# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## ద్వితీయ భాగము.





గ్రంథకర్త

కావ్యతీర్థ, వేదాంతతీర్థ, వేదాంతశిరోమణి, వేదాంతవాచస్పతి

శ్రీమాన్

కందాడై శేషాచార్యులు

శ్రీః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

ఇది,

భగవద్బాదరాయణమహర్షిప్రణీత

శ్రీమచ్ఛారీరక మీమాంసా శాస్త్రంబునకు

భగవద్రామానుజప్రణీత

శ్రీభాష్యమునకు సరియయిన తెనుగున

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి

శ్రీమాన్

కందాడై శేషాచార్యుల వారిచే

రచియింపఁబడి

స్వకీయ

వేదాంత ముద్రాయంత్రమున

ముద్రింపఁబడి

ప్రచురింపఁబడినది.

**MADRAS**

1922.

    

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము

## ద్వితీయాధ్యాయము—ప్రథమపాదము.

### స్మృత్యధికరణము.

౧॥సూ॥ స్మృత్యనవకాశదోషప్రసఙ్గ ఇతిచేన్నాన్యస్మృత్యనవకాశ దోషప్రసఙ్గాత్

టీ॥ స్మృత్యనవకాశదోషప్రసఙ్గః = సాంఖ్యాది స్మృతులు ఉపయోగము లేవినియనెడిదోషము ప్రాప్తించును, ఇతిచేత్ = అని యంటివేని, న = అదిసరి కాదు, ఏలననఁగా, అన్యస్మృత్యనవకాశదోష ప్రసఙ్గాత్ = మన్వాద్యన్యస్మృతులు ఉపయోగములేనివి యనెడి దోషము ప్రాప్తించును.

తా॥ ఉపనిషత్తుల యర్థమును యథాశ్రుతముగాఁ దెలిసికొను పక్షమున, సాంఖ్యాది స్మృతులు వేదార్థమును విశదీకరించుటయందు ఉపయోగపడునవి కావనెడి దోషము ప్రసక్తించును. అట్టిదోషము ప్రసక్తింపకుండుటకై సాంఖ్య స్మృతి ప్రకారము వేదార్థమును విశదీకరించుకొను పక్షమున, దానికంటెను ఎక్కువ ఆదరణీయములగు, మన్వాది స్మృతులు వేదార్థమును విశదీకరించుట యందు ఉపయోగపడునవి కావనెడి దోషము ప్రసక్తించును.

ప్రథమ ద్వితీయాధ్యాయములకుఁ గల పరస్పరసంబంధము.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణ గోచరమగు అచిత్పదార్థమునకంటెను, అట్టియ చిత్పదార్థముతోఁ జేరియున్నట్టిదియు, చేరకయున్నట్టిదియునగు చిత్పదార్థమునకంటెను వేఱయినది. అవిద్యాది దోషములెంతమాత్రము లేనిది. అనంతములగు జ్ఞానానందములకు ముఖ్యస్థానమైనది. లెక్కలేని కల్యాణగుణములు కలది. ఈ సమస్తమైన జగత్తునకును తానే కారణమయినది. సర్వమునకం తరాత్మయయినది. పరబ్రహ్మము ఇట్టిదిగా ఉపనిషద్వాక్యములవలనఁ దెలుపఁ

బడుచున్నది యని ప్రథమాధ్యాయమునఁ బ్రతిపాదింపఁ బడియె. ఇట్లు ప్రతిపాదింపఁబడిన విషయము యెవ్విధమునను ఆక్షేపింపశక్యమైనది కాదని ప్రతిపాదించుటకై ద్వితీయాధ్యాయ మారంభింపఁ బడుచున్నది.

అవతారిక:—అందులకై ప్రథమమున, ఉపనిషద్వాక్యములు ప్రతిపాదించునట్టి విషయము కపిలస్మృతికి విరుద్ధమగుటంజేసి, యవి యావిషయమును ప్రతిపాదించునవి కావని శంకించి, యాశంకను నిరాకరించుచున్నారు.

శంక:—స్మృతితో విరోధించి నందున శ్రుతు లట్టివిషయముఁ ప్రతిపాదించునవి కావని యేల చెప్పఁదగును? శ్రుతి స్మృతులకు పరస్పరము విరోధము సంభవించునప్పుడు, శ్రుతి విరుద్ధమగు స్మృతి యాదరింపఁదగినది కాదని పూర్వమీమాంసాశాస్త్రమున I "విరోధేత్వ నపేక్షంస్యాత్" (పూ. సూ. ౧ అ. 3 పా 3. సూ.) అను తావున నిర్ణయింపఁ బడియెను కదా!

సమాధానము:—సత్యము. అయినను, "ఔదుంబరీం స్పృష్ట్వోద్గాయేత్" ఇత్యాది స్థలములయందు శ్రుతినిబట్టియే యర్థమును నిశ్చయింపశక్యము. కావున శ్రుతివిరుద్ధమయిన స్మృతి యాదరింపదగినది కాదని అట్టితావులచెప్పఁదగును. ప్రకృతముననో, ఉపనిషద్వాక్యములచేఁ దెలుపబడు తత్త్వము ఎక్కువ దుర్బోధమైనది. కాఁబట్టి యది మహర్షిప్రణీతమగు స్మృతికి విరుద్ధమగు పక్షమున,

(1) జ్యోతిష్టోమయాగము నాచరించునప్పుడు ఉదుంబర వృక్షముయొక్క కొమ్మను తెచ్చి సదస్సనంబడు మండపమున పాతుదురు. ఈ సందర్భమున "ఔదుంబరీ సర్వా వేష్టయితవ్యా" అనెడి స్మృతివాక్యము "ఆ యుదుంబర వృక్షముయొక్క శాఖను అన్నివైపులను వస్త్రముతోఁగప్పవలసినది" అని విధించుచున్నది. ఈసందర్భముననే "ఔదుంబరీం స్పృష్ట్వోద్గాయేత్" అనెడిశ్రుతివాక్యము "ఆ యుదుంబర వృక్షముయొక్క కొమ్మను స్పృశించి వేదగానము చేయవలసినది" అని విధించుచున్నది. ఈతావున స్మృతియందు విధించియున్న ప్రకారము ఔదుంబరశాఖనుఅన్నివైపులను కప్పివేసిన పక్షమున, శ్రుతియందు విధించియున్న ప్రకారము దానిని స్పృశించుట యసంభవము. శ్రుతియందు విధించియున్నప్రకారము దానిని స్పృశించుట కనుకూలముగానుండుటకైదానిని వస్త్రముతో నన్నివైపుల కప్పివేయకుంటిమేని, స్మృతియందు విధించినప్రకారమాచరించినవారము కాకపోదుము. అందువలన స్మృతిని ఆనాదరణము చేసినవారలమగుదుము. ఈపైని గనఁబఱచిన ప్రకారము శ్రుతిస్మృతులకు పరస్పరము విరోధము ప్రాప్తింపఁగా ఈయంశమును పూర్వ మీమాంసాశాస్త్రమున నిట్లు నిర్ణయించి యున్నారు. శ్రుతిస్మృతులకు పరస్పరము విరోధము సంభవించి నప్పుడు, స్మృతియందు చెప్పియున్న యర్థమునకు మూలభూతమైన శ్రుతివాక్యమేదియును గానఁబడని పక్షమున, స్మృతిని ప్రమాణముగాఁ గణింపక శ్రుతినే ప్రమాణముగాఁ గణించునది.

"ఈయర్థ మిట్లే" అని నిశ్చయించుట యసంభవము. అందువలన శ్రుతి యట్టి యర్థమును ప్రతిపాదించునది కాదని స్మృతినిబట్టి ప్రతిపాదింపఁదగును. అందు విరోధ మెద్దియును లేదు. అది యెట్లనిన,

పూ ర్వ ప క్ష ము.

సాంఖ్యుఁడు:—కపిలుఁడను మహర్షి వేదశాస్త్రము యొక్క పూర్వ భాగమున నిఖిలాభ్యుదయ సాధనములుగాఁ దెలుపఁబడిన [1] "అగ్నిహోత్ర" [2] "దర్శపూర్ణమాస్య" [3] "జ్యోతిష్టోమా" దికర్మములను బాగుగా నెఱింగినవాఁడు. మఱియు నతఁడు శ్రుతీతిహాస పురాణములయందు "ఋషిం ప్రసూతం కపిలం" (శ్వే. ౫ అ. ౨ వా.) ఈ మొదలగు వాక్యములచే ఆప్తతముఁడుగాఁ గొనియాడఁ బడినవాఁడు. ఆ మహర్షి మోక్షమును, తత్సాధనములనును తెలుపునట్టి యొక స్మృతిని రచియించెను. ఆ స్మృతిఁ గొని విశదపఱచుకొనిననే తప్ప. అల్పజ్ఞులమును, మందమతులమునునగు మనము ఉపనిషద్వాక్యముల యర్థములను నిర్ణయించుట యశక్యము. యథాశ్రుతముగానర్థమును గ్రహించుకొనుపక్షమున, ఆప్తతముఁడగు కపిలమహర్షిచే రచియింపఁబడిన సాంఖ్య స్మృతి యంతయును నిరుపయోగ మగును. కావున స్మృతివలన నిరూపింపఁబడినదియే యుపనిషత్తులవలనఁ దెలుపఁబడునది యని యెవ్విధముననైనను అంగీకరింప వలయును.

భాష్యకారులు:—అటులనగు పక్షమున, బ్రహ్మమునే జగత్కారణముగాఁ బ్రతిపాదించునట్టి మనుస్మృతి మొదలగునవి నిరుపయోగము లగునే?

సాంఖ్యుఁడు:—కావు. ఏలననిన, మన్వాది స్మృతులు జ్యోతిష్టోమాది కర్మములను ప్రతిపాదించునవి. అందువలన నవి వేదశాస్త్రము యొక్క పూర్వ భాగమును (కర్మకాండమును) విశదీకరించుటకు ఉపయోగపడుచున్నవి. సాంఖ్య స్మృతియన్ననో, అది యంతయును తత్త్వమునే ప్రతిపాదించునది. కావున నది యట్టిదిగా—ఉపనిషత్తుల యర్థమును విశదీకరించునదిగా—అంగీకరింపఁబడని పక్షమున నది యుపయోగములేనిది యగును.

(1) ఆహితాగ్నులు ప్రాతస్సాయంకాలములయందు చేసెడి హోమము.

(2) ఇది యొకవిధమైన సోమయాగము.

(3) అమావాస్యనాఁడు చేయఁదగిన యొకవిధమైన ఇష్టి.

సూత్రాన్వయము:—ఈపైని గనఁబఱచిన విషయమునే సూత్రకారులు "స్మృత్య నవకాశదోష ప్రసజ్గ ఇతి చేత్" అని యిట్లు శంకించి, "నాన్యస్మృత్య నవకాశదోష ప్రసంగాత్" అని సమాధానము చెప్పఁబోవుచున్నారు.

—సిద్ధాంతము.—

భాష్యకారులు:—మనుస్మృతి మున్నగు ఇతర స్మృతులు బ్రహ్మమునే జగత్కారణముగాఁ దెలుపుచున్నవి. ఎట్లన, మనువు, "ఆసీదిదం తమో భూతం" (మ. స్మృ. ౧ అ. ౫ శ్లో) "ఈపరిదృశ్య మానమగు ప్రపంచమంతయును సృష్టికి పూర్వము తమస్సుగానుండెను" అని యిట్లుచెప్పనారంభించి,

"శ్లో॥ తత స్స్వయంభూ ర్భగవా. న వ్యక్తో వ్యఞ్జయ న్నిదమ్।
మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః॥

మను స్మృతి. ౧ అ. ౬ శ్లో.

తా॥ అప్పుడు భగవంతుఁడును అవ్యక్తుఁడునగు స్వయంభువు దీనినంతయును ప్రకాశింపఁజేయఁ దలంచి, మహాభూతములు మొదలగువానిని ప్రకాశింపుచు తమస్సును పోగొట్టువాఁడై ప్రాదుర్భవించెను.

శ్లో॥ సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్ సిసృక్షుర్వివిధాః ప్రజాః।
అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్॥

మను స్మృతి. ౧ అ. ౮ శ్లో.

తా॥ స్వయంభువు ధ్యానించి, తన శరీరమునుండి నానావిధములగు ప్రజలను సృజింపనిచ్ఛయించి, ప్రథమమున ఉదకములను సృజించి, వానియందు వీర్యమును వదలెను" ఇవ్విధమున బ్రహ్మమునే జగత్కారణముగాఁ బ్రతిపాదించియున్నాఁడు. శ్రీభగవద్గీతలయందు,

"శ్లో॥ అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥

భ. గీ. ౭ అ. ౬ శ్లో.

తా॥ ఓ యర్జునా! నేను సమస్తమైన జగత్తునకును ఉత్పత్తికారణంబును, ప్రళయకారణంబును.

శ్లో॥ అహం కృత్స్నస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే॥

భ. గీ. ౧౦ అ. ౮. శ్లో॥

తా॥ ఓయర్జునా! నేను సమస్తమునకును ఉత్పత్తికారణము. నావలననే సమస్తమును ప్రవర్తించుచున్నది." ఇవ్విధమున చెప్పఁబడియె

అట్లే మహాభారతమునను,

"శ్లో॥ కుతస్సృష్టమిదం సర్వం జగత్ స్థావరజఙ్గమమ్।
ప్రళయే చ కమభ్యేతి తన్మే బ్రూహి పితామహ॥

భా. శా. మో. ౮ అ. ౧ శ్లో.

తా॥ ఓ పితామహుఁడా! స్థావరజంగమ విశిష్టమగునట్టి యీ జగమంత యును ఎవ్వనిచే సృజింపఁబడినది? ప్రళయకాలమున నిది యెవనిని పొందు చున్నది? ఈ విషయమును నాకెఱింగింపుమా?" ఇవ్విధమున ప్రశ్నించి,

"శ్లో॥ నారాయణో జగన్మూర్తి రనన్తాత్మా సనాతనః॥

భా. శాం. మో. ౮ అ. ౧౨ శ్లో.

తా॥ నారాయణుఁడు జగచ్ఛరీరుఁడును, అనంతమైనస్వరూపముగల వాఁడును, సనాతనుఁడును.

శ్లో॥ తస్మాదవ్యక్తముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ!

భా. శాం. మో. వ. అ. ౧౩ శ్లో.

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! ఆ నారాయణునివలన సత్త్వరజస్తమో గుణ యుక్తమగు అవ్యక్తము (ప్రకృతి) కలుగుచున్నది.

శ్లో॥ అవ్యక్తం పురుషే బ్రహ్మ న్నిష్క్రియే సంప్రలీయతే॥

భా. శాం. మో. ౮ అ. ౧౮ శ్లో.

తా॥ ఓబ్రాహ్మణుఁడా! ఆ యవ్యక్తము వికారరహితుఁడగు నారాయ ణునియందు లీనమగుచున్నది." ఇవ్విధమున జగత్కారణమును గుఱించి చెప్పఁ బడెను. శ్రీపరాశరమహర్షియును,

"శ్లో॥ విష్ణోస్సకాశాదుద్భూతం జగత్తత్రైవ చ స్థితం।
స్థితిసంయమకర్తాఽసౌ జగతోఽస్య జగచ్చ సః॥

విష్ణు. ౧ అం. ౧ అ.౩౧ శ్లో.

తా॥ ఈ జగత్తు విష్ణువునుండి కలిగినది. అతనియందే యున్నది. అతఁడే యీ జగత్తుయొక్క స్థితిని, నియమమును చేయువాఁడు. జగత్తును అతఁడే అనఁగా జగత్తునందంతట నుండువాఁడు" అనియిట్లు చెప్పియున్నాఁడు, అపస్తంబ మహర్షియును,

"పూః ప్రాణినః సర్వగుహాశయస్య అహన్యమానస్య వికల్మషస్య

ధర్మప్రశ్న. ౨౨ ఖ. ౮ వా.

తా॥ సమస్తములయిన వాని లోపల నంతరాత్మగా నుండు వాఁడును, నాశరహితుఁడును, పాపరహితుఁడును నగు వానికి ఈప్రాణు లన్నియును శరీర భూతములు" అని యిట్లారంభించి,

"తస్మాత్కాయాః ప్రభవన్తి సర్వే స మూలం శాశ్వతికస్స నిత్యః

ధర్మప్రశ్న. ౨౩ ఖ. ౧. ౨. వా.

తా॥ వానినుండియే శరీరభూతులగు చతుర్ముఖాద లందఱును పుట్టు చున్నారు" అని యిట్లు చెప్పియున్నాఁడు.

కపిలమహర్షి ప్రణీతమగు సాంఖ్యస్మృతి కనుగుణముగా ఉపనిషత్తుల యర్థమును నిర్ణయించు పక్షమున, ఈపైని గనఁబఱచిన స్మృతులన్నియును నిరుపయోగములనెడి యొక గొప్ప దోషము సంప్రాప్తించును.

దీని ఫలితార్థమేమన్నను, ప్రత్యక్షము మున్నగు ఇతర ప్రమాణములచేఁ దెలియ నశక్యమగునట్టి యర్థము ఉపనిషత్తులయందు ప్రతిపాదింపఁబడుచున్నది. అల్పజ్ఞులమగు మనము వానియర్థమును యెఱుంగవలయునన్న, అట్టి యర్థమును విశదపఱచునది యగు వేఱొకదాని సహాయ మావశ్యకము. వాస్తవమే. అయి నను, ఉపనిషత్తుల యర్థమును అనుసరించినవియు, మహర్షి ప్రణీతంబులునునగు అనేక స్మృతులు అట్టి యర్థమును విశదపఱచుటయందు ప్రవర్తించి యున్నవి. అవి యన్నియును నిరుపయుక్తములు కాఁదగవు. కావున శ్రుతివిరుద్ధమగు సాంఖ్యస్మృతి శ్రుతులకు ఉపబృంహణముగా నాదరింపఁదగదు. ఏలననిన, శ్రుతులవలనఁ దెలియవచ్చు అర్థమును విశదపఱచుటను గదా' "ఉపబృంహణ" మందురు. శ్రుతివిరుద్ధమగు స్మృతి అట్టి యుపబృంహణముగానెట్లుకాగలదు ?

ఈ పైని గనఁబఱచిన మన్వాది స్మృతులు వేదశాస్త్రము యొక్క పూర్వభాగమునఁ జెప్పఁబడిన విషయములను (కర్మములను) విశదపఱచినంత మాత్రముచే ఉపయోగవంతములు కాఁదగవు. ఏలన, ఈ స్మృతులు కర్మములను పరబ్రహ్మమనఁబడు పరమపురుషునికి ఆరాధనములనుగాఁ బ్రతిపాదించుచున్నవి. అట్టి యవి యా కర్మానుష్ఠానముచే నారాధింపఁబడు పరమపురుషుని స్వరూప మును ప్రతిపాదించునవి కాని పక్షమున, నవి పరమపురుషారాధన భూతములగు కర్మములను ప్రతిపాదించుట యసంభవ మగును. సమస్తకర్మములును పరమ పురుషుని యారాధనములే యని గదా శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి. ఎట్లన,

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥

భ. గీ. ౧౮. అ. ౪౬ శ్లో.

తా॥ సమస్తభూతములును యెవ్వనినుండి గలుగుచున్నవో, ఎవ్వఁడు సర్వమును వ్యాపించియున్నాఁడో, వానిని మానవుఁడు తన వర్ణాశ్రమ కర్మానుష్ఠానముచే నారాధించి సిద్ధిని పొందుచున్నాఁడు.

శ్లో॥ ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు।
బ్రహ్మలోకమవాప్నోతి న చేహావర్తతే పునః॥ (దక్షస్మృతి)

తా॥ ఎవ్వఁడు స్నానాదికర్మముల నాచరించునపుడు నారాయణుని ధ్యానించుచున్నాఁడో, వాఁడు బ్రహ్మలోకమును పొందుచున్నాఁడు. ఆతఁడు మరల సంసారమును పొందఁడు.

శ్లో॥ యైః స్వకర్మపరైర్నాథ! నరైరారాధితో భవాన్।
తే తరన్త్యఖిలా మేతాం మాయా మాత్మవిముక్తయే॥

విష్ణు, ౫ అం. ౩౦ అ. ౧౬ శ్లో.

తా॥ ఓ జగన్నాథ! ఎవ్వరు నిన్ను స్వాశ్రమ విహిత కర్మానుష్ఠానముచే నారాధించుచున్నారో, వారు మోక్షప్రాప్తికై యీ యవిద్య నంతయును అతిక్రమించుచున్నారు.

ఈపైని గనఁబఱచిన స్మృతులు ఐహికాముష్మిక సాంసారిక ఫలములను గలుగఁజేయుటకు సాధనభూతములగు కర్మములను ప్రతిపాదించుటచే ఉపయోగవంతము లగుచున్నవని చెప్పఁదగదు. ఏలన, అట్టి కర్మములును సర్వేశ్వరునికారాధన భూతములే యని కదా శాస్త్రము తెలుపుచున్నది. ఎట్లన,

శ్లో॥ యేప్యన్యదేవతాభక్తాః యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకం॥

భ. గీ. ౯ అ. ౨౩ శ్లో॥

తా॥ ఓ యర్జునా! అన్ని పదార్థములును నాకు శరీరమగుటచే నింద్రాది శబ్దములు సయితము నన్నే తెలుపునవి; కావున ఇంద్రాదులంగూర్చి యాగములం జేయువారు సయితము నన్నుగూర్చి చేయువారే. వేదాన్తములు "పరమపురుషునికి శరీరభూతులగు ఇంద్రాదుల నారాధించునది" అని విధింపుచున్నవై, ఆ యింద్రాదులకు ఆత్మయైన పరమపురుషుఁడే సాక్షాత్తుగా నారా

ధింపఁదగినవాఁడని విధించుచున్నవి. వీరు వట్టి యింద్రాదులను ఆరాధించుటచే ఆవిధి ననుసరింపక యజ్ఞముఁ జేయువారగుచున్నారు.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే॥

భ. గీ. ౯ అ. ౨౪ శ్లో.

తా॥ ఓ యర్జునా! నేనే సర్వయజ్ఞముల ననుభవించువాఁడను, ఫలమునిచ్చువాఁడనును. ఈకర్తములు ఇంద్రాదిశరీరుఁడగు పరమపురుషుని యారాధనములనియు, ఆరాధింపఁబడువాఁడు పరమపురుషుఁడనియు తైవిద్య లెఱుఁగరు. కావున వారు కొంచము ఫలమును పొంది మరలువారగుదురు.

అటులనే,

శ్లో॥ యజ్ఞైస్త్వమిజ్యసే నిత్యం సర్వదేవమయోఽచ్యుత।
హవ్య కవ్య భుగేకస్త్వం పితృ దేవ స్వరూపధృక్॥

విష్ణు. ౫ అం. ౨౦ అ. ౯౭ శ్లో.

తా॥ ఓ నారాయణా! ఇంద్రాది సర్వదేవతలును శరీరముగాఁగలవాఁడవగు నీవే యజ్ఞములచే నారాధింపఁబడుచున్నావు. పితరులయొక్కయు, దేవతలయొక్కయును రూపమును ధరించి నీవొక్కఁడవే హవ్య కవ్య ములను అనుభవించుచున్నావు.

"ఋషిం ప్రసూతం కపిలం (శ్వే. ౫ అ. ౨ వా.) అనియిట్లు కపిలుఁడు ఆప్తుఁడుగా శ్రుతులయందు కొనియాడఁబడినందున, ఆతనిచే రచియింపఁబడిన సాంఖ్యస్మృతికనుగుణముగానే యుపనిషత్తుల యర్థమును నిర్ణయింపఁదగునని చెప్పినదియును యుక్తము కాదు. ఏలన, అట్లైనచో, శ్రుతిస్మృతుల యందంతటను బృహస్పతి పరిపూర్ణజ్ఞానకలిమికి నిదర్శనముగాఁ గొనియాడఁబడినందుచే అతఁడు రచియించిన [1]లోకాయతిక సూత్రముల కనుగుణముగా ఉపనిషత్తుల యర్థమును నిర్ణయింపవలయుననియును ప్రసక్తించునే?

(1) లోకాయతికులకు ప్రత్యక్షమొక్కటియే ప్రమాణము. ప్రత్యక్షసిద్ధముకాని విషయమునుదేనినిగాని యున్నదని యొప్పుకొనరు. కనుక ప్రత్యక్షసిద్ధములైన పృథివ్యప్తేజోవాయువులను భూతములు నాలుగుమాత్రమే వారికి తత్త్వములు. ఆకాశము ప్రత్యక్షసిద్ధముకాక శబ్దగుణముచే అనుమేయమగుటవలన నది యున్నదని యొప్పుకొనరు కాఁబోలు. ఆ భూతములు నాలుగింటికంటె వేఱైన దొక్కటియులేదు. సున్నము, వక్కలు, తమలపాకులును గూర్చి నమలునప్పుడు

అవతారిక:—కపిలుఁడు తన యోగమహిమవలన వస్తుయాథాత్మ్యము నెఱింగినవాఁడు. కావున అతఁడు రచియించిన సాంఖ్యస్మృతి ప్రకారము ఉపనిషత్తుల యర్థమును నిర్ణయింపవలయుని శంకింపఁగా, అందుల కుత్తరమును పలించుచున్నారు:—

**౨॥ సూ॥ ఇ త రే షాం చా ను ప ల బ్ధేః.**

టీ॥ ఇతరేషాంచ = మన్వాది మహర్షుల కయితే, అనుపలబ్ధేః=కపిలునికి తెలియవచ్చిన ప్రకారము తత్త్వము తెలియరానందున, (కపిలోపలబ్ధిః=కపిలుని తత్త్వజ్ఞానము, భ్రాంతిమూలా = భ్రాంతిమూలమయినది.)

తా॥ మన్వాది మహర్షులకు కపిలునికిఁ దెలియవచ్చిన ప్రకారము తత్త్వము తెలియరానందున, కపిలుని తత్త్వజ్ఞానము భ్రాంతిమూలమయినది.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "చ" అనెడిశబ్దము శంకాపరిహారమును సూచింపుచున్నది. మన్వాది మహర్షులనేకులు తమ యోగమహిమవలన పరాపరతత్త్వముల యథార్థ స్వరూపమును బాగుగా నెఱింగి యున్నారు. వారు తమ వాక్య జగత్తున కంతటికిని యొక గొప్ప యౌషధముగా "యద్వైమనురవదత్ తద్భేషజం" (యజు. ౨ 3 అష్ట. 3 ప్ర. ౨ ౧౧ అను.) "మనువు చెప్పినది మందు" అనుతావుల శ్రుతులయందు ప్రసిద్ధి పొందియున్నారు. అట్టివారు కపిలుఁడు

---

వానిసంయోగవిశేషమువలన నెఱ్ఱఁదన మనుక్రొత్తగుణమొకటి పుట్టునట్లును, సారాయమునకు ప్రకృతిద్రవ్యములైన కిణ్వము మొదలైనవాని సంయోగవిశేషమువలన మత్తు అనుక్రొత్తశక్తి యొకటి కలుగునట్లును, పృథివ్యాదిభూత చతుష్టయముయొక్క శరీరరూపమైన సంయోగవిశేషమువలన చైతన్యమనెడి నూతనధర్మమొకటి పుట్టుచున్నది. ఇట్టి చైతన్యముతోఁ గూడినదేహమే యాత్మ యనఁబడునుగాని దేహమునకంటె వేఱుగా ఆత్మయనునదిలేదు. ఎట్లన, 'నేను స్థూలుఁడను' 'నేను కృశుఁడను' అనుచో స్థూలత్వకృశత్వములు దేహమునకు సంబంధించినవగుటచే 'నేను స్థూలుఁడ' ననఁగా దేహము స్థూలమనియు, "నేను కృశుఁడ" ననఁగా దేహము కృశమనియు నర్థములుగాన "నేను" అనునదియె సామానాధికరణ్యముచే "దేహ" మగునని దేహాత్మల కభేదము సిద్ధించుచున్నది. అర్థకామములే పురుషార్థములు. నిగ్రహానుగ్రహకర్తయై లోకప్రసిద్ధుఁడగు రాజే సర్వేశ్వరుఁడు. జీవించియుండునపుడు గలుగుసుఖమే స్వర్గము. దుఃఖమే నరకము. సుఖదుఃఖములకుఁ గారణము స్వభావమేకాని పుణ్యపాపములుగావు. మరణమే మోక్షము. ఈమతము, ప్రత్యక్షముకానిది లేదనుటచే నాస్తికమతమనియు, లౌకికాభిమతములైన యర్థకామములే పురుషార్థములుగాఁ బ్రతిపాదించుమూలమున లోకములం దాయతమై-అనఁగా విస్తృతమై, యుండుటచే లోకాయతమనియు, బృహస్పతినిర్మితమగుటచే బార్హస్పత్యమనియు నామాంతరములు గలిగియున్నది.

తెలిసికొనిన ప్రకారము తత్త్వమును తెలిసికొని యుండలేము. కావున శ్రుతి విరుద్ధమగు కపిలుని జ్ఞానము భ్రాంతిమూలమయినది. అందువలన దానిప్రకారము యుపనిషత్తులయర్థమును విశదీకరించు కొనుట యశక్యము.

ఽ స్మృత్యధికరణము ముగిసెను ఽ

—

యోగప్రత్యుక్త్యధికరణము.

౩॥ సూ॥ ఏ తే న యో గః ప్ర త్యు క్తః

ఏతేన=సాంఖ్యస్మృతిని నిరాకరించుటచే, యోగః=యోగస్మృతి, ప్రత్యుక్తః=నిరాకరింపఁబడినది.

తా॥ సాంఖ్యస్మృతిని నిరాకరించుటచే యోగస్మృతియును నిరాకరింపఁబడినదని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ సాంఖ్యస్మృతిని నిరాకరించుటచే యోగస్మృతియును నిరాకరింపఁబడినది.

శంక:—ఇట్లుండ, సాంఖ్యస్మృతిని నిరాకరించిన పద్ధతినిఁగాని యోగస్మృతిని వేఱుగా నిరాకరించుట యగత్యమగునట్లుచేయునట్టి వేఱొక సంశయమేమిః కలిగెను ?

సమాధానము:—చెప్పెదను. యోగస్మృతియందు ఈశ్వరుఁడు కలఁడని యంగీకరింపఁబడియె. వేదాంతమునందు (ఉపనిషత్తులయందు) మోక్షసాధనముగా విధింపఁబడిన యోగమున్ను దీనియందే చెప్పఁబడియె. యోగస్మృతి కర్తయగు హిరణ్యగర్భుఁడు వేదాంతముల నన్నింటిని ప్రవర్తింపఁజేయుటకుఁ దగినవాఁడు. ఈ హేతువులనుబట్టి యోగస్మృతి ప్రకారము ఉపనిషత్తుల యర్థమును విశదీకరించుకొనుట యుక్తమని తలంపఁదగును.

పరిహారము:—ప్రధానము ఈశ్వర నిరపేక్షముగా జగత్తునకు ఉపాదాన కారణమనియు, ఈశ్వరుఁడు నిమిత్తకారణము మాత్రమేయనియును యోగస్మృతియందు చెప్పఁబడియె. ధ్యానరూపమగు యోగము ధ్యానింపఁబడు వస్తువును బట్టి నిశ్చయింపఁబడునది. ఇచట ధ్యానింపఁబడు పదార్థములు జీవేశ్వరులు. వారిలోఁ జీవుఁడు బ్రహ్మమేయంతరాత్మ గాఁగలవాఁడు కాఁడు. ఈశ్వరుఁడు జగత్తునకు ఉపాదానకారణము కాఁడు. సమస్తములగు కల్యాగుణములు కలవాఁడును కాఁడు. కావున ఈ యోగస్మృతి శ్రుతిసమ్మతమైనది కాదు. హిరణ్య

గర్భుఁడును ఒక జీవుఁడే గదా! కావున అతఁడును ఒకప్పుడు రజస్తమోగుణ వశ్యుఁడగుట సంభవము. అతఁడు రజస్తమోగుణవశ్యుఁడై రచియించిన పురాణము వలెనే యోగస్మృతియును భ్రాంతిమూలము కాఁదగును. కావున యోగ స్మృతిప్రకారము ఉపనిషత్తుల యర్థమును విశదీకరించు కొనఁదగదు.

యోగప్రత్యుక్త్యధికరణము ముగిసెను

విలక్షణత్వాధికరణము.

౪॥ సూ॥ న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్.

టీ॥ విలక్షణత్వాత్=కారణముకంటెఁ గార్యము విలక్షణముగానుండుటవలన, అస్య=ఈప్రపంచమునకు, న=బ్రహ్మము కారణముకాదు; తథాత్వంచ= అట్టివైలక్షణ్యము, శబ్దాత్=వేదమువలన (అవగమ్యతే=తెలియఁబడుచున్నది).

తా॥ పరబ్రహ్మము ప్రపంచమునకంటె విలక్షణము. కావున నది దీని కుపాదాన కారణము గాఁజాలదు. అట్టివైలక్షణ్యము శ్రుతిప్రసిద్ధము.

శ్రీ॥ భా॥ పూర్వాధికరణమున స్మృతి విరోధము నవలంబించి వాదించిన పూర్వపక్షియే తర్కము నవలంబించి మరల వాదించుచున్నాఁడు.

పూర్వపక్షము.

సాంఖ్యుఁడు:—సాంఖ్యస్మృతిని నిరాకరించి, ప్రపంచము బ్రహ్మమువలనఁ గలుగునదియని చెప్పినది యుపపన్నము కాదు. ఏలననిన, అచేతనముగాను, అపరిశుద్ధముగాను, ఈశ్వరగుణములేవియును లేనిదిగాను, దుఃఖస్వరూపముగానును ప్రత్యక్షాది ప్రమాణములవలనఁ దెలియవచ్చునదియు, చిదచిదాత్మకమునునగు ఈప్రపంచము సర్వజ్ఞుఁడుగాను, సర్వేశ్వరుఁడుగాను, హేయప్రత్యనీకుఁడుగాను, ఆనందైక స్వరూపుఁడుగానును, మీచేనంగీకరింపఁబడిన బ్రహ్మమునకంటెను విలక్షణమైనది. అయితే ప్రపంచము అట్లు విలక్షణమైనదిగాఁబ్రత్యక్షాది ప్రమాణములనుండి మాత్రమే తెలియవచ్చుచుండలేదు. మఱియేమన్నను, శ్రుతులనుండియు నది యట్టిది గాను తెలియవచ్చుచున్నది: ఎట్లన,

తైత్తిరీయోపనిషత్తునందు "విజ్ఞానం చా విజ్ఞానం చ" (తై. ఆ. ౬. అను ౩. వా) "చేతనమును, అచేతనమును" అనియు, కౌషీతక్యుపనిషత్తునందు "ఏవ మేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణే ఒర్పితాః"(కౌ. ౩ అ. ౯ వా.) (విషయములు జ్ఞానమునం దుంచంబడినవి జ్ఞానము ప్రాణమునందుంచఁబడినది)" అనియు, ముండకోపనిషత్తునందు "సమానే

వృక్షే పురుషో నిమగ్నో ఽనీశయా శోచతి ముహ్యమానః.”(౩ ము. ౧ ఖ. ౨ వా.) (సాధారణమగు వృక్షమున అనఁగా జీవాత్మ పరమాత్మలకుభయులకాశ్రయమయిన శరీరమునందు జీవుఁడు రాగద్వేషాదులలో మునింగి మోహమును పొందినవాఁడై, దుఃఖములనుండి తప్పించుకొనుటకసమర్థుఁడై, దుఃఖించుచున్నాఁడు) అనియు, శ్వేతాశ్వతరోపనిషత్తునందు “అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్” (శ్వే. అ. ౧ వా.) “అసమర్థుఁడగు జీవుఁడు కర్మఫల భోక్తయగుటం జేసి దుఃఖించుచున్నాఁడు” అనియును పఠింపఁబడియె. ఈపై శ్రుతివాక్యములు కార్యభూతమగు ప్రపంచము అచేతనమనియు, దుఃఖయుక్తమనియును తెలుపుచున్నవి.

ఏది దేనికార్యమో, అది దానికంటెను విలక్షణమైనదిగా లోకమునఁ గన్పట్టుచుండలేదు. దృష్టాంతము:—మృత్తికతోఁ జేయఁబడిన ఘటముమృత్తికకంటె విలక్షణమైనది కాఁదు. స్వర్ణముతోఁ జేయఁబడిన ఆభరణము స్వర్ణముకంటెను విలక్షణమైనది కాఁదు. కావున ప్రపంచము బ్రహ్మమునకంటెను విలక్షణమైనదగుటంజేసి యది బ్రహ్మమువలనఁ గలిగినది యగుట యసంభవము. కాఁబట్టి సాంఖ్యస్మృతి ప్రకారము కార్యభూతమగు ప్రపంచముతో నేకస్వభావముగలదగు ప్రధానమే అట్టి ప్రపంచమును గలుగఁజేయు కారణము కాఁదగును.

శాస్త్రము వేఱొకప్రమాణము నపేక్షింపనిదియు, అతీంద్రియములగు వానిని తెలుపునదియు నైనను, తర్కముఁగూడ అనుసరింపవలయును. ఒక్కొక్క విషయమున సర్వప్రమాణములును తర్కముయొక్క సహాయముఁ గొనియే అర్థమును నిశ్చయించునవి యగుచున్నవి. తర్కమనఁగా ఏదైన నొకపదార్థమును, దానియొక్క స్వభావమును పరీక్షించిగాని, దాని యవయవములను పరీక్షించిగాని, నిరూపించుటచే దాని విషయమైన ప్రామాణ్యమును నిశ్చంచునదియు, దానిని మనకు బాగుగ విశదపఱచునదియునగు ఒకవిధమైన జ్ఞానము. ఇదియే ఊహయనియును నామాంతరము కలది. సర్వప్రమాణములును ఈ తర్కమనఁబడు జ్ఞానము నపేక్షించునవి. శాస్త్రమునకుఁగల ప్రామాణ్యము చాలాభాగము వఱకు[1] “ఆకాంక్ష” “సన్నిధి” “యోగ్యత”లను గుఱిం

(1) వాక్యమునం దన్వయముకొఱకు ఒకపదము మఱియొకపదమును కోరుట. “ఆకాంక్ష” యనఁబడును. వాక్యమునందు పదములు దూరాన్వయముగలవి కాకుండ ఆకాంక్షానుగుణమగు సామీప్యము గలవిగాఁ బ్రయోగింపఁబడుట “సన్నిధి” యనఁబడును. “నిప్పుచే తడపవలసినది,” అని యిట్లు వాక్యములు అసంగతార్థములు కానివిగానుండుట “యోగ్యత” యనఁబడును. ఈ మూఁడును గలవాక్యమే ప్రామాణికమని తార్కికులు చెప్పుచున్నారు.

చిన జ్ఞానము నపేక్షించుచునది. కావున శాస్త్రము అన్నితావులను తర్కముయొక్క సహాయము నపేక్షించుచునదియే. కనుకనే మనువును "యస్తర్కేణాభిసంధత్తే స ధర్మం వేద నేతరః" (మను ౧౨ అ. ౧౦౬ శ్లో) "ఎవ్వఁడు తర్కముఁగొని ధర్మమును విచారించుచున్నాఁడో వాఁడే ధర్మము నెఱుంగును కాని యితరుఁడెఱుగఁడు" అని చెప్పియున్నాఁడు. శ్రుతియును "మన్తవ్యః" అనుటచే తర్కసహాయముఁగొని శాస్త్రార్థమును స్థిరపఱుచుకొనవలయునని తెలుపుచున్నది.

ఒకవేళ మీరిట్లు వాదింప వచ్చును--"బ్రహ్మమే జగత్కారణమని శ్రుతులయందు నిశ్చయింపఁబడుటంజేసి, బ్రహ్మమునకుఁ గలచైతన్యము తత్కార్యభూతమగు ప్రపంచమున సయితము కలదని యంగీకరింపఁదగును. వాస్తవమునకు ఘటపటాది పదార్థములయందును చైతన్యమున్నను, చేతనులకుఁగల చైతన్యము సుషుప్తి మూర్ఛాద్యవస్థలయందు స్ఫురింపకుండు చందమున, అది స్ఫురింప నిదిగానున్నది. ఈహేతువువలననే చేతనపదార్థములనియు, అచేతన పదార్థము లనియును విభాగము కలిగెను."

అయినను, ఈపైవాదము యుక్తమైనది కాదు, ఏలననిన, ఎన్నఁడును స్ఫురింపకుండుట యెన్నఁడును లేకుంటనే ధ్రువపఱుచుచున్నది. కావున వానియందుచైతన్యశక్తియొక్క సంబంధమాత్రము సయితము నిరసింపఁబడుచున్నది. ఏది యే కార్యమునుగలుగఁ జేయునదిగా నెన్నఁడును ఏతావునను తెలియఁబడదో, దానియందు ఆకార్యమును గలుగఁజేయు శక్తి కలదని వాదించెడి వాఁడు గొడ్డురాళ్ల బిడ్డలసభయందు వారితల్లులకు ప్రజోత్పాదన శక్తి (పిల్లలను కను శక్తి) మెండుగాఁగలదనియును చెప్పవచ్చును.

ఇంతేకాక ఈపైవాదమున [1]ఇతరేతరాశ్రయ దోషము సయితము కలదు. ఎట్లన,-బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాన కారణమని యుపనిషత్తులవలన నిశ్చయింపఁబడినయెడలనే, ఘటపటాది జడపదార్థములయందును చైతన్యశక్తి కలదని నిశ్చయింపఁదగును. ఘటపటాది జడపదార్థములయందు చైతన్యము స్ఫురింపకున్నను, అది వానియందు కలదని నిశ్చయింపఁబడిన యెడలనే.

---

(1) రెండు అంశములలో నొక్కయంశమును నిరూపించిననే కాని వేఱొకయంశము నిరూపింపఁబడకుండునట్లు రెండుయంశములు పరస్పరము నిరూప్య నిరూపకములుగానుండు ఇతరేతరాశ్రయ మనఁబడును. ఇది తర్కమునందొక దోషము. ఈదోషముగల వాదము ప్రామాణికముగా నాదరింపఁదగు.

బ్రహ్మము జగత్తున కుపాయన కారణమని యుపనిషత్తులవలన నిశ్చయింపఁ దగును. ఏలన, పరస్పరము విలక్షములగు పదార్థములకు కార్యకారణ భావము గలదని ప్రతిపాదించుట యశక్యము కదా!

భాష్యకారులు:—సాధర్మ్యము లేకుండుటనుబట్టి, బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాన కారణమగుట యసంభవమని ప్రతిపాదించి యుంటివి. సరే, ఉపాదానకారణమగుటకై కార్యకారణ పదార్థముల కెవ్విధమైన సాధర్మ్యము నపేక్షించెదవు? వాని కన్నివిధములను సాధర్మ్య ముండవలయునని కోరవుగదా! అట్లు కోరితివేని కార్యకారణభావమే సంభవింపక పోవును. దృష్టాంతము:—మృత్పిండము యొక్క కార్యములగు (మృత్పిండముతోఁ జేయఁబడిన) ఘటశరావాది పదార్థములయందు పిండాకారము మొదలగునవి యనువర్తించునవిగాను గానఁబడవు—ఏదైనయొక్కవిధమున మాత్రము సాధర్మ్య ముండవలయునని కోరెదవా? అట్లైనపక్షమున, జగద్బ్రహ్మములకు సత్తాదిరూపమగు (ఉనికి మొదలుగాఁగల) సాధర్మ్యము సంభవమే గదా?

సాంఖ్యుఁడు:—చెప్పెదను. ఏ స్వభావమునుబట్టి కారణ పదార్థము వేఱొక్కపదార్థమునుండి వేఱయినదిగా నెన్నఁబడుచున్నదో, ఆస్వభావము ఆకారణపదార్థముయొక్క కార్యమునను అనువర్తించుటయే కార్యపదార్థమునకు కారణపదార్థముతోఁగల సాధర్మ్యము. దృష్టాంతము:—ఏ యాకారమునుబట్టి స్వర్ణము మృత్తికాది పదార్థములనుండి వేఱయినదిగా నెన్నఁబడుచున్నదో, ఆ యాకారము స్వర్ణముయొక్క కార్యములగు (స్వర్ణముతోఁ జేయఁబడిన) కుండలాదులయందు అనువర్తించునదిగాను గన్పట్టుచున్నది.—బ్రహ్మము హేయములకు విరుద్ధమును, జ్ఞానానందైశ్వర్యస్వభావమును. ప్రపంచమన్ననో తద్విరుద్ధ స్వభావము. కావున బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదాన గారణము కాఁదగదు.

భాష్యకారులు:—వైలక్షణ్యముగల తావులను, కార్యకారణభావము గన్పట్టుచున్నదే! దృష్టాంతములు:—చేతనుఁడగు పురుషునినుండి యచేతనములగు కేశ నఖ దన్త లోమములు గలుగుచున్నవి. అచేతనమగు గోమయము నుండి చేతనమగు పేడపురుగు పుట్టుచున్నది. చేతనమగు సాలెపురుగునుండి అచేతనములగు తంతువులు గలుగుచున్నవి.

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఈపైని గనఁబఱచిన దృష్టాంతములయందును అచేతనాంశమునుబట్టియే కార్యకారణభావము కలదు.

అవతారిక:—ఒకవేళ యిట్లు వాదింపవచ్చును:—"తం పృథివ్యబ్రవీత్" (యజు. ౫ కాం. ౫ ప్ర. ౨ అను) (పృథివి దానిని చెప్పెను) అనియు, "ఆపో వా అకామయన్త" (3 అష్ట. ౧ ప్ర. ౫ అను) (ఉదములుకోరెను) అనియు, "తే హేమే ప్రాణా అహం శ్రేయసే వివదమానాః బ్రహ్మజగ్ముః" (బృ. ౮ అ. ౧ బ్రా. ౭ వా.) (నేనే శ్రేయస్సుకొఱకయ్యెదనని యా ప్రాణములు వివాపడుచు బ్రహ్మయొద్దకుఁ బోయెను) అనియు నీమొదలగు శ్రుతులయందు అచేతన పదార్థములకును చైతన్య సంబంధమున్నట్లు వినఁబడుచున్నది. నదీ సముద్ర పర్వతాదులకును చైతన్యముకలదని పురాణములయందు తెలుపఁబడియె. కావున జగద్బ్రహ్మంబులకు వైలక్షణ్యము లేదు"—ఇందు కుత్తరమును సూత్రకారుఁడు ఇట్లు పఠించుచున్నాఁడు:—

౫॥ సూ॥ అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్.

టీ॥ విశేషానుగతిభ్యామ్= "దేవతా" అనెడి విశేషణముండుటవలనను, అనుప్రవేశము వినఁబడుటవలనను, అభిమానివ్యపదేశస్తు = పృథివ్యాదిశబ్దము పృథివ్యాది భూతాభిమాని దేవతను తెలుపునది.

తా॥ పూర్వోదాహృత శ్రుతులయందు పృథివ్యాది శబ్దములు "దేవతా" అనెడి శబ్దముచే విశేషింపఁబడిన వగుటవలనను, శ్రుత్యంతరమందు అగ్న్యాది దేవతలు వాగాదిరూపములుగా ముఖాదులను ప్రవేశించినట్లు తెలియవచ్చుటవలనను పృథివ్యాది శబ్దములు పృథివ్యాది భూతాభిమాని దేవతలను తెలుపునవియే. (పృథివ్యాద్య చేతనవస్తువులను తెలుపునవి కావు.)

శ్రీ॥ భా॥ "తం పృథివ్యబ్రవీత్" ఇత్యాదిశ్రుతులలో నుండు పృథివ్యాది శబ్దములు పృథివ్యాది భూతాభిమాని దేవతలను తెలుపునవి. అది యెట్లు తెలియఁదగును? విశేషణము వలనను, అనుప్రవేశమువలనను తెలియఁదగును. పృథివ్యాదులు "దేవతా" శబ్దముచే విశేషింపఁబడినవై పేర్కొనఁబడుచున్నవి. ఎట్లన, "హన్తాహమిమాస్తిస్రో దేవతాః" (ఛా. ౬ ప్ర; 3౭ ౨ వా) అను శ్రుతియందు అగ్ని ఉదకము పృథివియనునవి "దేవతా" శబ్దముచే విశేషింపఁబడినవి. "సర్వాహ్వై దేవతాః అహంశ్రేయసే వివదమానాః" అనియు; "తే దేవాః

ప్రాణే నిశ్శ్రేయసం విదిత్వా" (కౌ. ౨ అ. ౯ వా). అనియు నీమొదలగు శ్రుతులును అందుల కుదాహరణములు.

"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్ ఆదిత్యశ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్ వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్" (ఐ. ౧ ఖ. ౪ వా). (అగ్నివాక్కై ముఖమునుప్రవేశించెను సూర్యుఁడు చక్షుస్సై నేత్రములను ప్రవేశించెను) వాయువు ప్రాణమై నాసికారంధ్రములను ప్రవేశించెను అనియు నీమొదలగు శ్రుతులవలన అగ్న్యాది దేవతలు వాగాద్యభిమాని దేవతలుగా ముఖాదులను ప్రవేశించినట్లు తెలియవచ్చుచున్నది.)

కావున ప్రపంచము అచేతనము. అందువలన నది బ్రహ్మమునుండి విలక్షణమైనది. కాఁబట్టి అది బ్రహ్మమువలనఁ గలిగినది కాఁదగదు. ఈ హేతువునుబట్టి తర్కసహాయముగల సాంఖ్యస్మృతియందు చెప్పియున్న ప్రకారము ప్రధానమును జగత్తున కుపాదాన కారణముగాను ఉపనిషత్తులు ప్రతిపాదించుచున్నవని యెఱుంగునది.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షముర్రాఁగా

౬॥ సూ॥ దృ శ్య తే తు.

టీ॥ దృశ్యతే=కానఁబడుచున్నది, తు=కావున పూర్వపక్షము యుక్తము.

తా॥ విలక్షణములగు వస్తువులకు కార్య కారణభావము లోకమునఁ గన్పట్టుచున్నది. కావున పూర్వపక్షము యుక్తము కాదు.

సి ద్ధాం త ము.

శ్రీ॥ భా॥ ప్రపంచము బ్రహ్మమునుండి విలక్షణమైన దగుటంజేసి యది బ్రహ్మము ఉపాదానకారణముగాఁగలది అనఁగా బ్రహ్మమువలనఁ గలిగినది కాఁదని పూర్వపక్షి చేయువాదము యుక్తమైనదికాదు. ఏలననిన, విలక్షణములైన వస్తువులకును కార్యకారణ భావము లోకమునఁ గానఁబడుచున్నది. దృష్టాంతము:—తేనె మొదలగు పదార్థములనుండి విలక్షణములైన కృమ్యాది జంతువులు తెనె మొదలగువానినుండి పుట్టుచున్నవి.

సాంఖ్యుఁడు:—అట్టితావుల కార్యకారణ భావము అచేతనాంశమును బట్టియే సంభవించునది. కావున ఆతావుల కార్యకారణపదార్థములకు సాధర్మ్యముకలదని చెప్పియుంటిని గదా?

భాష్యకారులు:—చెప్పినావు. వాస్తవమే. నీకభిమతమైన సాధర్మ్యము అంతమాత్రమున సిద్ధింపదు. ఏలాగునైన సాధర్మ్యమును సమర్థించెద నంటివేని, ప్రతి వస్తువునకును ప్రతివస్తువుతోను యేదోక విధమైన సాధర్మ్యము ఉండనే యున్నది. కావున ప్రతివస్తువును ప్రతివస్తువునుండి కలిగినదని ప్రసక్తించును. ఈ భయమువలననే కదా నీవును "ఒకవస్తువును వేఱొకవస్తువునుండి భేద పఱచు ఆకార విశేషము ఆవస్తువువలనఁ గలిగిన కార్యమునం దనువర్తించుట కార్యకారణముల కావశ్యకమైన సాధర్మ్యము" అని యంగీకరించి యున్నావు. అట్లు నీ వంగీకరించిన సాధర్మ్యనియమము, తేనెమొదలగువానినుండి కృమ్యాదులు గలుగుటలో ననుసరింపఁబడినట్లు గానఁబడదు. కావున ప్రపంచము బ్రహ్మమునుండి విలక్షణమైనదియే యైనను, అది బ్రహ్మముయొక్క కార్యము అనఁగా బ్రహ్మమునుండి కలిగినది కాఁదగును. అసంభవ మేమియును లేదు. ఏలననిన, మృత్తిక, స్వర్ణము మొదలగు పదార్థములను తదితర పదార్థముల నుండి భేదపఱచునట్టి యొక యసాధారణమగు ఆకారము తత్కార్య భూతములగు ఘట కుండలాదులయందు అనువర్తించునది గాను గన్పట్టుచుండు చందమున, అట్టి యసాధారణమగు ఆకారమేదియును తేనె గోమయము మొదలగు వానియందు నుండునదై, తత్కార్యభూతములగు కృమి వృశ్చికాదులయం దనువర్తించునట్టిదిగాను గన్పట్టుచుండ లేదు.

౭॥ సూ॥ అ స ది తి చే న్న ప్ర తి షే ధ మా త్ర త్వా త్

టీ॥ అసత్ =లేనిది, ఇతిచేత్ =ఇట్లంటివేని, న-అది సరికాదు. ఏలయనఁగా, ప్రతిషేధమాత్రత్వాత్ = సాధర్మ్యనియమమును నిషేధించుట మాత్రమే యుద్దేశింపఁ బడినందున.

తా॥ [1] అసత్కార్యవాదము ప్రసక్తించునంటివేని, అది సరికాదు. ఏలననఁగా, పూర్వసూత్రమున సాధర్మ్యనియమము కూడదని మాత్రమే చెప్పఁబడియె.

శ్రీ॥భా॥ సాంఖ్యుఁడు:—కార్యభూతమగు ప్రపంచమున కంటెను కారణ

(1) ఏదైన నొకపదార్థము గలుగుటకు పూర్వ మాపదార్థము లేకుండుటయును ఆపదార్థము గలుగుటకొక హేతువని తార్కికుల మతము. ఈవాదము అసత్కార్యవాదమని శాస్త్రమున వ్యవహరింపఁబడును. పదార్థములు గలుగుటకు పూర్వ మవి కారణాత్మకములుగా నుండునని వేదాంతుల మతము. ఈవాదము సత్కార్యవాదమని శాస్త్రమున వ్యవహరింపఁబడును.

భూతమగు బ్రహ్మము విలక్షణమైనచో, కార్యకారణములు భిన్నపదార్థము లగును. అట్లగుపక్షమున, కారణభూతమగు బ్రహ్మమునందు కార్యభూతమగు ప్రపంచము లేనిది యగును. అందుమూలముగ అభావమునుండియే ప్రపంచము గలిగెనని ప్రసక్తించునే ?

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, కార్యకారణములకు సాధర్మ్యముండవలయుననెడి నియమము కూడదని మాత్రమే పూర్వసూత్రమునఁ జెప్పఁబడియె. ఇంతేకాని కారణమునకంటెను కార్యము భిన్నపదార్థమని చెప్పఁబడలేదు. కారణభూతమగు బ్రహ్మమే తనకంటెను విలక్షణమగు ప్రపంచముగాఁ బరిణమించెననెడి యంశము పరిత్యజింపఁబడలేదు. కృమి మాక్షికములకు వైలక్షణ్యమున్నను, కుండల హిరణ్యములకువలె ద్రవ్యైక్యముండనే యున్నది కదా !

అవతారిక:—ఈ విషయమును గుఱించి శంకించుటకై :—

౮॥ సూ॥ అపీతౌ తద్వత్ప్రసఙ్గాదసమఞ్జసమ్.

టీ॥ అపీతౌ = ప్రళయాద్యవస్థలయందు, తద్వత్ప్రసంగాత్ = బ్రహ్మము వికారాది దోషములు గలదని ప్రసక్తించుటవలన, అసమఞ్జసం = ఉపనిషద్వాక్య జాతము అసంగతమగును.

తా॥ కార్యకారణములకు ద్రవ్యైక్యమం (ఒక్కటియే పదార్థమగుటయం) గీకరింపఁబడు పక్షమున, ప్రపంచగతములగు దోషములు ప్రళయాద్యవస్థలయందు బ్రహ్మమునఁ బ్రసక్తించును. అందుమూలముగ ఉపనిషద్వాక్య జాలమంతయును అసంగతమగును.

శ్రీ॥ భా॥ "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౧ వా). (సృష్టికిపూర్వ మీదృశ్యమానమగు జగత్తు సత్తుగానుండెను) అనియు, "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" (ఐ. ౧ ఖం. ౧ వా). (సృష్టికి పూర్వ మీపరిదృశ్యమానమగు జగము ఒక్కటియేయగు బ్రహ్మముగానుండెను" అనియు నీమొదలగు శ్రుతులయందు సృష్టిస్థితులకు పూర్వము ప్రళయావస్థ పేర్కొనఁబడియె. కావున సూత్రకారులు "అపీతౌ" అనియిట్లు సూత్రమునందు ప్రళయమును ముందుగ పేర్కొనియున్నారు.

సాంఖ్యుఁడు:—కార్యకారణములు రెండును ఒక్కటియే పదార్థమని

యంగీకరించుపక్షమున, కార్యభూతమగు ప్రపంచమునకు బ్రహ్మమునందు లయమును సృష్టి మొదలుగాఁగల యవస్థలును గలుగునపుడు, ఆయాయవస్థల తోఁసంబంధముగలది బ్రహ్మమే గాన, కుండలమునఁ గల విశేషములు స్వర్ణము నందువలెనే, కార్యభూతమగు ప్రపంచమునఁ గల దోషములు బ్రహ్మమునఁ బ్రసక్తించును. అందుమూలముగ "యస్సర్వజ్ఞస్సర్వవిత్" (ము. ౧. ము. ౧ ఖ. ౯ వా) (ఎవ్వఁడు సామాన్యముగా నన్నింటిని ఎఱింగినవాఁడును, విశేష ముగా నన్నింటిని ఎఱింగినవాఁడునో) అనియు, "అపహతపాప్మా విజరో విమృత్యుః" (ఛా. ౮ ప్ర. ౭ ఖ. ౧ వా) (పాపములు లేనివాఁడును, ముసలి తనము లేనివాఁడును, నాశము లేనివాఁడును) అనియు, "న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే" (శ్వే. ౬ అ. ౮ వా) ఆపర బ్రహ్మమునకు శరీరమును, ఇంద్రియములును లేవు, వానికి సమానుఁడును వానికంటెను గొప్పవాఁడును లేఁడు) అనియు, "తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి" (ము. 3 ము. ౧ ఖ. వా) "ఆ రెండు పక్షులలో (జీవాత్మ పరమాత్మలలో) ఒక్కటి (జీవాత్మ) రుచియైన ఫలమును (కర్మఫలమును) అనుభవించుచున్నది." అనియు "అనీశశ్చాత్మాబధ్యతే భోక్తృభావాత్" (శ్వే. ౧ అ. ౮ వా) "కర్మ ఫలభోక్తయగుటంజేసి యసమర్థుఁడగు జీవుఁడు దుఃఖించుచున్నాఁడు" అనియు, "అనీశయా శోచతి ముహ్యమానః" (ము. 3 ము, ౧ ఖ. ౧ వా) "జీవుఁడు అజ్ఞానములోఁబడి దానినుండి తప్పించుకొనుట కసమర్థుఁడగుటచే దుఃఖించు చున్నాఁడు" అనియు నివ్విధమున శ్రుతులయందు పేర్కొనఁబడిన విరుద్ధ ధర్మ ములన్నియు నొక్కటియే వస్తువునందుండునవి యని ప్రసక్తించును. అందు వలన ఉపనిషద్వాక్య జాలమంతయును అసంగతమగును.

భాష్యకారులు:—కార్యకారణభావము చిదచిత్పదార్థములుశరీరముగాఁ గల పరమాత్మ యందుండునది. దోషములన్నియో చిదచిత్పదార్థములయందుం డునవి. కావున కార్యావస్థయందున్నప్పుడు గాని, కారణావస్థయందున్నప్పుడు గాని యా దోషములు బ్రహ్మమునఁ బ్రసక్తింపవు.

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁదగదు. జగద్బ్రహ్మములకు శరీర శరీరిభావ ముండుటయే యసంభవము. అది సంభవమగు పక్షమున, అట్టి శరీర సంబంధ మును గలుగఁజేయు దోషములు బ్రహ్మమునకుఁ గలవని తప్పక ప్రసక్తించును.

మఱియు చేతనపదార్థములును, అచేతనదాముర్థలును్న బ్రహ్మము

యొక్క—శరీరమగుటయును అసంభవము. ఏలననిన, కర్మఫలరూపములగు సుఖదుఃఖములను అనుభవించుటకు సాధనభూతములగు ఇంద్రియములకాశ్రయమును, [1]పంచవృత్తులుగల ప్రాణముల కధీనమై నిలువఁబడి యుండునదియును నగు పృథివ్యాది భూతములయొక్క—యొకవిధమైన చేరిక గదా శరీరమనఁబడును. అట్టిదానికే గదా లోకమునందును, శాస్త్రమునందును శరీరమనెడి ప్రసిద్ధి కలదు. బ్రహ్మమన్ననో, "అపహతపాప్మా విజరః" అనియు, "అనశ్నన్నన్యో ఽభిచాకశీతి" అనియు, "అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః" అనియు, "అప్రాణోహ్యమనాః" అనియు నీ మొదలుగాఁగల శ్రుతివాక్యములయందుఁ జెప్పియున్న ప్రకారము కర్మముగాని కర్మ ఫలానుభవముగాని లేనిది, ఇంద్రియాధీనమైన భోగానుభవములేనిది, ప్రాణములకధీనమైనయునికిలేనిది. కావున అట్టి బ్రహ్మమునకు చేతనాచేతన పదార్థములు శరీరమగుట యెంతమాత్రము సంభవింపదు. ఏలననిన. అచేతన పదార్థముల వ్యష్టిరూపములగు తృణకాష్ఠాదులును, సమష్టిరూపమగు భూతసూక్ష్మమును ఇంద్రియములకాశ్రయమగుట యసంభవము. భూతసూక్ష్మము పృథివ్యాదుల చేరిక కాదుగదా! జ్ఞానైకాకారుఁడగు చేతనునియందన్ననో, ఇదియంతయునుండుట యసంభవము.

భాష్యకారులు:—శరీరమనఁగా భోగస్థానము.

సాంఖ్యుఁడు:—గృహము మొదలగునవియును భోగస్థానములే కదా? వానికి శరీరమనెడి ప్రసిద్ధి కలదా? లేదే?

భాష్యకారులు:—(జీవుఁడు) దేనియందే యుండినవాఁడై సుఖ దుఃఖములననుభవించునో, అదియే భోగస్థానము.

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, పరకాయ ప్రవేశముచేఁ గలుగు సుఖ దుఃఖానుభవమునకు స్థానభూతమగు వేఱొక్కని శరీరమునకు, దానిలోఁ బ్రవేశించినవాని శరీరమనెడి ప్రసిద్ధి లేదే. మఱియు ఈశ్వరుఁడు స్వతస్సిద్ధమును, నిత్యమును, నిరతిశయమునునగు ఆనందము గలవాఁడు. అట్టివాని భోగమున్నకై చేతనాచేతన పదార్థరూపమగు స్థానమావశ్యకమనెడి యనియమముండుట యసంభవము. శరీరమనఁగా భోగస్థానమనెడి యంశము ఈపైని గనఁబఱచిన హేతువులవలన నిషేధింపఁబడుచున్నది.

(1) ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అనునని పంచవృత్తులు.

భాష్యకారులు:—ఏది దేని యిచ్ఛకధీనములగు స్వరూప, స్థితి, ప్రవృత్తులు గలది యగునో, అది దాని శరీరము. దృష్టాంతము:—చేతనాచేతన పదార్థములు సర్వేశ్వరుని యిచ్ఛకధీనములగు స్వరూప, స్థితి, ప్రవృత్తులు, గలవి. కావున అవి వానికి శరీరభూతములు.

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పుటయును యుక్తముకాదు. ఏలననిన, శరీర మనఁబడునది చేతనుని యిచ్ఛకధీనములగు స్వరూపాదులను గలదిగాఁ గన్పట్టు చుండలేదు. దృష్టాంతము—రోగపీడితుని శరీరము వాని యిచ్ఛకధీనమైన ప్రవృత్తి గలది కాదు. మృతశరీరము చేతనుని యిచ్ఛకధీనమైన ప్రవృత్తి గలది కాదు. బొమ్మలు మొదలగునవి చేతనుని యిచ్ఛకధీనములగు స్వరూప, స్థితి, ప్రవృత్తులు గలవియే యయినను, అవి యా పురుషుని శరీరముగా వ్యవహరింపఁబడుచుండలేదు. చేతనుఁడు నిత్యుఁడు గాన, వాని స్వరూపము ఈశ్వరాధీనమైనది కాఁదగదు. కావున చేతనపదార్థములు ఈశ్వరుని శరీరము కాఁదగవు.

భాష్యకారులు:—ఏది యెవ్వనిచే మాత్రము నియమింపఁబడునో, ఎవ్వనిచే మాత్రము ధరింపఁబడునో, ఎవ్వనికి శేషభూతమో, అది వాని శరీరము.

సాంఖ్యుఁడు:—అట్లంటివేని, ఈ లక్షణము క్రియయందు [1]అతివ్యాప్తి గలదియగును. మఱియు "అశరీరం శరీరేషు" అనియు, "అపాణిపాదో జవనో గృహీతా" అనియు నీమొదలగు శ్రుతులు ఈశ్వరునికి శరీరము లేనే లేదని చెప్పుచున్నవి. ఈపైని గనఁబఱచిన హేతువులవలన జగద్బ్రహ్మంబులకు శరీర శరీరి భావముండుటయే యసంభవము. అది సంభవమగు పక్షమున, ప్రపంచగతములగు దోషములు బ్రహ్మమునఁ బ్రసక్తించును. కావున బ్రహ్మముజగత్కారణమని వాదించునెడల, ఉపనిషద్వాక్యజాల మంతయు నసంగత మగును.

అవతారిక:—ఇందుకుత్తరమును పఠించుచున్నారు.

౯॥ సూ॥ న తు దృష్టాన్తభావాత్.

టీ॥ న=ఉపనిషద్వాక్య జాలము అసంగతము కాదు, ఏలననిన, దృష్టా

(1) ఏదైన నొకపదార్థమును తదితర పదార్థము లన్నింటినుండి భేదపఱచి తెలుపునట్టి వాక్యము "లక్షణము" అనఁబడును. లక్షణముచే నవ్విధముగాఁ దెలుపఁబడునది "లక్ష్యము" అనఁబడును. లక్షణను తనలక్ష్యమునే కాకుండ, తన లక్ష్యము కానిదానిని సయితము అవ్విధమున తెలుపుపక్షమున నది "అతివ్యాప్తిగలది" అనఁబడును. లక్షణము తన లక్ష్యమునే పూర్ణముగాఁదెలుపని పక్షమున నది "అవ్యాప్తిగలది" అనఁబడును.

న్త భావాత్ =దృష్టాంతముండుటవలన, కావున, తు=హేయగుణములు బ్రహ్మ మునఁ బ్రసక్తింపవు.

తా॥ గుణ వ్యవస్థను తెలుపునట్టి దృష్టాన్తముండుటవలన, పూర్వపక్షి గానఁబఱచిన యసంగత మెంతమాత్రమును లేదు. కావున దోషగుణములు బ్రహ్మమునఁ బ్రసక్తింపవు.

శ్రీ॥ భా॥ భాష్యకారులు:—ఇట్టి యసంగత మేదియును లేదు. ఒక్కటియే పదార్థము రెండు అవస్థలను పొందునట్టిదైనను, గుణదోషముల కొక వ్యవస్థను తెలుపు దృష్టాన్తము కలదు. సూత్రమునందుండు "తు" శబ్దము పరమాత్మకు హేయగుణములతో సంబంధము లేశమాత్రమైననుండుట యసంభవమని సూచింపుచున్నది. ఇందు ఫలితార్థమేమన్నను, చేతనాచేతనపదార్థములు శరీరముగాఁగల దగుటంజేసి వానికి యాత్మయగు పరబ్రహ్మమునకు సంకోచ వికాస్మకమగు కార్యకారణభావముతో సంబంధమున్నను, విరోధ మేదియును లేదు. ఏలననిన, సంకోచ వికాసములు పరమాత్మకు శరీరభూతములగు చేతనాచేతనపదార్థములయందుండునవి. శరీరయుక్తులగు (దేవమనుష్యాది) జీవాత్మలయొక్క శరీరగతములగు బాల్య యౌవన వార్ధిక్యాదులు ఆత్మలతోను, ఆత్మగతములగు జ్ఞాన సుఖాదులు శరీరముతోనును సంబంధింపనివగు చందమున, శరీరగతములగు దోషములాత్మతోను, ఆత్మగతములగు గుణములు శరీరముతోనును సంబంధింపవు. ఈహేతువును బట్టియే "దేవతగాఁ బుట్టెను, మనుష్యుఁడుగాఁ బుట్టెను" అనియు, "వాఁడే బాలుఁడు; వాఁడే తరుణుఁడు; వాఁడే వృద్ధుఁడు" అనియు నీమొదలగు వ్యవహారములు ముఖ్యముగానే ప్రవర్తించును. జీవాత్మలకు దేవత్వము, మనుష్యత్వము మొదలగునవి వానివాని శరీరములను బట్టి గలిగినవియే యని "తదనన్తరప్రతిపత్తౌ" (బ్ర॰సూ॰ 3, అ॰ ౧ పా॰ ౧, సూ) ఇత్యాదిసూత్రమునఁ జెప్పఁబడును.

చేతనాచేతనాత్మకమయినట్టి యీప్రపంచము స్థూలముగా నుండునప్పుడు గాని, సూక్ష్మముగా నుండునప్పుడు గాని పరమాత్మయొక్క శరీరము కాఁదగదని యిట్లు సాంఖ్యులుచేయు వాదము యుక్తమైనది కాదు. అది మంచి యుక్తుల సహాయముఁగొని యుపనిషద్వాక్యముల యర్థమును బాగుగా నెఱింగి యుండని వారి మనస్సునఁ దోఁచినట్లు కుతర్కములచే గల్పింపఁబడినది. ఏలననిన, స్థూలావస్థయందుండునవియు, సూక్ష్మావస్థయందుండునవియునునగు చేత

నాచేతన పదార్థములన్నియును పరబ్రహ్మమునకు శరీరములయినవని యుపనిషద్వాక్యములన్నియును తెలుపుచున్నవి. ఎట్లన,

వాజసనేయులు కాణ్వశాఖయందును, మాధ్యందినులు అన్తర్యామి బ్రాహ్మణమునను, "యః పృథివ్యాం తిష్ఠన్ ** యస్యపృథివీ శరీరం" ఈమొదలగు వాక్యముచే సమస్తములగు పృథివ్యాద్యచేతన పదార్థములను, "యో విజ్ఞానే తిష్ఠన్ ** యస్యాత్మా శరీరం" అను వాక్యముచే చేతనపదార్థములనును ప్రత్యేకముగా నిర్దేశించి, అవి యన్నియును పరమాత్మయొక్క శరీరములని పఠించియున్నారు.

సుబాలోపనిషత్తునందును, "యః పృథివీ మన్తరే సఞ్చరన్", "యస్య పృథివీ శరీరం" అని యారంభించి "య ఆత్మాన మన్తరే సఞ్చరన్" "యస్యాత్మా శరీరం" అనియిట్లు, ఈపై నిగనఁబఱచిన ప్రకారము, చేతనాచేతన పదార్థములు సర్వావస్థలయందును పరమాత్మకు శరీరభూతములని పఠించి, అనంతరము "ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అని యిట్లు పరబ్రహ్మము సర్వభూతముల కంతరాత్మయని పఠింపఁబడెను.

స్మృతులయందును, "జగత్సర్వం శరీరం తే" (రా. యు. ౧౨౦ స. ౨౬ శ్లో.) (ఓ పరమాత్మా! ప్రపంచమంతయును నీయొక్క శరీరము) అనియు, "యదమ్బు వైష్ణవః కాయః" (వి. ౨ అం. ౧౨ అ. 3౭ శ్లో.) (జలమనఁబడునది యేది కలదో, అది విష్ణుసంబంధమైన శరీరము) అనియు, "తత్సర్వం వై హరేస్తనుః" (వి. ౧ అం. ౨౨ అ. 3౮ శ్లో.) (అదియంతయును విష్ణువుయొక్క శరీరము) అనియు, "తాని సర్వాణి తద్వపుః" (వి. ౧ అం. ౨౨ అ. ౮౬ శ్లో.) "అనియన్నియును వాని శరీరము" అనియు "సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్" (మను. ౧ అ. ౮ శ్లో.) (ఆ పరబ్రహ్మము ధ్యానించి తన శరీరమునుండి) అనియు నివ్విధముగాఁ బఠింపఁబడెను. ఈ పైశ్లోకమున "శరీరాత్స్వాత్" అనఁగా "భూతసూక్ష్మరూపమగు తన శరీరమునుండి" అని యర్థము.

లోకమున "శరీర" శబ్దము ఘటాదిశబ్దములవలె నియతాకారములగు పదార్థములను తెలుపునది కాక, నానావిధములును, అత్యంతము విలక్షణములునునగు కృమి, కీట, పతంగ, సర్ప, నర, పశు ప్రభృతులను తెలుపునదై, ప్రయోగింపఁబడునదిగాఁ గన్పట్టుచున్నది. ఈ శబ్దముయొక్క యర్థమును నిర్ణయింపవలయునన్న, భాషయందీశబ్దమునకుఁగల ప్రయోగంబుల నన్నింటిని యనుసరించి గదా నిర్ణయింపఁదగును.

అయితే శరీరమనఁగా "కర్మఫల భోగమునకు సాధనము" అని యిట్లు సాంఖ్యులు చెప్పునట్టిశరీరలక్షణ మన్ననో, భాషయందు శరీర శబ్దమునకుఁ గల ప్రయోగంబుల నన్నింటిని యనుసరించి చెప్పినది కాదు. ఏలననిన, ఆ లక్షణము ఈపైని గనఁబఱిచిన ప్రకారము సర్వేశ్వరునికి శరీరభూతములగు పృథివ్యాది పదార్థముల యందు [1]అవ్యాప్తి గలది.

ఇంతేకాక ఆ లక్షణము సర్వేశ్వరుఁడు స్వేచ్ఛచేఁ గైకొనిన శరీరముల యందును, "స ఏకధా భవతి" ఇత్యాది శ్రుతియందుఁ జెప్పియున్న ప్రకారము ముక్తపురుషులచేఁ గైకొనఁబడిన శరీరములయందును [1]అవ్యాప్తిగలది. ఏలననిన, ఆశరీరములు కర్మానుభవమునకై గైకొనఁబడినవి కావు.

"శరీరమనఁగా (పృథివ్యాది) భూతముల చేరిక" అని యిట్లు సాంఖ్యులు చెప్పునట్టి శరీరలక్షణము నయితము యుక్తమైనది కాదు. ఏలననిన, అది ఈ పైని గనఁబఱిచిన సర్వేశ్వరశరీరములయందు [1]అవ్యాప్తిగలది. ఏలననఁగా "న భూతసంఘ సంస్థానో దేహోఽస్య పరమాత్మనః" (పరమాత్మయొక్క శరీరము పృథివ్యాది భూతములయొక్క చేరిక కాదు.) అనెడి స్మృతివాక్యప్రకారము సర్వేశ్వరుని శరీరము పృథివ్యాది భూతముల చేరిక కాదు గదా!

శరీర మనఁగా "పంచ వృత్తులుగల ప్రాణమున కధీనమై నిలువఁబడి యుండునది" అను సాంఖ్యుల శరీరలక్షణము యుక్తమైనది కాదు. ఏలననిన, అది స్థావరశరీరములయందు [1]అవ్యాప్తి గలది. ఏలన, స్థావరపదార్థములయందు ప్రాణమున్నను, అచట నది ఐదు విధములుగానుండి శరీరమును ధరించుచుండ లేదు.

"ఇంద్రియముల కాశ్రయమైనది శరీరము" అనెడి లక్షణము గాని "సుఖ దుఃఖములకు హేతువైనది శరీరము" అనెడి లక్షణము గాని యుక్తమైనది కాదు. ఏలననిన, కర్మనిమిత్తము [2]అహల్యాదులు పొందిన శిలాకాష్ఠాది శరీరములయందు ఆలక్షణములు అవ్యాప్తిగలవి.

---

(1) ౨౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన ౧ వ వివరణమును చూఁడుము

(2) 'అహల్య' గౌతమమహర్షియొక్క భార్య. ఒకదినమున గౌతముఁడు గృహమున లేని సమయమున ఇంద్రుఁడు గౌతమునివేషము వేసుకొని, గౌతముని యాశ్రమమునకేగి యహల్యతో రమింపఁగోరెను. గౌతముండీసమాచారమును యోగదృష్టివలన నెఱింగి యామెను "శిలారూపమై పడియుందువు గాక" యని శపించెను. భర్తృశాపవశమున నామె మహారణ్యములో గౌతమాశ్రమమునకు సమీపమున శిలారూపముగా బహుకాలము పడియుండి తుట్టతుదకు శ్రీరాములవారి పాదస్పర్శము వలన శాపవిముక్తురాలై నిజరూపమును పొంది మరల తన భర్తతోఁగలసికొనెనని శ్రీరామాయణమునఁ జెప్పఁబడియె.

కావున "ఏ చేతనునికి ఏ ద్రవ్యము అన్ని విధములచేతను స్వార్థమునకై ధరించుటకును, నియమించుటకును శక్యమైనదో, మఱియు వానికి శేషభూతము గానుండుటయే ముఖ్యస్వరూపముగాఁగలదో, అది యా చేతనుని శరీరము" అని యిట్లు శరీరలక్షణమును నిర్ణయింపఁదగును. రోగియొక్క శరీరమున నియమనశక్తి యున్నను, ప్రతిబంధకవశమున నాశక్తి స్ఫురించుచుండలేదు. అగ్న్యాదులయందు ఔష్ణ్యాది శక్తులున్నను అవి యొకప్పుడు ప్రతిబంధకవశమున స్ఫురింపకుండుట ప్రసిద్ధమే గదా! అట్లే యిచటను తెలియంగునది. మృతశరీరము చేతనవియోగకాలముననే శిథిలమగుటకు సిద్ధమై క్షణాంతరమున శిథిలమై పోవుచున్నది. అయితే అది యింతకు పూర్వము చేతనునితోఁగూడియుండునప్పుడు ఒకవిధమైన చేరికగల పదార్థముగా నుండుటనుబట్టి, అది చేతనవియుక్తమైనప్పుడును, దానికి శరీరమనెడి వ్యవహారము లోకమునఁ గలదు.

కావున సర్వమును పరమపురుషునిచే స్వార్థమునకై నియమింపఁబడఁదగినదియు, ధరింపఁబడఁదగినదియు, వానికి శేషభూతముగానుండుటయే ముఖ్యమైనస్వరూపముగాఁగలదియును నగుటంజేసి, చేతనాచేతనస్వరూపమగునట్టి యీ సమస్త ప్రపంచమును వానికి శరీరభూతమైనది. సర్వమును సర్వేశ్వరునికి శరీరభూతమైనదని యుపనిషత్తులయందంతటను వినఁబడుటచే "అశరీరం శరీరేషు" అను శ్రుతివాక్యము సర్వేశ్వరునికి కర్మఫలరూపమగు శరీరము లేదని మాత్రమే చెప్పుచున్నట్లు తెలియంగునది. రాఁబోవు అధికరణములయందు ఈవిషయమునుగుఱించి విశదముగాఁ జెప్పఁబడును. "అపీతౌ తద్వత్ప్రసఙ్గాదసమఞ్జసమ్" అనియు "న తు దృష్టాన్తభావాత్" అనియు నీరెండు సూత్రములచే "ఇతరవ్యపదేశాధికరణమున" నిరూపింపఁబడునట్టి యర్థము సూచింపఁబడినది.

౧౦॥ సూ॥ స్వ ప క్ష దో షా చ్చ.

టీ॥ స్వపక్షదోషాచ్చ=సాఙ్ఖ్యుల వాదమునందు దోషముండుటవలనను, (బ్రహ్మకారణవాదః = బ్రహ్మమే జగత్కారణమనెడి వాదము, అనుసరణీయః= అనుసరింపఁదగినది.)

తా॥ సాంఖ్యుల ప్రధానకారణవాదము దోషయుక్తమైనదగుటవలనను బ్రహ్మకారణవాదము అనుసరింపఁదగినది.

శ్రీ॥ భా॥ బ్రహ్మమే జగత్కారణమనెడి వాదము దోషరహితమైనదగుటనుబట్టియే కాక, సాంఖ్యుల ప్రధానకారణవాదము దోషవిశిష్టమైన దగుటను

బట్టియును దీనిని త్యజించి, బ్రహ్మకారణవాదము ననుసరింపవలసినది. ప్రకృతియే జగత్కారణమగుపక్షమున, జగత్సృష్టి సంభవింపనే సంభవింపదు. ఏలననిన, నిర్వికారుఁడును, చిన్మాత్రైకరసుఁడునునగు పురుషుఁడు ప్రకృతియొక్క సాన్నిధ్యమున నుండుటచే వానియందు ప్రకృతియొక్క ధర్మముల యధ్యాసము (మిథ్యారోపము) గలుగును. అందుమూలముగ ప్రపంచము గలుగుచున్నది. ఇవ్విధమునఁగదా సాంఖ్యులు చెప్పుచున్నారు. ఈసందర్భమున నిర్వికారుఁడును చిన్మాత్రైకరసుఁడును నగు పురుషునియందు ప్రకృతిధర్మము లారోపింపఁబడుటకు హేతుభూతమగునట్టి ప్రకృతి సాన్నిధ్యముయొక్క స్వరూపమెట్టిదియో విచారింపఁదగును. ప్రకృతి సాన్నిధ్యమనఁగా ప్రకృతియొక్క యునికిమాత్రమా ? కాక, దానియందుండొక విధమైన వికారమా? అథవా పురుషునియందే యుండునదియగు నొకవిధమైన వికారమా ? అది పురుషునియందే యుండునట్టి యొకవిధమైన వికారమని చెప్పఁదగదు. ఏలననిన. పురుషునియందొక వికారము కలదని యంగీకరించియుండలేదు. అది ప్రకృతియందుండునట్టి యొకవిధమైన వికారమనియును చెప్పఁదగదు. ఏలననిన, అధ్యాసమువలనఁగదా వికారము గలుగుచున్నదని యంగీకరింపఁబడియె. ఇట్లుండ, అట్టి వికారమే ఆ యధ్యాసమునకు హేతువు ఎట్లు కాఁగలదు? అసంభవము. ప్రకృతియొక్క యునికిమాత్రమే అట్టి సన్నిధానమనుపక్షమున, [1]ముక్తపురుషునియందును అట్టియధ్యాసము కలుగునని ప్రసక్తించును. కాఁబట్టి సాంఖ్యమతప్రకారము జగత్సృష్టిని యుపపాదించుట యసంభవము. ఈవిషయము సాంఖ్యమతమును ఆక్షేపించు సందర్భమున "అభ్యుపగమేఽప్యర్థాభావాత్" (బ్ర. సూ. ౨ అ ౨ పా. ౬ సూ) ఈమొదలగు సూత్రములచే విశదముగాఁ గాన్పింపఁబడును.

౧౧॥ సూ॥ తర్కాప్రతిష్ఠానాదపి.

టీ॥ తర్కాప్రతిష్ఠానాదపి=తర్కముయొక్క యస్థిరత వలనఁగూడ, (బ్రహ్మకారణవాదః = బ్రహ్మకారణవాదము, అనుసరణీయః = అనుసరింపఁదగినది.)

తా॥ తర్కముయొక్క యస్థిరతవలనఁగూడ బ్రహ్మకారణవాదమే యనుసరింపఁదగినది గాని ప్రధానకారణవాదము అనుసరింపఁదగినది కాదు.

(1) పురుషుఁడు ముక్తుఁడగునప్పుడు వానికి ప్రకృతితో సంబంధము లేకున్నను, ప్రకృతి స్వయముగ నుండనే యున్నది. ప్రకృతియొక్క యునికిమాత్రమే యధ్యాసములఁ గలుగఁజేయునది యగుపక్షమున నది మోక్షావస్థయందును అధ్యాసములను గలుగఁజేయుట శక్యమని యభిప్రాయము.

శ్రీ॥ భా॥ కేవలతర్కము స్థిరమైనది కాకపోవుటవలనఁగూడ శ్రుతిమూలమగు బ్రహ్మకారణవాదమే ఆశ్రయింపఁదగినది గాని, సాంఖ్యుల ప్రధానకారణవాదము ఆశ్రయింపఁ దగినది కాదు. ఏలననిన, [1]బుద్ధునియొక్కయు, [2]కాణాదునియొక్కయు, [3]అక్షపాదునియొక్కయు, [4]జినునియొక్కయు, [5]కపిలునియొక్కయు, [6]పతఞ్జలియొక్కయును తర్కములు (వాదములు) అన్యోన్యము విరుద్ధములగుటనుబట్టి తర్కము అస్థిరమని తెలియవచ్చుచున్నది.

౧౨॥ సూ॥ అన్యథాఽనుమేయమితి చేదేవమప్యనిర్మోక్షప్రసఙ్గః

టీ॥ అన్యథా = అట్టియస్థిరత సంభవింపకుండ, అనుమేయం=సాంఖ్యుల తర్కముయొక్క స్వరూపము యోచింపఁదగినది, ఇతిచేత్ = ఇట్లంటివేని, ఏవమపి=ఈప్రకారము యోచించినను, అనిర్మోక్షప్రసఙ్గః = ముందువచ్చిన యాక్షేపము నివారితముకాదు.

తా॥ సాంఖ్యుల తర్కమును మాత్రము, "తర్కము అస్థిరము" అనెడి దోషమురాకుండుట్లు వేఱొక విధముగా యోచింపఁదగునంటివేని, అట్లు యోచించినను ఆదోషము రాకమానదు.

శ్రీ॥ భా॥ ఇప్పటి వారలగు గౌతమబుద్ధుఁడు మొదలగు వారి తర్కములను దూషించి: సాంఖ్యుల ప్రధానకారణవాదమును గుఱించిన తర్కమునుమాత్రము "తర్కము అస్థిరము" అనెడిదోషము రాకుండునట్లు వేఱొకవిధముగాయోచింపఁదగు నంటివేని, అట్లు యోచించినను ఆదోషము నివారితముకాదు. ఏలననిన, తర్కమనఁబడునది పురుషబుద్ధియందు గలుగునట్టి యూహ నవలంబించి యుండునట్టిది గదా! నీకంటెను ఎక్కువగా తర్కమునఁ గౌశల్యమును వడసిన వేఱొక్కనిచే నది వేఱొకదేశమున వేఱొకకాలమున దూషింపఁబడ వచ్చును. కావున తర్కము అస్థిరమనెడి దోషము అనివార్యము. కాఁబట్టి యింద్రియ గోచరము కాని విషయమును గుఱించి శాస్త్రమే ప్రమాణము కాఁదగును.

శాస్త్రమునఁ దెలుపఁబడిన విషయమును విశదపఱచుటకై మాత్రమే

(1) ఈతఁడు బౌద్ధమత ప్రవర్తకుఁడు. గౌతమబుద్ధుఁడని ప్రసిద్ధినొందినవాఁడు.
(2) ఈతఁడు వైశేషిక దర్శన ప్రవర్తకుఁడు. వైశేషికసూత్రములను రచియించినవాఁడు.
(3) ఈతఁడు అక్షపాద దర్శన ప్రవర్తకుఁడు.
(4) ఈతఁడు జైనమతప్రవర్తకుఁడు, జైనసూత్రములను రచియించినవాఁడు.
(5) ఈతఁడు సాంఖ్యదర్శన ప్రవర్తకుఁడు, సాంఖ్యస్మృతిని రచియించినవాఁడు.
(6) ఈతఁడు యోగదర్శన ప్రవర్తకుఁడు, యోగసూత్రములను రచియించినవాఁడు.

తర్కము ఆశ్రయింపఁ దగినది. కావుననే, మనువును "ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా।య స్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (ఎవ్వఁడు వేదశాస్త్రముతో విరోధింపని తర్కముతో స్మృతులయందు చెప్పఁబడిన ధర్మోపదేశమును సంబంధింపఁ జేయుచున్నాఁడో, వాఁడే ధర్మము నెఱిఁగినవాఁడు ఇతరుఁడుకాఁడు) అని యిట్లు చెప్పియున్నాఁడు. ఈ పై శ్లోకమున "శాస్త్రావిరోధినా" అనఁగా "వేదశాస్త్రముతో విరోధములేనట్టి" అని యర్థము. కావున సాంఖ్యస్మృతి వేదవిరుద్ధమైన దగుటంజేసి యది వేదార్థమును విశదీకరించుటకును, దానిని నిర్ణయించుటకును ఉపయోగపడనేరదు.

విలక్షణత్వాధికరణము ముగిసెను.

---

## శిష్టాపరిగ్రహాధికరణము

౧౩॥ సూ॥ ఏ తే న శి ష్టా ప రి గ్ర హా అ పి వ్యా ఖ్యా తాః

టీ॥ ఏతేన=ప్రధానకారణవాదమును నిరాకరించుటచే, శిష్టాపరిగ్రహా అపి=తక్కిన వేదబాహ్య మతములును, వ్యాఖ్యాతాః=నిరసింపఁబడినవి.

తా॥ సాంఖ్యుల ప్రధానకారణవాదమును నిరాకరించుటచే, తక్కిన వేదబాహ్యమతము లన్నియును నిరాకరింపఁబడినవని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ శిష్టాపరిగ్రహము లనఁగా, "శిష్టాః = తక్కిన, అపరిగ్రహాః= వేదానుమతిలేనివి" అని యర్థము. వేదబాహ్యమగు సాంఖ్యులవాదమును నిరాకరించుటచే తక్కిన వేదబాహ్యములగు కాణాద, అక్షపాద, జిన, బుద్ధుల వాదములు నిరాకరింపఁబడినవని యెఱుంగునది.

శంక:—ఈపైనిపేర్కొనఁబడిన దర్శనకర్త లందఱును పరమాణువులు జగత్కారణ మనెడి యంశమును అంగీకరించుచున్నారు. ఇట్లుండ, కారణవస్తువును గుఱించి వారుచేయుతర్కము నిలువనేరనిదని చెప్పుట యశక్యము.

పరిహారము:—ఈ యంశమున మాత్రము వారికందఱికిని ఐకమత్యమున్నను, వారందఱును తర్కము నవలంబించిన వారలే. పరమాణువుల స్వరూపమును గుఱించి వారిలో కొందఱవి శూన్యాత్మకములనియు మఱికొందఱవి శూన్యాత్మకములు కావనియు, కొందఱవి జ్ఞానస్వరూపములనియు మఱికొందఱవి ద్రవ్య స్వరూపములనియు, కొందఱవి క్షణికములనియు మఱికొందఱవి నిత్యములనియు, కొందఱవి నియతస్వభావములనియు మఱి

కొందఱవి యట్టివికావనియు, కొందఱవి సత్యస్వరూపములనియు మఱి కొందఱవి యసత్యస్వరూపములనియు నిట్లు పలుతెఱంగుల వారిలో వారు పరస్పరము వివాదపడుచున్నారు. కావున వారితర్కము ఎంతమాత్రము స్థిరమైనది కాదు.

శిష్టాపరిగ్రహాధికరణము ముగిసెను.

## భోక్త్రాపత్త్యధికరణము

### ౧౪॥ సూ॥ భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్.

టీ॥ భోక్త్రాపత్తేః=బ్రహ్మమున్ను కర్మఫలభోక్తయని ప్రసక్తించుటవలన, అవిభాగః=జీవబ్రహ్మముల స్వభావమున భేదములేకుండుట, చేత్=ప్రాప్తించు నంటివేని, లోకవత్=లోకమునందువలెనే, స్యాత్=జీవబ్రహ్మముల స్వభావమున భేదము ఉండును.

తా॥ పరబ్రహ్మము సయితము శరీరవంతుఁడగుటంజేసి, శరీరవంతుఁడగు జీవునివలె నతఁడును సుఖదుఃఖానుభవము గలవాఁడని ప్రాప్తించుటవలన, జీవబ్రహ్మముల స్వభావమున భేదములేకపోవు నంటివేని, లోకమునందువలెనే వారి స్వభావమున భేదముండును.

శ్రీ॥ భా॥ సాంఖ్యుఁడు మరల ఇట్లు వాదించుచున్నాఁడు.

#### పూర్వపక్షము.

సాంఖ్యుఁడు:—స్థూలములయినవి గాను, సూక్ష్మములయినవి గాను నుండు చేతనాచేతన పదార్థములు శరీరముగాఁగల పరబ్రహ్మము కారణరూపమును కార్యరూపమును నగుటంజేసి, జీవబ్రహ్మముల స్వభావము వేఱయినదిగా నుండుట సంభవమే యని మీరు చేయువాదము యుక్తమైనదికాదు. ఎల ననిన, మీరు వాదించినప్రకారము జీవేశ్వరుల స్వభావము వేఱయినదిగా నుండుట యసంభవము. ఎట్లన, పరబ్రహ్మమున్ను శరీరవంతుఁడగు పక్షమున, అతఁడు భోక్తయు నగును. జీవుఁడు శరీరవంతుఁడగుటంజేసి సుఖదుఃఖముల ననుభవించువాఁడగు చందమున, పరబ్రహ్మము సయితము, శరీర వంతుఁడగుటంజేసి, సుఖదుఃఖముల ననుభవించువాఁడును నని తప్పక ప్రాప్తించును.

భాష్యకారులు:—"సంభోగప్రాప్తిరితిచేన్నవైశేష్యాత్" (బ్ర. సూ. ౧.

అ.౨.పా. ౮.సూ) అనుసూత్రమున సర్వేశ్వరునికి సుఖదుఃఖానుభవము సంప్రాప్తించుననెడ శంకను పరిహరించియున్నామే ?

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, "ఉపాస్యవస్తువుగా హృదయస్థానమున సన్నిహితుఁడైన సర్వేశ్వరుఁడు శరీరములో నుండువాఁడయినంతమాత్రముచే నతనికి సుఖదుఃఖానుభవము సంభవింపదు" అని యింతమాత్రమే ఆతావునఁజెప్పఁబడియె. ప్రకృతముననో, జీవునివలెనే సర్వేశ్వరుఁడును శరీరవంతుఁడగుటంజేసి జీవునివలెనే యతండును సుఖదుఃఖానుభవము గలవాఁడు కాఁదగునని యనివార్యముగాఁ బ్రసక్తించునని కదా నేను చెప్పుచున్నాఁడను. లోకమునను శరీరవంతులగు జీవులకు శరీరగతములగు బాల్యము, వార్ధిక్యము మొదలగు మార్పులు గలుగకపోయినను, శరీరగతమగు ధాతువుయొక్క సమవిషమస్థితులనుబట్టి సుఖదుఃఖములు గలుగుచున్నట్లు మనము చూచుచున్నాము కదా! "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి అశరీరం వావ సన్తం ప్రియాప్రియే న స్పృశతః" (ఛా. ౮. ప్ర ౧౨. ఖ ౧ వా) అనెడి శ్రుతివాక్యము సయితము "శరీరవంతుఁడగు వానికి సుఖదుఃఖములు లేకుండుట యెన్నఁడును లేదు, శరీరము లేనివాని నన్ననో, సుఖదుఃఖము లెన్నఁడును సంబంధింపవు" అనికదా చెప్పుచున్నవి. కావున శరీరవంతుఁడగు బ్రహ్మము జగత్కారణమగు పక్షమున, జీవబ్రహ్మముల స్వభావము వేఱగుట పంభవింపదు. కేవల బ్రహ్మము జగత్కారణమగు పక్షమున, ఘటాదికార్యపదార్థములందుఁ గల దోషములకుమృత్సువర్ణాదులువలెనే, ప్రపంచగతములగు దోషములన్నింటికిని బ్రహ్మమే స్థానభూతమైనదియని ప్రసక్తించును. కాఁబట్టి బ్రహ్మ కారణవాదముకంటెను ప్రధాన కారణవాదమే ఎక్కువ గొప్పది.

## సిద్ధాంతము.

భాష్యకారులు:—ఈపైని గనఁబఱచిన ప్రకారము పూర్వపక్షమురాఁగా అందులకు "లోకవత్" అని యిట్లు సమాధానమును సూత్రకారులు పఠించుచున్నారు.

శరీరగతమగు ధాతువుయొక్క సమ విషమ స్థితులనుబట్టి జీవునికిఁ గలుగు సుఖదుఃఖానుభవము, వాఁడు శరీరముగలవాఁడగుటను బట్టి గలుగునది కాదు. అయితే అది వాని పుణ్యాపాప రూపమగు కర్మమునుబట్టి గలుగునది "న హ వై సశరీరస్య" ఇత్యాదిశ్రుతివాక్యము పుణ్యాపాపరూపమగు కర్మ

మును బట్టి గలిగిన శరీరమును గుఱించి యిట్లు చెప్పుచున్నది. ఇంతియే. ఏల
ననిన, "స ఏకధా భవతి త్రిధా భవతి" (ఛా. ౭ ప్ర ౨౬ ఖ ౨ వా) "ముక్తపురు
షుఁడు ఒక్క శరీరముగలవాఁడును మూఁడు శరీరములు గలవాఁడును అగు
చున్నాఁడు" అనియు, స" యది పితృలోకకామోభవతి" (ఛా. ౮ ప్ర. ౨
ఖ. ౧ వా) (ఆ ముక్తపురుషుఁడు పితృలోకముఁ గోరుపక్షమున) అనియు,
"స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః" (ఛా ౮ ప్ర ౧౨. ఖ ౩. వా)
"ఆ ముక్తపురుషుఁడు పరబ్రహ్మమునందు భుజించువాఁడు; క్రీడించువాఁడు;
రమించువాఁడు" అనియు, నిట్లు కర్మబంధమునుండి విమోచనమును బొంది స్వ
స్వరూపావిర్భావముగలవాఁడగు ముక్తపురుషుఁడు శరీరవంతుఁడే యయినను,
వానికిఅట్టిదోషములు లేశమాత్రమైనను లేనట్లు శ్రుతులే తెలుపుచున్నవి గదా!
అపహతపాప్ముఁడగు పరమాత్మయన్ననో, స్థూలసూక్ష్మరూపమగు నట్టి యీ
సమస్త ప్రపంచము శరీరముగాఁ గలవాఁడే యయినను, అతనికి కర్మసంబంధము
లేశమాత్ర మైననులేదు గాన అట్టిదోషము లతనియందు ఎంతమాత్రము
ప్రసక్తింపవు. దృష్టాంతము—లోకమున రాజశాసనమున కనుగుణముగాఁ
బ్రవర్తించువారు సుఖమునకును, తద్వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించువారు దుఃఖ
మునకును పాత్రులే యయినను, వారివలెనే శరీరవంతుఁడనెడిసామ్యమును
బట్టి, రాజును వారివలెనే రాజశాసనాను వర్తనమువలన సుఖమునకును,
తద్వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించుటవలన దుఃఖమునకును అర్హుఁడని ప్రస
క్తించునా? ప్రసక్తింపదే—అట్లే ప్రకృతమునను ఎఱుంగునది. ఈ విషయ
మును గుఱించి శ్రీద్రమిడాచార్యులవారు తమభాష్యమున నీక్రింద నుదహ
రింపఁబడిన దృష్టాంతమును గాన్పించియున్నారు.— "లోకమున దోమలు మొ
దలగు వానిబాధ మెండుగ గలిగిదియు, భయంకరమై నదియు, అనేకము
లగు అనర్థములను, సంకటములనును, గలిగియున్నట్టిదియును నగు ప్రదేశమున
నున్నవాఁడైనను, రాజగువాఁడు చామరములు మొదలగువానితో విసరించు
కొనుచు నాప్రదేశమునందుండు దోమములతో నెంతమాత్రము సంబంధము
లేనివాఁడై తనకు ప్రియములగు దేశములను ఏలుచున్నాఁడు గదా! సర్వజన
భోగ్యములగు సుగంధద్రవ్యములు మొదలగువాని ననుభవించు చున్నాఁడు
గదా! అట్లే సృష్టికర్తయును తన సామర్థ్యరూపమగు చామరములతో విసరఁ
బడి దోషములతో నెంతమాత్రము సంబంధము లేనివాఁడై బ్రహ్మలోకము

మొదలగువాని నేలుచున్నాఁడు. సర్వజనులకును భోగ్యములగు భోగముల ననుభవించుచున్నాఁడు."

సర్వేశ్వరుఁడు ఎవ్విధమైన వికారమును (మార్పును) లేనివాఁడనియు, ఎవ్విధమైన దోషమును (లోపమును) లేనివాఁడనియును, శ్రుతులు తెలుపుచున్నవి. కావున సృష్టియనఁగా, మృత్తిక స్వర్ణము మొదలగునవి, ఘటము, కుండలములు మొదలగునవిగాఁ బరిణమించునట్లు, సర్వేశ్వరుని స్వరూపము జగద్రూపముగాఁ బరిణమించుటయని మాత్రము అంగీకరింపము.

విమర్శనము:—"బ్రహ్మమే జగత్కారణమనివాదించుపక్షమున,"ఈతఁడు భోక్త ఇది భోగ్యపదార్థము" అనెడి విభాగము లేకపోవునేమో యనిశంకించి, సముద్రఫేనతరంగ దృష్టాంతమునుబట్టి విభాగము గలుగును అని యివ్విధమున సూత్రకారుఁడు సమాధానమునిచ్చెను" అనియిట్లు [1] శ్రీశంకరాచార్యులవారీ సూత్రమునకు వ్యాఖ్యానము చేసియున్నారు. వారివ్యాఖ్యానము యుక్తమైనది కాదు. ఏలననిన, లోపలనుండునట్టి యొకశక్తితోఁగాని, అవిద్యతోఁగాని, ఉపాధితోఁగాని, గూడియున్నట్టి బ్రహ్మము ఈప్రపంచమును సృజించుచున్నదని గదా వారిమతము. అట్టిసందర్భమున, ఈపైని గనఁబఱచిన శంకయును, సమాధానమును అసంగతములగును. ఎట్లన, కారణవస్తువులో నుండెడి శక్తితోఁ

---

☞ (1) శ్రీ శంకరాచార్యులవారు తమ భాష్యమున నీసూత్రముయొక్కయర్థమునిట్లు తెలియబఱచియున్నారు.

సూ॥ భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్॥

"టీ॥ అవిభాగశ్చేత్ =బ్రహ్మమును జీవప్రపంచములు నభిన్నములైనచో, భోక్త్రాపత్తేః- భోక్తృత్వదోషము కలుగుటవలన ; (బ్రహ్మకారణవాదమయుక్తము = ఇట్లని పూర్వపక్షము రాఁగా), లోకవత్ = సముద్రతరంగములవలెనే, స్యాత్ = బ్రహ్మమందు భోక్తృభోగ్య విభాగము కలుగుచున్నది.

తా॥ భోక్తృభోగ్య విభాగము లోకమందుఁ బ్రసిద్ధముగదా! జీవుఁడు భోక్తయు, విషయములు భోగ్యములు నయియున్నవి. ఇవి బ్రహ్మ నన్యములనిచెప్పినచో, భోక్త భోగ్యము గాను, భోగ్యము భోక్తగాను, కావలసియుండును. మరియు బ్రహ్మముకూడ నొకప్పుడు భోక్తగాను, భోగ్యముగాను కావలసియుండును. ఇది యయుక్తము - కావున నద్వితీయబ్రహ్మకారణవాదమ సమంజసము.

ఇట్లు చెప్పఁబడిన దోషము, దోషముకాదని లోకప్రసిద్ధమగు నొక దృష్టాంతముచే బోధయగుచున్నది. సముద్ర వికారము లగు ఫేన, వీచీ, తరంగ, బుద్బుదాదులు, జలస్వభావముచే దానికంటె నన్యములయినను, పరస్పర విభాగ వ్యవహారము కలిగియున్నవి. అట్టి విభాగము కలిగియున్నను అవి సముద్రముకంటె భిన్నములయి యుండలేదు - ఇటులనె భోక్తృభోగ్యములు పరస్పరభిన్నములైయును బ్రహ్మముకంటె ననన్యములయియున్నవి.

ఈ దృష్టాంతమునే సూచించు ॥ శ్లో ॥ సత్యపిభేదా పగమే నాథ తవాహం న మామకీనస్త్వం । సాముద్రోహితరంగః క్వచనసముద్రో స్తితారంగః ॥" అనెడి శ్లోకమును గలదు,

గాని, అవిద్యతోఁగాని, ఉపాధితోఁగాని మూయఁబడినదియే భోక్త. అట్టి యుపాధియే భోగ్యపదార్థము. అవి పరస్పరము విలక్షణములయినవి గాన, వానిలోనొక్కటి వేఱొక్కటిగా భావింపఁబడుట కవకాశమేలేదు.

బ్రహ్మస్వరూపమే జగద్రూపముగాఁ బరిణమించుచున్నదనెడి వాదమును వారంగీకరింపరు. ఏలననిన, "నకర్మావిభాగాదితి చేన్నానాదిత్వాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా ౩౫ సూ.) అను సూత్రమున "జీవులును వారివారి కర్మములును అనాదులు" అని కదా వారు ప్రతిపాదించి యున్నారు. ఒకవేళ వారీవాదము నంగీకరించినను, "ఈతఁడు భోక్త, ఇది భోగ్యపదార్థము" అనెడి విభాగము లేకపోవునేమో యనెడి శంక యెవ్వనికిని గలుగనేరదు. దృష్టాంతము:—మృత్తిక, స్వర్ణము మొదలగునవి ఘటము, శరావము, కటకము, ముకుటము, మొదలగునవిగాను పరిణమించునప్పుడు "ఇది మృత్తిక; ఇది ఘటము; ఇది స్వర్ణము; ఇది కటకము;" అనెడి విభాగము తోఁచుచున్నది గదా! అయితే వారీవాదము నంగీకరించుపక్షమున, ఇందు బ్రహ్మమొక్కటియే భోక్తగాను, భోగ్యపదార్థముగాను నగుచున్నదిగాన, "భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్" అనియిట్లు పూర్వము గానఁబడిచిన యసంగతము మరల ప్రాప్తించును.

భోక్త్రాపత్త్యధికరణము ముగిసెను

## ఆరమ్భణాధికరణము.

౧౪॥ సూ॥ తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః

టీ॥ తదనన్యత్వం = పరమకారణమగు బ్రహ్మముకంటెను జగత్తు వేఱయినది కాదని, ఆరమ్భణశబ్దాదిభ్యః = ఆరమ్భణశబ్దముతో నారంభింపఁబడిన వేదవాక్యమువలన, (అవగమ్యతే = తెలియవచ్చుచున్నది.)

తా॥ ఈప్రపంచము పరమకారణమగు బ్రహ్మముకంటెను వేఱయినది కాదని "వాచారమ్భణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యం" ఈమొదలగు శ్రుతివాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ "అసదితి చేన్నప్రతిషేధమాత్రత్వాత్" ఇత్యాది సూత్రములయందు కారణభూతమగు బ్రహ్మముకంటెను కార్యభూతమగు ప్రపంచము వేఱయినది కాదని యంగీకరించి, బ్రహ్మము జగత్కారణమని యుపపాదింపఁబడియె. ఆ యంశమునే మరల నీయధికరణమున నాక్షేపించి సమాధానముచెప్పఁబోవుచున్నారు.

☞ ఈయంశమును గుఱించి వైశేషికులిట్లాక్షేపించుచున్నారు.

వైశేషికుఁడు:—కారణపదార్థముకంటెను కార్యపదార్థము వేఱయినది కాదని చెప్పగిట్టదు. ఏలననిన,

హేతువు:—కార్యకారణపదార్థములు వేఱయినవిగాను కదా మనకు తెలియవచ్చుచున్నవి.

దృష్టాంతము:—కారణభూతములగు తన్తువులును, కార్యభూతమగు వస్త్రమును ఒక్కటియే పదార్థముగాఁ దెలియవచ్చుచుండలేదు. కారణభూతమగు మట్టిముద్దయును కార్యభూతమగు ఘటమును ఒక్కటియే పదార్థముగాఁ దెలియవచ్చుచుండలేదు.

హేతువు:—కార్య కారణపదార్థములు వేఱువేఱు నామములచే వ్యవహరింపఁబడుచున్నవి.

దృష్టాంతము:—తన్తువులను వస్త్రమని చెప్పము గదా! వస్త్రమును తన్తువులని చెప్పము గదా!

హేతువు:—కార్యకారణపదార్థముల యుపయోగములును వేఱయినవి.

దృష్టాంతము:—మట్టిముద్దతో నుదకముఁ గొనిరాము కదా! ఘటముతోఁ గోడలను పెట్టము కదా!

హేతువు:—కాలభేదమును బట్టియును కార్యకారణపదార్థములు వేఱయినవి.

దృష్టాంతము:—పూర్వముండునది కారణము; తరువాత గలుగునది కార్యము.

హేతువు:—కార్యకారణపదార్థముల యాకారములును వేఱయినవి.

దృష్టాంతము:—కారణపదార్థమగు మృత్తిక పిండాకారమైనది. కార్యపదార్థమగు ఘటమన్ననో విపులమైన అడుగుతట్టును ఉదరమును గలది. మృత్తిక అట్టి యాకారముగలదై యున్నట్టిదియేయగు మృత్తికవిషయమై గదా "ఘటము నష్టమైనది" అనెడి వ్యవహారము పొసగుచున్నది!

హేతువు:—కార్యకారణపదార్థములకు సంఖ్యాభేదమును గలదు.

దృష్టాంతము:—తన్తువు లనేకములు, వస్త్రమన్ననో ఒక్కటియే.

మఱియు కారణపదార్థమునకంటెను కార్యపదార్థము వేఱయినదిగాని పక్షమున, కార్యమును గలుగఁజేయు పనివాని యుద్యమము నిష్ప్రయోజనము

గును. ఏలయనిన, కారణపదార్థమే కార్యపదార్థమగునెడల, పనివాఁడు చేయవలసినది మఱియేమున్నది?

భాష్యకారులు:—పూర్వమే కారణపదార్థమునందున్నట్టి కార్యపదార్థమును పనివాఁడు తన యుద్యమముచే వేఱొకకార్యమున కుపయుక్తమగు దానినిగాఁ జేయుచున్నాఁడు.

వైశేషికుఁడు:—అట్లగుపక్షమున, పనివాని యుద్యమమునకు ఎన్నఁడును [1]విరామము లేకపోవును. సర్వమును సర్వదా ఉన్నట్టిదియేగాన "ఇది నిత్యము; ఇది యనిత్యము" అనెడి విభాగము లోకమున లేకపోవును.

భాష్యకారులు:—కార్యపదార్థము పూర్వమున్నదియే యయినను, స్పష్టముగాఁ దెలియరానిదై పనివానియొక్క యుద్యమముచే ప్రకాశింపఁబడుచున్నది. కావున పనివానియొక్క యుద్యమము సార్థకము. నిత్యానిత్య వస్తు విభాగముగూడ గలుగును.

వైశేషికుఁడు:—అది సరికాదు. కార్యపదార్థమును ప్రకాశింపఁజేయుట యనఁగా నేమి? ఇదివఱకు కార్యపదార్థమునకుఁ గల ప్రకాశమనునది మరల ప్రకాశింపఁజేయుట నపేక్షించుచున్నదని మెదవా? అట్లంటివేని, ప్రకాశింపఁ జేయుటకు మితిలేకపోవుటచే అనవస్థాదోషము సంప్రాప్తమగును. అదియట్లు ప్రకాశింపఁజేయుట నపేక్షించునది కాదంటివేని, కార్యపదార్థము ఎల్లప్పుడును ప్రకాశించునదిగా నుండవలయును. అట్టి ప్రకాశమనఁబడునది కార్యపదార్థము యొక్క యుత్పత్తి యనిమెదవా? అట్లంటివేని, కార్యపదార్థము ఇంతకుపూర్వము కారణపదార్థమున లేనిదై ఇప్పుడు నూతనముగా నుత్పన్నమగుచున్నదనెడి "యసత్కార్యవాదము" సంప్రాప్తమగును. ఇంతేకాక పనివానియొక్క యుద్యమము ఏదైన నొకదానిని ప్రకాశింపఁజేయునదియగు పక్షమున, ఘటమునకై యొనర్చిన యుద్యమము కరకము, మొదలగు నాభరణమును ప్రకాశింపఁ జేయుటయు ప్రసక్తించును. ఏలయనిన, ప్రకాశింపఁజేయునదియగు దీపము మొదలగునది ఏదైన నొక్కపదార్థమును మాత్రమే ప్రకాశింపఁజేయుననెడి నియమములేదు. దృష్టాంతము:—ఘటమును ప్రకాశింపఁజేయుటకై పెట్టిన దీపము, కరకము, మొదలగుదానిని సయితము ప్రకాశింపఁజేయవచ్చును గదా. కావున

(1) కార్యపదార్థము ఎప్పుడునుండునదిగాన దానికిఁగానగు పనివాని యుద్యమము ఎప్పుడునుండునది యగును.

నింతకుపూర్వము లేనిపదార్థమును గలుగఁజేయుటయే పనివాని యుద్యమముచే నెరవేర్పఁబడునది. కాఁబట్టి కార్యపదార్థము పూర్వము కారణాత్మకముగా నుండియున్నదనెడి సత్కార్యవాదము సిద్ధింపదు.

భాష్యకారులు:—ఏదైన నొకకార్యమును నొనర్పవలయుననిన నందులకు నియతమైన కారణముఁ గొనియే యాకార్యము నొనర్చుటనుబట్టి కార్యపదార్థ మింతకుపూర్వము కారణపదార్థమున నుండియున్నదని నిశ్చితమగుచున్నది.

వైశేషికుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఒక్కొక్కకారణమున నొక్కొక్కకార్యమును గలుగఁజేయు శక్తియున్నందున ఆయాకార్యమును గలుగఁజేయుటకై యాయాకారణమునే యవలంబించుట సంభవము. ఇంతియే.

భాష్యకారులు:—అసత్కార్యవాదియగు నీమతమునను పనివాని యుద్యమము ఉపపన్నముకాదు. ఏలననిన. ఉత్పత్తికి పూర్వము కార్యపదార్థము కారణపదార్థమున లేనిదని గదా నీవు చెప్పుచున్నావు. అట్లగుపక్షమున, నేదైన నొకకార్యము నొనర్చుటకై పనివాఁడు చేయునట్టి యుద్యమము ఆకార్యము కంటెను వేఱగునట్టి మఱి యేకార్యమునైనను గలుగఁజేయవచ్చును. కారణపదార్థముకంటెను కార్యపదార్థము వేఱయినదంటివేని, అదియట్లు వేఱైనదే దియయినను గావచ్చును గదా. కావున కారణభూతములగు తన్తువులఁగొని చేయునట్టి యుద్యమము ఘటముఁగూడ గలుగఁజేయవచ్చునని ప్రసక్తించును.

వైశేషికుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఏకార్యమును గలుగఁజేయు శక్తి యేకారణమునఁగలదో, ఆకారణమునే యవలంబించి చేసిన యుద్యమము ఆకార్యమునే గలుగఁజేయును.

☞ ఈ యంశమును గుఱించి యద్వైతులిట్లు వాదించుచున్నారు:—

అద్వైతి:—కారణపదార్థమునకంటెను కార్యపదార్థము వేఱయినది కాదు. వాస్తవమునకు కారణమునకంటెను వేఱుగా కార్యమనఁబడునది యొక్కటియును లేదు. సమస్తములైన కార్యములును వానిని గుఱించిన వ్యవహారములును అవిద్యామూలకములు. కారణభూతమగు మృత్తిక మొదలగు దాని వలనఁగలుగు వికారములయందు దెలియవచ్చునట్టి మృత్తికతప్ప, తదితరమగు ఘటశరావాదిరూపమగు కార్యజాతమంతయును వాగ్వ్యవహారము మాత్రమే యాధారముగాఁగలదియు, మిథ్యాభూతమును. కావున కారణభూతమగు మృత్తికయే సత్యము. అట్లే కారణభూతమగు నిర్విశేష చిన్మాత్రబ్రహ్మము కంటెను

వేఱయనదిగాఁ దెలియవచ్చునదియు "నేను, నాది" అని యిట్లు అహంకారాది వాగ్వ్యవహారమే యాధారముగాఁ గలదియుననగు ఈప్రపంచమంతయును మిథ్య. కారణ భూతమును, సన్మాత్రముననగు బ్రహ్మమే సత్యము. అందువలన కారణముకంటెను వేఱుగాఁ గార్యమనఁబడునది యొక్కటియును లేదు. కాఁబట్టి కారణకంటెను కార్యము వేఱయినదికాదు.

భాష్యకారులు:—(భ్రాంతివశమున త్రాఁటిని సర్పముగాఁ దలంచిన తావున) సర్పమువలెను, (భ్రాంతివశమున ముత్యపుచిప్ప రజతముగాఁదోఁచిన తావున) రజతమువలెను, ఘటశరావాది పదార్థములు మిథ్యాభూతములయినట్లు ప్రసిద్ధిలేదే? కావున మీరు గానఁబఱచిన దృష్టాంతము సరియయినది కాదు.

అద్వైతి:—అయినను, మృత్తికమాత్రమే సత్యమని యుక్తిచే నిశ్చిత మగుచున్నది. దానికంటెను వేఱయిన దంతయును యుక్తిచే బాధింపఁబడు చున్నది.

భాష్యకారులు:—ఆ యుక్తి యేదో గాన్పింపుము.

అద్వైతి:—మృత్తికమాత్రమే [1]యనువర్తమానము. తదితరమైనది [1]వ్యావర్తమానము. రజ్జుసర్ప దృష్టాంతమున అనువర్తమానమును అధిష్ఠాన భూతముననగు రజ్జువు(త్రాఁడు) మొదలగునదియే సత్యముగాను, వ్యావర్తమా నములగు సర్పము, భూదళనము, ఉదకధార మొదలగునవి యసత్యములుగానును తెలియుచున్నవి గదా. అట్లే యనువర్తమానమును అదిష్ఠానభూతముననగు మృత్తికయే సత్యము, వ్యావర్తమానములగు ఘటశరావాదులు అసత్యములు.

ఇంతేకాక సత్తగు (ఎప్పుడు నున్నట్టిదియగు) ఆత్మకు నాశములేదు. అసత్తులగు (ఎన్నఁడునులేని) కుందేటి కొమ్ములు మొదలగునవి యెన్నడుఁను తెలియరానివి. కావున తెలియవచ్చునదియు వినాశముగలదియుననగు కార్య మనఁబడునది సదసదనిర్వచనీయముగా అనఁగా సత్తని (ఉన్నట్టిదని) గాని అసత్తని (లేనట్టిదని) గాని చెప్పుటకశక్యమైనదిగాఁ దెలియవచ్చుచున్నది. ముత్య పుచిప్పయందు భ్రమింపఁబడిన వెండివలెనే యనిర్వచనీయమైనది మిథ్యయే కదా! కావున కార్యపదార్థము తెలియఁబడునదియు, నశించునదియు నయినం దున అనిర్వచనీయముగాను సిద్ధించుచున్నది.

---

(1) మొదటి సంపుటముయొక్క ౬౨ - వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన ౧ - వ వివరణమును చూడుము.

ఇంతేకాక మృత్తిక మొదలగు కారణపదార్థము ఎవ్విధమైన మార్పును పొందకనే కార్యపదార్థమును గలుగఁజేయుచున్నదా? కాక, ఏదైన నొక విశేషమును పొందినదైయే కార్యపదార్థమును గలుఁగజేయుచున్నదా? అది యెవ్విధమైన మార్పును పొందకయే కార్యపదార్థమును గలుగఁజేయుచున్నదని చెప్పఁదగదు. అట్లంటివేని, అది సర్వదా కార్యపదార్థమును గలుగఁజేయునది గానే గన్పట్టుచుండవలయునని ప్రాప్తించును. అది యేదైననొక విశేషమును పొందినదై కార్యపదార్థమును గలుగఁజేయుచున్నదనియును చెప్పఁదగదు. అట్లంటివేని, అది యొక్కవిశేషమును పొందుటకు పూర్వము వేఱొక్కవిశేషమును పొందియుండవలయును. కావున నిట్లు విశేషముల కంతము లేకుండుటచే నీవాదమున ననవస్థాదోషము ప్రాప్తించును. కారణపదార్థము ఎవ్విధమైన మార్పును పొందకనే దేశకాలనిమిత్తములతో సంబంధము కలదై కార్యమును గలుగఁజేయుచున్నదనియెదవేమో? అటులను చెప్పఁదగదు. అట్లంటివేని, వికారాంతరమును పొందనిదిగాని, విశేషాంతరమును పొందినదిగానియగు దానికి దేశము కాలము మొదలగువిశేషములతో సంబంధము, సయితము, ఈపైని గనఁబఱచిన ప్రకారము, సంభవింపదు.

భాష్యకారులు:—మృత్తిక, స్వర్ణము, క్షీరములు మొదలగు వాని నుండి క్రమముగ ఘటము, కరకము, దధి మొదలగునవి గలుగునవిగాను గన్పట్టుచున్నవి. భ్రాంతివశమున శుక్తికరజతముగాఁ దోఁచఁబడిన తావునవలెనే ఆత్మావునను దేశకాలాది రూపములగు ఉపాధులకు బాధయును గానఁబడదు. ఏది యెట్టిదిగాఁ దెలియఁబడునో, దానిని యట్టి దానినిగానే గ్రహింపవలయును. కావున, కారణమునుండియే కార్యము ఉత్పన్నమగుచున్నదని యవశ్యమంగీకరింపఁదగును.

అద్వైతి:—ఈ వాదము వికల్పములకు నిలువఁబడునది కాదు. ఎట్లన, కేవల స్వర్ణము మొదలగునది మాత్రమే స్వస్తిక మొదలుగాఁగల యాభరణములను గలుగఁజేయునదియా? కాక రుచకాద్యాభరణ రూపమగు స్వర్ణము అట్టి స్వస్తికాద్యాభరణములను గలుగఁజేయునదియా? కాక రుచకాదుల కధిష్ఠానమగు స్వర్ణము అట్టి యాభరణాదులను గలుగఁజేయునదియా? కేవల స్వర్ణము మాత్రమే అట్టి స్వస్తికాది కార్యమును గలుగఁజేయునదియని చెప్పఁదగదు. ఏలననిన, స్వర్ణముకంటెను వేఱుగ కార్యమనఁబడునది యొక్కటియు

గానఁబడదు. తన్నేతాను గలుగఁజేయుచున్నదనియును చెప్పఁదగదు. అది యసంభవము.

భాష్యకారులు:—స్వర్ణమునకంటెను వేఱుగా స్వస్తికమనఁ బడుకార్య పదార్థమొక్కటి గానఁబడుచున్నదే?

అద్వైతి:—అది స్వర్ణముకంటెను వేఱయినది కాదు. స్వర్ణమే కదా దానియందును తెలియవచ్చుచున్నది. స్వర్ణముకంటెను వేఱగు పదార్థమేది యును తెలియవచ్చుచుండలేదే?

భాష్యకారులు:—స్వర్ణమనెడి జ్ఞానమును, పేరును, స్వస్తికమనెడి జ్ఞాన ముకంటెను పేరుకంటెనున్ను వేఱయినవి. కావున వేఱొక్కటి యున్నట్లు నిశ్చితమగుచున్నది.

అద్వైతి:—అట్టి జ్ఞానమును, అట్టి పేరును, యేవస్తువును గుఱించినవో ఆవస్తువు "ఇది యని" నిరూపింపఁబడలేదు. కావున నవి "భ్రాంతివశమున శుక్తి కరజతముగాఁ దోచుతావున రజతమనెడి జ్ఞానమువలెను, పేరువలెను, భ్రాం తిమూలకములు. అందువలన నవి వేఱొక వస్తువును సాధింపనేరవు.

మఱియు రుచకాదిరూపమగు స్వర్ణము స్వస్తికాద్యాభరణరూపమగు కార్యమును గలుగఁజేయునది యనియును చెప్పఁదగదు. ఏలననిన, కార్యభూత మగు వస్త్రమునందు కారణభూతమగు తంతువులవలెనే రుచకము స్వస్తికమున నీకును గానఁబడుచుండలేదు కదా!

మఱియు రుచకమున కధిష్ఠానమగు స్వర్ణము సయితము అట్టి స్వస్తికా ద్యాభరణరూపమగు కార్యమును గలుగఁజేయునదియని చెప్పఁదగదు. ఏల ననిన, స్వర్ణము అట్లు రుచకాదుల కధిష్ఠానముగానుండు ఆకారముతో స్వస్తి కాద్యాభరణములయందు దెలియఁబడు చుండలేదు కదా!

ఇట్లు మృత్తిక మొదలగు కారణపదార్థముకంటెను వేఱగు కార్య మనఁబడునది అసత్యమైనదిగాఁ దెలియవచ్చుటవలన, బ్రహ్మమనఁబడు కారణ ముకంటెను వేఱై కార్యభూతమగు ఈప్రపంచమంతయును మిథ్యయని నిశ్చి తమగుచున్నది. బ్రహ్మవ్యతిరిక్తమైనదంతయును మిథ్యయనెడి విషయము సుల భముగాఁ దెలియఁబడునట్లు చేయుటకై మృత్తిక మొదలగువానిని సత్య ములుగాఁ గల్పించి వాని కార్యమయినదంతయును అసత్యమని ప్రతిపాదింపఁ బడియె. వాస్తవమునకన్ననో, మృత్తిక, స్వర్ణము, మొదలుగాఁగల కారణ

పదార్థములును; ఘటము, రుచకము, మొదలగు కార్యపదార్థములవలెనే, మిథ్యాభూతములు, అవియును ప్రపంచముతోఁ జేరినవియే కదా?

మఱియు "ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం" అనియు, "నేహనానాస్తి కిఞ్చన మృత్యోస్స మృత్యు మాప్నోతి యఇహనానేవపశ్యతి," అనియు "యత్ర హిద్వైతమివభవతి తదితర ఇతరం పశ్యతి" "యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్ తత్కేన కంపశ్యేత్" అనియు, "ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే" అనియు నీమొదలగు శ్రుతులు బ్రహ్మముతప్ప తక్కినవంతయును మిథ్యయని తెలుపుచున్నవి.

ఇట్లు వేదశాస్త్రముచే దెలుపఁబడునది ప్రత్యక్షవిరుద్ధమని శంకింపఁదగదు. ఏలన, ఈపైని గనఁబఱచిన ప్రకారము కార్యభూతమైనదంతయును మిథ్యయే. ప్రత్యక్షము సయితము సన్మాత్రమునే తెలుపునది. శాస్త్రమునకు ప్రత్యక్షముతో విరోధముండుగాక. అయినను, శాస్త్రము దోషవిశిష్టమైనదని తలంచుటకును అవకాశమీయనిది. ప్రత్యక్షముకంటెను తరువాతిది. అది తన స్వరూపముయొక్క యునికిపట్టు మొదలగువానికై ప్రత్యక్షాదుల నపేక్షించునదియే యైనను, ప్రమాణమగు విషయమున నదిదేనినిన్ని అపేక్షించునది కాదు. మఱియునది నిరవకాశమయినది. ఈహేతువులవలన శాస్త్రము ప్రత్యక్షముకంటెను ఎక్కువ బలమైనది. కావున కారణభూతమగు బ్రహ్మముకంటెను వేఱయినదంతయును మిథ్య.

ప్రపంచము మిథ్యయని చెప్పినంతమాత్రముచే జీవుఁడు సయితము మిథ్యయని యాక్షేపింపఁదగదు. ఏలననిన, బ్రహ్మముకే కదా జీవభావము గలిగెను! ఈ సమస్త శరీరములలోను బ్రహ్మమే గదా జీవభావము ననుభవించుచున్నది. "అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య" (ఛా. ౬ ప్ర. 3 ఖ. ౨ వా) "ఆత్మయగు ఈజీవునితోఁబ్రవేశించి" అనియు, "ఏకోదేవః సర్వభూతేషు గూఢః" (శ్వే. ౬ అ. ౧౧ వా) భగవంతుఁడు "ఒక్కఁడే అన్నిభూతములలో నుండువాఁడు." అనియు, "ఏకోదేవో బహుధానివిష్టః" (య. ఆ. 3 ప్ర. ౧౨ అ) భగవంతుఁడు "ఒక్కఁడే అనేక విధములుగా నుండువాఁడు" అనియు "ఏషసర్వేషు భూతేషుగూఢోఽత్మా న ప్రకాశతే" (కఠ. 3 వ. ౧౨ వా) "ఈయాత్మయొక్కఁడే సర్వభూతములయందును దాఁగియుండువాఁడై తెలియరాఁడు." అనియు,

"నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ. ౫ అ. ౭ బ్రా. ౨౩ వా) "ఈతనికంటెను వేఱగు తెలిసికొనువాఁడు లేఁడు" అనియు నీమొదలగు శ్రుతులును అట్లే తెలుపుచున్నవి.

వైశేషికుఁడు:—బ్రహ్మమొక్కటియే సమస్తములగు శరీరములలోను జీవుఁడుగానుండు పక్షమున, "నాకాలు నొప్పి" అనియు, "నాశిరస్సున సుఖముగా నున్నది" అనియు నివ్విధముగా నొక్క శరీరముననుండు సుఖదుఃఖాదులనుభవింపఁబడు చందమున అన్నిశరీరములయందుండు సుఖదుఃఖాదులు ననుభవింపఁబడవలయునే? మఱియు జీవుఁడనియు, ఈశ్వరుఁడనియు, బద్ధుఁడనియు, ముక్తుఁడనియు, శిష్యుఁడనియు, ఆచార్యుఁడనియు, తెలివిగలవాఁడనియు, తెలివిలేనివాఁడనియు నివ్విధమగు నట్టి యేర్పాటు లేకపోవునే?

☞ బ్రహ్మము అద్వితీయము (రెండవదిలేనిది) అనివాదించు కొందఱు అద్వైతులు (జీవాజ్ఞానవాదులు) ఈవిషయమును గుఱించి యిట్లు సమాధానము చెప్పుచున్నారు:—

జీవాజ్ఞానవాది:—ఒక్కటియేయగు ముఖము, మణి, ఖడ్గ, దర్పణాదులలోఁ బ్రతిఫలించునప్పుడు, దాని ప్రతిబింబములు చిన్నవిగాను, పెద్దవిగాను, మలినములుగాను, శుద్ధములుగాను నివ్విధముగాఁ గానఁబడునట్లు, బ్రహ్మమొక్కటియేయైనను, దాని ప్రతిబింబములగు జీవులు సుఖవంతులుగాను, దుఃఖవంతులుగాను నిట్లు ఆయాయుపాధుల కనుగుణముగాఁ దెలియఁబడుట సంభవము.

బ్రహ్మాజ్ఞానవాది:—"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" ఇత్యాది శ్రుతులప్రకారము జీవులు బ్రహ్మముకంటెను వేఱుకారనిగదా చెప్పఁబడియె.

జీవాజ్ఞానవాది:—సత్యము. వాస్తవమునకు, జీవులు బ్రహ్మముకంటెను వేఱుకాకున్నను, వారల కొకవిధమైన భేదమును గల్పించి, దానినిబట్టి యీపైని గనఁబఱచిన ప్రకారము సుఖదుఃఖానుభవముల కొక వ్యవస్థ గాన్పింపఁబడియె.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్టి కల్పన బ్రహ్మముదా? జీవునిదా? బ్రహ్మమదని చెప్పఁదగదు. ఏలననిన, బ్రహ్మము పరిశుద్ధమును జ్ఞానస్వరూపమును నయినందున నది యెవ్విధములైన కల్పనలును లేనిది. అది జీవునిదనియును చెప్పఁదగదు. అట్లంటివేని, యీ వాదమున ఇతరేతరాశ్రయదోషము ప్రసక్తిం

చును. ఎట్లన, కల్పననుబట్టి జీవుఁడొక్కఁడు కలఁడని సిద్ధించును. జీవుఁడొక్కఁడుంటచే గదా కల్పన వానిదగుట సిద్ధించును.

జీవాజ్ఞానవాది:—అట్లు చెప్పఁదగదు. [1]బీజాంకుర న్యాయప్రకారము జీవుఁడును అవిద్యయును అనాదులు. ఇతరేతరాశ్రయ దోషము మొదలగునవి, వాస్తవముగానుండునట్టి వాని విషయమై ప్రాప్తించునెడల, అవి దోషములుగా నెన్నఁబడునవియే గాని, [2]ప్రాసాద నిగరణాదులవలె నసంభావ్యస్వరూపమును, మిథ్యాభూతమునునగు అవిద్యావిషయమై యవి దోషములుగా నెన్నఁబడవు. వాస్తవమునకు జీవులు బ్రహ్మముకంటెను వేఱు కారు. ఖడ్గము దర్పణము మొదలగువానిలోఁ బ్రతిఫలించిన ముఖాదుల ప్రతిబింబములు మొదలగువానియందు నలుపువర్ణము మొదలగునవి వలెనే, ఉపాధివశమున జీవునియందొక యపరిశుద్ధి యుండవచ్చును. కావున జీవునియం దవిద్య యుండుట సంభవము. అందువలన జీవభావము కల్పితమగుటయును సంభవము. ప్రతిబింబమునఁ గానఁబడు మలినవర్ణము మొదలగునది వలెనే జీవునియందుండు అపరిశుద్ధియును భ్రాంతిమాత్రమే. అట్లుకాకున్న, ఆ యపరిశుద్ధినుండి జీవుని కెన్నఁడును విడుదలే లేక పోవునని ప్రసక్తించును. జీవులకుఁ గల భ్రమ మనఁబడునది నదీప్రవాహమువంటి యనాది యగుటంజేసి దానిఁ గలుగఁజేయునట్టి హేతువును గుఱించి విచారింపఁదగదు.

బ్రహ్మాజ్ఞానవాది:—ఈ పై వాదమంతయును అద్వైతముయొక్క యథార్థస్వరూపమును బాగుగా నెఱుంగనివారును, భేదవాదమున విశ్వాసవంతులగు జనుల వలన నొక గౌరవమును అపేక్షించువారును, కల్పించినది. అదిమెట్లన్నను,

(1) విత్తనము చెట్టునుండి కలుగునది. చెట్టు విత్తనమునుండి కలుగునది. ఈ రెంటికిని పరస్పరము కార్యకారణభావము కలదు. ఈ సందర్భమున విత్తనము ముందా? చెట్టు ముందా? అనిశంకించి నట్లైన నట్టిశంకను పరిహరించుటకు వేఱొక మార్గము లేదు. కావున విత్తనమును చెట్టును ఈరెండును అనాదులని శాస్త్రికారులు వ్యవహరింతురు. ఇదియే బీజాంకురన్యాయమనఁబడును. ఇవ్విధమున రెండుపదార్థములకు పరస్పరము కార్యకారణభావము సంభవించునప్పుడు, వాని రెంటిలో నొక్కటి పూర్వముండునది యనియు, వేఱొక్కటి తరువాత గలుగునది యనియును నిర్ణయించు టకవకాశము లేకపోయినచో, అది బీజాంకుర న్యాయప్రకారమంగీకరింపఁదగినది.

(2) ప్రాసాదము=గొప్పయిల్లు, నిగరణము=మ్రింగుట. ప్రాసాదనిగరణమనఁగా, గొప్పయింటిని మ్రింగివేయుట. అది సంభవమా? అసంభవము. కావున లోకమున అసంభవములగు వానిని ప్రాసాదనిగరణము వంటివని శాస్త్రికారులు వ్యవహరింతురు,

జీవుఁడు కల్పితముగాని (కేవల చిద్రూపమగు) యాకారముతో నవిద్యకాశ్రయమగు పక్షమున, బ్రహ్మమే యవిద్య కాశ్రయమైనదని చెప్పినట్లగును. బ్రహ్మము కంటెను వేఱయినదియు, బ్రహ్మమునఁ గల్పింపబడినదియుననగు నాకారముతో నవిద్య కాశ్రయమగు పక్షమున, జడపదార్థమే యవిద్యకాశ్రయమని చెప్పినట్లగును. ఏలననిన, ఈపైని గనఁబఱచిన ప్రకారము, ద్వివిధమగు నాకారమున కంటెను వేఱగు నాకార మొక్కటి కలదని యంగీకరింపఁబడలేదు గదా ?

జీవాజ్ఞానవాది:—అట్టి కల్పితమైన యాకారముతోఁ గూడియుండునట్టి స్వరూపముతో నవిద్య కాధారమైనది.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అఖండైకరసమగు (బ్రహ్మ) స్వరూపము అవిద్యతోఁగూడియున్ననే తప్ప, వేఱొక విధముగానది విశిష్టమైనది యగుట (ఒకదానితోఁ గూడియుండుట) సిద్ధింపదు. అట్లైన, అవిద్య కాశ్రయభూతమైనట్టి యాకారమే బ్రహ్మస్వరూపమని నిరూపితమగును.

ఇంతేకాక, "ఇది సంసారబంధము, ఇది మోక్షము" అనెడి యొక వ్యవస్థను గలుగఁజేయుటకై కదా జీవుల కజ్ఞానము కలదనెడివాద మాశ్రయింపఁబడియె. అట్టివాదము నాశ్రయించినను, బంధమోక్షవ్యవస్థ సిద్ధింపదు. ఏలననిన, అవిద్య నశించుటయే కదా మోక్షము. ఒక్కఁడు ముక్తుఁడయినంతమాత్రముచే అవిద్య నశించునుగాన, అందుచే తక్కినయందఱును ముక్తులుకావలసివచ్చునే ?

జీవాజ్ఞానవాది:—అంతమాత్రముచే ఇతరులును ముక్తిని పొందక పోవుటచే ఇంకను అవిద్య కలదని యెఱుంగుము.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్లంటివేని, ఒక్కనికిని ముక్తి కలుగనే లేదని చెప్పవచ్చును. అవిద్య బొత్తుగ నశించనే లేదు గదా!

జీవాజ్ఞానవాది:—ఒక్కొక్క జీవునికిని ప్రత్యేకముగా నొక్కొక్క యవిద్యకలదని కల్పించెదను. అట్టిసందర్భమున ఎవ్వనియవిద్య నశించినదో, వాఁడు ముక్తుఁడు. ఏవ్వని యవిద్య నశించలేదో, వాఁడు బద్ధుఁడు.

బ్రహ్మాజ్ఞానవాది—అట్లు కాదు. ఏలన, "ఒక్కొక్కజీవునికిని" అనుటచే జీవులకు భేదము కలదని తెలుపుచున్నావు. అట్లు జీవులకుఁగల భేదమనఁబడునది స్వాభావికమైనదా ? అవిద్యామూలముగాఁ గల్పింపఁబడినదా ? అది స్వాభావికమని చెప్పఁదగదు. మీరట్లంగీకరించి యుండలేదు. మఱియు, అట్లంటిరేని,

అట్టిభేదము గలుగుటకై యవిద్య నెక్క దానిని గల్పించుట నిరర్థకమగును. అట్టి జీవభేదము అవిద్యా మూలముగాఁ గల్పింపఁబడినది యనిమెదవా ? అట్లగునేని, యీ జీవభేదమును కల్పించునదియగు నవిద్య బ్రహ్మముదా ? జీవులదా? బ్రహ్మముదంటివేని, నామార్గముకే వచ్చినవాఁడవగుదువు. లేక అది జీవులదని యెదవా? అట్లంటివేని, జీవులకు భేదముగలదని తెలుపుటకై యవిద్యయనఁబడు నదొకటి కల్పింపఁబడియె ననెడి విషయమును బొత్తుగ మరిచిపోతివా? ఇంతియెకాక, ప్రతిజీవునికిని బంధమోక్ష వ్యవస్థను గలుగఁజేయుటకై యే యవిద్యలు కల్పింపఁబడుచున్నవో, ఆ యవిద్యలను బట్టియే జీవులకు భేదము కలదని తలంచుచున్నావు. కావున ఈవాదమున ఇతరేతరాశ్రయ దోషము కలదు. ఎట్లన, జీవులకు భేదము కలదని నిరూపించిన యెడలనే, అవిద్యలు కలవని సిద్ధించును. అవిద్యలు కలవని నిరూపించిన యెడలనే, జీవులకు భేదముకలదని సిద్ధించును. ఈకావున బీజాంకుర న్యాయముపయోగపడదు. ఏలననిన, బీజాంకురముల విషయమైయన్ననో, వేఱొక వేఱొక బీజము వేఱొక వేఱొకయంకురయును గలుగఁజేయవచ్చును. ప్రకృతమున నో, యే యవిద్యలను బట్టి యే జీవులు కల్పింపఁబడుదురో, ఆ జీవులను బట్టియే యా యవిద్యలును సిద్ధించుట యశక్యము. ఇంతకు పూర్వముండు జీవులకుఁ గల యవిద్యలను బట్టి ఇఁకమీఁదరాఁబోవు జీవులు కల్పింపఁబడుదు రనిమెదవా ? అట్లంటివేని, జీవులు నాశమును బొందువారని ప్రసక్తించును. అందుమూలముగాఁ జీవులు తామింతకు పూర్వమొనర్చియుండని కర్మముల ననుభవించుచున్నారనియు, ఇప్పుడు వారొనర్చునట్టి కర్మములు నశించునవి యనియును ఈమొదలగునవి ప్రసక్తించును. బ్రహ్మమే ఇంతకుపూర్వ ముండు జీవులకుఁ గల యవిద్యలను బట్టి యిఁకమీఁద రాఁబోవు జీవులను కల్పించునది యనెడి వాదము సయితము, ఈపైని గనఁబఱచిన హేతువులవలన, నిరసింపఁబడిన దగుచున్నది.

అవిద్య ప్రవాహమువంటి యనాది యని యంగీకరించుపక్షమున, అట్టి యవిద్యామూలముగాఁ గల్పింపఁబడిన జీవులును ప్రవాహమువంటి యనాదులని ప్రసక్తించును. కావున జీవులు స్థిరముగా నుండువారు కాకపోవుదురు. అందువలన మోక్షము గలుగువఱకును జీవులు స్థిరముగా నుండువారనెడి ముఖ్యమయిన యంశమే సిద్ధింపకపోవును.

"అవిద్యయనఁబడునది వాస్తవముగానుండునట్టి యొకవస్తువు కానిది

యును, అనుపపన్నమైన స్వరూపము గలదియునుగాన, వాస్తవములగు వస్తువులను గుఱించి దోషములుగా నెన్నఁబడు ఇతరేతరాశ్రయ దోషము మొదలగు నవియట్టి యవిద్యను గుఱించి యెవ్విధమైన లోపమును గలుగఁజేయునవి గానేరవు” అని యిట్లు మీరీ పైని వాదించియున్నారు. అట్లగునేని, అవిద్య ముక్తపురుషులను పరబ్రహ్మమునున్ను ఆశ్రయించి యుండవచ్చునే?

జీవాజ్ఞానవాది:—వారు పరిశుద్ధజ్ఞాన స్వరూపు లగుటంజేసి యపరిశుద్ధమగు అవిద్య వారియందుండునదిగాఁ బ్రసక్తింపదు.

బ్రహ్మాజ్ఞానవాది:—అవిద్య యెదైన నొక యుక్తియుక్తమైన హేతువు ననుసరించినదా? అట్లగుపక్షమున, ఈపైని గనఁబఱచిన హేతువులను బట్టి యవిద్య జీవులను గూడ ఆశ్రయించియుండునది కాకపోవును. ఇంతియెకాక, జీవుని యాశ్రయించియుండునట్టి యవిద్య తత్త్వజ్ఞానము గలిగినతోడనే నశించునప్పుడు, జీవుఁడును నశించునా? నశింపఁడా? అప్పుడు జీవుఁడును నశించు నంటివేని, స్వరూపనాశమే మోక్షమన్నట్లగును. అప్పుడు జీవుఁడు నశింపఁడంటివేని, అవిద్య నశించినను మోక్షము గలుగదని చెప్పినట్లగును. ఏలననిన, అప్పుడును బ్రహ్మముకంటెను వేఱుగా జీవుఁడొక్కఁడు కలఁడు గదా?

“మణులు, ఖడ్గము, దర్పణము ఈమొదలగువానిలోఁ బ్రతిఫలించినదైగానఁబడు ముఖముయొక్క ప్రతిబింబము మలినముగాను, నిర్మలముగాను ద్వివిధముగాఁ దెలియవచ్చుచందమున, పరిశుద్ధముగాను అపరిశుద్ధముగాను ద్వివిధముగా నుండుట కొఱక వ్యవస్థ గలుగుచున్నది” అని మీరు వాదించియున్నారు. ఇందొక్కటి విచారింపవలసి యున్నది. ఉపాధివశమునఁ గలుగునట్టి యీ యల్పత్వము మలినత్వము మొదలగు దోషములెప్పుడు నశించును?

జీవాజ్ఞానవాది:—దర్పణము మొదలగు ఉపాధులు తొలఁగినవెంటనే యీ దోషములు నశించును.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్టిసమయమున అ యల్పత్వాదుల కాశ్రయభూతమగు ప్రతిబింబ ముండునా? కాక, అదియును పోవునా? అప్పుడా ప్రతిబింబ ముండునంటివేని, ప్రతిబింబస్థానీయుఁడగు జీవుఁడును కలఁడు, కావున మోక్షమనఁబడునది లేనేలేదని ప్రసక్తించును. అప్పుడాప్రతిబింబము నశించునంటివేని, అట్లే ప్రతిబింబ స్థానీయుఁడగు జీవుడును నశించును, కావున స్వరూపనాశమే మోక్షమనవలసి వచ్చును.

ఇంతియెకాక, చెఱుపైనదియగు దోషమెవ్వనికిఁ దెలియునో, వానికే గదా అట్టి దోషము పోవుట మంచిదని తోఁచును. ఇట్లుండ, ప్రకృతమున ఆ దోషము బింబస్థానీయుఁడగు బ్రహ్మమునకుఁ దెలియవచ్చునదా? లేక, అది ప్రతిబింబస్థానీయుఁడగు జీవునికిఁ దెలియవచ్చునదా? లేక, అది వీరుభయులకంటెను వేఱగు మఱియొక్కనికిఁ దెలియవచ్చునదా? అది బ్రహ్మమునకుఁగాని జీవునికిఁగాని తెలియవచ్చునది యగు పక్షమున, ఈపైని గనఁబఱచిన దృష్టాంతము పొసగదు. ఏలననిన, ఈపై దృష్టాంతమున చిన్నదిగాఁగానఁబడుట మొదలుగాగల దోషములు ముఖమునకుఁ గాని ముఖ ప్రతిబింబమునకుఁగాని తెలియరానివి. ముఖముగాని దాని ప్రతిబింబముగాని చేతనపదార్థములు కావు గదా!

ఇంతియెకాక, బ్రహ్మము అట్టి దోషమును తెలిసికొనునది యంటివేని బ్రహ్మాజ్ఞానవాదము (బ్రహ్మము అవిద్యకలదని) ప్రసక్తించును. వారుభయులకంటెను వేఱగు మఱియొక్కని కది తెలియవచ్చునది యనియును చెప్పఁదగదు. జీవబ్రహ్మములకంటెను వేఱుగా మఱియొక్కఁడు తెలుసుకొనువాఁడు లేఁడుగదా!

ఇంతియెకాక, జీవుఁడు అవిద్యామూలముగాఁ గల్పింపఁబడువాఁడు గదా! అట్టి జీవుని కల్పించునది యెద్దియో నిరూపింపవలయును. అట్టిది యవిద్యయని చెప్పఁదగదు. అవిద్య యచేతనపదార్థము గదా! అట్టిది జీవుఁడనియును చెప్పఁదగదు. అట్లంటివేని, ఇతరేతరాశ్రయ దోషము ప్రసక్తించును మఱియు భ్రాంతివశమున ముత్యపుచిప్ప రజతముగాఁ దోఁచుచందమున, జీవుఁడుగానుండుట యవిద్యావశమునఁ గల్పింపఁబడినది గదా! బ్రహ్మమే జీవునిఁ గల్పించునట్టిది యనియెదవా? అట్లంటివేని, బ్రహ్మాజ్ఞానవాదము మరల ప్రసక్తించును.

ఇంతియెకాక, బ్రహ్మము అజ్ఞానముకలదని యంగీకరింపని పక్షమున, బ్రహ్మమునకు జీవులను గుఱించిన జ్ఞానము కలదా? లేదా? అనెడి యంశము విచారింపవలసియున్నది. బ్రహ్మము కట్టి జ్ఞానము లేదంటివేని, యది ఈక్షణపూర్వకముగా ఈ విచిత్రసృష్టి నొనర్చుటయు, నామరూపములను విశదపఱచుటయును నీ మొదలగునవి సంభవింపక పోవును. దాని కట్టిజ్ఞానము కలదంటివేని, అఖండైకరసమగు బ్రహ్మము, అవిద్యతోఁ జేరియుండక, జీవులను తెలిసికొనదు. కావున బ్రహ్మాజ్ఞానవాదము మరల ప్రసక్తించును.

ఈపైనిగనఁబఱచిన హేతువును బట్టియే మాయకంటెను అవిద్య వేఱయినదనెడి వాదము సయితము నిరసింపఁబడుచున్నది. మాయావియగు బ్రహ్మము అవిద్యతోఁ జేఱియుండనిదై జీవులను తెలిసికొనుట సంభవింపదు. అదియెటువలెననిన. మాయావి యితరులను చూడకయే వారలకు మోహమును గలుగఁజేయనేరఁడు గదా! మాయావికిఁ గల మాయ యితరులను తెలిసికొనుటకు సాధనమైనది కాదు. ఇతరులు తెలివచ్చునప్పుడు వారలకు మోహమును గలుగఁజేయుటకు మాత్రమే అది సాధనమైనది గదా!

జీవాజ్ఞానవాది:—బ్రహ్మమునకుఁ గల మాయ బ్రహ్మమునకు జీవులఁ దెలుపుచు వారలకు మోహమును గలుగఁజేయునది.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్లంటివేని, పరిశుద్ధమును, అఖండైక రసమును, స్వయంప్రకాశమును నగు బ్రహ్మమునకు జీవులను దెలుపునట్టి యీ మాయ యనఁబడునది "మాయ" అని యిట్టి నామాంతరముగల యవిద్యయే యగును.

జీవాజ్ఞానవాది:—అవిద్య విపరీతజ్ఞానమును గలుగఁజేయునది. మాయ యన్ననో, మిథ్యాభూతమును బ్రహ్మవ్యతిరిక్తమును నగు దానిని అట్లు మిథ్యాభూతముగానుండునట్టి యాకారముతోఁ గాన్పించునది. ఇది బ్రహ్మమునకు విపరీత జ్ఞానమును గలుగఁజేయునది కాదు. కావున నిది యవిద్య కాఁదగదు.

బ్రహ్మాజ్ఞానవాది:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, చంద్రుఁ డొక్కఁడే యని తెలిసియున్నప్పుడు చంద్రు లిద్దఱనెడి జ్ఞానమును గలుగఁజేయునదియును అవిద్యయే కదా! బ్రహ్మము తనకంటెను వేఱయినదానిని మిథ్యగా నెఱుఁగు పక్షమున, దానికి మోహమును గలుగఁజేయఁడు. దృష్టాంతము:—లోకమున ఉన్మత్తుఁడు గాని వాఁడెవ్వఁడును మిథ్యాభూతములనుగాఁ దానెఱింగిన వానికి మోహమును గలుగఁజేయుచున్నట్లు గానఁబడఁడు.

జీవాజ్ఞానవాది:—చెఱుపైనదియు, అసత్యమునునగు జ్ఞానమును గలుగఁజేయునది యవిద్య. మాయయన్ననో, బ్రహ్మము కట్టి చెఱుపైన జ్ఞానమును గలుగఁజేయునది కాదు. కావున నది యవిద్య కాఁదగదు.

బ్రహ్మాజ్ఞానవాది:—చంద్రు లిద్దఱనెడి జ్ఞానము ఒకదుఃఖమును గలుగఁజేయునది కాదు. అందువలన నది చెఱుపుచేయునది కాదు. అట్లున్నను, దానిని గలుగఁజేయునది యవిద్యయే. మఱియు దానిని పోఁగొట్టుటకై ప్రయత్నించుచున్నారు. మాయయనఁబడునది చెఱుపుచేయునట్టి జ్ఞానమును గలుగఁ

జేయునది కానిపక్షమున, నది పోఁగొట్టవలసినది కాదు. అందువలన నది నిత్యమును బ్రహ్మస్వరూపము నాశ్రయించి యుండునది యనగును.

జీవాజ్ఞానవాది:—కానిమ్ము దోషమేమి?

బ్రహ్మాజ్ఞానవాది:—భేదము తెలియవచ్చుటయే దోషము. "యత్రహి ద్వైతమివ భవతి" అనియు "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" అనియు నీవిధముగ అద్వైతమును (బ్రహ్మ మొక్కటియే సత్యమని) బోధించునట్టి శ్రుతులు విరోధించును.

జీవాజ్ఞానవాది:—ఈపైని గనఁబఱచిన యద్వైతశ్రుతులు పరమార్థవస్తువును గుఱించినవి. మాయయన్ననో, అసత్యమైనది. కావున విరోధమెద్దియును లేదు.

బ్రహ్మాజ్ఞానవాది:—మితిలేని యానందమే స్వరూపము గాఁగలదియగు బ్రహ్మము అసత్యమగు మాయను తెలిసికొనుటయును, దానిని గలిగియుండుటయును, ఈ రెండును దానియందవిద్య లేక సంభవింపవు. మఱియు అసత్యమును అనిత్యమునునగు మాయవలన బ్రహ్మము కేమి ప్రయోజనము?

జీవాజ్ఞానవాది:—జీవులను మోహింపఁజేయుటయే ప్రయోజనము.

బ్రహ్మాజ్ఞానవాది:—ఇట్లు అసత్యమగు మోహమును గలుగఁజేయుటచే ప్రయోజనమేమి?

జీవాజ్ఞానవాది:—క్రీడయే ప్రయోజనము.

బ్రహ్మాజ్ఞానవాది—మితిలేని యానందము గల బ్రహ్మము కట్టి క్రీడల వలనఁ బ్రయోజనమేమి?

జీవాజ్ఞానవాది:—పరిపూర్ణమగు భోగముగలవారియెడలను క్రీడయనఁబడునది యొక పురుషార్థముగా గన్పట్టుచున్నదే?

బ్రహ్మాజ్ఞానవాది:—ప్రకృతవిషయమును గుఱించి యట్లు చెప్పఁదగదు. ఏలననిన, అసత్యములును, అసత్యములుగాఁ దెలియవచ్చునవియును నగు క్రీడోపకరణములచే గలుగునదియగు క్రీడవలనఁగాని, అట్టిక్రీడ యపరమార్థమని తెలియవచ్చుటవలనఁగాని, ఉన్మత్తుఁడు గాని వానికెవ్వనికిని క్రీడారసము గలుగదు. మఱియు మాయకాశ్రయమైనదానినిగా, మీరంగీకరించిన బ్రహ్మముకంటెను వేఱుగా అవిద్యాశ్రయుఁడగు జీవుఁడొకఁడు కలఁడనెడి కల్పనయును అసంభవమగునని యీపైనిగనఁబఱచిన ప్రకారము శోధించు

నునది. కావున బ్రహ్మము అద్వితీయము (రెండవదిలేనిది) అని వాదించునట్టి మీరును (జీవాజ్ఞానవాదులును) బ్రహ్మమే యవిద్యచే నావరింపఁబడినదై తన యందు నానావిధ భేదములను తెలిసికొనుచున్నదని యంగీకరింపవలయును.

అట్లగుపక్షమున, "ఈతఁడు బద్ధుఁడు, ఈతఁడు ముక్తుఁడు" అనెడి యొక వ్యవస్థ లేకపోవునని యెదరేమో? బ్రహ్మాజ్ఞానవాదమున, (బ్రహ్మము కజ్ఞానము కలదను పక్షమున) ఆ విషయమును గుఱించి యాక్షేపింప నక్కఱలేదు. ఏల ననిన, బ్రహ్మ మొక్కటియే యజ్ఞానము కలదై యా యజ్ఞానము పోవుటచే ముక్తిని పొందుచున్నది. ఇట్లుండ, "ఈతఁడు బద్ధుఁడు ఈతఁడు ముక్తుఁడు" అనెడి వ్యవస్థ యక్కఱనే లేదు. లోకమున "బద్ధుఁడు, ముక్తుఁడు, శిష్యుఁడు, ఆచార్యుఁడు" ఈ మొదలగు వ్యవహార మన్ననో, కల్పితము. స్వప్నమునుచూచిన వానియొక్కవలెనే యొక్కని యవిద్యవలన సర్వమును కల్పింపఁబడుట సంభవము. స్వప్నమును చూచినవాని కొక్కనికిఁ గానఁబడిన శిష్యుఁడు ఆచార్యుఁడు మొదలగువారు వాని యవిద్యా మూలముగాఁగల్పింపఁబడిన వారే. కావున ప్రతిజీవునికిని ఒక్కొక్క యవిద్య కలదనియు, అందుమూలముగానవిద్య లనేకములనియు నిట్లు కల్పించుట యుక్తియుక్తము కాదు.

"బద్ధుఁడు, ముక్తుడుఁడు" అనెడి వ్యవస్థగాని "తాను, ఇతరుఁడు" అనెడి వ్యవస్థగాని వాస్తవముగాఁగలదని జీవాజ్ఞానవాదులును అంగీకరింపరు. ఏలన, ఈ వ్యవస్థ యసత్యమైనది. కావున నది యొక్కని యవిద్యచేతనే కల్పింపఁబడుట శక్యము. అట్లే న్యాయప్రయోగములును (Syllogistic Statements) కలవు.—

ప్రతిజ్ఞ:—"బద్ధుఁడు, ముక్తుఁడు" అనెడి వ్యవస్థయును, "తాను, ఇతరుఁడు" అనెడి వ్యవస్థయును తనయొక్క యజ్ఞానము చేతనే కల్పింపఁబడినవి.

హేతువు.—అవి యసత్యము లయినందు వలన,

ఉదాహరణము.—స్వప్నమునఁ గానఁబడు వ్యవస్థలవలెనే.

---

ప్రతిజ్ఞ:—ఇతరశరీరములును "నేనే" యాత్మగాఁ గలవి,

హేతువు:—అవియును శరీరములగుటవలన,

ఉదాహరణము:—ఈ శరీరము వలెనే.

---

ప్రతిజ్ఞ:—ఇతరశరీరములును నాయొక్క యవిద్యచేతనే కల్పింపఁబడినవి.

7

హేతువు:—అవియును శరీరములగుట వలనఁగాని, కార్యపదార్థములగుటవలనఁగాని, జడపదార్థములగుటవలనఁగాని, లేక కల్పింపఁబడినవగుట వలనఁగాని,

ఉదాహరణము :—ఈ శరీరమువలెనే.

---

ప్రతిజ్ఞ:—వివాద విషయమగు చేతన పదార్థ సమూహమంతయును "నేనే".

హేతువు:—"నేను" చేతన మగుటవలన. ఏది "నేను" కానిదో, అది యచేతనముగాఁ గన్పట్టుచున్నది.

ఉదాహరణము:—ఘటము.

కావున "తాను, ఇతరుఁడు" అనెడివిభాగమును "ఈతఁడు బద్ధుఁడు, ఈతఁడు ముక్తుఁడు, ఈతఁడు ఆచార్యుఁడు, ఈతఁడు శిష్యుఁడు" అనెడి వ్యవస్థయును ఒక్కని యవిద్యచేతనే కల్పింపఁబడుచున్నవి.

ఆత్మలు వేఱువేఱయినవని వాదించునట్టి వైశేషికాదుల మతమునను, బద్ధముక్తివ్యవస్థను ఉపపాదించుట దుర్లభము. ఎట్లన, అనంతకల్పములు గడచినవి. ఒక్కొక్క కల్పమున నొక్కొక్కజీవుఁడు ముక్తుఁడైనను, ఇదివఱలో నందఱును ముక్తులై యుందురు. కావున బద్ధుఁడైనవాఁడొక్కఁడును మిఁగిలియుండుట యసంభవము.

వైశేషికుఁడు:—ఆత్మలు అనంతములుగాన ముక్తిని పొందనివారును గలరు.

బ్రహ్మాజ్ఞానవాది:—అనంతములనఁగా నేమి?

వైశేషికుఁడు:—ఇందఱని లెక్కపెట్టిచెప్పుట కశక్యులనుట.

బ్రహ్మాజ్ఞానవాది:—ఆత్మలనేకులగుటంజేసి వారిని లెక్కపెట్టుట యల్పజ్ఞులమగు మనకు అశక్యమైనను; సర్వేశ్వరుఁడు సర్వజ్ఞుఁడుగాన వానికి వారిని లెక్కపెట్టుట యశ్యకము కాదే? వానికిఁ గూడ వారిని లెక్కపెట్టుట యశక్యమంటివేని, సర్వేశ్వరుఁడు సర్వజ్ఞుఁడుకాఁడన్నమాట వచ్చునే?

వైశేషికుఁడు:—ఆత్మలకు లెక్క లేనేలేదు. కావున నట్లులేనట్టిలెక్క సర్వేశ్వరునికి తెలియనంత మాత్రముచే వాఁడు సర్వజ్ఞుఁడు కాఁడనిచెప్పఁదగదు.

బ్రహ్మాజ్ఞానవాది:—ఆత్మలు వేఱువేఱయిన వగు పక్షమున, అవి లెక్కలేనివగుట యసంభవము. ప్రయోగము.

ప్రతిజ్ఞ:— ఆత్మలు సంఖ్యావంతములు.

హేతువు:—వేఱు వేఱు స్వరూపముగలవయినందున,

ఉదాహరణము:—మినుపగింజలు, ఆవగింజలు, ఘటములు,వస్త్రములు మొదలగునవివలెనే

అట్లు ఆత్మలు వేఱువేఱు స్వరూపముగల వగునేని అవి ఘటాదుల వలెనే జడములనియు, ఆత్మలుకానివనియు, నాశయుక్తములనియును ప్రసక్తించును. మఱియుబ్రహ్మము అనంతము కాకపోవును. అనంతమనఁగా [1]పరిచ్ఛేదము లేనిది. బ్రహ్మము భిన్నమైనదని వాదించుపక్షమున, అది వేఱొకవస్తువునుండి విలక్షణమైన దగును. కావున బ్రహ్మము వస్తుపరిచ్ఛేదము లేనిదని చెప్పుట యశక్యము. వేఱొక వస్తు వుండుటయే గదా! వస్తుపరిచ్ఛేద మనఁబడును. ఏప దార్థము వస్తుపరిచ్ఛేదముగలదో, అది దేశపరిచ్ఛేదమున్ను, కాలపరిచ్ఛేదమున్ను, లేనిదని చెప్పఁదగదు. ఏలననిన, వేఱొక వస్తువునుండి విలక్షణములగుటంజేసి వస్తుపరిచ్ఛేదము గలవియగు ఘటపటాదులు దేశకాలపరిచ్ఛేదములనున్ను గలవిగాను గన్పట్టుచున్నవి. అట్లే సమస్తములగు జీవులును బ్రహ్మమున్ను వస్తుపరిచ్ఛేదముగలవిగాన నవి దేశకాలపరిచ్ఛేదములను నయితము కలవియే. ఇందుమూలముగా, బ్రహ్మము ఎవ్విధమైన పరిచ్ఛేదమును లేనిది యని ప్రతిపాదించునట్టి "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ." ఈమొదలగు శ్రుతి వాక్యములతో విరోధము సంభవించును. మఱియు జీవులును బ్రహ్మమును జన్మనాశములు గలవనియును ప్రాప్తించును. కాలపరిచ్ఛేదమును గలిగియుండుటయే గదా జన్మనాశములను పొందునది యగుట.

కాఁబట్టి చతుర్ముఖ బ్రహ్మము మొదలు గడ్డికాడవఱకు ఈసమస్త ప్రపంచమును, ఒక్కటియేమైనదియు మెవ్విధమైన పరిచ్ఛేదమును లేనిదియునునగుబ్రహ్మముయొక్క యవిద్యవలనఁ గల్పింపఁబడినది. స్వప్నదృష్టపదార్థములవలెనే అవిద్యా స్వభావముగలదయినందున సుఖదుఃఖానుభవమును గుఱించిన వ్యవస్థయును సంభవము. కావున ఒక్కటియేమై నిత్యముక్త స్వయం ప్రకాశస్వభావమగు బ్రహ్మమే అవిద్యావశమునఁ జగదాకారముగా భ్రమింపఁ

(1) ౧-వ సంపుటమున ౪౩-వ పత్రమున ౧-వ వివరణమును చూడుము.

బడుచున్నది. వాస్తవమునకు బ్రహ్మముకంటెను వేఱయినదేదియును లేదు గాన, జగత్తు బ్రహ్మమునకంటెను వేఱయినదికాదనుట యుక్తమే.

బ్రహ్మాజ్ఞానవాదులగు అద్వైతులు చేయునట్టి యీ పైవాదమునకు వైశేషికులిట్లు సమాధానము చెప్పుచున్నారు.

వైశేషికుఁడు:—"భేదములేవియును లేనిదియు, స్వయంప్రకాశమాత్రమగు బ్రహ్మము అనాదియగు అవిద్యచే మూయఁబడిన స్వరూపముగలదై తనయందు నానావిధ భేదములను తెలిసికొనుచున్నది" అని యిట్లు అద్వైతులు చేయువాదము యుక్తమైనదికాదు. ప్రకాశస్వరూపమును, విభాగము లేవియును లేనిదియును నగు బ్రహ్మస్వరూపమునకు ప్రకాశనివృత్తిరూపమగు తిరోధానము గలుగుపక్షమున, నది యట్టిస్వరూపముయొక్క నాశమే యని ప్రసక్తించును. కావుననట్టి తిరోధానము మొదలగునవి గలుగుట యసంభవము. అందువలన నారి వాదము ప్రమాణవిరుద్ధమనియు స్వవచనవిరుద్ధమనియును ఇంతకు పూర్వమే ప్రతిపాదింపఁబడెను.

"కారణముకంటెను వేఱుగా కార్యమనఁబడునది యొక్కటి కలదను విషయము యుక్తులచే బాధింపఁబడునది గాన, భ్రాంతివశమున ముత్యపుచిప్ప రజతముగాఁ దోఁచుచందమున నదియును భ్రాంతిమాత్రము" అనియిట్లు అద్వైతులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, అందు యుక్తియే లేదే? అనువర్తమానమగుటచే కారణము మాత్రము సత్యమనియు, వ్యావర్తమానములగుటచే ఘటశరావాదికార్యపదార్థములు అసత్యములనియును వారుగానఁబఱచిన యుక్తియుక్తమైనది కాదు. ఏలననిన, ఒక తావున గానఁబడిన పదార్థము వేఱొక తావున గానఁబడనంత మాత్రముచే బాధయేమియును లేదు. కావున వారుగానఁబఱచిన యుక్తి యింతకు పూర్వమే పరిహరింపఁబడియెను.

"కార్యపదార్థము తెలియవచ్చునదియు, నాశమును పొందునదియును నగుటంజేసి యది యనిర్వచనీయము. కావున నట్టిది యసత్యము" అనియిట్లు అద్వైతులు చేయువాదము నయితము సరియయినది కాదు. ఏలననిన, అందు మూలముగా నేదైన నొక్కపదార్థము మిథ్యయని నిరూపింపఁబడదు. అయితే అందువలన నాపదార్థము అనిత్యమని మాత్రము నిరూపింపఁబడును. ఏ ప్రదేశమున, ఏ కాలమున, ఏ పదార్థము ఉన్నట్టిదిగాఁ దెలియఁబడినదో, ఆ దేశముననే, ఆ కాలముననే, ఆ పదార్థమే, లేనిదిగాఁ దెలియఁబడు పక్షమున

అందువలన నది మిథ్యయని చెప్పఁదగును. ఏదైననొక్క ప్రదేశమున, నొక్క కాలమున ఉన్నట్టిదిగాఁ దెలియఁబడినది, వేఱొక్క ప్రదేశమున, వేఱొక్క కాలమున, లేనిదిగాఁ దెలియవచ్చునేని, అంతమాత్రముచే నది వేఱొక్క దేశమున, వేఱొక్క కాలమున నుండునది కాదనిమాత్రమే నిరూపితమగును. ఇంతే కాని, అంతమాత్రమున నాపదార్థము మిథ్యయని నిరూపింపఁబడదు. వారి వాదముతో విరోధించు న్యాయప్రయోగము నయితము కలదు:—

ప్రతిజ్ఞ:—ఘటము మొదలగు కార్యపదార్థము సత్యము.

హేతువు:—దేశకాలాదిరూపముగా నంగీకరింపఁబడిన యుపాధియందు బాధింపఁ బడకుండుటవలన,

ఉదాహరణము:—ఆత్మ వలెనే.

“ఏదైననొక మార్పును పొందినట్టిదిగాని, లేక ఎవ్విధమైన మార్పును పొందనిదిగాని యగు కారణ స్వరూపమునుండి కార్యపదార్థము గలుగుట యసంభవము” అని యద్వైతులు వాదించియున్నారు. ఆ వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, అందులకుఁదగిన దేశకాలాదులతో సంబంధముగల కారణ పదార్థమునుండి కార్యపదార్థము గలుగుట సంభవము.

“మార్పును పొందిన దానికిఁగాని లేక పొందనిదానికిఁగాని దేనికైనను తగిన దేశకాలములతో సంబంధము గలుగుట యసంభవము” అని యద్వైతులు ఆక్షేపించిరి. అది యుక్తము కాదు. ఏలననిన, పూర్వము మార్పునుపొందనిదానికే గదా తగిన దేశకాలాదులతో సంబంధము సంభవము.

బ్రహ్మజ్ఞానవాది:—అంతకు పూర్వమున్న అది మార్పును పొందనిదగుట సమానమేగాన, అప్పుడును దానికి ఆ దేశకాలాదులతో సంబంధము ప్రసక్తించునే?

వైశేషికుఁడు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన. అట్టి దేశకాలాదులతోసంబంధము వేఱొకకారణమున కధీనమైనది. కావున నది దీనికధీనమైనది కాదు. కాఁబట్టి యందులకుఁదగిన దేశకాలాదులతో సంబంధమును పొందినట్టి కారణపదార్థము కార్యపదార్థమును గలుగఁజేయుచున్నది. అందు దోషమేదియును లేదు. కారణము కార్యపదార్థమును గలుగఁజేయు విషయమై యెవ్విధమైన బాధయును లేదు. అది యట్టిదిగాను గన్పట్టుచున్నది. కావున దాని నెవ్విధముచేతను నిరోధించుట యశక్యము.

"కేవలస్వర్ణముగాని, రుచకాద్యాభరణరూపమగు స్వర్ణముగాని, రుచకాదుల కాశ్రయభూతమగు స్వర్ణముగాని, కార్యపదార్థమును గలుగఁజేయుటయసంభవము" అని యద్వైతులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, స్వర్ణము మాత్రమే ఆవశ్యకములగు ఉపకరణములతోఁ గూడినదై కార్యపదార్థమును గలుగఁజేయుట సంభవము. "కార్యపదార్థమును గలుగఁజేయునదియగు స్వర్ణముకంటెను వేఱుగా కార్యమనఁబడునది యొక్కటియు గానఁబడుచుండలేదు" అని చెప్పఁదగదు. ఏలననిన, స్వర్ణముకంటెను వేఱుగా స్వస్తికమనఁబడునది యొక్కటి గానఁబడుచున్నది గదా! "ఇది స్వస్తికము" అనెడి జ్ఞానమును వేఱును "ఇది స్వర్ణము" అనెడి జ్ఞానముకంటెను వేఱు కంటెను వేఱయిన వయినందున స్వర్ణరూపమగు కారణపదార్థము కంటెను స్వస్తికరూపమగు కార్యపదార్థము వేఱయినదిగా నిరూపింపఁబడుచున్నది.

"భ్రాంతి వశమున ముత్యపుచిప్ప రజతముగాఁ దోఁచిన తావున, రజతమనెడి జ్ఞానమువలెను వేఱువలెను స్వస్తికమనెడి జ్ఞానమును వేఱును భ్రాంతిమాత్రములు" అని చెప్పఁదగదు. ఉత్పత్తి మొదలు నాశము వఱకునుండు మధ్యకాలమున నాకార్యపదార్థమునకు, అదియుండు దేశకాలములయందు, ఎవ్విధమైన బాధయును లేదు. ఈ కార్యపదార్థము తెలియవచ్చుటను బాధించునట్టి యుక్తి యేదియును గానఁబడదు. ఇంతకు పూర్వము తెలియరాని స్వస్తికము తెలియవచ్చు సమయమున నాస్వస్తికమున కాశ్రయముగా స్వర్ణము అనువర్తించుచున్నదిగాన, స్వస్తికము విషయమై "ఇదిస్వర్ణము" అనెడి ప్రత్యభిజ్ఞయును గలుగవచ్చును. కావున విరోధమేదియును లేదు. ప్రపంచము మిథ్యయని శ్రుతులవలనఁ దెలియవచ్చుచున్నదనెడి యంశము ఇంతకు పూర్వమే నిరసింపఁబడియె. ప్రత్యక్షముతో విరోధములేకుండుట మొదలగు నిరసింపఁదగిన విషయమంతయు నింతకు పూర్వమే బాగుగా నిరసింపఁబడియెను.

"సమస్తశరీరములును ఒక్కటియే యాత్మగలవి కాఁదగును" అని యద్వైతులు చేయువాదము యుక్తమైనదికాదు. ఏలననిన, అట్లగునేని, ఒక్కటియేయాత్మకు సర్వశరీరములయందుండు సుఖదుఃఖముల యనుభవము ప్రసక్తించును. [1] సౌభరి మొదలగు వారివిషయమునమో, ఆత్మయొక్కటియే యయు

1 సౌభరి యొక ఋషి. ఈతఁడు మాంధాతయల్లుఁడు. ఈతఁడు యమునానదీ జలమునందు ద్వాదశ వర్షములు తపంబు సలిపి పిదప సంసార కాంక్ష కలిగి మాంధాతను ఒకకన్యక

నందున, అనేకశరీరములయందలి సుఖదుఃఖముల యనుభవము ఒక్కటియే యాత్మయెడల గన్పట్టుచున్నది.

"అహంకారమే తెలిసికొనునది యగుటంజేసియు, అది ప్రతిశరీరమునను వేఱువేఱగుటంజేసియును అనేక శరీరములయందుండు సుఖదుఃఖము లొక్క యాత్మకుఁదెలియరావు. ఇంతేకాని ఆయాశరీరములయందుండు ఆత్మలు వేఱువేఱయినవగుటనుబట్టి కాదు" అనిచెప్పెదవేమో; అట్లగుట యశక్యము. ఏలననఁగా, ఆత్మ జ్ఞాతయే (తెలిసికొనునదియే). అది "నేను" అనఁబడునదియే. అన్తఃకరణభూతమగు అహంకారమన్ననో, జడపదార్థమగుటవలనను, సాధనభూతమైనది యగుటవలనను శరీరేంద్రియాదులవలె నది తెలిసికొనునట్టిది కాదని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడెను కదా!

"శరీరములును, జడములును, కార్యభూతములును, కల్పితములును నయినందున, సర్వశరీరములును ఒక్కని యవిద్యవలనఁ గల్పింపఁబడినవి కాఁదగును" అనెడి యద్వైతుల వాదము యుక్తము కాదు. ఏలననిన, సర్వశరీరములును అవిద్యాకల్పితములగుటయే లేదు. ఏది బాధింపఁబడదో, అది సత్యమనియే కదా ప్రతిపాదింపఁబడియెను. ఇదియే అందులకు హేతువు.

"చేతనపదార్థముకంటెను వేఱయినదంతయును జడముగాఁ గానఁబడుటంజేసి సమస్తములగు చేతనపదార్థములును పరస్పరము వేఱువేఱయినవి కాఁదగవు" అనెడి యద్వైతుల వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, ఒక్కఁడు దుఃఖిగాను వేఱొక్కఁడు సుఖిగాను నుండుటనుబట్టి చేతనులకు పరస్పరము భేదము కలదని యుపపాదింబఁబడియే. కావున ఈపై వాదము నిరసింపఁబడుచున్నది.

"అన్ని శరీరములును "నన్నే" యాత్మగాఁ గలవి. అన్నియును "నాయొక్క" యవిద్యచేతనే కల్పింపఁబడినవి. ఈచేతన జాతమంతయును "నేనే" అనియిట్లు అన్నింటియందునుండు "నేను" అనఁబడునది యొక్కటియే యని నీవు

కావలయునని వేఁడఁగా అతఁడు తన కొమార్తెలలో ఎవతెఅతనిని వరించునో, దానిని కైకొనుము అనిచెప్పి తనయేఁబండ్రు కూతులను చూపెను. అప్పుడు తపఃప్రభావముచే రూప యౌవన సంపన్నుఁడు అయి అతఁడు వారికి కనఁబడఁగా వారందఱును అతనిని మోహించి వరించిరి. అంతట అతఁడు ఆకన్యకల నందఱిని వివాహమాడెను. అట్లు యేఁబండ్రు భార్యలతో విషయ సుఖముల ననుభవించుటకై కాఁబోలు అతఁడు యేఁబండ్రు శరీరములను కైకొనెను

ఉపపాదించినదియును యుక్తముకాదు. ఏలననిన, నీవు నీసిద్ధాంతమును బాగుగా నెఱుంగక భ్రాంతివశమున నట్లు జల్పించినావు; ఇంతియే. ఎట్లన, "నేను," అనియు "నీవు," అనియు నీ మొదలగు వానికంటెను విలక్షణమైనదియును, జ్ఞానమాత్రమునునగునది యాత్మయని కదా! మీమతస్థులు తలంచుచున్నారు. ఇంతియె కాక, నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మముకంటెను వేఱయినదంతయును మిథ్యయనెడి మీమతమున మోక్షమును లభించుటకై యొనర్పఁబడు ప్రయత్నము వ్యర్థమని ప్రసక్తించును. ఇందును గుఱించిన న్యాయప్రయోగములు:—

ప్రతిజ్ఞ:—మోక్షమును లభించుటకై శాస్త్రార్థశ్రవణాదుల నొనర్చుటకుగానునగు ప్రయత్నము వ్యర్థము.

హేతువు:—అదియును అవిద్యవలనఁ గలుగునది యగుట వలన,

ఉదాహరణము:—భ్రాంతివశమున ముత్యపుచిప్ప రజతముగాఁ దోఁచిన తావున ఆరజతమును గైకొనుటకుగాను నగు ప్రయత్నము వలెనే.

ప్రతిజ్ఞ:—మోక్షమును లభించుటకుగా నగు ప్రయత్నము వ్యర్థము,

హేతువు:—కల్పింపఁబడిన యాచార్యుని కధీనమగు జ్ఞానమునుండి గలుగునది యయినందున,

ఉదాహరణము:—శుక, ప్రహ్లాద, వామదేవాదుల ప్రయత్నమువలెనే.

ప్రతిజ్ఞ:—"తత్త్వమసి" ఈమొదలగు వాక్యములవలనఁ గలుగు జ్ఞానము సంసారబంధమును నివర్తింపునట్టిది కాదు,

హేతువు:—అవిద్యామూలముగా గల్పింపఁబడిన వాక్యములనుండి గలుగునదైనందు వలనఁగాని, అదిస్వయముగా నవిద్యాస్వరూపమైనందువలనఁగాని, అవిద్యామూలముగా గల్పింపఁబడిన జ్ఞాతను (తెలుసుకొనువానిని) ఆశ్రయించి యుండునదగుటంజేసి గాని, కల్పింపఁబడిన యాచార్యునికధీనమగు శాస్త్రార్థశ్రవణమువలనఁ గలుగునదైనందువలనఁగాని,

ఉదాహరణము:—"నీబంధము నివర్తించినది" అని యిట్లు స్వప్నమునందు వినఁబడినవాక్యమువలనఁ గలుగుజ్ఞానము వలెనే.

ఇంతియేకాక,

ప్రతిజ్ఞ:—నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మము మిథ్య.

హేతువు:—అవిద్యవలనఁ గలుగు జ్ఞానముమూలముగాఁ బొందఁదగినది యగుటంజేసి గాని, అవిద్యామూలముగాఁ గల్పింపఁబడిన జ్ఞాతయందుండు జ్ఞానమువలనఁబొందఁదగినది యగుటంజేసిగాని, అవిద్యాస్వరూపమగు జ్ఞానము వలనఁబొందఁ దగినదగుటంజేసి గాని. ఎట్లన, ఏది యివ్విధమైనదియో, అది యట్టిదియే అనఁగా మిథ్యాభూతమైనదియే.

ఉదాహరణము:—స్వప్నమునందుగానఁబడు గంధర్వనగరము మొదలగునవి వలెనే.

"నిర్విశేష చిన్మాత్రమగు బ్రహ్మము తన్ను ప్రకాశింపఁజేయుటకుగాను వేఱొక ప్రమాణము నపేక్షింపనిదై తనకు తానే ప్రకాశించునది" అని మీరు చెప్పినదియును యుక్తము కాదు. ఏలననిన, ఏది యాత్మసాక్షికమును (తనస్థితిని తానే నిశ్చయించునదియును) స్వయంప్రకాశ జ్ఞానమునునో, అది తెలియఁదగిన పదార్థమును గుఱించిన ప్రకాశరూపముగాను, జ్ఞాతయందే యుండునదిగానును గన్పట్టుచున్నదని యింతకుపూర్వమే చెప్పఁబడియెను గదా! బ్రహ్మము నిర్విశేష చిన్మాత్రమని నిరూపించుటకై యే యుక్తులను మీరు గాన్పించియుంటిరో, అవి యన్నియును అవిద్యవలనఁ గలిగినవి. కావున నవి యీపైని గానఁబఱచిన యనుమానములచే నిరసింపఁబడియెను.

విశేషము లేనియును లేనిదియు, జ్ఞానమాత్రమునునగు బ్రహ్మము అజ్ఞానము విషయమై సాక్షియగుటయు, దానికి అహంకారాదిరూపమగు జగత్తనెడి భ్రమము గలుగుటయును అసంభవములు. ఏలననిన, సాక్షిత్వము, భ్రమము మొదలగునవి జ్ఞాతయగువాని యందుండునవిగాను గన్పట్టుచున్నవే గాని, జ్ఞానమాత్రమునందుండునవిగాను గన్పట్టుచుండలేదే! అట్టివస్తువు ప్రకాశమగుటగాని లేక అది తనకధీనమైన ప్రకాశము గలదియగుటగాని సంభవము కాదు. ఏలననిన, ఒకపురుషుని కొక పదార్థమును గుఱించిన తెలివి గదా! ప్రకాశమనఁబడుచున్నది? ఈ హేతువును బట్టియే గదా అట్టిది స్వయంప్రకాశమని మీరును ఉపపాదించియున్నారు. అట్టిది కానిదియగు నిర్విశేష వస్తువొక్కటి కలదంటిరేని, దానికి ప్రకాశముండుట సంభవింపదు.

అసత్యమగుదానినుండియును సత్యమగు కార్యజాతము గలుగుచున్నదనెడి ప్రసిద్ధి మీ సిద్ధాంతమున నుండు గాక. అయినను, ఆ కార్యపదార్థములన్నియును దాదాపుగా బాధింపఁబడని పదార్థములవలెనుండునవనియు, వ్య

వహారమునకు మాత్రమే సత్యములనియు, వాస్తవమునకన్ననో అవిద్యా స్వరూపములనియును మీరంగీకరించి యుండుటనుబట్టియే మీవాదము నిరసింపఁబడినదగుచున్నది. మఱియు అన్నితావులను సత్యమైదినయే యగు కారణమునుండి సమస్తకార్యములును గలుగుచున్నవని మేము ఉపపాదించుచున్నాము. కావున నను మీ వాదము నిరసింపఁబడినది. మేము గానఁబఱిచిన అనుమానములు శ్రుతివిరుద్ధములని చెప్పుట యశక్యము. శ్రుతియును అవిద్యవలనఁ గలిగినదియు, అవిద్యాస్వరూపమును గదా! కావున ఈ పైని గానఁబఱిచిన దృష్టాంతములకును దీనికిని భేదమేదియును లేదు.

"బ్రహ్మము అసత్యమగు జ్ఞానముచేఁ బొందఁదగినదియేయైనను, తరువాత అందులకేదియును బాధలేకుండుటంజేసి, బ్రహ్మము సత్యమైనదియే" అని మీరు వాదించెదరేమో; అట్లు చెప్పఁదగదు. దోషవిశిష్టమగు కారణమునుండి గలిగిన జ్ఞానమువలనఁ బొందఁబడునదని నిశ్చయింపఁబడునేని, తరువాతి బాధ లేకుండుటవలన నేమి ప్రయోజనము? అదెటువలెననిన, "శూన్యమే తత్త్వము," అనెడి వాక్యమువలనఁ గలిగిన జ్ఞానమునకు తరువాతి బాధ యేదియును గానఁబడకపోయినను, అట్టి జ్ఞానము; దోషమూలమని నిశ్చయింపఁబడుట వలననే కదా దానిచేఁ దెలుపఁబడునదియును అసత్యమగుచున్నది.

"నేహ నానాస్తి కిఞ్చన" అనియు, "విజ్ఞాన మానన్దం బ్రహ్మ" అనియు నీ మొదలగు వేదశాస్త్రము విజ్ఞానమాత్రముకంటెను వేఱగు ఈ సమస్త వస్తుజాతమును నిషేధించుటచే నది సర్వమునకు తరువాతిది, కావున అటుపిమ్మట దానికేదియును బాధలేనట్లు గానఁబడుచున్నది" అని మీచే చెప్పఁబడియె. అయితే అట్టి జ్ఞానమాత్రము సయితము లేదని చెప్పునట్టి "శూన్యమే తత్త్వము," అనెడి వాక్యము అట్టి వేదశాస్త్రమునకంటెను తరువాతిది కావున, నా వేదశాస్త్రమునకును అటుపిమ్మటి బాధయున్నట్లు గానఁబడుచున్నది. అయితే "సర్వమును శూన్యమే" అని చెప్పినపిమ్మట అంతకంటెను వేఱొకనిషేధమేదియును గానఁబడదు కావున నావాక్యమే తరువాతి బాధ యేదియును లేనిది. దోషమూలమగుట యన్ననో, ప్రత్యక్షాది ప్రమాణములకును ఉపనిషత్తులవలనఁ గలుగునట్టి "సర్వము శూన్యము," అనెడి జ్ఞానమునకును ఈరెంటికిని సమానమే.

కావున సర్వవిధమైన విజ్ఞానమును సత్యమగు జ్ఞాతయందుండునది. స్వయముగ సత్యమైనది. అదియొకపదార్థమును గుఱించిన తెలివి. దానిలో

కొంత దోషమూలమైనది. దోషమున్ను సత్యము. దానిలో మఱికొంత దోషము లేవియును లేనిదియు, సత్యములగు సాధనముల వలనఁ గలుగునదియును. ఈపైని గనఁబఱచిన ప్రకారము మీరెంతవఱ కంగీకరింపరో, అంతవఱకు "ఇది సత్యము, ఇది మిథ్య," అనెడి వ్యవస్థయు, లోక వ్యవహారమును సిద్ధింపవు. లోక వ్యవహారము సత్యమైనదియు భ్రాంతి రూపమైనదియును, మఱియు నది సత్యమగు నాజ్ఞాతయందును, పదార్థముల గుఱించినదియు జ్ఞానస్వరూపమునుగు ప్రకాశము కలదని సూచింపునది. నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమన్ననో, సత్యము గాని, మిథ్యగానియగు ప్రకాశము మొదలగుదానికి హేతువగుట యసంభవము. కావున లోక వ్యవహారము సంభవింపదు.

"ఆధారమేదియును లేక భ్రమము కలుగదు. కావున, సమస్తములగు భ్రమములకును ఆధారభూతమైన సన్మాత్రమొక్కటి సత్యముగా నుండవలయును" అని మీరు చేయువాదము యుక్తమైనదికాదు. ఏలననిన, దోషమును దోషమున కాధారమైనదియును, జ్ఞాతయును, జ్ఞానమును ఇవియన్నియును వాస్తవమునకు లేకపోయినను, భ్రమము గలుగుట సంభవమని మీరుచెప్పచున్నారు గదా! అట్లే భ్రమమున కాధారభూతమైనది యొక్కటి సత్యముగా లేకపోయినను, భ్రమము గలుగవచ్చును. కావున మీవాదము నిరసింపఁబడినది. "ఆధారవస్తువు అసత్యమగు తావున నెచటను భ్రమము గలుగుచున్నట్లు గానఁబడదు, కావున సన్మాత్రమనఁబడున దొక్కటి సత్యముగాఁగలదనియవశ్యమంగీకరింపవలయును" అని తలంచెదరేమో, అట్లగుపక్షమున, దోషమును అట్టిదోషముయొక్క యాధారమును, జ్ఞాతయును, జ్ఞానమును, ఇవియన్నియును అసత్యములగునెడల భ్రమము గలుగుచున్నట్లు గానఁబడదు. మనకు గానఁబడురీతిని దోషము మొదలగునవియును సత్యములేయని యవశ్య మంగీకరింపవలయును. కావున మీయొక్కపట్టుదలే తప్ప విశేషమేదియును లేదు.

"ఆత్మలకు భేదము కలదని యంగీకరించు పక్షమున, మితిలేని కల్పములు గడచిపోయినవి గాన, ఇదివఱలోనే సర్వాత్మలును ముక్తులైయే యుండవలయును. కావున, బద్ధుఁడొక్కఁడును లేకపోవలయును. అందువలన "ఈతఁడు బద్ధుఁడు, ఈతఁడు ముక్తుఁడు" అనెడి వ్యవస్థయుండుట యసంభవము" అని యివ్విధమున మీరు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, ఆత్మలు అనంతములగుటంజేసి మీవాదము పరిహరింపఁబడుచున్నది.

"ఆత్మలు వేఱువేఱయినవగు పక్షమున, మినుపగింజలు, ఆవగింజలు, ఘటములు, వస్త్రములు, మొదలగునవి వలెనే యవియును సంఖ్యగలవి యగును" అని మీరుచేయు వాదము యుక్తమైనది కాదు. ఏలననిన: ఘటాదిపదార్థములును అనంతములు. కావున మీరు గానఁబఱచిన దృష్టాంతము పొసగదు.

బ్రహ్మాజ్ఞావాది:—పదికుండలు, వేయి మినుపగింజలు అని యివ్విధమున నవియును ఒకసంఖ్య గలవిగాను గన్పట్టుచున్నవే ?

వైశేషికుఁడు:—వాస్తవమే. అట్టి సంఖ్య ఘటాదుల స్వరూపమును బట్టియుండునదికాదు. అయితే అది యీకాలమున, యీదేశమున, నిన్నిఘటములుకలవని యిట్లు దేశకాలాద్యుపాధితోఁగూడినవి యగు ఘటాదులను బట్టి గలిగినది. అట్టిసంఖ్య యాత్మలకును కలదని మేమంగీకరించెదము. అంతమాత్రమున నందఱు ముక్తులై యుండవలయునని ప్రసక్తింపదు.

"ఆత్మలు వేఱువేఱయిన వగునేని, యవి ఘటపటాది పదార్థములవలెనే జడములనియును, ఆత్మలు కానివనియు, నాశయుక్తములనియును ప్రసక్తించును" అనెడి మీవాదము యుక్తమైనదికాదు. ఏలననిన, ఏకజాతీయములగు పదార్థములలో నొక్కటి వేఱొక్కటికంటెను వేఱగునేని, యంతమాత్రమున నవి వేఱుజాతిలోఁ జేరినవి కాఁదగవు. దృష్టాంతము:—ఒక్క ఘటము వేఱొక్క ఘటముకంటెను వేఱగునేని, అట్లు వేఱగు ఘటము ఇతరజాతీయమైన పదార్థమగునా? కాదే ?

"బ్రహ్మము వేఱొకదానికంటెను వేఱయినదగునేని, అది వస్తుపరిచ్ఛేదము గలది యగును. అందు మూలముగా నది దేశపరిచ్ఛేదమును, కాలపరిచ్ఛేదమును గలదియని ప్రసక్తించును. కావున బ్రహ్మము అనంతమని సిద్ధింపదు" అనియిట్లు మీరుచేయు వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, వస్తుపరిచ్ఛేదముగలవైనను, దేశకాల పరిచ్ఛేదముల విషయమై [1]న్యూనాధికభావముండవచ్చును గాన, నవి యా పరిచ్ఛేదములు గలవనెడి నియమము గానఁబడదు. దేశకాలముల సంబంధమును గుఱించిన పరిమితి ప్రమాణాన్తరములనుబట్టి తెలియఁదగును. ప్రకృతమున, బ్రహ్మమునకు సమస్తములగు దేశకాలములతో సంబంధమున్నను బ్రహ్మము ప్రమాణాంతరములనుండి తెలియఁబడు

(1) ఏది కలుగఁజేయఁబడునదియో, దాని యందుండు విశేషములు అట్లు దానిని గలుగఁజేయు దానినిబట్టి గలుగునవిగావు. లోకానుభవము వలనఁ దెలియవచ్చుచున్నవి. ఒక్క

నదికాదు గాన, విరోధమేదియును లేదు (దేశకాలపరిచ్ఛేదములు లేనిది వస్తుపరిచ్ఛేదముగలది యయినంతమాత్రమున విరోధమేదియును లేదు.)

బ్రహ్మాజ్ఞానవాది:—బ్రహ్మమునకు వస్తుపరిచ్ఛేదమున్నంత మాత్రముచే అది యెవ్విధమైన పరిచ్ఛేదమును లేనిదనెడి ప్రసిద్ధి పోవును. అందుమూలముగా బ్రహ్మము అనంతమని సిద్ధింపదు.

వైశేషికుఁడు:—బ్రహ్మము అవిద్యకంటెను వేఱయినదని యంగీకరించునట్టి మీమతమునను ఈ పైని గనఁబఱచిన దోషము సమానమే. బ్రహ్మము అవిద్యకంటెను విలక్షణమైన దని గదా మీరును చెప్పుచున్నారు. కావున నది మఱియొక్క దానికంటెను వేఱయినది. కావున, భేదవాదము నంగీకరించుటచే ప్రసక్తించునట్టి దోషములన్నియును మీమతమునను ప్రసక్తించును. మీరు బ్రహ్మము అవిద్యకంటెను విలక్షణమైనదని యంగీకరింపరా? అట్లగుపక్షమున,

---

పదార్థము దిగువ పడుటలోఁ గల తారతమ్యములు దాని యందుండు గురుత్వము యొక్క తారతమ్యములనుబట్టి గలుగునవి. దృష్టాంతము:—బరువైన ఇనుపగుండును ఉన్నత ప్రదేశమునుండి క్రింద వదిలితిమేనియది శీఘ్రముగాఁ క్రిందపడును. తేలికయైన వగుడాకు, దూది మొదలగు వానిని వదిలితిమేని,యవి యాలస్యముగా క్రిందపడును. దూమ శకటము యొక్క శీఘ్రగతి దాని యింజినుయొక్క వేగమునందుండు తారతమ్యమును బట్టి గలుగునది. కావుననే యిన్ని గుఱ్ఱముల వేగముతోఁగూడియున్న యింజిను గల బండి యిన్నిగంటలలో నిన్ని మైళ్లు పోఁగల దనెడి నియమము గలదు.

ప్రకృతమున దేశకాలపరిచ్ఛేదములయందు న్యూనాధికభావరూపమగు తారతమ్యము కలదు. ఎట్లన, ఒక్కదేశమున నొక్కపదార్థము కలదంటిమేని యా పదార్థమాదేశమున కొంత భాగమున మాత్రముగాని యాదేశమునకు పైగానునుగాని యుండవచ్చును.ఈకాలమున ఈపదార్థము దొరకుననఁగా నాపదార్థమాకాలమున కొంతవఱకుగాని లేక ఆకాలము తరువాతనున్ను కొంతవఱకుగాని యుండవచ్చును. ఇట్లు దేశకాలపరిచ్ఛేదములయందు న్యూనాధికభావముండవచ్చును. ఇట్టి న్యూనాధికభావము దేనినిబట్టి గలిగినదనియెఱుంగఁదగును? ఈ పైనిగానఁబఱచిన లోకానుభవమునుబట్టి యది వానిఁ గలుగఁజేసిన వస్తుపరిచ్ఛేదమునందుండు న్యూనాధికభావమునుబట్టి గలుగునదని చెప్పవలసివచ్చును. వస్తుపరిచ్ఛేదమున న్యూనాధికభావము కలదా? లేదు. ఏలననిన, "ఈవస్తువు ఈపదార్థము, ఆవస్తువు ఈపదార్థముకాదు. అది దీనికంటెను వేఱయినది" అనుట గదా వస్తుపరిచ్ఛేదము. ఏ వస్తువు ఏ పదార్థమో ఆవస్తువంతయును ఆపదార్థమే అందులో కొంత ఆపదార్థమును మఱికొంత ఆపదార్థముకాక పోవుటయును యెచటనైనను కద్దా? లేదు. కాఁబట్టి వస్తుపరిచ్ఛేదమున న్యూనాధికభావము లేనే లేదు. కాఁబట్టి దేశకాలపరిచ్ఛేదములు వస్తుపరిచ్ఛేదమూలకములంటివేని వానియందుండు న్యూనాధికభావము వస్తుపరిచ్ఛేదముననుండు న్యూనాధికభావమూలక మని చెప్పవలసివచ్చును. వాస్తవమునకు ఈపైనిగానఁబఱచిన ప్రకారమువస్తుపరిచ్ఛేదమున న్యూనాధికభావములేనే లేదు. కాఁబట్టి దేశకాలపరిచ్ఛేదములు వస్తుపరిచ్ఛేదమునుబట్టి గలుగునవి యని చెప్పఁదగదు.

బ్రహ్మము అవిద్యాత్మకమే యగును. అందుమూలముగా "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ," అనియిట్లు బ్రహ్మముయొక్క స్వరూపమును తెలుపునట్టి శ్రుతివాక్యము సయితము అపార్థకమగును.

మఱియు భేదమనఁబడున దొక్కటి వాస్తవముగా లేనేలేదని యంగీకరించుపక్షమున, "ఇది మన మతము, అది యితరుల మతము; ఇది మనమతమును గుఱించిన సాధనము, అది యితరుల మతమును గుఱించిన దూషణము" ఇవ్విధమగు వివేకమే లేకపోవును గాన, సర్వము అసంగత మగును. బ్రహ్మము దేశకాలపరిచ్ఛేదములు లేనిదగుటంజేసియే యనంతమైనదిగా సిద్ధించుచున్నదిగాన, అది వస్తుపరిచ్ఛేదము సయితము లేనిదగుటంజేసి యట్టిదిగా సిద్ధించుచున్నదని చెప్పఁదగదు. అట్లు వస్తుపరిచ్ఛేదము సయితములేనిది కుందేటికొమ్మువలెనే యెన్నఁడును ఉన్నట్టిదిగాఁ దెలియరాదు కదా.

భేదమనఁబడునది వాస్తవముగాఁ గలదను వాని మతముననో, సమస్తములగు చిదచిత్పదార్థములును పరబ్రహ్మముయొక్క శరీర మగుటంజేసి, పరబ్రహ్మము అన్నివిధములయినది. కావున నట్టి పరబ్రహ్మముకు తననుండిగాని వేఱొక పదార్థమునుండిగాని పరిచ్ఛేదము లేనేలేదు.

కాఁబట్టి ఈ పైన గనఁబఱచిన ప్రకారము కారణపదార్థముకంటెను వేఱయినదగు కార్యపదార్థము సత్యమైనదయినందున, బ్రహ్మమునుండి గలుగునట్టిదియగు ఈసమస్తప్రపంచమును బ్రహ్మముకంటెను వేఱయినదియే.

## సిద్ధాంతము.

భాష్యకారులు:—ఈ పైని గానఁబఱచిన ప్రకారము పూర్వపక్షము రాఁగా, అందులకు సమాధానము "తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః," అని పఠింపఁబడుచున్నది.

తదనన్యత్వం, (తస్మాత్-అనన్యత్వం) తస్మాత్=పరమకారణమగు బ్రహ్మముకంటె, అనన్యత్వం జగత్తు వేఱుకానిదగుట, దానిని ప్రతిపాదించునట్టి (ఆరమ్భణశబ్దాదిభ్యః = ఆరమ్భణశబ్దః ఆదిర్యేషాం వాక్యానాం) అనఁగా ఆరమ్భణశబ్దముతో నారంభింపఁబడిన శ్రుతివాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది. అట్టి శ్రుతు లేవి యనఁగా, "వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (ఛా. ౬. ప్ర. ౧. ఖ. ౪వా.)అనియు, "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేకమేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత"

(ఛా. ౬. ప్ర. ౨. ఖ. ౧.వా.) అనియు, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య" (ఛా. ౬. ప్ర. ౩ ఖ. ౩. వా) అనియు, "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాస్సదాయతనాః సత్ప్రతిష్ఠాః ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛా. ౬.ప్ర. ౮.ఖ. ౬. వా) అనియు నీ మొదలగునవి. వేఱువేఱు ప్రకరణములయందు పఠింపఁబడినవైనను, ఈపైని గనఁబఱచిన శ్రుతివాక్యములవంటివి యన్నియును ఈ తావున ముఖ్యముగా గ్రహింపఁదగినవి. చిదచిత్పదార్థములు శరీరముగాఁగల పరబ్రహ్మము ప్రపంచముకంటెను వేఱయినది కాదని యీ వాక్యములు ప్రతిపాదించుచున్నవి. ఎట్లనిన,

ఛాందోగ్యోపనిషత్తునందు "స్తబ్ధోస్యుత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతంభవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతం" (ఛా. ౬. ప్ర. ౧. ఖ. ౩. వా) (ఊరకయుంటివా? లేక, ఏ యుపదేశముచే వినఁబడనిదంతయు వినఁబడినదగునో, చింతింపఁబడని దంతయును చింతింపఁబడినదగునో, తెలియఁబడని దంతయును తెలియఁబడినదగునో, ఆయుపదేశము నడిగితివా?) అను తావున ఆచార్యుఁడు ఈసమస్తప్రపంచమును బ్రహ్మమునుండియే గలుగునది యనియు, కారణము కంటెను కార్యము వేఱయినది కాదనియు నీయంశములను మనస్సున నుంచుకొని, కారణభూతమగు బ్రహ్మమొక్కటి తెలియుటచే కార్యభూతమగు నట్టి యీసమస్త ప్రపంచమును తెలియఁబడునని ప్రతిజ్ఞ చేయఁగా, ఈసమస్త ప్రపంచమునకును బ్రహ్మమే కారణమని యెఱుఁగని శిష్యుఁడు ఒక్కటి తెలియుటచే వేఱొక్కటి తెలియఁబడుట యసంభవమనుకొని, "కథం ను భగవ స్స ఆదేశః?" "(ఓపూజ్యుఁడా! ఆయుపదేశము ఎట్టిది?") అని యడిగెను. అంతట ఆచార్యుఁడు ఈ సమస్తప్రపంచమునకును బ్రహ్మమొక్కటియే కారణమని యుపదేశింపఁబోవుచు, అందులకై కారణముకంటెను కార్యము వేఱయినది కాదని తెలుపునట్టి లౌకికదృష్టాన్తమును "యథా సోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం" (ఓప్రియమైన శిష్యుఁడా! ఒక్క మట్టిముద్దను తెలిసికొనుటచే మట్టితోఁజేయబడిన సమస్తపదార్థములును ఎట్లు తెలియఁబడునో, అట్లే," అనుటచేఁ గాన్పించుచున్నాఁడు. అనఁగా లోకమున మట్టితోఁ జేయఁబడిన ఘటశరావాది పదార్థములు అట్టి మట్టిముద్దకంటెను వేఱైన ద్రవ్యము గాకపోవుటంజేసి దానిఁ దెలిసికొనుటచే నాపదార్థములన్నియును తెలియఁబడునట్లనుట. ఈ సందర్భమున వైశేషికులు కార్యమును కారణముకంటెను వేఱ

యినదానినిగాఁ జెప్పుచున్నారని శంకించి లోక ప్రసిద్ధిని బట్టియే కారణముకంటె ను కార్యము వేఱయినది కాకపోవుటను "వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం" అనువాక్యముచేఁ బ్రతిపాదించుచున్నాఁడు.

ఈ శ్రుతియందు "ఆరమ్భణం" అనఁగా "ఆరభ్యతే = ఆలభ్యతే— స్పృశ్యతే" అనెడి వ్యుత్పత్తినిబట్టి "పొందఁబడునది" లేక "స్పృశింపఁబడునది" యనియర్థము. "కృత్యల్యుటో బహుళం" (పా. 3. అ. 3. పా ౧౧౩. సూ) అను సూత్రమువలన నీశబ్దము కర్మణ్యర్థముగలది. 'వాచా' అనఁగా "వచనపూర్వక మగు వ్యవహారరూపమగు హేతువువలన" అనియర్థము. ఎట్లన "ఘటముతో నుద కమును గొనిరా" ఈమొదలగు వాక్కునుచ్చరించిన తరువాతను గదా ఉదకము ను గొనివచ్చుటమొదలగు వ్యవహారము గలుగుచున్నది. విపులమైన అడుగు తట్టును ఉదరమునుగల యాకారవిశేషమును, అట్టి యా కారవిశేషమునుబట్టి వ చ్చిన ఘటము మొదలగు నామమును అట్టి మృత్తికచేతనేస్పృశింపఁబడుచున్నవి. అనఁగా ఉదముఁగొనివచ్చుట మొదలగు వ్యావహారము గలుగుటకై మృత్తిక యనఁబడు పదార్థమే యొక యాకారవిశేషమును, ఒకపేరును గలది యగుచున్న దని యర్థము. కాఁబట్టి ఘటము మొదలగునవియును మృత్తికయే యగుట సత్యము అనఁగా అవిమృత్తికయనఁబడుద్రవ్యముగానే ప్రమాణములవలనఁ దెలి యవచ్చుచున్న వేగాని ద్రవ్యాంతరముగాఁ దెలియవచ్చుచుండ లేదు. కావున మృత్తిక హిరణ్యము మొదలగు ద్రవ్యము వేఱొక యాకారవిశేషమును పొందిన దై నంతమాత్రమున వేఱొక పదార్థమనెడి జ్ఞానమున్ను పేరున్ను గలవియగుట సంభవము. దృష్టాంతము:—అవస్థాభేదములనుబట్టి దేవదత్తుని యొక్కనియం దే బాలుఁడనియు, తరుణుఁడనియు, వృద్ధుఁడనియు నివ్విధముగాఁ దెలియవచ్చు టయు, ఈపేరులును, కార్యవిశేషములును, గన్పట్టుచున్నవి గదా.

"మృత్తికయుండగానే ఘటము నష్టమైనదనెడి వ్యవహారమునుబట్టి కారణభూతమగు మృత్తికకంటెను కార్యభూతమగు ఘటము వేఱుపదార్థము గాఁదెలియవచ్చుచున్నది" అను వైశేషికుల వాదము యుక్తమైనదికాదు. ఉత్పత్తి, వినాశము మొదలగునవి కారణపదార్థమునఁ గలుగునట్టి యవస్థావిశేష ములే కదా! కావున ఆవాదము పరిహరింపఁబడుచున్నది. ఆ యా యవస్థలను పొందునట్టి ద్రవ్యమొక్కటియే ఆయాపేరులును కార్యములును గలది యగుట యుక్తము.

ద్రవ్యము ఆ యాయాకారములుగలది యగుట వని వాని యుద్యమమున కధీనమైనది. కావున వానియుద్యమము సార్థకము. వని వాని యుద్యమముచే కార్య పదార్థము ప్రకాశింపఁబడుచున్నదనెడి పక్షమును మేమంగీకరింపము. అందువల ననే అందునుగురించిన యాక్షేపము లన్నియును పరిహరింపఁ బడినవి.

ఉత్పత్తి నంగీకరించినను, సత్కార్యవాదమున కెవ్విధమైన విరోధమును లేదు. పూర్వమున్నట్టిదియే గదా ఉత్పన్నమగుచున్నది ?

వైశేషికుఁడు:—పూర్వమే యుండియున్నది యిప్పుడు ఉత్పన్నమగు చున్నదంటిరేని, యది యసంగతము.

భాష్యకారులు:—ఉత్పత్తి యనఁగానేదియో, వినాశమనఁగానేదియో వాని యథార్థస్వరూపముల నెఱుంగని వాఁడిట్లడుగఁదగును. ఏదైన నొక ద్రవ్యము ఉత్తరోత్తరాకారవిశేషములను పొందుటయే పూర్వపూర్వాకార విశేషములు గలదానియొక్క వినాశ మనఁబడును. ప్రకృతమున నుండునట్టి యాకారవిశేషములనుగలదియగుటయే యుత్పత్తి యనఁబడునది. కావున ఈ యన్ని యాకారములు గల ద్రవ్యమొక్కటి పూర్వమునను ఉండియుండుటం జేసి సత్కార్యవాదమున కెవ్విధమైన విరోధమును లేదు.

వైశేషికుఁడు:—ఇంతకు పూర్వములేని యాకారవిశేషము ఇప్పుడు ఉత్పన్నమగుపక్షమున, అసత్కార్యవాదము ప్రసక్తించునే ?

భాష్యకారులు:—అసత్కార్యవాదివియగు నీమతమున నొక్కపదార్థము ఉత్పన్నమగునేని, దాని యుత్పత్తియనఁబడు దానికిని యుత్పత్తి కలదా? లేదా? లేదంటివేని, యది యింతకు పూర్వమున్నట్టిదియేగాన, నీమతమున సత్కార్య వాదము ప్రసక్తించును. కలదంటివేల, దానికిని వేఱొక యుత్పత్తియుండి యుం డవలయును. ఇట్లు మితిలేని యుత్పత్తులు ప్రసక్తించుటచే అనవస్థాదోషము ప్రాప్తించును. మామతముననో, కార్యభూతములగు ఆకారములనఁబడునవి అట్టి యాకారములను పొందునట్టి పదార్థముకంటెను వేఱయినవిగాను గ్రహిం పఁబడవు. కాఁబట్టి ఏది యాకారములను పొందునదియో అదియే యుత్పత్తి మొదలగునవి కలది. కావున దోషమేదియును లేదు. ఎట్లన, కపాలముగాను, చూర్ణముగాను, పిణ్డముగాను నుండునట్టి యాకారము పోయి ఘట ముగానుండునట్టి యాకారమువలెనే, ఒక్కటిగానుండునట్టి యాకారము పోయి అనేకములుగా నుండునట్టి యాకారమును, అదిపోయి ఒక్కటిగా నుండు నట్టియాకారమును, సంభవములు. కావున ఎవ్విధమైన విరోధమును లేదు.

అట్లే "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేకమేవా ద్వితీయం (ఛా. ౬. ప్ర ౨ఖ. ౧వా)" అనెడి శ్రుతివాక్యము తెలుపుచున్నది. ఎట్లన, సదేవేదం = ఇక్కాలమున (సృష్టియందు) వివిధములగు నామరూపములను గలదియగుటం జేసి నానారూపమగు జగత్తు, అగ్రే = ఇంతకు ముందు, (సృష్టికిపూర్వము) ఏకమేవ = నామరూపవిభాగము లేకపోవుటచే నొక్కటియేయై సత్తుగా, ఆసీత్ = ఉండెను. కారణమగు బ్రహ్మము సర్వశక్తి గల దగుటంజేసి వేఱొక్క నియామకుని సహాయము నపేక్షించునదికాదని "అద్వితీయం" అనుపదము తెలుపుచున్నది. కావున ఈ వాక్యము కారణభూతమగు బ్రహ్మముకంటెను కార్యభూతమగు జగత్తువేఱయినదికాదని గదా ప్రతిపాదించుచున్నది.

అట్లే "తదైక్షత బహుస్యామ్ ప్రజాయాయేతి" (ఛా. ౬. ప్ర. ౨ఖ. 3వా) అనెడి శ్రుతివాక్యమును తెలుపుగున్నది. ఎట్లన, బ్రహ్మము తాను సృజింపఁబోవు తేజస్సు మొదలగు నానావిధవిచిత్ర స్థావరజంగమవిశిష్టమగు జగత్తుగా తన్ను అనేకమగునట్లు సంకల్పించి జగత్తును సృజించెనని యీవాక్యము తెలుపుటచే కార్యభూతమగు జగత్తు పరమకారణమగు పరబ్రహ్మముకంటెను వేఱయినది కాదని నిశ్చయింపఁబడుచున్నది.

సత్తనఁబడువాఁడును, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును, దోషరహితుఁడును నగు పరబ్రహ్మమే "సదేవేదం" అని యీపైని గనఁబఱచిన ప్రకారము జగత్తుతో నొక్కటిగాఁ జెప్పఁదగినదగుటయు, నామరూపవిభాగము లేకుండుటచే నొక్కటియగుటయు, వేఱొక్కనియామకుని సహాయమున పేక్షింపకుండుటయు,మరలనదియే విచిత్రమును,స్థావరజంగమవిశిష్టమునునగు జగత్తుగా ననేకము కావలయుననెడి సంకల్పరూపమగు ఈక్షణము గలదియగుటయు, అట్టి సంకల్పప్రకారము సృజించుటయు నిదియంతయు నెట్లు సంభమని శంకించి, ఛందోగులు "సేయం దేవతైక్షత హన్తాహ మిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణి" (ఛా. ౬. ప్ర. 3ఖ. ౨.వా) (ఈదేవత ధ్యానించి నేను పృథివ్యప్తేజస్సులలోఁ జీవశరీరుఁడుగాఁ బ్రవేశించి నామరూపములను గలుగఁజేసి వానిలో నొక్కొక్కటిని మూఁడేసి మూఁడేసి గాను అనఁగా [1]త్రివృత్కరణమును చేయుదునని తలంచెను) అని పఠించుచున్నారు. ఈవాక్యము "తిస్రో దేవతాః" (తేజ

1. మొదటి సంపుటమున ౨౧౬-వ పత్రమునందందలి ౧-వ వివరణమును చూడుము.

స్సు, ఉదకములు పృథివి) అనుటచే ఈ సమస్తమగు అచిత్పదార్థ సమూహమును నిర్దేశించి పరబ్రహ్మము జీవాంతరాత్మగాఁ దీనిలోఁ బ్రవేశించి దీనినంతయును నానావిధములగు నామరూపములుగల దానినిగాఁ జేయుటకై సంకల్పించెనని చెప్పుచున్నది "అనేన జీవేనాత్మనా" అనఁగా "నన్ను ఆత్మగాఁగల జీవునితోఁ దీనిలోనాత్మగాఁ బ్రవేశించి దీనిని నంతయును నామరూపములుగల దానినిగాఁ జేయుచున్నానని యర్థము. ఆత్మగాఁ దన్నుఁగలిగియున్న జీవుఁడు ఈయచేతన పదార్థజాతములోనంతట యాత్మగాఁ బ్రవేశించి దానిని నామరూపములుగల దానినిగాఁ జేసెననుట. "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్ తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" (తై. ఆ. ౬. అను ౨ వా) అనెడి వేఱొక శ్రుతివాక్యము సయితము "దానిని సృజించి దానిలోఁ బ్రవేశించి చేతనముగాను అచేతనముగాను నాయెను" అనుటచే ఈయంశమునే — జీవునితోఁగూడియున్నట్టి యీ జగమంతయును పరబ్రహ్మముచే నాత్మగాఁ బ్రవేశింపఁబడియెననెడియంశమునే—స్పష్టపఱచుచున్నది. కార్యావస్థయందును కారణావస్థయందును నుండునదియగు ఈ చిదచిత్పదార్థజాతమంతయును అనఁగా స్థూలమైనదిగానుగాని సూక్ష్మమైనదిగానుగాని యుండునట్టి యిది యంతయును పరబ్రాహ్మముకు శరీరభూతమైనది యనియు, పరబ్రహ్మము దానికంతకును నాత్మయనియును అంతర్యామిబ్రాహ్మణము మొదలగు తావుల ప్రతిపాదింపఁబడినవిషయమే యిచటఁ గాన్పింపఁబడినది. కావున పూర్వము గానఁబఱచిన యాక్షేపము నిరసింపఁ బడినదగుచున్నది.

ఈ పైని గనఁబఱచిన ప్రకారము జీవునితోఁ జేరియున్నట్టి యచిత్పదార్థములోఁ బరబ్రహ్మము అంతరాత్మగానుండఁగా నామరూపములనుస్పష్ట పఱచుట మొదలగునవి చెప్పియున్నందుచే పరబ్రహ్మమే చేతనా చేతనశరీరము. అందువలననది జగత్తనంబడునదని సిద్ధమగుచున్నది. కావున "సదేవ సోమ్యేద మగ్రఆసీత్" ఈమొదలగు శ్రుతులు బ్రహ్మమును జగత్తుగా నిర్దేశించుట యుపపన్నము. సమస్తములగు మార్పులును, దోషములును శరీరభూతములగు చేతనా చేతన పదార్థములందుండునవిగాన, బ్రహ్మము దోషము లేనియును లేనిదియనియు కల్యాణములకాకర మనియు ననెడి యీ యంశమునకేమియు బాధ లేదు. సూత్రకారులే " అధికంతు భేదనిర్దేశాత్ " అనెడిసూత్రమున ఈ విషయమును గుఱించి యిఁకమీఁద చెప్పఁబోవుచున్నారు.

అట్లే "ఐతదాత్మ్యమిదం సర్వం" (ఛా. ౬. ప్ర. ౮. ఖ. ౭. వా) అను శ్రుతివాక్యమునను చేతనా చేతన విశిష్టమగు ఈ సమస్తప్రపంచమునకు బ్రహ్మముతో తాదాత్మ్యము ఉపదేశింపఁబడియె. అట్టియుపదేశమునే "తత్త్వమసి" అనుశ్రుతివాక్యము ముగింపుచున్నది.

అట్లే ప్రకరణాన్తరములయందును నుండునట్టి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనియు, "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత ఇదం సర్వం విదితం" అనియు "ఇదం సర్వం యదయమాత్మా" అనియు "బ్రహ్మైవేదం సర్వం" అనియు "ఆత్మైవేదం సర్వం" అనియు నీమొదలగు శ్రుతివాక్యముల యందును జగద్బ్రహ్మములు వేఱయినవి కావని తెలుపఁబడియె.

కనుకనే మఱికొన్నితావుల అనఁగా "సర్వం తంపరాదద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేద" అనియు "నేహ నానాస్తి కిఞ్చన మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అనియు నీతావుల జగత్తు బ్రహ్మముకంటెను వేఱయినదగుట నిషేధింపఁబడియె.

అట్లే "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" (బృ. ౬. అ. ౫. బ్రా. ౧౫. వా) అనెడిశ్రుతివాక్యము "విద్వాంసుఁడు సర్వమును బ్రహ్మముకంటెను వేఱుకానిదానినిఁగాఁ జూచువాఁడనియును, మూర్ఖుఁడు సర్వమును బ్రహ్మముకంటెను వేఱయిన దానినిగాఁ జూచువాఁడనియును" చెప్పుటచే, "వేఱుకానిదిగా నుండుటయే తత్త్వము" అని ప్రతిపాదించుచున్నది.

ఇట్లు "వాచారమ్భణం వికారో నామధేయం" ఇత్యాది శ్రుతివాక్యములు పరమకారణమగు పరబ్రహ్మముకంటెను ప్రపంచము వేఱయినది కాదని యుపపాదించుచున్నవి. ఇందు తత్త్వమేమన్నను, చేతనా చేతన పదార్థములు శరీరముగాగలదగుటంజేసి యా పదార్థములు విశేషములుగాఁగల బ్రహ్మమే ఎల్లప్పుడును అన్ని శబ్దములచేతను తెలుపఁబడునది, అట్టిబ్రహ్మ మొకప్పుడు తనశరీరమని యిట్లు వేఱుగాఁ నిర్దేశించుటకర్హములుకానంత సూక్ష్మములుగానుండు చేతనా చేతన పదార్థములు శరీరముగాఁ గలది. అట్టిసమయమున నది కారణావస్థలో నుండు బ్రహ్మమనఁబడును. వేఱొకప్పుడు నామరూపవిభాగముగలవై వ్యవహారార్హములగునంత స్థూలములుగానుండు చేతనాచేతనపదార్థములు శరీర

ముగాఁ గలదియగును. అప్పుడది కార్యావస్థలోనుండు బ్రహ్మ మనఁబడును. కావున కారణభూతమగు పరబ్రహ్మముకంటెను కార్యభూతమగు ప్రపంచము వేఱయినది కాదు. ఇట్లు శరీరభూతములగు చేతనా చేతన పదార్థములకును శరీరియగు పరబ్రహ్మమునకును కారణావస్థయందుగాని కార్యావస్థయందుగాని వాని స్వభావముల కొక వ్యవస్థగలదని యనేక శ్రుతులయందు చెప్పియున్నందున, వానికి గుణదోషవ్యవస్థయును కలదని "నతు దృష్టాన్తభావాత్" అను సూత్రమునఁ జెప్పఁబడియె.

అద్వైతమత విమర్శనము.

అద్వైతులు కార్యపదార్థజాతమంతయును మిథ్యయని యంగీకరించి కార్యకారణపదార్థముల కభేదమును వర్ణించుచున్నారు. కాని, వారిమతప్రకారము కార్యకారణపదార్థముల కభేదము సిద్ధింపనే సిద్ధింపదు. ఏలననిన, సత్యాసత్యపదార్థములకు ఐక్యము అనఁగా సత్యమగు బ్రహ్మమును అసత్యమగు ప్రపంచమును నొక్కటియే యగుటయెట్లు సంభవము? అసంభవము. అట్లగుపక్షమున, బ్రహ్మమే మిథ్యయనియనియు ప్రపంచమే సత్యమనియైనను ప్రసక్తింపవచ్చును.

భాస్కరమత విమర్శనము.

[1] భాస్కరమతస్థులు కార్యపదార్థము సయితము సత్యమేయని యంగీకరించుచునే జీవబ్రహ్మములు ఉపాధివశమున వేఱయినవారనియు, స్వాభావికముగా వేఱుకారనియు, అచిద్బ్రహ్మములు వేఱగుటయు వేఱుకాకపోవుటయును స్వాభావికమనియును చెప్పుచున్నారు. అయితే వారిమతప్రకారము ఉపాధికంటెను బ్రహ్మముకంటెనున్ను వేఱయినది మఱియొక్కటేదియు లేకపోవుటంజేసి, నిరవయవమును, అఖండమును నగు బ్రహ్మమే యుపాధిసంబంధము గలది కావలయును. అందువలన నట్టి బ్రహ్మస్వరూపమే హేయపదార్థములుగాఁ బరిణమింపవలయును. ఒకవేళ వారు బ్రహ్మముయొక్క శక్తిమాత్రమే అట్లు పరిణమించునది యందురేమో? అయితే శక్తియును బ్రహ్మముకంటెను వేఱయినది కాదు గదా! కావున జీవుఁడు కర్మవశ్యుఁడనియు, బ్రహ్మమన్ననో అపహతపాప్మండనియు నిట్లు జీవబ్రహ్మములకుఁగల యొకవ్యవస్థను తెలుపునట్టివియు, అచిత్పదార్థము మార్పును పొందునదనియు బ్రహ్మమన్ననో మార్పును పొందనిదనియు నిట్లు అచేతన పదార్థమునకును బ్రహ్మమునకును గల యొక వ్యవస్థను తెలుపుచునవియును నగు శ్రుతులతో విరోధము సంభవించును.

---

1. మొదటి సంపుటము ౪౪-వ పత్రమునందు ౧-వ వివరణమును చూడుము.

[4]యాదవప్రకాశమతస్థు లిట్లు చెప్పుచున్నారు. సమస్తములగు భోక్తృత్వాది వికల్పరూపములగు వికారములేవియును లేనిదియు, సర్వశక్తిగలదియు, సన్మాత్రమనఁబడు పదార్థమే కారణభూతమగు బ్రహ్మము. అది ప్రళయకాలమున సుఖదుఃఖాను భవవిశేషములన్నియు నడిగినదై, స్వయంప్రకాశమైనదియైనప్పటికిని, సుషుప్తిలోనుండు జీవునివలె నచిత్పదార్థముగాఁ నుండునది యగును. సృష్టికాలమున నాబ్రహ్మము, మృత్తిక ఘటశరావాదిరూపముగా నగునట్లును, సముద్రము ఫేనతరంగబుద్బుదాదిరూపముగా నగునట్లును, భోక్తగాను (జీవుఁడుగాను) భోగ్యపదార్థముగాను (అచేతనపదార్థముగాను) నియామకుఁడుగాను (ఈశ్వరుఁడుగాను) నిట్లు అంశత్రయరూపమగు నాకారము గలదియగును. కావున భోక్తృత్వము, భోగ్యము, నియన్తృత్వము అనఁబడునవియును వానిఁబట్టి గలుగు గుణదోషములును, శరావత్వ, ఘటత్వ, మణికత్వముల వలెను వానికిఁ గల కార్యభేదముల వలెనును అంతట వ్యాపించియుండునవి. ఘటము, శరావము, మణికము మొదలగునవి మృదాత్మకము లగుటంజేసి కారణపదార్థమగు మృత్తికతో నభిన్నములగునట్లు, భోక్త, భోగ్యము, నియామకుఁడను నవియన్నియును సత్స్వరూపమే యగుటంజేసి కారణభూతమగు బ్రహ్మముతో నభిన్నములగుట సంభవము. కావున సన్మాత్రమే యీ సమస్తములగు ఆకారములను కలిగియుండునది. కావున, జగత్తు బ్రహ్మము కంటెను వేఱయినదికాదని యంగీకరించుచున్నారు.

యాదవప్రకాశ మతోపన్యాసము.

---

4. పరిణామ వాదము కలది యాదవప్రకాశమతము. సన్మాత్ర స్వరూపంబైన బ్రహ్మమే చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు అను మూఁడు విధములుగాఁ బరిణమించును. చిత్తనఁగా జీవుఁడు అఁచిత్తనఁగా అచేతనమైన దేహేంద్రి యాదికము. ఈశ్వరుఁడనఁగా సర్వనియంతయైన పరమచేతనుఁడు. ఇందు చిత్తులకును బ్రహ్మమునకును భేదము శంకరమతమునఁబోలె మాయారూపమిథ్యోపాధి ప్రయుక్తమైనదికాఁదు. భాస్కర మతమునఁ బోలె దేహాదిరూపసత్యోపాధి ప్రయుక్తమైనదియునుగాదు. బ్రహ్మపరిణామములే చిత్తులుగనుక నీరెంటికిని భేదమునుఅభేదమును భాస్కరమతమునంధలి యచిత్బ్రహ్మముల కుంబోలె స్వాభావికములు. బ్రహ్మము తనక భిన్నములైనవానిని భిన్నములుగా భ్రమించుటే సంసారము. ఇది జ్ఞానకర్మ సముచ్చయముచేతనే అనఁగా "విద్యాఞ్చావిద్యాఞ్చ యస్తద్వేదోభయం సహ అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే" అన్నట్లు కర్మముచే సంసారనివృత్తియు జ్ఞానముచే బ్రహ్మముతో నైకీభావము ప్రాప్తించుటయును గలుగును. ఇవి రెండు నిందు మోక్షము లనఁబడును. భాస్కరమతమున జ్ఞానకర్మములం గాంగీభావము గలవైసంసారనివృత్తి పూర్వక బ్రహ్మప్రాప్తిని గలిగించును. ఇంధెట్టి భావములేక యీరెండు వేఱువేఱసంసారనివృత్తిని బ్రహ్మ ప్రాప్తిని గలిగించునని తెలియునది. ఇది బ్రహ్మపరిణామమువలన జగత్తును నిరూపించుటచే పరిణామియగును.

అయితే వీరు చెప్పునదంతయును శ్రుతులకును, స్మృతులకును, ఇతిహాస ములకును, పురాణములకును, యుక్తులకును విరుద్ధమైనది. ఏలననిన, సమస్తము లగు శ్రుతులును, స్మృతులును, ఇతిహాసములును, పురాణ ములును ఇవియన్నియును సమస్తమైనపాలకులకును ఈశ్వరుఁడును ఎప్పుడును సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, సత్యసంకల్పుఁడును, పాపరహితుఁడును, దేశపరిచ్ఛేదముగాని కాలపరిచ్ఛేదముగాని లేనివాఁడును, మితిలేనిదియు అంతను మించినదేదియును లేనట్టియానందముగలవాఁడును, పరమకారణమును నగుబ్రహ్మమును ప్రతిపాదించుచున్నవే గాని అట్టి యీశ్వరుని కంటెను వేఱయినదియు, అట్టి యీశ్వరుని తన యంశముగా గలిగియుండున దియునునగు సన్మాత్రమును ప్రతిపాదించుచుండ లేదు. ఎట్లన,

యాదవప్రకాశ మతవిమర్శనము.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమే వాద్వితీయం"(ఛా. ౬. ప్ర ౧ఖ ౧వా) అనియు, "తదైక్షత బహుస్స్యామ్ ప్రజాయాయేతి" (ఛా. ౬.ప్ర. ౧ఖ ౩వా) అనియు "బ్రహ్మవా ఇద మగ్ర ఆసీదేకమేవ తదేకంసన్నవ్యభవత్ తచ్ఛ్రేయోరూపమత్య సృజత క్షత్రం యాన్యేతాని దేవక్షత్రాణీన్ద్రో వరుణ స్సోమో రుద్రః పర్జ న్యో యమో మృత్యు రీశానః" (బృ. ౩. అ. ౪. బ్రా. ౧౧ వా) (మొట్టమొదట బ్రహ్మ మొక్కటియే యుండెను. ఒక్కటియే యైనందున నది సమర్థమైనది గాక పోయెను. అందువలన నది దేవతులలో క్షత్రియులనఁబడు ఇంద్రుఁడు వరుణుఁడు, సోముఁడు, రుద్రుఁడు, పర్జన్యుఁడు, యముఁడు, మృత్యువు, ఈశానుఁడు అను వారలను సృజించెను) అనియు "ఆత్మావాఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కిఞ్చన మిషత్ స ఐక్షత లోకాన్ను సృజా ఇతి" (ఐ ౧ ౧. ౧) (ఈ పరిదృశ్యమానమగు ప్రపంచమంతయును ఒక్కటియగు పరమాత్మగానేయుండెను. తక్కిన దేదియును లేకుండెను. అట్టి పరమాత్మ లోకములను సృజింపఁదలంచెను) అనియు "ఏకోహవై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానో నేమే ద్యావాపృథివీ న నక్షత్రాణి నాపో నాగ్ని ర్నసోమో న సూర్యః స ఏకాకీ న రమేత తస్య ధ్యానస్థస్య" (మహో. ౧. ౧.) (నారాయణుఁడొక్కఁడే యుండెను. చతుర్ముఖ బ్రహ్మమును, ఈశానుఁడును, ఈ భూమ్యంతరిక్షములును, నక్షత్ర ములును, ఉదకమును, అగ్నియు, చంద్రుఁడును, సూర్యుఁడును వీ రెవ్వరును లేరు. అతఁడొక్కఁడై నందున సంతోషముగా నుండకపోయెను. అంతట నతఁడు ధ్యానస్థుఁడాయెను) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములవలన పరమ

కారణము సర్వేశ్వరుఁడగు నారయణుఁడే యని తెలియవచ్చుచున్నది. ఈపైశ్రుతులయందు "సత్" అనియు, "బ్రహ్మ" అనియు "ఆత్మ" అనియు నీమొదలగునవి సమానప్రకరణమునఁ బ్రయోగింపఁబడినవై సమానప్రకరణముననుండు నారాయణశబ్దముతో విశేషణ విశేష్యభావసంబంధముగలవై నారాయణునే తెలుపునవి.

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" (శ్వే. ౬. అ. ౭వా.) అనియు "స కారణంకరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా నచాధిపః" (శ్వే. ౬. అ. ౯వా.) అనియు నీ మొదలగు శ్రుతివ్యాములు ఈశ్వరుఁడే జగత్కారణమని తెలుపుచున్నవి.

మనుస్మృతియును "తత స్స్వయంభూ ర్భగవాన్" (మను ౧. అ. ౬.) అని యారంభించి "సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్ సిసృక్షుర్వివిధాః ప్రజాః అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమపాసృజత్" (మను. ౧. ౮.) అని యిట్లు భగవంతుఁడే జగత్కారణమని తెలుపుచున్నది.

"నారాయణో జగన్మూర్తి: అనన్తాత్మా సనాతనః। స సిసృక్షు స్సహస్రాంశాద సృజత్పుసర్షాన్ ద్విథా" (భా. శా. మో. ౮. అ. ౧౨ శ్లో) అనఁగా జగచ్ఛరీరుఁడును, అనన్తుఁడును, సనాతనుఁడునునగు నారాయణుఁడు తనయొక్క సహస్రాంశమునవలన జగత్తును సృజింపఁదలఁచి రెండువిధములగు ప్రజలను సృజించెను అనియు, "విష్ణోస్సకాశాదుద్భూతం జగత్తత్రైవచ స్థితం (వి. ౧. అం. ౧. అ ౩౧. శ్లో) అనియు నీమొదలగు ఇతిహాసపురాణములును పురుషోత్తమునే పరమకారణమునుగాఁ దెలుపుచున్నవి.

అట్టి యీశ్వరుఁడు సత్తామాత్రమని చెప్పుట యశక్యము. ఏలననిన, ఈశ్వరుఁడు అట్టి సత్తను తనయంశమునుగాఁగలిగియుండువాఁడు గదా! సర్వేశ్వరుఁడు ఆనందాద్యనంత కల్యాణగుణములను గలిగియుండుట కాదాచిత్కమనియును చెప్పఁదగదు. ఏలననిన, అవి యతనికి స్వాభావసిద్ధములగుటంజేసి నిత్యములు. అట్లే గదా "పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ" అనియు, "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అనియు నీమొదలగుశ్రుతివాక్యములు తెలుపుచున్నవి. అయితే జ్ఞానానందాదిశక్తులతో నంబంధము మాత్రమే యతనికి స్వాభావికమని చెప్పఁదగదు. ఏలననిన, శక్తిస్వాభావికము అనియు జ్ఞానబల క్రియలును స్వాభావికములు అని యిట్లు వేఱువేఱుగా శ్రుతియందు నిర్దేశింపఁ

బడుటవలనను, లక్షణప్రసక్తించుటవలనను అట్లుచెప్పఁదగదు. పాచకాదిశబ్దముల వలెనే "సర్వజ్ఞః" మొదలగు శబ్దములయందుండు కృత్ప్రత్యయము శక్తిని మాత్రము తెలుపునదియని చెప్పుట యశక్యము. కేవలము కృత్ప్రత్యయము శక్తిని తెలునదియని యెచటను చెప్పియుండలేదు. "శక్తా హస్తికవాటయోః" అను నీమొదలగు తావుల కొన్నిశబ్దములయందుండు కృత్ప్రత్యయము మాత్రమే గదా శక్తివాచకముగాఁ దెలుపఁబడియె. పాచకాదిశబ్దముల విషయమైయున్ననూ, వేఱొక విధముగా నర్థము పొసగనందున లక్షణయే యవలంబింపఁబడుచున్నది.

ఈశ్వరుఁడు సత్తయనఁబడుదాని యంశమును, సత్తనయనఁడునది యంశియునునగుపక్షమున, తరగముకంటెను సముద్రము ఎక్కువ పరిమాణముగలది యగు చందమున అంశమగు ఈశ్వరుని కంటెను అంశియగు సన్మాత్రము గొప్పది యని ప్రసక్తించును. అట్లగుపక్షమున, "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" అనియు "న తత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" అనియు నిట్లు సర్వేశ్వరవిషయములగు అనేక శ్రుతివాక్యములు విరోధించును. ఇంతియె కాక, సన్మాత్రమే సర్వాత్మకమును, అంగియును నగు పక్షమున, సర్వేశ్వరుఁడు అట్టి సన్మాత్రమునకంశమగును. అట్లగునేని, సర్వేశ్వరుఁడు సరాత్మకుఁడనియు అంశియనియును చెప్పునట్టివాక్యములు బాధించును. ఘటశరావాదులు(వానికంటెనుచిన్నవియగు) మణికలనఁబడు మృణ్మయపాత్రములలో నుండునవిగాఁగాని, వాని యంశములుగాఁగాని కాఁదగవు గదా ఉల్లే. అయితే సన్మాత్రము తన యంశములలో నన్నింటిలోనును సంపూర్ణముగానుండుటచే నది తన యంశమగు ఈశ్వరుని యందును సంపూర్ణముగానుండును. కావున ఇతరవస్తువులట్టి యీశ్వరాంశములుగాను ఈశ్వరాత్మకములుగానును కాఁదగునంటివేని, ఘటమునను సన్మాత్రము సంపూర్ణముగానున్నదిగాన,ఈశ్వరుఁడట్టి ఘటముయొక్క యంశమనియు, తదాత్మకుఁడనియును ప్రసక్తించును. ఇంతియెకాక, "ఘటము కలదు" అనియు "వస్త్రముకలదు" అనియునివ్విధమగువ్యవహారమునుబట్టిఘటపటాదిపదార్థముల ధర్మముగాఁ దెలియవచ్చునట్టి సన్మాత్రమనఁబడునది తాను స్వయముగా నొక్కద్రవ్యముగాఁగాని ఒక్కదానిని గలుగఁజేయునదిగాఁ గాని యగుట యసంభ

---

(*a*) "జ్ఞాన బలక్రియాచ" అనుతావున జ్ఞానశబ్దము జ్ఞానమనఁబడు గుణమును దెలుపునది. అట్లుకాక, అది శక్తిని తెలుపునది యంటివేని, దాని.వాచ్యార్థమును వదలుకొని లక్షణార్థమునంగీకరింపవలసి వచ్చునని భావము.

వము ఏలననిన, వ్యవహారయోగ్యమైనదగుటను గదా "సత్యము" అందురు. అట్టిదిఅందులకు విరుద్ధమైన వ్యవహారమునకుఁ దగినదగుటను గదా "అసత్యము" అందురు. ద్రవ్యమే సత్తని యంగీకరించు పక్షమున, తదితరములయినందున క్రియాదులు అసత్తని ప్రసక్తించును. ఒకవేళ క్రియాదులు సత్తగుట వానికి ద్రవ్యముతోఁగల సంబంధమునుబట్టి యుండునది యంటివేని, అన్నితావులను సత్తయనఁబడుది యేకరూపమైనదని యుపపాదించుట దుర్లభమగును. అంత యును సన్మాత్రాకారమగుటంజేసి అందొక్కటి వేఱొక్కటి కంటెను వేఱగుట లేనేలేదంటివేని, యది సర్వజ్ఞమైనందున దానికి అన్నింటి యొక్కయును అన్ని స్వభావములను గుఱించిన యనుభవమును గలుగవలసివచ్చును. అందుమూలముగ గుణదోషసంకరము ప్రసక్తించునని యింతకు పూర్వమే గానఁబఱచి యున్నాము. కాఁబట్టిజగద్బ్రహ్మములకుఁగల యభేదము మేమింతకు పూర్వము గానఁబఱచిన ప్రకారమే యైనదని యెఱుంగునది.

అవతారిక :—"దేవదత్తుఁడు బాలుఁడు, తరుణుఁడు" ఈ మొదలగు తావులను ఒక్కటియే వస్తువు భిన్నభిన్న అవస్థలను పొందుటను బట్టి భిన్నభిన్నవస్తువులుగాఁ దెలియవచ్చుటయు భిన్నభిన్ననామములచే బిలువఁబడుటయును సంభవములుగాను దెలసికొనుచున్నాము. అయితే మృత్తిక, దారువు, సువర్ణము, మొదలగునవియును స్వయముగ భిన్నభిన్నపదార్థములైనను భిన్నభిన్నజ్ఞానములును భిన్నభిన్నపేరులును గలవిగాను గన్పట్టుచున్నవే? ఇట్లుండ, మృత్తిక, ఘటము ఈ మొదలగు కార్యకారణ పదార్థముల విషయమై భిన్నభిన్నజ్ఞానములును భిన్నభిన్నపేరులును అయాయవస్థలను బట్టియే గలుగునవి యని యెట్లు నిర్ణయింపఁదగునని శంకింపఁగా, నందులకు సమాధానము చెప్పుటకై :—

## ౧౬. భా వే చో ప ల బ్ధేః.

టీ॥ భావేచ=కార్యపదార్థము యొక్క యునికియందు ఉపలబ్ధేః = కారణపదార్థము గానఁబడుచున్నందున కార్యకారణముల కనన్యత్వము సిద్ధమగుచున్నది.

తా॥ కుండలాదికార్యపదార్థము యొక్క యునికియందు సువర్ణాది కారణపదార్థము గన్పట్టుచున్నందున, కారణముకంటెను కార్యము వేఱుకానిదిగాఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ కుండలాదికార్యపదార్థమునందు కారణభూతమగు హిర ణ్యము తెలియవచ్చుచున్నది అనఁగా "ఈ కుండలము హిరణ్యము" అని యిట్లు హిరణ్యము గుర్తింపఁబడుచున్నది. కావున, కారణముకంటెను కార్యము వేఱుకాదు. అయితే మృత్తికమొదలగునవి యున్ననూ, హిరణ్యము మొదలగు ద్రవ్యాంతరములయందు అవ్విధముగాఁ దెలియబడుచుండలేదు. కావున దేవ దత్తుఁడొక్కఁడే యవస్థాభేదమునుబట్టి బాలుఁడనియు, తరుణుఁడనియు నివ్విధ ముగాఁ బిలువఁబడునట్లు కారణభూతమగుద్రవ్యమే వేఱొక్క యాకారమును పొందినదై కార్యముగాఁ బిలువఁబడుచున్నది. కారణపదార్థముకంటెను కార్యప దార్థమువేఱయినదను వైశేషికులచేతను అంగీకరింపఁబడునట్టి యవస్థాన్తరము మూలముగా వేఱొక వస్తువుగాఁ దెలియవచ్చుటయు, వేఱొక పేరుగలదియగు టయును సంభవములగుచుండ, తెలియరానిదియును కార్యమనఁబడు వేఱొక్క ద్రవ్యమును కల్పించుట యనుపపన్నము.

కుండలమునందు హిరణ్యమనెడి ప్రత్యభిజ్ఞ జాతినిబట్టి గలుగునది యని చెప్పఁదగదు. అట్టి జాతికి యాశ్రయమగునట్టి వేఱొక్క పదార్థముగానఁ బడు చుండలేదు కదా! సువర్ణము యొక్కజాతిలోఁ జేరినట్టి యొక్కటియే పదార్థము గదా కార్యముగాను కారణముగానును అనఁగా ఈరెండుఅవస్థలుకలది గాను గన్పట్టుచున్నది. పదార్థములు భిన్నభిన్నములయినను సమవాయి కారణము అనువర్తించుచున్నందున కార్యమునందుకారణము తెలియ వచ్చుట సంభవమని చెప్పఁదగదు. ఏలననిన, పదార్థములు వేఱయినవగు పక్షమున, వాని యాశ్రయము అనువర్తించు చున్నంతమాత్రముచే ఒక్క పదార్థము దాని యాశ్రయమునందుండునట్టి వేఱొక్క పదార్థమునందుఁదెలియ వచ్చుట యసంభవము. అయితే గోమయము మొదలగు కారణపదార్థము నుండి గలుగునట్టి వేడపురుగు మొదలగు కార్యపదార్థమునందట్టి గోమయము మొదలగునది తెలియవచ్చుచుండలేదే? అని శంకించెదవేమో? అట్లు శకింపఁ దగదు. ఆతావునను అన్నిపదార్థములకును ఆదికారణమగు పృథివియనఁబడు ద్రవ్యము తెలియ వచ్చుచునే యున్నది గదా! అగ్నివలనఁ గలుగునట్టిది యగు దూమమునందు అగ్ని తెలియవచ్చుచుండ లేదంటివేని, వాస్తవమే. అగ్ని తెలియవచ్చుచుండ లేదు. అయినను దోషమేమియును లేదు. ఏల ననిన, ఆ తావున అగ్ని నిమిత్తకారణము మాత్రమే కదా! అగ్ని సంబంధముగల

తడికట్టెల వలనఁగదా ధూమము గలుగుచున్నది. ఆ కట్టెలయొక్కయు, ధూమముయొక్కయును వాసనయును ఒక్కవిధమైనదియే యగుటంజేసి తడి కట్టెలనుండియే ధూమము గలుగుచున్నదని నిశ్చయింపఁబడుచున్నది.

కావున కార్యపదార్థమునందు "అదియే ఇది" అని యిట్లు కారణపదార్థము తెలియవచ్చుచున్నది. కాఁబట్టి వేఱయినదిగాఁ దెలియవచ్చుటయు, వేఱుపేరుచేఁ బిలువఁబడుటయును అవస్థాభేదమునుబట్టి మాత్రము గలుగునవి యని తెలియఁదగును. అందువలన కారణముకంటెను కార్యము వేఱయినది కాదు.

అవతారిక:—ఈ క్రిందగాన్పింపఁబడు హేతువువలనను,

౧౭॥ సూ॥ స త్త్వా చ్చా వ ర స్య

టీ॥ అవరస్య=కార్యపదార్థము, సత్త్వాచ్చ కారణపదార్థమున నుండుటను బట్టియును.

తా॥ కార్యపదార్థము కారణపదార్థమునందుండుటను బట్టియును కారణముకంటెను కార్యము వేఱుపదార్థము కాదు.

శ్రీ॥ భా॥ కార్యపదార్థము కారణపదార్థమునందుండుట వలననున్ను కారణముకంటెను కార్యము వేఱయినది కాదు. లోకమునను, శాస్త్రమునను, కార్యమే గదా కారణముగా నిర్దేశింపఁబడుచున్నది. ఎట్లనిన, ఘటశరావాదికార్యపదార్థములనుచూచి "ఇవియన్నియును ప్రొద్దుటిపూట మృత్తికగానుండెను" అని గదా మనము చెప్పుదుము. శాస్త్రమునను, "సదేవేదమగ్ర ఆసీత్" అనగా ఈ పరిదృశ్యమానమగు జగత్తు సృష్టికి పూర్వము సత్తుగా (బ్రహ్మముగా) నుండెనని గదా చెప్పఁబడుచున్నది.

౧౮॥ సూ॥ అసద్వ్యపదేశాదితిచేన్న ధర్మాన్తరేణ వాక్యశేషాద్యుక్తే శ్శబ్దాన్తరాచ్చ.

టీ॥ అసద్వ్యపదేశాత్ = సృష్టికి పూర్వము కార్యపదార్థము అసత్తుగాఁ జెప్పఁబడినందున నది కారణపదార్థమున లేనట్టిది, ఇతిచేత్ = ఇట్లంటివేని, న=అదిసరికాదు. ఏలననఁగా, వాక్యశేషాత్ = ఉత్తరవాక్యమువలనను, యుక్తేః = యుక్తివలనను, శబ్దాన్తరాచ్చ=శ్రుత్యన్తరమువలననున్ను, ధర్మాన్తరేణ = అకారాన్తరముతోఁ గూడియున్నట్టిదిగాఁ దెలియవచ్చుటవలన,

తా॥ సృష్టికి పూర్వము ఈజగత్తు అసత్తుగానుండెనని "అసదేవేదమగ్ర ఆసీత్" ఇత్యాది శ్రుతియందు చెప్పియున్నందున, కారణపదార్థమున కార్యపదార్థము గలదని చెప్పఁదగదంటివేని, యది సరికాదు. ఆకారాన్తరమునుబట్టి యట్లు చెప్పఁబడియెను. ఉత్తరవాక్యమువలనను, యుక్తివలనను, శ్రుత్యన్తరమువలననున్ను ఇట్లు విశదమగుచున్నది.

శ్రీ॥ భా॥ మరల వైశేషికులిట్లాక్షేపించుచున్నారు.

## ఆ క్షే ప ము.

వైశేషికుఁడు :— కారణపదార్థము కార్యపదార్థమునందున్నట్లు లోకానుభవమువలనను, శాస్త్రమువలనను న్ను సిద్ధమగుచున్నదని చెప్పినది యుక్తముకాదు. ఏలననిన, "అసదేవేదమగ్ర ఆసీత్" (ఛా. ౬. ప్ర. ౨ఖ. ౧ వా) (ఈపరిదృశ్యమానమగు ప్రపంచము సృష్టికి పూర్వము అసత్తుగానుండెను) అనియు, "అసద్వా ఇదమగ్ర ఆసీత్" (శత. ౬. ౧. ౧) (సృష్టికి పూర్వమిది యసత్తుగా నుండెను.) అనియు, "ఇదం వా అగ్రే నైవ కిఞ్చనాసీత్" (అష్ట. ౨. ప్ర. ౮. అను) (సృష్టికి పూర్వము ఈ ప్రపంచమేదియు నుండియుండలేదు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు సృష్టికి పూర్వమీ ప్రపంచమంతయును అసత్తుగానుండెనని గదా చెప్పుచున్నవి. లోకమునను అపరాహ్ణకాలమున ఘటశరావాది పదార్థములనుచూచి ఇవి పూర్వాహ్ణమున లేకుండెనని గదా మనము చెప్పుదుము. కావున ఇంతకుముందు ప్రతిపాదించిన ప్రకారము కారణపదార్థమున కార్యపదార్థముండియుండుట సంభవము కాదు.

## స మా ధా న ము.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఆకారభేదమునుబట్టి శ్రుతులయందట్లు నిర్దేశింపఁబడియె. కార్యపదార్థము ఉత్పత్తికి పూర్వము ఆకారాంతరము గలదగుటనుబట్టి అసత్తనియిట్లు శ్రుతియందు నిర్దేశింపఁబడియెను గాని, మీరు చెప్పునట్లు, అదిబొత్తుగా లేనిదియగుటంజేసి యట్లు నిర్దేశింపఁబడలేదు. సత్తుగా నుండుటయు అసత్తుగానుండుటయును నేదైన నొక్కపదార్థముయొక్క ఆకారభేదములని గదా యింతకు పూర్వము చెప్పఁబడెను. అందుసత్తనంబడు ఆకారముకంటెను వేఱగు ఆకారముగలదియగుట అసత్తనఁబడును. ఈపైశ్రుతియందు "ఇదం=ఇది" అనెడి శబ్దముచే నిర్దేశింపఁబడిన జగత్తుయొక్క

సత్తనంబడునట్టి యాకారము నామరూపములు. అందువలన అసత్తనంబడు నట్టి యాకారము దానికి విరుద్ధమగు సూక్ష్మావస్థ. కావున నామరూపముల తోఁ గూడియున్నట్టి జగత్తు సత్తనంబడునది. అందులకు విరుద్ధమగు సూక్ష్మా వస్థగలజగత్తు అసత్తనంబడునది. కాఁబట్టి యీజగత్తు నామరూపములతోఁగూడి యుండుటకు విరుద్ధమగు సూక్ష్మావస్థగలదియగుటయే అసత్తనఁబడునది యని సిద్ధమగుచున్నది. ఇవ్విధమున నెట్లు తెలియఁదగునంటివేని, ఉత్తరవాక్యమువల నను, యుక్తివలనను, శ్రుత్యన్తరమువలననున్ను అట్లు తెలియఁబడును. ఎట్లనిన, "ఇదంవా అగ్రే నైవకిఞ్చనాసీత్" అనుతావున "తదసదేవసన్మనో కురుత స్యా మితి" అనఁగా "ఆయసత్తు జగత్తుగా నగుదునని తలంచెను" అనువాక్యశేష మున "ఆయసత్తునకు ఒక తలంపు గలదు" అని తెలుపఁబడియె. ఈ హేతు వునుబట్టి యసత్తనంబడునది బొత్తుగా లేనిది కాదని నిశ్చితమగుచున్నది. ఈ వాక్యము పైవాక్యముతో నేకార్థముగలదయినందున "అసదేవేదం" ఈమొద లగు తావుల అసచ్ఛబ్దముయొక్క యర్థము ఇట్టిదియేయని నిశ్చయింపఁబడు చున్నది.

యుక్తినిబట్టియును అసత్తనంబడునది వేఱొకయాకారవిశేషముగాఁ దెలియవచ్చుచున్నది. ఎట్లనిన, విపులమైన యడుగుతట్టు ఉదరము మొద లగువానిని గలిగియుండుటయే మృత్తికకు ఘటముకలదనెడి వ్యవహారమును గలుగఁజేయునది, అట్టి యాకారవిశేషమును గలిగియుండునది అందులకు విరుద్ధమగునట్టి యాకారవిశేషమును పొందునేని యది దానికి ఘటము లేదనెడి వ్యవహారమును గలుగఁజేయునది. కపాలముగానుండెడి యాకారము కుండగానుండెడి యాకారమునకు విరుద్ధమగుటచే నది ఘటములేదు అనఁగా ఘటరూపమగు నాకారము లేదనెడి వ్యవహారమును గలుగజేయుచున్నది. ఏల యనిన, దానికంటెను వేఱుగా ఘటాభావమనఁబడున దొక్కటియు, తెలియరా కున్నది గదా. అంతమాత్రముచేతనే ఘటము లేదనెడి వ్యవహారము సంభవ మగుటంజేసి యిట్టి యభావమనఁబడునది వేఱుగా నొక్కటి గలదని కల్పింపఁ దగదు.

అట్లే శ్రుత్యంతరమును బట్టియు అసత్తనఁగా నింతకుపూర్వము ఆకా రాంతరమును పొందినది యగుటయే యని విశదమగుచున్నది. శ్రుత్యంతర మును ఇంతకుపూర్వమే గానఁబఱచియున్నాము. అది "సదేవ సోమ్య దమగ్ర

ఆసీత్" ఈమొదలగు వాక్యమే. ఈతావున "కుతస్తుఖలు సోమ్యైవంస్యాత్" "ఓసౌమ్యుఁడా ఇట్లు ఏల నగును?" అనుటచే సృష్టికిపూర్వమీ జగమంతయును భొత్తుగ లేనిదిగా నెట్లు కాఁదగునని ఆక్షేపించి, తరువాత "సదేవేదమగ్రఆసీత్" అనఁగా సృష్టికిపూర్వము ఈజగంబు సత్తే (ఉన్నట్టిదే) అని స్థాపింపఁబడి యె. ఆసందర్భమున "తద్ధేదంతర్హ్యావ్యాకృత మాసీత్తన్నామ రూపాభ్యాం వ్యాక్రియత" అనఁగా జగత్తు సృష్టికి పూర్వము నామరూపములతో స్పష్టమైనది కానిదై సృష్టి సమయమున నది నామరూపములతో స్పష్టమైనదిగా నొనర్పఁబడె నని యిట్లు విశదముగానే తెలుపఁబడియెను.

అవతారిక:—కార్యపదార్థము కారణపదార్థముకంటెను వేఱయినది కాదను విషయమై రెండు దృష్టాంతముల నీక్రింది రెండు సూత్రములచేఁ గాన్పించుచున్నారు:—

౧౯॥ సూ॥ ప ట వ చ్చ

టీ॥ పటవచ్చ = వస్త్రమువలెను.

తా॥ తన్తువులు వస్త్రమగునట్లు బ్రహ్మము ప్రపంచ మగుచున్నది.

శ్రీ॥ భా॥ తన్తువులే యొకవిధమైన చేరికగలవై వస్త్రమనేడి నామాన్తరమును, రూపాన్తరమును, కార్యాన్తరమును మొదలగువానిని పొందునట్లు, బ్రహ్మమున్ను (జగత్తనెడి నామరూప కార్యాంతరాదులను పొందుచున్నది.)

౨౦॥ సూ॥ య థా చ ప్రా ణా దిః

టీ॥ ప్రాణాదిః = ప్రాణాపానాది వాయువులు, యథాచ = ఎటులనో.

తా॥ ఒక్కటియే వాయువు వృత్తిభేదమును బట్టి ప్రాణాపానాది భేదములు గలదియగునట్లు, ఒక్కటి యేయగు బ్రహ్మమున్ను అవస్థాభేదములను బట్టి జగద్రూపము గలదగుచున్నది.

శ్రీ॥ భా॥ ఒక్కటే వాయువు శరీరమునందు వృత్తి విశేషములను బొందినదై ప్రాణాపానాది నామాంతరములను, రూపాన్తరములను, కార్యాన్తరములనును పొందునది యగునట్లు, ఒక్కటే బ్రహ్మమును విచిత్రస్థావర జంగమ రూపమగు జగత్తుగా నగుచున్నది. కాఁబట్టి పరమకారణమగు పరబ్రహ్మము కంటెను జగత్తు వేఱుకాదని సిద్ధమగుచున్నది.

ఆరమ్భణాధికరణము ముగిసెను.

## ఇతరవ్యపదేశాధి కరణము

౨౧॥ సూ॥ ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః

టీ॥ ఇతరవ్యపదేశాత్ = జీవుఁడు బ్రహ్మముకంటెను వేఱుకాఁడనెడియుపదేశమువలన, హితాకరణాదిదోషప్రసక్తిః = సృష్టియందు హితాకరణాహితకరణాది దోషములు ప్రసక్తించును.

తా॥ "తత్త్వమసి" ఈ మొదలగు వాక్యములు జీవుఁడు బ్రహ్మముకంటెను వేఱుకాఁడని యుపదేశించునవియగు పక్షమున, సృష్టియందు హితాకరణా హితకరణాదిదోషములు ప్రసక్తించును.

శ్రీ॥ భా॥ జగత్తు బ్రహ్మముకంటెను వేఱుకాదని ప్రతిపాదించునవియగు "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" ఈ మొదలగు శ్రుతివాక్యములు జీవుఁడును బ్రహ్మముకంటెను వెఱుకాఁడని ప్రతిపాదించుచున్నవని యింతకుపూర్వము అద్వైతులచేఁ జెప్పఁబడియె. ఇందొక్కటి విచారింపవలసియున్నది.

ఈపై శ్రుతివాక్యములు జీవుఁడు బ్రహ్మమేయని యుపదేశించునవియగు పక్షమున, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును నీమొదలగువాఁడగు బ్రహ్మము తనకు హితమైన జగత్తును సృజింపకపోవుటయు, తనకు హితముకాని జగత్తును సృజించుటయు నీమొదలగు దోషములు ప్రసక్తించును. ఈ జగత్తు ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికము లనఁబడు అనంతములగుదుఃఖములకు స్థానమైనది గదా! ఇట్టి విధమగు తన యనర్థమును గుఱించి స్వాధీనుఁడును, బుద్ధిమంతుఁడును నగువాఁడెవ్వఁడును ప్రవర్తింపఁడు. జగత్తు బ్రహ్మముకంటె నన్యమైనదికాదని ప్రతిపాదించు సందర్భమున అద్వైతులు జీవబ్రహ్మములకు భేదమును ప్రతిపాదించెడి శ్రుతులను పరిత్యజించియున్నారు. అవియిట్లు భేదమును ప్రతిపాదించుపక్షమున, వారంగీకరించిన ప్రకారము యనన్యత్వము సిద్ధింపదు గదా!

ద్వైతాద్వైతి :—భేదశ్రుతులు— జీవబ్రహ్మములు వేఱయినవని తెలుపు శ్రుతులు— ఉపాధివశముచేఁ గలుగుభేదమును తెలుపునవి. అభేద శ్రుతులన్నను—జీవబ్రహ్మముల కభేదమును ప్రతిపాదించు శ్రుతులన్నను— జీవబ్రహ్మములకు స్వాభావికమగు అభేదమును తెలుపునవి.

భాష్యకారులు:—ఇందొక్కటి విచారింపవలసియున్నది. అవిద్యచే మాయఁబడనిధియు, జగత్కారణమునునగు బ్రహ్మము స్వాభావికముగాఁ దనకంటెను

వేఱుకానట్టి జీవుని తెలుసుకొనుచున్నదా? లేదా? తెలుసుకొనుచుండ లేదంటి వేని, బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వమునకు లోపము గలుగును. తెలుసుకొను చున్న దంటివేని, తనకంటెను వేఱుకానట్టి యీజీవునికిఁగల దుఃఖము తన యొక్క దుఃఖమేయని యెఱుంగునదియగు బ్రహ్మము జగత్తును అనుకూలమైన దానినిగా సృజింపకపోవుటయు, ప్రతికూలమైన దానినిగా సృజించుటయు నీమొదలుగాఁగల దోషములు తప్పక ప్రసక్తించును.

ఒకవేళ జీవబ్రహ్మములకుఁగల భేదము అజ్ఞానమూలకమనియు, అట్టి యజ్ఞానమూలకమగు భేదమునే భేదశ్రుతులు తెలుపుచున్నవనియును అద్వై తులు చెప్పుదురేమో, అట్లగునేని, జీవాజ్ఞానపక్షమున నింతకు పూర్వముగానఁ బఱచిన వికల్పములును వానిఫలములును ఇంతవఱకును నివారింపఁబడలేదు. మఱియు బ్రహ్మాజ్ఞానపక్షమున, స్వప్రకాశస్వరూపమగు బ్రహ్మము అజ్ఞానసాక్షి యగుటయు జగత్తును సృజించుటయును సంభవములుకావు. ఏలననిన, అజ్ఞా నముచే ప్రకాశమునకుఁ గలుగు తిరోధానమనఁబడునది యట్టి ప్రకాశమునకు నివృత్తిని గలుగఁజేయునదిగదా! అయితే ప్రకాశమే స్వరూపముగుటంజేసి స్వరూపనివృత్తియే గలుగవలసివచ్చును. అందువలన స్వరూపనాశము మొదలు గాఁగల వేలకొలది దోషములు ప్రసక్తించునని యింతకు పూర్వమే చెప్పఁ బడియె.

—— పూ ర్వ ప క్ష ము. ——

ఇందువలన, ఈపైని గనఁబఱచిన ప్రకారము, బ్రహ్మము జగత్కారణ మనెడి యంశము అసంగతమనిన.

అవతారిక:—ఇట్లు వచ్చిన యాక్షేపమును బరిహరించుటకై:—

**౨౨॥ సూ॥ అ ధి క స్తు భే ద ని ర్దే శా త్.**

టీ॥ భేదనిర్దేశాత్ బ్రహ్మముకంటె జీవుఁడు బిన్నుఁడని శ్రుతులు చెప్పు చున్నందున, అధికం జీవునికంటె బ్రహ్మము వేఱు పదార్థము, తు=కావున పూ ర్వపక్షము సరికాదు.

తా॥ బ్రహ్మముకంటెను జీవుఁడు భిన్నుఁడని శ్రుత్యులు చెప్పుచున్నందున జీవునికంటెను బ్రహ్మము వేఱు పదార్థము. కావున పూర్వపక్షము సరికాదు.

—— సి ద్ధాం త ము. ——

శ్రీ॥ భా॥ అట్లు చెప్పుట యుక్తము కాదు. ఆధ్యాత్మికాది దుఃఖము లకు పాత్రుఁడగు జీవునికంటెను బ్రహ్మము వేఱైనది. ఏలననిన, బ్రహ్మము

ప్రత్యగాత్మకంటెను వేఱయినదిగాను శ్రుతులయందు నిర్దేశింపఁ బడుచున్నది. అదెట్టులనిన,

వాజసనేయులు "య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాఽన్తర్యా మ్యమృతః" (బృ. ౫.అ ౭. బ్రా. ౨౨.వా) అనఁగా "ఏపరబ్రహ్మము ప్రత్యగాత్మ యందున్నదై, ప్రత్యగాత్మచేఁ దెలియఁబడక, ప్రతగాత్మయే శరీరముగాఁ గలదై, ప్రత్యగాత్మలోపలనుండి, ప్రత్యగాత్మను నియమించుచున్నదో, అది నీయొక్క యాత్మయు, అంతర్యామియు, అమృతస్వరూపుఁడును" అని పఠించుచున్నారు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టస్తత స్తేనామృతత్వమేతి" (శ్వే.౧. ౬) (ప్రత్యగాత్మను, ప్రేరకుఁడగు పరమాత్మనున్ను భిన్నపదార్థములనుగా నెఱింగి పరమాత్మచే ననుగ్రహింపఁ బడినవాఁడు నిత్యమగు మోక్షమును బొందుచున్నాఁడు.) అనియు "స కారణం కరణాధిపాధిపః" (శ్వే. ౬. ౯) (ఆ పరబ్రహ్మము కారణభూతుఁడును, ఇంద్రియాధిపతియగు ప్రత్యగాత్మకు అధిపతియును" అనియు, "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి" (శ్వే. ౪. ౬) (వీరిద్దరిలో ప్రత్యగాత్మ కర్మఫలము ననుభవించువాఁడు బ్రహ్మము దానిననుభవింపక ప్రకాశించు చున్నాఁడు" అనియును చెప్పఁబడియె.

"జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ" (శ్వే. ౧. ౯) అను శ్రుతివాక్యము "ఒక్కఁడు సర్వజ్ఞుఁడును, మఱియొక్కఁడు అజ్ఞుఁడు నైనవారును, ఒక్కఁడు ఈశ్వరుఁడును మఱియొక్కఁడు ఈశ్వరుఁడుగానివాఁడు నైనవారును నగు వీఱిద్దఱును పుట్టుకలేని వారు" అని తెలుపుచున్నది.

"ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" (బృ. ౬. అ 3. బ్రా ౨౧ వా) అను శ్రుతివాక్యము "సర్వజ్ఞుఁడగు నాత్మచే వ్యాపింపఁబడినవాఁడు" అనియు "ప్రాజ్ఞే నాత్మనాఽన్వారూఢః" (బృ. ౬. అ 3. బ్రా ౨౧ వా) అను శ్రుతివాక్యము "సర్వజ్ఞుఁడగు నాత్మచే వ్యాపింపఁబడినవాఁడు" అనియును, చెప్పుచున్నవి.

"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్ తస్మింశ్చాన్యోమాయయా సన్నిరుద్ధః" (శ్వే. ౪. ౯) అనుశ్రుతివాక్యము "దీనినుండి మాయాధీశ్వరుఁడగు బ్రహ్మము ఈజగత్తునంతయును సృజించుచున్నాఁడు. దానియందు వేఱొక్కఁడు మాయచేఁబద్ధుఁడై యున్నాఁడు" అని చెప్పుచున్నది.

"ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః" (శ్వే. ౬.) అను శ్రుతివాక్యము "పరబ్రహ్మము ప్రకృతికిని ప్రత్యగాత్మకును నధిపతియనియు, గుణముల కధిపతియనియును" చెప్పుచున్నది.

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం విదధాతి కామాన్" (శ్వే. ౬. ౧౩.) అను శ్రుతివాక్యము "నిత్యుఁడును, చేతనుఁడును ఒక్కఁడునునగు నెవ్వఁడు నిత్యులును, పెక్కండ్రునగు చేతనులు అనఁగా ప్రత్యగాత్మలు కోరు వానినిగలుగఁ జేయుచున్నాఁడో" అని చెప్పుచున్నది.

"యోఽవ్యక్తమన్తరే సఞ్చరన్ యస్యావ్యక్తం శరీరం యమవ్యక్తంన వేద యోఽక్షరమన్తరే సఞ్చరన్ యస్యాక్షరం శరీరం య మక్షరం న వేద ఏష సర్వభూతాన్తరాత్మా దివ్యోదేవ ఏకోనారాయణః" (సుబా. ౭౭) అను సుబాలోపని షద్వాక్యము మొదలగునవి "ఎవ్వఁడు అవ్యక్తమునను అనఁగా ప్రకృతియందు సంచరించుచున్నాఁడో, ఎవనికి అవ్యక్తము శరీరమో, ఎవనిని అవ్యక్తము తెలిసికొనదో, మఱియు ఎవ్వఁడు ప్రత్యగాత్మయందు సంచరించుచున్నాఁడో ఎవనికి ప్రత్యగాత్మ శరీరమో, ఎవనిని ప్రత్యగాత్మ దెలిసికొన లేదో, అతఁడుఅనఁగా ఆపరబ్రహ్మము సర్వభూతముల కంతరాత్మయు, అపహతపాప్ముఁడును, పరమపదమునందుండువాఁడును, దేవుఁడును ఒక్కఁడునగు నారాయణుఁడు" అనుచు ప్రత్యగాత్మకంటె పరబ్రహ్మము వేఱయినదని తెలుపుచున్నవి.

౨౩॥ సూ॥ అశ్మాదివచ్చ తదనుపపత్తిః

టీ॥ అశ్మాదివత్ = శిలాకాష్ఠాదులును బ్రహ్మమున్ను ఒక్కటియగుట యసంభవగునట్లు, తదనుపపత్తిః = జీవేశ్వరుల కైక్యము అనుపపన్నము.

తా॥ శిలాకాష్ఠాది పదార్థములున్ను బ్రహ్మమున్ను ఒక్కటి యగుట యసంభవమగు చందమున, జీవుఁడును బ్రహ్మమున్ను ఒక్కటియే పదార్థమగుట యసంభవము.

శ్రీ॥ భా॥ అత్యంతము హేయములును, ఎల్లప్పుడు మార్పును బొందునట్టివియును, అచిత్పదార్థములును నగు, రాయి, కట్టె, మట్టిగడ్డ, గడ్డి మొదలగు పదార్థములకు, నింద్యముకానిదియును, మార్పునుబొందని స్వరూపము గలదియును, సమస్త హేయగుణములకు విరుద్ధములగు కల్యాణ గుణములను గలిగియున్నట్టిదియును, తనకంటె నితరములగు సమస్త వస్తువుల కంటెను విలక్షణమైనదియును, అనంతములగు జ్ఞానానందాదులు స్వరూపముగాఁగలిగియున్నదియును, అనంతమై నానావిధమగు గొప్ప విభూతితోఁ గూడినదియును నగు పరబ్రహ్మస్వరూపముతో నైక్యమెట్లు అసంభవమో, అట్లే, చేతనుఁడైనను, అనంతదుఃఖములకు పాత్రుఁడై దాదాపుగా నొక మిడుగుఱుఁ బురుగువలె నుండు ప్రత్యగాత్మకు "అపహతపాప్మా" ఇత్యాదిశ్రుతి వాక్యములవలన సమస్త కల్యాణగుణముల కాకరుఁడుగా దెలియఁబడు పరబ్రహ్మముతో నైక్యము సంభవింప నేరదు. ఒకవేళ, శ్రుతులు "బ్రహ్మము జీవుఁడు"

అనుచు బ్రహ్మమునకును, జీవునికిని సామానాధికరణ్యమును (ఐక్యమును) జెప్పుచున్నవని యందురేమో, వాస్తవమే, అయితే అట్టి సామానాధికరణ్యనిర్దేశమునకు జీవబ్రహ్మముల కైక్యమును జెప్పుటయందుఁ దాత్పర్యము కాదు. "యస్యాత్మా శరీరం" ఇత్యాది శ్రుతులయందుఁ జెప్పియున్న ప్రకారము, జీవుఁడు బ్రహ్మమునకు శరీరమగుటవలన, బ్రహ్మము జీవుని శరీరముగాఁ గలిగి యుండుటచే అట్టిజీవుని కాత్మగా నున్నాఁడు. కాఁబట్టి యిట్లు జీవబ్రహ్మములకుఁగల శరీరశరీరి భావము నెఱింగించుటకై యేర్పడినదగు సామానాధికరణ్యనిర్దేశము ప్రస్తుతాంశముతో విరోధింపదు. సరేకదా, దాని నింకను బలపఱచుచున్నది. ఈయంశము "అవస్థితే రితికాశకృత్స్నః" (బ్ర. సూ. ౧ అ, ౪ పా. ౨౨ సూ.) ఇత్యాదిసూత్రములచే ననేకపర్యాయములు ఉపపాదింపబడినది. కాఁబట్టి యన్ని యవస్థలయందును, అనఁగా కారణావస్థయందును, కార్యావస్థయందునున్న బ్రహ్మము చిదచిత్పదార్థములను శరీరముగాఁగలది. అందువలన బ్రహ్మము సూక్ష్మములగు చిదచిత్పదార్థములు శరీరముగాఁగలదై కారణమనఁబడుచున్నది. మఱియు నదియే స్థూలములగు చిదచిత్పదార్థములను శరీరముగాఁగలదై జగద్రూపమగు కార్యమనఁబడుచున్నది. కాన, ఈ హేతువును బట్టి జగద్బ్రహ్మములను సామానాధికరణ్యముచేఁ జెప్పుట అనగా "జగత్తుబ్రహ్మము" అని చెప్పుట యుపపన్నమగును. ఇట్లంగీకరించినచో, జగత్తు బ్రహ్మకార్యమగుటయు, జగద్బ్రహ్మములకభేదమును, అచిత్పదార్థము పరిణమించునదియనియు, జీవుఁడు దుఃఖయనియు, బ్రహ్మము కల్యాణగుణాకరుఁడనియును చెప్పఁబడు వీనిస్వభావములకు సంకరము లేకపోవుటయు అనగా నొకదాని స్వభావము మఱియొకదానిదిగా నెన్నఁబడకపోవుటయును, శ్రుతివాక్యములకు పరస్పరము విరోధము లేకపోవుటయును,నివియన్నియును కలుగుచున్నవి. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" అను శ్రుతియందు జెప్పియున్నట్టి యవిభాగావస్థయందును అనఁగా బ్రహ్మము తనయందేదియును విభాగము లేనిదిగానుండు నట్టియవస్థయందును, అచిత్తుతోఁ గూడుకొనిన జీవుఁడు అతిసూక్ష్మరూపముతో బ్రహ్మమునకు శరీరముగా నున్నాఁడని యవశ్య మంగీకరింపవలయును. ఏలననిన, జీవులట్టి సమయమున నతిసూక్ష్ములై బ్రహ్మమునందున్నట్లు "వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౩౪ సూ) అనియు, "న కర్మావిభాగాదితిచే న్నానాదిత్వాదుపపద్యతే చాప్యుపలభ్యతే చ" (బ్ర. సూ. ౨. అ. ౧. పా. ౩౫. సూ) అనియు నీ రెండు సూత్రములచేఁ సూత్రకారులే ప్రతిపాదించి యున్నారు గదా! అట్టి సమయమున నిదియంతయు నవిభాగముగా నుండెననఁగా, నామరూప విభ

గము లేనిదిగానుండెనని యభిప్రాయము. కనుక బ్రహ్మము కారణమగుట సంభవమే.

ఈ జీవుఁడే యవిద్యా వియుక్తుఁడుగా నట్టి యవస్థను బట్టివచ్చిన భేదమును ఈ సూత్రములు వర్ణించుచున్నవని కొందఱు (అద్వైతులు మొదలగు వారు) చెప్పుచున్నారు గాని, వీరు చెప్పునదంతయు నసంగతమగును. ఏలననిన,

అద్వైతమతనిరసనము.

అట్లు అవిద్యావియుక్తుఁడగు జీవుఁడు సర్వజ్ఞుఁడుగాని, సర్వేశ్వరుఁడుగాని, సమస్తమునకు కారణుఁడు గాని, సమస్తమున కంతరాత్మగాని, సమస్తమును నియమించువాఁడుగాని, ఈ విధముగా నెట్టివాఁడును, కాఁడు గదా! ఇవ్విధముగానుండుటను బట్టియే గదా శ్రుతులు బ్రహ్మముకును జీవులకును భేదమును ప్రతిపాదించుచున్నవి. వారి మతప్రకారమన్ననో, సర్వజ్ఞత్వము మొలగునదియంతయు నవిద్యాల్పికతము గదా! ఒకవేళ అవిద్యాకల్పితుఁడగు జీవునికి అవిద్యావస్థయందు గల భేదము, ముత్యపుచిప్పను వెండినిగా భ్రమించిన తావున ముత్యపుచిప్పకును వెండికిని గల భేదమువంటిది యనియు, అట్టి భేదమునే "అధికంతు భేదనిర్దేశాత్" ఈ మొదలగు సూత్రములు ప్రతిపాదించుచున్నవనియును వారందురేమో, అదియును అసంగతము. ఏలననిన, ఇంతకు పూర్వము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (బ్ర. సూ. ౧. అ. ౧. పా. ౧. సూ) అనుసూత్రముచే విచారణమునకుఁ దేబడినదియు, జగజ్జన్మాది కారణమునునగు బ్రహ్మమును గుఱించి తెలుపుటయే వేదాన్త శాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము. ఇట్లు బ్రహ్మము జగత్కారణమను విషయమునకును స్మృతిన్యాయములకును గల విరోధము ప్రకృతమున పరిహరింపఁబడుచున్నది. ఈయధికరణమునఁ బ్రతిపాదింపఁబడిన విషయమునే "అపీతౌ తద్వత్ప్రసంగాదసమఞ్జసం" (బ్ర. సూ. ౨. అ. ౧. పా ౮. సూ.) అనియు "నతు దృష్టాన్తభావాత్" (బ్ర. సూ. ౨. అ. ౧. పా. ౯. సూ.) అనియు నీ రెండు సూత్రములు అనువదించుచున్నవి. ఏలననిన, అన్యోన్య విలక్షణములగు పదార్థములకును అనఁగా నచేతనమగు జగత్తునకును చేతనుఁడగు బ్రహ్మముకును కార్యకారణభావము సంభవమని గదా యీసూత్రములు ప్రతిపాదింపుచున్నవి. "అసదితిచేన్నప్రతిషేధమాత్రత్వాత్" (బ్ర. సూ. ౨. అ. ౧. పా ౭ సూ.) అనుసూత్రము పూర్వాధికరణమున ప్రతిపాదింపఁబడిన దానిని అనువదించుచున్నది.

ఇతరవ్యపదేశాధికరణము ముగిసెను.

## ఉపసంహారదర్శనాధికరణము.

౨౪॥ సూ॥ ఉ ప స ం హా ర ద ర్శ నా న్నే తి చే న్న క్షీ ర వ ద్ధి.

టీ॥ ఉపసంహారదర్శనాత్ = కార్యోత్పత్తికిగాను ఉపకరణములను సంగ్రహించుట లోకమునఁగానఁ బడుచుండుట వలన, న=ప్రపంచము ఈశ్వర కార్యమగుట యుక్తము కాదు, ఇతిచేత్ = ఇట్లంటివేని, న=అదిసరికాదు. ఏలననఁగా, క్షీరవద్ధి = పాలు సహజముగా దధియగుటవలెనే ప్రసిద్ధము గదా?

తా॥ ఘటపటాదులకుఁ గర్తలగు కులాలాదులు మృద్దండాద్యనేక సాధనోపేతులై తమతమ కార్యములను జేయుచున్నట్లు లోకమునందు మనము చూచుచున్నాము. ఇట్టి సాధనసహాయ మాపరబ్రహ్మమునకు లేమింజేసి, యతఁడు జగత్కర్తకాఁడని చెప్పగిట్టదు. ఏలననఁగా, అతఁడసహాయుండయ్యును, పాలు స్వభావముగా దధియగునట్లుగానే, తనయందున్న విచిత్రశక్తి యోగమువలన, జగత్తుగాఁ బరిణమించుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును నగు పరబ్రహ్మము సూక్ష్మావస్థయందును స్థూలావస్థయందును నుండునట్టి యీసమస్తములగు చేతనాచేతనపదార్థములను, శరీరముగాఁ గలవాఁడగుటంజేసి, యతఁడు అన్నివిధములగు శరీరములను గలిగియుండుటచే, నన్నింటికి నంతరాత్మయగుటయు, స్వేతరసమస్త వస్తువులకంటెను విలక్షణుఁడగుటయును విరుద్ధముగాదని పూర్వాధికరణమున స్థాపింపఁబడియె. సత్యసంకల్పుఁడగు పరబ్రహ్మము, సంకల్పమాత్రముచే ఈవిచిత్రజగత్సృష్టిని గలుగఁజేయుట విరుద్ధముగాదని యీ యధికరణమున ప్రతిపాదింపఁబడుచున్నది.

(పూర్వాధికరమునకీ యధికరణముతోఁగల సంబంధము.)

### పూ ర్వ ప క్ష ము.

"పరిమితశక్తులగు మనమేదైన నొకకార్యము నొనర్ప వలయునన్న, తగిన సాధనములు లేక, దాని నొనర్ప నేరము. సర్వేశ్వరుఁ డన్ననో, సర్వశక్తుఁడగుటంజేసి యందులకుఁగావలసిన సాధనముల నపేక్షింపక యే జగత్సృష్టి నొనర్పవచ్చును. కావున నతఁడు జగత్తును సృజించుట యెంతమాత్రము విరుద్ధము కాదు. ఇట్లుండ, అందును గుఱించి యేలశకింపఁదగును?" అనియడుగఁబనిలేదు, ఏలననిన, ఒకనికొక కార్యము నొనర్చుటకు తగినసామర్థ్యమున్నను, అందులకుఁదగిన సాధనసామగ్రి లేకపోయినచో, అతఁడాకార్యము నొనర్ప నేరఁడను విషయము మన మెఱిఁగినదే కదా! అటులనే యీశ్వరుఁడును సర్వశక్తుఁడైనను, తగిన సాధనములు లేనివాఁడై, జగత్సృష్టి నొనర్పజాలఁడని కొందఱు మందమతులు శంకింపవచ్చును. అట్టివారు చేయు శంకను ఈయధికరణమున నిరా

రించుచున్నారు. కులాల కువిందాదులు ఘటపటాదులను సృజించు సామర్థ్యము గల వారైనను, తగినసాధనములతోఁ గూడుకొని యున్నప్పుడే వానిని సృజింప సమర్థులుగాఁ గానఁబడుచున్నారు. అయితే వారలకు వానిని సృజింప శక్తియే లేనపుడు వారివద్ద కావలసిన సాధనములున్నను, వానిని సృజింపనేరకున్నారు. శక్తులగువారు ఉపకరణములున్ననే అట్టికార్యములను జేయుచున్నారు. ఇదియే శక్తిమంతులకును, శక్తిలేనివారలకునుండు విశేషము. కావున, బ్రహ్మము సర్వశక్తుఁడైనను, తగినసాధనములు లేక దేనినిన్ని సృజింపనేరఁడు. సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కఁడే తప్ప మఱేదియును వానికి సహాయముగా లేదని గదా! "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అనియు, "ఏకమేవాద్వితీయం" అనియు, "ఏకోహ వై నారాయణ ఆసీత్" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు తెలుపుచున్నవి. కాఁబట్టి బ్రహ్మము జగత్స్రష్టయనుట యుక్తముకాదని పూర్వపక్షము రాఁగా,

## సిద్ధాంతము.

లోకమునందు ప్రతిపదార్థమును తగిన సాధనసామగ్రులతోనే సృజింపఁబడుచున్నదనెడి నియమము లేదు. ఏలననిన, క్షీరములకు దధిగాను, ఉదకములకును హిమముగాను పరిణమించు శక్తి కలదు. అయితే యవి యందులకై తగిన సాధనసామగ్రి నపేక్షింపకయే దధిగాను, హిమముగాను పరిణమించుచుండలేదా! అటులనే సర్వమును జనింపఁజేయఁగల సామర్థ్యము అట్టి పరబ్రహ్మమునకుఁ గలదు. పరబ్రహ్మము స్వయముగానే అనఁగా తగినసాధనముల నపేక్షింపకయే సర్వమును సృజించుట సంభవమే. సూత్రమునందుండు "హి" అనుశబ్దము ఉదాహరణముయొక్క లోకప్రసిద్ధిని తెలుపుచు అందుమూలముగా నీపైనిగానఁబఱచిన శంక అంతబలమైనదికాదని సూచింపుచున్నది. క్షీరాదులు దధ్యాదిరూపముగాఁ బరిణమింపవలయునన్న ఆతంచనాదులను (పేరుటకై పాలలో మజ్జిగమిడుట) జేయుచున్నామేయని శంకింపఁబనిలేదు. శీఘ్రముగాఁ బరిణమించుటకై గాని, ఒకవిధమైన రుచిని గలుగఁజేయుటకై గాని మన మాతంచనాదుల నొనర్చుచున్నామే గాని, క్షీరములు దధిరూపముగాఁ బరిణమించుటకై కాదని యెఱుంగునది.

## ౨౫॥ సూ॥ దేవాదివదపి లోకే.

టీ॥ లోకే=తమ తమ లోకములందు, దేవాదివత్=దేవతలు మొదలగు వారివలెనే.

తా॥ దేవతలు మొదలగువారు తమతమ లోకములందు బాహ్యసాధనములనపేక్షింపకయే తాము కోరిన వస్తువులను తమ సంకల్పమాత్రముచే

నిర్మించుకొనునట్లు, పరబ్రహ్మమున్ను తన సంకల్పమాత్రముచే ఈ జగత్సృష్టిని నిర్మింపఁగలఁడు.

శ్రీ॥ భా॥ దేవతలు మొదలగువారు తమతమ లోకములందు సంకల్పమాత్రముచేత తాము కోరిన వానినన్నింటిని సృజించుచుండు చందంబున, పరబ్రహ్మమున్ను తనసంకల్పమాత్రముచేత ఈ సమస్తమైన జగత్తును సృజించుచున్నాఁడు. వేదావగతశక్తుఁడగు పరబ్రహ్మముయొక్క సామర్థ్యమును సులభముగాఁ గ్రహింపఁజేయుటకై వేదావగతశక్తులగు దేవాదులు ఉదాహరణముగాఁ జేర్కొనఁబడిరని యెఱుంగునది.

ఉపసంహారదర్శనాధికరణము ముగిసెను.

## కృత్స్నప్రసక్త్యధికరణము.

### ౨౬॥ సూ॥ కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా.

టీ॥ కృత్స్నప్రసక్తిః = బ్రహ్మము నిరవయవమగుటచే యావద్బ్రహ్మమును జగత్తుగాఁ బరిణమించునని ప్రసక్తింపును, వా = అట్లుకాకున్న, నిరవయవత్వశబ్దకోపః = బ్రహ్మము నిరవయవమని చెప్పుశ్రుతులతో విరోధము గలుగును.

తా॥ కారణావస్థయందు బ్రహ్మము నిరవయవమగుటంజేసి యావద్బ్రహ్మమును జగత్తుగా నుపయోగపడునని యంగీకరింపవలయును. వేఱొక్క విధమునఁ జెప్పుకొనిన, బ్రహ్మము నివయవమని ప్రతిపాదించునట్టి శ్రుతులు విరోధించును.

పూర్వపక్షము.

శ్రీ॥ భా॥ "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అనియు "ఇదం వా అగ్రే నైవ కిఞ్చనాసీత్" అనియు "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు కారణావస్థయందు బ్రహ్మమొక్కటిగానే అనఁగా అవయవవిభాగము లేనిదిగానే యుండెనని చెప్పుచున్నవి. అనఁగా అప్పుడు "ఇది చిత్తు" అనియు "ఇది యచిత్తు" అనియు నివ్విధమగు విభజనము లేకుండుటచే బ్రహ్మము నిరవయవమని చెప్పఁబడినది. అట్లు విభాగమేదియు లేనిదియు, ఒక్కటియు, నిరవయవమేయగు బ్రహ్మము "బహుస్యాం" అనఁగా "నేను అనేకముగా నగుదును" అని సంకల్పించి ఆకాశవాయ్వాది విభాగముగలదిగాను బ్రహ్మాదిస్తంబపర్యంతముండు చేతనాచేతనములనఁబడు విభాగము గలదిగాను నాయెనని చెప్పఁబడియె; అట్లగునేని, పరబ్రహ్మమంతయును, కార్యరూపముగ వినియోగింపఁబడినదని యంగీకరింపవలసి వచ్చును.

బ్రహ్మముయొక్క చేతనాంశము జీవులుగాను, అచేతనాంశము, ఆకాశ వాయ్వాదులుగాను, విభజింపఁబడుచున్నదనియెదవా? అట్లంటివేని, "సదేవ సోమ్యేదమగ్రఆసీత్" అనియు, "ఏకమేవాద్వితీయం" అనియు "బ్రహ్మైక మేవ" అనియు, "ఆత్మైకఏవ" అనియు నిట్లు బ్రహ్మమొక్కటియే, దానియం దేవియు నవయవములు అనఁగా విభాగములు లేవనిచెప్పునట్టి యీపై శ్రుతులు బాధితములగును. ఒకవేళ, సూక్ష్మములగు చిదచిత్పదార్థములు శరీరముగాఁ గల బ్రహ్మము కారణమనియు, స్థూలములగు చిదచిత్పదార్థములు శరీరముగాఁ గల బ్రహ్మము కార్య మనియును నంగీకరించినను, ఇందువలన శరీరియగు నంశము సయితము కార్యముగా నంగీకరింపఁబడుటచే, పూర్వోక్తదోషము అనఁగా—బ్రహ్మమంతయును కార్యరూపముగా వినియోగింపఁ బడుచున్నదను దోషము— నివారితము గానేరదు. మఱియు అట్టి నిరవయవమగు బ్రహ్మము అనేకములుగా నగుటయును సంభవింపదు. కార్యముగాను వినియోగింపఁబడని భాగ మొక్కటి యుండుటయును అసంభవము. అందువలన నిదియంతయు నసంగతముగాను గానఁబడుచున్నది. కాఁబట్టి బ్రహ్మము జగత్కారణమగుట సంభవముకాదు.

అవతారిక:—బ్రహ్మము జగత్కారణ మగుటను గుఱించి యీపైని గనఁబఱచిన ప్రకారము పూర్వపక్షము రాఁగా, సమాధానము చెప్పుటకై,

౨౭॥ సూ॥ శ్రు తే స్తు శ బ్ద మూ ల త్వా త్.

టీ॥ శ్రుతేః = బ్రహ్మము నిరవయవమనియు, జగత్కర్తయనియును శ్రుతి చెప్పుటవలన, శబ్దమూలత్వాత్ = ఇట్టి విషయము శ్రుతినుండియే తెలియఁ దగినదగుటవలన, తు= పూర్వపక్షము యుక్తము కాదు.

తా॥ బ్రహ్మము నిరవయవమనియు ఇట్టి బ్రహ్మమునుండియే జగత్తు కలుగుచున్నదనియు శ్రుతి తెలుపుచున్నది. ఇట్టి విషయము వేదప్రమాణము నుండియే తెలియఁదగినది. కావున పూర్వపక్ష మసంగతము.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ అట్లు చెప్పుట యుక్తము కాదు. ఈ విషయమున నసంగత మేదియును లేదు. ఏలననిన, బ్రహ్మము నిరవయవమనియు, అట్టిబ్రహ్మమునుండి యే విచిత్రమగు జగత్సృష్టి గలుగుచున్నదనియును శ్రుతియే తెలుపుచున్నది కదా!. అనఁగా శ్రుతులనుండియే తెలిసికొనఁదగిన విషయమును గుఱించి శ్రుతులు చెప్పినప్రకారమంగీకరింప వలయునని యర్థము. అయితే వేదములు గూడ "అగ్నినా సిఞ్చేత్" (అగ్నిచే దడపవలయును) ఇవ్విధముగా నసంగ

తార్థములను తెలుపునవి యంటివేని, యట్లు చెప్పఁదగదు. ఏలననిన, బ్రహ్మము ఇతర పదార్థములవలెనే ప్రమాణాంతరవేద్యముకానిదై, వేదములనుండి మాత్రము తెలియఁదగినదగుటచే నది యితరపదార్థములకంటెను విలక్షణమైనది. కాఁబట్టి దానియందు విచిత్రశక్తులుండుట విరుద్ధము కాదు. సాధారణముగ లౌకికపదార్థములను గుఱించి తోఁచునట్టి సాధన దూషణములకు బ్రహ్మమర్హమైనది కాదు.

౨౮॥ సూ॥ ఆత్మని చైవం చిత్రాశ్చ హి.

టీ॥ ఆత్మని = పరమాత్మయందు. ఏవం=ఇవ్విధముగా, విచిత్రాశ్చహి= విచిత్రశక్తులు కలవు గదా.

తా॥ పరమాత్మయందు ఇవ్విధములగు విచిత్రశక్త్తులుండుటంజేసి, యతఁడు జగత్కర్తయగు విషయమై విరోధమెద్దియును లేదు.

శ్రీ॥ భా॥ ఇంతియెకాక, ఏదయిన నొకవస్తువుయొక్క ధర్మమును వేఱొకవస్తువునం దారోపించుట యుక్తమైనచో, అచేతనమగు ఘటాది పదార్థమునం దుండునవిగాఁ దెలియవచ్చు ధర్మములు తద్విసజాతీయుఁడును, చేతనుఁడును, నిత్యుఁడుననగు ఆత్మయందును ప్రసక్తించును! అట్లు ప్రసక్తింపకుండుటకు హేతువు ఒక్కొక్కవస్తువునకు స్వభావవైచిత్ర్యముండుటయే యని "విచిత్రాశ్చహి" అనునది తెలుపుచున్నది. అదెటువలెననిన, అన్యోన్య విలక్షణములగు అగ్ని, జలము, మొదలగు పదార్థములయందు అన్యోన్య విలక్షములగు ఔష్ణ్యము, శైత్యము మొదలగు ధర్మములున్నట్లు గానఁబడుచుండ లేదా, అట్లే లోకమునందు గానఁబడు సమస్తపదార్థములకంటెను విలక్షణుఁడగు పరబ్రహ్మమునందు సామాన్యముగ లోకదృష్టములగు పదార్థములయందు గానఁబడనివియు, విలక్షణములునగు నానావిధవిచిత్రశక్తులు వేలకొలదియుండవచ్చును. అందు విషయమై యసంభవమేదియును గానఁబడదు. ఈవిషయమును గుఱించిశ్రీపరాశరుఁడు,

"శ్లో॥ నిర్గుణస్యాప్రమేయస్య శుద్ధస్యాప్యమలాత్మనః।
కథం సర్గాది కర్తృత్వం బ్రహ్మణోఽభ్యుపగమ్యతే॥

(విష్ణు. ౧ అం. 3 అ. ౧ శ్లో.)

తా॥ నిర్గుణుఁడును, ప్రమాణములకు విషయము గానట్టివాఁడును, పరిశుద్ధుఁడును, నిర్మలస్వరూపుఁడునునగు పరబ్రహ్మము సృష్టిమొదలగువాని నొనర్చుట యెట్లు సంభవము?"— అని యిూపైనిచెప్పిన ప్రకారము, సామాన్యదృష్టిచే శంకించి, యనంతరము,

శ్లో॥ శక్తయస్సర్వభావానా మచింత్య జ్ఞానగోచరాః।
యతోఽతో బ్రహ్మణస్తాస్తు సర్గాద్యా భావశక్తయః।
భవన్తి తపతాం శ్రేష్ఠ పావకస్యయథోష్ణతా॥

(విష్ణు. ౧ అం. 3 అ. ౨-3 శ్లో.)

తా॥ అనేకములగుటచే చింతించుట కలవిగాని సర్వశక్తులును సర్వేశ్వరునియందు కలవు. కాన, నతనికి సృష్ట్యాదికార్యముల నొనర్చుటకు స్వభావసిద్ధములైన శక్తు లగ్నియం దౌష్ణ్యమువలెనే కలవు."— ఇట్లు సమాధానము చెప్పియున్నాఁడు.

"కింస్విద్వనం క ఉ స వృక్ష ఆసీత్ యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసా పృచ్ఛతేమతద్యదధ్యతిష్ఠద్భువనాని ధారయన్ బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీద్యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసా విబ్రవీమివో బ్రహ్మాధ్యతిష్ఠద్భువనాని ధారయన్" (౨ అష్ట. ౨ ప్ర. ౭ అను॥) అను శ్రుతివాక్యము గూడ "భూమ్యంతరిక్షములు దేనినుండి నిర్మింపఁబడినవో ఆ వృక్షమెద్ది? అది యేవనమందుండెను? ఈ లోకములను ధరించినవాఁడెవఁడు? ఓవిద్వాంసులారా! మనస్సుతో మిమ్ములనడుగుచున్నాను" అని శంకించి, అట్టి శంకకు సమాధానమును "దేనితో భూమ్యంతరిక్షములు సృజింపఁబడినవో, అట్టివృక్షము బ్రహ్మము అట్టివనము బ్రహ్మము ఓ విద్వాంసులారా! మనస్సుతో మీకు చెప్పుచున్నాను. బ్రహ్మమే లోకములను ధరించియున్నాఁడు" అనిచెప్పుచున్నది.

ఈ హేతువులవలన సామాన్యముగా లోకదృష్టములగు పదార్థములను గుఱించి గలుగునట్టి యాక్షేపములు వానికంటెను విలక్షణుఁడగు బ్రహ్మమును గుఱించి కలుగవని యెఱుంగునది.

అవతారిక:—మఱియు ఈహేతువువలనను.

౨౯॥ సూ॥ స్వపక్షదోషాచ్చ

టీ॥ స్వపక్షదోషాత్-చ = తమపక్షమున అనఁగా ప్రధానాదికారణవాదులమతమునను, లోకదృష్టమగు దోషముండుటవలన,

తా॥ ప్రధానాదికారణవాదమునను లోకదృష్టములగు దోషములుండుటవలనను బ్రహ్మమే జగత్కారణము కాఁదగును.

శ్రీ॥ భా॥ ప్రధానాదులు జగత్కారణమని వాదించు ఈ పూర్వపక్షుల మతమున ఆ ప్రధానాదులు లౌకిక వస్తువులకంటె విలక్షణములు కానందున, వారు గానఁబఱచిన దోషములన్నియును ప్రధానాదులయందును ప్రవర్తిం

చును. కనుక స్వేతరసమస్తవస్తువిలక్షణుఁడగు పరబ్రహ్మమే జగత్కారణమని యంగీకరింపవలయును. ఏలననిన, ప్రధానము నిరవయవము గదా! అది మహత్తు మొదలు గాఁగల విచిత్రజగత్తు నెట్లుసృజింపఁగలదు? సత్త్వరజస్తమస్సులనఁబడు అవయవములు ప్రధానమునకుఁ గలవని వాదించుదురేమో, అట్లు వాదించితిరేని, యీ విషయమును గుఱించి యిట్లు విచారింపవలయును.

సత్త్వరజస్తమో గుణములయొక్క సముదాయము ప్రధానమనఁబడు చున్నదా? లేక సత్త్వరజస్తమోగుణములనుండి ప్రధానమనఁ బడునది యొక్కటికలుగుచున్నదా?

సాంఖ్యదర్శన విమర్శనము.

సత్త్వరజస్తమో గుణములనుండి ప్రధానమనఁబడు కార్యపదార్థమొక్కటి కలుగుచున్నదను పక్షమున, ప్రధానము సర్వమునకు మూలకారణమనెడి వారిమతముతో విరోధము ప్రాప్తించును. మఱియు నీపక్షమున, వారంగీకరించిన తత్త్వసంఖ్యతో విరోధము గలుగును అనఁగా ప్రధానమనునది సత్త్వరజస్తమో గుణములకంటె వేఱయినదిగా నెన్నఁబడుటచే వారంగీకరించిన ప్రకారము తత్త్వములిఱువదినాలుగు కంటె నధికమనవలసి వచ్చును. ఇంతియెకాక, ఆసత్త్వరజస్తమో గుణములు నయితము నిరవయవములేగాన, అవి ప్రధానమనఁబడు కార్యమును గలుగఁజేయుటయును విరుద్ధము.

సత్త్వరజస్తమో గుణములయొక్క సముదాయము ప్రధానమను పక్షమునను, అవి నిరవయవములగుటంజేసి, వానిలో నొక్కటి మఱియొక్క దాని వైపున జేర్పఁబడుట నపేక్షింపకయే పరస్పరము సంయుక్తములు గావలయునుగాన, నట్టివి స్థూల ద్రవ్యములను గలుగజేయుచున్నవని సిద్ధముగా నేరదు.

వైశేషికదర్శన విమర్శనము.

పరమాణు కారణవాదమునను, అణువులు నిరంశములు గాను నిష్ప్రదేశములుగానున్న అంగీకరింపఁ బడుటంజేసి, యవియును ప్రదేశభేదమపేక్షింపకయే పరస్పరము సంయుక్తములగుచున్నను, స్థూల పదార్థములను గలుగఁజేయ సమర్థములు గానేరవు.

౩౦॥ సూ॥ సర్వోపేతా చ తద్దర్శనాత్

టీ॥ సర్వోపేతాచ = పరదేవత సర్వశక్తిగలది, ఏలననఁగా, తద్దర్శనాత్ = అట్లు శ్రుతిచెప్పుచుండుట వలన,

తా॥ పరదేవత సర్వశక్తి గలది. అట్లే శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ పరదేవతయనంబడు పరబ్రహ్మము సర్వపదార్థములకంటె విలక్షణమైనదనియు, సమస్త శక్తులతోఁ గూడియుండినదనియును శ్రుతులు జెప్పుచున్నవి. ఏలననిన:—

"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" "పరబ్రహ్మముయొక్క శక్తినానావిధమైనదిగా వినఁబడుచున్నది అతని జ్ఞానము, బలము, క్రియయు స్వాభావికములు" అనియు, అట్లే "అపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః" (పరమాత్మ పాపరహితుఁడు, ముసలితనములేనివాఁడు, మరణరహితుఁడు, శోకరహితుఁడు ఆకలి దప్పికలు లేనివాఁడు) అనియును జెప్పుచు నిందుచే లోకమునందలి సర్వవస్తు సాధారణములగు, పాపము, జరా, శోకము మొదలగునవి బ్రహ్మమునందు లేవని వానిని నిషేధించి, ఈ హేతువువలన పరబ్రహ్మము స్వేతరములగు సర్వ పదార్థములకంటెను విలక్షణుఁడను విషయమును ప్రతిపాదించి, తరువాత "సత్యకామః సత్యసంకల్పః" అనువాక్యముచే ఈతఁడు సర్వశక్తియుక్తుఁడని ప్రతిపాదింపుచున్నవి. అట్లే "మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్పః ఆకాశ ఆత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిదమభ్యాత్తోఽవాక్యనాదరః" (ఛా. 3 ప్ర. ౧౪ ఖ. ౨ వా) అనుశ్రుతియును "పరమాత్మ పరిశుద్ధమగు మనస్సుచేఁ దెలిసికొనఁదగినవాఁడు, ప్రాణములన్నింటిని ధరించినవాఁడు, ప్రకాశించు రూపముగలవాఁడు, సత్యసంకల్పుఁడు, ఆకాశమువలె సూక్ష్మమై స్వచ్ఛమగు స్వరూపము గలవాఁడు, జగత్తునంతయు సృజించినవాఁడు, సమస్తములగు భోగోపకరణములు గలవాఁడు, అప్రాకృతములగు గంధములును రసములును, గలవాఁడు, ఇట్లు చెప్పఁబడిన కల్యాణగుణములను స్వీకరించినవాఁడు, అవాప్త సమస్తకాముఁడగుటవలన నెవనితో మాటలాడనివాఁడు, గనుకనే యాదరము లేనివాఁడు" అనియును చెప్పటచే పరబ్రహ్మము సర్వశక్తుఁడనియు, సమస్త వస్తు విలక్షణుఁడనియును దెలియజేయుచున్నది.

### ३०॥ సూ॥ వికరణత్వాన్నేతి చేత్తదుక్తం

టీ॥ వికరణత్వాత్ = శరీరేంద్రియసాధనములు లేకపోవుటవలన, నేతిచేత్ = బ్రహ్మము జగత్కారణము కాఁజాలదంటివేని, తదుక్తం ఆక్షేపమునకుపరిహార మిదివఱకే చెప్పఁబడినది.

తా॥ శరీరేంద్రియాది సాధములు లేనిదయినందున, బ్రహ్మము జగత్కారణము కాఁదగదని శంకింపఁదగదు. ఆక్షేపమిది వఱకే పరిహరింపఁబడినది.

శ్రీ॥ భా॥ ఒక్కటియేయైన బ్రహ్మము స్వేతరసమస్తపదార్థములకంటె విలక్షణమైనదియు, సమస్త శక్తులతోఁ గూడుకొనినదియేయైనను, "న తస్య కార్యం కరణం చ విద్యతే" (శ్వే. ౬. అ. ౫.) (ఆపరబ్రహ్మమునకు శరీరమును ఇంద్రియములునులేవు) అనుశ్రుతిప్రకారము ఇంద్రియములు లేనిదైనందున నిట్టి బ్రహ్మము జగద్రూపమగు కార్యము నొనర్ప నేరదని శంకించె

దకేమో, అట్లు శంకింపఁదగదు. అందులకు సమాధానము "శ్రుతేస్తుశబ్దమూలత్వాత్" (బ్ర. సూ. ౨. అ. ౧. పా. ౨౭. సూ.) అనియు "విచిత్రాశ్చహి" (బ్ర. సూ. ౨. అ. ౧. పా. ౨. సూ.) అనియు నీ సూత్రములచేఁ జెప్పఁబడియె. అనఁగా పరబ్రహ్మము అన్నిపదార్థముల వలెనే ప్రమాణాంతరములచేఁ దెలియబడునదిగాక, కేవలము వేదప్రమాణమునకు మాత్రము విషయమైనదైనందునను, సర్వపదార్థములకంటె విలక్షణమైనదైనందున నున్ను, ఆయాసాధనముల సహకారము నపేక్షింపకయే కార్యముల నొనర్పఁగలదనుట. అట్లే "పశ్యత్యచక్షుస్స శ్రుణోత్యకర్ణః అపాణిపాదో జవనో గృహీతా" (శ్వే. 3. అ. ౧౯.) అనుశ్రుతివాక్యము సయితము "పరబ్రహ్మము నేత్రేంద్రియము లేనివాఁడైనను, చూచుచున్నాఁడు, శ్రవణేంద్రియము లేనివాఁడైనను వినుచున్నాఁడు, పాణిపాదములు లేనివాఁడైనను, వానికార్యములగు వేగమును, గ్రహణమును గలిగియున్నాఁడు" అనిచెప్పుచు పరబ్రహ్మము ఆయాకార్యములకు ఆవశ్యకములగు సాధనములు లేకయే వానినొనర్ప సమర్థుఁడని తెలియఁజేయుచున్నది.

కృత్స్నప్రసక్త్యధికరణము ముగిసెను

## ప్రయోజనవత్త్వాధికరణము.

### ౩౨॥ సూ॥ న ప్రయోజనవత్త్వాత్

టీ॥ ప్రయోజనవత్త్వాత్ = ప్రవృత్తులు ప్రయోజనవిశిష్టము లగుటవలన, న = పరమాత్మ జగత్కర్తయయి యుండఁజాలఁడు.

తా॥ ప్రయోజనములేకయే లోకమునం దెవ్వఁడునుగాని యొక పనియందు ప్రవర్తించుట గానము. అవాప్తసమస్తకాముఁడగు సర్వేశ్వరునికి జగత్సృష్టివలన నేమియు ప్రయోజము లేకుండుటంజేసి, యతఁడు జగత్కర్త కాఁజాలఁడు.

### పూర్వపక్షము.

శ్రీ॥ భా॥ సృష్టికిపూర్వము పరబ్రహ్మము తనతోనేవియును సాధనములు లేక తానొక్కఁడేయున్నను, అతఁడు సర్వపదార్థములకంటె విలక్షణుఁడుగాన, స్వయముగానే ఈ చిత్రవిచిత్రరూపమగు జగత్తును సృజింప సమర్థుఁడవుఁగాక! అయినను, అతఁడు జగత్కారణుఁడగుట యసంభవము. ఏలననిన,

ఇట్టి చిత్రవిచిత్రమగు జగత్తును సృజించుట కేదియైన నొకప్రయోజన ముండవలయును గదా! అయితే యీజగత్తును సృజించుటకై సర్వేశ్వరుని కెద్దియు ప్రయోజనమున్నట్లు గానఁబడదు. ఎట్లనిన, లోకమునందు తెలివితోఁ బనిచేయు వారు ద్వివిధములగు ప్రయోజనములంబట్టి అనఁగా తమకైగాని

యితరులకై గాని కార్యములనొనర్చుచున్నారు. సర్వేశ్వరుఁడన్ననో, స్వాభావికముగానే అవాప్తసమస్తకాముఁడగుటంజేసి, అతనికి ఈ జగత్తును సృజించి అందువలనఁ బొందవలసిన ప్రయోజనమేదియు గానఁబడదు. పరులకుగాను అతఁడు ఈ జగత్తును సృజించెననుటయును అసంభవము. అవాప్తసమస్తకాముఁడగు నీతఁడు పరులయందనుగ్రహమువలనఁగదా పరులకై ఈ జగత్తును సృజింపవలయును? తనచే ననుగ్రహింపఁ బడు వారలకుగాను ఇట్టి గర్భజన్మజరామరణ నరకాదినానావిధానంతదుఃఖబాహుళ్యముతోఁ గూడుకొనియున్న జగత్తును దయారసముగల వాఁడెవ్వఁడును సృజింపఁడు. అట్లు కరుణతో సృజించువాఁడు కేవలము సుఖరూపమైన జగత్తునే సృజించును. ఈ హేతువువలన సర్వేశ్వరుఁడీ జగత్తును సృజించుటకెద్దియు ప్రయోజనము కానంబడకుండుటంజేసి, యతఁడు జగత్కారణుఁడగుట యసంభవమనిన,

అవతారిక:—ఇట్లు ప్రాప్తింపఁగా, అందులకు సమాధానమును ఈసూత్రముచేఁ జెప్పుచున్నారు.

33॥ సూ॥ లోకవత్తు లీలాకైవల్యం

టీ॥ లోకవత్ = లోకమునందువలెనే, లీలాకైవల్యం = సృష్టి లీలామాత్రప్రయోజనము గలది, తు = కావున పూర్వపక్షము యుక్తము కాదు.

తా॥ ప్రయోజనములేకయే లోకమునందు క్రీడాదులొనర్పఁబడునవి గాను గానఁబడుచున్నవి. అట్లే సర్వేశ్వరుఁడును క్రీడామాత్రముగాఁ జగత్తును సృజించెను.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ అవాప్తసమస్తకాముఁడును, పరిపూర్ణుఁడునునగు సర్వేశ్వరుఁడు, కేవలము క్రీడార్థము, అనఁగా విలాసమునకై, స్వసంకల్పమాత్రముచే మార్పునుపొందఁ దగినట్టియు, నానావిధమును విచిత్రమును నైనదియు, చిదచిత్తులతోఁ గూడుకొనియుండునట్టి యీ జగత్తును సృజించెను,

అదెట్లనిన:—సప్తద్వీపములతోఁ గూడుకొనినట్టి యీ జగత్తునకంతకును అధిపతియై, సంపూర్ణములగు శౌర్యవీర్యములతోఁ గూడుకొనిన మహారాజగు వాఁడు స్వయముగ కేవలము విలాసార్థము బంతులాడుట మొదలగు కార్యములయందు శ్రమించుచుండలేదా? అట్లే, పరబ్రహ్మమును, విలాసార్థము స్వసంకల్పమాత్రమున జగజ్జన్మ స్థితి లయంబుల నొనర్చుచున్నాఁడనిన నేదియును దోషము లేదు.

34॥ సూ॥ వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి

టీ॥ సాపేక్షత్వాత్ = జీవుల ధర్మాధర్మములయపేక్ష యుండుటవలన,

వైషమ్యనైర్ఘృణ్యే = పాక్షికత్వనిర్దయత్వములు, న బ్రహ్మమునకుఁ బ్రసక్తింపవు, తథాహి = అట్లేకదా, దర్శయతి = శ్రుతియును జెప్పుచున్నది.

తా॥ ఈ విషమసృష్టికి సృజ్యమానములగు నాయా ప్రాణుల సుకృత దుష్కృత రూపకర్మములే కారణములు గాని, సర్వేశ్వరునియందుండు పాక్షికత్వ నిర్దయత్వములు కారణములు గావు.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ స్వేతరసమస్త చిదచిత్పదార్థములకంటెను విలక్షణుఁడగు సర్వేశ్వరుఁడు సృష్టికిపూర్వమొక్కఁడేయై నిరవయవుఁడైనను, తలంచుటకు అశక్యమైన శక్తినిగలిగియుండువాఁడగుటంజేసి, విచిత్రమును చిదచిత్పదార్థములతో గూడుకొనియున్నట్టి యీ జగత్తును సృజించుట సంభవమగు గాక! అయినను, సర్వేశ్వరుఁడు దేవ, తిర్యక్, మనుష్య, స్థావరరూపమగు, ఉత్కృష్ట మధ్యమ నికృష్ట సృష్టిని గలుగఁజేయు చున్నందున, నతనికి పక్షపాతమనఁబడు దోషము గలదని ప్రసక్తించును. ఇంతియేగాక, అతఁడు అతిఘోరములగు దుఃఖములను గూడ గలుగజేయుటచే క్రూరుఁడనియును తప్పక ప్రసక్తించుననిన,

స మా ధా న ము,

ఈపైని గానఁబఱచినదోషములు ప్రసక్తింపవు. ఏలననిన, సర్వేశ్వరుఁడు ఆయాజీవుల కర్మముల కనుగుణముగా ఉత్కృష్ట మధ్యమ నికృష్ట రూపమగు విషమసృష్టిని సృజించుచున్నాఁడు. దేవాదులకు నుదేవాదిశరీరప్రాప్తి వారివారి కర్మమును బట్టి గలిగినదియని గదా శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి. ఎట్లన, "సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపోభవతి" అను శ్రుతివాక్యము "పుణ్యకర్మముల నొనర్చిన వాఁడు గొప్ప జన్మమును బొందుచున్నాఁడు, పాపకర్మముల నొనర్చినవాఁడు పాపపు అనగా నీచజన్మమును బొందుచున్నాఁడు" అనియు, "పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన కర్మణా" అను శ్రుతివాక్యము "పుణ్యకర్మముల నొనర్చినవాఁడు పుణ్యాత్ముఁడును పాపకర్మముల నొనర్చువాఁడు పాపాత్ముఁడును అగుచున్నాఁడు" అనియును చెప్పుచున్నవి అట్లే శ్రీపరాశరుఁడును:—దేవ మనుష్యాది విచిత్ర శరీరములు గలుగుటకు ఆయాజీవుల ప్రాచీనకర్మమే హేతువని తెలిపియున్నాఁడు. ఎట్లన.

శ్లో॥ నిమిత్తమాత్రమేవాసౌ సృజ్యానాం సర్గకర్మణి।
ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః।
నిమిత్తమాత్రం ముక్త్వైవ నాన్యత్కించిదపేక్షతే।
నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతాం॥

(విష్ణు. ౧ అం. ౪ అ. ౫౦-౫౧.)

తా॥ సృజింపఁబడువాని సృష్టి విషయమై సర్వేశ్వరుఁడు నిమిత్తమాత్రుఁడు. వానివాని కర్మములే వానివాని జన్మములకు ప్రధానకారణములు. దేవాదుల జీవులు దేవాదిశరీరప్రాప్తికిగాను సర్వేశ్వరుని నిమిత్తమాత్రునిగా నపేక్షించుచున్నవి. అయితే అవి తమతమ కర్మములవలననే దేవాదిశరీరములను బొందుచున్నవి. (ఈశ్లోకములందలి శక్తిశబ్దమునకు కర్మమని యర్థము).

3౫॥ సూ॥ నకర్మావిభాగాదితిచేన్నానాదిత్వాదుపపద్యతేచాప్యుపలభ్యతేచ

టీ॥ అవిభాగాత్ = సృష్టికిఁబూర్వము చిదచిద్విభాగము లేకపోవుటవలన, అప్పుడు, కర్మ విషమసృష్టికిఁ గారణముగాఁ జెప్పఁబడిన కర్మము, న = లేదు. ఇతిచేత్ = ఇట్లంటివేని, న = అది సరికాదు. ఏలననఁగా, అనాదిత్వాత్ = జీవులును వాని కర్మములును అనాదులగుటవలన, అట్లగు పక్షమునను, అవిభాగః = విభాగము లేకపోవుట, ఉపపద్యతే ఉపపన్నమగుచున్నది. ఉపలభ్యతేచ = ప్రమాణ సిద్ధమును నగుచున్నది.

తా॥ సృష్టికిఁ బూర్వము చిదచిద్విభాగము లేకుండుటచే విషమసృష్టికిఁ గారణముగాఁ జెప్పఁబడిన కర్మమున్ను అప్పుడు లేదంటివేని, యది సరికాదు. ఏలననఁగా, జీవులును వాని కర్మములును అనాదులు. అట్లగు పక్షమునను, అప్పుడు నామరూపవిభాగము లేకపోవుట యుపపన్నమును, ప్రమాణసిద్ధమును నగును.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ "సదేవ సోమ్యే దమగ్రఆసీత్" అను శ్రుతివాక్యము "సృష్టికిఁ బూర్వ మిది యంతయును సద్రూపముగానున్నది" అనుటచే నప్పుడు చిదచిద్విభాగ మెద్దియును లేదని తెలియఁజేయుచున్నది. కాఁబట్టి అట్టి సమయమున జీవులే లేరు గదా! ఇట్లుండ వారొనర్చిన కర్మము లెట్లుండఁగలవు? కనుక నట్టి కర్మములనుబట్టి సృష్టియందు వైషమ్యము కలదని యెట్లు చెప్పఁదగుననిన

స మా ధా న ము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. జీవులును వారి కర్మప్రవాహములును అనాదులు, ఇట్లు అవి యనాదులని యంగీకరించినను,సృష్టికిఁబూర్వము విభాగ మెద్దియు లేదని శ్రుతియందుఁ జెప్పియుండుట సంభవమే యగును. అట్టి సమయమున క్షేత్రజ్ఞులు నామరూపవిభాగము లేనివారై బ్రహ్మమునకు శరీరభూతులుగానైనను వేఱుగా గ్రహింప నర్హులుకాక,సూక్ష్మభూతులుగా నుండిరి. అట్లంగీకరింపని పక్షమున, [1] జీవులు తాము చేసియుండని కర్మముయొక్క

(1) జీవులు అనాదిగానుండువారని యంగీకరింపని పక్షమున,వారు అప్పుడప్పుడు క్రొత్త క్రొత్తగా బుట్టువారని చెప్పవలసివచ్చును. అట్లగు నేని,జీవుఁడింతకుముందు లేఁడు గాన,వాఁడీశరీర

ఫలమును పొందుచున్నారనియు, వారుచేసిన కర్మము నశించుచున్నదనియు ననెడి దోషము సంప్రాప్తమగును. మఱియు "న జాయతే మ్రియతే వా విప శ్చిత్" (కఠ ౧ అ. ౨ వ. ౧౮) అను శ్రుతివాక్యము "ఆత్మ పుట్టువాఁడును మృతినొందువాఁడును కాఁడు" అనుచు జీవులు అనాదులని తెలుపుచున్నది. "సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్" (తై. నా. ౧ అను. ౧౪) ఈ మొదలగు శ్రుతులు "చతుర్ముఖ బ్రహ్మము సూర్యచంద్రుల నింతకు పూర్వము నందువలెనె సృజించెను" అనుచు సృష్టియనఁబడునది ప్రవాహమువంటి యనాది యని తెలుపుచున్నవి. "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్త న్నామరూపాభ్యాంవ్యాక్రియత" (బృ.3. ౪. ౭) అనుశ్రుతివాక్యము "సృష్టికిఁ బూర్వమిది యంతయు అస్పష్టముగా నుండెను. సృష్టికాలమున నిది స్పష్టమగుచు నామరూపవిభాగము గలదిగాఁ జేయఁబడుచున్నది" అనుచు సృష్టియనఁగా "నామరూప విభాగమును స్పష్టపఱచుట" యని తెలియఁ జేయుచున్నది, కావున జీవుల స్వరూపము అనాదియని సిద్ధమగుచున్నది. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" (భ.గీ.౧3.౧౯) అను స్మృతివాక్యము గూడ "ప్రకృతియు, పురుషుఁడును ఈ రెండును అనాదులని యెఱుంగుము" అని చెప్పుచున్నది.

ఈ పైని గనఁబఱచిన ప్రకారము పరబ్రహ్మము సర్వవస్తు విలక్షణుఁడగుట వలనను, సర్వశక్తిగల వాఁడగుట వలనను, లీలయే ప్రయోజనముగాఁగలవాఁడగుట వలనను, జీవులయొక్క కర్మానుగుణముగ సృష్టినిగలుగఁ జేయుట వలనను అతఁడే జగత్కారణమని సిద్ధమగుచున్నది.

### 3౬॥ సూ॥ సర్వధర్మోపపత్తేశ్చ

టీ॥ సర్వధర్మోపపత్తేః - చ = సమస్త ధర్మములును ఉపపన్నములగుట వలనను (బ్రహ్మమే జగత్కారణము)

తా॥ జగత్కారణవస్తువునకు ముఖ్యముగా నుండవలసిన ధర్మము లన్నియును బ్రహ్మమునకుఁగలవుగాన, బ్రహ్మమే జగత్కారణము.

---

మునందనుభవించు సుఖదుఃఖాదులు వాఁడొనర్చిన కర్మముల ఫలములు గావని ప్రసక్తించును. అందువలన నొక్కఁడొనర్చిన కర్మముల ఫలములను వేఱొక్కఁడనుభవించుచున్నాఁడనెడి దోషము ప్రసక్తించును. మఱియు, ఈ జీవుఁడు అప్పుడప్పుడు పుట్టువాఁడుగాన, అతఁడు అప్పుడప్పుడు నశించువాఁడనియును చెప్పవలసివచ్చును "జాతస్య హి ధ్రువోమృత్యుః" అన్నట్లు పుట్టినది గిట్టట లోకమునఁగలదు గదా. ఈతఁడీశరీరములో నుండగా నొనర్చినకర్మముల ఫలములనను భవింపకనే నశించునుగాన కర్మములును నశించుననెడి దోషముప్రసక్తించును. కాఁబట్టి జీవులు అనాదులని యంగీకరింపవలయును. అట్లు జీవులనాదులుగాన వారికర్మములును అనాదులనియు వానినిబట్టి విషమసృష్టిగలుగుచున్నదనియును చెప్పినచో దోషములేదు.

శ్రీ॥ భా॥ జగత్కారణమగుట కావశ్యకములైన యేయే ధర్మములు ప్రధానము, పరమాణువులు మొదలగు వానియందు లేవని యింతకు పూర్వము గానంబఱచియుంటిమో, మఱియు నింకమీంద గానంబఱచుదుమో, అవియన్ని యును, బ్రహ్మముకుంగలవుగాన, బ్రహ్మమే జగత్కారణమని సిద్ధమగుచున్నది.

ప్రయోజనవత్త్వాధికరణము ముగిసెను.



గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బంధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేంకటేశ్వరసన్నిధ్యధ్యా పకకైంకర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీ పేరరుళాళరామానుజయతివరపర మానుగ్రహసమధిగత సకలవిశిష్టాద్వైత సిద్ధాంతసంప్రదాయగ్రంథ తత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీత్యా ద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగ ధ్యవస్థాదిద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్రశ్రీభాష్యమునందు ద్వితీయాధ్యాయమున ప్రథమపాదము.

శ్రీరస్తు



    

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీ మ దాం ధ్ర శ్రీ భా ష్య ము.

## ద్వితీయాధ్యాయము—ద్వితీయపాదము

### రచనానుపపత్త్యధికరణము.

౧. సూ॥ ర చ నా ను ప ప త్తే శ్చ నా ను మా నం ప్ర వృ త్తే శ్చ

టీ॥ రచనానుపపత్తేః-చ=చేతనునితోఁగూడియుండనిది జగత్తును నిర్మించుటయందసమర్థముగాను గానఁబడుచుండుటవలనను, ప్రవృత్తేశ్చ = అట్లు చేతనునితోఁగూడిన దాని కట్టి ప్రవృత్తియున్నట్లు గానంబడుచుండుట వలననున్ను, అనుమానం = ప్రకృతి, న = జగత్కారణము కాఁదగదు.

తా॥ చేతనునిసహాయములేని యచేతనపదార్థము స్వయముగ జగత్తును నిర్మించుటకు సామర్థ్యములేనిదిగాను గన్పట్టుచున్నందునను, అట్టిసహాయముగలది యన్ననో, జగత్తును నిర్మించుటయందు ప్రవర్తించునదిగాను గన్పట్టుచున్నందునన్ను, ప్రకృతి జగత్కారణము కాఁదగదు.

శ్రీ॥ భా॥ జగత్తుయొక్క జన్మస్థితి నాశములు బ్రహ్మమువలననే గలుగుచున్నవని యింతకుఁబూర్వము ప్రతిపాదింపఁబడియె; ఈ విషయమును గుఱించి మతాంతరులు నిరూపించు దూషణములుగూడ పరిహరింపఁబడినవి. బ్రహ్మమే జగత్కారణమనెడి విషయమును స్థిరపఱచుటకై మతాంతరుల వాదము లీపాదమున ఖండింపఁబడుచున్నవి. అట్లుకాకున్న, మందబుద్ధిగలవాని కెవ్వనికైనను, వారల వాదములు యుక్త్యాభాసమూలకములని యెఱుంగకపోవుటచే, నవి ప్రామాణికములనెడి తలంపు గలిగి వేదప్రతిపాదితమగు మతమున నమ్మకము తగ్గును. కాఁబట్టి మతాంతరుల వాదములను నిరాకరించుటకై యీ పాదము ప్రారంభింపఁబడుచున్నది.

(ప్రథమద్వితీయ పాదములకుఁ గలపరస్పర సంబంధము.)

అందు, ప్రథమమున, సాంఖ్యమతము నిరసింపఁబడుచున్నది. ఏలననిన, వేదాంతు లంగీకరించిన సత్కార్యవాదము మొదలగునవి కపిలస్థాపితమగు సాంఖ్యమతమునందుఁ గూడ నంగీకరింపఁ బడుచున్నవి. కావున నదియును

సరియైన సిద్ధాంతమే యనెడి భ్రమము సులభముగాఁ గలుగుట సంభవము. ఇంతకుమున్ను, "ఈక్షతేర్నాశబ్దమ్" (బ్ర. సూ. ౧. అ. ౧ పా. ౫ సూ.) అను సూత్రమున వేదాంతవాక్యములు ప్రధానమును జగత్కారణముగాఁ బ్రతి పాదించునవి కావని మాత్రము చెప్పఁబడియె. ఇప్పుడట్టి సాంఖ్యమత మయుక్త మని నిరూపించుచున్నారు. కనుక నిచట పునరుక్తిదోషమున కెంతమాత్ర మవకాశములేదు. సాంఖ్యులు తమ మతము నిట్లు బోధింపుచున్నారు:—

" శ్లో॥ మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త।
షోడశకశ్చ వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః ॥ (సాం. కా ౩)

తా॥ ప్రకృతి మూలకారణము. అది దేనియొక్క కార్యమున్ను గాదు. మహదహంకారాదు లేడును కారణభూతములును కార్యభూతములును. కేవల కార్యభూతములగు పదార్థములు పదునాఱు. కారణమున్ను కార్యమున్ను కాని వాఁడు పురుషుఁడు. ఇవియే తత్వములు.

సాంఖ్యమతోపన్యాసము.

మూలప్రకృతి యనఁగా సుఖదుఃఖమోహాత్మకములును, లాఘవ ప్రకాశ చలన ఉపష్టమ్భన గౌరవ ఆవరణములనఁబడు కార్యములను గలుగఁ జేయునవియును, అత్యంతము అతీంద్రియములును, వాని కార్యములనుబట్టియే తెలియఁదగినవియును, ఎచ్చు తక్కువగానుండక సమముగా నుండునవియును నగు సత్త్వరజస్తమస్సులనఁబడు ద్రవ్యములే. ఇట్లు సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థారూపమగు ప్రకృతి యనఁబడునది యొక్కటి, స్వయముగా నచేత నము, అనేకులగు చేతనుల భోగమునకుగాను మోక్షమునకు గానును ఏర్పడి నది, అది నిత్యమైనది, అంతట నుండునది, ఎల్లప్పుడు మాఱునది, వేఱొక్కదానినుండి గలుగునది కాదు, అన్నింటికిని కారణభూతమైనది. కావున నట్టిదియగు ప్రకృతి పరమకారణమే. అట్టి ప్రకృతినుండి గలుగునవియు, ఇతర వస్తువులను గలుగఁజేయునవియును నగు మహదాదులు ఏడు గలవు. అవి మహత్తు, అహంకారము, శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గన్ధతన్మాత్రము అనఁబడునవి. వానిలో నహంకారము వైకారికమనియు, తైజసమనియు, భూతాదియనియును మూఁడు విధములు గలది. వానిలో వైకారికము సాత్త్వికము (సత్త్వప్రధానము.) తైజసము రాజసము (రజఃప్రధానము.) భూతాది తామసము (తమఃప్రధానము.) సత్త్వప్రధానమగు వైకారికము ఇంద్రియములను గలుగఁజేయును. తమఃప్రధానమగు భూతాది మహాభూతములకు కారణభూతములగు తన్మాత్రలను గలుగఁ జేయును. రజఃప్రధానమగు తైజసము ఈ రెంటిని గనఁబఱచిన రెం

డింటికిని సహాయభూతమైనది. ఆకాశము మొదలగునవి అనఁగా ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, పృథివియనఁబడు పంచమహాభూతములును, శ్రోత్రము మొదలగునవి అనఁగా శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణము అనఁబడు పఞ్చజ్ఞానేంద్రియములును, వాగాదులు అనఁగా వాక్కు, పాణి, పాదము,పాయువు,ఉపస్థము అనఁబడు పఞ్చకర్మేంద్రియములును,మనస్సును ఇవి పదునాఱును కేవల వికారములు. (వేఱొక్కదానినుండి కలుగునవియే) పురుషుఁడన్ననో, వికారమును బొందునట్టివాఁడు కాఁడుగాన, నతఁడు దేనిని గలుగఁజేయువాఁడు కాఁడు. దేనిచేతను గలుగఁజేయఁబడు వాఁడును కాఁడు. కావుననే యతఁడు నిర్గుణుఁడును చైతన్యమాత్ర శరీరుఁడును, నిత్యుఁడును నిర్వ్యాపారుఁడును, సర్వగతుఁడును, ప్రతిశరీరమునను వేఱయిన వాఁడును. నిర్వికారుఁడును నిర్వ్యాపారుఁడును నయినందున నతఁడు కర్తగాని భోక్తగాని యగుట యసంభవము. వాస్తవమునకు వీని స్వరూపము లిట్లుండఁగా, మూఢులు ప్రకృతిపురుషు లతిసమీపముననున్నంత మాత్రముచే పురుషునిదియగు చైతన్యమును ప్రకృతియందుండు దానినిగా భ్రమించి,జపాకుసుమముయొక్క యెఱుపు వర్ణమును తత్సమీపమున నుండు స్ఫటికమునయందు దానినిగా భ్రమించు చందమున ప్రకృతియందుండు కర్తృత్వమును పురుషునియం దుండుదానినిగాను భ్రమించి, అందుమూలముగా "నేనుకర్తను నేను భోక్తను" అని తలంచుచున్నారు. ఈపైనిగానఁబఱచిన ప్రకారము అజ్ఞానమునవలన భోగమును తత్త్వముల నెఱుంగుటవలన మోక్షమును గలుగును."

వారు ఈపైనిగానఁబఱచిన యంశములను ప్రత్యక్షానుమానాగమములనఁబడుప్రమాణములఁ గొని నిరూపించుచున్నారు. అయితే ప్రత్యక్షసిద్ధములగు పదార్థముల విషయమై ఎక్కువ వివాదపడవలసిన యంశ మేదియును లేదు. కపిలాదిసర్వజ్ఞజ్ఞాన మూలమైనది యాగమమనెడి యంశము పూర్వమీమాంసాశాస్త్రమున ప్రమాణలక్షణమును గుఱించి విచారించుసందర్భమున దాదాపుగా నిరసింపఁబడినది, ప్రకృతియే జగత్కారణముగాను అనుమానప్రమాణమువలనఁ దెలియవచ్చుచున్నదనెడి యంశ మొక్కటి కలదు. దానిని నిరసించుటచే వారి మతమంతయును నిరసింపఁబడినదగును. కావున నట్టి ప్రకృతియే జగత్కారణమనువాదము మాత్రము ప్రకృతమున నిరసింపఁబడుచున్నది.

ఇందునుగుఱించి వారివ్విధముగాఁ జెప్పుచున్నారు.—

## పూర్వపక్షము.

ఈ సమస్త ప్రపంచమునకును కారణమొక్కటియే యుండి యుండవలయునని యవశ్య మంగీకరింపవలయును. అట్లుకాక, అనేకకారణములనుండి

కార్యపదార్థము గలుగుచున్నదను పక్షమున, కారణములకు మితిలేకపోవును. అందువలన కారణమిదియని యేర్పడదు. దృష్టాంతము—తన్తువులు మొదలగు నవయవములు వానియంశములగు నాయుపార్శ్వములతోఁ జేర్పఁబడినవై అవయవిని అనఁగా వస్త్రమును గలుగఁజేయుచున్నవి. ఆతన్తువులు మొదలగు నవి యన్ననో, అవ్విధములగు వానియవయవములచేఁ గలుగఁజేయబడుచున్నవి అవియును వాని యవయవములచేఁ గలుగఁజేయఁబడుచున్నవి. ఇవ్విధముగ పరమాణువులు సయితము వాని యాయుపార్శ్వములతో సంయుక్తలైయే స్వకార్యమునుగలుగఁ జేయుచున్నవని యవశ్యమంగీకరింపవలసివచ్చును. అట్లు కాకున్న, వైపుల్యము గలుగుట యనుపపన్నమగును. పరమాణువులును అంశములుగలవిగాన నవి వానియంశములవలనఁ గలుగునవి. ఆ యంశములును తమ యంశములవలనఁ గలుగునవి. ఇవ్విధమున నెంతదూరము పోయినను కారణమిదియని యేర్పడదు. అందువలన కారణమిదియని యేర్పడుటకుగాను ఒక్కటియే వస్తువు వివిధ విచిత్రవస్తువులుగాఁ బరిణమింపశక్తి గలదియు, తన స్వరూపమునకు హాని గలుగకుండగనే మహదాదిరూపములగు నవస్థలు గలదియగునది కారణమని యంగీకరింపఁదగును. అవ్విధముగా నొక్కటియగు కారణము సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థారూపమగు ప్రధానమే. అట్టి ప్రధానమనఁబడు దానిని కల్పించుకొనుటకుగానగు హేతువు లిట్లు గాన్పింపఁబడుచున్నవి.

శ్లో॥ భేదానాంపరిమాణాత్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ।
కారణకార్యవిభాగాదవిభాగాద్వైశ్వరూప్యస్య।
కారణమస్త్యవ్యక్తం॥ సాంఖ్యకారిక. ౧౬.

అర్థము. వైశ్వరూప్యమనఁగా విశ్వరూపమే:— విచిత్రసన్నివేశమగు శరీరలోకాది సమస్తప్రపంచమనుట. ఈ ప్రపంచము నానావిధ పదార్థముల సమూహమగుటంజేసి కార్యభూతమైనది. ఇది దీనితో సరూపమైన కారణము వలనఁ గలిగినది. ఇది కార్యపదార్థము గదా! కార్యపదార్థము లన్నియును కారణపదార్థముల నుండి వేఱయినవిగానును వానితో సరూపములయినవి నవిగానును గన్పట్టుచున్నవి. దృష్టాంతము.—ఘటము, కిరీటము మొదలగునవి వానితో సరూపములగు మృత్సువర్ణాది కారణపదార్థములకంటె వేఱయినవిగాను వానితోనేకమయినవిగానును కదా కన్పట్టుచున్నవి. కావున నానావిధమగు జగత్తు దానితో సరూపమగు ప్రధానమనఁబడు కారణమునుండి గలుగునది. దానియందే లయమును బొందునది. కావున జగత్తు ప్రధానమే కారణము గాఁగలది. సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థయగు ప్రధానమే జగత్తుతో

సఖరూపమైన కారణము. జగతున్ను సత్త్వరజస్తమోమయమును సుఖదుఃఖమోహాత్మకమైనదియును గదా! మృణ్మయమగు ఘటమునకు మృత్తికయే కారణమగుట యెట్లో, అట్లే. అదియే కదా దానియుత్పత్తి యనఁబడు ప్రవృత్తిని గలుగఁజేయ సమర్థమయినది. అట్లే గదా గన్పట్టుచున్నది. మహత్తు అహంకారము పంచతన్మాత్రలు మొదలగునవి దేశకాలపరిచ్ఛేదములుగలవి గాన,అవి యీసమస్త జగత్తును సృజింప నేరవు. కావున దేశకాల పరిచ్ఛేదములు లేనిదియు సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థారూపమగు ప్రధానమే జగత్కారణమని తెలియవచ్చుచున్నది. ఘటాది పదార్థములవలెనె పరిమితిగలవి యగుటంజేసి మహత్తు మొదలగునవియును ఈసమస్తప్రపంచమును గలుగఁజేయఁజాలవు. కావున సత్త్వరజస్తమోయుక్తమగునట్టి యీ ప్రపంచము అట్టి సత్త్వాదుల సామ్యావస్థారూపమగు ప్రధానమునుండియే గలుగునదియని నిశ్చితమగుచున్నది.

## సిద్ధాంతము.

ఇట్లు పూర్వపక్షమురాఁగా, అందులకు సమాధానము "రచనానుపపత్తేః" ఇత్యాది సూత్రముచేఁ జెప్పఁబడుచున్నది. ఈసూత్రమునందుండు "అనుమాన" శబ్దమునకు "ఊహింపఁబడునది" అనఁగా "ప్రధానము" అని యర్థము. సాంఖ్యులు జగత్కారణముగా గానఁబడిచిన ప్రధానము ఈ విచిత్రప్రపంచమును సృజింపఁజాలదు. అది యచేతనము. వేఱొకచేతనునిచే నియమింపఁబడునదియును కాదు. ఏది యిట్టిదియో,యదిస్వయముగాఁ దేనిని గలుగఁజేయునదిగాను గన్పట్టుచుండలేదు, దృష్టాంతము—రథములు, రాజభవనములు మొదలగు వానిని దారువు మొదలగునవి స్వయముగా నిర్మింపఁగలవా? నిర్మింపనేరవు గదా! లోకమున దారువు మొదలగు నచేతనపదార్థము అట్టి నిర్మాణముల నెఱింగిన చేతనునిచే నియమింపఁబడనిదై ప్రాసాదనిర్మాణాదిరూపమగు కార్యమును గలుగఁజేయునదిగాను గన్పట్టుచుండలేదు. అయితే యది యట్టి చేతనునిచే నియమింపఁబడినదియైనచో, నట్టి కార్యములను గలుగఁజేయునదిగాను గన్పట్టుచున్నది. ఈపైని గానఁబఱచిన హేతువులనుబట్టి చేతనుని సహాయములేని కేవలప్రధానము జగత్కారణము కాఁదగదని చెప్పఁబడుచున్నది.

సూత్రమునందుండు "చ" కారము కార్యపదార్థమునం దునికియును కారణత్వమును నిరూపింపనేరదని సముచ్చయముచేఁ దెలుపుచున్నది. దృష్టాంతము.—శౌక్ల్యము, గోత్వము, మొదలగునవి కార్యపదార్థమునం దుండునవియే యైనను, అవి కారణభూతములుగా గన్పట్టుచుండలేదు.

సాంఖ్యువాదు:—కార్యపదార్థమున నుండునవియే యైనను, శౌక్ల్యము మొదలగు గుణములు కారణభూతములు గాకపోవుగాక, అయితే కార్యమున

నుండునదియగు స్వర్ణము మొదలగుద్రవ్యము కారణమగుట యుండియే యున్నది. అట్లే సత్త్వము మొదలగు ద్రవ్యములును కార్యపదార్థమునందు గానఁబడుచున్నవి. కావున నవియును కారణభూతములు కాఁదగుననియెద వేమో, అట్లు చెప్పఁదగదు. ఏలననిన, సత్త్వము మొదలగునవి ద్రవ్యములయొక్క ధర్మములేగాని, అవి స్వయముగ ద్రవ్యములు గావు. సత్త్వము మొదలగునవి పృథివ్యాదులయందుండు లఘుత్వము, ప్రకాశము మొదలగు వానిని గలుగఁజేయునవియు, వానియొక్క స్వభావవిశేషము లయినవియును గదా ! అయితే అవి మృత్తిక హిరణ్యము మొదలగునవివలె ద్రవ్యముగాను కార్యపదార్థమునఁ గన్పట్టుచుండునవి కావు. కావుననే సత్త్వము మొదలగు వానికి గుణములనెడి ప్రసిద్ధిలోకమునఁ గలదు.

కారణ మిదియనెడి యొక వ్యవస్థ సిద్ధించుటకై జగత్తు ఒక్కటియే వస్తువు కారణముగాఁగలదిగా నుండవలయునని యింతకుఁ బూర్వము చెప్పఁబడియెను గాని, సత్త్వాదులనేకము లగుటంజేసి, యది సంభవము కాదు. అందువలననే కారణవ్యవస్థయును సిద్ధింపదు. ప్రధానమనఁగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ యని గదా సాంఖ్యుల మతము. ఇట్లుకారణము లనేకములగుటంజేసి ప్రాప్తించునట్టి యవ్యవస్థ నివారితము కానేకాదు. అవి యపరిమితములగుటంజేసి వ్యవస్థ సిద్ధించు ననియెదరేమో, అట్లు చెప్పగిట్టదు. ఏలననిన, అపరిమితమైన వగు పక్షమున అవి మూఁడును అంతటనుండునవి యగుటంజేసి, వానియందు ఎచ్చు తక్కువ లుండవు. అందువలన, వానియందు వైషమ్యము సిద్ధింపదు. కాఁబట్టి జగత్తనంబడు కార్యపదార్థము గలుగుటయే సంభవింపదు. కావున కార్యముగలుగుటకైయే యవి పరిమితములయిన వని యవశ్య మంగీకరింపవలయును.

అవతారిక:—చేతనునిచే నియమింపఁబడునట్టివి గాను స్పష్టముగాఁ దెలియవచ్చునట్టి రథాదులే కాకుండ, తద్వ్యతిరిక్తమగు సమస్తమును అట్టిది గానే తెలియవచ్చుచున్నదని తెలుపుటకై:—

౫॥ సూ॥ ప యో మ్బు వ చ్చే త్త త్రా పి.

---

టీ॥ పయోమ్బువత్ = క్షీరోదకములవలెనె, (సహజముగా ప్రధానము ప్రయోజనకారి గావచ్చును) చేత్ = ఇట్లంటివేని, (అదిసరికాదు, ఏలననఁగా) తత్రాపి = ఆక్షీరోదకములయందులి, (ప్రవృత్తికి అన్యసంబంధము కలదు)

తా॥ క్షీరోదకములవలెనె ప్రదానము సహజముగానే ప్రవర్తింపఁగల దంటివేని, అది సరికాదు. వానికిఁగల ప్రవృత్తివిషయమయ్యును అన్యసంబంధము కలదు.

 

## ఆక్షేపము

శ్రీ॥ భా॥ ప్రధానము చేతనునిచే నియమింపఁబడక సహజముగానే ఈ విచిత్రవస్తుసన్నివేశమగు జగత్తుయొక్క-సృష్టి నొనర్చుట యసంభవమని యింతకుఁబూర్వము చెప్పఁబడెను గాని, యది యుక్తము కాదు. ఏలననిన, క్షీరముల వలెను ఉదకమువలెనున్ను ప్రధానము సహజముగానే ప్రవర్తించుట సంభవము. దృష్టాంతము:—క్షీరములు దధిగాను పరిణమించునప్పుడు వేఱొక్క-దాని సహాయమును గుఱించి నయపేక్షలేకుండనే ఆద్యపరిస్పందనము మొదలగు పరిణామపరంపర సహజముగానే గలుగుచుండుట సంభవ మగునట్లు గన్పట్టుచున్నది. ఒక్క-టియే రుచిగల వర్ష జలము నారికేళ, తాళ, చూత, కపిత్థ, నిమ్బ తింత్రిణ్యాది నానావిధము లగు రుచులు గలదిగాఁ బరిణమించు విషయమై సహజముగానే ప్రవర్తించునది గాను గన్పట్టుచున్నది. అట్లే, ప్రధానమున్ను పరిణమించుటయే స్వభావముగాఁ గలదియును, వేఱొక్క-దాని సహాయము నపేక్షింపకయే సృజింపఁబడిన పదార్థముగానుండునట్టి ప్రతియవస్థయందును సదృశ పరిణామముతోఁ గూడియుండు నదియు నగుటవలన, సృష్టిరూపమగు నవస్థయందు గుణవైషమ్యము వలనఁ గలుగు విచిత్ర పరిణామము గలదిగా నగుట సంభవము. అట్లే, "పరిణామ తస్సలిలవత్ ప్రతిప్రతిగుణాశ్రయ విశేషాత్" (సాంఖ్యకారిక ౧౬ శ్లో) (పదార్థములయందు ప్రత్యేకముగ గుణములకు అంగాంగీభావముతోనుండుట యనెడి వైషమ్యమువలన జలమువలెనె ప్రధానము జగత్తుగాఁ బరిణమింపఁదగును) అని సాంఖ్యకారికల యందుఁ జెప్పఁబడియె. ఈ పైని గానఁబడుచిన ప్రకారము ప్రధానము వేఱొక్క-దాని సహాయము నపేక్షింపక, సహజముగానే, జగత్సృష్టియందుఁ బ్రవర్తించుచున్నదని యాక్షేపము రాఁగా.

## సమాధానము

భాష్యకారులు:—క్షీరోదక రూపములగు దృష్టాంతముల విషయమయ్యును, చేతనుని నియమనములేకుండ, ప్రవృత్తి గలుగదు. ఈవిషయమును గుఱించి యింతకుఁ బూర్వమే చెప్పఁబడెనవి యెఱుంగునది, "ఉపసంహార దర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి" (బ్ర. సూ. ౨ అ. ౧ పా, ౨౪సూ.) అను సూత్రమున, లోకదృష్టములగు సాధనములేవియును లేకున్నను, బ్రహ్మమునకు స్వాసాధారణమగు జగద్రూపపరిణామము సంభవమని యింతమాత్రము చెప్పఁబడెను. ఇంతియెగాని, చేతననియామ్యత్వమును వదలుకొని యుండలేదు. "యోఽప్సు తిష్ఠన్" ఇత్యాది శ్రుతివాక్యమే "పరమాత్మ ఉదకము మొదలగు వాని లోనుండి వానిని నియమించు చున్నాఁడు" అని చెప్పుచున్నది గదా!

3॥ సూ॥ వ్య తి రే కా న వ స్థి తే శ్చా న పే క్ష త్వా త్.

టీ॥ అనపేక్షత్వాత్ = సర్వేశ్వరుని నియమనము నపేక్షింప కుండుట వలన, వ్యతిరేకానవస్థితేశ్చ = సృష్టిప్రళయములకు వ్యవస్థ గలుగకుండుటచే ప్రధానము జగత్కారణము కాఁదగదు.

తా॥ చేతనుని నియమనము నపేక్షింపక, ప్రధానము స్వయముగ జగత్తును సృజించు పక్షమున, సృష్టిప్రళయముల విషయమై వ్యవస్థ సిద్ధింపదు. కావునను ప్రధానము జగత్కారణము కాఁదగదు.

శ్రీ॥ భా॥ సత్యసంకల్పుఁడగు సర్వేశ్వరుని సహాయము నపేక్షింపకయే ప్రధానము సహజముగానే జగద్రూపముగాఁ బరిణమించు పక్షమున, సృష్టికి విరుద్ధముగ ప్రళయము గలుగుటకు వ్యవస్థలేక పోవుట ప్రసక్తించును. కావున చేతనునిచే నియమింపంబడనిదై ప్రధానము మాత్రము జగత్తును సృజింపఁ జాలదు. అది చేతనుఁడగు సర్వేశ్వరునిచే నియమింపఁబడున దగుపక్షమున, అతఁడు సత్యసంకల్పుఁడుగాన, సృష్టిప్రళయములును నానావిధ విచిత్ర సృష్టియును గలుగుటకు ఒక వ్యవస్థ సిద్ధించును.

సాంఖ్యుఁడు:—ఒకవేళ ప్రధానము సర్వేశ్వరునిచే నియమింపఁబడు పక్షమునను, అతఁడు అవాప్త సమస్తకాముఁడును, పరిపూర్ణుఁడును, మితిలేని యతిశయముగల యానందము గలవాఁడును, నిర్దోషుఁడును, నిర్వికారుఁడు నగుటంజేసి, సృష్టి ప్రళయములను గుఱించిన ఏర్పాటుకు హేతువుకాఁ జాలఁడు. అతఁడు విషమసృష్టికి హేతువగు పక్షమున, నిర్దయుఁడని ప్రసక్తించును. కావున వేదాంతుల మతమునను దోషము సమానమే.

భాష్యకారులు:—సర్వేశ్వరుఁడు పరిపూర్ణుఁడే యయినను, క్రీడార్థము జగత్సృష్టియందుఁ బ్రవర్తించుట సంభవము. అతఁడు సర్వజ్ఞుఁడుగాన, పరిణామభేదమును పొందునట్టి ప్రకృతిని గుఱించిన జ్ఞానమతనికిఁగలదు. అందువలన నతఁడు సృష్టిప్రలయములను గలుగఁజేయునట్టి హేతువు కాఁగలఁడు. విషమసృష్టిని గలుగఁజేయుటకు జీవుల కర్మములే హేతువులుగా నేర్పడుచున్నవి.

సాంఖ్యుఁడు:—జీవుల పుణ్యపాప కర్మములను బట్టియే సర్వవ్యవస్థలును సిద్ధించుపక్షమున, సర్వేశ్వరుఁడు చేయవలసినది మఱియేమున్నది? చేతను లొనర్చిన పుణ్యపాప రూపమగు కర్మముచే సంస్కరింపఁబడిన ప్రకృతియే పురుషుని కోరిక కనుగుణముగా నాయా విధములఁ బరిణమింపఁగలదు. దృష్టాంతము:—విషాదులచేఁ జెడుపఁబడిన యన్నపానాదులు దుఃఖమును గలుగఁ జేయునవిగాను, ఔషధములతోఁ జేర్పఁబడినవి సుఖమును గలుగఁజేయునవిగాను పరిణమించునవిగాను దేశకాలవ్యవస్థనుబట్టి గన్పట్టుచున్నవి. కావున,

సృష్టిప్రళయవ్యవస్థయు, దేవాదివిషమసృష్టియు, కైవల్యవ్యవస్థయును నానావిధములుగాఁ బరిణమింప శక్తిగలదియగు ప్రధానమునకే సంభవము లగుచున్నవి.

భాష్యకారులు:—పుణ్యాపాపకర్మముల స్వరూపము నీకు బొత్తుగ తెలియదు. వాని స్వరూపము శాస్త్రమునుండియే యెఱుంగఁదగినది. శాస్త్రమనఁగా, అనాదియు, నాశరహితమును,పరంపరగా వచ్చునట్టిదియునగు వేదము. అది పరమపురుషుని యానందింపఁ జేయునట్టి కర్మముల ననుష్ఠించుట పుణ్యమనియు,తద్వ్యతిరిక్తములగు కర్మముల ననుష్ఠించుట పాపమనియును శాస్త్రము తెలుపుచున్నది. మఱియు నది యట్టి పరమపురుషుని యనుగ్రహమువలన సుఖము గలుగుననియు, వాని నిగ్రహమువలన దుఃఖము గలుగుననియును తెలుపుచున్నది. అట్లే శ్రీ ద్రమిడాచార్యులవారును "ఫలసంబిభత్సయా హి కర్మభిరాత్మానం పిప్రీషన్తి స ప్రీతోలం ఫలాయేతి శాస్త్రమర్యాదా" అనఁగా "ఫలమునుబొందుటకై కర్మములనొనర్చి పరమాత్మను సంతోషింపఁ జేయుచున్నారు. పరమాత్మ సంతోషించినఁజాలునను కొనుచున్నారు. ఇదియే శాస్త్రపద్ధతి" అని చెప్పియున్నారు. "ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్య నాభిః" అనఁగా "అన్తరాత్మగా లోకములను ధరించియున్నవాఁడగు సర్వేశ్వరుఁడు నానావిధముగా నొనర్పఁబడు శ్రౌతస్మార్తకర్మమును సర్వమును తన కారాధనభూతమైన దానినిగా స్వీకరించుచున్నాఁడు" అని శ్రుతివాక్యము తెలుపుచున్నది. అట్లే భగవంతుఁడును స్వయముగాఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వ మిదం తతం।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥

భ. గీ. ౧౮ అ. ౪౬ శ్లో.

తా॥ ఓ యర్జునా! దేనివలన నీభూతములు కలుగుచున్నవో,ఏది యీ సమస్తమును వ్యాపించియున్నదో,ఆపరమాత్మను వర్ణాశ్రమకర్మానుష్ఠానముచే నారాధించి మానవుఁడు సిద్ధిని బొందుచున్నాఁడు.

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥

భ. గీ. ౧౬ అ. ౧౯ శ్లో.

తా॥ ఓ యర్జునా! క్రూరులును, అమంగళులును, నన్ను ద్వేషించునట్టివారలగు నరాధములను సంసారమునఁ ద్రోయుచున్నాఁడను. వారిని తరుచుగా అసురయోనులయందుఁ జన్మింపఁజేయుచున్నాఁడను.

అవాప్తసమస్తకాముఁడును, సర్వజ్ఞుఁడును, సర్వేశ్వరుఁడును, సత్యసఙ్కల్పుఁడును, భగవంతుఁడునగు పురుషోత్తముఁడు "ఈకర్మములు మంచివి

ఈకర్మములుచెడ్డవి” అని యిట్లు కర్మలకు ద్వైవిధ్యము నేర్పఱచి, వానిని గ్రహించుటకుఁ దగిన దేహేంద్రియాదులను, వానిని నియమించుటకు శక్తి నిన్ని సామాన్యముగ జీవులందఱికి నిచ్చి, తన శాసనమును దెలుపునట్టి శాస్త్రి మునున్ను గాన్పించి, దానిని ప్రవర్తింపఁజేయుటకై యంతరాత్మగా నందఱిలోఁ బ్రవేశించి, అంగీకారము నిచ్చువాఁడుగా వారిని నియమించుచున్నాఁడు జీవులును వానిచే నీయంబడిన శక్తియును, శరీరేంద్రియాదులును గలవారును, వాఁడే యాధారముగాఁ గలవారునై స్వయముగనే తమ యిష్టానుసారము పుణ్యాపాపరూపములగు కర్మముల నొనర్చుచున్నారు. భగవంతుఁడు పుణ్య కర్మముల ననుష్ఠించువానిని తన యాజ్ఞప్రకారము ప్రవర్తించువానినిగా నెఱింగి వానికి ధర్మార్థకామమోక్షముల నొసంగుటచే వానిని వృద్ధికిఁ దీసికొని వచ్చుచున్నాఁడు. తనయాజ్ఞనతిక్రమించి ప్రవర్తించువాని కన్ననో, తద్విరుద్ధ ములగు వానిఁ గలుగఁజేయుచున్నాఁడు. కావున నీతావున స్వాతంత్ర్యాదులకు లోపము గలుగుననెడి శంక కెవ్విధమైన యవకాశమును లేదు. మఱియు నతఁడు నిర్దయుఁడనియును చెప్పఁదగదు, ఏలననిన, దయ యనఁగా స్వప్ర యోజనము నపేక్షింపకయే పరుల దుఃఖములను సహింపఁజాలకుండుట గదా! తనయాజ్ఞ నతిక్రమించి ప్రవర్తించువాని విషయమునను అట్టి దయను గాన్పిం చు పక్షమున, అందువలన గుణమేమున్నది? మీఁది మిక్కిలి వానికి పౌరుష హీన తను గలుగఁజేయును. కనుక నట్టివారలను శిక్షించుటయే అందుల గుణము. అట్లుకాకున్న, శత్రుసంహారము మొదలగునవి నిష్ప్రయోజనములని ప్రసక్తిం చును. సర్వేశ్వరుఁడు ఎప్పుడును జీవుల కపరిమితమగు సుఖమును గలుగఁ జేయుటకై యే ప్రయత్నించుచున్నాఁడు. అందులకై యతండు వారనంతకల్పము లుగా నొనర్చుచు వచ్చినవియు, అసహ్యములునగు ననంతాపరాధముల నంగీ కరింపక శిక్షించుటచే తనయాజ్ఞ నతిక్రమించువిషయమై వారికి కోరిక గలుగ కుండునట్లుచేయుచున్నాఁడు. అట్లేగదా భగవంతుఁడు చెప్పియున్నాఁడు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥

భ. గీ ౧౦. అ. ౧౦. శ్లో॥

తా॥ ఓ యర్జునా! నాయందెల్లెడల నాసక్తిగలిగి నన్ను ప్రీతిపూర్వక ముగా నాశ్రయించు వారలకు నన్నుఁజేరుటకు ఉపయుక్తమగు జ్ఞానమును నేనే యిచ్చుచున్నాఁడను.

శ్లో॥ తేషామే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

భ. గీ. ౧౦. అ. ౧౧. శ్లో॥

తా॥ ఓ యర్జునా! అజ్ఞానుల ననుగ్రహించుటకొఱకు వారియొక్క మనోవృత్తికి విషయముగా నున్నవాఁడనై నా కల్యాణగుణములను ప్రకటింపఁజేయుచు నావిషయమగు జ్ఞానమనెడి ప్రకాశించుచున్న దీపముచేత; జ్ఞానమునకు విరోధులగు పూర్వకర్మములనెడి యజ్ఞానముచే బుట్టినదియు నాకంటె నితరములగు విషయముల యందలి ప్రావీణ్యరూపమగు చీఁకటిని నశింపఁ జేయుచున్నాఁడను.

కాఁబట్టి చేతనునిచే నియమింపఁ బడనిదియగు ప్రధానము జగత్కారణము కాఁదగదు.

అవతారిక:—చేతనునిచే నియమింపఁబడనియెడల ప్రధానము కదలను గూడ నేరదని చెప్పఁబడియె. అయినను, అది వేఱొక్కదాని యపేక్ష లేకయే పరిణమించుట సంభవము. ఏలననఁగా, అట్లు మనము చూచుచున్నాము. దృష్టాంతము:—ఆవులు మొదలగు జంతువులచే భుజింపఁబడిన గడ్డి, ఉదకము మొదలగునవి క్షీరాకారముగాఁ బరిణమించుచున్నట్లు మనము చూచుచున్నాము. కావున ప్రకృతియును సహజముగానే జగదాకారముగాఁ బరిణమింపఁగలదని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై:—

౪॥ సూ॥ అన్యత్రాభావాచ్చ న తృణాదివత్.

టీ॥ అన్యత్ర = ధేనువుకంటె నన్యతావుల అనఁగా వృషభాదులయందు, అభావాత్ = తృణాదికమునకు క్షీరరూపమగు పరిణామము లేకపోవుటవలన, తృణాదివత్ = తృణాదులవలెనె, న = ప్రధానమునకు సహజ పరిణామము లేదు.

తా॥ గోవులవలనఁ భుజింపఁబడిన తృణాదులే పాలుగాఁ బరిణమించుచున్న వేగాని, యాతృణాదులే వృషభాదులచే భుజింపఁ బడినచో, పాలగుట లేదు. కావున తృణాదులకువలెనె ప్రధానమునకును సహజ పరిణామము లేదు.

శ్రీ॥ భా॥ అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, చేతనునిచే నధిష్ఠింపఁబడని తృణాదులు క్షీరాదులుగాఁ బరిణమింపనివి గాను గన్పట్టుచున్నందున, దృష్టాంతము సరియయినది కాదు. ఎట్లనిన, ఎద్దులు మొదలగు వానిచే భుజింపఁబడిన తృణోదకాదులు గాని, లేక ఒకచోట పెట్టియుంచిన తృణోదకాదులు గాని, క్షీరములుగాఁ బరిణమించునవియగు పక్షమున, చేతనుని యపేక్ష లేకయే తృణోదకాదులు సహజముగా క్షీరరూపమునఁ బరిణమింపఁగలవని చెప్పఁగలము. అట్లు కానఁబడుచుండలేదు. కావున, ఆవులు మొదలగువానిచే భుజింపఁబడిన తృణాదికమును చేతనుఁడే క్షీరరూపముగాఁ బరిణమింపఁజేయుచున్నాఁడు. "పయోమ్బువచ్చేత్తత్రాపి" (బ్ర. సూ. ౨ అ ౨ పా ౨ సూ) అను సూత్రమున జెప్పిన యంశమునే బలపఱచుటకై మరల దానినే ఈ సూత్రమున నెక్కి చెప్పియున్నారు.

౫॥ సూ॥ పు రు షా శ్మ వ ది తి చే త్త థా పి.

టీ॥ పురుషాశ్మవత్ = పంగుపురుషా యస్కాంతములవలెనే, ఇతిచేత్ = పురుషప్రేరణమువలనఁ బ్రధానము ప్రవర్తించునంటివేని, తథాపి - అట్లయినను, దోషము అనివార్యము.

తా॥ దృక్ఛక్తిసంపన్నుఁడును, గమనశక్తివిహీనుండు నగు పంగుఁడొకఁడు గమనశక్తిసంపన్నుఁడును, దృక్ఛక్తివిహీనుఁడు నగు నంధు నొకని నధిష్ఠించి (భుజములమీఁద నెక్కి) వానిఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు. స్వయముగాఁ బ్రవర్తింపఁజాలని యయస్కాంతము (సూదంటురాయి) లోహమును బ్రవర్తింపఁజేయుచున్నది. ఇటులనే చేతనుఁడగుపురుషుఁడచేతనమగు ప్రధానమును బ్రవర్తింపఁజేయుచున్నాఁడని చెప్పినను, సాంఖ్యమతమునఁ బ్రసక్తించిన దోషము అనివార్యము.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ చైతన్యమాత్రశరీరుఁడగు పురుషుఁడు నిర్వ్యాపారుఁడే యైనను, ప్రధానము దర్శనశక్తిలేనిదియే యైనను, పురుషుని సాన్నిధ్యము మూలమున ప్రధానము ప్రవర్తించుచున్నది, మనము లోకమునందట్లు చూచుచున్నాము. దృష్టాంతము:—గమనశక్తి విహీనుఁడును, దృక్ఛక్తి సంపన్నుఁడు నగుపంగుని (కుంటివాని) సాన్నిధ్యమున వాని దర్శనశక్తిచే నుపకరింపఁబడినవాఁడును, దృక్ఛక్తివిహీనుండును, గమనశక్తిసంపన్నుఁడునగు నంధుఁడు ప్రవర్తించుచున్నాఁడు. అయస్కాంతముయొక్క సాన్నిధ్యమున నుండుటచే లోహము ప్రవర్తించుచున్నది. ఇవ్విధముగ ప్రకృతిపురుషసంబంధమువలన ఈ ప్రపంచము గలుగుచున్నది. అట్లే గదా సాంఖ్యకారికయందుఁ జెప్పఁబడియె.

శ్లో॥ పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య।
పఙ్గ్వన్ధవదుభయోరపి సంయోగ స్తత్కృత స్సర్గః॥

తా॥ పురుషునికి ప్రకృతిదర్శనరూపమైన భోగము కొఱకును, తద్వియోగరూపమైన కైవల్యము కొఱకును ప్రకృతి ప్రవర్తించుచున్నది. గమనశక్తిలేక దర్శనశక్తిగల పంగు వొకఁడును,దర్శనశక్తిలేక గమన శక్తిగల యంధుఁడొకఁడును తమ తమ లోపములచేఁ గమ్యస్థానమునకుఁ బోనేరక దైవవశమున నిద్దఱొకచోఁ గూడిరేని, యప్పుడు పరస్పర సహాయముఁ గోరి యంధుఁడు పంగువునెక్కించుకొనఁగా, పంగువు అంధునకుఁదారి చూపఁగా, గమనప్రవృత్తి గలుగుచున్నది. అట్లే కర్తృత్వశక్తిగలిగి చైతన్యములేని ప్రకృతిని చైతన్యము గలిగి కర్తృత్వములేని పురుషుఁడధిష్ఠింపఁగా, ఇట్టిసంబంధము వలన ప్రకృతిపరిణామ రూపమగు ప్రవృత్తి అనఁగా సృష్టి గలుగుచున్నది.

అనఁగా, పురుషునికి ప్రకృతియొక్క భోగమును కైవల్యమును గలుగఁ జేయుటకై పురుషసాన్నిధ్యము వలనఁ బ్రధానము సృష్ట్యాదుల విషయమై ప్రవర్తించుచున్నదని యెఱుంగునది.

సమాధానము.

ఒకవేళ ఇట్లయినను, ప్రధానమునకు జగత్సృష్టి విషయమై ప్రవృత్తి సంభవింపకపోవుట అట్లేయుండును. ఏలననిన, పంగువు గమనశక్తివిహీనుండైనను, మార్గదర్శనము, మార్గోపదేశము మొదలగు అప్పుడప్పుడు గలుగునట్టి విశేషములు వేలకొలఁది గలవు. అంధుండును చేతనుండైనందున వానియుపదేశ ప్రకారము ప్రవర్తించుచున్నాఁడు. అట్లే అయస్కాంతమణికిన్ని సమీపమునకు వచ్చుట మొదలగు విశేషములనేకములుగలవు. పురుషుండన్ననో, నిర్వ్యాపారుఁడుగాన, నవి యేవియును వాని విషయమై సంభవింపవు. మఱియు ప్రకృతి పురుషసన్నిధానము నిత్యమైనదయినందున, అందునుబట్టి గలుగు సృష్టియును నిత్యమును గలుగునదియే యగును. పురుషుఁడు నిత్యముక్తుఁడు గాన, నతనికి బంధమోక్షములే లేకపోవలసివచ్చును.

౬॥ సూ॥ అఙ్గిత్వానుపపత్తేశ్చ.

టీ॥ అఙ్గిత్వానుపపత్తేః - చ = త్రిగుణములు పరస్పరము అంగాంగీభావమును పొందుటకు ఉపపత్తిలేక పోవుటవలనను్ను (ప్రధానమునకు ప్రవృత్తి లేదని సిద్ధించుచున్నది.)

తా॥ సత్త్వరజస్తమోగుణములు పరస్పరము అంగాంగీభావమును పొందుటకు ఉపపత్తిలేక పోవుటంజేసి ప్రధానమునకు సృష్టియందు ప్రవృత్తి సంభవింపదు.

శ్రీ॥ భా॥ సత్త్వరజస్తమోగుణముల న్యూనాధిక్యతనుబట్టి యుండునది యగు నంగాంగీభావమువలనఁగదా సృష్టిగలుచున్నదని "ప్రతిప్రతిగుణాశ్రయవిశేషాత్" అనుటచే నారంగీకరించుచున్నారు. ప్రళయకాలమున సమముగానుండునట్టి ఈ సత్త్వరజస్తమస్సులకు పరస్పరము ఎచ్చుతక్కువలు లేకుండుటంజేసి, యంగాంగీభావము అసంభవము గాన, జగత్సృష్టియే సంభవింపదు. ప్రళయమునను వానికి ఎచ్చుతక్కువలు గలవని యంగీకరించు పక్షమున, ఎల్లప్పుడును సృష్టిగలుగుచునే యుండవలయునని ప్రసక్తించును. కావునను చేతనునిచే నధిష్ఠింపఁబడని కేవలప్రధానము జగత్కారణము గానేరదు.

౭॥ సూ॥ అన్యథానుమితౌ చ జ్ఞశక్తివియోగాత్.

టీ॥ అన్యథా = వేఱు విధముగా, అనుమితౌచ = అనుమానము చేసినను, జ్ఞశక్తివియోగాత్ = జ్ఞాతృత్వశక్తిలేక పోవుటవలన (పూర్వోక్తములగు రచనానుపపత్తి ప్రవృత్త్యభావాది దోషములు విడువకయున్నవి.)

తా॥ వేఱొక విధమున ననుమానము చేసినచో, జ్ఞాతృత్వశక్తిలేక పోవుటంజేసి, పూర్వము గానఁబఱచిన దోషములు విడువకయుండును.

శ్రీ॥ భా॥ ఆక్షేపించిన విధమునకంటెను వేఱొక విధమున ననుమానముచేసినచో, ప్రధానమునకు జ్ఞాతృత్వశక్తి లేకపోవును. అందువలన పూర్వము గానఁబఱచిన దోషములు విడువకయుండును. కావున, ఎవ్విధమున నాలోచించినను, అనుమానముచే ప్రధానమును నిరూపించుట దుర్లభము.

౮॥ సూ॥ అభ్యుపగమేఽప్యర్థాభావాత్.

టీ॥ అభ్యుపగమేఽపి అనుమానముచే ప్రధానము సిద్ధించునని యంగీకరించినను, అర్థాభావాత్ ప్రయోజనములేనందున, (న అది యనుమానముచే నిరూపింపఁదగదు.

తా॥ అనుమానముచే ప్రధానము సిద్ధించునని యంగీకరించినను, ప్రధానమువలనఁ బ్రయోజనమెద్దియులేదు గాన, నది యనుమానముచే నిరూపింపఁదగదు.

శ్రీ॥ భా॥ అనుమానప్రమాణముచే ప్రధానము సిద్ధించునని యంగీకరించినను, ప్రధానమువలనఁ బ్రయోజన మేదియులేనందున, నది యనుమానముచే నిరూపింపఁదగదు. ఏలయనిన, "పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య" అనఁగా "ప్రధానము పురుషునికి దర్శనరూపభోగము కొఱకును, కైవల్యముకొఱకునున్న" అనిచెప్పుటచే పురుషునికి భోగమోక్షములఁ గలుగఁజేయుటయేగదా ప్రధానమువలని ప్రయోజనముగాఁ దెలియుచున్నది. అది సంభవింపదు. ఎట్లనిన, పురుషుఁడు చైతన్యమాత్ర స్వరూపుఁడును, నిర్వ్యాపారుఁడును, నిర్వికారుఁడును, నిర్మలుఁడును, కావుననే నిత్యముక్తస్వరూపుఁడును నైనందున, నతనికి ప్రకృతి దర్శనరూపమగు భోగమున్ను తద్వియోగరూపమగు మోక్షమున్ను గలుగుట యసంభవము. ఇవ్విధమైనవాఁడే యగు పురుషునికి ప్రకృతిసాన్నిధ్యమువలనఁ దత్పరిణామరూపములగు సుఖదుఃఖముల దర్శనరూపమగు భోగము సంభవమగు పక్షమున, అట్టి ప్రకృతిసాన్నిధ్యము నిత్యము గాన, నీపురుషుని కట్టి సుఖదుఃఖభోగానుభవమునుండి యెన్నఁడును విముక్తియే లేకుండవలసి వచ్చును.

౯॥ సూ॥ విప్రతిషేధాచ్చాసమఞ్జసం.

టీ॥ విప్రతిషేధాచ్చ సాంఖ్యమతము పరస్పర విరోధములు గలదైనందునను, అసమఞ్జసం - అసంగతము.

తా॥ సాంఖ్యుల మతమున పరస్పర విరోధములుండుటను బట్టియు ఆ మతము అసంగతము,

శ్రీ॥ భా॥ సాంఖ్యుల మతము పరస్పర విరోధములు గలదై నందునను అసంగతము. ఎట్లనిన. వారు ప్రకృతిని వేఱొకదానికై యేర్పడినదానిని గాను, దృశ్యపదార్థమును గాను, భోగ్యవస్తువును గాను నంగీకరించి, పురుషుని యట్టిప్రకృతి ననుభవించువానిని గాను, ప్రకృతి నధిష్ఠించి యుండువానినిగాను, ద్రష్టనుగాను, సాక్షిభూతుని గాను నంగీకరించి, అట్టి ప్రకృతిరూపమగు సాధనముచే ఆ పురుషునికి కైవల్య రూపమగు ప్రాప్యము గలుగునని చెప్పుచున్నారు. ఇట్లు చెప్పుచు వీరు ఆపురుషుఁడు ఎన్నఁడును మార్పును పొందనట్టి స్వరూపము గలవాఁడును, చైతన్య మాత్ర స్వరూపుఁడునగుటచే నతఁడు దేనికిని కర్తగాఁడనియు కైల్యమే యతని స్వరూపమనియును చెప్పుదురు. కనుకనే బంధ విముక్తికి గానగు సాధనానుష్ఠానము సయితము, ప్రకృతితో సంబంధించినదియే యని చెప్పుదురు. ఇట్లు నిర్వికారుఁడును, ఉదాసీనుఁడు నగు పురుషుని సాన్నిధ్యమునుబట్టి ప్రకృతి పురుషులలో నొకటిని వేఱొకటినిగా భ్రమించుటచే జగత్సృష్టి మొదలగునవి గలుగుననియు, అట్టి ప్రకృతి, పురుషునికి భోగమును మోక్షమునున్ను గలుగఁజేయుటకై, యేర్పడినదనియును చెప్పుదురు. ఎట్లనిన,

సాంఖ్యమతము ననువదించుట

శ్లో॥ సంఘాతపరార్థత్వాత్ త్రిగుణాదివిపర్యయాదధిష్ఠానాత్।
పురుషోఽస్తి భోక్తృభావాత్ కైవల్యార్థప్రవృత్తేశ్చ॥
సాంఖ్యకారిక. ౧౭

తా॥ ప్రకృతి చిత్రవిచిత్ర వస్తుసమూహమైన జగత్తుగాఁ బరిణమించుచున్నది గదా! ఇట్టి పదార్థసమూహము వ్యర్థముగా నేర్పడి యుండునా? అది వేఱొకనికోసమే యేర్పడి యుండవలయును. కావున నట్టివేఱొకఁడుండవలయును. ప్రకృతియొక్క గుణములు మూఁడును, తత్కార్యములును జడము లగుటచే నధిష్ఠాతలు కాఁజాలవు, కావున, వానికంటె విలక్షణుఁడైన యధిష్ఠాత యొకఁడుండవలయును. ప్రకృతి భోగ్యమైనది గాన, దానిననుభవించువాఁడొకఁడు గావలయును. ప్రకృతి తనచే బద్ధుఁడైన యొకనిని ఈ బంధమునుండి విడిపించుటకై ప్రవర్తించుటవలన నట్టి బద్ధుఁడొక్కఁడు ఉండవలయును. ఈపైని గనఁబఱచిన హేతువులవలన పురుషుఁడొక్కఁడు గలఁడని యేర్పడుచున్నది.

శ్లో॥ తస్మాచ్చ విపర్యాసాత్సిద్ధం సాక్షిత్వమస్య పురుషస్య।
కైవల్యం మాధ్యస్థ్యం ద్రష్టృత్వ మకర్తృభావశ్చ॥
సాంఖ్యకారిక. ౧౯

తా॥ అట్లు సత్త్వరజస్తమస్సుల యెచ్చుతక్కువలనుబట్టి యీ పురుషునికి సాక్షిత్వము సిద్ధించుచున్నది. మఱియు ఈతనికి కేవలుఁడుగానుండుటయు, మధ్యస్థుఁడుగా నుండుటయు, ద్రష్టగానుండుటయు, దేనికిని కర్తగాకుండుటయు నివి సిద్ధించుచున్నవి.

మఱియు సాంఖ్యులు,

శ్లో॥ పురుష విమోక్ష నిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య ॥

సాంఖ్యకారిక. ౫౬.

తా॥ పురుషునికిని ముక్తిని గలుగఁజేయుటకై ప్రవర్తించునది ప్రకృతియే.

ఇవ్విధముగాఁ జెప్పి, యనంతరము,

శ్లో॥ తస్మాన్నబధ్యతే నాపి ముచ్యతే నాపి సంసరతి కశ్చిత్ ।
సంసరతి బధ్యతే ముచ్యతే చ నానాశ్రయా ప్రకృతిః ॥

సాంఖ్యకారిక. ౬౨

తా॥ కావున బంధమునవుండువాఁడును గాని, మోక్షమును బొందువాఁడునుగాని, సంసారము నఁబ్రవర్తించు వాఁడును గాని యెవ్వఁడును లేఁడు అయితే సంసారమునఁ బ్రవర్తించునదియు, బంధములో నుండినదియు, విముక్తిని బొందునదియును నానావిధవస్త్వాశ్రయమగు ప్రకృతియే.

అట్లే,

॥ తస్మాత్తత్సం యోగా దచేతనం చేతనావదివ లింగం ।
గుణకర్తృత్వేచ తథా కర్తేవ భవత్యుదాసీనః ॥

సాంఖ్యకారిక. ౨౦

తా॥ చైతన్యవంతుఁడగు పురుషునితో సంయోగమువలన, నచేతమగు మహదాది పదార్థజాతము చైతన్యముగల దానివలె నగును. అట్లే "ధర్మము చేయుదును, అధర్మము చేయుదును" ఈ మొదలగు నధ్యవసాయాది కార్యములను గుఱించి గుణములే వాస్తవమునకు కర్తలైనను, ఉదాసీనుఁడగు పురుషుఁడు కర్తవలెనగుచున్నాఁడు.

శ్లో॥ పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం ప్రధానస్య ।
పఙ్గ్వన్ధవదు భయోరపి సంయోగస్తత్కృతస్సర్గః ॥

సాంఖ్యకారిక. ౨౧

తా॥ పురుషునికి ప్రకృతిపరిణామాది దర్శనరూపమగు భోగము కొఱకును తద్వియోగరూపమైన మోక్షము కొఱకును ప్రకృతిపురుషులకు

సంయోగము గలుగుచున్నది. ఈ ప్రకృతిపురుషసంయోగము పఙ్గ్వన్ధుల సంయోగమువంటిది. అట్టి సంయోగవలననే జగత్సృష్టి రూపమగు కార్యమును గలుగుచున్నది.

నిత్యుఁడును, నిర్వికారుఁడును, అకర్తయును, ఉదాసీనుఁడును, కైవల్యమే స్వరూపముగాఁ గలవాఁడును, నగువానికి సాక్షిత్వ, ద్రష్టృత్వ, భోక్తృత్వాదు లుండుట యసంభవము. ఇట్టి స్వరూపము గలవానికి అధ్యాసరూపమగు భ్రమమున్ను గలుగుట యసంభవము. అధ్యాస భ్రమములును వికారములే గదా! ప్రకృతికిని యవి గలుగుట యసంభవము. ఏలననిన, అవి చేతనపదార్థము యొక్క ధర్మములు. చేతనుఁడగువాఁడు భ్రాంతివశమున నొకదాని ధర్మములను వేఱొకదాని ధర్మములనుగాఁ దలంచుటను గదా అధ్యాస మందుగు. అట్టిదియగు నధ్యాసము చేతనుని ధర్మము. మఱియు నది యొక వికారము. ప్రకృతి యొక్క సాన్నిధ్యమున నున్నంతమాత్రమున చేతనునికి అధ్యాసాదులు గలుగుట యసంభవము. అతఁడు యెట్టి వికారములును లేనివాఁడు గదా. అట్లు ఆ వికారములు పురుషునికిఁ గలుగుట సంభవ మగునేని, అట్టివికారములు పురుషునికి యెల్లకాలము గలవని ప్రసక్తించును. సాన్నిధ్య మాత్రమునఁ బ్రయోజన మెద్దియును లేదని "న విలక్షణత్వాదస్యతథాత్వంచశబ్దాత్" (బ్ర సూ. ౨ అ. ౧ పా. ౪ సూ) అను సూత్రమునఁ బ్రతిపాదించి యున్నాము. ప్రకృతి వలననే పురుషుఁడు సంసారముగలవాఁడును, బంధముగలవాఁడును, ముక్తి గలవాఁడును నగు పక్షమున, ఆప్రకృతి నిత్యముక్తుఁడగు పురుషుని యుపకరించునది యెట్లు కాఁగలదు? అట్లే కదా సాంఖ్యులు చెప్పుచున్నారు.

(మార్జిన్: సాంఖ్యమత విమర్శనము)

శ్లో॥ నానావిధైరుపాయై రుపకారిణ్యానుపకారిణః పుంసః ।
గుణవత్యగుణస్య సత స్తస్యార్థ మపార్థకం చరతి ॥

సాంఖ్యకారిక, ౬౨

తా॥ సత్త్వరజస్తమోగుణయుక్తమగు ప్రకృతి యట్టి గుణములులేనివాఁడును, ఏన్నఁడును తన కొఱకు యుపకారమునొనర్చి యుండనివాఁడు నగు పురుషుని నుపకరించుటకై స్వప్రయోజనమేదియును లేకయే ఆ పురుషునికి గానే నానావిధోపాయములచే ప్రవర్తించుచున్నది.

మఱియు ఆ ప్రకృతి, యే పురుషునిచే నట్టిస్వభావము గలదిగాఁ జూడఁబడుచున్నదో, ఆపురుషునినుండి యప్పుడే నివర్తించుచున్నదనియును సాంఖ్యులు చెప్పుచున్నారు. ఎట్లనిన,

శ్లో॥ రఙ్గస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథానృత్తాత్ ।
పురుషస్య తథాత్మానం ప్రకాశ్య నివర్తతే ప్రకృతిః ॥

సాంఖ్యకారిక. ౫౯

తా॥ ఒక నాట్యముచేయుస్త్రీ రంగస్థలమునఁ దన్నుఅనఁగా తనయాటనుఁ జూపి తీఱినదే యెట్లు నివర్తించునో, అట్లేప్రకృతియును దన్ను పురుషునికిఁ దెలిపి వాఁడు తనదోషములఁ గనుఁగొనఁగానే తనంతనే నివర్తించుచున్నది.

శ్లో॥ ప్రకృతే స్సుకుమారతరం న కిఞ్చిదస్తీతి మే మతిర్భవతి ।
యా దృష్టాస్మీతి పునర్నదర్శన ముపైతి పురుషస్య ॥

సాంఖ్యకారిక. ౬౧

తా॥ ప్రకృతికంటెను యెక్కువ సుకుమారమైనది మఱి యేదియును లేదని నాతలంపు. ఏలననిన, ప్రకృతి తానుచూఁడఁబడితినని మరల పురుషునికిఁ గానఁబడదు.

ఈ పైని గనఁబఱచిన ప్రకారము సాంఖ్యులు చెప్పునదియును అసంగతము. ఏలననిన, పురుషుఁడు నిత్యముక్తుఁడును నిర్వికారుఁడును నైనందున, నతఁడు ప్రకృతి నేన్నఁడును జూఁడడు. మఱియు నతఁడు ప్రకృతియొక్క గుణములను గూడ తనయందారోపించుకొనఁడు. ప్రకృతి స్వయముగా నచేతనమైనందున,నదియును తన్ను చూచుకొన నేరదు. మఱియు నది పురుషునియొక్క దర్శన శక్తిని తనదిగాను తనయందారోపించు కొనదు. ఏలనినన, అది స్వయముగా నచేతన వస్తువు. మఱియు పురుషుఁడును అట్టి దర్శనరూపమగు వికారము గలవాఁడు కాఁడు. దర్శనమనఁగా పురుషునికిఁగల ప్రకృతిసాన్నిధ్యమే యని వారు చెప్పుదురేమో, అట్లనిరేని, యట్టి సాన్నిధ్యము నిత్యమైనది గాన, దర్శనమును నిత్యమైనదని ప్రసక్తించును. ఇంతియెకాక, నిత్యనిర్వికారుఁడగు పురుషునికి తన స్వరూపముకంటెను వేఱుగ కాదాచిత్కమగు సాన్నిధ్యమనఁబడునది యొక్కటి యుండుటయును అసంభవము. ఒకవేళ, సాన్నిధ్యమే దర్శనమనియు, అదియే మోక్షహేతువనియును వారందురేమో, అట్లనిరేని, అటులనే యది బంధహేతువు నయితము గాన, బంధమున్ను మోక్షమున్ను నిత్యములే యగును. అయథాదర్శనము బంధహేతువనియు, యథావత్స్వరూపదర్శనము మోక్షహేతువనియును వారందురేమో, అట్లనిరేని, ఈ యుభయవిధ దర్శనమును సాన్నిధ్యరూపమైనదియే గాన, ఎల్లప్పుడు రెండును ప్రసక్తింపక తప్పవు. ఒకవేళ వారు అట్టి ప్రకృతిపురుషసాన్నిధ్యము అనిత్యమనిరేని, యందులకు హేతువును గాన్పింప వలసివచ్చును. తరువాత దానికి

హేతువును గాన్పింపవలసివచ్చును. ఇట్లు అనవస్థాదోషము ప్రసక్తించును. వారొకవేళ, ఈదోషమునుండి తప్పించుకొనుటకై ప్రకృతిపురుషుల స్వరూపమే యట్టి సాన్నిధ్య మందురేమో, అట్లనిరేని, స్వరూపము నిత్యము గాన, బంధమోక్షములు సయితము నిత్యములే యని ప్రసక్తించును. ఇట్లు పరస్పర విరుద్ధమైనందున, సాంఖ్యుల మతము అసంగతము.

అద్వైతమత విమర్శనము.

కూటస్థనిత్య నిర్విశేష స్వప్రకాశ చిన్మాత్రమగు బ్రహ్మము అజ్ఞానసాక్షియగుటంజేసి యది పరమార్థభూతములుగాని బంధమోక్షములను బొందునదియని చెప్పునట్టి యద్వైతుల మతమునను, ఈపైని గనంబడిన ప్రకారము, బ్రహ్మమునకు అజ్ఞానసాక్షిత్వము మొదలగు నధ్యాసములు గలుగుట యసంభవముగాన, వారి మతమును అసంగతమే. అయితే వీరికిని సాంఖ్యులకును గల భేదమేమనిన, సాంఖ్యులు జననమరణ నియతికి గాను ఒకవ్యవస్థను గలుగఁ జేయుటకై

సాంఖ్యాద్వైత మతములకుఁ గల తారతమ్యము.

పురుషులు (ఆత్మలు) అనేకులని యంగీకరించుచున్నారు. వీరో, అంతమాత్రమైనను అంగీకరింపరు. కావున వీరిమత మెంతమాత్రము యుక్తమైనది కాదు. (సాంఖ్యమతమున) ప్రకృతి పరమార్థ వస్తువుగాఁ దలంపఁ బడుచున్నదనియు, (అద్వైతమున) అది అపరమార్థ వస్తువుగాఁ దలపఁబడుచున్నదనియు, ఇదియే యీ రెంటికిఁ గల భేదమనియును చెప్పుట గలదు. అయితే ప్రకృతి పరమార్థ వస్తువైనను, అపరమార్థవస్తువైనను, నిత్యనిర్వికార స్వప్రకాశైకరస బ్రహ్మైక్య స్వరూపుఁడు దానిని తనస్వరూపము కంటెను వేఱుగాఁ దెలిసికొనుట యసంభవము. అట్లు అది యపరమార్థవస్తువగు పక్షమున, నది దృశ్యమనియు, బాధ్యమనియు, నంగీకరింపఁబడును. అందువలనను సాంఖ్యమతము సుతరామసంగతము.

యాదవప్రకాశ మతవిమర్శనము.

భేదాభేదములు ఉపాధినిబన్ధనములనెడి యాదవప్రకాశుని మతమునను, ఉపాధిసంబంధముగల బ్రహ్మముయొక్క స్వభావమున్న ఇట్టిదియే గాన, బ్రహ్మమున కట్టి యుపాధితో సంబంధముండుట యసంభవమగుటంజేసి, యీ మతమును అసంగతమేయని యింతకుఁ బూర్వము చెప్పఁబడియె.

రచనానుపపత్త్యధికరణము ముగిసెను.

## మహద్దీర్ఘాధికరణము.

**౧౦॥ సూ॥ మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమణ్డలాభ్యాం.**

టీ॥ హ్రస్వపరిమణ్డలాభ్యాం = ద్వ్యణుక పరమాణువులవలన, మహద్దీర్ఘవత్ = త్ర్యణుకోత్పత్తిగలుగుననెడి వాదమువలెనె, (అసమఞ్జసం=వైశేషికులుచేయు మఱియే వాదమును అసంగతము)

తా॥ ద్వ్యణుక పరమాణువులనుండి త్ర్యణుకోత్పత్తి గలుగునని యిట్లు వైశేషికులుచేయు వాదమునవలెనె, వారు చేయునట్టి యన్నివాదములును అసంగతములు.

ప్రధానము జగత్కారణమను వాదము యుక్త్యాభాస మూలక మగుటంజేసి పూర్వాపర విరుద్ధము. కావున నది యసంగతమని పూర్వాధికరణమునఁ జెప్పఁబడియె. పరమాణువులు జగత్కారమనెడి వైశేషికుల వాదము సయితము అసంగతమని యీ యధికరణమునఁ బ్రతిపాదింపఁ బడుచున్నది.

పూర్వాధికరణ సంబధము.

ద్వ్యణుకపరమాణువులనుండి త్ర్యణుకాది క్రమమున జగత్తు గలుగు చున్నదను వాదమువలెనే, అనఁగా పరమాణువులవలనఁ ద్వ్యణుకము (రెండణువుల పరిమాణముగలది) గలుగుననియు, ద్వ్యణుకమునుండి త్ర్యణుకము (మూఁడణువుల పరిమాణముగలది) గలుగుననియు నివ్విధముగ జగత్తు గలుగుచున్నదనియు నిట్లు 1 వైశేషికులు చేయు వాదమువలెనె వారుచేయునట్టి మఱియే వాదమును అసంగతమైనదియే. అదియెట్లనిన, తన్తువులు మొదలగు నవయవములు తమయొక్క యంశములగు నాఱు పార్శ్వములతోఁ జేర్పంబడినవై యొక యవయవిని గలుగఁ జేయుచున్నవి. పరమాణువులును తమ యవయవములగు నాఱుపార్శ్వములతోఁ జేర్పంబడినవియే యై ద్వ్యణుకము మొదలగువానిని గలుగఁజేయ వలయును. అట్లుకాకున్న, పరమాణువులకు ప్రదేశభేదము లేని పక్షమున, వేయి పరమాణువులు చేరినను, ఒక్కపరమాణువు కంటెను భిన్నమయిన పరిమాణము గలుగకపోవుటంజేసి, యణుపరిమాణ మగుటయు, హ్రస్వపరిమాణ మగుటయు, మహత్పరిమాణ మగుటయు, దీర్ఘపరిమాణ మగుటయును నీమొదలగునది సిద్ధింపకపోవును.

వైశేషికమత విమర్శనము.

---

(i) వైశేషికమతము:—విశేష మనుపదార్థమును ముఖ్యముగా నిరూపించున దగుటచే నిది వైశేషికమనియు, కణాదుఁడు ఏర్పఱచినదగుటచే కాణాదమనియు జెప్పఁబడును. ఇందు ప్రత్యక్షానుమానములు రెండుప్రమాణములు. శబ్ద మనుమానములోఁ జేరినదని యిందలి మతము. ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయము లని పదార్థము లాఱు. ఇటీవల

పరమాణువులకు ప్రదేశభేదము గలదని యంగీకరించు పక్షమున, పరమాణువులుగూడ తమయందుండు నట్టి యవయవములను బట్టి అవయవములు గలవియే యగును. అందువలన వాని యవయవములు గూడ తమయవయవములను బట్టి యవయవములు గలవియగును. ఇట్లు అనవస్థాదోషము ప్రాప్తించును. అవయవములయందుండు ఎచ్చుతక్కువలను బట్టి ఆవగింజకును పర్వతమునకును భేదము సిద్ధించుననియును చెప్పఁదగదు. ఏలననిన, పరమాణువు అనంతావయవములుగలది యగుపక్షమున, ఆవగింజకును పర్వతమునకును సయితము అట్లు అనంతావయవములను గలిగియుండుట సమానమే గాన, వాని స్వరూపములకు భేదము సిద్ధింపక పోవును. కాఁబట్టి అవయవములు బొత్తుగ తగ్గియుండునట్టి యవస్థ యొక్కటి కలదని తప్పక యంగీకరింప వలయును.

పరమాణువులకు ప్రదేశభేదములేని పక్షమున, ఒక్కపరమాణువు యొక్కపరిమాణము కంటెనుభిన్నమగు పరిమాణము అనఁగా వైపుల్యము సిద్ధింపదు. కావున ఆవగింజయనియు పర్వతమనియు నిట్లు భిన్నభిన్న పరిమాణములు గల వస్తువులే లేకపోవలసివచ్చును. అందులకై యేమిచేయుదు ననియెదవా, వేదములందు గానఁబడుచిన పద్ధతి నవలంబించుట మంచిది.

---

అభావ మనుపదార్థ మొకటి చేర్పఁబడినది. ఇట్లు ప్రమాణ పదార్థ గణనమునందప్పఁ దక్కిన విషయములం దిది యించుమించుగా నైయాయిక మతమువంటిదే యగును.

అవయవముల కూడికచేత నవయవి గలుగును. కనుక అవయవులైన కొండకును ఆవగింజకును అవయవము లుండవలయును. అవయవముల మొత్తమునందలి యెక్కువతక్కువలచేత నారెంటికిని పరిమాణమునందు వైషమ్యము కలుగ వలయును. ఇట్లవయవముల మొత్తముల కెక్కువ తక్కువలు గలుగుటకు మిక్కిలియుఁ జిన్నవియై కావుననే నిరవయవములై యున్నట్టి యవయవము లుండవలయునని యొప్పుకొనఁదగును. ఆచిన్న యవయవములకును అవయవము లున్నవన్నయెడల నాయవయవములకును మఱి యవయవము లుండవలయునని యిట్లే యనవస్థ గలుగును. ఈ యనవస్థచే కొండయొక్క యవయవములును ఆవగింజ యవయవములును రెండును అనంతములగును గాన నారెంటి మొత్తముల కెక్కువ తక్కువలు లేమిచే వానివలనఁబుట్టు పరిమాణవైషమ్యమును సిద్ధింపదు. ఈ వైషమ్యసిద్ధికై తమకంటె నవ్వల చిన్నవిలేనట్టియు, నిరయవములైనట్టియు నవయవము లుండఁదగునని యొప్పుకొని తీఱవలయును. ఇట్టి యవయవములే పరమాణువులు. ఈశ్వరేచ్ఛాహితవిశేషమైన యదృష్టముతోఁగూడిన పరిపక్వజీవునితోడి సంయోగముచే నీయణువులకు క్రియ గలుగును. ఈక్రియచే నివి ద్వ్యణుక త్ర్యణుకాదులుగాఁ గూడి జగత్తును బుట్టించుచున్నవి. 'అగ్నే రూర్ధ్వజ్వలనం వాయో స్తిర్యగ్గమన మణుమనసో శ్చాద్యం కర్మాదృష్టకారితాని' అన్నట్లివి యెల్ల సాంఖ్యప్రోక్తప్రధానముయొక్క సత్త్వాదిగుణములచేఁ గలుగునవి కాక, పరమాణువులం దదృష్టప్రేరితమైన క్రియచేఁ గలుగునని యిందలి సిద్ధాంతము.

ఈ సూత్రము బ్రహ్మకారణవాదమును గుఱించిన దూషణములను పరిహరించుటకై ప్రవర్తించినదని అద్వైతులు వ్యాఖ్యానముచేసియున్నారు గాని, వారి వ్యాఖ్యానము అసంగతము. అందు పౌనరుక్తి దోషము సయితము కలదు. ఎట్లనిన, బ్రహ్మకారణవాదమును గుఱించి యితరులు గానఁబఱచిన దోషములను కడచిన పాదమున పరిహరించి, ప్రకృతమునఁ ఇతరుల మతములను గదా! నిరసింపుచున్నారు. చేతనుఁడగు బ్రహ్మమునుండి జగత్తు గలుగుట సంభవమేయని "న విలక్షణత్వా దస్య తథాత్వంచ శబ్దాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౪ సూ) అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. ద్వ్యణుకమునుండియు పరమాణువులనుండియు మహత్పరిమాణముగలదియును, దీర్ఘపరిమాణము గలదియును, అణుపరిమాణము గలదియును, హ్రస్వపరిమాణముగలదియును గలుగుననెడి వాదమువలెనే వైశేషికు లంగీకరించునది యంతయు నసంగతమని యీసూత్రము యొక్క యర్థము.

అద్వైతుల సూత్రార్థమును విమర్శించుట

అవతారిక:— అట్లు అసంగతమయినది మఱియేది యనిన,

౧౧॥ సూ॥ ఉభయథాపి న కర్మాతస్తదభావః.

టీ॥ ఉభయథాపి = రెండు ప్రకారములను, కర్మ — కర్మము, న = సంభవింపదు. అతః = అందువలన. తదభావః = దానినిబట్టి గలుగునట్టి సృష్టియును సంభవింపదు.

తా॥ కర్మము ఆత్మనిష్ఠమగు నదృష్టమువలనఁ గలుగునది యని యంగీకరించినను, లేక, అది పరమాణునిష్ఠమగు నదృష్టమువలనఁ గలుగునదియని యంగీకరించినను, ఈ రెండువిధములను కర్మము అసంభవము గాన, అందును బట్టి గలుగునదిగా నంగీకరింపఁబడిన జగత్సృష్టియును గలుగనేరదు.

శ్రీ॥ భా॥ పరమాణువులు జగత్కారణమని వాదించు [1]వైశేషికుల మతమున, పరమాణువులయందుండునట్టి కర్మము (క్రియ) వలనఁగలుగు సంయోగవశమున ద్వ్యణుకపరిమాణముగల వస్తువు గలుగుచున్నది. అట్లే త్ర్యణుకాది పరిమాణములుగల వస్తువులు గలుగుచున్నవి. అట్లే క్రమముగ జగత్తున్ను గలుగుచున్నది. ఇట్లు సమస్తజగత్తుయొక్కయును ఉత్పత్తికి

1. వీరు ప్రతిపాదించునట్టి యుత్పత్తిక్రమ మెట్లన, నల్లనికుండ పెంకులై, చతురణుకములై, త్ర్యణుకములై, ద్వ్యణుకములగును. ఈద్వ్యణుకము నశింపఁగాఁ గలిగిన పరమాణువునందు పాకమువలన పూర్వమున్న రూపాదులు నివర్తించును. పిదప నింకొక పాకమువలన దానికి రక్తత్వాదులు గలుగును. పిదప నదృష్టవంతమైన యాత్మతోడి సంయోగముచే దానియందు ద్రవ్యారంభమునకై క్రియ గలుగును. ఆక్రియచేనది పూర్వదేశమునుండి వేఱుపడును. (ఇదియె విభాగ మనఁబడును). ఈ విభాగముచే దానికి పూర్వదేశముతోడి సంయోగము నివర్తింపఁగా నది మఱియొక పరమాణువుతోఁ గూడును. ఇట్లు పూర్వద్వ్యణుకనాశము మొదలుగా నవక్ష

కారణభూతములగు పరమాణువుల యందుండునట్టి మొట్టమొదటి కర్మము అదృష్టమువలనఁ గలుగునదియని వారంగీకరించుచున్నారు. "అగ్నేరూర్ధ్వ జ్వలనం వాయోస్తిర్యగ్గమన మణుమనసోశ్చాద్యం కర్మేత్యదృష్టకారితాని" అనఁగా "అగ్ని జ్వాలలకు ఊర్ధ్వముగా జ్వలించుటయు, వాయువునకు అడ్డముగా వీచుటయు, అణువుల యొక్కయు మనస్సు యొక్కయును మొట్టమొదటి క్రియయును ఇవి యొకవిధమైన యదృష్టమువలనఁ గలుగునవి" అని వారు చెప్పుచున్నారు. అయితే యిట్లు పరమాణువులయందుండు కర్మము వాని యందుండునట్టి యదృష్టము వలనఁ గలుగునదియా? లేక, అది ఆత్మయందుండునట్టి యదృష్టమువలనఁ గలుగునదియా? అది యీరెండువిధములలో నెట్టిదియు నగుట యసంభవము. ఏలననిన, అదృష్టమనఁబడునది శరీరవంతులగు జీవులచే ననుష్ఠింపఁ బడిన పుణ్యాపాపకర్మముల వలనఁ గలుగునది. కావున నది పరమాణువుల యందుండునది యగుట యసంభవము. ఒకవేళ, అది పరమాణువులయందుండుట సంభవమగునేని, యవి సర్వదా జగత్తును గలుగఁ జేయుచునే యుండవలయునని ప్రసక్తించును. ఆ యదృష్టము ఆత్మయందుండునదియగు పక్షమున, అది పరమాణువులయందలి కర్మమును గలుగఁ జేయుట యసంభవము. ఒకవేళ అట్టి యదృష్టముతోఁ గూడియున్నట్టి యాత్మతోఁగల సంబంధమును బట్టి పరమాణువులయందు కర్మము గలుగుచున్నదని వారందురేమో, అట్లగునేని, యా యదృష్టప్రవాహము నిత్యమైన దగుటచేసి, నిత్యమును సృష్టి గలుగుచునే యుండవలసి వచ్చును.

వైశేషికుఁడు:— అదృష్టము పరిపక్వదశనుబట్టి గదా ఫలమునుగలుగఁ జేయఁగలది యగును. కొన్నియదృష్టములు అప్పుడే ఫలించును, కొన్ని జన్మాంతరమున ఫలించును. మఱికొన్ని కల్పాంతరమున ఫలించును. ఇట్లు అదృష్టము పరిపక్వదశను బట్టియే ఫలమును గలుగఁజేయుటయందుఁ బ్రవర్తించునది గాన, నది నిత్యము జగద్రూపమగు ఫలమును గలుగఁజేయు నదియని ప్రసక్తింపదే?

భాష్యకారులు:— అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అనేకులగు నాత్మలచే ముందుగానట్టి యేర్పాటును లేక భిన్నభిన్న కాలములయం దనుష్ఠింపఁబడిన నానావిధ కర్మములవలనఁ గలుగునట్టి యదృష్టము లన్నియును ఏకకాలమున ఏకరూపమగు ఫలమును గలుగఁ జేయుట ప్రామాణికము కాఁదగదు. కావుననే ఏకకాలమున సర్వపదార్థములు నశించుట గాని, ద్విపరార్థకాలము వఱకును

ణుములచే నూతనద్వ్యణుకోత్పత్తి గలుగును. ఈద్వ్యణుకాదులు త్ర్యణుకాదులుగాఁగూడి మరల నుండయగును, "కారణగుణపూర్వకః కార్యగుణః" అన్నట్లు కారణగుణములే కార్యమునకుఁ గలుగుటచే పరమాణువునకుఁ గలిగిన రక్తత్వాదులు ఘటకును గలుగుచున్నవి. ఇదియే పీలుపాకవాద మనఁబడును. పీలు వనఁగా పరమాణువు.

పరిపక్వదశను పొందక యుండుట గాని సమకూడదు. సర్వేశ్వరుని సంకల్ప వశమున కొన్నివిశేషములతోఁ గూడియున్నట్టి యదృష్టముగల యాత్మయొక్క సంబంధమువలన అణువులయందు కర్మము(క్రియ) గలుగుచున్నదని వారుచెప్ప దురేమో, అట్లుచెప్పఁదగదు. ఏలననిన, వారిమతప్రకారము అనుమాన ప్రమాణమువలన సర్వేశ్వరుఁ డొక్కఁడుండుట సిద్ధింపదని "శాస్త్రయోనిత్వాత్" (బ్ర. సూ. ౧ అ ౧ పా ౩ సూ) అనుసూత్రమునఁ గానఁబఱచి యున్నాము. కాఁబట్టి యణువుల యందుండు కర్మవశమున జగత్తు గలుగనేరదు.

౧౨॥ సూ॥ సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః.

టీ॥ సమవాయాభ్యుపగమాత్ - చ = (వైశేషికమతమున) సమవాయము నంగీకరించుటవలనను (అసమఞ్జసం = వైశేషికమత మసంగతము. ఏలననఁగా,) సామ్యాత్ - జాతిగుణాదులకును సమవాయమునకును సామ్యముండుటవలనను, అనవస్థితేః = వ్యవస్థలేకపోవుటవలనను.

తా॥ సమవాయము నంగీకరించుటవలనను వైశేషికమత మసంగతము. ఏలననిన, సమవాయము సయితము జాతిగుణాదులవలెనే పృథక్సిద్ధమైనందున నొక వ్యవస్థయేర్పడదు.

శ్రీ॥ భా॥ సమవాయము నంగీకరించుటవలనను వైశేషికమత మసంగతము. ఏలననఁగా, ఒకద్రవ్యముయొక్క యవయవ జాతి గుణములవలెనే సమవాయము సయితము తన్ను ఉపపాదించుటకు వేఱొక్కదాని యపేక్ష గలది యగుటవలనను, అట్టి వేఱొక్కటి తన్ను ఉపపాదించుటకై వేఱొక్కదాని యపేక్షగలది యగుటవలనను నివ్విధముగ నొకవ్యవస్థ యేర్పడకుండుటవలన నది యసంగతమే. ఎట్లనిన, ఎన్నఁడును వేఱుగాఁ దెలియరానివియు, ఆధారాధేయ భూతములును నగువానిని గుఱించి "ఇది యిక్కడ" అని తెలుపునది సమవాయసంబంధమని వైశేషికు లంగీకరించుచున్నారు. అయితే వేఱుగానుండునట్టివిగా నెన్నఁడును తెలియరానివియగు జాతిమొదలగువానినట్లు వేఱుగాఁ దెలియరానట్లు సంబంధించియుండు వానినిగాఁ దెలుపునదిగాను సమవాయ సంబంధ మంగీకరింపఁబడు పక్షమున, నా సమవాయ సంబంధము సయితము అట్టి జాతిగుణాదులఁవంటిదియే గానదానినట్టి దానినిగాఁ దెలుపుటకై వేఱొక్కదానిని కనిపెట్టవలయును. అట్టి వేఱొక్కటియు నట్టిదియేగాన, దాని నట్టి దానినిగాఁ దెలుపునట్టి వేఱొక్కదానిని కనిపెట్టవలయును. ఇట్లు ఒక వ్యవస్థ యేర్పడదు. అట్లు వేఱుగాఁ దెలియరానిదిగా సంబంధించి యుండుట సమవాయముయొక్క స్వభావమని కల్పించెదనంటివేని, యది జాతిగుణాదులకే స్వాభావికమని కల్పించుకొనవచ్చునే? ఇట్లుండ, ఎన్నఁడునుగానఁబడి యుండని సమ

వాయమనఁబడుదాని నొక్కదానిని యంగీకరించి, దాని కట్లువేఱుగాఁ దెలి యరానిదిగా సంబంధించి యుండుట స్వభావమని కల్పించుకొనుట యుక్తము కాదు.

అవతారిక:— సమవాయ సంబంధము నిత్యమను పక్షమునను, అని త్యమను పక్షమునను, ఈ దోషము సమానము. అందు నిత్యమనెడి పక్షమున ప్రసక్తించు దోషాంతరమును గానఁబఱచుటకై :—

౧౩॥ సూ॥ నిత్యమేవ చ భావాత్.

టీ॥ నిత్యమేవ = జగత్తు నిత్యముగానే, భావాత్-చ = ఉండుటవలనను.

తా॥ సమయవాయము నిత్యమగునేని, జగత్తు నిత్యముగా నుండునది యనిప్రసక్తించును. అందువలనను వైశేషికమత మసంగతము

శ్రీ॥ భా॥ సమవాయ మనఁబడునది యొక సంబంధము గాన, ఆసంబంధ ము నిత్యమగు పక్షమున, నట్టి సంబంధముగల జగత్తున్ను నిత్యము ఉండునది యగును. కావునను వైశేషికమతము అసంగతము.

౧౪॥ సూ॥ రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్.

టీ॥ రూపాదిమత్త్వాచ్చ = పరమాణువులకు రూపాదులు గలవని యంగీకరించుటవలనను వైశేషికమత మసంగతము(ఏలననఁగా) విపర్యయః వ్య త్యాసము గలుగును. (ఏలననఁగా) దర్శనాత్ = అట్లులోకమునఁ గానఁబడుట వలన,

తా॥ పరమాణువులు రూపాదులు గలవియని యంగీకరించుటవలనను వైశేషికమత మసంగతము. అట్లంగీకరించుటవలన పరమాణువులు వారిమత ప్రకారము నిత్యములు కాక, అందులకు విపరీతముగా అనిత్యములని ప్రస క్తించును. అట్లే గదా లోకమునఁ గానఁబడుచున్నది.

శ్రీ॥ భా॥ పృథివీసంబంధులనియు, ఉదకసంబంధులనియు, తేజస్సంబంధు లనియు; వాయుసంబంధులనియు నిట్లు నాలుగువిధములగు పరమాణువులును రూప రస గన్ధ స్పర్శములు గలవని వైశేషికు లంగీకరించుచున్నారు. కావున అవి వారంగీకరించుప్రకారము నిత్యములును, సూక్ష్మములును, నిరవయవ ములును ఇవ్విధములైనవి కాక, అందులకు విపరీతముగా, అనిత్యములును, అవయవయుక్తములునుగానగు నని ప్రసక్తించును. దృష్టాంతము:— రూపాది యుక్తములగు ఘటపటాదిపదార్థములు అనిత్యములుగాను, అట్టి యనిత్య మగు వేఱొక కారణపదార్థము నుండి గలిగినవిగాను నివ్విధమైనవిగాను లోకమునఁ గన్పట్టుచున్నవి గదా! [1]మనకుఁ గానఁబడనిదై మనకుఁ గానఁబడు రీతినిబట్టి

1. శాస్త్రయోని త్వాధికరణమున ఈవాదము విపులముగా వివరింపఁబడినది.

యూహింపఁబడు పదార్థమున, మన కనుకూలములగు విశేషముల నారోపించుకొనుట యశక్యము. [1]వైశేషికులు లోకమునఁ గానఁబడురీతిని బట్టియే గదా పరమాణువులు రూపాదులతోఁగూడియుండున వని కల్పించుచున్నారు. కావునను, వారి మత మసంగతము.

అవతారిక :— ఈ దోషమును తొలఁగించుటకై పరమాణువులు రూపాది రహితములని యంగీకరించెదరా? అట్లంగీకరించితిరేని,

౧౫॥ సూ॥ ఉభయథా చ దోషాత్.

టీ॥ ఉభయథాచ = రెండు విధములను, దోషాత్ – దోషము ప్రసక్తమగుటవలన (వైశేషికమత మయుక్తము.)

తా॥ పరమాణువులకు రూపాదులు గలవను పక్షమునను, రూపాదులు లేవను పక్షమునను, దోషము ప్రసక్తించుటవలన వైశేషికమత మయుక్తము

శ్రీ॥ భా॥ పరమాణువులకు రూపాదులు గలవనుపక్షము మాత్రమే దోషయుక్తము కాదు. వానికి రూపాదులు లేవనెడి పక్షము సయితము దోషయుక్తమైనదియే. ఎట్లనిన, పరమాణువులకు రూపాదులు లేవనుపక్షమున, "కారణపదార్థమునందుండు గుణములే కార్యపదార్థమున సంక్రమించును" అనెడి న్యాయమునుబట్టి కారణభూతములగు పరమాణువులు రూపాదులు లేనివగుటచే వాని కార్యములగు పృథివ్యాదులు సయితము రూపాదులులేనివి కావలసివచ్చును. ఈదోషమును తొలఁగించుటకై పరమాణువులకును రూపాదులు గలవని యంగీకరించు పక్షమున, ఇంతకుఁబూర్వము గానఁబడిచిన దోషము (పరమాణువు లనిత్యము లగుట మొదలగునది) ప్రసక్తించును. ఇట్లు ఈ రెండు పక్షములను దోషములుండుటచే వైశేషిక మతము యుక్తమైనది కాదు.

౧౬॥ సూ॥ అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా.

టీ॥ అపరిగ్రహాచ్చ – వైదికు లంగీకరింప నందునను, (వైశేషికమతము) అత్యన్తం – ఎంతమాత్రమును, అనపేక్షా – ముముక్షువులచే నపేక్షింపఁదగినది కాదు.

---

(1) పరమాణువులు ప్రత్యక్షముగాఁ గానఁబడునవి గావనియు, అవి యతిసూక్ష్మములనియు, అయితే యవి లోకానుభవమును బట్టి యూహింపఁబడునవి యనియును వైశేషికు లంగీకరించుచున్నారు. దృష్టాంతము:—లోకమున తెల్లనిదారములనుండి తెల్లని వస్త్రము గలుగుచుండుటవలనను,నల్లనిదారములనుండి నల్లనివస్త్రము గలుగుచున్నందువలనను కార్యభూతములగు వస్త్రాదులకుఁ గల శ్వేతాదివర్ణములు తత్కారణభూతములగు దారములయందుండునవి యని యెఱుంగుచున్నాము. అట్లే జగత్తునందుండు ఘటాదిపదార్థముల రూపములును తత్కారణములగు పరమాణువులయందుండినవి యని వారంగీకరించుచు నిందుమూలమున "కారణగుణాః కార్యేసంక్రామంతి" అను న్యాయము గల్పించియున్నారు.

తా॥ వైశేషికమతమును వైదికు లంగీకరింపనందునను, అది మోక్షము నపేక్షించు వారిచే నెంతమాత్ర మవలంబింపఁ దగినది కాదు.

సాంఖ్యవైశేషిక మతములకుఁగల తారతమ్యము.

శ్రీ॥ భా॥ సాంఖ్యమతము శ్రుతులతోను యుక్తులతోనును విరోధించు నదైనందున పరిత్యజింపఁబడినదియే యైనను, అందలి సత్కార్యవాదము మొదలగు కొన్నియంశములను వైదికు లంగీకరించి యున్నారు. ఈ వైశేషిక మతమునందలి యొక్కయంశమునైనను వైదికు లంగీకరించి యుండ లేదు. మఱియు ఈ మతస్థులు చెప్పునవి యన్నియు నసంభవములు. ఈ హేతువులనుబట్టి పరమశ్రేయోరూపమగు మోక్షమును గోరువారు ఈమతము నెంతమాత్ర మవలంబింపఁదగదు.

❧ మహద్దీర్ఘాధికరణము ముగిసెను. ❧

---

### సముదాయాధికరణము

౧౮॥ సముదాయ ఉభయహేతుకేపి తదప్రాప్తిః.

టీ॥ సముదాయే = శరీరాది సంఘాతము, ఉభయహేతుకేపి = రెండు విధములో నెవ్విధమైనదైనను, తదప్రాప్తిః = సముదాయప్రాప్తి కాఁజాలదు.

తా॥ అణుహేతుకమగు పృథివ్యాదిచేరికగాని, పృథివ్యాదిహేతుకమగు శరీరేంద్రియాదిచేరికగానియీరెంటిలో నెవ్విధమైనచేరికయును గలుగఁజాలదు.

పూర్వాధికరణ సంబంధము.

శ్రీ॥ భా॥ జగత్తు పరమాణువులనుండి గలుగుచున్నదను వైశేషికుల వాదము పూర్వాధికరణమున నిరసింపఁబడెను. బౌద్ధులు సయితము జగత్తు పరమాణువులనుండి గలుగుచున్నదని యంగీకరించు చున్నారు. గాన, వారిమతమునను జగదుత్పత్తి జగద్వ్యవహారాదులు ఉపపన్నములు గావని యీ యధికరణమునఁ బ్రతిపాదింపఁ బడును.

బౌద్ధులు [1]నాలుగు తెగల వారు. వారిలో నొక్కతెగవారు

---

1. బౌద్ధులలో మాధ్యమికులనియు, యోగాచారులనియు, సౌత్రాంతికులనియు, వైభాషికులనియును నాలుగు తెగలు గలవు.

([1]వైభాషికులు) తమ మతము నివ్విధముగ బోధించుచున్నారు:—పదార్థములు బాహ్యములనియు అభ్యంతరము లనియును రెండు విధములు. భూతభౌతికము

బౌద్ధమతోపన్యాసము.

లు బాహ్యపదార్థములు. భూతములనఁగా, పృథివ్యప్తేజో వాయువులు. భౌతికము లనఁగా, స్పర్శ రూప రస గంధ ములును చక్షురాది జ్ఞానేంద్రియములును. ఈ భూత భౌతికములు రెండును పార్థివాప్య తైజస వాయవీయ పరమాణుసంఘాతరూపములు. [2]చిత్తచైత్తము లాభ్యంతర పదార్థములు. ఈపైని గానఁబడుచిన రెండువిధములగు పదార్థములు అనఁగా బాహ్యాభ్యంతర పదార్థములు ప్రత్యక్షానుమానప్రమాణ సిద్ధములు.

---

1. బాహ్యార్థప్రత్యక్షత్వవాదులు వైభాషికులు. పార్థివములు, ఆప్యములు, తైజసములు, వాయవీయములు అను చతుర్విధములైన పరమాణువులుగూడి వరుసగా పృథివ్యాదులుకాఁగా నవి గూడి శరీరాదు లగును. అట్టి శరీరములోపల 'నే నెఱుఁగుచున్నాను' అని గ్రాహకాభిమానరూపమైయుండు విజ్ఞానసంతానమే యాత్మగాని, వేఱొక యాత్మలేదు. పదార్థము లన్నియు అవస్థానము (నిలుకడ) లేమిచే, నవి తమంత జ్ఞానమునకు విషయములు కానేరవు. ప్రత్యక్షమూలమున నే జ్ఞానవిషయము లగును. కనుక ప్రత్యక్షసిద్ధములే యగును. ఇట్లుకాక, యవి తమంత జ్ఞానమునకు విషయములై యాజ్ఞానమువలన అనుమితములగునే కాని ప్రత్యక్షములు కావన్నచో, నప్పుడేదియుఁ బ్రత్యక్షసిద్ధము కానందున, ప్రత్యక్షసిద్ధమైనవ్యాప్తిచేఁ బ్రవర్తించు అనుమానమును సిద్ధింపదు గాన, నవి యనుమానసిద్ధమగుట యెట్లు ? శూన్యమనుట లోకానుభవవిరుద్ధము. కనుక జగత్తు ప్రత్యక్షసిద్ధము. దానియందలి స్థిరత్వబుద్ధి సంసారము. క్షణికత్వబుద్ధి మోక్షహేతువు అని వైభాషికులు చెప్పుదురు.

2. చిత్తచైత్త ములాంతరము లనఁబడును - చిత్తమనఁగా విజ్ఞానస్కంధము - నిర్వాణపర్యంతమునుండు- "అహ మహమ్" అను విజ్ఞాన ప్రవాహమే విజ్ఞానస్కంధము. ఇదియే యీ మతమున నాత్మయనఁబడుచున్నది. చైత్తములు నాలుగు విధములు ; ౧ రూపస్కంధము - విషయములు బాహ్యములైనను అవి దేహస్థములగు నింద్రియములచే గ్రహింపఁబడుచుండుటచే నవి యాంతరములలోఁ జేర్పఁబడియె. ౨ వేదనాస్కంధము - అనఁగా సుఖ దుఃఖాద్యనుభవము. ౩ సంజ్ఞా స్కంధము - అనఁగా పశు వృక్షాది సంకేత జ్ఞానము. ౪ సంస్కారస్కంధము అనఁగా రాగద్వేష మోహ ధర్మాధర్మరూపకమగు జ్ఞానము. ఇవి నాలుగును, విజ్ఞానస్కంధమును జేరి స్కంధములయిదు. స్కంధమనఁగా సమూహము ; ఇచటఁ బ్రవాహ పరముగా నూహించునది,

వారిలో వేఱొక్క తెగవారు([1]సౌత్రాన్తికులు) పృథివ్యాది బాహ్యపదార్థములు విజ్ఞానానుమేయములని చెప్పుచున్నారు.

వారిలో మఱియొక తెగవారు ([2]యోగాచారులు) బాహ్యపదార్థములేవియు సత్యముగ లేవనియు, ఈకనఁబడు పదార్థములన్నియు స్వప్నమునఁ గానఁబడు పదార్థములవంటివి యనియు, అయితే విజ్ఞానము మాత్రము పరమార్థముగా నున్నది యనియును చెప్పుచున్నారు.

ఈ పైని గనఁబఱచిన మూఁడు తెగలవారును తామంగీకరించు పదార్థములు క్షణికములనుచున్నారు. మఱియు ఈపైనిజెప్పిన భూతభౌతిక చిత్తచైత్త వ్యతిరిక్తములగు ఆత్మాకాశాదులు కలవనియును వారంగీకరింపరు.

---

1. "బాహ్యార్థానుమేయత్వవాదులు సౌత్రాంతికులు. వీరు వైభాషికమతము గలవారే కాని జగత్తు మాత్రము అనుమానసిద్ధ మందురు. అర్థములు జ్ఞానమునకు విషయములగుట యనఁగా జ్ఞానమును బుట్టించుటకు హేతువులగుట యని గ్రహింపవలయును. అప్పుడు అవస్థానములేకుండియున్నవి తమంతే జ్ఞానమునకు విషయములు కాఁగూడును. ఎట్లన, ఒక యర్థము తన యాకారమును జ్ఞానమున సమర్పించి తాను నశింపఁగా, దాని యాకారము జ్ఞానగతమైయుండును. పుష్టిచే భోజనమును, భాషచే దేశమును, సంభ్రమముచే స్నేహమును అనుమితములగునట్లు, ఆ యర్థముయొక్క జ్ఞానప్రతిబింబితమైన యాకారముచే నశించినదానియొక్క పూర్వాకారము అనుమితమగుచున్నది. ఇట్లు అర్థాకార వైచిత్ర్యము ప్రతిఫలించుటచే జ్ఞానమునకును వైచిత్ర్యము గలుగఁగా తన్మూలమున విచిత్రార్థసంఘాతరూపమైన జగత్తు అనుమితము (అనఁగా అనుమానసిద్ధము) అగుచున్నది" అని సౌత్రాంతికులు చెప్పుదురు.

2. "బాహ్యశూన్యత్వవాదులు యోగాచారులు. వీరు అర్థవైచిత్ర్యమువలన జ్ఞానవైచిత్ర్యము గలుగుననుట యొప్పరు. అర్థములవలెనే జ్ఞానములును సాకారములై తమంత విచిత్రములైయుండును. జ్ఞానమునకు స్వరూపవైచిత్ర్యము భేదప్రత్యయప్రవాహరూపమైన యనాది వాసనావశముననే కలుగుచున్నది కాని యర్థప్రతిఫలనముచేఁగాదు. జ్ఞానార్థములకు సహోపలంభనియమముండుటచే, అనఁగా జ్ఞానముతోఁగూడనే యర్థము నియతముగాఁ దెలియఁచుండుటచే జ్ఞానముకంటె అర్థము వేఱైనది కానేరదు. జ్ఞానమే బయట నర్థమువలె నవభాసించుచున్నది గాన, అర్థములెల్ల భ్రమాత్మకమే యగును. ఆయర్థమునకుఁగల యాకారము జ్ఞానముయొక్క యాకారమే యగును. ఎట్లన, బాహ్యార్థములైన ఘటపటాదులనుగుఱించిన విజ్ఞానములందు జ్ఞానమాయాయర్థమునకు అసాధారణమై యుండును. అది ఆయాయర్థముయొక్క రూపము గలిగియుండిననే ఆయాదానికి అసాధారణముగా నుండుట పొసఁగును. కనుక అర్థస్వరూపమైన రూపము జ్ఞానమున కుండవలయును. ఇట్లు ఆకారములతోఁ గూడిన జ్ఞానమే సర్వాకారవ్యవహారమునకుఁ జాలియుండఁగా దానికి వ్యతిరిక్తమైన యర్థము గలదని కల్పింపనేల? కనుక బాహ్యార్థమేదియు లేదు. విజ్ఞానమాత్రమే కలదు. ఇదియును లేదన్నచో, నప్పుడు తెలివియనునదే లేకుండును. కనుక జగత్తెల్ల నంధమగును. కావున విజ్ఞాన మాత్రమే తత్త్వము. అదియును క్షణికము. భావనాపుష్టిబలమువలన సకలవాసనలు నశింపఁగా వివిధవిషయాకారబాధితముకాని విశుద్ధవిజ్ఞాన ముదయించుటయే పరమోదయము" అనియోగాచారులు చెప్పుదురు. అర్థమేలేదను వీరికి పరమాణుప్రసక్తియే గలుగదు,

బాహ్యాభ్యంతర పదార్థము లేవియును వాస్తవముగా లేవనియు, సర్వము శూన్యమనియును ఇతరులు [1](మాధ్యమికులు) చెప్పుచున్నారు.

ఈపైని గనఁబఱచిన నాలుగు తెగల వారిలో, బాహ్యపదార్థములను మాత్ర మంగీకరించునట్టి వైభాషికుల మతము ఈ యధికరణమున నిరసింపఁబడుచున్నది. వైభాషికులు తమ మతము నిట్లు వర్ణించుచున్నారు :— రూప రస స్పర్శ గంధ స్వభావములగు పార్థివ పరమాణువులును, రూప రస స్పర్శ స్వభావములగు ఉదక పరమాణువులును, రూపస్పర్శ స్వభావములగు తైజస పరమాణువులును, స్పర్శ స్వభావములగు వాయవీయ పరమాణువులును క్రమముగ పృథివ్యప్తేజోవాయు రూపమగు సంఘీభావము గలవి యగుచున్నవి. అట్టి పృథివ్యాదులవలన శరీర విషయరూపమగు సముదాయము గలుగుచున్నది. శరీరాంతర్వర్తియును "నేను తెలిసికొనువాఁడను" అనెడి యభిమానమున కాస్పదమయినట్టి విజ్ఞానసంతానమే యాత్మ. అట్టి విజ్ఞాన సంతానమువలననే లౌకిక వ్యవహారము లన్నియును ప్రవర్తించుచున్నవి.

*వైభాషికమతమునను వదించుట*

ఈ పైని గనఁబఱచిన ప్రకారము వైభాషికులు వర్ణించు జగత్సృష్టి ప్రక్రియ యుక్తమయినది గాదని యీ సూత్రమునఁ దెలుపుచున్నారు.

పరమాణువులనుండి పృథివ్యాదిభూతాత్మకమగు సముదాయము గలుగుచున్నదను పక్షమును, అట్టి పృథివ్యాదులనుండి శరీరేంద్రియ విషయరూపమగు సముదాయము గలుగుచున్నదను పక్షమును ఈ రెండు పక్షములును ఉపపన్నములు గావు. అనఁగా పరమాణువులనుండి పృథివ్యాదులు గలుగుటయు, పృథివ్యాదులనుండి శరీరేంద్రియ విషయరూపమగు సముదాయము గలుగుటయును అసంభవము. పరమాణువులును, పృథివ్యాది భూతములును క్షణికములని గదా వీరు చెప్పుచున్నారు. అట్లయినచో, క్షణకాలములోనే నశించునట్టి పరమాణువులును పృథివ్యాది భూతములును ఎప్పుడు అట్టివిగా చేరుటకై యారంభించుచున్నవి? అవి యెప్పుడట్లు చేరుచున్నవి? ఎప్పుడు విజ్ఞానమునకు విషయభూతము లగుచున్నవి? ఎప్పుడవి త్యాగోపాదానాది వ్యవహారములకు విషయములగుచున్నవి? విజ్ఞానమనఁబడు ఆత్మ యెవ్వఁడు? అతఁడు ఏవిషయమును ఇంద్రియవిషయమునుగాఁ జేయుచున్నాఁడు? ఏ విజ్ఞానాత్మ ఏపదార్థము నెప్పుడు తెలిసికొనుచున్నాడు? తెలిసికొనఁబడినట్టి యే విషయము నెవ్వఁడెప్పుడు గ్రహించుచున్నాఁడు?

*వైభాషికమత నిరసనము*

1. మొదటిసంపుటము ౧౮౫-వ పత్రమునందలి ౧-వ వివరణమును చూడుడు.

ఇంద్రియ విషయమునుగాఁజేసికొను వాఁడును నష్టమగుచున్నాఁడు. ఇంద్రి విషయముగాఁజేయఁబడు పదార్థమును నష్టమగుచున్నది. తెలిసికొను వాఁడును నష్టమగుచున్నాఁడు. తెలిసికొనఁబడు పదార్థమున్ను నష్టమగుచున్నది. ఒక్కఁడు ఇంద్రియ విషయమునుగాఁజేసికొనిన దానిని వేఱొక్కఁడెట్లు తెలిసికొనఁగలఁడు? మఱియు నొక్కఁడు తెలిసికొనిన విషయమును మఱొక్కఁడెట్లు గ్రహింపఁగలఁడు? విజ్ఞానసంతానము ఒక్కటియే యయినందున, నీవు పైనిచెప్పినదంతయును ఉపపన్నమని యందువేమో, అట్లయినను, ఆ విజ్ఞాన సంతానములు వానిఁగలిగియుండు వానికంటెను వాస్తవముగను వేఱయినవి గానంగీకరింపఁబడనందున నందునుబట్టి యుండునట్టి లోకవ్యవహారము అనుపపన్నమగును. "అహం" అనఁబడునదియే యాత్మయనియు అది జ్ఞాత(జ్ఞానముగలది) యనియు నింతకుఁ బూర్వము ప్రతిపాదింపఁబడియె.

౧౯॥సూ॥ఇతరేతరప్రత్యయత్వాదుప పన్నమితిచెన్న సఙ్ఘాతభావానిమిత్తత్వాత్.

---

టీ॥ ఇతరేతర ప్రత్యయత్వాత్ = అవిద్యాదులు పరస్పరము నిమిత్తనైమిత్తికము లగుటవలన, ఇతిచేత్ = హఠాత్తుగ సఙ్ఘాతము గలుగుచున్నదంటివేని, న = అట్లు గలుగఁజాలదు. ఏలననఁగా, సఙ్ఘాతభావానిమిత్తత్వాత్ = అవిద్యాదులు సఙ్ఘాతము గలుగుటకు కారణము గానందున,

తా॥ అవిద్యాదులు పరస్పరము కార్యకారణము లగుటంజేసి సఙ్ఘాతము గలుగుట సంభవమను పక్షమున్ను సరికాదు. ఏలననఁగా, ఆవిద్యాదులు సఙ్ఘాతమును గలుగఁజేయునట్టి హేతువులు కావు గదా.

**బౌద్ధుల సృష్టిప్రక్రియ నుపన్యసించుట**

శ్రీ॥ భా॥ అవిద్యాదులలో నొక్కటి వేఱొక్కటికి అనఁగా నవి పరస్పరము హేతుభూతము లయినందున సంఘాతము గలుగుట మొదలగునది యుపపన్నము. ఏలననఁగా, సమస్తపదార్థములును క్షణమాత్రముండునవియే యైనను, ఇదియంతయు నవిద్యవలనఁ గలుగుట సంభవము. 1: ది యెట్లనిన, క్షణకాలము మాత్రముండు పదార్థములను గుఱించి యవి స్థిరములనెడి విపరీతబుద్ధి యవిద్యయనఁబడుచున్నది. అట్టి యవిద్యవలన సంస్కారములనఁబడు రాగద్వే

---

1. క్షణికములగు వానిని స్థిరములనియు, కార్యభూతములగు వానిని నిత్యములనియు, దుఃఖమును సుఖమనియు, శూన్యమును వస్తువనియును తలంచుట యవిద్యయనఁబడును. ఇట్టి యవిద్యవలన రాగద్వేషాదులు గలుగుచున్నవి. ఈరాగద్వేషములే సంస్కారము లనఁబడును. ఈరాగద్వేషాదులు "నేను తెలిసికొనుచున్నాను" అనెడి యభిమానముతోఁ గూడుకొనియున్నట్టి

పాదులు గలుగుచున్నవి. వానినుండి చిత్తప్రకాశరూపమగు విజ్ఞానము గలుగుచున్నది. ఆవిజ్ఞానమునుండి నామము లనఁబడు చిత్తచైత్తములును,రూపవంతములగు పృథివ్యాది పదార్థములును గలుగుచున్నవి. వానినుండి షడాయతనమనఁబడు ఇంద్రియషట్కమును, దానినుండి స్పర్శ మనఁబడు శరీరమును, దానినుండి వేదనాదులును గలుగుచున్నవి. అట్టి వేదనాదులనుండి యీపైని గాఁబఱచిన యవిద్యాదులు గలుగుచున్నవి. అవిద్యనుండి పైని గానఁబఱచిన ప్రకారము రాగద్వేషాదులు గలుగుచున్నవి. ఇట్లు ఈ యవిద్యాదులు పరస్పరము కారణభూతములగుచు చక్రమువలెఁ బరివర్తించుచున్నవి. ఇదియంతయును పృథివ్యాది భూత భౌతికపదార్థములు సంఘముగాఁ జేరిననే తప్ప, వేఱొక్క విధముగ, సంభవము గాదు. ఇట్లు అవిద్యాదులు పరస్పరము హేతుభూతము లగుటంజేసి పృథివ్యాది భూతభౌతికము లన్నియును సంఘముగాఁ జేరుట మొదలగునది యంతయును ఉపపన్నమే.

బౌద్ధుల సృష్టిప్రక్రియను నిరసించుట

ఇట్లు చెప్పుట సరికాదు. పృథివ్యాది భూతభౌతిక పదార్థములు సంఘముగాఁ జేరియుండుటకు అవిద్యాదులు హేతువులు గానేరవు. అస్థిరములగు వానిని భ్రాంతివశమున స్థిరములనుగా నెఱుంగుట యనఁబడు నట్టి యవిద్యగాని, అట్టి యవిద్యనుండి గలుగునట్టి రాగద్వేషాదులు గాని, క్షణికములగు పదార్థాంతరముల సంఘీభావమునకు (చేరికకు) హేతుభూతములు గానేరవు. దృష్టాంతము:— శుక్తికను భ్రాంతివశమున రజతమునుగా నెఱుంగుట శుక్త్యాదిపదార్థముల సంఘీభావమునకు హేతుభూతము గానేరదు గదా! ఇంతియె కాక, ఎవ్వనికి క్షణికపదార్థము స్థిరపదార్థముగాఁ దోచునో, అట్టివాఁడును, బౌద్ధసంప్రదాయ ప్రకారము, ఆ క్షణముననే నశించుచున్నాఁడు. కావున, సంస్కారము లనంబడు రాగద్వేషాదు లెవనికిఁ గలుగును? సంస్కారాశ్రయమై, స్థిరముగా నుండునట్టి

సూక్ష్మచిత్స్సంతానమునకు (విజ్ఞానరూపమగు నాత్మకు) ప్రదేశాన్తరమునకుఁ గొనిపోఁబడునట్టియు, ప్రతిక్షణము ఉత్పన్నమగుచుండు దీపజ్వాలలకువలెనె మాతృకుక్షియందుఁ బ్రవేశముగలుగుటకు హేతువు లగుచున్నవి. అట్లు మాతృగర్భమునఁ బ్రవేశించినట్టి యీ విజ్ఞానాత్మకు అటుతరువాత,మీఁదుమీఁదు విషయములను గుఱించి యీతనికి జ్ఞానము గలుగుచున్నది.ఇదియే చిత్తమనఁబడును. అట్టి జ్ఞానముతోఁగూడ వేదనా, సంజ్ఞా, చేతనా, వితర్కము, విచారము, ప్రీతి, ఏకాగ్రతా, శ్రద్ధా, వీర్యము, స్మృతి, ప్రజ్ఞా, ఈ మొదలగునవి గలుగుచున్నవి. ఇవియే నామములని పిలువఁబడు చిత్తచైత్తములనఁబడుచున్నవి. వీనినుండి పృథివ్యాదులును వాని పుంజీభావమును గలుగుచున్నవి. అట్టి పుంజీభావమునుండి యింద్రియములును ఇంద్రియములనుండి యవిద్యయును గలుగుచున్నవి.

యొక్క పదార్థమునైనను అంగీకరింప నట్టి యీ బౌద్ధమతమున సంస్కారము యొక్క యనువృత్తినిన్ని కల్పించుట యశక్యము.

౧౯॥ సూ॥ ఉ త్త రో త్పా దే చ పూ ర్వ ని రో ధా త్.

టీ॥ ఉత్తరోత్పాదే-చ = ఉత్తరక్షణమునందలి వస్తువుయొక్క యుత్పత్తి సమయమునందు, పూర్వనిరోధాత్ = పూర్వ క్షణమునందలి వస్తువు నశించుట వలన, (అవిద్యాదులు ఉత్పత్తిమాత్రమునకును నిమిత్తభూతములు కాఁదగవు.)

తా॥ ఉత్తరక్షణవర్తియగు పదార్థము గలుగునపుడు తత్కారణమగు పూర్వక్షణవర్తి పదార్థము నశించుటంజేసి, యవిద్యాదులు ఉత్పత్తివిషయము నను నిమిత్తభూతము లగుట సంభవింపదు.

శ్రీ॥ భా॥ ఈ క్రిందు గాన్పింపఁబోవు హేతువులనను, సర్వము క్షణిక మను పక్షమున జగదుత్పత్తి యెంతమాత్రము సంభవింపదు. ఏలననిన, ఉత్తరక్షణమునందలి పదార్థము గలుగునపుడు పూర్వక్షణవర్తియగు పదార్థము నష్టమగుచున్నది గాన, నది యుత్తరక్షణవర్తియగు పదార్థము యొక్క యుత్పత్తికి హేతువు గానేరదు. అట్లు పూర్వక్షణమునందెద్దియును లేకపోవుటయే అనఁగా దాని యభావమే యుత్తరక్షణ వర్తియగు పదార్థముయొక్క యుత్పత్తికిఁ గారణ మనియెదవా, అట్లంటివేని, అట్టి యభావ మన్ని తావుల నన్ని సమయములయందు నుండునది గాన, నన్నితావుల నన్ని సమయములయందు నన్నిపదార్థములును ఉత్పన్నములు గావలసి వచ్చును! ఏదైన నొక్కటి పూర్వక్షణమునందుండి యుండుటయే యట్టి హేతువనియెదవా, అట్లంటివేని, ఏదైననొక్క ఘటాదిపదార్థముయొక్క క్షణికస్థితి తదుత్తర కాలవర్తులును, ఈ మూఁడులోకములయందునుండునవియునగు గోమహిషాశ్వ కుడ్యపాషాణాదుల కన్నింటికిని హేతుభూతము గావలసివచ్చును! ఏ జాతిపదార్థము పూర్వక్షణమునందుండునో, అది యుత్తరక్షణవర్తియగు నాజాతి పదార్థమునకు మాత్రము హేతుభూత మగుచున్న దనియెదవా? అట్లంటివేని, అన్ని దేశములయందు నుండునట్టి యుత్తరక్షణవర్తులగు నన్నిఘటంబులకును పూర్వక్షణవర్తియును, ఒక్క ప్రదేశమున మాత్ర ముండునట్టిదియును, నొక్కటియే యగు ఘటము హేతుభూత మగుచున్నదని చెప్పవలసి వచ్చును! ఒక్క పదార్థము ఒక్కటియే పదార్థమునకు మాత్రము హేతుభూత మగుచున్నదని యెదవా, అట్లంటివేని, దేనికేది హేతువో, తెలిసికొన నేరమే? ఏ దేశమున నేఘటమునకు క్షణకాలస్థితి గద్దో, ఆక్షణకాలస్థితి ఆదేశమున మాత్రము ఉత్తరక్షణకాల వర్తియగు ఘటమునకు హేతుభూత మగుచున్నదని

యెదవా, అట్లంటివేని, సర్వము క్షణికమను నీవును దేశమనఁ బడునట్టి యొక స్థిరపదార్థమున్నదని తలఁచెదవా? ఇంతియె కాక, మీమతమున సర్వ పదార్థములు క్షణధ్వంసము లగుటంజేసి, చక్షురాదులకు విషయభూతమగు పదార్థము జ్ఞానోత్పత్తి కాలమునందుండదు. కావున, నేపదార్థమున్ను జ్ఞాన విషయము గానేరదు.

౨౦॥ సూ॥ అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా

టీ॥ అసతి = కారణము లేకయే కార్యము ఉత్పన్నమగుచున్నదంటివేని, ప్రతిజ్ఞోపరోధః = స్వప్రతిజ్ఞాహాని కలుగుచున్నది; అన్యథా = అట్లుకాకున్న, యౌగపద్యం = కార్యకారణములు రెండును ఏకకాలమున నుత్పన్నములు గావలసివచ్చును.

తా॥ హేతువులేకున్నను, కార్యపదార్థము ఉత్పన్నమగు పక్షమున, బౌద్ధమతమునందలి ప్రతిజ్ఞకు హాని కలుగుచున్నది. అట్లుకాకున్న, కార్యకారణములకు ఏక కాలోత్పత్తి ప్రసక్తించును.

శ్రీ॥ భా॥ హేతువు లేకున్నను, కార్యపదార్థము ఉత్పన్నమగు పక్షమున, సర్వము సర్వత్ర సర్వకాలములయందును ఉత్పన్నము గావలసివచ్చుననెడి దోషము సంప్రాప్తమగు నని యింతకుఁ బూర్వము చెప్పఁబడియె. ఇట్లు ఉత్పత్తిని గుఱించిన విరోధము ప్రసక్తించుటయే కాక, ఈ పక్షమున, బౌద్ధులయొక్క ప్రతిజ్ఞకుఁగూడ భంగము గలుగును. ఏలననిన, [1]అధిపతి (ఇంద్రియము) సహకారి, ఆలంబనము, సమనంతరప్రత్యయము అనఁబడు ఈ నాలుగును విజ్ఞానము గలుగుటకు హేతువులని గదా! బౌద్ధులు ప్రతిజ్ఞ జేయుచున్నారు. ఇట్టి ప్రతిజ్ఞకు భంగము లేకుండుటకై కారణభూతమగు ఘటముండునట్టి క్షణముననే కార్యభూతమగు ఘటము ఉత్పన్నమగుచున్నదని యందువేమో, అట్లంటివేని, కార్యకారణములు రెండును ఏకకాలమునఁ దెలియరావలసివచ్చును. అయితే యట్లు లోకమునఁ గానఁబడుచుండలేదు. ఇందువలన సర్వము క్షణికమను ప్రతిజ్ఞకుఁగూడ భంగము గలుగుచున్నది. క్షణికత్వప్రతిజ్ఞకు భంగము

1. మనకు జ్ఞానము గలుగవలయునన్న ఇంద్రియమొక్కటి యుండవలయును. కేవలము ఇంద్రియమున్నంత మాత్రమునఁ బ్రయోజనములేదు. దానికిఁదోడుగ వెలుఁగు ఉండవలయును. ఏపదార్థమును గుఱించి మనకుఁ దెలియవలయునో, అది యొక్కటి యుండవలయును. ఇంతియె కాక, ఏకాలమున మనకు జ్ఞానము గలుగవలయునో, ఆకాలముయొక్క పూర్వోత్తరక్షణములను గుఱించిన జ్ఞానముండవలయును. ఇట్లు ఈ నాలుగును సిద్ధముగా నున్న పక్షమున మనకొకపదార్థమును గుఱించిన జ్ఞానము గలుగునని బౌద్ధులు చెప్పుచున్నారు.

లేదనిమెదపు, అట్లగునేని, ఇంద్రియ సంప్రయోగమునకును జ్ఞానమునకును ఏకకాలస్థితి ప్రసక్తించును.

౨౧॥ సూ॥ ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్

టీ॥ అవిచ్ఛేదాత్ = సత్తావంతములగు పదార్థములకు నిరన్వయ వినాశము లేకపోవుటవలన, ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిః = ప్రతిసంఖ్యా=స్పష్టమైనట్టియు, అప్రతిసంఖ్యా=అస్పష్టమైనట్టియు, నిరోధాప్రాప్తిః= వినాశము గలుగదు.

తా॥ సత్తావంతములగు పదార్థములకు నిరన్వయవినాశము లేకపోవుటవలన, బౌద్ధులు చెప్పురీతిని, వానికి స్పష్టముగాఁ గానఁబడునట్టి వినాశముగాని, అస్పష్టముగాఁ గానఁబడునట్టి వినాశముగాని సంభవింపదు.

శ్రీ॥ భా॥ కారణము లేకయే కార్యము ఉత్పన్నమగుచున్నదను పక్షము పూర్వసూత్రమున నిరాకరింపఁబడియె. పదార్థములకు నిశ్శేష వినాశము గూడ సిద్ధింపనేరదని ఈసూత్రమునఁ బ్రతిపాదింపఁ బడుచున్నది. సర్వము క్షణికమని వాదించు బౌద్ధులు ప్రతిసంఖ్యానిరోధమనియు, అప్రతిసంఖ్యానిరోధమనియును రెండు విధములగు వినాశములను జెప్పుచున్నారు. కోకటిపోటు మొదలగునది తగులుటచేఁ గలుగు ఘటచ్ఛేదమువలె స్థూలమై మనకు స్పష్టముగాఁ గానఁబడునట్టి పదార్థవినాశము ప్రతిసంఖ్యానిరోధమని చెప్పఁబడుచున్నది.అట్లు మనకుఁగానఁబడక సూక్ష్మమయి ప్రతిక్షణము పదార్థములయందుఁ గలుగుచుండు నిరన్వయవినాశము అప్రతిసంఖ్యానిరోధమని చెప్పఁబడుచున్నది.

ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యానిరోధముల లక్షణములు

కార్యకారణపదార్థము లెల్లప్పుడు నెడతెగక యుండునవి యగుటంజేసి వానికి ఈ పైని వివరింపఁబడిన ప్రతిసంఖ్యానిరోధమనఁబడు విచ్ఛేదముగాని అప్రతిసంఖ్యానిరోధమనఁబడు విచ్ఛేదముగాని సంభవించుట దుర్లభము.ఇఁక, పదార్థము పుట్టుచున్నదన్నను, వినాశమునుబొందుచున్నదన్నను అవస్థాంతరమును బొందుచున్నదనుటయే గాని మఱియొకటి గాదు. ఏదైన నొక పదార్థమునుండి మఱియొకపదార్థము పుట్టుచున్నదనినచో, నాపదార్థము అవస్థాంతరమును బొందుచున్నదనుటయే గాన, నట్టి యవస్థాంతరమును బొందునట్టి కారణపదార్థము కార్యపదార్థముకంటె నత్యంతము భిన్నమయినది కాదు. ఈ హేతువునుబట్టియే కారణపదార్థముకంటెను కార్యపదార్థము భిన్నము కాదని "తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః" (బ్ర. సూ. ౨ అ. ౧ పా ౧౫ సూ) అను సూత్రమునఁ బ్రతిపాదించి యున్నాము.

ప్రతి సంఖ్యాప్రతి. సంఖ్యానిరోధా సంభవము.

వైభాషికుఁడు:—దీపముచల్లాగుట దీపముయొక్క నాశము గదా! దీపము నాశము నొందుట యనఁగా నది యవస్థాంతరమునుబొందుట యనినచో, నట్టినాశమనెడి యవస్థాంతరమునందు దీపసంబంధ మేదియయిన నుండవల యునే? అయితే యట్టి సంబంధమెద్దియును గానఁబడదు. కనుక నిది నిరన్వయ వినాశముగాఁ దెలియవచ్చుచున్నది. ఈ హేతువువలన నితరపదార్థములున్ను దీపమువలె నిరన్వయవినాశమును బొందుచున్నవని యూహింపుచున్నాము.

భాష్యకారులు:—అట్లు చెప్పుట సరికాదు. ఘటశరావాదులు పగిలి తునకలగుట ఘటశరావాది రూపమగు కార్యమునకు నాశము గదా. ఇట్లు ఘట శరావాదులు బొత్తుగ నాశము నొందినవా? లేదు. ఏలననిన, వానికిఁగారణ భూతమగు మృత్తిక వాని తునకలయందుఁ గానఁబడుచున్నది. ఇందువలన ఘట శరావాదులు నాశమునొందుచున్నవనఁగా ఘటశరావాద్యాకార రూపమగు యవస్థ పోయి తునకలుగా నుండుట యనఁబడునట్టి యవస్థాంతరము సంప్రాప్త మగుచున్నది. యనుట కాఁబట్టి నాశమనఁగా నవస్థాంతరమును బొందుటయని నిశ్చయింపఁబడుచున్నది. ఇట్లే దీపము ఆరిపోవుట మొదలగునది గూడ అవ స్థాంతరమనికల్పించుట యుక్తము. అయితే యది యతిసూక్ష్మమయినందున మనకంత స్పష్టముగాఁ గానఁబడదు.

౨౨॥ సూ॥ ఉ భ య థా చ దో షా త్.

టీ॥ ఉభయథా-చ=తుచ్ఛమునుండి జగత్తు కలుగుచున్నదనినను, నాశ మనఁగా బొత్తుగ నశించి పోవుట యనినను అనఁగానీరెండు పక్షములను, దోషాత్ = దోషము ప్రాప్తించుటవలన, (బౌద్ధమతము అసంగతము.)

తా॥ జగత్తు తుచ్ఛమునుండి గలుగుచున్నదన్నను, నాశమనఁగా బొత్తు గ నశించి పోవుట యన్నను, దోషము సంభవించుట వలన, బౌద్ధమతము అసంగతము.

శ్రీ॥ భా॥ సర్వము క్షణికమను బౌద్ధమతమున కనుగుణముగ సర్వము [1]తుచ్ఛమునుండి గలుగుటయు,అట్లు గలుగునట్టి కార్యజాతమంతయుఅవసానము న తుచ్ఛమే య గుటయు నీరెండును అసంభవములని పూర్వ సూత్రములయందుఁ జెప్పఁబడెను.మఱియు నట్లు అంగీకరించుటచే వేఱొక్కదోషము సయితము గల దని ఈ సూత్రమునందుఁ జెప్పఁబడుచున్నది. ఎట్లనిన, తుచ్ఛమునుండి గలుగు నట్టి కార్యపదార్థము గూడ తుచ్ఛాత్మకముగా నుండవలయును. లోకమునం దేది దేనినుండి గలుగుచున్నదో, అది తదాత్మకముగా నుండుట సహజము. దృష్టాంతము:— మృత్తునుండి గలుగునట్టి ఘటము మృదాత్మకమయినది

(1) కుందేటి కొమ్ములవలె సున్నయగునుయేన్నది తుచ్ఛమనఁబడును.

గాను, సువర్ణమునుండి గలుగునట్టి మకుటము సువర్ణాత్మక మయినది గాను గన్పట్టుచున్నది. అయితే జగత్తు తుచ్ఛాత్మకమని బౌద్ధు లంగీకరింపరు. మఱియు జగత్తు తుచ్ఛాత్మక మయినదిగాను తెలియవచ్చుచుండుటయును లేదు. ఏదైన నొక పదార్థము నాశమును బొందుచున్నదనఁగా, అవస్థాంతరమును బొందుచున్నదని యంగీకరింపక, నిరన్వయ వినాశమును బొందుచున్నదనినచో, సర్వము క్షణికమను బౌద్ధమత ప్రకారము, జగత్తున్ను ఏకక్షణానంతరమున తుచ్ఛాత్మకము గావలసివచ్చును. మఱియు నది బౌద్ధమతప్రకారము తుచ్ఛమునుండి గలుగుచున్నదనినచో, నది యీ పైని గాన్పించిన ప్రకారము తుచ్ఛాత్మకము గావలసివచ్చును. ఇట్లు ఈ రెండు దోషములు సంప్రాప్తము లగుచున్నవి. కావున, బౌద్ధు లంగీకరించిన ప్రకారము ఉత్పత్తి వినాశములు సంభవింప నేరవు.

౨౩॥ సూ॥ ఆ కా శే చా వి శే షా త్.

టీ॥ ఆకాశేచ=ఆకాశమునందును, అవిశేషాత్ — ఇతరవస్తువులనుండి భేదము లేకుండుటవలన, (అనఁగా పృథివ్యాదులవలెనే ఆకాశమున్ను ఒకపదార్థమయి యుండుటవలన నది తుచ్ఛము కాదు.)

తా॥ పృథివ్యాదులవలెనే ఆకాశమున్ను ఒకపదార్థము గాన, నది తుచ్ఛము కాదు.

శ్రీ॥ భా॥ బాహ్యాభ్యంతర పదార్థములు స్థిరములని ప్రతిపాదించుటకై, ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యా నిరోధములు కేవల మభావరూపములను బౌద్ధుల

పూర్వసూత్రముతోఁ గల సంబంధము

వాదము పూర్వసూత్రమున నిరాకరింపఁబడియె. ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యా నిరోధములవలె నాకాశముగూడ కేవలము తుచ్ఛాత్మకమయినదని బౌద్ధులు వాదించుచున్నారు. అట్లు బౌద్ధులు చేయువాదము సయితము ప్రసంగవశమున నిచట నిరాకరింపఁబడుచున్నది.

ఆకాశము "ఇట్టిది" యని చెప్పుట కశక్యమైనదని వాదింపఁదగదు. ఏలన నిజ భావ (ఉన్నట్టి)పదార్థములనుగా వారంగీకరించిన పృథివ్యాదులవలె నాకాశము సయితము తెలియవచ్చుచున్నది. అందుల కెద్దియును

ఆకాశమభావ రూపమనువాదమునుఖండించుట

బాధకములేదు. కావున ఆకాశము కేవల మభావమెంత మాత్రముగానేరదు. దృష్టాంతము:—"ఇచట డేగఎగురుచున్నది. అచట గద్ద ఎగురుచున్నది" అను వ్యవహారమువలన నాకాశము శ్యేనాదివతన ప్రదేశముగాను మనకు విదిత మగుచున్నది. పృథివ్యాదుల యభావమే (లేమియే) యాకాశ మగుటయు నశక్యము. అట్లయినచో, ఆకాశము పృథివ్యాదుల

యభావమనఁగా పృథివ్యాదుల [1]ప్రాగభావమా? ప్రధ్వంసాభావమా? ఇతరేతరాభావమా? అత్యంతాభావమా? ఆకాశము ఈ నాలుగువిధములలో నెద్ది యయినను, అది తెలియవచ్చుట యసంభవ మగును. పృథివ్యాదుల ప్రాగభావమయినను, లేక, ప్రధ్వంసాభావ మయినను ఆకాశమన్నచో, పృథివ్యాదులు ఉండునపుడు ఆకాశము లేకపోవలయును. కావున, జగత్తంతయు నిరాకాశము గావలసి వచ్చును. ఇతరేతరాభావము వస్తువులయందు నుండునది యయినచో, అది సర్వవస్తువులయందుండునది యగుటంజేసి ఆయావస్తువుల కంతరాళము లేదనవలసి వచ్చును. అయితే వాస్తవమున కంతరాళము గద్దు. అత్యంతాభావము పృథివ్యాదుల కుండుట యసంభవము. ఇంతియె కాక, అభావమనఁగా నవస్థాంతరమును బొందుట యని యింతకుఁ బూర్వము ప్రతిపాదించిన ప్రకారము ఆకాశము అభావరూపమయినను, అది కేవలము తుచ్ఛమని చెప్పుట కవకాశము లేదు. త్రివృత్కరణ ప్రక్రియచే ద్యోతితమయిన [2]పంచీకరణ ప్రకారము అణ్డాస్తర్వర్తియగు నాకాశము పంచీకృతమయినది. కావున నిది చాక్షుషమనిన నెద్దియు బాధకము లేదు.

## ౨౭॥ సూ॥ అనుస్మృతేశ్చ.

టీ॥ అనుస్మృతేః—చ=పూర్వము అనుభవించిన వస్తువును గుఱించిన స్మరణము గలుగుట వలనను (జ్ఞాతకు క్షణికత్వము సిద్ధింపదు.)

తా॥ పూర్వము అనుభవించిన వస్తువును గుఱించిన స్మరణము గలుగుట వలనను జ్ఞాతకు క్షణికత్వము సిద్ధింపదు.

శ్రీ॥ భా॥ పదార్థములు స్థిరములనెడి ప్రస్తుతాంశమే యిచటగూడ ఉపపాదింపఁబడుచున్నది. సూత్రమునందుండు "అనుస్మృతి" శబ్దమునకు "ఇంతకు పూర్వ మనుభవించిన పదార్థమును గుఱించిన జ్ఞానము" అని యర్థము. అనఁగా "స్మృతికివచ్చుట" యనుట. ఇంతకు పూర్వ మొకప్పు డనుభవించిన పదార్థమును మరల అనుభవించునపుడు "అదియే ఇది" యను జ్ఞానము గలుగుచున్నది. "దీపపు జ్వాలలు భిన్నములయినను ఒకజ్వాలవలె నితర జ్వాలలుండుటవలన నన్నియు నొక్కటియే జ్వాల యను జ్ఞానము గలుగునట్లు, ప్రకృతమునను, ఇంతకు పూర్వమనుభవించిన పదార్థమువలెనే ప్రకృతమున ననుభవించు పదార్థము సయితము ముండుటవలన నింతకు పూర్వమనుభవించిన పదార్థమున్ను ఇప్పు డనుభవింపఁబడు పదార్థమున్ను ఒక్కటియే యను జ్ఞానము సాదృశ్యము వలనఁ గలుగుచున్నది. కావున, నిట్టి యేకత్వజ్ఞానము మోహమాత్రము" అని

---

(1) మొదటి సంపుటము ౬౭-వ పత్రమున ౨-వ వివరణమును చూడుము.

(2) మొదటి సంపుటము ౨౧౬-వ పత్రమున ౧-వ వివరణమును చూడుము.

యందు వేమో, అట్లు చెప్పుట యశక్యము. ఏలననిన, సర్వము క్షణికమను నీ మతమున నట్లు మోహమును బొందునట్టి జ్ఞాతయొక్కఁడు ఉన్నట్లు అంగీకరింప లేదు గదా! ఒక్కఁడు అనుభవించు పదార్థముతో, వేఱొక్కఁడు తాననుభ వించియుండిన పదార్థమునకు సాదృశ్యమును గాని, మైక్యమును గాని యనుసం ధించుకొనఁడు. కావున భిన్న కాలములయందుండు వస్తువుల నాశ్రయించియుండు నదియగు సాదృశ్యముయొక్క యనుభవమునుబట్టి ఐక్యరూపమగు వ్యామో హమును ప్రతిపాదించునట్టి నీవు అట్టి సాదృశ్యమును దెలిసికొను వాఁడొక్కఁడే యని యవశ్యమంగీకరింపవలయును. అగ్ని జ్వాలలకువలెనే ఘటపటాది పదార్థ ములకుఁగల భేదమును తెలుపునట్టి ప్రమాణము గానరాదు. అట్టి ప్రమాణ మెద్ది యయిన నున్నచోఁ గదా, ఇప్పుడు మన మనుభవించు పదార్థమునకు పూర్వము మన మనుభవించి యుండిన పదార్థముతో సాదృశ్యముండుటనుబట్టి యాపదార్థము మనకు జ్ఞప్తికి వచ్చుచున్న దనవచ్చును. అట్టి ప్రమాణమే లేదే? ఒకవేళ మీరిట్లు వాదింపవచ్చును :—

వైభాషికుఁడు :—ఘటపటాదిపదార్థములు క్షణికములని ప్రత్యక్షాను మాన ప్రమాణములవలన సిద్ధించుచున్నది. ఏలననిన, ప్రత్యక్ష ప్రమాణము ప్రస్తుతము మనకుఁ గానఁబడుచుండు పదార్థమును దెలియఁజేయుచు ప్రకృత కాలమున నుండని పదార్థమునకంటె నది వేఱయినదని సూచింపుచున్నది. దృష్టాంతము—నీలవర్ణముగల పదార్థము తెలియవచ్చునపు డది పీతవర్ణముగల పదార్థముకంటె భిన్నమయినదని సూచిత మగుచుండ లేదా! అట్లే ప్రకృత మునను ఎఱుంగునది. ఇట్లు ఇంతకుఁ బూర్వము ఉండిన పదార్థముకంటెను, ఇఁకమీఁదు ఉండబోవు పదార్థముకంటెనున్ను ప్రకృతకాలమున నున్నట్టి పదా ర్థము భిన్నమయినదని తెలియవచ్చుచున్నది. అనుమానము వలనను క్షణి కత్వము తెలియుచున్నది. ప్రయోగములు :—

ప్రతిజ్ఞ :—ఘటపటాదిపదార్థములు క్షణికములు.

హేతువు :—ప్రయోజనోపయుక్తములును, సత్తావంతములు నయి నందున,

ఉదాహరణము :—క్షణికములుగాని కుందేటికొమ్ములు ప్రయోజనోప యుక్తములు గాని, సత్తావంతములు గాని కావు గదా.

అట్లే

ప్రతిజ్ఞ :—ఇంతకుఁబూర్వము మన మనుభవించిన ఘటాదుల క్షణకాల సత్తలు వినాశవంతములు.

హేతువు : ఇప్పుడొక ఘటముయొక్క క్షణముండుటవలన.

ఉదాహరణము :—ప్రస్తుతము మనమనుభవించుచున్న ఘటముయొక్క క్షణముండుటం జేసి ఇఁకమీఁదు మన మనుభవింపఁబోవునట్టి ఘటముయొక్క క్షణమువలెనే.

ఇట్లు ప్రత్యక్షానుమాన ప్రమాణములవలన ఘటాదిసర్వపదార్థములును క్షణికములని ప్రతిపాదింపఁదగును.

భాష్యకారులు:—ఇట్లు ప్రతిపాదింపనేరవు. ఏలననిన, సర్వము క్షణికమనినచో, కార్య కారణభావము సిద్ధింపకపోవును. కావున, ఈ పైని గనఁబఱచిన యనుమానములు ఇంతకుఁ బూర్వమే నిరసింపఁబడినవి. మఱియు ప్రత్యక్షప్రమాణము మూలముగాఁ దెలియవచ్చునదియు, వర్తమానకాలమున నుండునట్టిదియునగు పదార్థమునుండి భూతభవిష్యత్కాలిక పదార్థములకుఁ గల వైలక్షణ్యమనునది వర్తమానకాలముననుండు పదార్థము భూతభవిష్యత్కాలిక పదార్థములకంటె నన్యమని తెలుపదు. అయితే యది యాపదార్థము వర్తమానకాలముతో సంబంధించి యున్నదని మాత్రము తెలుపును. ఇంతమాత్రమున వర్తమానకాలమున నుండు పదార్థము భూతభవిష్యత్కాలికపదార్థములకంటె నన్యమని సిద్ధింపదు. ఏలననిన, ఇప్పుడుండు పదార్థము ఇంతకుఁ బూర్వము ఉండి యుండుటయును, ఇఁకమీఁదు గూడ ఉండబోవుటయును సంభవములు గదా!

ఘటాదులు ప్రయోజనోపయుక్తము లయినందునను, సత్తావంతము లయినందునను్న క్షణికములని వాదించి యుంటివి. అయితే యీవాదము నీ కోరికకు విరుద్ధము. ఎట్లనిన, ప్రయోగము:—

ప్రతిజ్ఞ:—ఘటపటాది పదార్థములు స్థిరములు.

హేతువు:—సత్తావంతములును ప్రయోజనోపయుక్తములు నయినందున, ఏలననిన, అస్థిరపదార్థములు సత్తావంతములును ప్రయోజనోపయుక్తములును కావుగదా!

ఉదాహరణము:—కుందేటి కొమ్ములవలెనే.

ఈపైని గానఁబఱచిన ప్రకారముగానైనను వాదింపవచ్చునుగదా! పదార్థములు ప్రయోజనోప యుక్తములగుట యవి సత్తావంతములగుటనే గదా నిరూపించును. ఏలననిన, క్షణకాలములోనే నశించునట్టి పదార్థములతో నొక కార్యము.నొనర్చుట యసంభవము గాన, నవి ప్రయోజనోపయుక్తములగుట యసంభవమని యింతకుఁ బూర్వము చెప్పియున్నాము. అంతిమఘటక్షణము ఒక్క హేతువువలన నశింపుచున్నది గాన, ఇతర ఘటక్షణములున్ను ఒక్క

హేతువువలననే నశింపవలయును. కనుక ఘటపటాది పదార్థములు నాశహేతువగు రోకటిపోటు మొదలగునది పడువరకును స్థిరములనియే చెప్పవలయును.

ఒకవేళ, రోకటిపోటు మొదలగునవి ఘటముయొక్క నాశమునకు హేతువులు కావనియు, అయితే ఘటమునకు కపాలాదిరూపమగు వేఱొకరూపమును గలిగించుటకు మాత్రము హేతువులఁచున్నవనియును చెప్పెదవేమో, అట్లు చెప్పుటకు అవకాశము లేదు. ఘటాదులకు వినాశమనఁగా కపాలాదిరూపమగు అవస్థాంతరము గలుగుటయే యని ఇంతకుఁబూర్వము ప్రతిపాదించియున్నాము. వినాశ మనఁగా కపాలోత్పత్తికంటె వేఱయినదని యంగీకరించినను, రోకటిపోటు వినాశమునకే హేతువు. ఏలననిన, రోకటిపోటు తగిలిన వెంటనే గలుగునది ఘటవినాశమే గదా!

కావున ఇంతకుఁబూర్వము మన మనుభవించిన పదార్థమునే ఇప్పుడు మనమనుభవించుచున్నామనెడి ప్రత్యభిజ్ఞ గలుగుటవలన పదార్థములు స్థిరములని యేర్పడుచున్నది. ఇట్లు ప్రత్యభిజ్ఞవలన నేర్పడు స్థిరత్వమును యెవ్విధమనను నిరాకరించుట యశక్యము. ఇట్లు ప్రత్యభిజ్ఞ పూర్వాపరకాల సంబంధియగు పదార్థమొక్కటియే యని తెలుపుచుండగా, అది యట్లు తెలుపక వేఱొక్కదానిని తెలుపుచున్నదంటివేని, ఇఁక నీవు నీలవర్ణముగాఁ దెలియవచ్చు పదార్థము నీలేతరవర్ణముగల పదార్థమనియును జెప్పఁగలవు. ప్రమాతయును, ప్రమేయమును క్షణికములను నీమతమున వ్యాప్తియును అవధారణమును, తత్స్మరణమును ఇవి యన్నియును గలిగిన తరువాత గలుగునట్టి యనుమానము నంగీకరించుట సయితము దుశ్శకము. అట్లే “ఇది క్షణికము” అని యిట్టి ప్రతిజ్ఞను చేసిన తరువాత హేతుప్రదర్శనము మొదలగునదియును మీ మతమున సంభవముకాదు. ఏలననిన, అట్టి ప్రతిజ్ఞను ఉపక్రమించిన క్షణముననే ప్రతిజ్ఞ చేసినవాడు నష్టమగుచున్నాఁడు. ఒక్కఁడు ఉపక్రమించిన దానిని వేఱొక్కఁడు “అది యిట్టిది” యని తెలియక దానిని పూర్తిచేయుట యశక్యము గదా!

౨౬॥ సూ॥ నాసతోఽదృష్టత్వాత్.

టీ॥ అసతః = స్వయముగ లేనట్టి పదార్థము (దానిగుణములు మొదలగునవి వేఱొక్కదానియందు సంక్రమించుట), అదృష్టత్వాత్ = లోకమునఁ గానఁబడనందున, న=బౌద్ధమతము సరియయినది కాదు.

తా॥ స్వయముగ లేనట్టిపదార్థముయొక్క గుణములు వేఱొక్కపదార్థమునందు సంక్రమించుట లోకమునం దెచటను గానఁబడదు గాన, బౌద్ధమతము సరియయినది కాదు.

శ్రీ॥ భా॥ ఇట్లు బాహ్యపదార్థములు మాత్రము కలవని యంగీకరించునట్టి వైభాషిక సౌత్రాంతికుల మతములకు పొదువైన దూషణము లింతకుఁ బూర్వము జెప్పఁబడియె. సర్వము క్షణికమగు పక్షమున, ఇంద్రియ గోచర క్షణమునందుండునట్టి పదార్థము జ్ఞానోత్పత్తి క్షణముననుండుట యసంభవము గాన, సౌగతు లంగీకరించునట్టి యేపదార్థమున్ను జ్ఞానవిషయము గాదని యీ సందర్భమునఁ జెప్పఁబడియె. అట్టి వాదమునకు సౌంత్రాంతికుఁడు ఈ క్రిందు గాన్పించిన విధమున ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

పదార్థములు జ్ఞానోత్పత్తికాలమున నుండక పోవుట యవి జ్ఞానవిషయములు కాకపోవుటకు హేతువు గానేరదు. అయితే యవి జ్ఞానోత్పత్తికి హేతుభూతము లగుటయే జ్ఞానవిషయములగుట యని యెఱుంగునది. చక్షురాదీంద్రియములు గూడ జ్ఞానోత్పత్తికి హేతువులు గాన, నవియును జ్ఞానవిషయములని ప్రసక్తించునని యెద వేమో, అట్లు జెప్పుట యుక్తము కాదు. జ్ఞానమునఁ దమ యాకారమును అర్పించుచు నందు మూలముగా జ్ఞానోత్పత్తికి హేతువులగు నవియే జ్ఞానవిషయములుగా నంగీకరింపఁబడుచున్నవి. కనుకనే ఒక పదార్థము జ్ఞానమునఁ దన యాకారము నర్పించి నష్టమయినను, అది జ్ఞానగతమగు నీలాద్యాకారము మూలముగానే యున్నట్టిదిగా నూహింపఁబడుచున్నది. అయితె యోగాచారమతస్థులు చెప్పినట్లు పూర్వ పూర్వజ్ఞానము ఉత్తరోత్తర జ్ఞానముయొక్క యాకారమును గలుగఁజేయుచున్నదనుట కవకాశము లేదు. ఏలయన, అట్లగునేని, నీలజ్ఞానసంతతియందు పీతజ్ఞాన మకస్మాత్తుగా గలుగక పోవును. ఈపైని జెప్పఁబడిన హేతువులవలన జ్ఞానమునందుండు భేదము అనఁగా నీలజ్ఞానము పీతజ్ఞానము మొదలగునది నీల పీత పదార్థములవలనఁ గలుగఁజేయఁబడినదని సిద్ధమగుచున్నది.

సౌత్రాంతికుని వాదము ననువదించుట

ఇట్లు చెప్పుట యుక్తము గాదు. ఏలననిన, నష్టమయిపోయినట్టియు, ప్రస్తుతము లేనట్టి పదార్థముయొక్క నీలాద్యాకారమే జ్ఞానమునఁగల నీలాద్యాకార మనఁజాలము. లోకమునం దెచటను ధర్మవిశిష్టమగు పదార్థము నశింపఁగా, దాని ధర్మములు పదార్థాంతరమునందు సంక్రమించుచున్నట్లు గానఁబడుచుండ లేదు. (అయితే బింబధర్మములు ప్రతిబింబమున సంక్రమించుచుండ లేదా? యని యందువేమో, అచటను గూడ బింబపదార్థము స్థిరముగ నున్నప్పుడే ప్రతిబింబము మొదలగునది గానఁబడుచున్నది. అందును, బింబపదార్థగతములగు ధర్మములు మాత్రమే గానఁబడుచుండ లేదు. ఈపైని గానఁబఱచిన హేతువులను బట్టి ఏదైన నొకపదార్థమువిషయమగు జ్ఞానమునఁగల ధర్మము లా

సౌత్రాంతికునివాదమును నిరసించుట

పదార్థముయొక్క ధర్మములను బట్టి యుండునవి యగుట ఆ పదార్థము స్థిర ముగానుండు నది యగు పక్షమున నే సంభవమగునని సిద్ధ మగుచున్నది.

అవతారిక.—వైభాషిక సౌత్రాంతికుల మతములకు పొదువయిన మఱి యొక దూషణమును గూడ మరల ఈసూత్రముచే గానఁబఱచుచున్నారు.

౨౭॥ సూ॥ ఉ దా సీ నా నా మ పి చై వం సి ద్ధిః.

టీ॥ ఏవం-చ=అభావమునుండి వస్తుసిద్ధి యగుపక్షమున, ఉదాసీనానా మపి = ప్రయత్నముచేయక యూరకయున్నవారికిఁ గూడ, సిద్ధిః = కార్యసిద్ధి కావలసియుండును.

తా॥ కారణములేకయే వినాశాదికార్యసిద్ధి గలుగు పక్షమున, సోమరు లకుఁగూడ కార్యసిద్ధి కావలసి యుండును.

శ్రీ॥ భా॥ ఇట్లు బౌద్ధులు చెప్పునట్లు సర్వము క్షణికమగుటయు, అభా వమునుండి పదార్థములు ఉత్పన్నము లగుటయు, హేతువులేకయే వినాశాదులు గలుగుటయును సంభవము లగుపక్షమున, యెవ్విధమైన ప్రయత్నముఁ జేయక సోమరులుగానుండు వారికిఁగూడ సర్వకార్యములును సిద్ధింపవలసివచ్చును. ఏలననిన, లోకమున ఇష్టప్రాప్తి గాని, అనిష్టనివృత్తి గాని ప్రయత్నమువలనఁ గదా సాధింపఁబడుచున్నది. సర్వము క్షణకాలములోనే నశించు పక్షమున పూర్వకాలసంచితమగు పదార్థము గాని, అందువలనఁ గలుగు సంస్కారాది రూపమగు విశేషము గాని, బ్రహ్మవిద్యమొదలగునది గాని కాలాంతరమున నుండునది కాదు గాన, ప్రయత్నములవలన సాధింపఁదగిన దెద్దియును లేకపో వును. ఇట్లగునేని, హేతువులేకయే సర్వకార్యములును సిద్ధించునుగాన, సోమ రులకుఁగూడ ఐహికాముష్మికఫలములును, మోక్షమున్ను నిష్ప్రయత్నము గానే సిద్ధింపవలసి వచ్చును.

సముదాయాధికరణము ముగిసెను.

---

ఉపలబ్ధ్యధికరణము.

౨౮॥ సూ॥ నా భా వ ఉ ప ల బ్ధేః.

టీ॥ అభావః =జ్ఞానేతరపదార్థములకు యునికి లేదు (ఇట్లంటివేని), న= అది సరికాదు; (ఏలననఁగా) ఉపలబ్ధేః=అట్టివియగు బాహ్యపదార్థములు గానఁ బడుచున్నందున.

తా॥ ఆభ్యంతరమగు విజ్ఞానమునకు తప్ప తక్కిన బాహ్యపదార్థములకు సత్త లేదంటివేని, యది సరికాదు. బాహ్యపదార్థములును గానఁబడుచున్నవి గదా!

శ్రీ॥ భా॥ విజ్ఞానము మాత్రము కలదని వాదించునట్టి యోగాచార మతస్థులు తమ మతము నిట్లు ప్రతిపాదింపుచున్నారు:—

యోగాచార మతోపన్యాసము.

ఈ పైని గాన్పించిన ప్రకారము పదార్థములయందుండు వైచిత్ర్యమును బట్టి జ్ఞానమునందు వైచిత్ర్యము గలుగుచున్నదనుట యుపపన్నము గాదు. పదార్థమువలెనే జ్ఞానములు గూడ ఆకారవంతము లగుటంజేసి స్వయము గానే వానియందు వైచిత్ర్యము గలదు. జ్ఞానముల యొక్క స్వరూపమున నిట్టి వైచిత్ర్యము వాసనా వశమునఁ గలుగుచున్నది. విలక్షణములగుజ్ఞానముల ప్రవాహమే వాసన యనఁబడుచున్నది. అనఁగా "ఇది ఘటము" అనెడి జ్ఞానమువలన "ఇది కపాలము" అను జ్ఞానము కలుగుచున్నది. "ఇది ఘటము" అను జ్ఞానము అంతకు పూర్వముఉండిన ఘటమును గుఱించిన జ్ఞానమువలనఁ గలుగుచున్నది. దానిని గుఱించిన జ్ఞానమంతకు పూర్వము ఉండిన ఘటమును గుఱించిన జ్ఞానమువలనఁ గలుగుచున్నది. ఇట్లు పూర్వపూర్వజ్ఞానములవలనఁ గలుగునట్టి యుత్తరోత్తరజ్ఞానముల ప్రవాహమే వాసన యనఁబడుచున్నది. అయితే బాహ్యపదార్థములగు సర్షప మహీధరాదుల యాకారమే ఆభ్యంతరమగు జ్ఞానముయొక్క యాకారమని యెట్లు జెప్పందగునని యడిగెదవేమో, చెప్పెదను. పదార్థముల వ్యవహారయోగ్యత అనఁగా నవి లోకమున వ్యవహరింపఁదగిన వగుట జ్ఞానముయొక్క ప్రకాశమున కధీనమయినదని యంగీకరింపవలయును. అట్లు గానిచో, అనఁగా పదార్థములు స్వయముగానే వ్యవహారయోగ్యములగు పక్షమున, ఈ పదార్థము తనచేఁ దెలియఁదగినదనియు, ఆ పదార్థము ఇతరులచేఁ దెలియఁదగినదనియు నిర్విధమగు విభాగము లేక పోవలసి వచ్చును. ప్రకాశమానమగు జ్ఞానము సాకారమని యొప్పుకొనవలయును. నిరాకారవస్తువు ప్రకాశింపనేరదు గదా! ఇట్లు ఒక్కటియే యగు నాకారము జ్ఞానముతో సంబంధించినది కాఁదగను. అయితే యది బాహ్యపదార్థములయందుండునదిగాఁ దెలియవచ్చుట భ్రాంతికల్పితము. జ్ఞానమునకును పదార్థమునకును సహోపలంభ నియమముండుటనుబట్టియు అనఁగా జ్ఞానము ఉన్నప్పుడే వస్తువు తెలియవచ్చుటవలనను వస్తువు ఉన్నప్పుడే జ్ఞానము గలుగుటవలనను, జ్ఞానముకంటె పదార్థము భిన్నముగాదని స్పష్టమగుచున్నది.

ఇంతియెకాక, ఘటపటాది బాహ్యపదార్థములు కలవని వాదించు వైభాషికుల పక్షమునను ఇది ఘటము ఇది పటము అని యిట్లు ఘటపటాది విజ్ఞానములు గలుగునపుడట్టి జ్ఞానము ఆయాపదార్థముల కసాధారమగుట యనునది జ్ఞానమునందట్టి పదార్థముతో సమానమైన రూపములేక సంభవింపదు. కావున పదార్థముల రూపముతో సమానమగు రూపము జ్ఞానమునఁ గలదని

యొప్పుకొనవలయును. అంతమాత్రముననే సర్వ వ్యవహారములును సిద్ధింపుచుండఁగా, నట్టి విజ్ఞానముకంటె వేఱుగా, పదార్థము గూడ మఱియొకటి కలదనుట ప్రామాణికమయిన సంగతి గాదు. కనుక విజ్ఞానము మాత్రము తత్త్వము. బాహ్యపదార్థమెద్దియు లేదు.

యోగాచారమత నిరసనము

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఆభ్యంతరమగు విజ్ఞానమునకంటె నితరమగు బాహ్యపదార్థ మెద్దియు లేదనుట యశక్యము. ఏలననిన, జ్ఞాతయగు ఆత్మకు ఘటపటాది బాహ్యపదార్థములను గుఱించిన వ్యవహారమునందు యోగ్యతను గలుగఁజేయునదిగాను గదా జ్ఞానము తెలియవచ్చుచున్నది. కనుకనే లౌకికులు "ఇది ఘటము ఈ ఘటమును నేను తెలిసికొనుచున్నాను" అని చెప్పుచున్నారు. ఇట్లు జ్ఞానమనునది "నేను ఘటమును దెలిసికొనుచున్నాను" అనుచో, కర్మభూతమగు ఘటాది పదార్థముతోను "నేను"అను కర్తతోను "తెలిసికొను" అనుధాతువుతోను సంబంధించినదై యందఱికిని ప్రత్యక్షముగాఁ దెలియుచుండ, కేవలము జ్ఞానమే గద్దు, జ్ఞానభిన్నమయినది మఱియొక్కటెద్దియును లేదనుట పరిహాసాస్పదమయిన విషయము గాని వేఱొక్కటి గాదు. పైకి వేదప్రమాణము నంగీకరించువారమని చెప్పుకొనుచు లోపల బౌద్ధమతము నవలంబించియుండు వారిని (అద్వైతులను) నిరాకరించు సందర్భమున, ఈ విషయమును సవిస్తరముగ ప్రతిపాదించి యున్నాము. మఱియు సహోపలంభ నియమమునుబట్టి అనఁగా జ్ఞానమున్నప్పుడే వస్తువు తెలియవచ్చుటను వస్తువు ఉన్నప్పుడే తద్విషయిక జ్ఞానము గలుగుటనున్ను బట్టి నీలాదిపదార్థమునకును తద్విషయికజ్ఞానమునకును భేదము లేదనుటయును స్వవచన విరుద్ధము. ఏలయన, జ్ఞానమనియు వస్తువనియును రెండు ఉన్నచో గదా, ఒక్కటి యున్నప్పుడు రెండవది స్ఫురించును. పదార్థమునకు వ్యవహారయోగ్యతను గలుగఁజేయునదియై యట్టి పదార్థముతోఁ గూడ తెలియవచ్చునట్టి జ్ఞానము తనతో నట్టిపదార్థమునకభేదమును తెలియఁబఱచుచున్నదనుట పరిహాసింపదగినది. జ్ఞానములు నిశ్శేషముగా నశించునవియగు పక్షమున, వానియందు అనువర్తమానమును, స్థిరముగానుండు నదియునగు నాకారము లేనందున, దాని వాసనయయిననుండుట సంభవమని యుపపాదింపనేరము. పూర్వజ్ఞానము నష్టమగుచుండుటంజేసి దానివలన నుత్పన్నము గానట్టి యుత్తరజ్ఞానము వాసనారూపముగా నెట్లు ఉండగలదు? కావున జ్ఞానమునం దుండునట్టి వైచిత్ర్యము (వివిధాకారము) పదార్థమునందుండునట్టి వైచిత్ర్యము వలనఁ గలుగునదియే. ఆయాపదార్థములను వ్యవహారమునఁ దెలియఁదగిన వానినిగాను జేయుచు ప్రత్యక్షముగాఁ దెలియవచ్చునట్టి జ్ఞానమునందు ఆయాపదార్థ

ములతోఁగల యసాధారణ్యమనఁబడునది ఆయాపదార్థములతోఁ దీనికిఁగల సం బంధమునుబట్టి యుండునది. అట్టి సంబంధము సంయోగరూపమయినది. రెండు ద్రవ్యములకు సంయోగము గలుగవచ్చునే గాని, జ్ఞానమునకును ద్రవ్యమునకును సంయోగమెట్లు గలుగునని యడుగఁబని లేదు. జ్ఞానము సయితము ఒక ద్రవ్యమే. దీపము యొక్క గుణమగు కాంతి యొక ద్రవ్యముగ గణింపఁబడినట్లు, ఆత్మగుణ మగు జ్ఞానము సయితము ద్రవ్యమగుట విరుద్ధము గాదని యింతకుఁ బూర్వము ప్రతిపాదింపఁబడినది. కనుక బాహ్యపదార్థ మెద్దియును లేదనుట యెంత మాత్రము ఉపపన్నము కాదు.

అవతారిక.—స్వప్నమునందలి పదార్థములను గుఱించిన జ్ఞానముల వలెనే జాగ్రదవస్థయందుఁగానఁబడు స్తంభాదిపదార్థములను గుఱించిన జ్ఞానము లును వాస్తవమునకు అట్టి స్తంభాది బాహ్యపదార్థము లెవ్వియును లేకయే గలుగుచున్నవని శంకింపఁగా, అందులకు సమాధానము నీసూత్రముచేఁ జెప్పు చున్నారు.

అ॥ సూ॥ వై ధ ర్మ్యా చ్చ న స్వ ప్నా ది వ త్.

టీ॥ స్వప్నాదివత్ = స్వప్నాదులయందులవలెనే జాగరితావస్థయందును వాస్తవమునకు వస్తువులు లేకయే వానిని గుఱించిన జ్ఞానము గలుగుచున్నదంటి వేని, న=అది సరికాదు. ఏలననఁగా, వైధర్మ్యాత్-చ = స్వప్నజాగరితముల యందలి జ్ఞానములకు వైలక్షణ్యముండుట వలనను,

తా॥ స్వప్నాదులయందువలెనే జాగరితమునందును బాహ్యపదార్థములు లేకయే, వానిని గుఱించిన జ్ఞానము గలుగుచున్నదంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, స్వప్నజ్ఞానముకంటెను జాగరితజ్ఞానము విలక్షణమైనది.

శ్రీ॥ భా॥ స్వప్నజ్ఞానములకంటెను జాగరితజ్ఞానములు విలక్షణములయినవి. కావున,స్వప్నజ్ఞానములవలెనే జాగరితజ్ఞానములును బాహ్యపదార్థములు లేకయే గలుగుచున్నవనుట యనుపపన్నము. అది యెట్లనిన, స్వప్నజ్ఞానములు నిద్రాది దోషదూషితములగు ఇంద్రియములవలనఁ గలుగుచున్నవి. మఱియు స్వప్న దృష్టములగు పదార్థములు జాగరితావస్థయందు, మిథ్యాభూతము లగుచున్నవి. జాగరితజ్ఞానములన్ననో, అట్లు నిద్రాదిదోషదూషితములగు ఇంద్రియముల వలనఁ గలుగునవి గావు. కావున వానిని స్వప్నజ్ఞానములతోఁ బోల్చుట సరికాదు. జ్ఞానములన్నియు విషయమెద్దియును లేకయే గలుగుచున్నవను పక్షమున, నీవు చేయు అనుమానముగూడ విషయశూన్యమగుటంజేసి నీవు సాధింపఁదలఁచిన యంశముగూడ సిద్ధింపనేరదు. అట్టి యనుమానము విషయముగలది యయినచో,

నన్నిజ్ఞానములును దానివంటి వియేగాన, నెట్టి జ్ఞానమును విషయము లేనిదిగా జాలదు. కావున బాహ్యపదార్థమెద్దియు లేదనుట సిద్ధింపనేరదు.

౨౮॥ సూ॥ న భా వో ఽ ను ప ల బ్ధేః.

టీ॥ అనుపలబ్ధేః=బాహ్యపదార్థము లేకయే దానిని గుఱించిన జ్ఞానము తెలియరానందున, భావః=అట్టి నస్తువుతో సంబంధింపని జ్ఞానముండుట, న= సంభవింపదు.

తా॥ బాహ్యపదార్థము లేకయే దానిని గుఱించిన జ్ఞానము తెలియరానందున, బాహ్యపదార్థముతో సంబంధింపని జ్ఞానము ఉండుట యసంభవము.

శ్రీ॥ భా॥ పదార్థ మెద్దియును లేక, కేవల జ్ఞానముండుట యసంభవము. ఏలననిన, కర్తతోఁగాని, కర్మతోఁగాని సంబంధింపనిదై కేవల జ్ఞాన మెచటను తెలియఁబడుచుండలేదు గదా! స్వప్నజ్ఞానములు గలుగునపుడు పదార్థమెద్ది యును లేక పోలేదు. ఈ విషయమును ఖ్యాతి నిరూపణసందర్భమున ప్రతిపా దించి యున్నాము.

ఉపలబ్ధ్యధికరణము ముగిసెను.

సర్వథానుపపత్త్యధి కరణము.

౩౦॥ సూ॥ స ర్వ థా ను ప ప త్తే శ్చ.

టీ॥ సర్వథా=అన్ని విధములను, అనుపపత్తేశ్చ=మాధ్యమికమతమునకు ఉపపత్తి లేకుండుటవలనను, (అది యుక్తము కాదు.)

తా॥ ఎన్ని విధముల నాలోచించినను, మాధ్యమికమతము ఉపపత్తి లేని దిగాఁ దెలియుచున్నందున, నది సరియయినది కాదు.

శ్రీ॥ భా॥ సర్వము శూన్యమను మాధ్యమికులమతము ఈయధికరణమున విచారింపఁబడుచున్నది. సర్వము శూన్యమని కదా బౌద్ధులు సిద్ధాంతపఱచి యు న్నారు. క్షణికత్వాదులన్ననో, శిష్యులు తమతమ బుద్ధి కుశలత కనుగుణముగ అంగీకరించుటచేఁ జెప్పఁబడినవి. ఇంతియే. విజ్ఞానమున్ను బాహ్యపదార్థములున్ను ఇవి యన్నియును లేవు. సర్వము శూన్యమగుటయే తత్త్వము. అభావమై పోవు టయే మోక్షము. ఇదియే బుద్ధుని యభిప్రాయము. మాధ్యమికులు తమ మతము నిట్లు ఉపపాదించుచున్నారు:—

పూర్వాధికరణ సంబంధము

మాధ్యమికుఁడు:—సర్వము శూన్యమనుటయే యుక్తము. ఏలననిన, "ఎద్దియులేదు. సర్వము శూన్యము" అనినచో నట్టి శూన్యమును ప్రతిపాదిం

చుటకై యెవ్విధములగు హేతువులును కావలసి యుండవు. ఇట్లు శూన్యమను నది యొక హేతువుచే సాధింపఁదగినది కాదు గాన, నది స్వతస్సిద్ధము. సర్వము ఉన్నదనినచో గదా, యందులకై యొక హేతువును గన్పెట్టవలయును? "సర్వము ఉన్నది" యని యందువేమో, అట్లయినచో, నట్టి సత్పదార్థము (ఉన్నట్టిది) భావము (ఒకదానియునికి) వలన నుత్పన్నమగుచున్నదా? లేక, అది యభావము (ఒకదానిలేమి) వలన నుత్పన్నమగుచున్నదా? భావము వలన నెద్దియును ఉత్పన్నము గానేరదు. దృష్టాంతము:—మృత్తిక మొదలగుదాని పిండాకారస్థితి చెడకుండ, ఘటాదిపదార్థము ఉత్పన్నము కాదు గదా? అభావమునుండియు నెద్దియును ఉత్పన్నమగునదిగాను గానఁబడదు. దృష్టాంతము:—మృదాదిపిండాకారము చెడగా, దాని యభావమునుండి ఉత్పన్నమగు ఘటాదిపదార్థమున్ను, అభావస్వరూపము గానే యుండవలయును. మఱియు నిట్టి సత్పదార్థము స్వయముగాను గాని, వేఱొక్క పదార్థముండిగాని యుత్పన్నమగుట యసంభవము. ఏలననిన, ప్రతిపదార్థము తనకు తాను ఉత్పన్నమగుచున్నదనిన చో, ఆత్మాశ్రయ దోషము సంప్రాప్త మగును. అట్లు తనకు తాను ఉత్పన్నమగుటవలనఁ బ్రయోజనమెద్దియు గానఁబడదు. వేఱొక్క పదార్థమునుండి యుత్పన్నము గావచ్చునంటివేని, అట్టి వేఱొక్కపదార్థ మిట్టిదియనెడి నిశ్చయ మెద్దియు లేకపోవుటంజేసి,యదియే వేఱొక్క పదార్థమునుండియైనను ఉత్పన్నముగావచ్చును గాన, సర్వపదార్థములును సర్వపదార్థములనుండియును ఉత్పన్నములు కాఁదగునని ప్రసక్తించును. ఈ హేతువులనుబట్టి యుత్పత్తియే యసంభవమని సిద్ధమగుచున్నది. ఇట్లు యుత్పత్తి యనఁబడునది యొక్కటి లేకపోవుటంజేసి నాశము గూడ కలదనుట కవకాశము లేదు. కావున శూన్యమే తత్త్వమని సిద్ధమగుచున్నది. అందువలన జన్మము, వినాశము, ఉండుట, లేకపోవుట మొదలుగాగల వన్నియు భ్రాన్తికల్పితములు. అయితే యేదైన నొక్కటి యాధారముగా నున్నచోఁగదా, భ్రాన్తిగలుగును? అట్టి యాధారమెద్దియును లేక, సర్వము శూన్యమయినచో, భ్రాన్తిమాత్ర మెట్లు గలుగునని శంకింపఁబనిలేదు. (అద్వైతమున) దోషము దోషాశ్రయత్వము, జ్ఞాతృత్వము మొదలగునవి స్వతః అసత్యము లయినను తద్విషయికమయిన భ్రాన్తి గలుగుచుండలేదా? అట్లే ప్రకృతముననను భ్రాన్తి కాధారభూతమగు నదియెద్దియును లేక పోయినను, భ్రాన్తి గలుగవచ్చును. కనుక శూన్యమే తత్త్వమని సిద్ధమగుచున్నది.

మాధ్యమిక మతోపన్యాసము.

భాష్యకారులు:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఎన్నివిధముల నాలోచించినను నీ కభిమతమగు సర్వశూన్యత్వవాదమున కెవ్విధమయిన యుప

పత్తియును గానఁబడదు. నీవు సర్వము సత్తని (ఉన్నట్టిదని) చెప్పెదవా ? అసత్తని (లేనట్టిదని) చెప్పెదవా? లేక, ఈ రెంటికంటెను వేఱయినదని యెదవా ? నీ వెవ్విధమునఁ జెప్పినను, నీకభిమతమగు సర్వశూన్యత్వ వాదము సిద్ధింపనేరదు. ఏలననిన, లోకమునందు సాధారణముగ నేదైన నొక పదార్థము "ఉన్నది" "లేదు" అను వ్యవహారము గాని, అది యున్నట్టిదిగాను గాని లేనట్టిదిగాను గాని తెలియవచ్చుట గాని యాపదార్థముయొక్క యవస్థావిశేషము లే యని ప్రతిపాదింపఁబడియెను గదా! కావున, సర్వము శూన్యమని వాదించునట్టి నీవున్ను "సర్వము సత్యము" అని వాదించువానివలెనే సర్వము శూన్యమగుట యనునది స్వయముగా నున్నట్టిదియే యగు సమస్తపదార్థముయొక్కయు నవస్థావిశేషమే యని యంగీకరింపవలయును. అందువలన, నీ వంగీకరించిన ప్రకారము ఏపదార్థమున్ను తుచ్ఛమగుట అనఁగా కుందేటికొమ్ములవలె నెన్నఁడును బొత్తుగ లేకపోవుట సంభవింపదు. మఱియు నీవేదైన నొకప్రమాణమునుబట్టి గదా యట్టి శూన్యత్వమును తెలిసికొని "సర్వము శూన్యము" అని ప్రతిపాదింపవలయును. నీ వట్టి ప్రమాణ మయినను సత్యమని యంగీకరింప వలయునే ? అట్టి ప్రమాణము సత్యమని యంగీకరించినచో, ప్రమాణమనున దొకటి యున్నది గాన, "సర్వము శూన్యము"అని సిద్ధింపనేరదు. కాక, అట్టి ప్రమాణముగూడ అసత్యమని యంటివా, అట్టి యసత్యమగు ప్రమాణమునుబట్టి ప్రతిపాదింపఁబడిన "సర్వము శూన్యము"అను నీమతము గూడ అసత్యమే యగును. ఇందువలన "సర్వము సత్యము"అని సిద్ధమగుచున్నది. ఈపైని గానఁబఱచిన హేతువులవలన, "సర్వము శూన్యము" అని ప్రతిపాదించుట యసంభవము.

మాధ్యమిక మత నిరసనము.

సర్వథానుపపత్త్యధికరణము ముగిసెను.



## ఏకస్మిన్నసంభవాధికరణము

### ౩౧॥ సూ॥ నైకస్మిన్నసంభవాత్.

టీ॥ న=జైనమత మసంగతము. ఏలననఁగా, ఏకస్మిన్=ఒకవస్తువునందు, అసంభవాత్ = సత్త్వాసత్త్వాది విరుద్ధ ధర్మసమావేశము ఏకకాలమున సంభవింపక పోవుటవలన.

తా॥ ఒక్కటియే వస్తువునందు సత్త్వాసత్త్వ విరుద్ధ ధర్మ సమావేశము ఏకకాలమున సంభవింపదు గాన, జైనమత మసంగతము.

శ్రీ॥ భా॥ ఇంతకుఁ బూర్వము బౌద్ధమతము నిరసింపఁబడియె. జైనులు గూడ జగత్తు పరమాణువులవలనఁ గలుగుచున్నదని చెప్పు చున్నారు గాన, వారి మతము ఈ యధికరణమున నిరసింపఁబడు చున్నది. జైనులు తమమతము నిట్లు బోధింపుచున్నారు:—

పూర్వాధికరణ సంబంధము

జైనుఁడు:—జీవాజీవాత్మకమగు ఈ జగత్తు ఈశ్వరశూన్యమైనది. దీనిలో నాఱు ద్రవ్యములు గలవు. అవి జీవుఁడు, ధర్మము, అధర్మము, పుద్గలము, కాలము, ఆకాశము అనునవి. ఈ యాఱింటిలో జీవులు బద్ధులనియు, యోగసిద్ధులనియు, ముక్తులని యును మూఁడు తెగలవారు. చలనవంతములగు పదార్థముల చలనమునకు హేతువై జగద్వ్యాపియగు ద్రవ్యవిశేషము ధర్మమనఁబడుచున్నది. అట్టి పదార్థములస్థితికి అనఁగా చలనరాహిత్యమునకు హేతువై వ్యాపించియుండునది అధర్మ మనఁబడుచున్నది. వర్ణ గంధ రస స్పర్శవంత మగు ద్రవ్యము పుద్గల మనఁబడుచున్నది. పుద్గలము పరమాణురూపమనియు పర మాణుసంఘాత(చేరిక)రూపమనియును రెండువిధములు. అదివాయువు, అగ్ని, ఉద కము, భూమి, శరీరము, లోకములు ఈ మొదలగునది. భూతభవిష్య ద్వర్తమాన రూపమగు వ్యవహారమునకు హేతుభూతమై అణురూపమయిన ద్రవ్యవిశేషము కాల మనఁబడుచున్నది. ఒక్కటియై అనంత ప్రదేశములుగలది యాకాశము. వీని లో నణువులుకానివియగు ద్రవ్యములన్నియు జీవాస్తికాయమనియు, ధర్మాస్తికాయ మనియు, అధర్మాస్తికాయమనియు, పుద్గలాస్తికాయమనియు, ఆకాశాస్తికాయమ నియు నిట్లయిదస్తికాయములుగాను సంగ్రహింపఁ బడుచున్నవి. అస్తికాయ మనఁగా ననేక ప్రదేశముల యందుండు పదార్థమని యెఱుంగునది. జీవమనియు, అజీవమనియు, ఆస్రవమనియు, బన్ధమనియు, నిర్జరమనియు, సంవరమనియు, మో క్షమనియును మఱియొక సంగ్రహముగూడ ఈమతమునఁ గలదు. ఇది మోక్షోప యోగి. ఈ సంగ్రహమున మోక్షమును సయితము సంగ్రహించి యుండుటచే మోక్షోపాయము సయితము ఇచట సంగ్రహింపఁబడిన ట్లెఱుంగునది. మోక్షో పాయము మంచిజ్ఞానదర్శనము సదాచారము ఈ మొదలగునది. జ్ఞాన దర్శన సుఖవీర్యగుణములు గలవాఁడు జీవుఁడు. అట్టి జీవునికి భోగ్యభూతమగు పదార్థ జాతమంతయు అజీవము. అట్టి జీవుని భోగమునకు ఉపకరణభూతములగు ఇంద్రి యాదులు ఆస్రవ మనఁబడుచున్నవి. ఘాతికర్మచతుష్టయమనియు అఘాతికర్మ చతుష్టయమనియును బంధము అష్టవిధము. ఘాతికర్మచతుష్టయ మనఁబడు బం ధము జీవునియొక్క స్వాభావిక గుణములగు జ్ఞాన దర్శన సుఖ వీర్యములకు ప్రతి ఘాతము నొనర్చునట్టిది. అఘాతికర్మచతుష్టయ మన్ననో, శరీరసంస్థానము, శరీరాభి మానము, శరీరస్థితి, శరీరప్రయుక్తములగు సుఖదుఃఖములు అను.. వీనిమొదల

జైనమతోపన్యాసము.

ఉపేక్షను గలుగఁజేయునది. మోక్షసాధనముగా జినునిచే ఉపదేశింపఁబడిన తపస్సు అజర మనఁబడుచున్నది. సమాధిరూపమగు నింద్రియనిరోధము సంవర మనఁబడుచున్నది. రాగాది క్లేశములు నివర్తించిన వానికి స్వాభావికమగు నాత్మ స్వరూప మావిర్భూతమగుట (ప్రకటితమగుట) మోక్షమనఁబడుచున్నది. పృథి వ్యాదులకు కారణభూతములగు అణువులు, వైశేషిక మతమునందు వలెనే, నాలుగు విధము లయినవి కాక, యీ మతమున నవి యొక్కటియే విధము గలవి. వానికి భేద మెద్దియును లేదు. అయినను, పృథివ్యాది పదార్థములకుఁగల భేదము పరిణామమువలన సంప్రాప్తమయినది. ప్రతిపదార్థము సత్త్వమనియు అసత్త్వ మనియు, నిత్యమనియు అనిత్యమనియు, భిన్నమనియు అభిన్నమనియు నిట్లనేక ప్రకారములు గలదిగా నంగీకరింపఁబడుచున్నది. అది యెట్లనిన, ఇందు ప్రతి పదార్థమును "స్యాదస్తి" (కలిగి యుండవచ్చును); "స్యాన్నాస్తి" (లేకుండ వచ్చును), "స్యాదస్తిచ నాస్తిచ" (కలిగియు, లేకయు నుండవచ్చును), "స్యా దవక్తవ్యం" (అనరాకుండవచ్చును), "స్యాదస్తి చావక్తవ్యంచ" (కలిగియు, ననరాకయు నుండవచ్చును), "స్యాన్నాస్తి చావక్తవ్యంచ" (లేకయు, ననరా కయు నుండవచ్చును), "స్యాదస్తిచ నాస్తి చావక్తవ్యంచ" (కలిగియు, లేక యు, ననరాకయు నుండవచ్చును), అని యిట్లు సప్తవిధములుగాఁ గొనఁబడు చున్నది.

ఈపైని గానఁబఱచినవియే పదార్థములకుఁగల ప్రకారములు. ఈ విభ జనము సప్తభంగీనయమని జైనమత గ్రంథములయందు వ్యవహరింపఁబడు చున్నది. ప్రతిపదార్థము ద్రవ్యాత్మకముగాను గాని, పర్యాయాత్మకము గానుగాని యుండవచ్చును గాన, ద్రవ్యాత్మకముగానుండు నపుడు పదార్థముల యందు సత్త్వము, ఏకత్వము, నిత్యత్వము మొదలగునవి యుండుట సంభవము. పర్యాయాత్మకముగా నుండునపుడు అవి సత్త్వాదివిపరీతములు. పర్యాయము లనఁగా అవస్థావిశేషములు. అవి భావాభావ రూపములయినందున సత్త్వా సత్త్వాదులు వానికుండుట యుపపన్నము.

భాష్యకారులు:—ఇట్లు చెప్పుట యుక్తము గాదు. ఒక్కటియే పదార్థము నందు పరస్పర విరుద్ధములగు అస్తిత్వ నాస్తిత్వాదులు ఏకకాలమున నుండుట యసంభవము. పరస్పర విరుద్ధములగు ఎండ నీడలు ఏక కాలమున నొక్కటియే ప్రదేశమునం దుండుట సంభవమా? కాదు గదా! దీని ఫలితార్థమేమనఁగా, ద్రవ్యమున్ను పర్యాయము లనంబడు అవస్థావిశేషములున్ను భిన్నభిన్న పదార్థములు గాన, ఏకకాలమున నొక్క-

జైనమతనిరసనము

టియే ద్రవ్యము పరస్పర విరుద్ధములగు ధర్మములతోఁ గూడుకొని యుండుట యసంభవము. ఏ పదార్థమున్ను ఒక్కటియే కాలమున ఉన్నట్టిదియై అప్పుడే లేనిదియును గానేరదు. ఉత్పత్తి వినాశములనంబడు పరిణామములతో (మార్పులతోఁ) గూడుకొని యుండుట గదా అనిత్యత్వమనఁబడును. అట్టి పరిణామవిశేషములేవియును లేనిదిగానుండుట గదా నిత్యత్వమనఁబడును. ఇట్లుండ, ఒక్కటియే పదార్థము ఏకకాలమున నిత్యమును, అనిత్యమును ఎట్లు కాఁగలదు? రెండు పదార్థములు విరుద్ధములగు ధర్మములతోఁ గూడుకొనియుండుట గదా భిన్నత్వమనఁబడును. అట్టివి కాకపోవుట గదా యభిన్నత్వమనఁబడును. ఇట్లుండ, ఒక్కటియే పదార్థము ఏకకాలమున భిన్నమును అభిన్నమును ఎట్లు కాగలదు? ఒక్కటియే జంతువు ఏకకాలమున అశ్వమున్ను మహిషమున్ను కాఁగలదా? కానేరదు. ఈవిషయము సమన్వయాధికరణమున భేదాభేదవాది మతమును నిరసించుసందర్భమున సవిస్తరముగ వివరింపఁబడినది. కాలమనఁబడునది "ఈ పదార్థము ఇక్కాలమున నున్నది. ఇక్కాలమున లేదు" ఇవ్విధముగ పదార్థములతోఁ జేర్పఁబడి వ్యవహరింపఁబడుచున్నదే గాని, యది ప్రత్యేకముగ వ్యవహరింపఁబడుచుండ లేదు. కావున కాలమును గుఱించి "ఉన్నది" అని చెప్పుటగాని "లేదు" అని పరిహరించుట గాని కూడదు. అయితే లోకమున "కాలమున్నది కాలము లేదు" అనుట కేవలము వ్యవహారమాత్రము గాని పారమార్థికము గాదు. జాత్యాదులు ద్రవ్యగుణములుగ ప్రతీయమానము లగుచున్నను, "జాతి, జాతి కాదు" అని వ్యవహరించుచుండ లేదా? అట్లే "కాలము ఉన్నది కాలము లేదు" అను వ్యవహారమును, జాత్యాదులు ద్రవ్యగుణములుగానే ప్రతీయమానము లగుచున్నవను విషయము నింతకుఁ బూర్వము ప్రతిపాదించి యున్నాము.

జైనుఁడు:—ఒక్కటియే పదార్థమునం దేకకాలమున విరుద్ధ ధర్మములుండుట యసంభమని యుపపాదించి యుంటిరి. కానిమ్ము, బ్రహ్మము ఒక్కటియే గదా! అట్టి బ్రహ్మము సర్వాత్మకమని వేదాంతులు చెప్పుచున్నారే? అది యెట్లు సంభవము?

భాష్యకారులు:—సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, సత్యసంకల్పుఁడునగు పురుషోత్తమునికి సమస్తములగు చేతనాచేతన పదార్థములు శరీరమగుటం జేసి, అతఁడు సర్వాత్మకుఁడనఁబడుచున్నాఁడు. శరీరియగు బ్రహ్మమున్ను వాని ధర్మములున్ను శరీరభూతములగు చేతనాచేతన పదార్థములకంటెను వాని ధర్మములకంటెనున్ను ఎక్కువ విలక్షణములయినవని యింతకుఁ బూర్వము ప్రతిపాదించి యున్నాము.

ఇంతియెకాక, జైనులచే నంగీకరింపఁబడిన జీవము, ధర్మము, అధర్మము ఈమొదలగు నాలుగు ద్రవ్యములకును ఒక్కటియే ద్రవ్యమగుట గాని, మఱియు

పర్యాయమగుటగాని లేనందున ద్రవ్యాత్మకముగాను గాని పర్యాయాత్మకముగాను గాని వానికి ఏకత్వానేకత్వాదులు గలవని నిరూపించుట యసంభవము. ఈ యాఱు పదార్థములును వానివాని యవస్థావిశేషములనుబట్టియు వానివాని స్వరూపస్వభావములనుబట్టియు ఏకముగాను అనేకములుగాను నుండ వచ్చునని యందువేమో, అట్లయినచో, సర్వము నిలుకడలేనిదై మాఱుచుండునది యను నీమతమునకు విరుద్ధము జెప్పినవాఁడవగుదువు. ఏలననిన, పదార్థములకు అన్యోన్యతాదాత్మ్యము అసంభవము. కావున జైనమత మయుక్తము. ఈశ్వరాధిష్ఠితములుగానివై స్వయముగానె పరమాణువులు జగత్తును సృజించుచున్నవను వైశేషికమతము నందుండు దోషములు సయితము ఈ మతమునఁగలవు.

3౪॥ సూ॥ ఏ వం చా త్మా కా ర్త్స్న్యం.

టీ॥ చ=మఱియు, ఏవం=జైనమతప్రకారము, ఆత్మాకార్త్స్న్యం = ఆత్మకు అపరిపూర్ణత్వము, (ప్రసజ్యేత=ప్రసక్తించును).

తా॥ ఇంతియెకాక, ఈ జైనమతమున, ఆత్మకు అపరిపూర్ణత్వరూపమగు దోషమును ప్రసక్తించును.

శ్రీ॥ భా॥ జైనమతమునందు బోధింపఁబడిన ప్రకారము జీవస్వరూపము నంగీకరించిన యెడల, జీవునికి అకార్త్స్న్య రూపమగు దోషము సంప్రాప్తమగును. జీవుఁడు లెక్కలేని ప్రదేశముల యందుండువాఁడనియు, దేహానురూపమగు పరిమాణము గలవాఁడనియును జైనులు తలఁచుచున్నారు. అట్లయినచో, ఏనుగు మొదలగువాని శరీరములయందుండు జీవునికి అనఁగా వాని శరీరముల పరిమాణముగల జీవునికి చీమ మొదలగువాని సూక్ష్మశరీరము గలిగెనేని, జీవునియొక్క కొంతభాగము ఆ సూక్ష్మశరీరములోఁదూరక వెలుపలనుండి పోవుటచే నీ పక్షమునందు జీవుని కకార్త్స్న్య దోషము సంప్రాప్తమగుచున్నది. అకార్త్స్న్యమనఁగా అసంపూర్ణత్వము.

అవతారిక:—జీవుఁడు పర్యాయము లనఁబడు నవస్థలను బొందునట్టివాఁడు. అట్టి యవస్థ లొకప్పుడు సంకోచమును మఱియొకప్పుడు వికాసమును బొందునట్టి స్వభావము గలవి. జీవునికి ఏనుగు మొదలగువాని శరీరము గలుగునపు డట్టియవస్థలు వికాసమును బొందుచున్నవి. అనఁగా విస్తరించుచున్నవి. అతనికి చీమ మొదలగువాని శరీరము గలుగునపు డవి సంకోచమును బొందుచున్నవి. అనఁగా ముడుచుకొనుచున్నవి. కాఁబట్టి పూర్వసూత్రమునందు ప్రతిపాదింపఁబడిన యకార్త్స్న్య దోషము జీవునికి సంప్రాప్తము గానేరదని శంకింపఁగా, నందులకు సమాధానమును ఈసూత్రముచేఁ జెప్పుచున్నారు.

33॥ సూ॥ న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః.

టీ॥ పర్యాయాత్ =జీవావయవములు సంకోచవికాసములను పొందునవి యగుటవలన, అవిరోధః=విరోధము లేదు, అపి=అట్లంగీకరించినను, న=విరోధ పరిహారము కాఁజాలదు. ఏలననఁగా, వికారాదిభ్యః=అందుమూలముగ జీవునికి వికారాదిదోషములు ప్రసక్తించుటవలన,

తా॥ జీవావయవములు సంకోచవికాసములను పొందునవి గాన, ఈపైని గానఁబఱచిన విరోధము లేదంటివేని, యట్లు చెప్పఁదగదు. ఏలననిన, అందుమూలముగ జీవునికి వికారాది దోషములుప్రసక్తించును. కావున, విరోధ మనివార్యము.

శ్రీ॥ భా॥ జీవుఁడు సంకోచవికాసరూపమగు నవస్థాంతరమును పొందుటనుబట్టి ఈపైని గనఁబఱచిన విరోధము పరిహరింపఁబడునంటివేని, యట్లంగీకరించిన పక్షమున, జీవుఁడు వికారములును, అట్టివికారములనుబట్టి యుండునవి యగు ననిత్యత్వాదులును గలవాఁడనెడి దోషము ప్రసక్తించును. అందువలనఁ జీవుఁడు ఘటాదిపదార్థముల వంటివాఁడని ప్రసక్తించును.

3౪॥ సూ॥ అన్త్యావస్థితేశ్చోభయ నిత్యత్వాదవిశేషః.

టీ॥ అన్త్యావస్థితేః = మోక్షావస్థాభావియగు జీవపరిమాణము నిలిచి యుండుటవలనను, ఉభయనిత్యత్వాచ్చ = అట్టిజీవుఁడును వాని పరిమాణమును నిత్యములగుటవలనను, అవిశేషః=జీవపరిమాణమునఁ దారతమ్యము లేదు.

తా॥ మోక్షావస్థాభావియగు నంత్యజీవపరిమాణము మాఱిపోక నిలిచి యుండుటచేతను, అట్టి జీవుఁడును వాని పరిమాణమును నిత్యములగుటచేత నున్ను జీవునికి శరీరానుసారముగా స్థూలసూక్ష్మ పరిమాణము లుండఁజాలవు. కావునను జైనమతమసంగతము.

శ్రీ॥ భా॥ మోక్షావస్థనుపొందిన జీవుఁడు మరల దేహమును బొందఁడుగాన, నతని కట్టి మోక్షావస్థయందుఁగల పరిమాణము మార్పును పొందక నిలిచి యుండునది. ఇట్లు మోక్షావస్థను బొందిన జీవుఁడును అట్టి యవస్థయం దతనికిఁ గల పరిమాణమున్ను ఈ రెండును నిత్యములు. కావున నట్టి పరిమాణమే యతనికి స్వాభావికమైనది కాఁదగును. కావున నట్టి మోక్షావస్థ గలుగుటకు పూర్వమున్ను జీవునికిఁగలపరిమాణ మట్టిదిగానే యుండవలయును. ఈ హేతువువలన జైనులు చెప్పురీతిని జీవుఁడు శరీరానురూపమగు పరిమాణము గలవాఁడుగా నుండఁజాలఁడు. కావున, జైనమతము ఏ తన్మాత్రము యుక్తమయినది కాదు.

ఏకస్మిన్నసంభవాధికరణము ముగిసెను.

## —పశుపత్యధికరణము.—

### ౩౭॥ సూ॥ పత్యురసామఞ్జస్యాత్.

టీ॥ అసామఞ్జస్యాత్ = సామరస్యము లేకపోవుటవలన, పత్యుః= పశుపతియొక్క (మతం=మతము, ఆదరణీయం=ఆదరింపఁదగినది. న=కాదు).

తా॥ సామరస్యము లేకపోవుటవలన పశుపతిమత మాదరణీయము కాదు.

పూర్వాధికరణ సంబంధము.

శ్రీ॥భా॥ ఇంతకుఁ బూర్వము సాంఖ్య, వైశేషిక, బౌద్ధ, జైన మతముల యుక్తము లయినందునను, వేదబాహ్యము లయినందునను మోక్షార్థు లగువారిచే నవి యాదరింపఁదగినవి కావని చెప్పఁబడియె. అట్లే వేదవిరుద్ధమయి నందునను, అయుక్తమయి నందునను పశుపతిమతము సయితము అనాదరణీయమని యీ యధికరణమునఁ జెప్పుచున్నారు.

పశుపతి మతోపన్యాసము.

ఈ పశుపతి మతావలంబులు కాపాలులనియు, కాళాముఖులనియు, పాశుపతులనియు, శైవులనియును నాలుగు తెగల వారు. వీరందఱును వేదవిరుద్ధమగు తత్త్వప్రక్రియను, ఐహికాముష్మిక నిశ్శ్రేయస్సాధకములగు కల్పనలనున్ను కల్పించుచున్నారు. వీరు నిమిత్తోపాదాన కారణములకు భేదము నంగీకరించుచు, పశుపతిని జగత్తునకు నిమిత్తకారణమునుగాను మాత్రమంగీకరించి ముద్రికాషట్కధారణము మొదలగునది ముక్తిసాధనమని బోధించుచున్నారు. కాపాలులు ముద్రికాషట్కధారణమును గుఱించి యిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ ముద్రికాషట్కతత్త్వజ్ఞః పరముద్రావిశారదః।
భగాసనస్థమాత్మానం ధ్యాత్వా నిర్వాణ మృచ్ఛతి॥

తా॥ ముద్రికాషట్కముయొక్క తత్త్వమును బాగుగా నెఱింగి పరముద్రను తెలిసికొనిన మానవుఁడు భగాసనమున నాత్మను ధ్యానించి మోక్షమును బొందుచున్నాఁడు.

శ్లో॥ కంఠికా రుచకంచైవ కుండలం చ శిఖామణిః।
భస్మ యజ్ఞోపవీతం చ ముద్రాషట్కం ప్రచక్షతే॥

తా॥ కంఠికయు, రుచికంబును, కుండలమును, శిఖామణియును, భస్మమును, యజ్ఞోపవీతమును, ఈ యాఱును ముద్రికాషట్క మనంబడు చున్నవి.

శ్లో॥ ఆభిర్ముద్రితదేహస్తు న భూయ ఇహ జాయతే।

తా॥ ఇట్టి ముద్రికాషట్కముచే ముద్రింపఁబడిన శరీరముగల మానవుఁడు మరల ఈలోకమున జన్మింపఁడు.

వీరిలో కాళాముఖులు కపాలమును భోజనపాత్రనుగా నుపయోగించుటయు, శవభస్మమును దేహమునందంతటఁ బూసుకొనుటయు, దానిని భక్షించుటయు, చేతిలో నొకదుడ్డుకఱ్ఱనుంచుకొనుటయు, సురాకుంభస్థాపనమును, అట్టి సురాకుంభమునం దిష్టదేవతనర్చించుటయను నవి ఐహికాముష్మిక ఫలసాధనములని చెప్పుచున్నారు.

"రుద్రాక్షకఙ్కణం హస్తే జటాచైకాంచ మస్తకే కపాలం భస్మనాస్నానం" (హస్తమునందు రుద్రాక్షకంకణమును, శిరస్సునందు జటయు, కపాలము, భస్మస్నానమును) ఈ మొదలగునవి శైవాగమమునందు ప్రసిద్ధములు. అట్లే ఏదైన నొక కార్యవిశేషము నొనర్చుటచే నితర జాతులవారికిని బ్రాహ్మణ్యప్రాప్తియును, ఉత్తమాశ్రమ ప్రాప్తియును గలుగుననియును వీరు చెప్పుచున్నారు. ఎట్లనిన,

శ్లో॥ దీక్షాప్రవేశ మాత్రేణ బ్రాహ్మణో భవతి క్షణాత్।
కాపాలంవ్రత మాస్థాయ యతిర్భవతి మానవః॥

తా॥ ఎవ్వఁడయినను దీక్షాగ్రహణ మాత్రమున బ్రాహ్మణుఁడు గావచ్చును. కాపాలవ్రతము నవలంబించిన మాత్రమున యతి గావచ్చును.

ఈపైని వివరింపఁబడిన పశుపతిమతము పరస్పరవిరుద్ధ మయినందునను, వేద విరుద్ధమయి నందునను ఆదరింపఁదగినది కాదు. ఎట్లనిన, ముద్రికాషట్క ధారణము, భగాసనమున నాత్మను ధ్యానించుట, సురాకుంభమును స్థాపించుట, అట్టి కుంభమునందు దేవతార్చన నొనర్చుట, గూఢాచారము, స్మశానమునందలి భస్మముతో స్నానమొనర్చుట, ప్రణవపూర్వకమగు ధ్యానము ఈ మొదలగునవి పరస్పర విరుద్ధములు. వీరి తత్త్వకల్పనము, ఉపాసనము, ఆచారమును వేదవిరుద్ధములు. ఏలననిన, వేదములు పరబ్రహ్మమగు నారాయణునే కదా జగత్తుయొక్క నిమిత్తకారణమునుగాను, ఉపాదానకారణమునుగానును తెలుపుచున్నవి. ఎట్లనిన, "నారయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః। నారాయణపరోజ్యోతి రాత్మా నారాయణః పరః" అనియు "తదైక్షత బహుస్యాం ప్రజాయాయేతి" అనియు "తదాత్మానం స్వయమకురుత" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు "పరబ్రహ్మమగు నారాయణుఁడు జగత్తునకు ఉపాదానకారణమున్ను నిమిత్తకారణముననియు" "వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసస్తు పారే" అనియు "తమేవం విద్వాన మృత ఇహభవతి నాన్యః

(margin: పశుపతిమత నిరసనము)

పన్థా అయనాయ విద్యతే" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములతో నేకార్థ లగు నుపనిషత్తులన్నియును పరబ్రహ్మమగు పరమపురుషుని గుఱించిన వేదనమే (జ్ఞానమే) మోక్షసాధనమగు నుపాసనమనియు "తమేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన" అనియు "ఏతమేవలోక మిచ్ఛన్తః ప్రవ్రాజినః ప్రవ్రజన్తి" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు "శాస్త్రవిహితములగు వర్ణాశ్రమ ధర్మములే యట్టి యుపాసనమునకు సహాయకములనియును తెలుపుచున్నవి. ఉపాసనమును విధించు వాక్యములయందు వినఁబడు ప్రజాపతి, శివ, ఇంద్ర, ఆకాశ, ప్రాణాది శబ్దములు కేవలముపరతత్త్వమును ప్రతిపాదించునట్టి నారాయణానువాక్యమునందు ఉపదేశింపఁబడినట్టి తత్త్వమును దెలియఁజేయునవి యని "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" అను సూత్రమునఁ బ్రతిపాదించి యున్నాము. మఱియు "ఏకో హవై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానః" అను వాక్యమొదలు కొని "స ఏకాకీ న రమేత," అను వాక్యపర్యంతము సృష్టిప్రకరణమునందు సృష్టికర్తగాఁ జెప్పఁబడిన నారాయణుఁడే ప్రకృతమగు "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" ఇత్యాది వాక్యములయందు "సత్" "బ్రహ్మ" ఇత్యాది శబ్దములచేఁ దెలుపఁబడుచున్నాఁడనియును "జన్మాద్యస్యయతః" (బ్ర. సూ. ౧ అ. ౧ పా. ౨ సూ.) అను సూత్రమునందు ప్రతిపాదించియున్నాము. ఈ పైని గనఁబఱచిన హేతువులనుబట్టి పాశుపత మతము వేదవిరుద్ధమగు తత్త్వమును, ఉపాసనమును, అనుష్ఠానమునున్ను బోధించునది యగుటంజేసి, ఇది యెంతమాత్ర మాదరింపఁదగినది కాదు.

## ౩౯॥ సూ॥ అ ధి ష్ఠా నా ను ప ప త్తే శ్చ.

టీ॥ అధిష్ఠానా నుపపత్తేశ్చ=ప్రధానాదుల నధిష్ఠించుట యనుపపన్నమైనందునను, ఈశ్వరుఁడు నిమిత్తకారణము మాత్రమే కాఁజాలఁడు.

తా॥ ఈశ్వరుఁడు ప్రధానాదుల నధిష్ఠించి జగత్సృష్టి నొనర్చుట యసంభవము గాన, నతఁడు నిమిత్తకారణము మాత్రమే కాఁజాలఁడు.

శ్రీ॥ భా॥ కార్యభూతమగు ఘటమును జూచి దీనికిఁ గారకుఁడొక్కఁడు ఉన్నాఁడని యూహించుచున్నట్లు గదా, వేదబాహ్యు లందఱును కార్యభూతమగు జగత్తును జూచి దీనికిఁ గారకుఁడగు నీశ్వరుఁ డొక్కఁడు ఉన్నాఁడని యూహించుచున్నారు. కానిమ్ము. అయిన నిట్లు అనుమానమునుబట్టి యీశ్వరుఁడు నిమిత్తకారణమని చెప్పునట్టి వీరు, కులాలుఁడు ఘటమునుఁ జేయుటకై మృత్తికనధిష్ఠానముగాఁ జేసికొనినట్లు, ఈశ్వరుఁడగు పశుపతియును ప్రకృతి నధిష్ఠానముగాఁ జేసికొని అనఁగా దాని నాశ్రయించి యుండియే కదా జగద్రూపమగు కార్యము నొనర్చు

చున్నాఁడని చెప్పవలయును. ఇది యసంభవము. ఏలననిన, ఈశ్వరుఁడు శరీర రహితుఁడు. శరీరయుక్తు లగుటంజేసి గదా కులాలాదులు మృదాదుల నధిష్ఠింప సమర్థు లగుచున్నారు. ఈశ్వరుఁడును శరీరయుక్తుఁడే యని చెప్పనేరము. ఏల ననిన, అవయవయుక్తమగునట్టి యాశరీరము నిత్యమగు పక్షమునను, అనిత్యమగు పక్షమునను దోషము సంప్రాప్తమగునని "శాస్త్రయోనిత్వాత్" (బ్ర. సూ. ౧ అ. ౧ పా. 3 సూ.) అను సూత్రమునఁ బ్రతిపాదించి యున్నాము.

౩౭॥ సూ॥ కరణవచ్చేన్న భోగాదిభ్యః.

టీ॥ కరణవత్ = జీవునికి శరీరేంద్రియాదు లధిష్ఠానమయినట్లు, చేత్ = ప్రకృతి యీశ్వరున కధిష్ఠానము గావచ్చునంటివేని, న=అది సరికాదు. ఏలన నఁగా, భోగాదిభ్యః=అది కర్మ ఫలభోగాదులనుబట్టి యుండుటవలన.

తా॥ శరీరేంద్రియాదులు జీవుని కధిష్ఠానమైనట్లు, ప్రధానాదు లీశ్వరున కధిష్ఠానము గావచ్చునంటివేని, యది సరికాదు. అట్లగుట కర్మానుభవమునుబట్టి వచ్చినది.

శ్రీ॥ భా॥ భోక్తయగు జీవుఁడు శరీరరహితుఁడయినను, కరణకళేబరాదుల నధిష్ఠించి యున్నట్లు, మహేశ్వరుఁడును శరీరరహితుఁడయినను, ప్రధానము నధిష్ఠించి యుండుట సంభవమని వాదించుటకుఁ గూడ, అవకాశము లేదు. ఏలననిన, జీవుని పుణ్యాపాపరూపకర్మఫలముల ననుభవింపఁజేయుటకై పుణ్యాపాప రూపాదృష్టముచే నతనికి శరీరము నిర్మింపఁబడుచున్నది. ఈశ్వరుఁడు శరీరముగల వాఁడగునేని, యందులకై యతఁడును పుణ్యాపాప రూపమగు నదృష్టముగలవాఁడు గావలసి వచ్చును. మఱియు పుణ్యాపాపకర్మఫల భోగము గూడ అతనికిఁగలదని చెప్పవలసి వచ్చును. ఈ హేతువువలన నీశ్వరుఁడు ప్రధానము నధిష్ఠించుట యొంతమాత్రము సంభవము గాదు.

౩౮॥ సూ॥ అన్తవత్త్వమసర్వజ్ఞతా వా.

టీ॥ అన్తవత్త్వం=నాశవత్త్వము గాని, అసర్వజ్ఞతా వా=అసర్వజ్ఞత్వము గాని ఈశ్వరునికి ప్రసక్తించును

తా॥ అట్లగు పక్షమున, ఈశ్వరుఁడు నాశవంతుఁడని గాని, సర్వజ్ఞుఁడు కాఁడని గాని ప్రసక్తించును.

శ్రీ॥ భా॥ ఈపైని గనఁబఱచిన ప్రకారము జీవునివలె నీశ్వరుఁడును పుణ్యాపాప రూపమగు నదృష్టము గలవాఁడని యంగీకరించినచో, జీవునివలె నతఁడును అంతవంతుఁడనియు అనఁగా సృష్టిసంహారాదుల కాస్పదుఁడనియు, అసర్వజ్ఞుఁడనియు నంగీకరింపవలసి వచ్చును. కావున పశుపతి మతమెంత మాత్ర మాదర

ణీయము కాదు. "విరోధేత్వనపేక్షం స్యాత్" ఇత్యాది పూర్వమీమాంసా సూత్రములచే వేదవిరుద్ధ మయినది యనాదరణీయమని తెలిసియున్నను, పశుపతి మతము వేదవిరుద్ధమయినదని తెలియఁజేయుటకై "పత్యురసామఞ్జస్యాత్" ఇత్యాది సూత్రములచే వేదవిరుద్ధములగు మతములనుగుఱించిన ఖండనమును మరల ఆరంభించి యుండిరి. వేదవిరుద్ధములుకాని మతములయందుండు కొన్ని యంశములు శైవపాశుపతమతములయందుండినను, ఈమతస్థులు వేదవిరుద్ధముగ నిమిత్తోపాదాన కారణములకు భేదముగలదని యంగీకరించుచున్నారు. అది పరాపరతత్త్వములను గుఱించిన విపర్యయజ్ఞానమువలనఁ గలిగినది. కావున వీరి మతము అయుక్త మయినది.

పశుపత్యధికరణము ముగిసెను.

## ఉత్పత్త్యసంభవాధికరణము.

### ౩౯॥ సూ॥ ఉత్పత్త్యసంభవాత్.

టీ॥ ఉత్పత్త్యసంభవాత్ = జీవునికి ఉత్పత్తి సంభవము గానందున, (భాగవత మత మయుక్తము).

తా॥ వాసుదేవుఁడను పరమాత్మనుండి సంకర్షణుఁడను జీవుఁడు ఉత్పన్నుఁడగుట సంభవము కాదు గాన, భాగవత మత మయుక్తము.

### ఆక్షేపము

శ్రీ॥ భా॥ భగవంతునిచే మోక్షసాధనప్రతిపాదకముగా నుపదేశింపఁబడిన పాంచరాత్ర తంత్రమున్ను సాంఖ్యవైశేషికాది తంత్రములవలె నప్రామాణ్యమని యాక్షేపించి యట్టియాక్షేపమును ఈయధికరణమున నిరాకరించుచున్నారు.

భాగ మతోపన్యాసము.

పరమకారణుఁడును, పరబ్రహ్మభూతుఁడనగు వాసుదేవునినుండి సంకర్షణుఁడనంబడు జీవుఁడు పుట్టుచున్నాఁడనియు, ఆ సంకర్షణుఁడను జీవుని నుండి ప్రద్యుమ్నమను మనస్సు పుట్టుచున్నదనియు, ప్రద్యుమ్నమను మనస్సునుండి అనిరుద్ధమను అహంకారము పుట్టుచున్నదనియు నివ్విధముగ భాగవతులు తమ మతమును బోధింపుచున్నారు. అయితే "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇత్యాది శ్రుతివాక్యములు జీవునికి జన్మమరణములు లేవని చెప్పుచు జీవుఁడనాదియని తెలియఁజేయుటంజేసి, జీవునికి ఉత్పత్తిగలదనుట కేవలము శ్రుతివిరుద్ధమయిన సంగతి.

౪౦॥ సూ॥ న చ క ర్తుః క ర ణ మ్.

టీ॥ కర్తుః=కర్తయగు సంకర్షణునుండి, కరణం=ప్రద్యుమ్న మనఁబడు నదియు, కరణము నగు మనస్సు, న=కలుగఁజాలదు.

తా॥ సంకర్షణసంజ్ఞకుఁడును, కర్తయునగు జీవునినుండి ప్రద్యుమ్న సంజ్ఞకమును కరణమునగు మనస్సు పుట్టఁజాలదు.

శ్రీ॥ భా॥ సంకర్షణుఁడనంబఁడు జీవునినుండి ప్రద్యుమ్న మనంబడు మనస్సు కలుగుచున్నదనఁగా, కర్తయగు జీవునినుండి కరణమగు మనస్సు కలుగుచున్న దనుట గదా? కర్తనుండి కరణ మెట్లు గలుగును? ఇది యసంభవము. ఇంతియె కాక, "ఏతస్మాత్ జాయతే ప్రాణః మనస్స ర్వేంద్రియాణిచ" అనుశ్రుతివాక్యము "ప్రాణము మనస్సు మొదలగునవి పరబ్రహ్మమునుండి బుట్టుచున్నవి" అనుచు మనస్సు సయితము పరమాత్మనుండియే పుట్టుచున్నదని చెప్పుచున్నది. కనుక పాంచరాత్రతంత్రము జీవునినుండి మనస్సు గలుగుచున్నదనుచు శ్రుతివిరుద్ధమగు సంగతిని తెలుపుచున్నది. అందువలన దానిని ప్రామాణికముగా నంగీకరింపఁ దగదు.

అవతారిక:—ఇట్లు పాంచరాత్ర తంత్రమున కప్రామాణ్యము ప్రాప్తింపఁగా, నందులకు సమాధానము నీసూత్రముచేఁ జెప్పుచున్నారు.

౪౧॥ సూ॥ విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః.

టీ॥ విజ్ఞానాదిభావే=బ్రహ్మ భావము గలుగుచుండగా, తదప్రతిషేధః=ప్రామాణ్యము నిషేధితముకాదు. కావున, వా=పూర్వపక్షము యుక్తముకాదు.

తా॥ సంకర్షణాదుల యెడల బ్రహ్మభావము తగినదియే గాన, దానిఁ బ్రతిపాదించునట్టి శాస్త్రముయొక్క ప్రామాణ్యము నిషేధితముకాదు.

—సమాధానము—

శ్రీ॥ భా॥ "విజ్ఞానమును ఆదియును" అను విగ్రహ వాక్యమునుబట్టి విజ్ఞానాది యనఁగా పరబ్రహ్మము. సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధులయం దట్టి పరబ్రహ్మభావము నుంచుట యుక్తమయినదే గదా ? వానియందట్టి పరబ్రహ్మ భావమును ప్రతిపాదించునట్టి పాంచరాత్రతంత్రము అప్రమాణమని యెట్లు చెప్పఁ దగును? అయితే భాగవతులు జీవోత్పత్తిని ప్రతిపాదించుచున్నారను మాట భాగవతుల ప్రక్రియను బాగుగ పరిశీలింపని వారు చెప్పునదియే గాని మఱి యొకటి కాదు. ఆశ్రితజనవత్సలుఁడును, వాసుదేవుఁడనంబడు పరబ్రహ్మము తన యాశ్రితులు తనను సులభముగా నాశ్రయించుటకై తానే తన యిచ్ఛవలన నాలుగు విధములుగానుండునని గదా భాగవతులు జెప్పుచున్నారు. ఈ విషయ మును గుఱించి పౌష్కరసంహిత యందిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ కర్తవ్యత్వేన వై యత్ర చాతురాత్మ్య ముపాస్యతే।
క్రమాగతైస్స్వసంజ్ఞాభిః బ్రాహ్మణైరాగమం తు తత్॥

తా॥ పరబ్రహ్మమెుక్క నాలుగు విధములను క్రమముగ వానిపేర్లతోఁ గూడ బ్రాహ్మణులు ఉపాసింపవలయునని విధించునది యాగమము.

ఇట్లు చాతురాత్మ్యమును అనఁగా నీనాలుగు విధముల నుపాసించుట వాసుదేవుఁడను పరబ్రహ్మమును ఉపాసించుటయే యనుచు సాత్వతసంహిత ఇట్లు జెప్పుచున్నది.

శ్లో॥ బ్రాహ్మణానాం హి సద్బ్రహ్మ వాసుదేవాఖ్యయాజినాం।
వివేకదం పరం శాస్త్రం బ్రహ్మోపనిషదం మహత్॥

తా॥ వాసుదేవుఁడనంబడు పరబ్రహ్మమును ఉపాసించునట్టి బ్రాహ్మణులకు సత్తనంబడు బ్రహ్మమే యుపాస్యవస్తువు. దానిని తెలుపునట్టి శాస్త్రము గొప్పది. ఇదియే బ్రహ్మోపనిషత్తనఁబడుచున్నవి.

ఇట్లు వాసుదేవుఁడనఁబడు పరబ్రహ్మము సంపూర్ణసద్గుణశరీరుఁడు. ఇట్టి పరబ్రహ్మము సూక్ష్మమనియు, వ్యూహమనియు, విభవమనియు నివ్విధముగా నుండునట్టిది. ఇట్టి బ్రహ్మమును భక్తులు తమ తమ అధికారమున కనుగుణముగ జ్ఞానవిశిష్టమగు కర్మముతో నర్చించుటచేఁ బొందుచున్నారు. వారు విభవము నర్చించుటచే వ్యూహమును బొందుచున్నారనియు, వ్యూహము నర్చించుటచే సూక్ష్మమై వాసుదేవుఁడనఁబడు పరబ్రహ్మను బొందుచున్నారనియును చెప్పుచున్నారు. రామ కృష్ణాదిరూపములగు నవతారములు విభవమనఁబడుచున్నవి. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న అనిరుద్ధములనఁబడు నీ నాలుగును వ్యూహము లనఁబడుచున్నవి. కేవలషాడ్గుణ్య స్వరూపమును వాసుదేవమనఁబడు పరబ్రహ్మము సూక్ష్మమనఁబడుచున్నది. పౌష్కరసంహితయందు, "యస్మాత్సమ్యక్పరం బ్రహ్మ వాసుదేవాఖ్యమవ్యయం। అస్మాదవాప్యతే శాస్త్రాత్ జ్ఞానపూర్వేణ కర్మణా" "అవ్యయుఁడును వాసుదేవుఁడనఁబడు పరబ్రహ్మమును భక్తులు జ్ఞానయుక్తమగు కర్మముచేఁ బొందుచున్నట్లు పాంచరాత్ర తంత్రమువలనఁ దెలియవచ్చుచున్నది" అని ప్రస్తావించి ఈవిషయమును సవిస్తరముగాఁ జెప్పియున్నారు. ఈ పైని గనఁబఱచిన హేతువులవలన సంకర్షణాదులనఁగా, పరబ్రహ్మము స్వేచ్ఛచే గ్రహించిన శరీరములే యని స్పష్టమగుచున్నది. మఱియు "అజాయమానో బహుధా విజాయతే" అను శ్రుతివాక్యము "ఆశ్రితవాత్సల్య నిమిత్తమున పరబ్రహ్మము స్వేచ్ఛచే శరీరమును గ్రహించి జన్మింపవచ్చును" అని చెప్పుచున్నది. ఇట్లు శ్రుతి ప్రోక్తమగు జన్మమును ప్రతిపాదించి

నందువలన పాంచరాత్రతంత్రము అప్రమాణ మెట్లు కాగలదు? కనుక నిది యెంతమాత్రము అప్రమాణము గానేరదు. జీవతత్త్వమునకు సంకర్షణుఁడును, మనస్తత్త్వమునకు ప్రద్యుమ్నుఁడును, అహంకార తత్త్వమున కనిరుద్ధుఁడును అధిష్ఠానదేవతలు. కావున, జీవుని సంకర్షణునిగాను, మనస్సును ప్రద్యుమ్నుని గాను, అహంకారము ననిరుద్ధుని గాను, వ్యవహరించుచున్నాము. ఇట్లు వ్యవహరించుట విరుద్ధము గాదు. అదెటువలెననిన, ఆకాశ ప్రాణాదిశబ్దములచే బ్రహ్మమును వ్యవహరించుచుండలేదా? అట్లే యిచటను ఎఱుంగునది.

సూ॥ వి ప్ర తి షే ధా చ్చ.

టీ॥ విప్రతిషేధాచ్చ=పాంచరాత్ర తంత్రమునను జీవోత్పత్తి నిషేధింపఁ బడి యున్నందునను,

తా॥ పాంచరాత్ర తంత్రమునను జీవోత్పత్తి నిషేధింపఁబడియున్నందునను అది అప్రమాణమని చెప్పఁదగదు.

శ్రీ॥ భా॥ ఇంతియెకాక, పాంచరాత్ర తంత్రమునందును జీవోత్పత్తి నిషేధింపఁబడుచున్నది. పరమ సంహిత యందీవిషయము సవిస్తరముగ ప్రతిపాదింపఁబడినది. ఎట్లనిన,

శ్లో॥ అచేతనా పరార్థా చ నిత్యా సతత విక్రియా।
త్రిగుణా కర్మిణాం క్షేత్రం ప్రకృతే రూపముచ్యతే॥

తా॥ అచేతనమును, ఇతరులకుగా నుండునదియును, నిత్యమును, ఎల్లప్పుడును వికారమునొందునట్టిదియును, సత్త్వరజస్తమో గుణములతోఁగూడుకొని యుండునదియును, కర్తలగు జీవులకు భోగస్థానమయినదియును నగుట ప్రకృతి యొక్క స్వరూపము.

శ్లో॥ వ్యాప్తిరూపేణ సంబంధస్తస్యాశ్చ పురుషస్యచ।
సహ్యానాది రనంతశ్చ పరమార్థేన నిశ్చితః॥

తా॥ వ్యాప్తియే అట్టి ప్రకృతి పురుషులకుఁగల సంబంధము. అనఁగా ప్రకృతిపురుషులు పరస్పరము చేరియుండువారు. వాస్తవమున పురుషుఁడు జన్మమరణములు లేనివాఁడు.

ఇంక, అనేక సంహితలయందుఁ జీవుఁడు నిత్యుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈహేతువులవలన పాంచరాత్ర తంత్రమునఁ జీవునికి ఉత్పత్తి గలదనెడి యంశము నిషేధింపఁబడుచున్నదే గాని యది ప్రతిపాదింపఁబడుచుండ లేదు. ఇట్లు జీవునికి జన్మమరణములు లేకపోయినను, "జన్మించుచున్నాఁడు. మృతి నొందుచున్నాఁడు" అని యిట్లు శాస్త్రమునను లోకమునను నుండునట్టి వ్యవహారము ఎట్లు పొసగుచున్నదో, ఆవిషయమునుగుఱించి "నాత్మాశ్రుతేః"

(బ్ర. సూ. ౨ అ. ౩ పా. ౧౮ సూ.) అను సూత్రమున విచారింపఁబోవుచున్నాము. ఇట్లు పాంచరాత్ర తంత్రమునను, జీవోత్పత్తి నిషేధింపఁబడుచున్నది గాన, శ్రుతి విరుద్ధమగు జీవోత్పత్తిని ప్రతిపాదించుటచే నది యప్రమాణమని శంకించుట కెంతమాత్ర మవకాశము లేదు.

## ఆక్షేపము.

పాంచరాత్రతంత్రము అప్రమాణమను విషయమును మఱికొందఱు ఇవ్విధమునఁ బ్రతిపాదించుచున్నారు:—శాండిల్యుఁడను మహర్షి సాంగముగ వేదముల నభ్యసించియు, పరమపురుషార్థనిష్ఠను బొంద నేరక, అటుపిమ్మట పాంచరాత్ర శాస్త్రము నభ్యసించెనన్న సంగతి మనమెఱింగినదే గదా! సాంగముగ వేద శాస్త్రము నభ్యసించినను, పరమపురుషార్థనిష్ఠ గలుగ లేదనుటచే తదనంతర మట్టి నిష్ఠకుగా నభ్యసింపఁబడు పాంచరాత్రతంత్రము వేదవిరుద్ధమయినదని ఈ యుపాఖ్యానమువలనఁ దెలియవచ్చుచున్నది.

## సమాధానము.

ఇది యంతయును వేదార్థములనుగుఱించిన యనుభవము లేనట్టియు, వేదార్థములను విశదపఱచునవియగు నుపబృంహణ న్యాయాదుల నెఱుంగని వారియొక్క విచారశూన్యమగు నమ్మకమువలనఁ గల్పింపఁబడినదియే గాని, వేఱొక్కటి కాదు. అదెటువలెననిన, కర్మకాణ్డమునందు అనుదితహోమ మనియు (సూర్యోదయాత్పూర్వము జేయఁబడు హోమము) ఉదితహోమమనియును (సూర్యోదయానంతరము జేయఁబడు హోమము) రెండు హోమములు జెప్పఁబడి యున్నవి. "ప్రాతః ప్రాతరనృతం తే వదన్తి పురోదయాజ్జుహ్వతి యేఽగ్నిహోత్రం" అను శ్రుతివాక్యము "సూర్యోదయాత్పూర్వము ప్రతిదినము హోమముఁ జేయుట ప్రతిదినమును ప్రాతఃకాలమున ననృతముఁ జెప్పినట్లు" అని చెప్పుచున్నది. ఇట్లు చెప్పునట్టి యీ పై శ్రుతివాక్యమునకు అనుదితహోమమును నిందించుటయందు తాత్పర్యమా? కాదు. అయితే యది యుదితహోమమును స్తుతించుటకుగా నట్లు చెప్పుచున్నది. దృష్టాంతము:— ఉపనిషత్తులయందు భూమవిద్యయనఁబడునట్టి యొక యుపాసనము గలదు. అందు నారదుఁడు సనత్కుమారుని యొద్దకుఁబోయి "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థమితిహాసం పురాణం పఞ్చమం" "ఓ మునివర్య! నేను ఋగ్యజుస్సా మాథర్వణ వేదములను, ఇతిహాస పురాణములను అభ్యసించితిని" అని యిట్లు విద్యలనన్నింటినిఁ బేర్కొని, యనంతరము "సోఽహం భగవో మన్త్రవిదేవాస్మి నాత్మవిత్" "అయితే వీటి నభ్యసించినందువలన నేను మంత్రవేత్తనే యయితిని గాని ఆత్మవేత్తను గాక

పోయితిని” అన్నట్లొక యితిహాసము గలదు. ఈ యితిహాసమున నితరవిద్యల యందెచటను ఆత్మజ్ఞానము బోధింపఁబడలేదని చెప్పియుండుటకు హేతువు భూమవిద్యను ప్రశంసించుటయే గదా! అథవా నారదుఁడు వేదవేదాంగముల యందుఁ బ్రతిపాదింపఁబడిన యాత్మతత్త్వము నెఱుంగనివాఁడై తన యజ్ఞానమును సనత్కుమారుని కెఱింగించుటకై గాని యిట్లు చెప్పియుండవచ్చును.

ఉపనిషత్తులయందు శాండిల్యుని యితిహాసమునకుఁ దరువాత వేదాంత ప్రతిపాదితమును వాసుదేవుఁడనఁబడు పరతత్త్వ మతనికి ఉపదేశింపఁబడినందున, ఆ యితిహాసమున్ను ఈపైని గనఁబఱచిన విధమునఁ గైకొనఁబడుచున్నది.

వేదార్థములను యదార్థముగా నెఱుంగుట దుర్లభమయినందున వానిని సులభముగాఁ దెలుపుటకై పాంచరాత్ర తంత్ర.మారంభింపఁబడు చున్నదనుచు పరమసంహిత యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ అధీతా భగవన్ వేదా సాఙ్గోపాఙ్గా స్సవిస్తరాః।
శ్రుతాని చ మయాఙ్గాని వాకోవాక్య యుతానిచ॥
నచైతేషు సమస్తేషు సంశయేన వినా క్వచిత్।
శ్రేయోమార్గం ప్రపశ్యామి యేన సిద్ధిర్భవిష్యతి॥

తా॥ ఓనారాయణ! తర్కముతోఁగూడ వేదములను వేదాంగములనున్ను సాంగముగా నభ్యసించితిని. అయినను, వీనియందెచటను మోక్షసాధనమగు మార్గము సంశయ రహితముగాఁ బ్రతిపాదింపఁబడినట్లు గానఁబడదు.

శ్లో॥ వేదాన్తేషు యథా సారం సంగృహ్య భగవాన్ హరిః।
భక్తానుకంపయా విద్వాన్ సంచిక్షేప యథాసుఖం॥

తా॥ సర్వజ్ఞుడును, భక్తవత్సలుఁడునగు, నారాయణుఁడు ఉపనిషత్తుల యందలి సారమునంతయును సంగ్రహించి, యది సులభముగాఁ దెలియునట్లు దానిని పాంచరాత్ర తంత్రరూపమున సంగ్రహముగాఁ జెప్పెను.

వేదైకవేద్యుఁడును, హేయరహితుఁడును, కల్యాణగుణాకరుఁడును, జ్ఞానానందాద్యపరిమితోదారగుణ సాగరుఁడును, సత్యసంకల్పుఁడును, పరబ్రహ్మమనఁబడు వాసుదేవుఁడు వర్ణాశ్రమ వ్యవస్థ కనుగుణముగ నడుచుకొనువారై ధర్మార్థ కామమోక్షములనఁబడు చతుర్విధ పురుషార్థములను గోరువారగు తనభక్తులఁ జూచి అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యాది గుణములచే నుప్పొంగి, తన స్వరూపమును, విభూతిని, ఆరాధనమును, దాని ఫలమున్నును బోధించునట్టిదియు, ఋగ్యజుస్సామాథర్వణములనఁబడు నాలుగువిధము

లతోఁ గూడియున్నట్టిదియు, అపరిమితశాఖలతోఁగూడికొనినట్టిదియు, విధి, అర్థవాద మంత్రరూపమునగు వేదశాస్త్రము తనకుతప్ప ఇతరులకెవ్వరికిని గ్రహించుట కశక్యమగుటఁ గనిపెట్టి అందలి యర్థములను యథార్థముగాఁ దెలియఁజేయునట్టి పాంచరాత్ర శాస్త్రమును స్వయముగ నిర్మించినట్లు, ఈపైని యుదహరింపఁబడిన పరమసంహితా వాక్యములవలనఁ దెలివచ్చుచున్నది. కనుక నీశాస్త్రము వేదవిరుద్ధమయిన దెంతమాత్రము గానేరదు.

పాంచరాత్ర తంత్రమునందేదో యొక వేదవిరుద్ధాంశమున్నందున నది ప్రమాణముగా నంగీకరింపఁదగినది కాదనుటయే యీ నాలుగు సూత్రముల కర్థమని కొందఱు భాష్యకారులు తమభాష్యమునఁ దెలియఁజేసియున్నారు. అయితే వారి భాష్యము సూత్రార్థము ననుసరించినది కాదు. మఱియు నది బ్రహ్మసూత్రకారుల యభిప్రాయమునకు విరుద్ధమయినది. ఎందువలననఁగా, శ్రీ వేదవ్యాసులు వేదాంతవిచారావబోధకములగు బ్రహ్మసూత్రములను రచియించి యనంతరము వేదోపబృంహణమునకై శ్రీ మహాభారతమును రచియించెను. మహాభారతమున నతఁడు(వేదార్థమును విశదపఱచుటకై)నూఱువేల గ్రంథమగు మోక్షధర్మమును జెప్పఁబూని, యందు జ్ఞానకాండమున,

శ్లో॥ గృహస్థో బ్రహ్మచారీ చ వానప్రస్థోఽథ భిక్షుకః ।
యఇచ్ఛేత్సిద్ధి మాస్థాతుం దేవతాం కాం యజేత సః ॥

భార. శాన్తి. మోక్ష. ౩౫ అ.

తా॥ "బ్రహ్మచారి, గృహస్థుఁడు, వానప్రస్థుఁడు, సన్యాసియనఁబడునట్టి యీ నలుగుఱిలో నెవ్వఁడయినను మోక్షమును బొందఁగోరినచో, అందుల కుగా నతఁడే దేవతనారాధింపవలయును?" అని ప్రశ్న చేసి యనంతరము చాలా భాగమువరకు పాంచరాత్ర శాస్త్రప్రక్రియనే ప్రతిపాదించి తుదకిట్లు ఆనతిచ్చెను.

శ్లో॥ ఇదం శత సహస్రాద్ధి భారతాఖ్యాన విస్తరాత్ ।
ఆవిధ్య మతిమన్థానం దధ్నో ఘృతమి వోద్ధృతం ॥

తా॥ పెరుగును కవ్వముతోఁ జిలుకరించి దానినుండి ఘృతము దీయఁబడునట్లు ఈ పాంచరాత్ర తంత్రము నూఱువేల శ్లోకములతోఁ గూడుకొనిన శ్రీ మహాభారతమునుండి బుద్ధియను కవ్వముతోఁ దీయఁబడినట్టి సారము.

శ్లో॥ నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా ।
ఆరణ్యకం చ వేదేభ్యః ఓషధీభ్యో యథామృతం॥

తా॥ నవనీతము పెరుగునుండి తీయఁబడిన సారమయినట్లును, బ్రాహ్మణుఁడు మనుష్య జాతియొక్క సారభూతుఁడయి నట్లును, ఆరణ్యకము (ఉపనిషత్తు) వేదములనుండి తీయఁబడిన సారమయినట్లును, అమృతము సర్వౌషధుల

నుండి తీయఁబడిన సారమయినట్లును, పాంచరాత్ర తంత్రము మహాభారతము నుండి తీయఁబడిన సారము.

శ్లో॥ ఇదం మహోపనిషదం చతుర్వేద సమన్వితం।
సాంఖ్య యోగ కృతాం తేన పాంచరాత్రాను శబ్దితం ॥

తా॥ ఇది కర్మయోగ జ్ఞానయోగములతో ముగించుటం జేసి చతుర్వేద సారభూతమగు పాంచరాత్రమని పిలువంబడునట్టి గొప్ప యుపనిషత్తు.

శ్లో॥ ఇదం శ్రేయ ఇదంబ్రహ్మ ఇదం హితమనుత్తమం ।
ఋగ్య జుస్సామభిర్జుష్టం అథర్వాంగిరసైస్తథా
భవిష్యతి ప్రమాణం వా ఏతదే వానుశాసనం ॥

తా॥ ఈ పాంచరాత్రతంత్రమే సాంసారిక ఫలమును బోధించునది. పరమ ప్రాప్యమగు పరబ్రహ్మమును బోధించునదియు నిదియే. ఇదియే మోక్ష సాధనము. ఇది ఋగ్యజుస్సామాథర్వాణంబులనఁబడు నాలుగు వేదముల ననుస రించియున్నది. కనుక నిదియే ప్రమాణమున్ను అనుశాసమున్ను అగుగాక.

"ఇదం మహోపనిషదం" అను శ్లోకమునఁ బేర్కొనఁబడిన సాంఖ్య యోగములనఁగా జ్ఞానయోగ కర్మయోగములని యెఱుంగునది. కనుకనే సాం ఖ్యులకు జ్ఞానయోగమునం దధికారమనియు, యోగులకు కర్మయోగమునం దధి కారమనియును "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" అను శ్రీ భగవద్గీతా శ్లోకమునఁ జెప్పఁబడినది.

ఇంతియెకాక, శ్రీ వేదవ్యాసులు భీష్మ పర్వమున,

శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యై శ్శూద్రైశ్చ కృతలక్షణైః ।
అర్చనీయశ్చ సేవ్యశ్చ పూజనీయశ్చ మాధవః ।
సాత్త్వతం విధిమాస్థాయ గీతస్సంకర్షణేన యః.

తా॥ "పాంచరాత్ర తంత్రమునఁ జెప్పియున్న ప్రకారము సంకర్షణునిచే గానము జేయఁబడిన మాధవుని స్వధర్మపరులగు బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును, వీరందఱు నర్చింపవలయును సేవింపవలయును పూ జింపవలయును" అని చెప్పియున్నారు.

ఈపైని గనఁబఱచిన ప్రకారము పాంచరాత్ర తంత్రమును సర్వోత్తమ మునుగా శ్రీమహాభారతమునఁ గొనియాడియున్నట్టియు వేదవిద్గ్రేసరులునగు శ్రీ వేదవ్యాసులే వేదాంతవేద్యుఁడును పరబ్రహ్మభూతుఁడునగు వాసుదేవుని గుఱించిన యుపాసనార్చనాదులను ప్రతిపాదించునట్టి పాంచరాత్రతంత్రమున కప్రామాణ్యమును బ్రహ్మసూత్రములయం దెట్లు చెప్పుదురు? అసంభవము.

## ఆ క్షే ప ము.

శ్రీ వేదవ్యాసులు మహాభారతమునందు "సాంఖ్యం యోగః పంచ రాత్రం వేదాః పాశుపతం తథా। కిమేతాన్యేకనిష్ఠాని పృథఙ్ నిష్ఠాని వా మునే" ఇత్యాది శ్లోకములచే "సాంఖ్య యోగ పాశుపతాదులఁ బేర్కొని యుండుటచే నవియును ఆదరణీయము లనవలసి వచ్చును. అయితే వీరు సాంఖ్య యోగాది మతములు అనాదరణీయములనుచు వానిని బ్రహ్మసూత్రముల యందు ఖండించియున్నారు. కావున వానివలెనే పాంచరాత్రముగూడ బ్రహ్మ సూత్రములయందు నిషేధింపఁబడుచున్నది.

## స మా ధా న ము.

శ్రీ వేదవ్యాసులు మహాభారతమునందు ప్రతిపాదించిన ప్రకారముగానే బ్రహ్మసూత్రములయందును చెప్పియున్నారే గాని, వేఱుగాఁ జెప్పియుండలేదు. ఎట్లనిన, ఈ పైని యుదహరింపఁబడిన "కిమేతాన్యేకనిష్ఠాని పృథఙ్ నిష్ఠానివా మునే" ఇత్యాది ప్రశ్నముయొక్క తాత్పర్యము నిట్లు తెలియఁదగును. సాంఖ్య యోగ పంచరాత్ర వేద పాశుపతములన్నియు నొక్కటియే తత్త్వమును బోధింపుచున్నవా? లేక, అవి భిన్నభిన్నతత్త్వములను బోధింపుచున్నవా? ఒక్కటియే తత్త్వమును బోధింపుచున్నచో, నాతత్త్వ మెద్ది? అథవా, అవి భిన్నభిన్న తత్త్వములను బోధింపుచున్నచో, పరస్పర విరుద్ధార్థావ బోధకములగుచున్నవి. అయితే పరవస్తువునందట్టి వికల్పము లుండుట యసంభవ మయినందున, పరస్పరము విరుద్ధములగు నర్థములఁ దెలియఁజేయునవియగు సాంఖ్యయోగాదులన్నియు ప్రమాణములు గానేరవు. కాఁబట్టి, వీనిలో నేదైన నొక్కటియే ప్రమాణము గావచ్చును. అట్లయినచో, నట్లు ప్రమాణ మయినదెద్ది? ఇట్లు శంకించి, యనంతరమందులకు సమాధానముఁ జెప్పునపుడు ఈ మతములన్నియు నానావిధము లయిన వనియు, వీనిలో సాంఖ్యమును కపిలుఁడును, యోగమును హిరణ్యగర్భుఁడును, పాశుపతమును పశుపతియును బోధించిరి గాన, నవి పౌరుషేయములనియు "అవాంతరతపా నామ వేదాచార్య స్స ఉచ్యతే" అన్నట్లు అవాంతర తపస్కుఁడు వేదాచార్యుఁడనుచు వేదము లపౌరుషేయములనియును జెప్పి తుదకు "పంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణ స్స్వయమ్" అను శ్లోకమున నారాయణుఁడు స్వయముగా పంచరాత్రమును బోధించి నట్లానతిచ్చిరి. మహా భారతమునం దిట్లానతిచ్చిన శ్రీ వేదవ్యాసులవారి యభిప్రాయము ఈక్రిందు వివరింపఁబడుచున్నది.

సాంఖ్యయోగాది తంత్రములు పౌరుషేయము లగుటంజేసి యవి పరస్పరము విరుద్ధములగు తత్త్వములను బోధింపుచున్నవి. వేదములన్ననో, అపౌరు

షేయములగుటం జేసి వానియందు ప్రమాదాదిదోషములు లేశమాత్రము ఉండ నేరవు. ఇట్టి వేదములచేఁ బ్రతిపాదించుట కర్హమయినదగు, యథావస్థిత వస్తువు విషయమై పౌరుషేయములగు సాంఖ్యాది తంత్రములెట్లు ప్రమాణము లగును? అది దుర్లభము. పరబ్రహ్మమనంబడు నారాయణుఁడు వేదైకవేద్యుఁడు. సాంఖ్యాదితంత్రప్రతిపాదితులగు ప్రధాన పురుష పశుపతి మొదలగునవియన్న నో, యట్టి వేదవేద్యుఁడగు నారాయణుఁడే యాత్మగాఁగలవగుటం జేసి తత్త్వము లుగా నెన్నఁబడుచున్నవి. కనుకనే "సర్వేషు చ నృపశ్రేష్ఠ జ్ఞానేష్వేతేషు దృశ్యతే। యథాగమం యథాన్యాయం నిష్ఠా నారాయణః ప్రభుః" అను శాస్త్ర వాక్యము గూడ "జ్ఞానప్రదములగు సాంఖ్యాది సమస్త తంత్రములయందు ప్రతి పాదింపఁబడు తత్త్వములకు నారాయణుఁడే యాధారభూతుఁడగుట న్యాయ సమ్మతమును ఆగమసమ్మతమును" అని చెప్పుచున్నది. కనుక నీతంత్రముల యందుఁ బ్రతిపాదింపఁబడునట్టి తత్త్వమెద్దియును బ్రహ్మము కాదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనియు "విశ్వం నారాయణః" అనియు నీమొదలగు శ్రుతి వాక్యములవలన సర్వమునకును బ్రహ్మమే యాధారమని యెఱింగిన వాని కీవిష యము స్పష్టపడును.

కావున, వేదాంతవేద్యుఁడును, పరబ్రహ్మమనంబడు నారాయణుఁడే స్వయముగ పాంచరాత్రతంత్రమును నిర్మించినాఁడనియు, పాంచరాత్ర తంత్రమట్టి నారాయణుని స్వరూపమును, వాని నుపాసించుపద్ధతినిన్ని బోధింపుచున్నదని యును ఈ పైని గనఁబఱచిన హేతువులవలన సిద్ధమగుచున్నది. కాఁబట్టి యితర తంత్రములయందుఁ జెప్పఁబడినదంతయు నీపాంచరాత్ర తంత్రమునందును గద్దు. ఈవిషయమును గుఱించి యాక్షేపింప నెవ్వనితరము? ఏలననిన, "ఏవమేకం సాంఖ్యయోగం వేదారణ్యకమేనచ। పరస్పరాంగాన్యే తాని పాంచరాత్రం తుకథ్యతే" అను శ్రీ మహాభారత వాక్యమే "సాంఖ్యమును యోగమును వేద ములును ఉపనిషత్తులును ఇవియన్నియు నొక్కటియే తత్త్వమును ప్రతిపాదించు విషయమై పరస్పరము సహాయకములయి యున్నవనియు, ఈ నాలుగును జేరి పాంచరాత్ర మనంబడుచున్నవనియును" చెప్పుచు సాంఖ్యయోగాది తంత్రము లన్నియును పాంచరాత్ర తంత్రాంతర్గతములని స్పష్టపఱచుచున్నది. అనఁగా సాంఖ్యతంత్రము పంచవింశతి తత్త్వములను బోధింపుచున్నది, యోగతంత్రము యమ నియమాది రూపమగు యోగాభ్యాసమును బోధింపుచున్నది. ఆరణ్యక ములనంబడు యుపనిషద్వాక్యములన్నవో, వేదప్రోక్తములగు కర్మముల నంగీ కరించునవియై సాంఖ్యస్మృతి ప్రోక్తములగు పంచవింశతి తత్త్వములు బ్రహ్మాత్మ కములనియు, యోగస్మృతి ప్రోక్తమగు యమనియమాదిరూప యోగాభ్యాసము బ్రహ్మోపాసన పద్ధతియనియు, వేదప్రోక్తములగు కర్మములు బ్రహ్మముయొక్క

యారాధనములనియును జెప్పుచున్నవై బ్రహ్మస్వరూపమును ప్రతిపాదింపుచున్నవి. ఈవిషయమును పరబ్రహ్మభూతుఁడగు నారాయణుఁడు స్వయముగ పాంచరాత్రతంత్రమున విశదపఱచి యున్నాఁడనుట.

వేదాంతశాస్త్రము సాంఖ్యయోగ పాశుపతాది మతములను ఖండించుచున్నదనఁగా, నిది సాంఖ్యమునందుఁ జెప్పబడియున్న పంచవింశతి తత్త్వములు లేవనుచు అట్టి తత్త్వస్వరూపమును ఖండించుచుండలేదు. అయితే ఆ తత్త్వములు బ్రహ్మాత్మకములు గావని సాంఖ్యులు జేయు వాదమును ఖండించుచున్నది. అట్లే ఇది యోగమున్ను పశుపతియును లేవనుచు యోగపశుపతుల స్వరూపమును ఖండించుచుండ లేదు. అయితే ఈశ్వరుఁడు కేవల నిమిత్తకారణుఁడను వీరల యభిప్రాయమును, పరాపర తత్త్వములను గుఱించి వీరుకల్పించు విపరీత కల్పనను, వీరియొక్క వేదబహిష్కృతమగు నాచారమున్ను నిరాకరించుచున్నది. కనుకనే, "సాంఖ్యం యోగః పంచరాత్రం వేదాః పాశుపతం తథా ఆత్మప్రమాణాన్యేతాని న హంతవ్యాని హేతుభిః" అను స్మృతివాక్యము గూడ "సాంఖ్య యోగ పంచరాత్ర వేద పాశుపతము లాత్మ స్వరూపమును గుఱించిన ప్రమాణములు. కావున వీని నెవ్వఁడును కుయుక్తులచే ఖండింపఁ గూడదు" అని చెప్పుచున్నది. కావున సాంఖ్య యోగాదులయందుఁ జెప్పఁబడిన తత్త్వములయొక్క స్వరూపమును మాత్ర మంగీకరింపవలయును. "యథాగమం యథాన్యాయం నిష్ఠా నారాయణః ప్రభుః" అని చెప్పియున్న ప్రకారము సర్వము పరబ్రహ్మాత్మక మగుటంజేసి, జైనులు బోధించు తత్త్వమును బహిష్కరించి నట్లు వీనినిఁగూడ బహిష్కరింపఁ గూడదు.

ఉత్పత్త్యసంభవాధికరణము ముగిసెను.

---

గద్య॥ ఇది శ్రీ కృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీత్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్యప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు ద్వితీయాధ్యాయమున—ద్వితీయపాదము.

---

    

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము

## ద్వితీయాధ్యాయము—తృతీయపాదము

### వియదధికరణము.

### ౧॥ సూ॥ న వియ దశ్రుతేః.

టీ॥ అశ్రుతేః = (ఆకాశోత్పత్తి) శ్రుతియందు వినఁబడక పోవుటవలన, వియత్ = ఆకాశము, న = (ఉత్పన్నమయిన పదార్థము) కాదు.

తా॥ ఆకాశమునకు ఉత్పత్తి యున్నట్లు, శ్రుతులయందెచటను వినఁబడక పోవుటచే, ఆకాశము ఉత్పన్నమయిన పదార్థము కాదు.

కడచిన పాదముతోఁ గల సంబంధము.

శ్రీ॥ భా॥ కుయుక్తులచే సాధింపఁబడినవి యగుటవలనను, పూర్వాపర విరుద్ధము లగుటవలననున్ను సాంఖ్యము మొదలగు వేదబాహ్యదర్శనములు అయుక్తములని ద్వితీయపాదమునఁ బ్రతిపాదించి, వేదాంత దర్శనమునం దట్టి దోషము లేవియును లేవని గానఁబఱచుటకై యీ పాద మారంభింపఁ బడుచున్నది. అందు, ప్రథమమున పరబ్రహ్మముచే సృజింపఁబడినదిగా నంగీకరింపఁబడినట్టియు, చిదచిదాత్మకమునగు జగత్తు సృజింపఁబడిన పదార్థమగు విధమును గుఱించి పరిశీలింపఁ బడుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఆకాశము సృజింపఁబడిన పదార్థమా? లేక, స్వతస్సిద్ధమయిన పదార్థమా?

### పూర్వపక్షము.

ఆకాశము సృజింపఁబడిన పదార్థము కాఁదగదు. ఏలననిన, ఆకాశము సృజింపఁబడినట్లు శ్రుతులయందెచటను చెప్పియుండలేదు. సంభవములగు వానిని గుఱించి శ్రుతియందుఁ జెప్పఁబడునే గాని, యసంభవములగు నాకాశకుసుమోత్పత్తి ఆకాశోత్పత్తి మొదలగు వానిని గుఱించి యెట్లు జెప్పఁబడును? ఆత్మ

నిరవయవమై సర్వగతమగుటంజేసి దానియొక్క యుత్పత్తిని నిరూపించుట యెట్లు అశక్యమో, అట్లే, యాకాశము నిరవయమై సర్వగతమగుటంజేసి దాని యొక్క యుత్పత్తిని నిరూపించుట సయితము అశక్యము. ఇట్లు ఆకాశము సృజింపఁబడినదగుట యశక్యమగుటను బట్టియే, ఛందోగులు, సృష్టినిగుఱించి పఠించుసందర్భమున, తేజస్సు మొదలగువానిని మాత్రమే సృజింపఁబడిన పదార్థములనుగాఁ బఠించియున్నారు. ఎట్లనిన, ఛాందోగ్యోపనిషత్తునందు "తదైక్షత బహుస్యాం ప్రజాయాయేతి తత్తేజోఽసృజత" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౩వా.) అను వాక్యమున "బ్రహ్మము జగత్తును సృజించుటకై అనేకములుగా నగుదునని ధ్యానించెను. అటుపిమ్మట తేజస్సును సృజించెను" అని యిట్లు పఠింపఁబడెను. తైత్తిరీయకాథర్వణాదిశాఖలయందు "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" 'పరబ్రహ్మమునుండి యాకాశము పుట్టినది.' అనియు, "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతిరాపః" "ఈపరబ్రహ్మమునుండి ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము పుట్టుచున్నవి" అనియును, జెప్పియున్నందున నాకాశము సృజింపఁబడినదిగాఁ దెలియవచ్చుచున్నను, ఆకాశమునకు ఉత్పత్తియుండుట ఈపైని గాన్పింపఁబడిన హేతువులతో విరోధించునుగాన, నీశ్రుతులు బాధింపఁబడుచున్న వనిన,

అవతారిక:—ఇట్లు పూర్వపక్షమురాఁగా, ఇందులకు సమాధానము చెప్పుటకై:-

౨॥ సూ॥ అస్తి తు.

టీ॥ అస్తి = ఆకాశమునకు ఉత్పత్తికలదు. తు = (కావున ఆకాశమునకు ఉత్పత్తిలేదను వాదము యుక్తము) కాదు.

తా॥ ఆకాశమునకు ఉత్పత్తి కలదు. కాఁబట్టి ఆకాశమునకు ఉత్పత్తి లేదను వాదము యుక్తము కాదు.

## సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ ఆకాశమునకు ఉత్పత్తిగలదు. ఇంద్రియగోచరములుకాని పదార్థములను దెలుపునట్టివి గదా! శ్రుతులు. కావున, ఆకాశమునకు ఉత్పత్తి గలదను విషయము ప్రమాణాంతరములనుండి తెలియఁబడక పోయినను, అట్టి యుత్పత్తిని ప్రతిపాదించు సామర్థ్యము శ్రుతులకుఁ గలదు. ఇట్లు ఆకాశమునకు ఉత్పత్తి గలదని శ్రుతులే ప్రతిపాదింపుచుండగా, దానికిఁగల నిరవత్వాది హేతువులనుబట్టి దానికిఉత్పత్తి లేదని యిట్లొక యనుమానము గలుగుట యసంభవము. ఆత్మ నిరవయవమైనదగుటచే మాత్రమే యది యుత్పత్తిరహితమైనది కాదని ఘఁకమీఁదు ప్రతిపాదింపఁబడును.

అవతారిక :—మరల శంకించుచున్నాఁడు.

3॥ సూ॥ గౌ ణ్య స మ్భ వా చ్ఛ బ్దా చ్చ.

టీ॥ గౌణీ=ఆకాశమునకు ఉత్పత్తిగలదని తెలుపు శ్రుతి గౌణార్థముగలది. ఏలననఁగా, అసంభవాత్=ఆకాశోత్పత్తి సంభవింపక పోవుటవలనను, శబ్దాచ్చ= ఆకాశము నిత్యమైనదని మఱియొకశ్రుతియందుఁ జెప్పియుండుటవలనను.

తా॥ ఆకాశమునకు పుట్టుకయుండుట యసంభవమగుటంజేసియు, అది నిత్యమైనదియని వేఱొక్కశ్రుతియందుఁ జెప్పియుండుటంజేసియును ఆకాశమునకు పుట్టుక కలదని తెలుపునట్టి శ్రుతి గౌణార్థముగలదియని యూహింపఁదగును.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" అను తైత్తిరీయక శ్రుతియందాకాశమునకు ఉత్పత్తి యున్నట్లు చెప్పియున్నను, అది యాశ్రుతి యొక్క ముఖ్యార్థము గాదని యూహింపఁదగును. ఎట్లనిన, ఛందోగులు "తత్తేజోఽసృజత" అనుచోట "పరబ్రహ్మము తేజస్సును సృజించెను" అనుచు తేజస్సును ప్రథమమున సృజింపఁబడిన దానినిగాఁ బఠించుచున్నారు. కావున, నాకాశమునకు ఉత్పత్తిగలదని ప్రతిపాదించుట యసంభవము. కనుకనే వాజసనేయులు "వాయుశ్చాంతరిక్షం చైతదమృతం" అనుతావున "వాయ్వాకాశములు జన్మమరణములు లేనివి"యని పఠించుచున్నారు.

అవతారిక :—పై శ్రుతియందుండు "సంభూత" శబ్దమొక్కటియే "ఆకాశ" శబ్దముతో నన్వయించునపుడు గౌణార్థము గలదిగాను "అగ్న్యాది" శబ్దములతో నన్వయించునపుడు ముఖ్యార్థము గలదిగాను నెట్లుకాఁగలదని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౪॥ సూ॥ స్యా చ్చై క స్య బ్ర హ్మ శ బ్ద వ త్.

టీ॥ బ్రహ్మశబ్దవత్=బ్రహ్మశబ్దమునకువలె, ఏకస్య="సంభూత" శబ్దమునకు ఒక్కదానికే ముఖ్యార్థ గౌణార్థములు సంభవించును.

తా॥ సంభూత శబ్దమొక్కటియేయైనను, బ్రహ్మశబ్దమువలె ముఖ్యార్థమునను, లేక ప్రకరణమునుబట్టి గౌణార్థముననను నంగీకరింపఁదగియుండును.

శ్రీ॥ భా॥ "సంభూత" శబ్దము ఒక్కటియే. అయిననది "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" అను తైత్తిరీయక వాక్యమున, "ఆకాశ" శబ్దముముతో నన్వయించునపుడు, ముఖ్యార్థముగలది యగుట యసంభవము. కావున నది యచట గౌణార్థమునఁ బ్రయోగింపఁబడినను, "వాయోరగ్నిః" ఇత్యాద్యనంతర వాక్యమున నగ్న్యాది శబ్దములతో నన్వయించునపుడు, ముఖ్యార్థము

గలది గావచ్చును. ఎట్లనిన, "తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" "ప్రకృతియు, నామము, రూపము, అన్నమున్ను, బ్రహ్మమునుండి పుట్టుచున్నవి" అను శ్రుతియందు "బ్రహ్మ" శబ్దము ప్రకృతిని తెలుపుటచే గౌణార్థముగలదై, ఆ ప్రకరణముననే "తపసా చీయతే బ్రహ్మ తతోన్న మభిజాయతే" (తపస్సుచే బ్రహ్మము గొప్పదగుచున్నది) అనుచోట పరబ్రహ్మమును తెలుపుటచే నది ముఖ్యార్థము గలదగుచుండ లేదా?

[1] అట్లే అనువర్తించునట్టి తావునను, మరల ప్రయోగింపఁబడిన తావునందు వలెనే శబ్దములకు గౌణార్థవృత్తియు, (గౌణార్థమును తెలుపుటయు) ముఖ్యార్థవృత్తియును(ముఖ్యార్థమును తెలుపుటయు) అనువర్తించునని యర్థము.

అవతారిక:—ఈపైని గానఁబఱచిన శంకను పరిహరించుటకై.

సూ॥ సూ॥ ప్రతిజ్ఞాఽహానిరవ్యతిరేకాత్.

టీ॥ అవ్యతిరేకాత్ =(వస్తుజాతమునకును పరబ్రహ్మమునకును, కార్యకారణ భావముండుటనుబట్టి వస్తుజాతము పరబ్రహ్మమునుండి) వేఱుగానుండునది కానందున, ప్రతిజ్ఞాఽహానిః= ప్రతిజ్ఞకు విరోధము లేకుండుట(స్యాత్ =సంభవించును)

తా॥ "యేనాశ్రుతం శ్రుతంభవతి" ఇత్యాది శ్రుతియందుఁ జెప్పఁబడిన వేదాంతశాస్త్రపు ప్రతిజ్ఞకు హానిలేకుండుట యనునది వస్తుజాత మంతయు బ్రహ్మమునుండి బుట్టినది యగుటచే నది బ్రహ్మముకంటె వేఱుగానుండునదిగాదని యంగీకరించిన పక్షమున సిద్ధించును.

సమాధానము

శ్రీ॥ భా॥ అయితే ఆకాశమునకు ఉత్పత్తి గలదని చెప్పు నట్టి యితర శాఖలవారి శ్రుతులకు ఛాందోగ్య శ్రుతులతో అనుకూల్యమును గలుగఁ జేయుటకై అవి (ఆ యితర శాఖీయశ్రుతులు) ఆకాశోత్పత్తిని వర్ణించుట గౌణమని, కల్పించుకొనుట యుక్తముకాదు. ఏలననిన, ఛందోగులు సయితము ఆకాశమునకు ఉత్పత్తి గలదని యంగీకరించుచున్నారు. ఎట్లనిన, ఛందోగులు

(1) సమాన ప్రకరణమున "బ్రహ్మ" శబ్దమునకు గౌణార్థమునను ముఖ్యార్థమునను ప్రయోగమును గనఁబఱచుటకై ఈపైని యుదహరింపఁబడిన శ్రుతులయందది రెండుచోట్లను ప్రయోగింపబడియె, (రెండుచోట్ల ప్రత్యేకముగ ప్రయోగింపబడుటచే యీ బ్రహ్మశబ్దమొక తావున నొకయర్థము గలదిగాను, మఱియొకతావున మఱియొక యర్థముగలదిగాను గావచ్చుననుట). సంభూతశబ్దమో, ఒకచోట మాత్రము ప్రయోగింపబడినదై ఇతర ప్రదేశములయందు మరల మరల ప్రయోగింపబడక అనువర్తించుచున్నది. (అనువర్తించుశబ్దము తాను పూర్వమే యర్థమున ప్రయోగింపబడినదో, ఆ యర్థమునే తానను వర్తించుతావునఁ గూడ తెలుపునుగాని భిన్నార్థము నెట్లు తెలుపఁగలదనిన.

"యేనాశ్రుతంశ్రుతం భవతి" ఇత్యాది వాక్యములయందు"బ్రహ్మమును గుఱించి వినుటచే నింతకుఁ బూర్వము వినఁబడనిదియు వినఁబడిన దగుచున్న దనియు మననము జేయఁబడనిదంతయు మననము జేయఁబడినదగుచున్న దనియు, తెలియఁబడనిదంతయు తెలియఁబడినదగుచున్న దనియు" ఇట్లు చెప్పుటచే నిందు మూలమున బ్రహ్మమునుదెలిసికొనుటచే సర్వము తెలియఁబడుచున్న దని ప్రతిజ్ఞ చేసియున్నారు. ఆకాశముగూడ బ్రహ్మమునుండి గలుగునట్టిదై బ్రహ్మమునుండి వేఱుకానిది యగు పక్షముననే వారి ప్రతిజ్ఞకు హానిలేకపోవును. (అట్లుకానిచో వారి ప్రతిజ్ఞకు భంగమువచ్చును) ఈ హేతువువలన ఛందోగులాకాశమునకు ఉత్పత్తిగలదని యంగీకరించినట్లు సిద్ధమగుచున్నది.

౩॥ సూ॥ శబ్దేభ్యః.

టీ॥ శబ్దేభ్యః = వేదవాక్యములనుండియును, (ఆకాశోత్పత్తిః=ఆకాశము యొక్క యుత్పత్తి, సిధ్యతి = సిద్ధించుచున్నది.)

తా॥ ఛాందోగ్యోపనిషద్వాక్యములనుండియే యాకాశమునకు ఉత్పత్తి గలదని సిద్ధించుచున్నది.

శ్రీ॥ భా॥ ఛందోగులు "సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమే వాద్వితీయం" అనువాక్యమున "సృష్టికిఁబూర్వము బ్రహ్మ మొక్కటియే యుండెను"అని నిర్ధారణ జేసి యనంతరము "ఐతదాత్మ్య మిదం సర్వం" అను వాక్యమున "ఈ పరిదృశ్యమానమగు నదియంతయు బ్రహ్మ సంబంధమయినది"అని చెప్పియున్నారు. అనఁగా, ఇది యంతయు బ్రహ్మకార్య మయినందున బ్రహ్మమునుండి వేఱుగానుండు నదికాదని చెప్పియున్నారు ఇందువలన ఛందోగులుగూడ ఆకాశమును బ్రహ్మముచే సృజింపఁబడిన దానినిగా నంగీకరించినట్లు స్పష్టమగుచున్నది.

"తత్తేజోఽసృజత" అను ఛాందోగ్యవాక్యము "తేజస్సు బ్రహ్మమునుండి యుత్పన్నమగుచున్నది"అనుచు ఆకాశోత్పత్తిని నివారింపనేరదు. ఈశ్రుతియందాకాశోత్పత్తి జెప్పఁబడక పోవుటవలన తేజస్సే ప్రథమమున నుత్పన్నమయినట్లు తెలియుచున్నది. ఇంతమాత్రముచే నీశ్రుతి శ్రుత్యంతర ప్రతిపాదితమగు నాకాశోత్పత్తిని యెట్లు నివారింపఁగలదు? నివారింపనేరదు.

౭॥ సూ॥ యావద్వికారంతు విభాగోలోకవత్.

టీ॥ లోకవత్ =లోకమునందువలె, యావద్వికారంతు=ఎంతవరకు కార్యత్వమో, విభాగః=(ఆకాశమునకు) ఉత్పత్తి, సంభవతి=సంభవించును.

తా॥ ఎంతవరకు కార్యత్వము వ్యాప్తమగునో, అంతవరకు ఆకాశమునకు ఉత్పత్తి సంభవమగును.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ఐతదాత్మ్య మిదం సర్వం" అను వాక్యమున "ఈసమస్తము బ్రహ్మసంబంధమయినది" అనుచు సర్వము బ్రహ్మముచే సృజింపఁ దడినదని యంగీకరించు చున్నారు. ఎటువలెననిన, లోకమునందును "వీరంద ఱును దేవదత్తుని పుత్రులు" అనిజెప్పి తరువాత వారిలో కొందఱిని గాన్పించి "వీరు వానికిఁబుట్టిన వారలు" అని చెప్పినచో, నందఱును వానికిఁబుట్టిన వార న్నట్లు గదా? అట్లే ప్రకృతమునను సర్వపదార్థములు బ్రహ్మమునుండిపుట్టినవియే యని జెప్పి తరువాత వానిలో తేజస్సు మొదలగు వానిని కొన్నింటిని మాత్రము నిర్దేశించి బ్రహ్మమునుండి పుట్టినవానిగాఁ జెప్పినచో ఆకాశాది సర్వపదార్థము లును బ్రహ్మమునుండి పుట్టినవని చెప్పినట్లు కాదా? చిరకాలముండునవి యనెడి యభిప్రాయముతో దేవతుల మృతులనినట్లు వాయ్వాకాశము లమృతములని "వాయుశ్చాంతరిక్షుంచైతదమృతం" ఇత్యాది శ్రుతిజెప్పుచున్నదని యెఱుంగునది.

౮॥ సూ॥ ఏ తే న మా త రి శ్వా వ్యా ఖ్యా తః.

టీ॥ ఏతేన=ఆకాశమునకు ఉత్పత్తి గలదనుటచేత, మాతరిశ్వా=వాయు వున్ను, వ్యాఖ్యాతః=ఉత్పన్న మైనవస్తువని తెలుపఁబడినది.

తా॥ ఆకాశమునకు ఉత్పత్తిగలదని తెలుపుటచే వాయువుగూడ ఉత్పన్న పదార్థమని తెలుపఁబడియె.

శ్రీ॥ భా॥ ఈ పైని గనఁబఱచిన హేతువులవలననే వాయువుకుఁ గూడ ఉత్పత్తిగలదని యెఱుంగునది. ఆకాశవాయువుల యుత్పత్తులను ప్రతిపాదించుటకై వేఱువేఱు సూత్రములను రచించుట "తేజో ఽత స్తథాహ్యాహ" అనుసూత్రము నందుండు "అతః" అను సర్వనామశబ్దముచే పూర్వసూత్రోక్తమగు వాయు వును తెలుపుటకై యని యెఱుంగునది.

౯॥ సూ॥ అ సం భ వ స్తు స తో ఽ ను ప ప త్తేః.

టీ॥ సతః-తు=పరబ్రహ్మముకు మాత్రమే, అసంభవః=ఉత్పత్తి యుం డుట సంభవింపదు. ఏలననగా, అనుపపత్తేః=వాఁడు ఉత్పన్నుఁడగుట యసం భవ మగుటవలన,

తా॥ పరబ్రహ్మముకు మాత్రము ఉత్పత్తి లేకపోవుట సంభవము. ఏల ననిన, వాఁడు, ఉత్పన్నుఁడగుట యనుపపన్నము గదా.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మముకు మాత్రమే యుత్పత్తి లేకుండుట సంభవము గాని,బ్రహ్మత్యతిరిక్తములగు పదార్థములలోఁ దేనికిగాని యుత్పత్తిలేకుండుట సంభ వము కాదు. ఇందు ఫలితార్థమేమనఁగా,ఆకాశవాయువుల యుత్పత్తిని మాత్రమే యిచట నిరూపించుట నిదర్శనమాత్రము. అయితే సత్తును పరమకారణుఁడు

నగు నాపరబ్రహ్మముకు మాత్రము ఉత్పత్తియుండుట సంభవింపదు. "బ్రహ్మము నొక్క దానిఁ దెలిసికొనుటచే సర్వము తెలియఁబడుచున్నది" అనెడి వేదాంత శాస్త్రీయపు ప్రతిజ్ఞనుబట్టి బ్రహ్మసృష్టములుగాఁ దెలియవచ్చునవియు, బ్రహ్మవ్యతిరిక్తములగు నవ్యక్తమహదహంకార పంచతన్మాత్రేంద్రియ వియత్పవనాదులలో నెద్దియును ఉత్పత్తి రహితమైనదిగాఁ జెప్పఁదగదు.

వియదధికరణము ముగిసెను.



## తే జో ధి క ర ణ ము

### ౧౦॥ సూ॥ తే జో ௨ త స్త థా హ్యా హ.

టీ॥ అతః=వాయువునుండి, తేజః=అగ్ని, సంభూతం=పుట్టినది. తథాహి=అట్లేకదా, ఆహ=శ్రుతివాక్యము చెప్పుచున్నది.

తా॥ వాయువునుండి తేజస్సు పుట్టుచున్నది. అట్లే గదా "వాయో రగ్నిః" ఇత్యాది శ్రుతివాక్యము తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ బ్రహ్మవ్యతిరిక్తమగు ఈ సమస్తజగత్తున్ను బ్రహ్మనుండియే పుట్టుచున్నదని ప్రతిపాదింపఁబడియె. అయితే యిందొక సంశయము గలుగుచున్నది.

#### స ం శ య ము.

ఒక్కదాని తరువాత నొక్కటిగాఁ బుట్టినవియగు తేజస్సు మొదలగునవి ఉత్తరోత్తర వస్తువులకుఁ గారణభూతములగు పూర్వ పూర్వవస్తువులనుండి మాత్రమే పుట్టుచున్నవా? లేక, అవి ఆయావస్తు శరీరుఁడగు పరబ్రహ్మమునుండి పుట్టుచున్నవా?

#### పూ ర్వ ప క్ష ము.

అవి కేవలము ఆయాపదార్థములనుండి మాత్రము పుట్టుచున్నవనుట యుక్తము. ఏలనిన, "వాయోరగ్నిః" అను శ్రుతివాక్యము కేవల వాయువునుండి యగ్ని పుట్టుచున్నదని గదా తెలియఁజేయుచున్నది.

### ౧౧॥ సూ॥ ఆ పః.

టీ॥ (అతః = అగ్నివలన,) ఆపః=నీళ్లు, ఉత్పద్యన్తే=పుట్టుచున్నవి, తథాహి=అట్లేకదా, ఆహ=శ్రుతి చెప్పుచున్నవి.

తా॥ అగ్నినుండి యుదకముపుట్టుచున్నది. అట్లేగదా శ్రుతి తెలుపుచున్నది

శ్రీ॥ భా॥ "అగ్నేరాపః" ఇత్యాది శ్రుతి ప్రమాణములవలన నుదకము తేజస్సునుండి యుత్పన్నమగుచున్నదని తెలియవచ్చుచున్నది.

౧౨॥ సూ॥ పృ థి వీ.

టీ॥ (అద్భ్యః=ఉదకములనుండి,) పృథివీ=భూమి, ఉత్పద్యతే = పుట్టుచున్నది. తథాహి = అట్లే కదా, ఆహ = శ్రుతివాక్యము తెలుపుచున్నది.

తా॥ ఉదకమునుండి పృథివి పుట్టుచున్నదని శ్రుతులు తెలుపుచున్నవి.

శ్రీ॥ భా॥ ఉదకములనుండి పృథివి యుత్పన్నమగుచున్నది. ఎట్లనిన, "అద్భ్యః పృథివీ" అను శ్రుతివాక్యము "ఉదకములనుండి పృథివి పుట్టుచున్నది" అనియు "తా అన్నమసృజన్త" అను శ్రుతివాక్యము "ఉదకము లన్నమును అనగా పృథివిని సృజించెను" అనియును తెలుపుచున్నవి గదా !

అవతారిక :—"తా అన్నమసృజన్త" అను శ్రుతియందలి "అన్న" శబ్దము పృథివీ వాచకమెట్లు కాఁగలదని యడుగఁగా, దానిని సమర్థించుటకై.

౧౩॥ సూ॥ అ ధి కా ర రూ ప శ బ్దా న్త రే భ్యః.

టీ॥ అధికార రూప శబ్దాన్తరేభ్యః = మహాభూత ప్రకరణమువలనను, కృష్ణరూపకథనమువలనను, జలజన్యత్వమును జెప్పు శ్రుత్యంతరమునలనను, (పృథివీ=భూమి అన్నశబ్దముచే వివక్షింపబడినదిగాఁ దెలియుచున్నది.)

తా॥ మహాభూత ములనుగుఱించిన ప్రకరణమగుటను బట్టియు, "యత్కృష్ణం తదన్నస్య" అనుచోఁ, కృష్ణరూపకథనమును బట్టియు, "అద్భ్యః పృథివీ" అనుచోఁ, జలము నుండి పృథివి పుట్టుచున్నదని చెప్పియున్నందునను "అన్న" శబ్దము పృథివీవాచకమని తెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ ఇది మహాభూతముల సృష్టిని గుఱించిన ప్రకరణము. కనుక నిచట "అన్న" శబ్దము పృథివిని తెలుపునది. అన్నమనఁగా భక్షింపఁబడునదియని యర్థము. మనము భక్షించునట్టి పదార్థములన్నియు పృథివినుండిగలుగునవయినందున పృథివీకార్యములు. ఇట్లు పృథివీకార్యమగు నాహారవిశేషమునకు వాచమగు నన్నశబ్దము కారణభూతమగు పృథివిని తెలియఁజేయుటకై యీతావునఁ బ్రయోగింపఁబడినది. మఱియు ఇదే ప్రకరణమున "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లంతదపాం యత్కృష్ణం తదన్నస్య" అనఁగా "అగ్నియందుండు ఎఱుపు వర్ణము తేజస్సుయొక్క రూపము, తెలుపువర్ణము ఉదకముయొక్క రూపము, నలుపువర్ణము అన్నముయొక్క, అనఁగా పృథివియొక్క రూపము" అనువాక్య శేషమునందు "అన్న" శబ్దము అగ్న్యాది శబ్దములతోఁగూడ పఠింపఁబడుటంజేసి, యగ్న్యాది సజాతీయమగు పృథివిని తెలుపునదిగాఁ దెలియవచ్చుచున్నది. మఱియు అట్టిప్రకరణమున మఱియొకచోట "అగ్నేరాపః అద్భ్యః పృథివీ" అనఁగా "అగ్నినుండి ఉదకము పుట్టుచున్నదనియు,

ఉదకములనుండి పృథివి పుట్టుచున్నదనియును చెప్పఁబడియె. ఈ హేతువులవలన నీ సృష్టిప్రకరణమునందు "అన్న" శబ్దము పృథివీవాచకమనియు, ఉదకము నుండియే పృథివి పుట్టుచున్నదనియును తెలియవచ్చు చున్నది. తేజస్సు మొదలగు పూర్వపూర్వ భూతములనుండి యుదకము మొదలగు నుత్తరోత్తర భూతములు పుట్టుచున్నవని యిట్లు నిదర్శనార్థము మాత్రము ఉదహరింపఁ బడియెను గాన, మహదహంకారాదు లన్నియును తమకు పూర్వముండు పదార్థముల నుండియే పుట్టుచున్నవని యెఱుంగునది. శ్రుతియు నిటులనే చెప్పుచున్నది గదా! శ్రుతియందుఁ జెప్పియున్నట్లు గ్రహించినఁ దోషమేమి? ఇట్లు బ్రహ్మము సర్వపదార్థములకును పరంపరగా కారణమని యంగీకరించుట వలనఁ గూడ బ్రహ్మము సర్వకారణమని ప్రతిపాదించు శ్రుతివాక్యములు అనఁగా "ఏతస్మా జ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ" (ఓ శౌనకుఁడా! పూర్వము జెప్పియుండెడి పరబ్రహ్మ నుండియే ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములున్ను, ఆకాశాది పంచభూతములున్ను పుట్టుచున్నవి) అనియు, "తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే" (ఓ శౌనకుఁడా! పరబ్రహ్మనుండి హిరణ్యగర్భుఁడనంబడు బ్రహ్మమున్ను, దేవదత్తాది నామములున్ను, శ్వేతాదిరూపములున్ను వ్రీహి యవాదిరూపమగు నన్నమున్ను ఇవి యన్నియును పుట్టుచున్నవి) అనియు "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" (ఆపరబ్రహ్మమునుండి ఆకాశము పుట్టుచున్నది) అనియు "తత్తేజోఽసృజత" (ఆ పరబ్రహ్మము తేజస్సును సృజించెను) అనియు నీ మొదలగు శ్రుతివాక్యము లన్నియు సంగతార్థము లగుచున్నవి.

అవతారిక:—ఈ పైని గనఁబఱచిన ప్రకారము తేజస్సు మొదలగు నవియే ఉదకాదులకుఁ గారణము లనియు, పరబ్రహ్మము వానికిఁ బరంపరగా కారణమగు ననియు నీపక్షమును నిరాకరించుటకై.

౧౪॥ సూ॥ త ద భి ధ్యా నా దే వ తు త ల్లి ఙ్గా త్సః

టీ॥ తు=పూర్వపక్షము యుక్తము కాదు. తదభిధ్యానాత్=చేయబోవు సృష్టి నిగూర్చి సంకల్పించుటవలన, సః=సర్వేశ్వరుఁడే, సృజతి=సృజించుచున్నాఁడు, ఏలననఁగా, తల్లిఙ్గాత్=అట్లు సంకల్పించుట సర్వేశ్వరుని చిహ్నమగుటవలన.

తా॥ తాను చేయబోవు సృష్టినిగూర్చి సంకల్పించుటవలనను, అట్టి సంకల్పము సర్వేశ్వరునికిమాత్రము సంభవమగుటవలనను ఆకాశాది వస్తుశరీరుఁడగు సర్వేశ్వరుఁడే యుత్తరోత్తర కార్యపదార్థములను సృజించుచున్నాఁడని తెలియవచ్చుచున్నది.

సిద్ధాంతము

శ్రీ॥ భా॥ మహదాది కార్య పదార్థములకున్ను పూర్వపూర్వవస్తు శరీరుడగు సర్వేశ్వరుడే కారణుడు. ఏలననగా, సృష్టిని ప్రతిపాదించు శ్రుతివాక్యములయందు సంకల్పరూపమగు చిహ్నము గానబడుటవలన నిట్లు తెలియవచ్చుచున్నది. సూత్రమునందు "అభిధ్యాన" మనగా "బహుస్యాం" (నేను అనేకము గానగుదును) అను శ్రుతియందు జెప్పియున్న సంకల్పము. ఎట్లనిన, "తత్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి" (తేజస్సు సృష్టికిగా ననేకముగా నగుదునని తలంచెను) అనియు "తా ఆప ఐక్షన్త బహ్వ్యః స్యామః ప్రజాయేమహీతి"(ఉదకములు సృష్టికిగాను అనేకములు గానగుదుమని తలంచెను) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు తేజస్సు, ఉదకము మొదలగునవి ఉదకము పృథివి మొదలగువానిని సృజించుటకు ప్రారంభించినప్పుడు ముందుగ సృష్టికిగాను బహువిధము లగుదుమని సంకల్పించుకొనినట్లు తెలియుచున్నది. ఇందువలన, మహత్తు మొదలగు కారణ వస్తువులు సయితము, స్వస్వకార్యములను సృజింపబోవునపుడు ఇవ్విధముగ సంకల్పము నొనర్చియే యుండవలయునని తెలియుచున్నది. ఇట్టి సంకల్పము మహదాది శరీరుడగు పరబ్రహ్మముకు సంభవమే గాని, కేవల మహదాది పదార్థములకు సంభవము కాదు. మఱియు "యః పృథివ్యాం తిష్ఠన్" (ఎవడు పృథివియం దున్నాడో) అనియు "యస్తేజసి తిష్ఠన్" (ఎవడు తేజస్సునం దున్నాడో) అనియు, "యోఽప్సు తిష్ఠన్" (ఎవడు ఉదకములయందు ఉన్నాడో) అనియు, "యో వాయౌ తిష్ఠన్" (ఎవడు వాయువునందు ఉన్నాడో) అనియు, "య ఆకాశే తిష్ఠన్" (ఎవడు ఆకాశమునందు ఉన్నాడో) అనియు, నీ మొదలగు నంతర్యామి బ్రాహ్మణవాక్యములును, "యస్య పృథివీ శరీరం" (ఎవనికి పృథివి శరీరమో) అనువాక్యము మొదలు "యస్యాహంకారశ్శరీరం", (ఎవని కహంకారము శరీరమో) అనియు, "యస్య బుద్ధి శ్శరీరం" (ఎవనికి బుద్ధి శరీరమో) అనియు, "యస్యావ్యక్తం శరీరం" (ఎవనికి అవ్యక్తము శరీరమో) అనియు, నీ మొదలగు సుబాలోపనిషద్వాక్యములున్ను సర్వేశ్వరుడు పృథివ్యాది భూతములయందున్న వాడనియు, బుద్ధ్యహంకారాదులు శరీరముగాగలవాడనియును చెప్పుచు, అందువలన నతడు సర్వశరీరుడనియు, సర్వాత్మకుడనియును తెలియజేయుచున్నవి.

అవతారిక :—"ఏతస్మా జ్జాయతే ప్రాణః మనస్స ర్వేంద్రియాణిచ" ఇత్యాది శ్రుతులయందు బ్రహ్మము ప్రాణాదులను సృజించినదియని చెప్పియుండవచ్చును. ఏలననగా, పరంపరగానైనను, అట్టి సృష్టి బ్రహ్మముకు ప్రాప్తం బగును" ఇట్లు పూర్వపక్షి చేసిన వాదమును నిరాకరించుటకై :—

౧౫॥ సూ॥ వి ప ర్య యే ణ తు క్ర మో ఽ త ఉ ప ప ద్య తే చ.

టీ॥ విపర్యయేణ=వ్యత్యస్తముగా, అనఁగా (అవ్యక్తమునుండి మహత్తు పుట్టుచున్నది, మహత్తునుండి అహంకారము పుట్టుచున్నదను) క్రమముకంటె, భిన్నముగా, క్రమః = (బ్రహ్మమునుండి ప్రాణము పుట్టుచున్నది. బ్రహ్మము నుండి ఆకాశము పుట్టుచున్నదను) క్రమము, అతః-తు=సర్వేశ్వరుఁడు సాక్షాత్తుగాఁ గారణమగు పక్షమునందే, ఉపపద్యతే చ=ఉపపన్న మగుచున్నది.

తా॥ తత్తత్పదార్థ స్వరూపుఁడగు సర్వేశ్వరునుండి మహాదాదులు పుట్టుచున్నవను పక్షమునందే, "మహత్తునుండి యహంకారము పుట్టుచున్నది" అను నీవిధమగు సృష్టిక్రమముకంటె వేఱగు క్రమము అనఁగా "బ్రహ్మమునుండి ప్రాణము బుట్టుచున్నది" అను నీవిధమగు క్రమము ఉపపన్న మగుచున్నది. కావున సర్వేశ్వరుఁడే మహాభూతములకు సాక్షాత్తుగ కారణుఁడు.

శ్రీ॥ భా॥ అవ్యక్తమునుండి మహత్తు పుట్టుచున్నదనియు, మహత్తు నుండి, అహంకారము పుట్టుచున్నదనియు, అహంకారమునుండి ఆకాశము పుట్టుచున్నదనియు, నివ్విధమగు క్రమముకు భిన్నముగా, "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అనియు నీమొదలగు శ్రుతులయందుఁ జెప్పఁబడినప్రకారము, "ఈ పర బ్రహ్మమునుండి ప్రాణము పుట్టుచున్నదనియు, ఈ పరబ్రహ్మమునుండి ఆకాశము పుట్టుచున్నదనియు, ఈపరబ్రహ్మమునుండి నామరూపాన్నములు పుట్టుచున్నవి" అనియు నివ్విధమగు సృష్టిక్రమము ఆయాపదార్థస్వరూపుఁడగు సర్వేశ్వరుఁడు ఆయా కార్య పదార్థములకుఁ గారణమని గ్రహించిన పక్షమునందే ఉపపన్నమగు చున్నది. అట్లుకాకున్న, సృష్టిని వర్ణించునపుడెల్ల "బ్రహ్మమునుండి పుట్టు చున్నది బ్రహ్మమునుండి పుట్టుచున్నది" అనుట విరోధించును. ఈ హేతువుల వలన "ఏతస్మాజ్జాయతే ప్రాణః" ఇత్యాది శ్రుతివాక్యము సయితము పరబ్ర హ్మముసర్వపదార్థములకును సాక్షాత్తుగానే కారణమగుటను బలపఱచుచున్నది.

౧౬॥ సూ॥ అన్తరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లిఙ్గాదితి చేన్నావిశేషాత్.

టీ॥ అంతరా = ప్రాణమునకును మహాభూతములకును మధ్యను, విజ్ఞాన సీ=ఇంద్రియములున్ను మనస్సున్ను, క్రమేణ = వరుసగా, (జాయన్తే = పుట్టు చున్నవి,) ఏలననఁగా, తల్లిఙ్గాత్=అట్టి జన్మమును దెలియఁజేయుహేతువు ఉండుటవలన, ఇతిచేత్=ఇట్లంటివేని, న=అది యుక్తము కాదు. ఏలననఁగా, అవిశేషాత్="ఏతస్మాత్ జాయతే," అనునది ప్రాణాదులన్నింటితోను సమాన ముగ నన్వయించుటవలన.

తా॥ శ్రుత్యంతరమునఁ దెలియవచ్చు క్రమప్రకారము పఠింపఁబడిన ఆకాశాది భూతములతో సహా పాఠముండుటనుబట్టి ఇంద్రియములును మన

స్సున్న ప్రాణమునకు తరువాతను ఆకాశాది భూతములకు పూర్వమునను పుట్టినవను క్రమ విశేషమును "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అను శ్రుతివాక్యము తెలుపుచున్నట్లు తెలియవచ్చుచున్నదంటివేని, యది యుక్తముకాదు. ఏలననఁగా, "ఏతస్మాజ్జాయతే" అనునది ప్రాణాదులతో నన్నింటితోను సమానముగ సంబంధించుటచే ఈ వాక్యము ప్రాణాదు లన్నియు సర్వేశ్వరునుండి పుట్టుచున్నవని చెప్పుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

## ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ విజ్ఞానసాధములయినందున ఇంద్రియములు "విజ్ఞాన" శబ్దముచే సూత్రమునఁ బేర్కొనఁబడినవి. "ఏతస్మాజ్జాయతే ప్రాణః మనస్సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ" అను శ్రుతివాక్యము (ఈ బ్రహ్మమునుండి ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము తేజస్సు, ఉదకము, సర్వమును భరించు పృథివియును పుట్టుచున్నవి.) అనుచు సర్వపదార్థములును బ్రహ్మమునుండి కలుగుచున్నవని తెలుపుచున్నది. అందువలన నిది బ్రహ్మమే సర్వపదార్థములకును సాక్షాత్తుగాఁ గారణ మని యిట్లు సంకల్పరూపమగు చిహ్నమునలనఁ దెలియఁబడిన యంశమును బలపఱచుచున్నదని యింతకుఁ బూర్వము ప్రతిపాదింపఁబడియె. అది సంభవము కాదు. ఏలననిన, ఈ శ్రుతివాక్యము ఒక పదార్థము తరువాత మఱియొక పదార్థము పుట్టిన క్రమమును తెలుపుచున్నది. కావున, దీనికి సర్వపదార్థములు పుట్టినక్రమమును దెలియఁజేయుఁజేయుటయందే తాత్పర్యము. ఎట్లనిన, శ్రుత్యంతరములయందుఁ జెప్పియున్న ప్రకారము ఆకాశ వాయ్వాదక పృథువులలో నొకదాని తరువాత నొకటి పుట్టిన క్రమమును ఈశ్రుతివాక్యము తెలుపుచున్నది. ఇచట పేర్కొనఁబడిన యాకాశాది భూతములతో సహ పాఠముండునుబట్టి ఇంద్రియమనస్సులు ప్రాణమునకుతరువాతను ఆకాశాదిభూతములకుఁబూర్వమునను పుట్టినట్లు ఈశ్రుతివలన విదిత మగుచున్నది. కనుక నిట్లొకదాని తరువాత మఱియొకటి పుట్టిన క్రమవిశేషమును ఈ పై వాక్యము తెలియఁజేయుచున్నది గాని, సర్వపదార్థములకును బ్రహ్మము సాక్షాత్తుగాఁ గారణమనెడి యంశమును బలపఱచుచుండ లేదు.

## స మా ధా న ము.

అది యుక్తము గాదు. ఈ వాక్యమునందలి "ఏతస్మాజ్జాయతే"(ఈబ్రహ్మనుండి పుట్టుచున్నది.) అనునది ఇంద్రియ మనస్సులతోను ఆకాశాదులతోనును అనఁగా ప్రాణము మొదలు పృథివివరకు శ్రుతియందుఁ బఠింపఁబడినవానితో నన్నింటితోను సమానముగా నన్వయించుచున్నందున అనఁగా బ్రహ్మమునుండి ప్రాణము పుట్టుచున్నదనియు, బ్రహ్మమునుండి మనస్సు పుట్టుచున్నదనియు,

బ్రహ్మమునుండి ఇంద్రియములు పుట్టుచున్నవనియు నీప్రకారము ప్రతిపదార్థము బ్రహ్మమునుండి పుట్టుచున్నదనియు నిట్లు తెలుపుచున్నందున నీ వాక్యమునకు బ్రహ్మమునుండియే ప్రాణాది పదార్థములన్నియు పుట్టుచున్నవనుటయే తాత్పర్య మనుట యుక్తము. కనుక నిది ప్రాణాదులలో నొకదాని తరువాత మఱియొకటి పుట్టు క్రమమును దెలియజేయునది కాదు. ఇంతియెకాక, ఈ శ్రుతి యొక్క సృష్టి క్రమమును తెలుపునది యగునేని, యిందు తెలుపఁబడిన క్రమము శ్రుత్యంతరమునఁ దెలుపఁబడిన క్రమముతోఁ[1] విరోధించును. [1]ఏలననిన, ‹‹పృథివ్యప్సు ప్రలీయతే'' అను వాక్యము మొదలుకొని ‹‹తమః పరే దేవ ఏకీభవతి'' (సుబా. ౨ ఖం) అను వాక్యము వరకు "పృథివి ఉదకములయందు లీనమగుచున్నదనియు ఉదకము తేజస్సునందు లీన మగుచున్నదనియు'' నీవిధముగ నారంభించి కడపట " తమస్సుపరదేవతయందు లీనమగుచున్నది '' అనియును జెప్పియుండుటచే నిచట వేఱొక క్రమము చెప్పఁబడియె. ఇట్లుచెప్పఁబడిన క్రమమునకు విరుద్ధ మగు క్రమమును జెప్పుచున్నందున ‹‹ ఏతస్మాజ్జాయతే ప్రాణః '' అను శ్రుతి వాక్యము ఒక క్రమవిశేషమును జెప్పునది కాదని స్పష్టమగుచున్నది. కనుక నీ శ్రుతివాక్యము కార్యభూతములగు సర్వపదార్థములున్ను అవ్యక్తాది స్వరూపుఁడగు పరబ్రహ్మమునుండియే పుట్టుచున్నవని తెలుపుచున్నదనుట యుక్తము. ‹‹ ఆగ్నేరాపః'' ( తేజస్సునుండి యుదకములు పుట్టుచున్నవి) అనియు ‹‹అద్భ్యః పృథివీ'' (ఉదకములనుండి పృథివి పుట్టుచున్నది) అనియు నీమొదలగు వాక్యములయందుండు అగ్న్యాదిపదములు అగ్న్యాది పదార్థములలో నంతరాత్మ యగు పరబ్రహ్మమునే తెలుపునవియని యెఱుంగునది.

అవతారిక.—ఈ పైని గనఁబఱచిన ప్రకారము సర్వశబ్దములు పరబ్రహ్మమునే తెలియఁజేయుచున్నవనినచో, ఆయాశబ్దములు వానివాని వ్యుత్పత్తినిబట్టి ఆ యా పదార్థములను దెలియజేయునవి యగుట విరోధించునే యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

౧౭॥ సూ॥ చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావ భావిత్వాత్.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, చరాచరవ్యపాశ్రయః = స్థావర జంగమ పదార్థములతోఁ సంబంధించినదై, తద్వ్యపదేశః = లోకమునందా

(1) "ఏతస్మాజ్జాయతేప్రాణః'' అను శ్రుతి యొక సృష్టిక్రమమును తెలుపునదియగు పక్షమున, ఆకాశవాయ్వాదులు ప్రాణమునకు తరువాతే పుట్టినవనవలసివచ్చును. శ్రుతులను పరిశీలింపఁగా వాయువునుండి ప్రాణము పుట్టుచున్నట్లును ఆకాశమునుండి వాయువు పుట్టుచున్నట్లును "ఆకాశాద్వాయుః'' ఇత్యాదులవలనఁ దెలియుచున్నదె. కావున నిందు విరోధము గలదు.

యాపదార్థములను మాత్రమే తెలుపునదియగు శబ్దము, భాక్తః = వాస్తవముగ నాయాశబ్దములకు వాచ్యుఁడగు పరమాత్మయొక్క యేకదేశమును మాత్రము తెలుపునది, స్యాత్ = అగును. ఏలననిన, (తత్పర్యవసానస్య = సర్వేశ్వరునిఁ దెలియజేయునదిగాఁ దెలియఁబడుట) తద్భావభావిత్వాత్ = సర్వేశ్వరుఁడు ఆ యాపదార్థములను శరీరముగ గలవాఁడనెడి జ్ఞానముగలిగిన తరువాతి దగుటవలన. (లోకమున నగ్న్యాదిశబ్దములు తేజస్సుమొదలగు పదార్థములను మాత్రమే తెలియఁజేయునవి యగుట దోషముకాదు.)

తా॥ స్థావరజంగమ వస్తువులతో సంబంధించినవై లోకమునం దాయాపదార్థములకు వాచకములుగాఁ దెలియవచ్చు శబ్దములు అట్లు స్థావరజంగమ వస్తుశరీరుఁడగు సర్వేశ్వరునియొక్క యంశమును మాత్రము తెలుపునవి. ఏలననఁగా, పరమాత్మ ఆయా పదార్థములను శరీరముగాఁ గలవాఁడనెడి జ్ఞానము గలిగిన తరువాతను గదా లోకమున ఆయాపదార్థములకు వాచకములుగాఁ దెలియవచ్చు శబ్దములు వాస్తవమునకు సర్వేశ్వరుని దెలియఁ జేయునవని లోకు లెఱుంగుదురు.

శ్రీ॥ భా॥ సమస్తములగు స్థావరజంగమపదార్థములతో సంబంధించినదై, వానిఁ దెలియఁజేయునట్టి శబ్దము, తాను తెలియఁ జేయవలసిన పదార్థమును సంపూర్ణముగాఁ దెలియఁజేయక, అట్టి పదార్థముయొక్క కొంతభాగమును మాత్రము తెలియఁ జేయుచున్నది. ఎట్లనిన, స్థావరజంగమాత్మకములగు సర్వపదార్థములును పరబ్రహ్మముయొక్క యాకారవిశేషములు. అయితే ఈ యాకారవిశేషములను మాత్రమే తెలియజేయుటయందు ఉపయుక్తములగు ప్రత్యక్షాది ప్రమాణములట్లు ఆకారవిశేషములతోఁగూడుకొనిన పరబ్రహ్మమును దెలియజేయుటయందుఉపయుక్తములుగావు. అందువలన వేదాంతశాస్త్రమునందు జ్ఞానము గలుగుటకుఁ బూర్వము అట్లాకార విశేషములగు పదార్థములు మాత్రమే తెలిసికొనఁబడుచున్నవే గాని, యీ పదార్థములు దేనియొక్క యాకార విశేషములో, యది మాత్రము తెలియఁబడుట లేదు. ఈ పదార్థములన్నియును దేనియొక్క యాకార విశేషములో, ఆ వస్తువు విషయమగు జ్ఞానమున్నచోఁ గదా, ఈ శబ్దములన్నియు నట్టి పరబ్రహ్మమును దెలియజేయుచున్నవని తెలిసికొందురు. అయితె యిట్టి జ్ఞానము సామాన్యముగ జనులకు లేనందున శబ్దములు వాస్తవముగా నవి తెలుపవలసిన వస్తువుయొక్క యొక్కొక్క యంశమును మాత్రము తెలుపుటకై ప్రయోగింపఁబడుచున్నవి.

☞ ఈ సూత్రమునకు వేఱొకవిధమునఁగూడ వ్యాఖ్యానము జేయవచ్చును:

రెండవ వ్యాఖ్యానము.

అవతారిక.—తేజస్సు మొదలగు శబ్దము లగ్న్యాది పదార్థములను మాత్రము తెలియఁజేయుటయందు ముఖ్యార్థము లనియు, ఆ యగ్న్యాదుల కంతరాత్మయగు పరమాత్మను దెలియఁజేయుటయందు గౌణార్థములనియును శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౧౭॥ సూ॥ చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశోఽభాక్తస్తద్భావభావిత్వాత్.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, చరాచరవ్యపాశ్రయః=స్థావరజంగమ పదార్థములతో సంబంధించినదై, తద్వ్యపదేశః=వానిని దెలియఁజేయునట్టి శబ్దము, (బ్రహ్మణి=బ్రహ్మమును దెలియఁజేయువిషయమై,) అభాక్తః=ముఖ్యార్థము గలదే. ఏలయన, తద్భావభావిత్వాత్=సర్వపదార్థములును, బ్రహ్మము వాటిలో నంతరాత్మగా నుండుటచే, బదార్థములుగా నెన్నఁబడుటవలన.

తా॥ స్థావరజంగమ పదార్థములతో సంబంధించినదై వానిఁ దెలుపునట్టి శబ్దము పరమాత్మను దెలియఁజేయు విషయమై ముఖ్యార్థము గలది. సర్వపదార్థములును, పరమాత్మ వానిలో నంతర్యామిగానుండుటను బట్టియే గదా, పదార్థములుగా నెన్నఁబడుచున్నవి.

శ్రీ॥ భా॥ స్థావరజంగమాత్మకములగు పదార్థములను దెలియజేయు శబ్దములు తదంతరాత్మయగు బ్రహ్మమును దెలియఁజేయు విషయమై గౌణార్థములు గావు. అవి ముఖ్యార్థములే. శబ్దములు బ్రహ్మమును దెలియజేయుచున్నవైనందుననే వాచకశక్తిగలవి యగుచున్నవి. బ్రహ్మము సర్వపదార్థములలోఁ బ్రవేశించి వానియొక్క నామములను రూపములను బ్రకటింపఁజేయుచున్నదని తెలుపునట్టి శ్రుతివాక్యమువలన నిట్లు తెలియుచున్నది.

తేజోఽధికరణము ముగిసెను.



ఆత్మాధికరణము.

౧౮॥ సూ॥ నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః.

టీ॥ అశ్రుతేః = సృష్టిని వర్ణించు శ్రుతులయందు, జీవోత్పత్తి వినఁబడకపోవుటవలనను, తాభ్యః=శ్రుతులవలన, నిత్యత్వాచ్చ=ఆత్మ నిత్యుఁడని వినఁబడుటవలనను, ఆత్మా=జీవుఁడు, న=జన్మించువాఁడు కాడు.

తా॥ సృష్టిప్రకరణమున నెచటను ఆత్మ పుట్టుచున్నట్లు చెప్పియుండనందు నను, శ్రుతులవలన నాత్మ నిత్యుఁడుగాఁ దెలియవచ్చుచుండుట వలనను ఆత్మ జన్మించువాఁడు కాడు.

శ్రీ॥ భా॥ ఆకాశాది ప్రపంచమంతయును పరబ్రహ్మమునుండి పుట్టుచున్న దని యింతకుఁబూర్వము ప్రతిపాదింపఁబడియె. ఇప్పుడొక సంశయము గలుగు చున్నది.

సంశయము.

జీవుఁడు ఆకాశాదులవలెనే పుట్టుచున్నాఁడా? లేదా.

పూర్వపక్షము.

జీవుఁడు బ్రహ్మమునుండి పుట్టుచున్నాఁడనుట యుక్తము. అట్లగుపక్షమున, ఒక వస్తువును దెలిసికొనుటచే నన్నివస్తువులును తెలియఁబడుచున్న వనెడి అనఁగా బ్రహ్మవ్యతిరిక్తమయిన దంతయును బ్రహ్మకార్యమయినందునఁ గారణభూతమయిన బ్రహ్మమును తెలిసికొనినచో, కార్యభూతమైన దంతయును తెలిసికొనఁబడు చున్నదను వేదాంత శాస్త్రపు ప్రతిజ్ఞయును ఉపపన్నమగుచున్నది. మఱియు, సృష్టికిఁ బూర్వము బ్రహ్మ మొక్కఁడే యుండెనని శ్రుతులు చెప్పుచున్నవి. ఇంతియెకాక, ఆకాశాదులకు వలెనే జీవునికిని జన్మముగలదని చెప్పునట్టిశ్రుతులును గలవు. ఎట్లనిన, “యతః ప్రసూతా జగతః ప్రసూతీ తోయేన జీవాన్ విససర్జ భూమ్యాం” (తై. అంభ. ౧౧) “జగత్కారణుఁడగు బ్రహ్మము ఉదకముతోఁ జీవులను భూమియందు సృజించెను” అనియు “ప్రజాపతిః ప్రజా అసృజత” (యజు. ౨ అష్ట) (బ్రహ్మము ప్రజలను సృజించెను) అనియు, “సన్మూలాః సౌమ్యేమాస్సర్వాః ప్రజా స్సదాయతనాస్సత్ప్రతిష్ఠాః” (ఛాం. ౬ ప్ర. ౮ ఖ. ౪ వా) (ఓ శ్వేతకేతుఁడా! ఈ ప్రజలందఱు సత్స్వరూపుఁడగు బ్రహ్మమునుండియే పుట్టుచున్నారు. అట్టి బ్రహ్మమునందే జీవించుచున్నారు. అట్టిబ్రహ్మమునే యాధారముగాఁ జేసుకొని యున్నారు) అనియు, “యతో వా ఇమాని భూతాని జాయన్తే” (తై. భృ. ౧ అ) (ఏబ్రహ్మమునుండి యీప్రాణులు పుట్టుచున్నవో) అనియు నిట్లు శ్రుతులు తెలుపుచున్నవి. ఈ శ్రుతులయందు జీవవిశిష్టమగు జగత్తుయొక్క యుత్పత్తిని గుఱించి చెప్పియున్నందున జీవునికిని ఉత్పత్తియున్నట్లు తెలియ వచ్చుచున్నది.

అయితే “తత్త్వమసి” (ఛాం. 3 ప్ర. ౧౪ ఖ. ౧ వా) (ఓ శ్వేతకేతుఁడా, ఆ బ్రహ్మమే నీవు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు జీవుఁడే బ్రహ్మమని చెప్పు చున్నవి. బ్రహ్మము నిత్యము. కనుక జీవుఁడును నిత్యుఁడు. అనఁగా జన్మరహితుఁ

డనియెదవేమో, అట్లు చెప్పఁదగదు. ఏలయన, అట్లయినచో, "ఐతదాత్మ్యమిదం సర్వం" అనియు, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు "దృశ్యమానమగు నాకాశాదిప్రపంచమంతయును బ్రహ్మమే" అని చెప్పుచున్నవి. ఆకాశాదులును బ్రహ్మమే కదా! అందువలన నాకాశాదులు సయితము నిత్యము లనియే చెప్పవలసివచ్చునే? కనుక, జీవుఁడును ఆకాశాదులవలెనే బ్రహ్మనుండి పుట్టుచున్నాఁడనుట యుక్తము.

—సిద్ధాంతము.—

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఆత్మ జన్మించునది కాదు. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (క. ౨వ. ౧౮వా.) (జ్ఞాతయగు నాత్మ జన్మించువాఁడును మృతినొందువాఁడును కాఁడు) అనియు "జ్ఞాజ్ఞౌ ద్వావజౌ" (శ్వే. ౧ అ. ౯ వా) (జీవాత్మ పరమాత్మ లిద్దఱును జన్మించువారు కారు) అనియు నీమొదలగు శ్రుతి వాక్యములు జీవుఁడు జన్మించువాఁడు కాఁడని తెలుపుచున్నవి. మఱియు "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామేకో బహూనాం విదధాతి కామాన్" (శ్వే. ౬ అ-౧౩వా.) '(నిత్యులలో నిత్యుఁడును, చేతనులలో చేతనుఁడును, అనేకులలో నొక్కఁడు నగుపరమాత్మ కోరికల నెరవేర్చుచున్నాఁడు) అనియు "అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే" (క. ౨వ. ౧౮వా) (జీవుఁడు జన్మరహితుఁడును, నిత్యుఁడును, నాశరహితుఁడును, "అనాదికాలము గానుండు వాఁడును శరీరము నశించినను నాశమునొందని వాఁడును) అనియు నీ మొదలగు శ్రుతులు జీవుఁడు నిత్యుఁడని తెలియఁజేయుచున్నవి. కనుక జీవుఁడు జన్మించు వాఁడు కాఁడని చెప్పుట యుక్తము.

జీవుఁడు బ్రహ్మమునుండి పుట్టకపోయినచో, అనఁగా, ఆకాశాదులవలెనే బ్రహ్మకార్యము గాని పక్షమున, ఒక వస్తువును దెలిసికొనుటచే నన్ని వస్తువులును తెలియఁబడుననెడి వేదాంత శాస్త్రపు ప్రతిజ్ఞ యెట్లు ఉపపన్నమగుచున్నదందు రేమో, ఇందుకు సమాధాన మిట్లు చెప్పఁబడుచున్నది.

జీవుఁడును కార్యభూతమైనందునను, కార్యకారణములు వేఱయినవి కానందునను వేదాంతశాస్త్రపు ప్రతిజ్ఞ ఉపపన్నమగుచున్నది. జీవుఁడు కార్యభూతుఁడయినచో, ఆకాశాదులవలె నతఁడును జన్మించువాఁడని యంగీకరించినట్లగునే యని శంకింపఁదగదు; ఏలననఁగా, కార్యమగుట యనఁగా మఱియొక యవస్థను బొందునదియగుట గదా! జీవుఁడును అవస్థాంతరమును బొందువాఁడు గాన, అతఁడును కార్యభూతుఁడనిపించుకొనుచున్నాఁడు. అయితే యతఁడు పొందునట్టి యవస్థాంతరము అచేతన పదార్థములగు నాకాశాదులు పొందునట్టి యవస్థాంతరము వంటిది కాదు. ఎట్లన, జీవుఁడు తన జ్ఞానమునందు సంకోచ వికాసరూప

మగు నవస్థాంతరమును బొందువాఁడైనందున కార్యపదార్థ మనిపించుకొను చున్నాఁడు. ఆకాశాదులన్ననో, తమ స్వరూపమునందు మార్పునొందుట యనెడి యవస్థాంతరమును బొందునవి యైనందున, కార్యపదార్థము లనిపించుకొను చున్నవి. ఇట్లు స్వరూపము మాఱిపోవుట యనెడి యుత్పత్తి జీవునికి లేదని శ్రుతులు తెలుపుచున్నవి. ఎట్లనినఁ, శ్రుతివాక్యములు భోగ్యభూతములగు నాకాశాదులను, భోక్తలగు జీవులను, నియంతయగు పరమాత్మనున్ను విలక్షణస్వరూపులనుగాఁ బ్రతిపాదించి, భోగ్యపదార్థములగు నాకాశాదులకుఁగల యుత్పత్త్యాదులు భోక్తలగు జీవులకు లేవనియు, జీవులు జన్మించునారు కారనియు, కనుకనే వీరలు నిత్యులనియును బ్రతిపాదించి, తరువాత భోగ్యపదార్థములగు నాకాశాదులకుఁగల యుత్పత్త్యాదులును భోక్తలగు జీవులకుఁగల కర్మవశ్యత్వమున్ను నియన్తయగు పరమాత్మకు లేవనియు, కనుకనే యీతఁడు నిత్యుఁడును, నిందారహితుఁడును, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును, ఇంద్రియముల కధిపతియగు జీవునికి నధిపతియును, సమస్త ప్రపంచమునకును పరిపాలకుఁడు నని యివ్విధమునఁ బ్రతిపాదించి, యనంతరము చేతన పదార్థములగు జీవులును అచేతనపదార్థములగు నాకాశాదులును ఇవి యన్నియును అన్నియవస్థలయందును పరమాత్మకు శరీరభూతములనియు, ఈతఁడు తనకు శరీరభూతములగు చేత నాచేతన పదార్థముల కాత్మయనియును బ్రతిపాదించుచున్నవి. ఇట్లు ఎల్లప్పుడును, బ్రహ్మము చేతనా చేతనపదార్థములు శరీరముగాఁగలదైనందున నది చిదచిద్విశిష్టమైనది. అది యొకప్పుడు తననుండి వేఱుగాఁ దెలుయుట కలవి కానంత సూక్ష్మములగు చేతనాచేతన పదార్థములు శరీరముగాఁగలదిగా నుండును. అప్పుడది కారణావస్థగల బ్రహ్మమని చెప్పఁబడుచున్నది. మఱియు నదియే, వేఱొకప్పుడు, నామరూపవిభాగముగలవై స్థూలములగు చిదచిత్పదార్థములు శరీరముగాఁగల దైయుండును. అప్పుడది కార్యావస్థగల బ్రహ్మమని చెప్పఁబడుచున్నది. బ్రహ్మము కారణావస్థనుండి కార్యావస్థనుబొందునపుడు, దానియందుండు అచిత్పదార్థాంశము అట్టికారణావస్థయందుశబ్ద స్పర్శరూప రస గంధరస రహితమైనదై, కార్యావస్థయం దది భోగ్యముగానుండుటకై, శబ్ద స్పర్శ రూప రస గంధయుక్తమైనదగుచు తనస్వరూపమున మార్పుగలది యగుచున్నది. ఇదియే యచిత్పదార్థములు బొందునట్టి యవస్థాంతరము. చేతనాంశమగు జీవుఁడు, స్వకర్మఫలముల ననుభవించుట కనుగుణముగ, జ్ఞానమునందు సంకోచ వికాసరూపమగు వికారమును బొందుచున్నాఁడు. ఇదియె జీవుఁడు పొందునట్టి యవస్థాంతరము. ఈ రెండు విధములగు చేతనాచేతన పదార్థములు శరీరములుగాఁ గలదయినందున నియంత్రంశమగు బ్రహ్మమున్ను ఆయాయవస్థలను బొందునట్టి చేతనాచేతన

పదార్థములతో విశిష్టమగుట యను వికారమును బొందుచున్నది. ఇట్లు కారణావస్థనుండి కార్యావస్థను బొందుట యనెడి వికారము శరీరభూతములగు చేతనాచేతన పదార్థములకును శరీరియగు పరబ్రహ్మమునకును సమానమే.

ఇట్లు ఒక్కదానికిఁ గలుగు నవస్థాంతరాపత్తి రూపమగు వికారమును బట్టియే "యేనాశ్రుతం శ్రుతం" (ఛాం. ౬ ప్ర. ౧ ఖ. ౩ వా) ఇత్యాదిశ్రుతులు ఒక పదార్థమును దెలిసికొనుటచేత నన్ని పదార్థములును తెలిసికొనఁబడుచున్నవని ప్రతిజ్ఞచేసి మృత్తును దెలిసికొనుటచే ఘటాదిపదార్థములు తెలిసికొనఁబడుటను ఉదాహరణముగ "యథా సౌమ్య" ఇత్యాది వాక్యములచేఁ దెలుపుచున్నవి.

జీవునికి జన్మమరణములు గలవని తెలుపునవిగాఁ బూర్వపక్షమునఁ గనఁబఱుపఁబడిన "ప్రజాపతిః ప్రజా అసృజత" (౨ అష్ట) ఈ మొదలగు శ్రుతి వాక్యములకు, ఈ పైని గనఁబఱచిన ప్రకారము, జీవునియొక్క జ్ఞానమునందు సంకోచ వికాసములను గలుగఁజేయు శరీరసంయోగ వియోగములను తెలుపుటయందే తాత్పర్యము. మఱియు జీవునికి జన్మము లేదనియు, జీవుడు నిత్యుడనియును తెలుపునట్టి "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" "నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౧ వా.) ఈ మొదలగు శ్రుతివాక్యములు జీవుఁడచేతన పదార్థములవలె స్వరూపమునం దెంతమాత్రము వికారమును బొందఁడని తెలుపునవి. మఱియు "స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతో బ్రహ్మ" అనియు, "నిత్యో నిత్యానాం" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు బ్రహ్మము, స్వశరీరభూతములగు చేతనా చేతన పదార్థములవలె స్వరూపమునందు మార్పును గాని జ్ఞానమునందు సంకోచ వికాసములనుగాని పొందు నట్టిది కాదని తెలుపునవి. [1]ఇట్లు ఎల్లకాలమును చేతనాచేతన విశిష్టమగు బ్రహ్మము సృష్టికిపూర్వము నామరూప విభాగానర్హములై సూక్ష్మములగు చేతనాచేతన పదార్థములతోఁ గూడుకొనియున్నది. కావున, అట్టిసమయమున నది యొక్కటి యే యుండెనని శ్రుతులయందుఁ జెప్పియుండుట సంభవమే. కనుకనే వాజసనేయులు "తద్ధేదంతర్హ్య వ్యాకృత మాసీత్త న్నామరూపాభ్యాం వ్యాక్రియత" (బృ. ౩ అ. ౪ బ్రా. ౭ వా) (కారణావస్థయందు నామరూపములతో స్పష్టముగానట్టి యీ బ్రహ్మము కార్యావస్థయందు, నామరూపములతో స్పష్టమగుచున్నది) అనెడి శ్రుతివాక్యమున నామరూప విభాగము లేనప్పుడే బ్రహ్మమొక్కటి యనియును నామరూప విభాగమున్నప్పు డనేక మనియును దెలియఁజేయుచున్నారు. సృ

(1) బ్రహ్మము మొదట నామరూపవిభాగానర్హ సూక్ష్మచిదచిద్విశిష్టము. అదియే నామరూపవిభాగవిభక్త స్థూలచిదచిద్విశిష్టమగును. ఇట్లు విశిష్టములైన బ్రహ్మములు రెంటికిని అద్వైతము=అనఁగా అభేదము. కనుక నిది విశిష్టాద్వైత మనఁబడును.

ష్టికిఁ బూర్వము నామరూప విభాగము లేమింబట్టియే వేదాంతులందఱును, అనఁగా బ్రహ్మమే యవిద్యోపాధి యుక్తుఁడగునపుడు జీవుఁడుగాను వ్యవహరింపఁ బడు చున్నాఁడ నెడివారును (శంకరమతస్థులును), పారమార్థికోపాధి యుక్తుఁడగు బ్రహ్మమే జీవుఁడనువారును(భాస్కరమతస్థులును)సన్మాత్రస్వరూపమగు బ్రహ్మమే భోక్తగను, భోగ్యముగను, నియంతగను మూఁడువిధములుగ నున్నద నెడివారును (యాదవప్రకాశమతస్థులును) వీరందఱును అవిద్యాశక్తియును, ఉపాధిశక్తియును, భోక్తృభోగ్యనియంతృత్వశక్తులును ప్రళయకాలమునందునుగూడ యుండియున్న ప్పటికిని,అట్టిసమయమున బ్రహ్మమొక్కటియేయుండెనని ప్రతిపాదించుచున్నారు. అనఁగా వీరందఱును అవిద్యాశక్తి మొదలగునవి ప్రళయకాలమునందుఁగూడ ఉండు నవి యని యంగీకరించుచున్నారు గాన నామరూపములు లేమింబట్టి తప్ప మఱి యొక విధముగ వీరుసృష్టికిఁబూర్వము బ్రహ్మమొక్కటియే యుండెనని ప్రతిపాదిం చుట యశక్యము. ఇంతియె కాక, బ్రహ్మసూత్రకారుఁడు సయితము "వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. 3౪ సూ) అనియు, "న కర్మావిభాగాదితిచేన్నా నాదిత్వా దుపపద్యతే చాప్యుపలభ్యతే చ" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. 3౫ సూ) అనియు నీసూత్రములచే జీవభేదమున్ను కర్మ ప్రవాహమున్ను అనాదులు అనఁగా నిత్యములని గదా చెప్పుచున్నాఁడు. ఇందు విశేష మెద్దియనిన:—వీనిలో, అవిద్యోపాధి యుక్తమగు బ్రహ్మమే జీవుఁడ నెడి వారి మతమున, అనాద్యవిద్యచేత బ్రహ్మమే మోహమును బొందుచున్నట్లు సంప్రాప్తించె. పారమార్థికోపాధి యుక్తమగు బ్రహ్మమే జీవుఁడనెడి వారి మత మున ఉపాధికంటెను బ్రహ్మముకంటెను వేఱుగ మఱియొకటి యున్నట్లంగీకరింపఁ బడనందున, పారమార్థికమును, అనాదియునగు నుపాధిచేత బ్రహ్మమే బంధింపఁ బడుచున్నట్లు సంప్రాప్తించె. సన్మాత్రమగు బ్రహ్మమే భోక్తగాను, భోగ్యము గాను, నియంతగాను మూఁడు విధములుగా నున్నదను వారిమతమున, బ్రహ్మమే విచిత్రాకారముగాఁ బరిణమించు చున్నదనియు అనిష్టములగు కర్మఫలములను సయిత మనుభవించు చున్నదనియును సంప్రాప్తమాయె. ఒకవేళ, ఈమూఁడింటి లో, నియంత్రంశము (బ్రహ్మము) భోక్త కాకపోయినను, సర్వజ్ఞుఁడయినందున భోక్తను తనకంటె వేఱుకాని వానినిగాఁ దెలిసికొనుచున్నాఁడు గాన, స్వయము గనే యనుభవించు చున్నాఁడు.

మా మతముననో (విశిష్టాద్వైతముననో) స్థూల సూక్ష్మావస్థలను బొందు నట్టి చిదచిత్పదార్థములను శరీరముగాఁ గలిగియుండెడి బ్రహ్మము కార్యావస్థను కారణావస్థను ఈ రెంటిని పొందునదియే యైనను, అది యెల్లప్పుడును దోషము లేవియు నెంతమాత్రము లేనిది గాను, సత్యసంకల్పత్వము మొదలగు లెక్కలేని

కల్యాణగుణములు గలదిగానున్న అంగీకరింపఁబడు చున్నది. ఇంతియె కాక, స్వరూపమునందు మార్పునుపొందుట మొదలగు దోషములు శరీరభూతములగు చిదచిత్పదార్థములతోను మాత్రమే సంబంధించినవి. కాఁబట్టి యీ మతమున ఇతరమతములయందుండు దోషము లేవియును లేవు.

ఆత్మాధికరణము ముగిసెను.

## జ్ఞాధికరణము.

### ౧౮॥ సూ॥ జ్ఞో ఽ త ఏ వ.

టీ॥ అత ఏవ = శ్రుతులనుండియే = (సః = జీవుఁడు) జ్ఞః = జ్ఞాతృత్వ స్వరూపుఁడు. (ఇతి = అని, ప్రతీయతే = తెలియుచున్నది).

తా॥ జీవుఁడు జ్ఞాతృత్వ స్వరూపుఁడని శ్రుతులనుండియే తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఆకాశాది పదార్థములవలె జీవుఁడు జన్మించువాఁడు కాడని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁ బడియె. ఇప్పుడు ప్రసక్తానుప్రసక్తముగ జీవునియొక్క స్వరూపము నిరూపింపఁబడును. ఈ విషయమును గుఱించి యొకసంశయము గలుగుచున్నది.

పూర్వాధికరణ సంబంధము

సంశయము.

బౌద్ధులును, సాంఖ్యులును ప్రతిపాదించునట్లు జీవుఁడు చిన్మాత్రస్వరూపుఁడా, వైశేషికులు ప్రతిపాదించునట్లు పాషాణకల్పుఁడును, అచిత్స్వభావుఁడునై అప్పుడప్పుడు వచ్చునట్టి చైతన్యము కలవాఁడా? కాక, జ్ఞాతయా అనఁగా జ్ఞాతృత్వమే స్వరూపముగాఁ గలవాఁడా?

పూర్వపక్షము.

జీవుఁడు చిన్మాత్రస్వరూపుఁడని చెప్పుట యుక్తము. శ్రుతులును ఇట్లే తెలుపుచున్నవి. అంతర్యామిబ్రాహ్మణమున, ''య ఆత్మని తిష్ఠన్'' (బృ. ౫ అ. ౭ బ్రా. ౨౨వా) (ఏపరమాత్మ ప్రత్యగాత్మయందున్నాఁడో) అని మాధ్యందినులు పఠించిన దానినే కాణ్వులు పఠించునపుడు ''యో విజ్ఞానే తిష్ఠన్''(ఏ పరమాత్మ విజ్ఞానమున అనఁగా చిన్మాత్ర స్వరూపుఁడగు జీవుని యందున్నాఁడో) అని పఠించుచుండుటచే జీవుని చిన్మాత్ర స్వరూపునిగా నంగీకరించుచున్నారు. తైత్తిరీయులును ''విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ'' (తై.ఆ.౫-౧వా) (విజ్ఞానము

బౌద్ధసాంఖ్య పక్షోపపాదనము

అనఁగా చిన్మాత్ర స్వరూపుఁడగు జీవుఁడు యజ్ఞమును కర్మములను జేయుచున్నాఁడు) అనుటచే యజ్ఞాది కర్తయగు జీవుఁడు చిన్మాత్ర స్వరూపుఁడని తెలియఁజేయుచున్నారు "జ్ఞాన స్వరూప మత్యంత నిర్మలం పరమార్థతః" (విష్ణు. ౧ అం. ౨ అ. ౬ శ్లో) (వాస్తవములో నీయాత్మ జ్ఞానస్వరూపుఁడును నిర్మల స్వరూపుఁడును) అనెడి పురాణ వాక్యమున్ను జీవుఁడు చిన్మాత్ర స్వరూపుఁడని తెలియఁజేయుచున్నది.

మఱికొందరు అనఁగా వైశేషికులు జీవుని స్వరూపమును గుఱించి యివ్విధమునఁ జెప్పుచున్నారు. జ్ఞానము గాని జ్ఞాతృత్వము గాని జీవునికి స్వాభావిక మయినచో, సర్వగతుఁడగు జీవుఁడు యెల్లప్పుడు నెల్లెడలను జ్ఞానము గాను గాని, జ్ఞాతగాను గాని తెలియవలసి వచ్చును. [1]అందువలన చక్షురాదీంద్రియములవలనఁ బ్రయోజన మెద్దియు నున్నట్లు గానఁబడదు. ఇంతియె కాక, సుషుప్తి మూర్ఛాద్యవస్థలయందు జీవాత్మయున్నప్పటికిని, జ్ఞానము ఉన్నట్లు తెలియఁబడదు. మఱియు జాగరావస్థ యందు ఇంద్రియాద్యుపకరణములతో సంబంధ మున్నప్పుడే జ్ఞానోత్పత్తి గలుగుచున్నట్లు గానఁబడుచున్నది. కాఁబట్టి జ్ఞానము జీవునియొక్క స్వరూపము కాదు. జీవుఁడు జ్ఞాత అనఁగా తెలివిగలవాఁడును సయితము కాడు. జ్ఞానము మధ్యవచ్చినదియే గాని యది జీవునికి స్వాభావికమయినది కానేరదు.

వైశేషిక పక్షోపపాదనము

మఱియు జీవుఁడు సర్వత్ర యుండువాఁడని అవశ్యముగ ఒప్పుకొనవలయును. ఇందులకు నిదర్శన మెద్దియనిన, జీవునికార్యము లన్నిచోట్లను కానఁబడుచున్నవి. ఎట్లనిన, దూరమునుండు సూర్యచంద్రాదులు మనచేఁ దెలిసికొనఁబడుచున్నవి గదా! అట్టి సూర్యచంద్రాదులను దెలిసికొనుటకు గాను మన శరీరేంద్రియాదు లాకాశాది ప్రదేశములకుఁ బోవుచున్నవనుటకు ప్రమాణ మెద్దియును లేదు. సుషుప్తి మోక్షావస్థలయందు జ్ఞానము లేదని శ్రుతులే తెలుపుచున్నవి. ఎట్లనిన, ఛందోగులు "నాహఖల్వయ మేవం సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మీతి నో ఏవేమాని భూతాని" (ఛా. ౮ ప్ర. ౧౧ ఖ. ౨ వా.) అనెడి వాక్యమున (ఈసుషుప్త్యవస్థయందు జీవుఁడు నేనిట్టివాడనని తనను తెలిసికొన నేరక పోవుటయేకాక, ఈ పృథివ్యాది భూతములనున్ను తెలిసికొన నేరడు) అనుటచే సుషుప్త్యవస్థయందు జీవునికి జ్ఞానము లేనట్లు తెలియఁజేయుచున్నారు. ఇంతియెకాక, వాజసనేయులు "న ప్రేత్య సంజ్ఞాస్తి" (బృ. ౬అ. ౫బ్రా. ౧౩వా)

(1) జీవుడు స్వయముగా జ్ఞానస్వరూపుఁడగుట వలన నతఁడు సర్వమును స్వయముగనే తెలిసికొన సమర్థుఁడు. కనుక చక్షురాదీంద్రియ ద్వారాగానే తెలిసికొన వలయునన్న నియమము లేనందున నట్టి యింద్రియములతో ప్రయోజన మెద్దియు లేకపోవును.

"(శరీరసంబంధము వదలినపుడు జ్ఞానములేదు) అనెడి వాక్యమున మోక్షావస్థ యందు జీవుఁడు జ్ఞానశూన్యుఁడని తెలియఁజేసి యున్నారు. కనుక "జ్ఞాన స్వరూప మత్యంత నిర్మలం" ఇత్యాది వాక్యములు జ్ఞానము జీవుని యసాధారణ గుణమగుటచే దాని నతని స్వరూపమునుగా తెలుపుచున్నవి. ఇంతియే. కావున నట్లు చెప్పుట యౌపచారికముగాని·ముఖ్యార్థము గాదని యెఱుంగునది.

## సిద్ధాంతము

జీవుడు, బౌద్ధులును సాంఖ్యులును ప్రతిపాదించు రీతిని, చిన్మాత్రస్వరూపుఁడు గాని, వైశేషికులు ప్రతిపాదించురీతిని జడస్వరూపుఁడు గాని కాడు. అయితే, అతఁడు జ్ఞాతృత్వస్వరూపుఁడు అనఁగా తెలివిగలవాడు. శ్రుతుల నుండియె జీవుఁడు జ్ఞాతృత్వ స్వరూపుఁడని తెలియవచ్చుచున్నది. సూత్రమునందలి "అతః" అను పదము పూర్వసూత్రమునఁ గాన్పింపఁబడిన శ్రుతిప్రమాణమును పరామర్శించు చున్నది. ఎట్లనిన :— ఛందోగులు ముక్తాముక్త స్వరూపమును గుఱించి పఠించు సందర్భమున "అథ యో వేదే దం జిఘ్రాణీతి స ఆత్మా" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౪ వా.) (దీనిని వాసన జూచుచున్నానని తెలిసికొనువాఁడు ఆత్మ) అనియు, "మనసైవైతాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౫ వా.) (ఈ ముక్తాత్మ మనస్సుచే నీకామములను దెలిసికొనుచు బ్రహ్మలోకమునందు రమించుచున్నాఁడు) అనియు "సత్యకామః సత్యసంకల్పః" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౫ వా) (జీవుఁడు సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు) అనియు "నోపజనం స్మరన్నిదంశరీరం" (ఛా. ౮ అ. ౧౨ ఖ. 3 వా.) (జీవుఁడు బంధుజన సమీపమునఁబడి యుండు మృతకళేబరమును స్మరింపనివాఁడై) అనియును, వీరే మఱియొకతావున "నపశ్యో మృత్యుంపశ్యతి" (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౨ వా.) (బ్రహ్మను దెలిసికొనని జీవుఁడు మరల జన్మమరణరూపమగు సంసారమును బొందడు) అనియును పఠించి యుండుటవలనను, వాజసనేయులును "కతమ ఆత్మా" (బృ. ౬ అ. 3 బ్రా. ౭ వా.) అనువాక్యమున జీవుఁడెట్టివాడని ప్రశ్నచేసి "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః" (బృ.౬.అ.౫.బ్రా.౧౫వా.)(హృదయమునను ముఖ్యప్రాణమునందును ఇంద్రియములందును నుండువాఁడును జ్ఞానముగలవాఁడును ప్రకాశస్వరూపుఁడును జీవుఁడు)అని ప్రత్యుత్తరమిచ్చి యుండుట చేతను "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" (బృ. ౬ అ. ౫ బ్రా. ౧౫వా.) (విజ్ఞాతయగు జీవుని నెట్లు తెలిసికొనవలయును), అని జెప్పియుండుటచేతను, మఱియొకచోట "జానాత్యేవాయంపురుషః" (ఈ పురుషుఁడు తెలిసికొనువాఁడు) అని చెప్పియుండుటచేతను, ప్రశ్నోపనిషత్తు నందు "ఏష హి ద్రష్టా,

శ్రోతా, ఘ్రాతా, రసయితా, మన్తా, బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మా పురుషః" (ప్ర. ౪ ప్ర. ౯ వా.) (చూచువాఁడును, రుచిచూచువాఁడును, ఆలోచించు వాఁడును, తెలిసికొనువాఁడును, కర్తయును అనఁగా చేయువాఁడును, విజ్ఞాన స్వరూపుఁడును ఈ జీవుఁడే) అనియును "ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కలాః" (ప్ర. ౬. ప్ర. ౫. వా.) (తెలిసికొను వాఁడగు యీ జీవునికి పదునాఱు కళలు కలవు) అనియును చెప్పియుండుట చేతనున్ను జీవుఁడు జ్ఞాతృత్వస్వరూపుఁడని శ్రుతులవలననే తెలియవచ్చుచున్నది.

అవతారిక:—జ్ఞాతృత్వము జీవునికి స్వాభావికమయినచో, ఈతఁడు సర్వగతుఁడయినందున నీతఁడెల్లప్పుడు అన్నిచోట్లను జ్ఞాతగానే అనఁగా తెలిసికొనువాఁడుగానే తెలియవలయునే యనెడి యాక్షేపమును పరిహరించుటకై:—

౨౦॥ సూ॥ ఉత్క్రాన్తిగత్యాగతీనాం.

టీ॥ ఉత్క్రాన్తిగత్యాగతీనాం=శరీరమును విడుచుటకును, లోకాంతరమునకుఁ బోవుటకును, అందుండి మరల వచ్చుటకును (శ్రుతేః=శ్రుతి యుండుట వలన, అణుః=జీవుఁడణు పరిమాణుఁడు).

తా॥ జీవుఁడు శరీరములోనుండి బయలు వెడలుచున్నాఁడనియు, లోకాంతరమునకుఁ బోవుచున్నాఁడనియు, అందుండి మరల వచ్చుచున్నాఁడనియును శ్రుతులు తెలుపుచున్నందున, జీవుఁడణు పరిమాణుఁడని తెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ జీవుఁడు సర్వగతుఁడు అనఁగా సర్వత్రయుండువాఁడు కాఁడు. అయితే యీతఁ డణుపరిమాణుఁడే. చక్షురాదీంద్రియములగుండ ఈ శరీరము లోనుండి బయలు వెడలి, చంద్రాదిలోకములకుఁబోయి, యచటనుండి మరల ఈ లోకమునకు వచ్చి శరీరయుక్తుఁడగుచున్నాఁడని శ్రుతులు తెలుపుచున్నందున నతఁ డణుపరిమాణుఁడనుట యుక్తము. ఎట్లన:—వాజసనేయులు "తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వాఽన్యేభ్యో శరీర దేశేభ్యః" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨ వా.) "ఈ జీవుఁడు హృదయాగ్రము ప్రకాశింపఁగా నేత్రముగుండగాని శిరస్సుగుండగాని యితరములగు శరీరప్రదేశములగుండ గాని బయలు వెడలుచున్నాఁడు" అను వాక్యమున జీవోత్క్రమణమును పఠించి యున్నారు. కౌషీతకులు "యేవైచాస్మాల్లోకాత్ప్రయంతి చంద్రమసమేవ తే గచ్ఛంతి" (కౌ. ౧ అ. ౨ వా.) (ఎవ రీలోకమును విడుచుచున్నారో, వారు చంద్రుని బొందుచున్నారు) అనెడి వాక్యమున నీలోకమును విడుచునట్టి జీవులను గుఱించి లోకాంతర ప్రాప్తిని పఠించియున్నారు. వాజసనేయులు "తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణే" (బృ. ౬ అ. ౪ బ్రా. ౬ వా) (కర్మమును

సంపాదించుకొనుటకై జీవుఁ డాలోకమునుండి యీలోకమునకు వచ్చుచున్నాఁడు) అనెడి వాక్యమున లోకాంతరమునకుఁ బోయిన జీవులను గుఱించి పునరాగమనమును పఠించియున్నారు. జీవుఁడంతటను ఉండు వాఁ డగుపక్షమున, శరీరములో నుండి బయలు వెడలుటయు, చంద్రాదిలోకములకుఁ బోవుటయును ఈ మొదలగునది యంతయును అసంభవ మగును.

౨౧॥ సూ॥ స్వాత్మనా చోత్తరయోః.

టీ॥ ఉత్తరయోః=ఉత్క్రాంతికి తరువాతివి యగు గత్యాగతులు, స్వాత్మనా చ=జీవునిచే స్వయము గానే యొనర్పవలసినవి యగుటంజేసి, (అణుః= జీవుఁడణు పరిమాణుఁడు.)

తా॥ పూర్వసూత్రమునందుఁ జెప్పఁబడిన యుత్క్రాంతి గత్యాగతులలో ఉత్క్రాంతికి తరువాతివియగు గత్యాగతివ్యాపారములు జీవునిచే స్వయము గానే యొనర్పవలసినవి యగుటంజేసి జీవుఁ డణుపరిమాణుఁడని సిద్ధ మగుచున్నది.

శ్రీ॥ భా॥ జీవుఁడు స్థిరముగా నుండునట్టివాఁడయినప్పటికిని, శరీరవియోగరూపమగుటంజేసి యుత్క్రమణము (శరీరసంబంధము విడిపోవుట) ఏదోకవిధమునఁ గలుగవచ్చును గాని, తక్కినవి రెండును అనఁగా నీలోకమునుండి పరలోకమునకుఁ బోవుటయు, అందుండి యిచటకు మరల వచ్చుటయును ఎవ్విధమునను సంభవింపవు. అవి జీవుఁడు స్వయముగానే చేయవలసినవి.

౨౨॥ సూ॥ నాణురతచ్ఛ్రుతే రితి చేన్నే తరాధికారాత్.

టీ॥ అతచ్ఛ్రుతేః= అణుత్వవిపరీత పరిమాణమును దెలియఁజేయు శ్రుతి యుండుటవలన, అణుః = అణుపరిమాణుఁడు, న = జీవుఁడుకాఁడు, ఇతిచేత్ = ఇట్లంటివేని, ఇతరాధికారాత్ = అది బ్రహ్మప్రకరణమగుటవలన, న = అట్లు చెప్పఁదగదు.

తా॥ "స వా ఏష మహా నజ ఆత్మా" ఇత్యాది శ్రుతులు జీవునికి మహత్పరిమాణము ఉన్నట్లు తెలియఁజేయు చున్నవేయని యంటివేని, యది యుక్తము కాదు. ఏలననిన, ఆ శ్రుతులు పరబ్రహ్మమును గుఱించి గదా! అట్లు చెప్పుచున్నవి.

ఆక్షేపము.

శ్రీ॥ భా॥ వాజసనేయులు "యోఽయం విజానమయః ప్రాణేషు" (బృ. ౬ అ. ౩ బ్రా. ౭ వా) (ఎవఁడు ప్రాణములయందు విజ్ఞానస్వరూపుఁడుగా నుండువాఁడో) అని యిట్లు ప్రథమమున జీవుని గుఱించి ప్రస్తావించి తరువాత "స

 

వా ఏష మహానజ ఆత్మా" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా.) అను వాక్యమున (అతడు విభుపరిమాణుడును జన్మరహితుడును) అని పఠించి యున్నారు. కనుక జీవుడణు పరిమాణుడనుట యుక్తము కాదనిన,

## సమాధానము

ప్రకరణమునుబట్టి విచారింపఁగా, "సవా ఏష మహానజ ఆత్మా" అను శ్రుతివాక్యము పరమాత్మనుగుఱించి విభుపరిమాణమును జెప్పుచున్నదే గాని, జీవుని గుఱించి యట్టి పరిమాణమును జెప్పుచుండ లేదని తెలియుచున్నది. ఏల ననిన, వాజసనేయులు ఉపక్రమమున జీవునిగుఱించి ప్రస్తావించినను, మధ్యను "యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా" (బృ. ౬ అ. ౪ బ్రా. ౪ వా.) (జీవునిచే నుపాస్యుఁడును ప్రాజ్ఞుఁడునగు ఆత్మ) అనెడి వాక్యమున పరమాత్మను గుఱించి చెప్పుటకై యారంభించి, తరువాత "సవా ఏషమహానజ ఆత్మా" అను వాక్యమున నతనిని గుఱించి విభుపరిమాణమును జెప్పియున్నారు. కనుక నిచట చెప్పఁబడిన విభుపరిమాణము పరమాత్మ సంబంధమయినదే కాని, జీవుని సంబంధమయినది కాదు.

## ౨౩॥ సూ॥ స్వశబ్దోన్మానాభ్యాం చ.

టీ॥ స్వశబ్దోన్మానాభ్యాంచ="అణు" శబ్దమునవలనను, సదృశపదార్థము నేర్చి పరిమాణమునుజెప్పుట వలనను, (జీవుఁడణు పరిమాణుఁడని తెలియవచ్చుచున్నది.)

తా॥ శ్రుతులయందు జీవుఁడు "అణు" శబ్దముచే బేర్కొనఁబడుట వలనను, అణుసదృశమగు వస్తువునేర్చి జీవుని పరిమాణము జెప్పియుండుటవలనను జీవుఁడు అణువని తెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పఞ్చధా సంవివేశ" (ము. 3 ముం. ౧ ఖ. ౯ వా.) (ఎవనియందు ప్రాణ మయిదు విధములుగ ప్రవేశించియుండెనో, ఆ జీవుఁడణువు, మనస్సుచేతఁ దెలిసికొనఁదగిన వాఁడు) అనెడి ముండకోపనిషద్వాక్యము జీవుని పరిమాణమును "అణు" శబ్దముచేతనే తెలుపుచున్నది. సూత్రమునందుండు "ఉన్మాన" శబ్దము నకు సదృశ పదార్థములనేర్చి పరిమాణమును దెలియఁజేయుట యని యర్థము. అణు సదృశమగుపదార్థము నేర్చి దానిపరిమాణ గదా జీవునికిఁ గలదని శ్రుతులు తెలుపుచున్నవి. ఎట్లనిన:—"వాలాగ్రశత భాగస్య శతధా కల్పితస్యచ భాగో జీవ స్సవిజ్ఞేయః" అను శ్రుతివాక్యము "ఒక రోమముయొక్క కొనను నూఱు భాగములనుగ భాగించి వానిలో నొక భాగమును మరల నూఱు భాగములుగ విభజించినచో, వానిలో నొక భాగమంత మాత్రము జీవుఁడని తెలిసికొనవలయు

ను" అనియు "ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః" అను శ్రుతివాక్యము "జీవుఁడు ముల్లుకొనయంత సూక్ష్మమయిన వాఁడుగ జూడఁబడి నాడు" అనియును గదా తెలుపుచున్నవి. కనుక జీవుఁడణు పరిమాణుఁడనుట యుక్తము.

అవతారిక:—జీవుఁడణుపరిమాణుఁడగు పక్షమున, శరీరమునందేదో యొకప్రదేశమునను మాత్రముండు వాఁడుగాన, అతఁడు శరీరముయొక్క యన్ని భాగములయందుండు దుఃఖముల నెట్లనుభవింపఁగలఁడని శంకింపఁగా, నట్టి శంకను మతాంతరులు చెప్పురీతిని పరిహరించుటకై:—

౨౪॥ సూ॥ అ వి రో ధ శ్చ న్ద న వ త్.

టీ॥ చందనవత్ = మంచి గంధమువలెనే, అవిరోధః-(సర్వాంగముల యందలి దుఃఖముల ననుభవించుట) విరుద్ధము కాదు.

తా॥ మంచి గంధమువలెనే జీవునికి సర్వాంగముల యందలి దుఃఖముల యనుభవము విరుద్ధము కాదు.

శ్రీ॥ భా॥ హరిచందనముయొక్క బిందువు శరీరమునందేదో యొక ప్రదేశమునందున్నను, అది శరీరముయొక్క యన్ని ప్రదేశములఁ బరిమళింపఁజేయు చందంబున, జీవుఁడును శరీరమునందేదో యొకప్రదేశమునందుండు వాఁడయినను, అతఁడు శరీరమునందలి సర్వభాగములయందుండు దుఃఖముల ననుభవించుచున్నాఁడు.

౨౫॥ సూ॥ అవస్థితివైశేష్యాదితిచేన్నాభ్యుపగమాద్ధృదిహి.

టీ॥ అవస్థితివైశేష్యాత్ =చందన బిందువునకు శరీరమునందొక ప్రదేశమున స్థితి విశేషముండుటవలన, ఇతిచేత్ =(అట్టిస్థితి విశేషము లేని జీవునకు చందనబిందు దృష్టాంతము వర్తింపదు) ఇట్లంటివేని, న = అది యుక్తము కాదు. హృది=హృదయమునందు, అభ్యుపగమాద్ధి=(జీవుని యునికి)అంగీకరింపఁబడెను గదా.

తా॥ చందన బిందువు కొక ప్రదేశమునందు స్థితి యున్నట్లు జీవునకును అట్టి స్థితి లేకుండుటంజేసి జీవుని చందనబిందువుతోఁ బోల్చుట పొసగదంటివేని, యట్లు చెప్పగిట్టదు. ఏలననిన, జీవుఁడు హృద్దేశమునయందు వాఁడగుట శ్రుతి సమ్మతమయినది కదా.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ హరిచందనము మొదలగు వాని బిందువు శరీరమునందేదో యొక ప్రదేశమునందుండుట కలదు. కావున నది శరీరమునందన్ని ప్రదేశము

లను పరిమళింపఁజేయు గాక. జీవుఁడన్ననో, శరీరమునం దేదోయొక ప్రదేశమున నున్నట్లు ఎచటను చెప్పియుండ లేదే యనిన.

సమాధానము.

అది యుక్తము కాదు. ఏలననిన ; "హృది హ్యయమాత్మా తత్రైకశతం నాడీనాం" (ఈ జీవుడు హృదయము నందుండువాఁడు అచట నూటయొక్క నాడులు కలవు.) అనెడి శ్రుతివాక్యము జీవుఁడు శరీరమునందు హృదయమనెడి యొక ప్రదేశముననుండు వాఁడని తెలుపుచున్నది. మఱియు వాజసనేయులు "కతమ ఆత్మా" (బృ.౬అ.3బ్రా.౭వా) అను వాక్యమున "జీవుఁడెట్టివాడు?" అని ప్రశ్నించి "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత ర్జ్యోతిః" అను వాక్యమున "ప్రాణములయందు విజ్ఞానవంతుడుఁగాను హృదయమునందుజ్యోతి స్స్వరూపుఁడుగా నుండువాఁడు యీ జీవాత్మ" అని ప్రత్యుత్తర మిచ్చియున్నారు. జీవాత్మ శరీరమునం దేదోయొక ప్రదేశమునందుండు వాఁడని తెలియ జేయుటకై మాత్రమే చందనబిందువును దృష్టాంతమునుగాఁ గొనియుంటిమి గాన, చందనబిందువుగూడ శరీరమునం దేదోయొక ప్రదేశవిశేషమున మాత్రమే యుండవలయునన్న నియమము లేదు.

అవతారిక:—జీవుఁడు శరీరమునం దేదోయొక ప్రదేశమునం దున్నను, శరీరమునందలి యన్ని ప్రదేశములయందును తన కార్యములనొనర్చుట సంభవమే యనెడి యంశమును గుఱించి సూత్రకారుఁడు స్వాభిప్రాయమును దెలియఁ జేయు చున్నాఁడు.

౨౬॥ సూ॥ గుణాద్వాలోకవత్.

టీ॥ వా=పైని గనఁబఱచినట్లు కాదు. ఆలోకవత్ = మణులు మొదలగువానికాంతి వలెనే, గుణాత్ = గుణవ్యాప్తి వలన

తా॥ మణులు మొదలగు వాని కాంతి వలె జీవుఁడును తన చైతన్య రూపమగు గుణముచే దేహమునందంతటను వ్యాపించి యున్నాఁడు.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "వా" అనుశబ్దము పైని గనఁబఱచిన మతము సరి కాదని తెలుపుచున్నది. స్వగుణమగు జ్ఞానముచే జీవాత్మ శరీరమందన్ని ప్రదేశములను వ్యాపించియుండునది. అదెటువలెననిన:—మణి, సూర్యుఁడు మొదలగునవి ఒక్కటియే ప్రదేశమునందున్నను, వాటిప్రకాశ మన్ని ప్రదేశములను వ్యాపించు చందంబున, హృదయమునందుండు వాఁడగు జీవాత్మ యొక్క జ్ఞానము శరీరము నందన్ని ప్రదేశములను వ్యాపించుచున్నది—మణి

లకాంతి మణులుండు ప్రదేశమునకంటె నితరప్రదేశములను వ్యాపించు చందంబున, జ్ఞాతయగు యీ జీవునియొక్క కాంతిగానుండు జ్ఞానమున్ను అతనికి యునికి భూతమగు హృదయమునకంటె నితరములగు ప్రదేశములను వ్యాపించుట యనునది యుపపన్నమగు ననెడియంశము మొదటి సూత్రమున ప్రతిపాదింపఁబడెను.

అవతారిక:—జ్ఞానము మాత్రమే యాత్మయని యింతకుఁ బూర్వము చెప్పఁబడియెను గదా! ఇట్లుండ, ఆత్మయొక్క స్వరూపమగు జ్ఞానము స్వరూపభిన్నమగు గుణమని యెట్లు చెప్పందగునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.—

౨౮॥ సూ॥ వ్యతిరేకో గన్ధవత్తథా చ దర్శయతి.

టీ॥ గంధవత్ = గంధమునకువలెనే, వ్యతిరేకః=గుణమునకు స్వాశ్రయమునకంటె వేఱయినదగుట, (సంభవతి = సంభవమగుచున్నది.)

తా॥ పృథివియొక్క గుణమగు గన్ధము పృథివికంటె వేఱయినదిగాఁ దెలియవచ్చు చందంబున, ఆత్మయొక్క గుణమగు జ్ఞానమాత్మకంటె వేఱైనది.

శ్రీ॥ భా॥ గన్ధము పృథివియొక్క గుణముగ దెలియవచ్చునదియయి, పృథివికంటె వేఱయినదగు చందంబున, "నేను తెలిసికొనుచున్నాను" అనుచో "తెలిసికొనుట" అనఁగా జ్ఞానము తెలివిగలవానియొక్క అనఁగా జ్ఞాతయగు జీవునియొక్క గుణముగాఁ దెలియవచ్చునదై జీవునికంటె వేఱయినదిగ సిద్ధమగుచున్నది "జానాత్యేవాయం పురుషః" అను శ్రుతివాక్యము సయితము (ఈయాత్మ తెలిసికొనుచున్నాఁడు) అనుటచే తెలివి యనునది యాత్మయొక్క గుణమనిగదా తెలుపుచున్నది.

౨౯॥ సూ॥ పృథగుపదేశాత్.

టీ॥ పృథక్=(జీవుఁడును అతని విజ్ఞానమును) వేఱుగా, ఉపదేశాత్ = శ్రుతియందుఁ జెప్పియుండుటవలన (జీవునికంటె విజ్ఞానము వేఱయినది)

తా॥ విజ్ఞానము జీవునికంటె వేఱయినదిగా శ్రుతియందుఁ జెప్పియుండుటవలన, విజ్ఞానము జీవునికంటె వేఱయినదని సిద్ధమగుచున్నది.

శ్రీ॥ భా॥ వాజసనేయులు "నహి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే" (బృ. ౬ అ. 3 బ్రా. 30 వా) (విజ్ఞాతయొక్క అనఁగా నాత్మయొక్క విజ్ఞానమునకెన్నఁడును లోపము లేదు) అనెడి వాక్యమున విజ్ఞానము నాత్మకంటె వేఱయిన దానినిగా స్పష్టముగాఁ దెలియఁజేసి యున్నారు గదా!

అవతారిక—అయినను; "యో విజ్ఞానే తిష్ఠన్" (బృ. ౫ అ. ౭ బ్రా. ౨౨ వా) (పరమాత్మ విజ్ఞానస్వరూపుఁడగు నాత్మయందుండి యున్నాఁడు) అనియు "విజ్ఞానం యజ్ఞం తనుతే" (తై. ఆ. ౫. అ. ౧) (విజ్ఞానస్వరూపుఁడగు జీవుఁడు యజ్ఞమును జేయుచున్నాఁడు) అనియు "జ్ఞానస్వరూపమత్యంత నిర్మలం" (విష్ణు. ౧ అం. ౨ అ. ౬ శ్లో.) (జీవుఁడు జ్ఞానస్వరూపుఁడును మిక్కిలి నిర్మలుఁడును) అనియు నీమొదలగు శ్రుతిస్మృతి వాక్యములు జ్ఞానమును జీవుని స్వరూపమునుగాఁ దెలుపుచున్నవేయని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౨౯॥ సూ॥ తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్.

టీ॥ తు = శంక యుక్తమైనది కాదు, తద్గుణ సారత్వాత్ = (జీవుఁడు) విజ్ఞానమును ప్రధానగుణమునుగా గలిగియుండుట వలన, ప్రాజ్ఞవత్ = పరమాత్మకువలె, తద్వ్యపదేశః = జీవునికి విజ్ఞానమను వ్యవహారము (సిద్ధ్యతి=సిద్ధించుచున్నది.)

తా॥ ఆనందము బ్రహ్మముయొక్క ప్రధాన గుణమగుటం జేసి బ్రహ్మమును ఆనందమని శ్రుతులయందు వ్యవహరించునట్లు, విజ్ఞానమున్ను జీవుని యొక్క ప్రధాన గుణమగుటం జేసి జీవుఁడును విజ్ఞానమని శ్రుతిస్మృతులయందు వ్యవహరింపఁబడుట యుక్తమే.

శ్రీ॥ భా॥ విజ్ఞానము జీవునియొక్క సారభూతమగు అనగా ప్రధానమగు గుణమగుటం జేసి జీవుఁడు విజ్ఞానమనియే శ్రుతిస్మృతులయందు వ్యవహరింపఁబడుచున్నాఁడు. అదెటువలెననిన, ఆనందము ప్రాజ్ఞునియొక్క అనఁగా పరమాత్మయొక్క సారభూతమగు గుణమయినందున "య ఏష ఆకాశ ఆనందో న స్యాత్" అనియు "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అనియు నీమొదలగు శ్రుతి వాక్యములయందు పరమాత్మ ఆనందమని పేర్కొనఁబడు చుండ లేదా? ఆనందము బ్రహ్మముయొక్క సారభూతమగు గుణమని "స ఏకో బ్రహ్మణ ఆనందః" (అట్టిదొకటి బ్రహ్మముయొక్క యానందము) అనియు "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" (బ్రహ్మముయొక్క ఆనందమును దెలిసికొనిన పురుషుఁడు దేనినుండియు భయపడఁడు) అనియు నీమొదలుగాఁగల శ్రుతివాక్యముల వలనఁ దెలియవచ్చుచున్నది.

☞ ఈ సూత్రమునకును మఱియొకవిధమునను వ్యాఖ్యానము చేయందగును.

రెండవ వ్యాఖ్యానము.

౨౯॥ సూ॥ త ద్గు ణ సా ర త్వా త్త ద్వ్య ప దే శః ప్రా జ్ఞ వ త్.

టీ॥ తు=శంక యుక్తమైనదికాదు, తద్గుణ సారత్వాత్ =(జీవుఁడు) విజ్ఞానమును సారభూతమగు గుణమునుగాఁ గలిగియుండుటవలన, ప్రాజ్ఞవత్ = పరమాత్మకునల్లె, తద్వ్యపదేశః=విజ్ఞానమనెడి వ్యవహారము (సిద్ధ్యతి=సిద్ధించుచున్నది.)

తా॥ జ్ఞానము బ్రహ్మముయొక్క ప్రధానగుణ మగుటంజేసి బ్రహ్మము జ్ఞానమని వ్యవహరింపఁబడునట్లు, విజ్ఞానమును జీవునియొక్క ప్రధానగుణమగుటంజేసి జీవుఁడును విజ్ఞానమని వ్యవహరింపఁబడుట యుక్తమే.

శ్రీ॥ భా॥ జ్ఞానము బ్రహ్మముయొక్క ప్రధానగుణమగుటంజేసి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములయందు బ్రహ్మము జ్ఞానమని వ్యవహరింపబడు చందంబున, విజ్ఞానమున్ను జీవునియొక్క ప్రధానగుణమగుటంజేసి, జీవుఁడును విజ్ఞానమని శ్రుతిస్మృతులయందు వ్యవహరింపఁబడుట యుక్తమే. జ్ఞానము బ్రహ్మముయొక్క ప్రధానగుణ మగునట్లు "సహ బ్రహ్మణా విపశ్చితా"అనఁగా "ముక్తపురుషుఁడు జ్ఞానవంతుడగు పరమాత్మతోఁగూడ భోగముల ననుభవించుచున్నాఁడు" అనియు "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అనఁగా "ఏపరమాత్మ సర్వమును గుఱించిన సామాన్యజ్ఞానమును విశేషజ్ఞానమునున్ను గలిగియున్నాఁడో" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

౩౦॥ సూ॥ యా వ దా త్మ భా వి త్వా చ్చ న దో ష స్త ద్ద ర్శ నా త్.

టీ॥ (విజ్ఞానస్య=విజ్ఞానము) యావదాత్మభావిత్వాచ్చ=ఎంతవఱకీ యాత్మయుండునో, అంతవరకు ఉండు నట్టి ధర్మమయినందునను, దోషః=(ఆత్మను విజ్ఞానమని వ్యవహరించుట) దోషము, న=కాదు, ఏలననిన, తద్దర్శనాత్ = లోకమునందట్లు గానఁబడుటవలన.

తా॥ విజ్ఞానము ఆత్మకు స్వాభావికమగు గుణమగుటంజేసి యాత్మను విజ్ఞానమని వ్యవహరించుట యొక దోషము కాదు. దృష్టాంతము:—లోకమునందును ఆవులకు స్వాభావికమయినధర్మము బోడియావులయందు సయితముండుటంజేసి, వాటినిగూడ ఆవులనిగదా వ్యవహరించుచున్నాము.

శ్రీ॥ భా॥ విజ్ఞానము ఆత్మయుండువఱకును ఉండునట్టిధర్మముగాన, ఆత్మను విజ్ఞాన మని వ్యవహరించుట యొక దోషము కాదు. దృష్టాంతము.—లోకము

నంచును గోవులకు స్వాభావికమగు ధర్మ మెప్పుడును గోవులయందుండు నది యగుటంజేసి, కొమ్ములులేని గోవు మొదలగు వానిఁగూడ "గోవు" అనియే వ్యవహరించుచున్నాము. జ్ఞానమువలె నాత్మయును స్వయంప్రకాశమయినందు నను శ్రుతులు ఆత్మను విజ్ఞానమని వ్యవహరించుచున్నట్లు సూత్రమునందుండు "చ" కారము సూచింపుచున్నది.

అవతారిక:—సుషుప్త్యాద్యవస్థలయందు జ్ఞానమున్నట్లు తెలియకున్నం దున, అది జీవుని స్వరూపముతో సంబంధించినదియగు అనఁగా జీవునికి స్వాభా వికమయిన ధర్మము కాదని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౩౧॥ సూ॥ పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్.

టీ॥ తు = శంక. యుక్తమైనది కాదు, పుంస్త్వాదివత్ =పుంస్త్వసూచక మగు ధాతువు వలెనే, సతః=సుప్త్యాద్యవస్థలయందు స్పష్టముగాఁ దెలియ రాకయున్నట్టి, తస్య = జ్ఞానమునకు, అభివ్యక్తియోగాత్ = ప్రకటీభావము గలుగుటవలన, జ్ఞాన మెప్పుడును ఉండినదే.)

తా॥ బాల్యాదులయందు స్పష్టముగాఁ దెలియరానిదై బీజరూపము గానున్న పుంస్త్వసూచకమగు ధాతువు యౌవనకాలమున స్పష్టముగాఁదెలియ వచ్చునట్లు గానే, సుషుప్త్యాద్యవస్థలయందు స్పష్టముగాఁ దెలియరానిదై బీజ రూపముగనున్న జ్ఞానము ప్రబోధ సమయమున స్పష్టముగాఁ దెలియునది యగుచున్నది.

శ్రీ॥ భా॥ సుషుప్త్యాద్యవస్థలయందు సయితము జ్ఞానము ఉండియేయున్నను, జాగరాద్యవస్థలయందు మాత్రమే యది యున్నట్లు స్పష్టమగుచున్నది. ఎటువలె ననిన, పుంస్త్వసూచకమగు ధాతువు బాల్యావస్థయందు సయితము ఉండి యున్నను, అది యౌవనావస్థయందు మాత్రమే యున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి ధాతువు బాల్యావస్థయందుండనిదై యౌవనావస్థయందు మాత్రము ఉం డునది యని చెప్పనేరము. ఏలనిన,—"తత్సప్తధాతు త్రిమలం ద్వియోని చతు ర్విధాహారమయం శరీరం" (శరీరము సప్తధాతువులతో అనఁగా రక్తము, ద్రవము, మాంసము, క్రొవ్వు, మజ్జ ఎముకలు రేతస్సు, అను వానితోఁ గూడు కొనినదియు, మూఁడువిధములగు మలములు గలదియు, రెండు విధములగు యో నులు గలదియు, చతుర్విధాహార మయమయినదియును) అనెడి శాస్త్రము వలన సప్తధాతువులతో నెప్పుడు చేరియుండుట శరీరముయొక్క స్వరూపమని తెలియు చున్నది.

"అహం" (నేను) అనఁబడునది సుషుప్త్యాద్యవస్థలయందు సయితము ప్రకాశించునది యని యింతకుఁబూర్వము ప్రతిపాదింపఁబడెను. దానియందు

ఉండియున్నట్టిదియగు జ్ఞానము జాగర్యాద్యవస్థలయందు ఘటాది పదార్థములను దెలిసికొొను నదిగాను తెలియవచ్చు చున్నది. జ్ఞాతృత్వము (తెలిసికొనునదియగుట) యీ మొదలగునవి యాత్మయొక్క గుణములని యింతకు పూర్వమే ప్రతిపాదింపబడియెను. కావున జ్ఞాతృత్వమే యాత్మయొక్క స్వరూపము. యిట్లు జ్ఞాతృత్వస్వరూపుడగు ఆత్మ యణుపరిమాణుడు.

మఱియు "నప్రేత్య సంజ్ఞాస్తి" అనుశ్రుతివాక్యము ముక్తావస్థయందు జీవునికి జ్ఞానము లేదని తెలుపుచుండ లేదు. "ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యే వాను వినశ్యతి" అను వాక్యమునఁ జెప్పియున్నప్రకారము సంసారావస్థయందు పృథివ్యాది భూతకార్యమగు శరీరముయొక్క యుత్పత్తినాశములఁబట్టి జీవుడును ఉత్పత్తినాశములు గలవాఁడుగాఁ దెలియవచ్చుట యనునది మోక్షావస్థయందు జీవునికి లేదని తెలియఁజేయుచున్నది. ఏలననిన, ఈపైవాక్యము "న పశ్యోమృత్యుం పశ్యతి న రోగం నోచ దుఃఖతాం సర్వం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః" (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౨ వా) (పరమాత్మను సాక్షాత్కరించిన ముక్తపురుషుఁడు జన్మమరణాది రూపమగు సంసారమును, రోగమును, దుఃఖమునున్ను అనుభవింపడు. ఈతఁడు సర్వము ననుభవించు చున్నాఁడు. మఱియు ఈతఁడు సర్వమును బొందుచున్నాఁడు) అనియు "నోపజనం స్మరన్నిదం శరీరం" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౩ వా) (ముక్తపురుషుఁడు తానింతకు పూర్వము ధరించిన శరీరమును మరిచిపోవుచున్నాఁడు) అనియు "మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౫ వా) (ముక్తపురుషుఁడు మనస్సుచే కల్యాణగుణములను జూచి వాని ననుభవించుచున్నాఁడు) అనియు, నీమొదలగు వాక్యములతో నేకార్థముగలదయినందునఁ గూడ ఇట్లు తెలియుచున్నది.

అవతారిక:—జ్ఞానమే యాత్మయగు పక్షమున నట్టియాత్మ సర్వగతుఁడని యంగీకరించుటచే నొకదోషము ప్రసక్తించుననుటకై,

**౩౨॥ సూ॥ నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసఙ్గోఽన్యతరనియమోవాన్యథా.**

టీ॥ అన్యథా=ఆత్మ సర్వగతుఁడగు పక్షమునను, జ్ఞానమాత్ర స్వరూపుఁడగు పక్షమునను, నిత్యోపలబ్ధ్య నుపలబ్ధి ప్రసఙ్గః = సర్వదా యుపలబ్ధియు, (తెలియవచ్చుటయు), అనుపలబ్ధియును (తెలియరాకుండుటయును) ఏకకాలమున ప్రసక్తించుట (స్యాత్=సంభవించును,) వా = కాక, అన్యతరనియమః = ఉపలబ్ధ్యనుపలబ్ధులలో నెద్దియయిన నొక్కటి మాత్రమే, (స్యాత్=ఎప్పుడును కలుగవలసివచ్చును.)

తా॥ ఆత్మ సర్వగతుఁడగు పక్షమునను, జ్ఞానమాత్ర స్వరూపుఁడగు పక్షమునను న్ను ఆత్మోపలబ్ధ్యనుపలబ్ధులకు నిత్యము సమభావము గాని, లేక, వానిలో నెద్దియయిన నొక్కటి మాత్రమే కలుగుట గాని ప్రసక్తించును.

శ్రీ॥ భా॥ ఆత్మ యణుపరిమాణుఁడు కాక, సర్వత్రయుండువాఁడగు పక్షమునను, అట్టి యాత్మ జ్ఞానమాత్రస్వరూపుఁడగు పక్షమునను, లోకమునందు ఆత్మోపలబ్ధియు (శరీరాదులయందు ఆత్మ ప్రకాశించుటయు) ఆత్మానుపలబ్ధియు (గంగాతీరాదులయందుఁ బ్రకాశింపక పోవుటయును) ఈ రెండును ఏకకాలమునఁ గలుగుట గాని, అథవా, యీ రెంటిలో, నెద్దియో యొక్కటి మాత్రము నిత్యముగ గలుగుట గాని ప్రసక్తించును. ఎట్లనిన, లోకమునందు ఆత్మోపలబ్ధి కలుగుటకును, అది కలుగకపోవుటకును సర్వగతమై జ్ఞానమాత్రస్వరూపమగు నాత్మయే హేతువుగా నుండవలయును. ఇట్లుండ, ఈయాత్మ లోకమునందు ఆత్మోపలబ్ధి కలుగుటకు మాత్రమే హేతువయినదా? కాక, అట్టియాత్మోపలబ్ధి కలుగకపోవుటకు మాత్రమే హేతువయినదా ? కాక, ఈ రెంటికిఁగూడ హేతువయినదా ? అది యీ పై రెంటికిని హేతు భూతమయినదని యంటివేని, లోకమునం దన్ని తావులను ఏకకాలముననే యాత్మోపలబ్ధి కలుగుటయును, కలుగకపోవుటయును ప్రసక్తించును. (అట్లుండుట యసంభవము), అట్లు కాక, అది లోకమునందు ఆత్మోపలబ్ధి కలుగుటకు మాత్రమే హేతు వగుచున్నదా? అట్లంటివేని, సర్వము సర్వత్ర యుపలభ్య మానమగు చుండవలయునే కాని, యేదియు నెచ్చటను ఎన్నఁడును ఉపలభ్యమానము కాకుండ యుండకూడదని ప్రసక్తించును. (అట్లుండుటయు నసంభవము) అట్లు కాక, అది లోకమునందు ఆత్మోపలబ్ధి కలుగకపోవుటకు మాత్రమే హేతు వగుచున్నదంటివేని, లోకమునం దేదియు నెచ్చటను ఎన్నఁడును ఉపలభ్యమానము కాకుండనే యుండవలయునని ప్రసక్తించును. (అట్లుండుటయు నసంభవము). మా మతముననో (విశిష్టాద్వైత సిద్ధాంతముననో) ఆత్మ శరీరములోను మాత్రమే యుండువాఁడగుటం జేసి, యచటను మాత్రమే ఆత్మోపలబ్ధి కలుగుచున్నదనియు, శరీరేతర ప్రదేశములయందట్టి యుపలబ్ధి కలుగుచుండ లేదనియు నొక వ్యవస్థ సిద్ధించుచున్నది.

ఆత్మలు జడపదార్థము లనియు, ఉపలబ్ధి యింద్రియాధీనమనియు నంగీకరించునట్టి వైశేషికుల మతమునఁగూడ ఆత్మలు సర్వత్రయుండునవి యగుటం జేసి యవి యన్ని తావుల నన్ని యింద్రియములతోను నిత్యము సంబంధించి యుండునవి గాన, అదృష్టాదినియమ మెద్దియును లేదు. అందువలన ఈపైని నిరూపింపఁబడిన దోషములు వారిమతమునను ప్రసక్తింపక మానవు.

జ్ఞాధికరణము ముగిసెను.

## కర్త్రధి కరణము.

### 33॥ సూ॥ కర్తా శాస్త్రార్థవత్త్వాత్.

టీ॥ శాస్త్రార్థవత్త్వాత్=శాస్త్రము సార్థకమగుటవలన, కర్తా=జీవుఁడు కర్త.

తా॥ జీవుఁడు కర్త. జీవుఁడు కర్తయగు పక్షమున నే కదా, "స్వర్గ కామో యజేత" ఇత్యాది శాస్త్రవిధు లర్థయుక్తములగును.

శ్రీ॥ భా॥ జ్ఞాతయగు ఈ యాత్మ అణుపరిమాణుఁడని పూర్వాధికరణ మునఁ బ్రతిపాదింపఁబడియె. అట్టి యాత్మయే కర్తా? (కార్యములను జేయు వాఁడా?) లేక తాను స్వయముగా కర్త కాక, యచేతనములగు గుణముల యందుండు కర్తృత్వమును తనయందు (భ్రాంతివశమున) ఆరోపించుకొను చున్నాఁడా? అనెడి యంశమునుగుఱించి యీయధికరణమున విచారింపఁబడును.

#### పూర్వపక్షము.

ఉపనిషత్తులు ఆత్మయందు కర్తృత్వమును నిషేధించి, దానిని గుణముల యందుండునట్టి దానినిగాఁ దెలుపుచున్నందున, ఆత్మ కర్తకాడనుట యుక్తము. ఎట్లనిన, కాఠకులు ''న జాయతే మ్రియతే వా విపశ్చిత్'' (కఠ. ౨ వ. ౧౮ వా.) (జీవుఁడెన్నఁడును పుట్టువాఁడును నశించువాడును కాడు) అనుటచే ప్రకృతి ధర్మములగు జననమరణాదులు జీవుని యందుండునవి కావని తెలుపుట యే కాక, "హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతం ఉభౌతౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే" (కఠ. ౨వ. ౧౯వా) (ఒకనిఁ జంపుచున్నానని గాని, ఒక నిచేఁజంపఁబడుచున్నానని గాని తలంచు వారిరువురు ఆత్మ స్వరూపము తెలియని వారు. ఒకఁడు మఱియొకనిఁ జంపుటయును లేదు. ఒకనిచే మఱియొక్కఁడు చంపఁ బడుటయును లేదు. అనఁగా తనను చంపువానినిగా నెఱుఁగువాఁడు ఆత్మస్వరూపము తెలియనివాఁడు) అనుటచే హననాదిక్రియల యందాత్మకుఁ గర్తృత్వము లేదనియును తెలియఁజేయుచున్నారు. మఱియు శ్రీభగవద్గీతల యందు,

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాహమితిమన్యతే॥

భ. గీ. 3 అ. ౨౭ శ్లో.

తా॥ అన్ని విధములను [1]ప్రకృతియొక్క గుణములచేతనే చేయఁబడు చున్న కర్మములంగూర్చి, అహంకారముచే మోహమును బొందిన యంతఃకర ణముగలవాఁడు "నేను కర్తను" అని తలంచుచున్నాఁడు.

(1) సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థప్రకృతి యనఁబడును. ఈయధికరణమునందలి పూర్వపక్షము సాంఖ్యమతస్థులది.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
భ. గీ. ౧౪ అ. ౧౯ శ్లో.

తా॥ గుణంబులకంటె వేఱొక్కఁడు కర్తకాడని దెలిసికొనుచున్నాఁడో, అనఁగా గుణములే కర్త లనుకొనుచున్నాఁడో,

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥
భ. గీ. ౧౩ అ. ౨౦ శ్లో.

తా॥ కార్యకారణముల నన్నింటి నొనర్చుటయందుఁ బ్రకృతియే హేతు వగుచున్నది. జీవుఁడు సుఖదుఃఖరూపములగు కర్మఫలముల ననుభవించుట యందు హేతు వగుచున్నాఁడు.

ఇట్లు చెప్పియుండుటచే, జీవుఁడు స్వయముగ కర్తకాడనియు, "నేను కర్తను" అనెడి యభిమానము మోహమాత్రమనియు, ప్రకృతియొక్క గుణములే కర్తలనియును శ్రీ భగవద్గీతలయందు భగవంతుఁడు స్వయముగానే తెలిపి యున్నాఁడనిన.

సిద్ధాంతము.

అది యుక్తముకాదు. జీవుఁడే కర్త యనుట యుక్తము. ఏలననిన, "స్వర్గకామో యజేత" (స్వర్గమును గోరువాఁడు యజ్ఞము చేయవలయును) అనియు "ముముక్షుర్బ్రహ్మోపాసీత" (మోక్షమును గోరువాఁడు బ్రహ్మమును ఉపాసింపవలయును) అనియు ఈ మొదలగు శాస్త్రవిధులు స్వర్గమోక్ష రూప ఫలముల ననుభవించునట్టి అనఁగా భోక్తయగు జీవునే యజ్ఞాదికర్మముల నొనర్చు వానినిగా అనఁగా కర్తనుగాఁగొని, జీవుని అట్టి కార్యములయందు నియమించుచు న్నవి. జీవుఁడు కర్త యగు పక్షముననే శాస్త్రవిధులన్నియును సార్థకము లగు చున్నవి. జీవుఁడు కర్త కాక, జీవేతరములును, అచేతనములునగు గుణములు కర్త లగుపక్షమున, శాస్త్రవిధులు గుణేతరుఁడగు జీవుని కర్తృత్వమున నియమింప కుండవలయునే? "శాసనాత్ శాస్త్రం" అనెడి శాస్త్రశబ్దోత్పత్తిని బరిశీలిం చితిమేని, శాస్త్రమనఁగా, శాసనము. శాసనమనఁగాఁ బ్రవర్తింపఁజేయుట యని తెలియుచున్నది. యజ్ఞము స్వర్గసాధనమనియు బ్రహ్మోపాసనము మోక్ష సాధనమనియు నిర్విధముగ బోధించుటచే శాస్త్రము "ప్రవర్తింపఁ జేయు నది" యనిపించుకొనుచున్నది. అచేతనమగు ప్రకృతియన్ననో, యట్లుబోధింప శక్యమైనది కాదు. కావున భోక్తయగు చేతనవస్తువే కర్తయనగునేని, శాస్త్రము సార్థకమగును. కనుకనే పూర్వమీమాంసకులును "శాస్త్రఫలం ప్రయోక్తరి" (కర్మముల నొనర్చువాఁడే కర్మఫలము ననుభవించు వాఁడు) అని చెప్పుచున్నారు.

పూర్వపక్షమునందు ఉదహరింపఁబడిన "హన్తాచేన్మన్యతే" ఇత్యాది కఠోపనిషద్వాక్యము హననాదిక్రియలయందు జీవునికి కర్తృత్వము లేదని తెలుపుచుండలేదు. అయితే జీవుఁడు నిత్యుఁడయినందున జంపఁబడువాఁడు కాడని తెలుపుచున్నది, "ప్రకృతేః క్రియమాణాని" ఇత్యాది శ్రీభగవద్గీతావాక్యము సాంసారిక కార్యములయందు జీవునికిఁగల కర్తృత్వము సత్వ రజ స్తమో గుణ సంబంధమూలమని తెలుపుచు, అందువలన అట్టి కర్తృత్వ మతని స్వరూపము గాదని చెప్పుచున్నది. అనఁగా సంసారావస్థయందు "ఇది కూడును, ఇది కూడదు" అనెడి వివేకముతోఁ బ్రవర్తించుట యనఁబడునది సత్త్వరజస్తమో గుణములనుబట్టి యుండునది యని చెప్పఁబడియె. కావుననే, శ్రీ భగవద్గీతలయందే మఱియొక తావున, "కారణం గుణసంగోఽస్యసదసద్యోనిజన్మసు" (భ. గీ. ౧౩ అ. ౨౧ శ్లో.) (సత్వరజస్తమో గుణసంబంధము జీవునికి పుణ్యాపాపయోనులయందు జన్మమును గలుగఁజేయునట్టి హేతువగుచున్నది) అని చెప్పఁబడియె. మఱియు ఇచటనే ఆత్మకు కర్తృత్వము కలదని యంగీకరించి చెప్పుసందర్భమున,

శ్లో॥ తత్రైవంసతి కర్తార మాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృత బుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః॥

భ. గీ. ౧౮ అ. ౧౬ శ్లో.

తా॥ ఎవ్వఁ డశిక్షితబుద్ధి గలవాఁడగుటవలన, అనఁగా వస్తుస్థితిని దెలిసికొనెడి జ్ఞానము లేనివాఁడగుటచే, ఈ యయిదింటిలో నాత్మను మాత్రము కర్తనుగాఁ దలఁచుచున్నాఁడో, ఆదుష్టబుద్ధిగలవాఁడేదియు నెఱుఁగడు.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధా చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥

భ. గీ. ౧౮ అ. ౧౪ శ్లో.

తా॥ శరీరము, జీవుఁడు, ఇంద్రియములు, ప్రాణాపానాది వాయువులు అదృష్టము, అను నీయయిదఁనుచేరి కర్త యగుచున్నవి.

ఇట్లు చెప్పుటచే ఆత్మకుఁగల కర్తృత్వము ఈపైశ్లోకమున శరీరము మొదలు అదృష్టమువరకును పేర్కొనఁబడిన వాని నపేక్షించియుండఁగా, ఆత్మమాత్రము కర్త యనుకొనువాఁడు ఆత్మస్వరూపము తెలియనివాఁడని చెప్పఁబడియె.

## ౩౪॥ సూ॥ ఉ పా దా నా ద్వి హా రో ప దే శా చ్చ.

టీ॥ ఉపాదానాత్=కరణసంగ్రహము వలనను, విహారోపదేశాచ్చ= విహారము కలదని శ్రుతియందుఁ జెప్పియుండుటవలననున్ను (జీవుఁడు కర్తయే).

తా॥ స్వప్నావస్థయందు జీవుఁడు ఇంద్రియముల నుపసంహరించుకొనుచున్నాఁడనియు, అతఁడు శరీరమునం దచ్చటచ్చట స్వేచ్ఛగ విహరించుచున్నాఁడనియును శ్రుతియందుఁ జెప్పియుండుటచే జీవుఁడు కర్తయని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ వాజసనేయులు "స యథా మహారాజః స్వే జనపదే యథాకామం పరివర్తతే, ఏవమేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే" (బృ. ౪ అ. ౧ బ్రా. ౧౮ వా) (ఒక గొప్పరాజు భృత్యులఁగొని తన దేశమునందు స్వేచ్ఛగ సంచరించుచు చందంబున, ఈజీవుఁడును వాగాదీంద్రియములఁగొని దేహమునందు తన యిష్టప్రకారము సంచరించుచున్నాఁడు) అని పఠించుటచే జీవుఁడు ప్రాణములను గ్రహించు విషయమునను, శరీరమునందు విహరించువిషయమునను కర్తయని తెలియఁజేసి యున్నారు.

౩౫॥ సూ॥ వ్యపదేశాచ్చ క్రియాయాం న చేన్నిర్దేశవిపర్యయః.

టీ॥ క్రియాయాం = లౌకిక వైదికక్రియలయందు, వ్యపదేశాత్-చ విజ్ఞానస్వరూపుఁడగు జీవునికి కర్తృత్వము చెప్పియున్నందున, జీవుఁడు కర్త, న చేత్ =విజ్ఞానపదముచేఁ జెప్పఁబడినది జీవుఁడుకాక, అది బుద్ధియంటివేని, నిర్దేశవిపర్యయః=శ్రుతియందు "విజ్ఞాన" శబ్దమును ప్రథమావిభక్తియందుఁ బ్రయోగింపక తృతీయా విభక్తియందుఁ బ్రయోగించియుండ వలసివచ్చును.

తా॥ "విజ్ఞానం యజ్ఞం తనుతే" అనుచో, విజ్ఞానస్వరూపుఁడగు జీవుఁడు యజ్ఞాదికర్తగా నిర్దేశింపఁబడెను గాన, జీవుఁడు కర్త. అట్లు నిర్దేశింపఁబడినవాఁడు జీవుఁడుకాడు, అది బుద్ధియంటివేని, అట్లయినచో "విజ్ఞానం" అను శబ్దమును ప్రథమావిభక్తియందుఁ బ్రయోగింపక తృతీయావిభక్తియందుఁ బ్రయోగించి యుండ వలసి వచ్చును.

శ్రీ॥ భా॥ తైత్తిరీయులు "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపిచ" (తై. ఆ. ౫ అ. ౧ వా.) (విజ్ఞాన స్వరూపుఁడగు జీవుఁడు యజ్ఞమును జేయుచున్నాఁడు. ఇతరములగు లౌకికవైదికకర్మములనుగూడ జేయుచున్నాఁడు) అనుటచే లౌకికవైదిక కర్మములయందు జీవునికి కర్తృత్వము గలదని చెప్పియున్నందునను, జీవుఁడు కర్త యని తెలియుచున్నది. అయితే యీపై శ్రుతియందుండు "విజ్ఞాన"శబ్దము అంతఃకరణమగు బుద్ధిని తెలుపునది యంటివేని, యట్లు చెప్పుట కవకాశము లేదు. ఏలననఁగా, విజ్ఞానమనఁగా బుద్ధియగు పక్షమున, బుద్ధియనఁబడునది యొకసాధనవిశేషము గాన, దానిఁదెలుపునదియగు "విజ్ఞానం" అను శబ్దము "విజ్ఞానేన" అనియిట్లు తృతీయావిభక్తి యందుండి యుండవలసివచ్చును. అట్లుండి యుండ లేదు. కనుక నిచట విజ్ఞాన మనఁగా జీవుఁడని యెఱుంగునది.

సూ॥ ౩౬॥ ఉ ప ల బ్ధి వ ద ని య మః.

టీ॥ ఉపలబ్ధివత్ = ఉపలబ్ధ్య నుపలబ్ధులకువలె, అనియమః=వ్యవస్థ లేక పోవును.

తా॥ ఆత్మ సర్వగతుఁడై జ్ఞానమాత్రస్వరూపుఁడునగు పక్షమున, ఉప లబ్ధ్యనుపలబ్ధులకు వ్యవస్థలేకపోవుట ప్రసక్తించునట్లు, ఆత్మ కర్త కాక, ప్రకృతియే కర్త యగు పక్షమున, కర్మానుభవము విషయమై యొక వ్యవస్థ లేక పోవును.

శ్రీ॥ భా॥ ఆత్మ కర్త కాడను పక్షమున, నొక దోషము సయితము ప్రసక్తించును. ఎట్లనిన, ఆత్మ విభువగు పక్షమున, ఆత్మోపలబ్ధి కలుగుటకును కలుగకపోవుటకును ఒక వ్యవస్థలేకపోవు చందంబున, ఆత్మ కర్త కాక, సత్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతియే కర్త యగుపక్షమున, నట్టి ప్రకృతి జీవులందఱితోను సర్వసామాన్యముగ సంబంధించి యున్నందున, దీనిచే నొనర్పఁబడు కర్మములందఱిచే ననుభోక్తవ్యములని గాని, కాక, అవి వారిలో నొక్కనిచేతను అను భోక్తవ్యములు కావని గాని, ప్రసక్తించును. అందువలన, ఈ కర్మములు వీరిచే ననుభోక్తవ్యములనియు, ఈ కర్మములు వీరిచే నను భోక్తవ్యములు కావనియు నిట్టి యొక వ్యవస్థ లేక పోవుటయును ప్రసక్తించును. మఱియు ఆత్మ సర్వవ్యాపి యగు పక్షమున, నతఁడు సర్వశరీరములతోను సర్వసాధారణముగా సంబంధించియున్నందున, ఏ జీవుఁడే శరీరముననుండి యే యన్తఃకరణాదులతో నేకర్మము నొనర్చునో, ఆ జీవుఁడే యాయన్తః కరణాదులతోనే యా కర్మ ఫలముల ననుభవింపవలయు ననెడి వ్యవస్థయును లేకపోవును. ఏలననిన, అన్తఃకరణాదుల భేదమునుబట్టియేగదా యట్టి వ్యవస్థయొక్కటి యుండకూడును.

౩౭॥ సూ॥ శ క్తి వి ప ర్య యా త్.

టీ॥ శక్తి విపర్యయాత్ =భోక్తృత్వశక్తి వ్యత్యస్తమగుటవలన (జీవుఁడే కర్త.)

తా॥ బుద్ధి కర్తయగు పక్షమున, ఆత్మదియగు భోక్తృత్వ శక్తి సయితము బుద్ధిదే కావలసివచ్చును. కావున జీవుఁడే కర్త.

శ్రీ॥ భా॥ కర్తకంటె భోక్త వేఱగుట యసంభవము. కావున, బుద్ధి కర్త యగు పక్షమున, భోక్తృత్వశక్తియును బుద్ధిదే కావలసివచ్చును. అట్లయినచో, ఆత్మయందు భోక్తృత్వశక్తియును లేక పోవును. అయితే, ఆత్మయందు భోక్తృత్వశక్తి యున్న పక్షమునఁ గదా, యట్టి భోక్తృత్వశక్తినిబట్టి ఆత్మయనునది

యొకటి యున్నదనుకొనుట కొక ప్రమాణ ముండును. భోక్తృత్వ శక్తియును బుద్ధియందే యుండునది యగునెడల, ఆత్మయనునది యొకటి యున్నదనుకొనుటకు ప్రమాణము సయితము లేకపోవును. ఆత్మయందుండు భోక్తృత్వశక్తిని బట్టియే గదా ప్రకృతికంటెను వేఱుగ నాత్మయనున దొకటి కలదని "పురుషోఽస్తి భోక్తృభావాత్" (సాంఖ్య. ౧౭ కారిక) అనుతావున సాంఖ్యులు అంగీకరించి యున్నారు.

## ౩౮॥ సూ॥ సమాధ్యభావాచ్చ.

టీ॥ సమాధ్యభావాచ్చ=సమాధిలేక పోవుటవలనను (జీవుఁడు కర్త.)

తా॥ ప్రకృతికంటె వేఱనెడి నిశ్చలబుద్ధి ప్రకృతికిఁ గలుగకపోవుట చేతను జీవుఁడే కర్త.

శ్రీ॥ భా॥ బుద్ధి అనఁగా ప్రకృతియే కర్తయగు పక్షమున, నదియే మోక్ష సాధనభూతమగు సమాధి నొనర్చుటయందుఁగూడ కర్తయని చెప్పవలసివచ్చును. ప్రకృతికంటెను వేఱనెడి భావనను గదా సమాధి యందురు. ప్రకృతికంటె వేఱనుభావన ప్రకృతికే యుండుట యసంభవము గాన, నాత్మయే కర్తయనుట యుక్తము.

అవతారిక:—ఆత్మ కర్తయగు పక్షమున, నది యెప్పుడును కర్త గానే యుండవలసి వచ్చును. అనఁగా నెప్పుడును దేనినయినను చేయుచునే యుండవలయును. అట్లయినచో, అట్టి కర్తృత్వమునుండి యాత్మకు విరామ మెన్నఁడును లేకపోవునని శంకింపఁగా, నట్టి శంకను నిరాకరించుటకై.

## ౩౯॥ సూ॥ యథా చ తక్షోభయథా.

టీ॥ యథా=ఎట్లు, తక్షా=వడ్రంగి, ఉభయథాచ=కర్తగను (పనిచేయువాఁడుగను) అకర్తగను (పని చేయని వాఁడుగను) కానఁబడుచున్నాఁడో, (అట్లే జీవుఁడును కర్తగాను, అకర్తగానును కానఁబడుచున్నాఁడు.)

తా॥ లోకమున వడ్రంగి, వాస్యాద్యుపకరణములుగలవాఁడైనను, స్వేచ్ఛానుగుణముగ కర్తగను (దేనినైనను చేయువాఁడుగను) (అకర్తగను, చేయకుండువాఁడుగను) గానఁబడుచుండు చందంబున, జీవుఁడును స్వేచ్ఛానుగుణముగ కర్తగను అకర్తగను గానఁబడుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ వాగాదీంద్రియములనెడి యుపకరణములతోఁ గూడియుండువాఁడైనను, ఆత్మ దేనినైనను చేయుట కిచ్ఛగలిగినపుడు, చేయుచున్నాఁడు. అట్టి యిచ్ఛ కలుగనపుడు, చేయఁడు. ఎటువలెననిన, వడ్రంగి, ఉలి, బాడిసె మొదలగు సాధనములుగల వాఁడైనను, ఇచ్ఛవచ్చినప్పుడు దేనినైన నొక పనిముట్టును

జేయుచున్నాఁడు. అట్టి యిచ్ఛ కలుగనపుడు, ఊరక యుండును. అచేతనమగు బుద్ధియే కర్తయగు పక్షమున మాత్రమే, దేనినైన చేయుటకును చేయకపోవుట కును నియామకములగు భోగవాంఛాదులు దానికి లేనందున, నది యెప్పుడును కర్త గానే అనఁగా దేనినైన నొనర్చునది గానే యుండవలసివచ్చునని ప్రసక్తించును.

కర్త్రధికరణము ముగిసెను

---

పరాయత్తాధి కరణము.

౪౦॥ సూ॥ ప రా త్తు త చ్ఛ్రు తేః.

టీ॥ తు=పూర్వపక్షము యుక్తము కాదు. తత్=జీవునికిఁ గల కర్తృత్వ ము (అస్య=ఈ జీవునికి) పరాత్=సర్వేశ్వరుని వలననే, భవతి=కలుగు చున్నది. ఏలననఁగా, శ్రుతేః=అట్లు శ్రుతియందుఁ జెప్పియుండుటవలన.

తా॥ సర్వేశ్వరుని వలననే జీవునికి కర్తృత్వము ప్రాప్తమగుచున్నది. అట్లే కదా శ్రుతి వాక్యము తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ జీవుఁడు కర్తయని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడెను. అట్లు జీవునికిఁ గల కర్తృత్వమును గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

సంశయము

జీవుఁడు కర్త యనఁగా తానే స్వతంత్రముగ కార్యముల నొనర్చు వాఁడనియా? లేక, పరమాత్మయొక్క యిచ్ఛ కధీనుఁడై కార్యముల నొనర్చు వాఁడనియా?

పూర్వపక్షము

జీవుఁడు కర్త యనఁగా తానే స్వతంత్రముగ కార్యముల నొనర్చువాఁ డనుట యుక్తము. ఈతఁడు పరతన్త్రముగ అనఁగా పరమాత్మయొక్క యిచ్ఛ కధీనముగ కార్యముల నొనర్చు వాఁడగు పక్షమున "ఈ కార్యమును జేయుము" "ఈ కార్యమును జేయకుము" అని యివ్విధములగు విధి నిషేధశాస్త్రము లనావశ్యకము లగును. ఏలననిన, స్వబుద్ధిచే దేనినైన నొనర్చువానిఁ గదా "ఈ కార్యమును జేయుము" "ఈకార్యమును జేయకుము" అని యివ్విధమున నియ మింపవలసి యుండును. కావున జీవుఁడు కర్తయనఁగా స్వతంత్రముగ కార్యముల నొనర్చు వాఁడనుట యుక్తమనిన.

సిద్ధాంతము

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, శ్రుతులు "అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" (తై. ఆ. 3 ప్ర. ౧౧ అను) అనువాక్యమున

"పరమాత్మ లోపల ప్రవేశించి జనులను ప్రవర్తింప జేయుచునందఱికి నాత్మగ నుండువాఁడు" అనియు "య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మాఽన్తర్యా మ్యమృతః" (బృ. ౫ అ. ౭ బ్రా. ౨౨-వా) అను వాక్యమున "ఎవఁడు ప్రత్య గాత్మయందున్న వాఁడై, ప్రత్యగాత్మ లోపలనుండి, ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁ బడక, ప్రత్యగాత్మను శరీరముగాఁ గలవాఁడై, ప్రత్యగాత్మయందుండి, ప్రత్యగా త్మను నియమించుచున్నాఁడో, వాఁడు నీయొక్క యాత్మయు, అన్తర్యామియు, అమృతస్వరూపుఁడును" అనియు నివ్విధమునఁ జెప్పియుండుట వలనను, శ్రీ భగవ ద్గీతలయందు, "సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞానమపోహ నం చ" (భ.గీ. ౧౫అ. ౧౫ శ్లో.) "ఓ అర్జునా! నేనందఱియొక్కయును హృదయ మునందుండువాఁడను. స్మరణంబును, జ్ఞానంబును, అజ్ఞానంబును నావలనఁగలుగు చున్నవి" అనియు "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామ యన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా" (భ. గీ. ౧౮ అ. ౬౧ శ్లో.) అను శ్లోకమున "ఓ అర్జునా! ఈశ్వరుండు సమస్త భూతములయొక్కయును హృదయ ప్రదేశమునందుండి తనయొక్క జ్ఞానముచే జనులనందఱిని యన్త్రము నందుండు వానివలె ప్రవర్తింపఁ జేయుచున్నాఁడు" అనియు నిట్లు చెప్పియుం డుటవలనను పరమాత్మ జీవులలోనంతరాత్మగానుండి జీవులను ఆయాకార్యముల యందుఁ బ్రవర్తింపఁజేయుచున్నట్లు తెలియుచుండుటచే జీవుని కర్తృత్వము పరమాత్మయొక్క యిచ్ఛ కధీనమైనదనుట యుక్తము.

అవతారిక:—జీవుఁడు తానొనర్చునట్టి కార్యములను గుఱించి స్వతం త్రుఁడు కానిచో, విధి నిషేధశాస్త్రము లనావశ్యము లగునని యీపైని గానఁ బఱచిన శంకను పరిహరించుటకై.

<u>౪౧॥ సూ॥ కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః.</u>

టీ॥ తు = పూర్వపక్షము యుక్తము కాదు, (ఏలననఁగా) విహితప్రతి షిద్ధావైయర్థ్యాదిభ్యః=విధి నిషేధశాస్త్రముల సార్థక్యాదులవలన, కృతప్రయ త్నాపేక్షః=(సర్వేశ్వరుఁడు) జీవుని ప్రయత్నమును అపేక్షించియుండు వాఁడు (అని తెలియుచున్నది).

తా॥ జీవుఁడు చేయు ప్రయత్నముల నపేక్షించియే సర్వేశ్వరుఁడు వానిని తన వ్యాపారములయందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు. ఇట్లంగీకరించినచో, విధి నిషేధశాస్త్రములు సార్థకము లగును.

శ్రీ॥ భా॥ సర్వకార్యములవిషయమునను జీవునిచేఁ జేయఁబడిన యుద్యమముల నపేక్షించియే వాని కంతరాత్మగానుండు పరమాత్మ వాని యుద్యమముల నంగీకరించుటచే వానిని ఆ యావ్యాపారములయందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు. అనఁగా పరమాత్మయొక్క యనుమతి లేకయే, జీవుఁడెట్టి కార్యమునను బ్రవర్తింప నేరడనుట. అది యెట్లు తెలియునంటివేని, అట్లగు పక్షముననే విధి నిషేధ శాస్త్రములు సార్థకములగుటనుబట్టి యట్లు తెలియుచున్నది. (సూత్రమునందుండు "ఆది" శబ్దముచే నిగ్రహాను గ్రహాదులు సయితము గ్రహింపఁబడుచున్నవి.) అదెటువలెననిన, ఇద్దఱి భాగస్థులకు ఉమ్మడిగానుండు ధనమును వారిలో నొక భాగస్థుఁడు మాత్రము తన భాగమును వేఱొక్కని కిచ్చుట కిచ్ఛయించినచో, రెండవ భాగస్థుని యనుమతి లేకుండ ఇవ్వజాలఁడు. అయితే రెండవ భాగస్థుని యనుమతిని సంపాదించుకొనుట తన స్వప్రయత్నముచేతనే గాన, తానే యందువలనఁ గలుగునట్టి లాభాలాభములకు పాత్రుఁడగును గాని, యందుల కంగీకరించిన రెండవ భాగస్థుఁడు కాడు.

జీవుఁడు పాపకర్మముల నొనర్పకుండునట్లు చేయుటకు సర్వేశ్వరుఁడు సమర్థుఁడైనను, జీవునికి వాటి నొనర్చుట కనుమతి నిచ్చినందున, నతఁడు కరుణారహితుఁడని ప్రాప్తించునని శంకించెదవేమో, అట్లు శంకింపఁదగదు. ఏలననిన, ఈ విషయమును గుఱించి సాంఖ్యదర్శనమును గుఱించి చెప్పు సందర్భమున నిరూపింపఁబడియె.

అయితే యీపైని గనఁబఱచిన ప్రకారము సర్వేశ్వరుఁడు జీవులకు ఆ యాకార్యముల నొనర్చుటకై యనుమతిని మాత్ర మొసంగు వాఁడగునేని, "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి ఏష హ్యేవా సాధు కర్మ కారయతి తం యమధో నినీషతి" (పరమాత్మ యెవని నుత్తమలోకములను బొందించుట కిచ్ఛయించుచున్నాఁడో, వానిచే సత్కర్మములఁ జేయించు చున్నాఁడు, ఎవని నధో లోకములను బొందించుట కిచ్ఛయించుచున్నాఁడో, వానిచేఁ బాపకర్మములఁ జేయించుచున్నాఁడు) అను శ్రుతియందు ఈశ్వరుఁడే జీవుల నుత్తమలోకమును బొందింపవలయుననెడి యిచ్ఛతో వారిచే సత్కర్మలను, వారి నధోలోకమును బొందింపవలయుననెడి యిచ్ఛతో వారిచేఁ బాపకర్మములనున్ను తానే స్వయముగఁ జేయించుచున్నాఁడని చెప్పియుండుట యుపపన్నము కాదే యని యంటివేని, చెప్పెదము. పరమాత్మ జీవులందఱిచే నట్లు చేయింపడు. అయితే ఏ జీవుఁడు తనకు మిక్కిలి యనుకూలముగాఁ బ్రవర్తించుచున్నాఁడో, ఆ జీవుని మాత్ర మనుగ్రహించి వానికి మాత్రము తనను జేరుట కనుకూలములగు కర్మముల నొనర్చుటయం దభిరుచిని గలుగఁ

జేయుచున్నాఁడనియు, ఏ జీవుఁడు తన యెడల మిక్కిలి ప్రతికూలముగాఁ బ్రవర్తించుచున్నాఁడో, వానిని శిక్షించుట కిచ్ఛయించినవాఁడై వానికి తన్ను పొందకపోవుట కనుకూలములగు కర్మలనొనర్చుటయందభిరుచిని గలుగ జేయుచున్నాఁడనియును యీ పై శ్రుతివాక్యము తెలుపుచున్నది. అట్లే శ్రీ భగవద్గీతలయందు భగవంతుఁడు స్వయముగ జెప్పియున్నాఁడు. ఎట్లనిన,

"శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥
భ. గీ. ౧౦ అ. ౮ శ్లో.

తా॥ ఓ అర్జునా! నేనే సమస్త ప్రపంచమునకును కారణమనియు, నావలననే సర్వమును జరుగుచున్నదనియును తెలంచి ఇట్టి భావనతోనుండిన వారై జ్ఞానులు నన్ను పొందుచున్నారు." ఇట్లు చెప్ప నారంభించి,

"శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥
భ. గీ. ౧౦ అ ౧౦ శ్లో.

తా॥ ఓ అర్జునా! నాయందెల్లెడల ఆసక్తిగలిగి, నన్ను ప్రీతిపూర్వకముగ ఆశ్రయించు వారలకు నన్నుఁజేరుటకు ఉపయుక్తమగు జ్ఞానమును నేనే యిచ్చుచున్నాఁడను" అనియు

"శ్లో॥ తేషామేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥
భ. గీ. ౧౦ అ. ౧౧ శ్లో.

తా॥ ఓ అర్జునా! నేను అట్టి వారి ననుగ్రహించుటకొరకాత్మభావమున నున్నవాఁడనై ప్రకాశించుచున్న జ్ఞానమనెడి దీపముచేత అజ్ఞానమువలనఁగలిగిన తమస్సును నశింపఁజేయుచున్నాను. అనఁగా జ్ఞానులయొక్క మనోవృత్తికి విషయముగానున్నవాఁడనై నాకల్యాణగుణములను ప్రకటింపఁజేయుచు నాయందలి విజ్ఞానమనెడి ప్రకాశింపుచున్న దీపముచేత జ్ఞానమునకు విరోధులగు పూర్వకర్మములనెడి యజ్ఞానమువలనఁ బుట్టినదియు, నాకంటె నితరములగు విషయములయందలి ప్రావణ్యరూపమునగు చీకటిని నశింపఁజేయుచున్నాఁడను" అనియు,

"శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం॥
భ. గీ. ౧౬ అ. ౮ శ్లో.

తా॥ ఓ అర్జునా! అసురయోనులయందుఁ బుట్టిన వారలు జగత్తు నసత్యమును గాను, ఆధారములేని దానిని గాను, ఈశ్వరుఁడు లేని దానిని గానును జెప్పుచున్నారు" అనియు,

"శ్లో॥ మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥

భ. గీ. ౧౬ అ. ౧౮ శ్లో.

తా॥ ఓ అర్జునా! అహంకారాదులతోఁగూడియుండు వారలు తమశరీరములయందును ఇతరశరీరములయందును నన్ను ద్వేషించుచు అసూయాపరులగుచున్నారు." అనియు,

"శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥

భ. గీ. ౧౬ అ. ౧౯. శ్లో.

తా॥ ఓ అర్జునా! నన్ను ద్వేషించుచున్నవారును, క్రూరులును, అమంగళులునగు ఆ మనుష్యాధములను నేను సంసారమున అసురసంబంధులగు యోనులయం దెల్లప్పుడు ఉంచెదను" అనియు నిట్లు చెప్పఁబడియె.

పరాయత్తాధికరణము ముగిసెను.

---

## అంశాధికరణము.

సూ॥ ౪౨॥ అంశోనానావ్యపదేశాదన్యథాచాపిదాశకితవాదిత్వమధీయత ఏకే.

---

టీ॥ నానావ్యపదేశాత్=భేదవ్యపదేశమువలనను, అన్యథా చ = అభేదవ్యపదేశమువలనను, అంశః=జీవుఁడు పరమాత్మయొక్క యంశము (తథాహి= అట్లే కదా) ఏకే = కొందఱు అనఁగా నాథర్వణికులు, దాశకితవాదిత్వమపి= (బ్రహ్మముకు) దాశ కితవాదిభావమునును, అధీయతే=పఠించుచున్నారు.

తా॥ శ్రుతులయందుఁ గొన్నితావుల జీవాత్మపరమాత్మలకు భేదము ఉన్నట్లు చెప్పియుండుటవలనను, మఱి కొన్ని తావుల అభేదము ఉన్నట్లు చెప్పియుండుటవలనను జీవాత్మ పరమాత్మయొక్క యంశ మనుట యుక్తము. కావుననే యాథర్వణికులు పరమాత్మను గుఱించి దాశకితవాదిభావమునున్న పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ జీవునియొక్క కర్తృత్వము పరమపురుషుని యిచ్ఛకధీనమయినదని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడియె. ఆ జీవుఁడెవఁడనెడి యంశమును గుఱించి శ్రుతులు పలుతెఱఁగులఁ జెప్పుచుండుటచే నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

జీవుఁడు బ్రహ్మముకంటె నత్యంతము భిన్నుఁడా? లేక, భ్రాంతి బొందిన జీవుఁడే బ్రహ్మమా? లేక, బ్రహ్మమే ఉపాధిసంబంధమువలనఁ జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడా? లేక, జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమా?

“తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః” (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౧౪ సూ) అనియు “అధికన్తు భేదనిర్దేశాత్” (సూ. ౨ అ. ౧ పా. ౨౨ సూ) అనియు నీసూత్రములయందు ఈ విషయము నిర్ణయింపఁబడినదియేయైనను, కొన్ని శ్రుతులు జీవు లనేకు లనియు, మఱి కొన్ని శ్రుతులు జీవుఁడొక్కఁడే యనియు నిట్లు పరస్పరము విరుద్ధముగ జెప్పుచున్నందున, ఈ విషయమును గుఱించియే మరల శంకించి జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమని విశేషముగ ప్రతిపాదించి నిర్ణయించుచున్నారు. ఏలననిన, జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమను విషయము బాగుగా నిర్ణయింపఁబడు వరకును, ఈ పై సూత్రములయందుఁ బ్రతిపాదింపఁబడిన ప్రకారము, జీవుఁడు బ్రహ్మముకంటె నన్యుఁడుకాడను విషయమున్ను, బ్రహ్మము జీవునికంటె నుత్కృష్టమైనదను విషయమున్ను స్థిరపడనేరవు.

### పూర్వపక్షము.

జీవుఁడెవ్వఁడను విషయమును గుఱించి పూర్వపక్షి యిట్లు వాదించుచున్నాఁడు:—జీవుఁడు బ్రహ్మముకంటె నత్యంతముభిన్నుఁడనుట యుక్తము. ఏలననిన,

అత్యంతభేదవాది మతము

“జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ” ఇత్యాది శ్రుతివాక్యములు జ్ఞాని యగు పరమాత్మయు అజ్ఞానియగు జీవాత్మయు నిద్దఱు గలరు. వీరిద్దఱును జన్మరహితులు. పరమాత్మ సమర్థుఁడు. జీవాత్మ యసమర్థుఁడు” అని తెలుపుచున్నవి. అయితే ఆత్మపరమాత్మలకు భేదములేదని తెలుపు శ్రుతి వాక్యములును కొన్ని కలవని యందురేమో, అవి “అగ్నినా సిఞ్చేత్” (నిప్పుతో తడపవలయును) ఈ మొదలగు వాక్యములవలె విరుద్ధార్థములైనందున ఔపచారికములు అనఁగా గౌణార్థములని యెఱుంగునది. బ్రహ్మముయొక్క యంశము జీవుఁడనుటయును యుక్తము కాదు. అట్లైనచో, అంశమనఁగా నొక్క పదార్థముయొక్క (అనఁగా బ్రహ్మముయొక్క) ఒక భాగ మనుట గదా! ఇందువలన జీవుని యందుండునవియగు సుఖదుఃఖాదిదోషములు బ్రహ్మమునందు సయితము ఉన్నట్లు ప్రసక్తించును. మఱియు అంశమనఁగా బ్రహ్మముయొక్క ఖండము లేక తునుక అనినచో, బ్రహ్మము ముక్కలు ముక్కలుగా భాగింపఁదగినది కాదు. అట్లైన, పూర్వోక్తదోషము మరల ప్రసక్తించును. కనుక నేది దేనికంటె నత్యంతము భిన్నమైనదో, అది దాని యంశమని యుపపాదించుట దుర్లభము.

అథవా, భ్రాంతిబొందిన బ్రహ్మమే జీవుఁడనుట యుక్తము. కనుకనే "తత్త్వమసి" అనియు 'అయమాత్మా బ్రహ్మ" అనియు నీమొదలగు శ్రుతి వాక్యములు జీవబ్రహ్మముల కైక్యమును ఉపదేశించుచున్నవి.

శంకరమతము

అయితే మఱికొన్ని శ్రుతులు జీవబ్రహ్మలకు భేదము గలదని గూడ జెప్పుచున్న వంటివేని, అది యుక్తము కాదు. ఏలననిన, ఈ శ్రుతులు ప్రత్యక్షాది ప్రమాణసిద్ధములగు పదార్థములను మాత్రమే అనువదించునవవి గాన, నవి వేఱొక్కవిధమునఁ దెలియరాని అద్వైతమును (బ్రహ్మాత్మభావమును) ఉపదేశించు నట్టి వాక్యములనుబట్టి ప్రత్యక్షాది ప్రమాణమువలె అవిద్యాంతర్గతములు గాను సూచింపఁబడుచున్నవి.

అథవా, అనాదియగు నుపాధిచే నావరింపఁబడిన బ్రహ్మమే జీవుఁడనియును చెప్పనచ్చును. ఏలననిన, అట్టి యుపాధిని బట్టియే బ్రహ్మమే యాత్మయని శ్రుతులు తెలుపుచున్నవి. అయితే ఈ యుపాధి భ్రాంతిచే పరికల్పితమైనదని చెప్పఁదగదు. అట్లయినచో, బంధమోక్షముల కొకవ్యవస్థ లేకపోవును.

భాస్కరమతము

## సిద్ధాంతము.

శ్రుతులయందుఁ గొన్నితావుల జీవాత్మపరమాత్మలకు భేదము గలదనియు, మఱికొన్ని తావుల వానికి భేదములేదనియును వినఁబడుటచే జీవాత్మ యనఁబడునది పరమాత్మయొక్క యంశ మనుట యుక్తము. ఎట్లనిన, కొన్ని శ్రుతివాక్యములు బ్రహ్మమును గుఱించి చెప్పుసందర్భమున, బ్రహ్మము సృజించువాఁడనియు, నియమించు వాఁడనియు, సర్వజ్ఞుఁడనియు, స్వతన్త్రుఁడనియు, పరిశుద్ధుఁడనియు, కల్యాణగుణాకరుఁడనియు, పతియనియును తెలుపుచున్నవి. జీవుని గుఱించి యన్ననో, సృజింపఁబడువాఁడనియు, నియమింపఁబడు వాఁడనియు, అల్పజ్ఞుఁడనియు, పరతన్త్రుఁడనియు, అపరిశుద్ధుఁడనియు, కల్యాణగుణములు లేనివాఁడనియు, శేషభూతుఁడనియును తెలుపుచున్నవి, ఇందువలన నవి జీవాత్మపరమాత్మలకు భేదమును ప్రతిపాదించుచున్నవి. మఱి కొన్ని వాక్యములన్ననో, "తత్త్వమసి" (పరబ్రహ్మము నీవు) అనియు "అయమాత్మాబ్రహ్మ" (ఈజీవుఁడు బ్రహ్మము) అనియు నిట్లు చెప్పుటచే జీవాత్మ పరమాత్మల కభేదమును ప్రతిపాదించుచున్నవి. మఱియు ఆథర్వణికులు "బ్రహ్మదాశా బ్రహ్మ దాసా బ్రహ్మేమే కితవాః" అనువాక్యమున "ఈ పల్లెవాండ్రును, సేవకులును, జూదమాడువారును బ్రహ్మమే" అని పఠించుచున్నారు. బ్రహ్మము ఈ సమస్తజీవులలోను వ్యాపించి యున్నందున ఈశ్రుతులు బ్రహ్మమును జీవాభిన్నమైనదానినిగ నిర్దేశించుచున్నవని తెలియుంగునది. జీవాత్మపరమాత్మలకు భేదమును అభేదమునున్ను ప్రతిపాదించు

నట్టి యీ యుభయవిధ శ్రుతులును ముఖ్యార్థము లగుటకు గాను, జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమని యవశ్య మంగీకరింపవలయును.

భేదప్రతిపాదకములగు శ్రుతి వాక్యములు, ప్రత్యక్షాది ప్రమాణసిద్ధ మగు దాని ననువదించునవి గాన నవి వేఱొక్క విధమునఁ దెలియవచ్చు దానిని తెలుపునవి యని చెప్పుటయును యుక్తము కాదు.

శంకరమత విమర్శనము

ఏలననిన, ఈ పైని గనఁబఱచిన ప్రకారము, జీవుఁడు బ్రహ్మముచే సృజింపఁబడువాఁడనియు, నియమింపఁబడు వాఁడనియు, బ్రహ్మముకు శరీరభూతుఁడనియు, శేషభూతుఁడనియు, బ్రహ్మమే యాధారము గాఁగలవాఁడనియు, బ్రహ్మముచే పాలింపఁబడువాఁడనియు, సంహరింపఁబడు వాఁడనియు, బ్రహ్మమును ఉపాసించువాఁడనియు, బ్రహ్మముయొక్క యనుగ్రహమువలన ధర్మార్థ కామమోక్షములను బొందువాఁడనియు నిట్లు జీవాత్మ పరమాత్మలకుఁగల భేదము శ్రుతులనుండియే తెలిసికొనఁదగినది గాని, యది వేఱొక్క విధమునఁ దెలియఁదగినది కాదు. కనుక జగత్సృష్టి మొదలగు వానిఁ బ్రతిపాదించునట్టి శ్రుతులు ప్రమాణాంతర సిద్ధమగు భేదము ననువదించునవి యనియు, అందువలన నవి మిథ్యాభూతములగు పదార్థములను దెలియఁజేయునవి యనియును చెప్పుట యుక్తము కాదు. అట్లగు పక్షమున, ఆనందైకరస చిన్మాత్ర స్వరూపము గలదియు, తాననేకముగా నగుదునని ధ్యానించినదియు, ధ్యానపూర్వకముగ నాకాశాది ప్రపంచమునంతయును సృజించినదియు, జీవభావముచే నా యాకాశాదులలోఁ బ్రవేశించినదియు, అట్లు ప్రవేశించి నానావిధ చిత్రవిచిత్రములగు నామరూపములను స్పష్టపఱచినదియు, వాటిలో నట్లు ప్రవేశించినప్పుడు వాటి యందుండు సుఖదుఃఖములతో నెంతమాత్రము సంబంధము లేనిదియు, వాటిని నియమించుచు వాటిలో నంతరాత్మగ నుండునదియు, ఇట్లు జీవభావమును బొందినపుడు తాను కారణ బ్రహ్మమనెడి యనుసంధానము గలదియు, సంసారవిముక్తిని యుపదేశించు శాస్త్రమును నిర్మించినదియునగు బ్రహ్మము భ్రాంతి బొందునదియని వేదములే యుపదేశించు పక్షమున, నట్టి వేదోపదేశము లన్నియును ఉన్మత్త ప్రలాపములవలసి వచ్చునే?

ఉపాధ్యవచ్ఛిన్నమగు బ్రహ్మమే జీవుఁడను పక్షము సయితము యుక్తమయినది కాదు. అట్లగు పక్షమున, బ్రహ్మము నియమించు వాఁడనియు,

భాస్కరమత విమర్శనము

జీవుఁడు నియమింపఁబడు వాఁడనియు నిట్లు జీవాత్మ పరమాత్మలకుఁ గల భేదమును ప్రతిపాదించునట్టి శ్రుతివాక్యములు విరోధించును. దేవదత్తుఁ డొక్కఁడే గృహాద్యుపాధి భేదము వలన నియామకుఁడును, నియామ్యుఁడును కావేరఁడు గదా! కావున భేదమును

అభేదమును జెప్పు శ్రుతులును అనఁగా నీయుభయ విధశ్రుతులును ముఖ్యార్థ ములగుటకు గాను జీవుఁడు బ్రహ్మము యొక్క యంశ మనుట యుక్తము.

౪౩॥ సూ॥ మ న్త్ర వ ర్ణా త్

టీ॥ మన్త్రివర్ణాత్=మన్త్రివర్ణమువలనను జీవుఁడు సర్వేశ్వరుని యంశ మని తెలియుచున్నది.

తా॥ జీవుఁడు సర్వేశ్వరునియొక్క యంశమని మన్త్రివర్ణమువలనను తెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అనెడి మంత్రము గూడ "సమస్తములయిన జంతువులు అనఁగా జీవులు ఈ బ్రహ్మముయొక్క పాదము అనఁగా అంశము" అని తెలుపుచున్నది. జీవు లనేకుల గుటంజేసి, యీపై శ్రుతివాక్యమున, "విశ్వా భూతాని" అని యిట్లు జీవవాచక మగు "భూత" శబ్దము బహువచనమునఁ బ్రయోగింపఁబడినది. 'అంశో నానావ్యపదేశాత్' అను సూత్రమున "అంశ" శబ్దముయొక్క ఏకవచన ప్రయోగమును జ్ఞాత్యేకవచనమునుగా నెఱుఁగునది. అట్లే "నాత్మాఽశ్రుతేః" (బ్ర. సూ. ౨ అ. 3 పా. ౧౮ సూ.) అను సూత్రమునందుండు "ఆత్మ" శబ్దముయొక్క యేకవచన ప్రయోగమును సయితము ఎఱుంగునది. కనుకనే "నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం విదధాతి కామాన్" అను శ్రుతివాక్యము "నిత్యులలో (జీవులలో) నిత్యుఁడును, చేతనులలో (జీవులలో) చేతనుఁడును, అనేకులలో (అనేకులగు జీవులలో) నొక్కఁడునగు పరమాత్మ కోరికెలను నెర వేర్చుచున్నాఁడు" అనుచు సర్వేశ్వరునికంటె జీవులు భిన్నులనియు, అనేకుల నియు, నిత్యు లనియును దెలియఁజేయుచున్నది. ఇట్లు జీవు లనేకులనెడి విష యము శ్రుతి ప్రమాణములనుండి తెలియవచ్చుచుండుటంజేసి, జీవు లందఱు జ్ఞానస్వరూపులగుటచే వారి యందఱి యొక్కయును రూప మొక్కటియే యయినను, వారికి పరస్పరము భేదము గల దనెడి యంశము ఆత్మయాథాత్మ్య మును దెలిసికొన సమర్థులగువారిచే మాత్రము దెలియఁబడునది. "అసన్తతే శ్చావ్యతికరః" (బ్ర. సూ. ౨ అ. 3 పా. ౪౮ సూ) అనెడి సూత్రముచే సూత్ర కారుఁడు సయితము జీవు లనేకులని తెలియఁజేయఁబోవుచున్నాఁడు.

౪౪॥ సూ॥ అ పి స్మ ర్య తే.

టీ॥ స్మర్యతే—అపి=ఇట్లు స్మృతియందును జెప్పఁబడుచున్నది.

తా॥ స్మృతియందును జీవుఁడు సర్వేశ్వరునియొక్క యంశమని చెప్పఁ బడియె.

శ్రీ॥ భా॥ "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" (భ. గీ ౧౫ అ. ౭ శ్లో.) (సనాతనమగు నా యంశమె జీవలోకమునందు జీవుఁడను వాఁడు) అనెడి స్మృతివలనను, జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమని తెలియవచ్చుచున్నది.

అవతారిక:— జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమనఁగా బ్రహ్మముయొక్క యొక భాగము గాన, జీవునికిఁగల సుఖదుఃఖాదిదోషములు బ్రహ్మమునకుఁ గూడ గలవని ప్రశక్తించునే? యనెడి శంకను పరిహరించుటకై:—

**౪౬॥ సూ॥ ప్రకాశాదివత్తు నైవం పరః.**

టీ॥ తు=పూర్వపక్షము అయుక్తము, పరః=పరమాత్మ, ఏవం=ఈప్రకారముగా (అనఁగా జీవుఁడెట్లు సంసారదుఃఖము ననుభవించుచున్నాఁడో, యట్లే), న = సంసారదుఃఖము ననుభవించుట లేదు. (ఏలననఁగా,) ప్రకాశాది వత్ = కాంత్యాదికము వలెనే జీవుఁడు బ్రహ్మముయొక్క యంశము.

తా॥ జీవునికి సంసారదుఃఖము ప్రసక్తించునట్లు, పరమాత్మకు ప్రసక్తింపదు. ప్రకాశాదులగ్న్యాదుల యొక్క యంశములగు నట్లు జీవుఁడును పరమాత్మయొక్క యంశము.

శ్రీ॥ భా॥ ప్రకాశాదులవలెనే జీవుఁడు బ్రహ్మముయొక్క యంశము. అదెటువలెననిన, అగ్న్యాదిత్యాదులయొక్క ప్రభారూపమగు ప్రకాశము వాని యంశమగు చందంబునను, గోత్వము (గోవుయొక్క ధర్మము) గోవుయొక్క యంశమగు చందంబునను, అశ్వత్వము (అశ్వముయొక్క ధర్మము)అశ్వముయొక్కయంశమగు చందంబునను, శ్వేతవర్ణము శ్వేతవసువుయొక్క యంశమగు చందంబునను, కృష్ణవర్ణము కృష్ణవస్తువుయొక్క యంశమగు చందంబునను, దేహవంతుఁడగు జీవునికి దేవ మనుష్యాదిరూపమగు దేహ మంశమగు చందంబున నున్న జీవుఁడు పరమాత్మయొక్క యంశము. ఏదైన నొకవస్తువుయొక్క యొకభాగమును గదా దాని యంశమందురు. కనుక ఏదైన నొక విశిష్టపదార్థముయొక్క అనఁగా గుణములతోఁ గూడుకొనియున్న వస్తువుయొక్క విశేషణము అనఁగా గుణము దాని యంశమే. కనుకనే పండితు లట్టి విశిష్టపదార్థమును గుఱించి ప్రస్తావించునపుడు ఇది విశేషణాంశమనియు, అది విశేష్యాంశమనియు నిట్లు విభజించి చెప్పుచున్నారు. విశేషణ విశేష్యములగువానిలో నొకటి యంశమున్ను మఱియొకటి యంశియు నయినను, వాటిస్వభావమునందు భేదము గన్పట్టుచున్నది గదా! అట్లే విశేషణ విశేష్య భూతులగు జీవాత్మ పరమాత్మలకున్ను అంశాంశిభావమున్నను, స్వరూప స్వభావములయందు వైలక్షణ్యము

డుట సంభవమే. ఈవిషయమునే "నైవంపరః" (జీవుఁడెట్టివాఁడో పరమాత్మయు నట్టి వాఁడు కాఁడు)అనుటచే సూత్రము తెలుపుచున్నది. తేజస్సునకంటెను తేజోవంతుఁడు భిన్నపదార్థమగు చందంబున, ప్రకృతమునను, తేజస్థానముననుండి నదియు స్వాంశమునగు జీవునికంటె అంశియగు పరమాత్మ భిన్నపదార్థమే. ఇట్లు జీవాత్మ పరమాత్మలకుఁగల విశేషణవిశేష్య భావమును బట్టి యుండునదియగు స్వభావ వైలక్షణ్యమును బట్టియే కొన్ని శ్రుతివాక్యములు జీవాత్మపరమాత్మలు భిన్నపదార్థములని తెలుపుచున్నవి. అభేదమును జెప్పు శ్రుతులన్ననో, విశేషణములు తమచే విశేషింపఁబడు వానికంటె అనఁగా విశేష్యపదార్థములకంటె వేఱుగానుండుట కర్థములు గాక, విశేష్యపదార్థముతోఁ గలిసియేయుండు ననెడి యభిప్రాయమును బట్టి ప్రవర్తించినవి గాన, అనఁగా అంశభూతములగు జీవాత్మ లంశియగు పరమాత్మకంటె వేఱుగానుండుట కర్థములు గాక, యెల్లప్పుడును పరమాత్మతోఁ గలిసియుండునవి యనెడి యభిప్రాయమును బట్టి ప్రవర్తించునవి గాన ముఖ్యార్థములే. ఈ యభిప్రాయమునుబట్టి "తత్త్వమసి" అనియు "అయమాత్మా బ్రహ్మ" అనియు నీశ్రుతివాక్యముల యందుండు "తత్" శబ్ద "బ్రహ్మ" శబ్దములవలెనే "త్వం" అనియు "అయం" అనియు "ఆత్మా" అనియు నీశబ్దములు జీవాత్మలను శరీరమునుగాగల పరబ్రహ్మమును తెలియఁ జేయుచున్నందువలన నొక్కటియే యర్థమును దెలియఁజేయునవి యగుచున్నవని యింతకు పూర్వము ప్రతిపాదించియున్నాము.

౪౬॥ సూ॥ స్మరన్తి చ.

టీ॥ స్మరన్తిచ — చ (ఇట్లే) స్మృతియందును చెప్పఁబడుచున్నది.

తా॥ ఇట్టి యంశాంశిభావమునే వ్యాసాదులును స్మృతులయందుఁ బఠించి యున్నారు.

శ్రీ॥ భా॥ తేజస్సుకును తేజోవంతునకువలెను, శక్తికిని శక్తిమత్పదార్థమునకు వలెను, శరీరముకున్ను శరీరవంతునకువలెను, జగత్తుకును బ్రహ్మముకును అంశాంశిభావమును పరాశరాది మహర్షులును స్మృతులయందుఁజెప్పి యున్నారు. ఎట్లనిన,

శ్లో॥ ఏకదేశస్థితస్యాగ్నే ర్జ్యోత్స్నా విస్తారిణీ యథా।
పరస్య బ్రహ్మణ శ్శక్తి స్తథే దమఖిలం జగత్ ॥

విష్ణు. ౧ అం. ౨౨ అం. ౫౬ శ్లో.

తా॥ ఏదియయిన నొకప్రదేశమునందు మాత్రమే యున్నట్టి యగ్ని యొక్క కాంతి యన్ని తావులను వ్యాపించియున్నట్లు, ఈ జగత్తంతయును పర బ్రహ్మము యొక్క శక్తియే యై యంతటను వ్యాపించియున్నది.

శ్లో॥ యత్కిఞ్చిత్సృజ్యతే యేన సత్త్వజాతేన వై ద్విజ।
తస్య సృజ్యస్య సంభూతౌ తత్సర్వం వై హరే స్తనుః ॥
విష్ణు ౧ అం. ౨౨ అ. ౩౮ శ్లో.

తా॥ ఏ వస్తువు ఏ వస్తువును సృజించుచున్నదో, అట్లు సృజింపఁబడు వస్తువు కలుగు విషయమునఁ గావలసిన శక్తియంతయును బ్రహ్మముయొక్క శరీరమే.

ఇంతియెకాక, "యస్యాత్మా శరీరం" ఈ మొదలగు శ్రుతివాక్య ములు జీవాత్మ పరమాత్మలకు శరీరశరీరిభావమును జెప్పుటచే నంశాంశి భావము నంగీకరించు చున్నవని సూత్రమునందుండు "చ" కారము సూచింపు చున్నది.

అవతారిక:—సర్వసామాన్యముగ జీవులందఱును బ్రహ్మముయొక్క అంశ ములును, బ్రహ్మముచే ప్రవర్తింపఁబడువారును, జ్ఞానమునందు సంకోచమును బొందువారు నగుచుండఁగా, వీరిలో కొందఱు మాత్రమే వేదాధ్యయనముఁ జేయు టకును అందుఁ జెప్పఁబడిన వాని ననుష్ఠించుటకును అర్హులనియు, మఱి కొంద రట్టివారు కారనియు, కొందఱు దర్శనస్పర్శనార్హులనియు, మఱికొందరట్టి వారు కారనియు నివ్విధమగు శాస్త్రనియమము లెట్లు ఉపపన్నములగుచున్న వని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై.

౪౭॥ సూ॥ అనుజ్ఞాపరిహారౌ దేహసమ్బన్ధాజ్జ్యోతిరాదివత్.

---

టీ॥ జ్యోతిరాదివత్ = అగ్న్యాదుల విషయమునవలె, దేహసంబంధాత్ = శరీరసంబంధమువలన, అనుజ్ఞా పరిహారౌ = విధినిషేధములు, (ఉపపన్నౌ = ఉపపన్నము లగును).

తా॥ అగ్న్యాదుల విషయమునవలె శరీసంబంధమునుబట్టి యనుజ్ఞాపరిహా రము లాత్మలవిషయమునను ఉపపన్నము లగును.

శ్రీ॥ భా॥ జీవులందఱును సర్వసామాన్యముగ పరబ్రహ్మముయొక్క యంశములగుటంజేసి యొక్కవిధమైన స్వరూపముగలవారే యైనను, బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది రూపమగు శుచ్యశుచి శరీరసంబంధ నిమిత్తమున వీరు స్పర్శనీయులనియు వీరు స్పర్శనీయులు కారనియు, నివ్విధములగు అనుజ్ఞా పరిహారములు యుపపన్నము లగుచున్నవి. అదెటువలెననిన, లోకమునందగ్ని

తావుల నుండు అగ్ని ఒక్కవిధమైనదియే యయినను, అగ్ని కావలసినప్పుడు శ్రోత్రియుని గృహమునుండియే దానిఁ గొనివచ్చుచున్నాము గాని, శ్మశానము నుండి గొనిరాము గదా ! మఱియు అందఱి యన్నమును సమానమే యయినను, శ్రోత్రియుని యన్నము నంగీకరించుచు, పతితుని యన్నమును పరిత్యజించుచున్నాము గదా !

## ౪౮॥ సూ॥ అ స న్త తే శ్చా వ్య తి క రః.

టీ॥ అసంతతేః = ప్రతిశరీరమునను జీవుఁడు భిన్నుఁడగుటవలన, అవ్యతికరః=కర్మఫలసాంకర్యము గలుగదు.

తా॥ ప్రతి శరీరమునను జీవుఁడు భిన్నుఁడగుటచే కర్మఫల సాంకర్యము సంభవింపదు.

శ్రీ॥ భా॥ జీవు లందఱును బ్రహ్మాంశలయినందున సమానులేయయినను, వీరలు పరస్పరము భిన్నులయినందునను, అణుపరిమాణు లయినందునను ప్రతి శరీరమునను భిన్నులగుటం జేసియును (ఏ శరీరముననుండి యే జీవుఁడు యే కర్మముల నొనర్చుచున్నాఁడో, వాని ఫలముల నాశరీరముననుండెడి యాజీవుఁడే యనుభవించుచున్నాఁడు. కాన) కర్మఫలానుభవవిషయమై సంకరము ప్రసక్తించుట కెంతమాత్ర మవకాశ ముండనేరదు.

భ్రాంతిబొందిన బ్రహ్మమే జీవుఁడను శంకరమతమునను, ఉపాధియుక్తుఁడగు బ్రహ్మమే జీవుఁడను భాస్కరమతమునను న్ను వాస్తవమునకు బ్రహ్మమే సర్వశరీరములయందుఁను జీవుఁడగుటం జేసి, బ్రహ్మమే కర్మఫలములను అనుభవించుచున్నాఁడనియు, ఒక శరీరముననుండు జీవుఁడొనర్చిన కర్మముల ఫలములను శరీరాంతరమునందుండు జీవుఁడనుభవించుచున్నాఁడనియు నిట్లు కర్మఫలానుభవమున సంకరము సంప్రాప్త మగుచున్నది. కావుననే జీవు లణువులయినందునను ప్రతిశరీరమునను భిన్నులయినందున నిట్టిదోషమున కెంతమాత్ర మవకాశ ముండనేరదను స్వాభిప్రాయమును సూత్రకారుఁ డీసూత్రముచేఁ గనఁబఱచియున్నాఁడు.

అవతారిక:—భ్రాంతిబొందిన బ్రహ్మమే జీవుఁడనువాదమునను, అవిద్యాకారితోపాధిభేదములవలన కర్మఫలభోగమునకొక వ్యవస్థ గలుగుచున్న దేయని శంకింపఁగా నట్టి శంకను పరిహరించుటకై.

## ౪౯॥ సూ॥ ఆ భా స ఏ వ చ.

టీ॥ (ఉపాధిభేదమును ఉపపాదించుచు హేతువు,) అభాస ఏవచ=భ్రాంతి కల్పిత మయినదియే.

తా॥ ఉపాధిభేదమును నిరూపించునట్టి హేతువు భ్రాంతికల్పితమైనదియే.

శ్రీ॥ భా॥ అఖండైకరస ప్రకాశమాత్ర స్వరూపమగు బ్రహ్మముయొక్క స్వరూపము అవిద్యావశమున భిన్నభిన్నోపాధులచే గప్పి వేయఁబడుచున్న దనుచు, ఉపాధిభేదమును ఉపపాదించు హేతువు భ్రాంతకల్పితమైనదియే. ఏల ననిన, ప్రకాశమాత్ర స్వరూపమగు పదార్థముయొక్క ప్రకాశము గప్పివేయఁ బడుటయను నది యప్ప్రకాశముయొక్క నాశమేయని ఇంతకుపూర్వమే ప్రతి పాదింపఁబడియెను గదా. ఈ సూత్రమునకు "ఆభాసా ఏవచ" అనియును పాఠ భేదము గలదు. ఈ పాఠమున ఉపాధిభేదమును ఉపపాదించు హేతువులు భ్రాంతి కల్పితములే యని యర్థము జెప్పుకొనునది. మఱియు "పృథగాత్మానం ప్రేరి తారంచ మత్వా" (జీవాత్మ పరమాత్మలను భిన్నపదార్థములనుగాఁ దెలిసికొని" అనియు "జ్ఞాజౌద్వౌ" (జీవాత్మ పరమాత్మలలో జీవాత్మ జ్ఞానమునందు సం కోచము గలవాఁడు. పరమాత్మ సర్వజ్ఞుఁడు)అనియు "తయోరన్యః పిప్పలంస్వా ద్వత్తి అనశ్నన్యన్యోఽభిచా కశీతి" (జీవాత్మ పరమాత్మలలో జీవాత్మ కర్మ ఫలము ననుభవించుచున్నాఁడు. పరమాత్మ వానిననుభవింపక కేవలము సాక్షి భూతుఁడుగ నుండువాఁడు) అనియు నివ్విధముగ జీవాత్మ పరమాత్మలకు భేద మును దెలుపు శ్రుతివాక్యములు, భ్రాంతిబొందిన బ్రహ్మమే జీవుఁడగుపక్షమున, విరోధించునని సూత్రము నందుండు "చ" కారము సూచింపుచున్నది. ఇంతియె కాక, అవిద్యాపరికల్పితోధిచే జీవాత్మ పరమాత్మలకు భేదముసిద్ధించినను, పర మార్థమునకు, పరమాత్మయొక్కటియే గలదు గాన, పూర్వసూత్రమునఁ గనఁ బఱచిన ప్రకారము కర్మఫలోప భోగమునకు వ్యవస్థయును సిద్ధింపనేరదు.

అవతారిక:—పారమార్థికమగు నుపాధిచేఁ గప్పఁబడిన బ్రహ్మమే జీవుఁ డను పక్షమునను, అట్టి యుపాధిభేదమునకు హేతుభూతమగు అనాద్యదృష్టవశ మున కర్మఫలభోగవ్యవస్థ సిద్ధించునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

**౫౦॥ సూ॥ అ దృ ష్టా ని య మా త్.**

టీ॥ అదృష్టానియమాత్ = అదృష్టమున్ను నియమహేతువు కానందున కర్మఫల భోగవ్యవస్థ సిద్ధింపదు.

తా॥ అదృష్టమున్ను నియమహేతువు కానందున కర్మఫల భోగమునకు వ్యవస్థ సిద్ధింపదు.

శ్రీ॥ భా॥ ఉపాధిపరంపరకు హేతుభూతమగు నదృష్టమున్ను బ్రహ్మస్వ రూపము నాశ్రయించియుండున దయినందున, అదియు నొకనియమమును గలు గఁజేయునది కాదు గాన కర్మఫలభోగవ్యవస్థ సిద్ధింపనేరదు. ఏలననిన, ఉపాధులు

గాని యదృష్టము గాని స్వసంబంధముచే బ్రహ్మమును ముక్కలు ముక్కలుగ ఖండించుటకు సమర్థములు కావు గదా!

౫౧॥ సూ॥ అ భి స న్ధ్యా ది ష్వ పి చై వ మ్.

టీ॥ అభిసంధ్యాదిషు-చ=సంకల్పాదులయందుఁ గూడ, ఏవం=ఇట్లే నియమము లేదు.

తా॥ ఈపైని గనఁబఱచిన ప్రకారము బ్రహ్మము అచ్ఛేద్యమగుటవలన సంకల్పాదులకుఁగూడ నియామకము సిద్ధింపదు.

శ్రీ॥ భా॥ పూర్వము గానఁబఱచిన హేతువులను బట్టియే అనఁగా బ్రహ్మము ఛేదనార్హ్మముగానందున అదృష్టమునకు హేతువులగు సంకల్పోద్యోగాదులకును గూడ నియామకము సిద్ధింపనేరదు.

౫౨॥ సూ॥ ప్ర దే శ భే దా ది తి చే న్నా న్త ర్భా వా త్.

టీ॥ ప్రదేశభేదాత్ = ఉపాదిసంబద్ధములగు బ్రహ్మప్రదేశముల భేదమునుబట్టి, ఇతిచేత్=కర్మపలభోగవ్యవస్థ సిద్ధించు నంటివేని, న=అది యుక్తము కాదు. ఏలననిన, అంతర్భావాత్ = ఆప్రదేశములు సయితము బ్రహ్మస్వరూపమునం దంతర్భూతము లయినందున.

తా॥ ఉపాధిసంబద్ధములగు బ్రహ్మప్రదేశములు సయితము బ్రహ్మస్వరూపాంతర్గతములే గదా! అందువలన ప్రదేశ భేదమునుబట్టి కర్మఫలభోగవ్యవస్థ సిద్ధించు ననుటయును యుక్తము కాదు.

శ్రీ॥ భా॥ బ్రహ్మస్వరూప మొక్కటియేయయి, ముక్కలు ముక్కలుగ ఛేదింపఁ దగినది కాక పోయినను, అది నానావిధములగు నుపాధులతో సంబంధించియున్నది. బ్రహ్మమునందు ఆ యా యుపాధులతో సంబంధించినట్టి ప్రదేశములు భిన్నభిన్నము లయినందున కర్మఫలానుభవ విషయమై యొక వ్యవస్థ సిద్ధించునని యంటివేని, యదియును యుక్తము కాదు. ఏలననిన, ఉపాధు లన్నితావులకును పోవుచుండుటచే నవి బ్రహ్మమునందుండునవియగు నన్నిప్రదేశములతో సంబంధించినవి గాన, ఇంతకుముందు గనఁబఱచిన కర్మఫల భోగ సంకరము యథాప్రకారము గానే యుండును. ఇంతియె కాక, ఉపాధులు బ్రహ్మమునందుండు భిన్నభిన్నప్రదేశములతో సంబంధించినవైనను, అవి యన్నియును బ్రహ్మముయొక్క ప్రదేశములే యయినందున ఆ యాప్రదేశములతో సంబంధించియుండు దుఃఖానుభవముగూడ బ్రహ్మముదే యనియును ప్రసక్తించును. వేదబాహ్యులయొక్క జీవసర్వగతత్వవాదము అనఁగా జీవుఁడు సర్వత్ర

వ్యాపించి యున్నాఁడనువాదము దోషయుక్తమయినదని యింతకు పూర్వము "నిత్యోపలబ్ధ్యను పలబ్ధిప్రసంగోఽన్యతరనియమోవాన్యథా" (బ్ర. సూ. ౨. అ. 3. పా. 3౨. సూ) అనియు "ఉపలబ్ధివదనియమః" (బ్ర. సూ. ౨. అ. 3. పా. 3౬. సూ) అనియు నీ సూత్రములచే నిరూపించి, వేదావలంబులగు నాత్మైకత్వవాదుల వాదము సయితము అనఁగా వాస్తవమునకు జీవుఁడను వాఁడు వేఱొక్కఁడు లేడు ఉపాధియుక్తమగు బ్రహ్మమే జీవుఁడని వాదించు నట్టియద్వైతుల వాదమున్ను దోషయుక్తమయినదియని "ఆభాస ఏవచ" (బ్ర. సూ. ౨. అ. 3. పా. ౪౯) ఇత్యాదిసూత్రములచే నిరూపించియున్నారు.

అంశాధికరణము ముగిసెను.



గద్య॥ ఇది శ్రీ కృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్దవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీ వేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణ తార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమాను గ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరు దాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు ద్వితీయాధ్యాయమున—తృతీయపాదము.



    

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

ద్వితీయాధ్యాయము—చతుర్థ పాదము.

## ప్రాణోత్పత్త్యధికరణము.

### ౧॥ సూ॥ తథా ప్రాణాః.

టీ॥ తథా=ఆకాశాదులవలెనే, ప్రాణాః=ఇంద్రియములు, ఉత్పద్యన్తే=పుట్టుచున్నవి.

తా॥ ఇంద్రియములు సయితము ఆకాశాదులవలె నుత్పత్తి వంతములు.

శ్రీ॥ భా॥ తృతీయపాదమున బ్రహ్మ వ్యతిరిక్తమగు ఆకాశాది ప్రపంచమంతయు కార్యభూతమగుటంజేసి జన్మించు నదియని ప్రతిపాదించి, జీవుఁడును అట్లే కార్యభూతుఁడయినను, అతఁడు ఆకాశాదులవలెనే స్వరూపమున మార్పునొందుట యనఁబడు జన్మము గల వాఁడుకాడని చెప్పి, ప్రసంగవశమున, జీవుని స్వరూపమును గుఱించి బాగుగ విచారించియుండిరి. జీవోపకరణములగు ఇంద్రియముల యొక్కయు ప్రాణముయొక్కయును ఉత్పత్తి మొదలగునవి యీ పాదమున విచారింపఁబడుచున్నవి. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఇంద్రియములు జీవునివంటి బ్రహ్మకార్యములా? అనఁగా, స్వతః ఉత్పత్తి రహితుఁడై జ్ఞానమునందు సంకోచవికాసములను బొందుట వలన జీవుఁడు బ్రహ్మకార్య మనిపించుకొను చందంబున, ఇంద్రియములును అట్లే బ్రహ్మకార్యములా? లేక, ఆకాశాదులవంటి బ్రహ్మకార్యములా? అనఁగా, స్వరూపమునందు మార్పునుబొందుట యనఁబడునట్టి యుత్పత్తిగలవియగుటంజేసి యాకాశాదులు బ్రహ్మకార్యము లనిపించుకొను చందంబున, ఇంద్రియములును అట్లే బ్రహ్మకార్యము లనఁబడుచున్నవా?

## పూర్వపక్షము.

ఇంద్రియములు జీవునివంటి బ్రహ్మకార్యము లనుట యుక్తము. సూత్రమునందుండు ప్రాణశబ్దమునకు ఇంద్రియములని యర్థము. జీవునికి ఉత్పత్తిలేని చందంబున, ఇంద్రియములకున్ను ఉత్పత్తి లేదు. జీవునికి యుత్పత్తిలేదని శ్రుతులు చెప్పుచున్నట్లు, ఇంద్రియములకున్ను ఉత్పత్తి లేదని శ్రుతులే చెప్పుచున్నవి. సూత్రమున "తథా"అట్లే అనునది జీవునికివలెనే జన్మరాహిత్యమునే గాకుండా, దానిని తెలుపు శ్రుతులుండుటనున్ను అతి దేశించుచున్నది. శ్రుతులెవ్వియనిన, "అసద్వా ఇదమగ్ర ఆసీత్ తదాహుః కిం తదా సీదితి ఋషయోవావ తే అగ్రే సదాసీత్ తదాహుః కే తే ఋషయ ఇతి ప్రాణా వావ ఋషయ ఇతి" "సృష్టికి పూర్వమిది యంతయును అసత్‌గా నుండెను. అప్పు డేదియుండెను? ఋషులుండిరి. ప్రాణములే ఋషు లనఁబడుచున్నవి." అనుశ్రుతి వాక్యము వలన సృష్టికి పూర్వము ప్రాణములు అనఁగా ఇంద్రియములు ఉన్నట్లు తెలియు చున్నది.

ఈ పైశ్రుతియందు "ప్రాణ" శబ్దము బహువచనమునందుఁ బ్రయోగింపఁబడి నందున, ఇది యింద్రియ వాచకమని యెఱుంగునది. అయితే "వాయుశ్చాంతరిక్షంచ ఏతదమృతం" (వాయువుయును అన్తరిక్షమును నాశరహితములు) అనియు, "సైషా అనస్తమితా దేవతా యద్వాయుః" (వాయువనునది నాశరహితమైన దేవత" అనియు నిట్లు శ్రుతులయందు వాయ్వంతరిక్షములు చిరకాల స్థాయులగుంటజేసి నాశరహితములుగాఁ జెప్పఁబడిన చందంబున, ప్రకృతశ్రుతియందును ఇంద్రియములును చిరకాల స్థాయులగుటంజేసియే జన్మరహితములని చెప్పఁబడుచున్నవని యందువేమో, అది యుక్తము కాదు. ఏలననిన, "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అనుశ్రుతివాక్యము ఆకాశాది సమస్త ప్రపంచమునకును ప్రళయము గలిగినప్పుడును ఇంద్రియములు ఉన్నట్లు గదా తెలుపు చున్నది.

ఒకవేళ, మఱికొన్ని శ్రుతు లింద్రియములకున్ను జన్మము ఉన్నట్లు జెప్పుచున్న వందువేమో, అవి జీవోత్పత్తిని జెప్పుశ్రుతుల వలెనే గౌణములు గాని ముఖ్యములు కావు.

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఆకాశాదులవలె నింద్రియములున్ను ఉత్పత్తివంతములు. ఏలననిన, ఛందోగులు "సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౧ వా) అను వాక్యమున "సృష్టికి పూర్వము ఈ పరిదృశ్యమానమగు జగత్తంతయు సత్తుగానే యుండెను" అనియు, ఐతరేయులు మొద

లగు వారు "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" (ఐ. ౧ అ. ౧ ఖం. ౧ వా) అనియు నీమొదలగు శ్రుతివాక్యములయందు సృష్టికి పూర్వ మాత్మ యొక్కటియే యుండెనని నిర్ధారణముగాఁ జెప్పియుండుటచే అప్పుడు బ్రహ్మము తప్ప ఇంద్రియాదులేవియును లేనట్లు దెలియనచ్చు చున్నందునను, "ఏతస్మాజ్జాయ తే ప్రాణో మన స్సర్వేంద్రియాణిచ" (౨ ము. ౧-3) అను ముణ్డకోపనిష ద్వాక్యము. "ఈ పరబ్రహ్మమునుండి ప్రాణమున్ను మనస్సున్ను సర్వేంద్రియములున్ను బుట్టుచున్నవి" అనుటచే నింద్రియములకు ఉత్పత్తి యున్నట్లు దెలియుచున్నందునను, సృష్టికి పూర్వము ఇంద్రియములు ఉండియుండుట యసంభవము. ఆత్మ యుత్పత్తిరహితమయినదనియు, నిత్యుననియును కొన్ని శ్రుతులు జెప్పుచుండుటనుబట్టి ఆత్మోత్పత్తిని ప్రతిపాదించు మఱికొన్ని శ్రుతులను గౌణార్థములనుగాఁ గొనియుంటిమి. అయితే అట్లు ఇంద్రియములు ఉత్పత్తి రహితములనియు, నిత్యములనియును శ్రుతులయందెచటను జెప్పియుండమింఁ జేసి ఇంద్రియములు ఉత్పత్తివంతములని తెలుపు శ్రుతివాక్యములను గౌణార్థములను గాఁగొనుట కవకాశము లేదు. "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అను ఈ పైవాక్యమునందుండు "ప్రాణ" శబ్దము పరమాత్మ పరముగాని, ఇంద్రియ పరము గాదు "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమే వాభి సంవిశన్తి ప్రాణమ భ్యుజ్జి హతే" (సర్వభూతములున్ను ప్రాణముతో (పరమాత్మతో) సంయుక్తములగుచున్నవి. ప్రాణమునుండి వచ్చుచున్నవి) అనియు నీ మొదలగు శ్రుతి వాక్యములయందు ప్రాణశబ్దమునకు పరమాత్మపరముగ ప్రయోగము గలదు. "ప్రాణా వావ ఋషయః" అనుతావున "ఋషి" శబ్దమునకు "సర్వజ్ఞుడగు పరమాత్మ" యను అర్థము పొసగును గాని, అచేతనములగు ప్రాణముల నెడి యర్థము పొసగదు.

అవతారిక:—"ఋషి" శబ్దమునకు సర్వజ్ఞుడనియును "ప్రాణ" శబ్దమునకు పరమాత్మయనియును అర్థమయినచో "ఋషయః = ఋషులు" అనియు "ప్రాణాః=ప్రాణములు" అనియు నిట్లు శ్రుతియందుండు బహువచన ప్రయోగ మెట్లుపొసగునని శంకింపఁగా నట్టి శంకను పరిహరించుటకై.

౨॥ సూ॥ గౌ ణ్య స మ్భ వా త్త త్ప్రా క్ఛ్రు తే శ్చ.

టీ॥ అసంభవాత్=బహువచన మసంభవమగుట వలనను, తత్ప్రాక్= సృష్టికి పూర్వము, శ్రుతేశ్చ=పరమాత్మ యొక్కఁడే యుండెనని శ్రుతియందు వినఁబడుట వలనను, గౌణీ=బహువచన శ్రుతి గౌణము, (స్యాత్=అగును).

తా॥ బహువచన మసంభవమగుటవలనను, సృష్టికిపూర్వము పరమాత్మ యొక్కఁడే యుండెనని శ్రుతి వలనఁ దెలియవచ్చుటవలనను బహువచన శ్రుతి గౌణమని సిద్ధమగుచున్నది.

శ్రీ॥ భా॥ బహువచనశ్రుతి గౌణము. ఏలననఁగా, బహువచన మీయర్థమున అసంభవము గదా. అట్లు, సృష్టికి పూర్వము పరమాత్మ యొక్కఁడే యున్నట్లు శ్రుతులు జెప్పుచున్నందుననే, యెఱుఁగునది.

3॥ సూ॥ తత్పూర్వకత్వాద్వాచః.

టీ॥ వాచః=నామధేయము, తత్పూర్వకత్వాత్=ఆకాశాదులు పూర్వపువిగా గలదగుటవలనను, ప్రాణః=ప్రాణశబ్దము పరమాత్మపరము.

తా॥ నామధేయమాకాశాదులకు తరువాతి దగుటవలనను ప్రాణశబ్దము పరమాత్మపరము.

శ్రీ॥ భా॥ ఈ క్రిందు గాన్పింపఁబడు హేతువువలనను పైశ్రుతియందుండు "ప్రాణ" శబ్దము పరమాత్మ వాచకమని స్పష్టమగుచున్నది. ఎట్లనిన, వాక్కు అనఁగా పరమాత్మ వ్యతిరిక్తములగు పదార్థములను దెలియఁజేయు నామధేయమనునది వాగ్విషయములగు నాకాశాదుల సృష్టికి తరువాతిది. అయితే "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" అనెడి శ్రుతివాక్యము "ఈ వియదాది ప్రపంచమంతయు నింతకు పూర్వము (సృష్టికి పూర్వము) నామరూపములచే స్పష్టము కానిదై, యిప్పుడు (సృష్టికాలమున) అది నామరూపములచే స్పష్టపఱుపఁబడుచున్నది" అని తెలుపుచున్నది. దీనిని బట్టి విచారింపఁగా, సృష్టికి పూర్వము నామరూపములను బొందియున్న పదార్థములే లేవని తెలియుచున్నది. అందువలన, అట్టి సమయమున వాగాదీంద్రియములకు ఉపయోగమెద్దియును గానఁబడదు. కావున నప్పుడు వాగాదీంద్రియములును లేవు. కావున ఆకాలపు స్థితిని వర్ణించు శ్రుతియందలి "ప్రాణ" శబ్దము వాగాదీంద్రియవాచకము గానేరదు. కావున నది పరమాత్మ వాచకమేయని యిందువలన సిద్ధమగుచున్నది.

ప్రాణోత్పత్త్యధికరణము ముగిసెను.



సప్తగత్యధికరణము.

౪॥ సూ॥ సప్తగతేర్విశేషితత్వాచ్చ.

టీ॥ సప్త=ఇంద్రియములు ఏడు, (ఏలననఁగా) గతేః = ఏడింటికి మాత్రమే గమనము శ్రుతియందు వినఁబడుట వలనను, విశేషితత్వాచ్చ=వాటికి మాత్రమే విశేష నిర్దేశముండుటవలననున్ను.

తా॥ ఏడింద్రియములు మాత్రమే జనన మరణములయందు జీవుని వెంబడించి లోకమున సంచరించుచున్నవని చెప్పి యున్నందునను, చక్షురాది జ్ఞానేం

ద్రియము లేడింటితోను మాత్రమే జీవుని గమనము విశేషింపఁబడుట వలనను ఇంద్రియము లేడేయని తెలియనచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ ఇఁక ఇంద్రియముల సంఖ్యను గుఱించి విచారింపఁబడును. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

శ్రుతు లింద్రియముల సంఖ్యను గుఱించి పరస్పరము విరుద్ధముగ జెప్పుచుండుటచే ఇంద్రియము లేడా? కాక, పదునొకండా?

## పూర్వపక్షము

ఏడింద్రియములకు మాత్రమే జన్మించునపుడును మృతిబొందునపుడును జీవుని తోడఁ గూడ లోకాంతరసంచారము శ్రుతులయందుఁ జెప్పియుండుటవలనను, చక్షుస్సు మొదలగు ఏడింద్రియములతోను మాత్రమే యట్టిగమనము విశేషింపఁబడియుండుట వలనను ఇంద్రియము లేడే యనుట యుక్తము. ఎట్లనిన, "సప్త ఇమే లోకా యేషు చరన్తి ప్రాణాః గుహాశయా నిహితా స్సప్తసప్త" అను శ్రుతివాక్యము,(ఓ శౌనకుఁడా! ఇంద్రియములు సంచరించులోకము లేడు. అవి ప్రతి జంతువుకును ఏడేసివంతున హృదయగుహాయందుండునవి" అని తెలుపుచున్నది. ఈ పై శ్రుతి యందు "సప్తసప్త" అని యిట్లు రెండు మాఱులు జెప్పుట ప్రతిజీవునికుండు ఏడేసు ఇంద్రియములను దెలుపుటకై యని యెఱుంగునది. కాఠకులును "యదా పఞ్చావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిం (కఠ. ౨-౬-౧౦) అను వాక్యమున, "ఎప్పుడు శ్రోత్రాది జ్ఞానేంద్రియములును, మనస్సును ఆత్మతోఁ జేరియుండునో, మఱియు బుద్ధియును నిశ్చలమయి యుండునో, దానినే శ్రేష్ఠమయిన గతినిగా అనఁగా మోక్షమార్గమునుగాఁ జెప్పుదురు" అనుచు ఏడింద్రియములతోనే యోగమార్గమును విశేషింపఁ జేసియున్నారు. ఇంద్రియములు శరీరములోపల సంచరించుటనువదలి మోక్షమునకై శరీరములోనుండి బయలువెడలుటయే యీపై శ్రుతి యందుఁ జెప్పఁబడిన పరమగతి యనఁబడు మోక్షమార్గము. ఇట్లు జననమరణములయందు ఏడు ఇంద్రియములు మాత్రమే జీవుని వెంబడించి పోవుచున్నవని చెప్పియున్నందునను, యోగదశను దెలియఁజేయు కాఠకశ్రుతియందు "జ్ఞానాని" అనుపదముచే చక్షురాది జ్ఞానేంద్రియము లేడు మాత్రము విశేషించి నిర్దేశింపఁబడుటవలనను శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణబుద్ధి మనస్సులనం బడునట్టి యింద్రియము లేడే ఈ జీవునికిఁ గలవని సిద్ధ మగుచున్నది. ఉపనిషత్తులయందుఁ గొన్ని తావుల విషయగ్రాహకము లగుటచే "అష్టౌ గ్రహాః"

('గ్రహములనంబడు యింద్రియము లెనిమిది') అనియును, మఱికొన్నితావుల "సప్త వై శీర్షణ్యాః ప్రాణాః ద్వావవాఞ్చౌ" ('శ్రోత్రాదు లేడును పాయూపస్థలు రెండును జేరి యింద్రియములు తొమ్మిది') అనియును, మఱికొన్ని తావుల "ఈతొమ్మిదియు వాక్పాణి పాదాహంకార చిత్తములయిదును జేరి యింద్రియములు పదునాలుగు" అనియు నివ్విధముగఁ జెప్పియున్నను, అవి యన్నియును జననమరణములయందు జీవునితోఁగూడ బోవుచున్న ట్లెచటను జెప్పియున్నట్లు గానఁబడదు. అయితే యవి జీవునికి స్వల్పస్వల్పోపకారముల నొనర్చుటంజేసి యింద్రియములుగాఁ జెప్పఁబడుచున్నవి. ఇంతియే.

అవతారిక:— ఈ పైని చెప్పినప్రకార మింద్రియము లేడే యని పూర్వపక్షము రాఁగా,

౬॥ సూ॥ హ స్తా ద య స్తు స్థి తే ఽ తో నై వ మ్

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, హస్తాదయః = హస్తాదులు, స్థితే= జీవునివిషయమై భోగోపకరణములుగా నుండగా, అతః=ఇందు వలన, ఏవమ్= ఇంద్రియ లేడేయని, న=తలఁపఁగూడదు.

తా॥ జీవునికి భోగోపకరణము లగుటంజేసి హస్తాదులును యింద్రియములు గాను గలవు గాన, నింద్రియము లేడె యని తలంపఁగూడదు.

సి ద్ధాం త ము.

శ్రీ॥ భా॥ ఇంద్రియములు పదునకొండు గాని యేడు కావు. హస్తపాదాదులును శరీరమునందుండు జీవునికి భోగసాధనము లయినవి గదా! శ్రోత్రాదులు శ్రవణాదికర్మములయం దుపయుక్తము లగునట్లు, హస్తపాదాదులును శ్రవణాది భిన్నములగు గ్రహణ గమనాది కార్యములయం దుపయోగపడుచున్నట్లు మనము చూచుచున్నాము. కనుక హస్తపాదాది కర్మేంద్రియములును గలవు. అవి లేవని తలంపవలదు. మనస్సనఁబడునది యొక్కటియే యధ్యవసాయనిష్ఠమయిన దగునపుడు బుద్ధియనియు, అభిమాననిష్ఠమైన దగునపుడు అహంకారమనియు, చిన్తానిష్ఠమయిన దగునపుడు చిత్తమనియు, నిట్లు వృత్తిభేదములనుబట్టి నామభేదముచే వ్యవహరింపఁబడుచున్నది. కావున ఇంద్రియములు పదునొకండు (శ్రోత్రాదులయిదును, హస్తాదులయిదును మనస్సొక్కటియును జేరి పదునొకండు) ఈ యింద్రియసంఖ్య శ్రుతిస్మృతులవలనఁగూడ సిద్ధమగుచున్నది. ఎట్లనిన, "దశేమే పురుషే ప్రాణాః ఆత్మైకాదశః" (శ్రోత్రాది జ్ఞానేంద్రియములును హస్తాది కర్మేంద్రియములును జేరి పదియును ఆత్మ అనఁగా మనస్సొక్కటియును ఈ పురుషునియందు గలవు) అను శ్రుతివాక్యమును "ఇంద్రియాణి దశైకంచ

పఞ్చచేంద్రియ గోచరాః" (ఇంద్రియములు పదియు నొక్కటియును వానిలో నయిదుమాత్రము యింద్రియగోచరములు) అను శ్రీభగవద్గీతా వాక్యమున్ను "తైజసా నీంద్రియాణ్యాహుః దేవా వైకారికా దశ ఏకాదశం మనశ్చాత్ర" (తైజసములును వైకారికములునగు యింద్రియములు పదియును మన స్సొక్కటియును జేరి పదునొకండు) అను శ్రీ విష్ణుపురాణ వాక్యమును ఈ మొదలగునవి యింద్రియములు పదునొకండని స్థిరపఱచుచున్నవి. అయితే కొన్నితావుల ఇంద్రియములు పదునొకండుకంటె నెక్కువ సంఖ్యగలవిగాఁ జెప్పబడుట మనోవృత్తులను గూడ ఇంద్రియములను గాను గణించుకొనుట వలన ననియు, మఱి కొన్నితావుల పదునొకండు కంటె తక్కువ సంఖ్య గలవిగాఁ జెప్పఁబడుట ఆ యాతావుల వివక్షితములగు గమనాదికార్యవిశేషములను బట్టి యనియు నెఱుఁగునది. కావున ఇంద్రియములు పదునొకండని సిద్ధమగుచున్నది.

సప్తగత్యధికరణము ముగిసెను.

---

## ప్రాణాణుత్వాధికరణము

### ౬॥ సూ॥ అణవశ్చ.

టీ॥ అణవః-చ=ఇంద్రియము లణుపరిమాణములు.

తా॥ ఇంద్రియము లణుపరిమితములు.

శ్రీ॥ భా॥ ఈ యధికరణమున నింద్రియముల పరిమాణమును గుఱించి విచారింపఁబడును. ఇందును గుఱించి యొక సంశయము గలుగు చున్నది.

### సంశయము.

ఇంద్రియములు విభుపరిమాణములా? లేక, అవి యణుపరిమాణములా?

### పూర్వపక్షము.

వాజసనేయులు "త ఏతే సర్వ ఏవ సమాః సర్వే అనంతాః" (బృ. 3 అ. ౫ బ్రా. ౧3 వా) అనువాక్యమున "ఈ యింద్రియములన్నియును సమానమగు వ్యాప్తిగలవై యనంతము లైనవి" అనుచు నిట్లు ఇంద్రియము లనంతములని చెప్పియున్నందున నవి విభుపరిమాణము లనుట యుక్తమనిన.

### సిద్ధాంతము.

"ప్రాణ మనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" అను శ్రుతి వాక్యము "జీవునితోఁగూడ శరీరములోనుండి బయలు వెడలు ముఖ్యప్రాణము ననుసరించి సర్వేంద్రియములును బయలు వెడలుచున్నవి" అనుచు ఇంద్రియములు శరీరములో నుండి బయలువెడలునవియని తెలుపుచున్నది. కనుక

నవి యొకవిధమైన పరిమాణము గలవి గానే యుండవలయును. ఇట్లు అవి శరీరము లోనుండి బయలు వెడలునపుడు, ప్రక్కననుండువారికి గానఁబడకున్నవి గాన, నవి యణుపరిమాణము లనుట యుక్తము. " అథ యో హైఽతాననంతా నుపాస్తే" (ఎవఁడు ఇంద్రియముల ననంతములనుగా నుపాసించుచున్నాఁడో) అను శ్రుతి వాక్యము ఉపాసనా ప్రకరణమునఁ బఠింపఁబడినదయినందున ఉపాస్యపదార్థము లగు ఇంద్రియములయొక్క కార్యము లనేకము లగుటనుబట్టి యింద్రియములన నంతములనుగా నుపాసింపవలయునని తెలుపుచున్నది గాని, యింద్రియము లంత ములేనివి అనఁగా మితిమీఱిన పరిమాణముగలవని తెలియఁజేయుచుండ లేదు.

## ౭॥ సూ॥ శ్రేష్ఠశ్చ.

టీ॥ శ్రేష్ఠః-చ=ముఖ్యప్రాణమున్ను (ఉత్పన్నమగుచున్నది)

తా॥ ముఖ్యప్రాణమున్ను ఇతరప్రాణములవలె బ్రహ్మజన్యము.

శ్రీ॥భా॥ ఇప్పుడు ముఖ్యప్రాణము యొక్క జన్మను గుఱించి విచారింపఁ బడును. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ముఖ్యప్రాణమునకు జన్మము కలదా ? లేదా ? తమలోనేది శ్రేష్ఠమయిన దనెడి యంశమును గుఱించి యింద్రియములకు పరస్పరము వివాదము గలిగిన పుడు, శరీరస్థితికి హేతువగుటచే ముఖ్యప్రాణము శ్రేష్ఠమయినదిగా నిర్ణయింపఁ బడినది. కావున సూత్రమునందలి శ్రేష్ఠశబ్దమునకు ముఖ్యప్రాణమని యర్థము.

### పూర్వపక్షము.

ముఖ్యప్రాణము జన్మించునది కాదు. ఏలననిన, "ఆనీదవాతం స్వధయా తదేకం" (అది యొక్కటి వాయువు లేకపోయినను, స్వనియమముచే నుచ్ఛ్వాస నిశ్వాసములతోఁ గూడుకొని యుండెను) అను శ్రుతివాక్యము మహాప్రళయము నను గూడ ముఖ్యప్రాణము వాయుకార్యములగు నుచ్ఛ్వాసనిశ్వాసములతోఁ గూడియుండెనని తెలియఁజేయుచున్నది. అయితే "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (పర బ్రహ్మము నుండి ప్రాణము పుట్టుచున్నది) అను శ్రుతివాక్యము ప్రాణమునకు జన్మము గలదని తెలియఁజేయుచున్నను, ఆవాక్యము జీవునికి జన్మము గలదని తెలుపు వాక్యమువలె గౌణార్థము గావచ్చుననిన,

### సిద్ధాంతము.

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, ముఖ్యప్రాణము జన్మము లేని దియేయయి, ప్రళయకాలమున సయితము నాశము నొందని దగు పక్షమున, ప్రళయకాలమున అనఁగా సృష్టికిపూర్వము బ్రహ్మ మొక్కటియే యుండెననియు,

బ్రహ్మముకంటె వేఱగు పదార్థమెద్దియును అట్టి సమయమున లేదనియును తెలుపునట్టి శ్రుతివాక్యములు విరోధించును. ఇంతియెకాక, "ఏతస్మాజ్జాయతే ప్రాణః" ఇత్యాదిశ్రుతులు పృథివ్యాదిభూతములవలె ముఖ్యప్రాణము గూడ బ్రహ్మము నుండి పుట్టుచున్నదని గదా తెలుపుచున్నవి. మఱియు జీవునికి జన్మములేదని శ్రుతులయందుఁజెప్పి యున్నట్లు, ముఖ్యప్రాణమునకుఁగూడ జన్మములేదని శ్రుతులయందెచ్చటను చెప్పియుండలేదు. కావున ముఖ్యప్రాణమునకు జన్మము గలదనుట యుక్తము. "అనీదవాతం" ఇత్యాది శ్రుతివాక్యము బ్రహ్మమొక్కటియే ప్రళయకాలముననుగూడ నాశము నొందక స్థిరముగానున్నదని తెలుపుచున్నది గాని, యది జీవసంబంధియగు ముఖ్యప్రాణ మట్టిది యని తెలుపుచుండలేదు. కనుకనే యీపై శ్రుతియందు "అవాతం" అనుపదముచే అట్లు ప్రళయ కాలమున గూడ స్థిరముగానుండు వస్తువు "వాతాపేక్ష లేనిది" అని తెలుపఁబడెను. ఇతరప్రాణములకువలెనే ముఖ్యప్రాణమునకును జన్మము ఉన్నట్లు పూర్వ సూత్రములవలననే విశదమగుచుండుటచే, ఇప్పుడీ విషయమును గుఱించి విచారింపవలసిన యావశ్యకత లేకపోయినను, ముఖ్యప్రాణమును గుఱించి యుత్తర సూత్రములచే విచారింపఁబోవుచున్నారు గాన, దానిని గుఱించి యిప్పుడు ప్రస్తాపించి యున్నారు.

ప్రాణాణుత్వాధికరణము ముగిసెను.

## వాయుక్రియాధికరణము

౮॥ సూ॥ న వాయుక్రియే పృథగుపదేశాత్.

టీ॥ పృథగుపదేశాత్ = వేఱుగాఁ జెప్పఁబడుటవలన, (ప్రాణః=ముఖ్య ప్రాణము) వాయుక్రియే=వాయుమాత్రము గాని, దాని క్రియామాత్రము గాని, న=కాదు.

తా॥ వాయు మాత్రముకంటెను, వాయు వ్యాపారమాత్రము కంటెను ముఖ్యప్రాణము వేఱయినదని శ్రుత్యుపదేశము లుండుటవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ ముఖ్యప్రాణమనఁగా నేది యనెడి యంశమును గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

అది పంచభూతములలో రెండవదియగు వాయువా? కాక, అట్టివాయువుయొక్క చలనరూపమగు క్రియయా? కాక, ఆవాయువు ఏదైన నొక విశేషముతోఁ గూడికొనినదై ముఖ్యప్రాణమనఁబడు చున్నదా?

—•◆ పూ ర్వ ప క్ష ము. ◆•—

"యః ప్రాణః స వాయుః" అను శ్రుతివాక్యము "ఏది ప్రాణమో అది వాయువు" అని చెప్పుచున్నందున ముఖ్యప్రాణమనఁగా వాయువనుట యుక్తము. అథవా, వాయుమాత్రమునకు లోకమున ప్రాణమను ప్రసిద్ధి లేనందునను, ఉచ్ఛ్వాసనిశ్వాసాదిరూపమగు వాయువ్యాపారమునకు లోకమున ప్రాణమను ప్రసిద్ధియున్నందునను, ఉచ్ఛ్వాసనిశ్వాసాది రూపమగు వాయువ్యాపారమే ముఖ్యప్రాణమని చెప్పఁదగుననిన.

—•◆ సి ద్ధాం త ము. ◆•—

వాయుమాత్రము గాని, లేక, ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమగు వాయుక్రియామాత్రము గాని ముఖ్యప్రాణము గాదు. ఏలననిన, "ఏతస్మా జ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ। ఖం వాయుః" (ప్రాణము, మనస్సు సమస్తములగు నింద్రియములు, ఆకాశము, వాయువు మొదలగునవి పరబ్రహ్మము నుండి పుట్టుచున్నవి) అను శ్రుతివాక్యమునందు వాయుప్రాణములు వేఱువేఱు పదార్థములుగా నిర్దేశింపఁబడుచున్నవి. ఇందువలననే ముఖ్యప్రాణ మనఁగా నుచ్ఛ్వాసనిశ్వాసరూపమగు వాయువ్యాపారము సయితము కాదు. ఏలననిన, అగ్న్యాదుల వ్యాపారము సయితము అగ్న్యాదులతోఁగూడ వేఱుద్రవ్యముగాను ఉపదేశింపఁబడదుగదా? "యః ప్రాణస్సవాయుః" అనుశ్రుతివాక్యము అవస్థాంతరమును బొందినట్టి వాయువే ప్రాణము గాని, యది తేజస్సు మొదలగు పదార్థములవలె తత్త్వాంతరము గాదని తెలియఁజేయుటకై "ఏది ప్రాణమో అది వాయువు" అనియిట్లు జెప్పుచున్నదే గాని, వాయుమాత్రము ప్రాణమని తెలియఁజేయుటకై గాదు. లోకవాడుకనుబట్టి విచారించినను, ప్రాణమనునది క్రియావంతమగు (కదలికగల) పదార్థము గాను తెలియవచ్చుచున్నదియే గాని, క్రియామాత్రము గాను (కేవల కదలికగాను) తెలియవచ్చుచుండలేదు. కనుకనే యుచ్ఛ్వాస నిశ్వాసములను గుఱించి వ్యవహరించునపుడు "ప్రాణము కదలుచున్నది" అని వ్యవహరించుచున్నాము.

అవతారిక:— ముఖ్యప్రాణమనఁగా వాయువుయొక్క వికారమగు నగ్నివలె భూతాంతరమా? యని శంకింపఁగా, అది కాదని తెలుపుటకై:—

౯॥ సూ॥ చ క్షు రా ది వ త్తు త త్స హ శి ష్ట్యా ది భ్యః.

టీ॥ తు = ముఖ్యప్రాణ మగ్నివంటి భూతాంతరముకాక, చక్షురాదివత్ = చక్షురాదులవంటి యొకయుపకరణమైనది. ఏలననఁగా, తత్ = అట్లు ఉపకరణమగుటయనునది, సహశిష్ట్యాదిభ్యః = చక్షురాదులతోఁగూడ నిది పఠింపఁబడుటవలన తెలియుచున్నది.

తా॥ ఛాందోగ్యమున ముఖ్యప్రాణము చక్షురాదులతోఁ గూడ పఠింపఁ బడుటచే వానివలె నిదియును జీవుని కొఱక భోగోపకరణముగాఁ దెలియవచ్చు చున్నది.

శ్రీ॥ భా॥ ముఖ్యప్రాణము అగ్న్యాదులవంటి యొక భూతవిశేషము కాదు. అయితే యిది చక్షురాదీంద్రియములవలె జీవుని కొఱక యుపకరణ విశేషము. కనుకనే ప్రాణసంవాదమున ముఖ్యప్రాణమును చక్షురాదీంద్రియములతోఁగూడఁ జేర్చి యున్నారు. సజాతీయపదార్థములనే గదా మన మొక దానితోఁగూడ వేఱొక్క దానిఁజేర్చి పేర్కొనెదము. "అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణః" అనియు "యోఽయం మధ్యమః ప్రాణః" అనియు నీశ్రుతులు గూడ ప్రాణములనంబడు ఇంద్రియములను గుఱించి చెప్పు సందర్భమున ముఖ్యప్రాణమును విశేషించి నిర్దేశించుటవలనను గూడ ముఖ్యప్రాణము ఉపకరణ విశేషమని సూత్రమందలి "ఆది" శబ్దము తెలియఁజేయుచున్నది.

అవతారిక:— చక్షురాదీంద్రియములవలె ముఖ్యప్రాణము సయితము జీవుని కొఱక యుపకరణ విశేషమగు పక్షమున, వానినుండివలెనే దీనినుండియును జీవుని కొఱక యుపకారము గలుగు చుండవలయును. అయితే యట్టి యుపకారమెద్దియునుగానఁబడదు. కనుక ముఖ్యప్రాణము చక్షురాదీంద్రియములవలె జీవుని కొఱక యుపకరణమని చెప్పుట యుక్తముకాదని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై:—

౧౦॥ సూ॥ అకరణత్వాచ్చ న దోష స్తథా హి దర్శయతి.

టీ॥ అకరణత్వాత్=(చక్షురాదులవలె ముఖ్యప్రాణము) జీవునికి ఉపకారకమయినది కానందున, దోషః=(ముఖ్యప్రాణము జీవునికొఱక యుపకరణమనుట) దోషము, (ఇతిచేత్=ఇట్లంటివేని) న=అది యుక్తముకాదు. ఏలనిన, తథాహి= అట్లే కదా, దర్శయతి=శ్రుతి తెలుపుచున్నది.

తా॥ చక్షురాదులవలె ముఖ్యప్రాణము జీవునికి ఉపకారకము గానందున, నది యొక యుపకరణ మనుట దోషమంటివేని, యది యుక్తము కాదు. ఏలననిన, అది జీవుని కొఱకయుపకారము నొనర్చుచున్నట్లు శ్రుతియే తెలుపుచున్నది గదా.

శ్రీ॥ భా॥ ముఖ్యప్రాణము చక్షురాదీంద్రియములవలెనే జీవునికి ఉపకారకమయినది కాదని చెప్పుట కవకాశము లేదు. ఏలననిన, అది శరీరేంద్రియములను ధరించుటయనెడి యుపకారము నొనర్చుచున్నట్లు శ్రుతులు తెలుపుచున్నవి. ఎట్లనిన, వాజసనేయులు "యస్మిన్నుత్క్రాంతే ఇదం శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే స వః శ్రేష్ఠః" ఇత్యాది వాక్యమున "ఏది యీ శరీరమును

విడిచినప్పుడు లోకులీశరీరమును పాపిష్ఠమయిన దానినిగాఁ దలంచుచున్నారో, యదియే తాను నిలిచియుండియు సర్వమును నిలుపుచున్నది. కావున నది శ్రేష్ఠ మయిన దనిపించుకొనుచున్నది''అని యివ్విధమునఁ బలించుటచే వాగాదీంద్రియ ములలో నేది శరీరమును వదలినను, శరీరమును తదితరములగు ఇంద్రియములు ను శిథిలములుకానివై యుండుననియు, ముఖ్యప్రాణ మీశరీరమును వదలినచో, శరీరేంద్రియాదులన్నియును, శిథిలములై పోవుచున్నవనియును, చెప్పుటచే ముఖ్య ప్రాణము శరీరేంద్రియాది ధారణరూపమగు నుపకారము నొనర్చునదియని తెలియఁజేయుచున్నారు. కనుక ప్రాణమనియు, అపానమనియు, వ్యానమనియు, ఉదానమనియు, సమానమనియు, నిట్లు ఐదు విధములగు వృత్తులతోఁగూడి కొనినదై ముఖ్యప్రాణము జీవునికి శరీరేంద్రియధారణ రూపమగు నుపకారము నొనర్చుచు చక్షురాదీంద్రియములవలెనే జీవునికొక యుపకరణ మనిపించు కొను చున్నది.

అవతారిక:—నామభేదమునుబట్టియు, కార్యభేదమునుబట్టియు ప్రాణా పానాదులు భిన్న భిన్న పదార్థములుగాఁ దెలియవచ్చుచున్న వే యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౧౧॥ సూ॥ ప ఞ్చ వృ త్తి ర్మ నో వ ద్వ్య ప ది శ్య తే.

టీ॥ మనోవత్=మనస్సువలెనే, పఞ్చవృత్తిః = ముఖ్యప్రాణము పఞ్చ వృత్తులు కలదిగా, వ్యపదిశ్యతే=ఉపదేశింపఁబడుచున్నది.

తా॥ మనస్సు వృత్తిభేదములు కలదయినట్లు గానే, ముఖ్యప్రాణము అయిదు వృత్తిభేదములు గలదని శ్రుతి యుపదేశించుచున్నది.

శ్రీ॥ భా॥ కామ, సంకల్ప, విచికిత్సాదులును వానికార్యములున్ను పర స్పరము భిన్నములయినను, ''కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీర్ధీర్భీరి త్యేతత్సర్వం మన ఏవ'' (బృ.3 అ. ౫ బ్రా. 3 వా) (కోరికయు సంకల్పమును, సంశయజ్ఞానమును, ఆస్తిక్యబుద్ధియును, ఆస్తిక్యబుద్ధి లేక పోవుట యును, ధారణమును ధారణము లేక పోవుటయును, లజ్జయును, ప్రజ్ఞయును, భయమును నీమొదలయిన, సమస్తమును, మనస్సే) అను శ్రుతివాక్యమువలన కామాదులన్నియును జేరి మనస్సని తెలిసికొనుచున్నాము గదా! అట్లే ప్రకృ తమునను, ''ప్రాణోఽపానో వ్యాన ఉదాన స్సమాన ఇత్యేతత్సర్వం ప్రాణ ఏవ'' (బృ. 3 అ. ౫ బ్రా. 3 వా.) (ప్రాణమనియు అపానమనియు, వ్యానమనియు, ఉదానమనియు, సమానమనియు నిదియంతయు ప్రాణమే) అను శ్రుతి ప్రమాణ మువలనఁ ప్రాణాపానాదులన్నియును జేరి ముఖ్యప్రాణమేయని తెలుఁగునది.

కావున ప్రాణాపానాదులు ముఖ్యప్రాణముయొక్క వృత్తి విశేషములు గాని, పరస్పరము భిన్న భిన్న పదార్థములు కావు.

వాయుక్రియాధి కరణము ముగిసెను.

శ్రేష్ఠాణుత్వాధి కరణము.

౧౨॥ సూ॥ అణుశ్చ.

టీ॥ అణుః-చ=ముఖ్యప్రాణము అణుపరిమాణము గలది.

తా॥ ముఖ్యప్రాణము సయితము ఇతర ప్రాణములవలెనే యణుపరిమాణము గలది.

శ్రీ॥ భా॥ "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి" (బృ. ౬ అ. ౪ బ్రా. 3 వా.) (శరీరములోనుండి బయలు వెడలు జీవుని యనుసరించి ముఖ్యప్రాణము సయితము బయలు వెడలుచున్నది) అను శ్రుతి వాక్యమువలన ముఖ్యప్రాణము శరీరములోనుండి బయలు వెడలునదిగాఁ దెలియవచ్చుచున్నం దున నది యణుపరిమాణము గలది యగుట సంప్రాప్తమే.

శంక:—అయినను, "సమ ఏభిః త్రిభి ర్లోకైః సమోఽనేన సర్వేణ" (బృ. 3 అ. 3 బ్రా. ౨౨ వా.) (ముఖ్య ప్రాణ మీ మూఁడులోకములతోను, ఈసమస్తముతోనును, సమానమయినది) అనియు "ప్రాణే సర్వం ప్రతిష్ఠితం" (ఇదియంతయును ప్రాణమే యాధారముగాఁ గలది) అనియు, "సర్వం హీదం ప్రాణేనావృతం" (జగత్తంతయును ప్రాణముచే నావరింపఁబడినది) అనియు నీ మొదలగు శ్రుతి వాక్యములవలన ముఖ్యప్రాణము విభుపరిమాణము గలదిగాఁ దెలియవచ్చుచున్నదనిన ;

సమాధానము:—ముఖ్యప్రాణము శరీరములోనుండి బయలు వెడలు చున్నదని తెలుపునట్టి శ్రుతివాక్యమువలన దాని కొకపరిమితి గలదని మనము తెలిసి కొనుచున్నాము. కావున నీపైని యుదహరింపఁబడిన శ్రుతులు సర్వజంతువులకును ప్రాణమే యాధారమగుటనుబట్టి దానిని గొప్పదానినిగాఁ దెలుపుచున్నవి. ఇంతియె.

శ్రేష్ఠాణుత్వాధికరణము ముగిసెను.

జ్యోతిరాద్యధిష్ఠానాధి కరణము.

౧౩॥ సూ॥ జ్యోతిరాద్యధిష్ఠానంతు తదామననాత్ప్రాణవతా శబ్దాత్.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, ప్రాణవతా=జీవునితోఁగూడ, జ్యోతిరాద్యధిష్ఠానం=అగ్న్యాదిదేవతలయొక్క ప్రాణవిషయమగు నధిష్ఠానము, తదా

మననాత్ = పరమాత్మయొక్క సంకల్పమువలన (భవతి=కలుగుచున్నది). ఏల ననిన, శబ్దాత్ = శ్రుతివలన (ఏవం=ఇట్లు, అవగమ్యతే= తెలియుచున్నది).

తా॥ జీవులును, దేవతలును ఇంద్రియముల కధిష్ఠాతలుగానుండుట పరమ పురుషుని సంకల్పమున కధీనమని శ్రుతులవలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ముఖ్యప్రాణమున్ను, ఇతరప్రాణములున్ను పరబ్రహ్మము నుండి పుట్టుచున్నవని ప్రతిపాదింపఁబడియె. వాని పరిమాణమున్ను నిరూపింపఁ బడియె. మఱియు అగ్న్యాదిదేవతలట్టి ప్రాణముల కధిష్ఠానదేవతలనియును "అభిమాని వ్యపదేశస్తు విశేషానుగతిభ్యాం" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౫ సూ) అను సూత్రముచేఁ బ్రసంగవశమునఁ బ్రతిపాదింపఁబడియె. ఈ ప్రాణములు జీవునికి భోగోపకరణము లయినందున జీవుఁడు వీని నధిష్ఠించి యుండువాఁడను విషయ మందఱును ఎఱింగినదియే. "ఏవమే వైష ఏనాన్ ప్రాణాన్ గృహీత్వా స్వేశరీరే యథాకామం పరివర్తతే" (బృ. ౪ అ. ౧ బ్రా. ౧౮ వా.) (జీవుఁడు ఇంద్రియముల నుపసంహరించుకొని తన శరీరమునందు స్వేచ్ఛగ సంచరించుచున్నాఁడు) అనెడి శ్రుతివాక్యమువలనను, ఈవిషయము తెలియుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఇట్లు జీవులును అగ్న్యాదిదేవతలును ఇంద్రియముల కధిష్ఠాతలుగా నుండుట వారి యిచ్ఛకధీనమయినదా ? లేక, వారట్లుండుట సర్వేశ్వరుని సంకల్పమున కధీనమయినదా ?

## పూర్వపక్షము.

వీరలు ఇంద్రియముల కధిష్ఠాతలుగానుండుటలో సర్వేశ్వరుని యపేక్షింపవలసిన దెద్దియును గానఁబడదు గాన, వారు స్వతంత్రము గానే యధిష్ఠాతలుగా నున్నారు.

## సిద్ధాంతము.

ఇట్లు చెప్పుట యుక్తము గాదు. జీవులును అగ్న్యాది దేవతలును సర్వేశ్వరుని సంకల్పము వలననే ఇంద్రియముల కధిష్ఠాతలుగా నుండి యున్నారు. ఇంద్రియములును, ఇంద్రియాభిమాని దేవతలున్ను జీవాత్మలున్ను, సర్వేశ్వరుని సంకల్పమున కధీనులయి, తమ తమ కార్యముల నొనర్చుచున్నట్లు శ్రుతులు తెలుపుచున్నవి. ఎట్లనిన, అంతర్యామి బ్రాహ్మణాదులయందు "యోఽగ్నౌ తిష్ఠన్నగ్నేరంతరో యమగ్నిర్న వేద యస్యాగ్నిశ్శరీరం యోఽగ్ని మంతరో యమయతి సత ఆత్మా అన్తర్యామ్యమృతః" అనియు "యో వాయౌ తిష్ఠ్" అనియు "య ఆదిత్యే తిష్ఠ్" అనియు "య ఆత్మని తిష్ఠన్" అనియు "యశ్చక్షుషి తిష్ఠ్"

అనియు నీమొదలగువాక్యములు సర్వేశ్వరుఁడు అగ్న్యాదిత్యాది దేవతలయందును, సమస్త జీవకోట్లయందును, చక్షురాదీంద్రియముల యందునుండి, వానిలోపలనున్నవాఁడై, వానిచేఁ దెలిసికొనఁబడక, అవి తనకు శరీరముగ గలవాఁడై వాటిని తాను నియమించుచున్నాఁడు"అని యివ్విధమునఁ జెప్పుచుండుటచే జీవుఁడును అగ్న్యాదిదేవతలున్ను, యింద్రియములున్ను సర్వేశ్వరుని నియమములో నుండునవి యని తెలిసికొనుచున్నాము. మఱియు "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః" (సర్వేశ్వరుని భయమువలననే గాలి వీచుచున్నది, సూర్యుఁడు ఉదయించుచున్నాఁడు, అగ్నియును, ఇంద్రుఁడును, అయిదవ వాఁడగు యముఁడును వారివారి కార్యముల యందు జాగరూకతోఁ బ్రవర్తించుచున్నారు) అనియు "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్ర మసౌ విధృతౌ తిష్ఠతః" (ఓగార్గి ఇంతకు పూర్వము జెప్పఁబడిన యక్షరస్వరూపుఁడగు పరబ్రహ్మముయొక్క యాజ్ఞవలన సూర్యచంద్రులు తమతమ స్థానములను విడువక యున్నారు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు గూడ ఇట్లే తెలుపుచున్నవి గదా!

౧౪॥ సూ॥ <u>తస్య చ నిత్యత్వాత్.</u>

టీ॥ తస్యచ=అన్నింటిని పరమాత్మయధిష్ఠించియుండుట, నిత్యత్వాత్=నిత్యమగుటవలన.

తా॥ పరమాత్మ నిత్యముగ ఈ సమస్తజీవుల నధిష్ఠించి యున్నందున నగ్న్యాదిదేవత లింద్రియముల కధిష్ఠానదేవతలుగా నుండుట పరమపురుషుని సంకల్పమున కధీన మయినదియే.

శ్రీ॥ భా॥ సర్వేశ్వరుఁడే సమస్త జీవులను నిత్యముగా నధిష్ఠించియున్నందునను, వీటి స్వరూపమునుబట్టి సర్వేశ్వరుఁడట్లుండుట నియతమగుటవలనను వీరలు సర్వేశ్వరుని సంకల్పమున కధీనముగానే యింద్రియముల కధిష్ఠాతలుగానుండి యుండవలయును. కనుకనే "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్" (తై. ఆ. ౮-౧.) (పరబ్రహ్మము జగత్తును సృజించి యట్లు తనచే సృజింపఁబడిన జగత్తునందు తాను ప్రవేశించి చేతనముగాను అచేతనము గాను నాయెను) అను శ్రుతివాక్యము పరమపురుషుఁడు ప్రపంచమునందుండు సమస్త చిదచిత్పదార్థములలోను నియామకుఁడుగాఁ బ్రవేశించి వాటికి సత్తను గలుగఁజేయుచున్నాఁడని తెలుపుచున్నది. స్మృతియందును,

శ్లో॥ విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితోజగత్॥

భ. గీ. ౧౦. అ. ౪౨. వా.

తా॥ "ఓ యర్జునా! నేను నాయొక్క యంశముచే నీజగత్తు నంతయును వ్యాపించియున్నాను" అని చెప్పంబడియె.

జ్యోతిరాద్యధిష్ఠానాధి కరణము ముగిసెను.

ఇంద్రియాధి కరణము.

౧౭॥ సూ॥ త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్.

టీ॥ శ్రేష్ఠాత్=ముఖ్యప్రాణముకంటె, అన్యత్ర=వేఱగు వాటిని గుఱించి యే తద్వ్యపదేశాత్=ఇంద్రియకథన ముండుటవలన, తే = ముఖ్యప్రాణవ్యతిరిక్తములగు ప్రాణములు, ఇంద్రియాణి=ఇంద్రియములు.

తా॥ ముఖ్యప్రాణము కాక, తక్కిన ప్రాణములను గుఱించి మాత్రమె శాస్త్రమున నింద్రియములని చెప్పియుండుటంజేసి యితరప్రాణములు మాత్రమే యింద్రియములు.

శ్రీ॥ భా॥ ఇంతకుపూర్వము ప్రాణములనఁగా నింద్రియములని చెప్పఁబడియె. ఈ విషయమును గుఱించి యొకసంశయము గలుగుచున్నది.

సంశయము.

ప్రాణములనఁబడునవన్నియును అనఁగా ముఖ్యప్రాణమును, ఇతరప్రాణములును జేరి, యింద్రియములా! లేక, ముఖ్యప్రాణము కాక, ఇతరప్రాణములు మాత్రమే యింద్రియములా!

పూర్వపక్షము

సమస్తప్రాణములు అనఁగా ముఖ్యప్రాణమున్ను ఇతరప్రాణములున్ను అన్నియును ప్రాణములనియె పిలువఁబడుట వలనను, జీవుని కుపకరణములయి నందునను ఇవియన్నియును ఇంద్రియములే యనుట యుక్తమనినచో.

సిద్ధాంతము.

ఇట్లు జెప్పుట యుక్తము కాదు. ముఖ్యప్రాణము కాక, తక్కిన ప్రాణములుమాత్ర మింద్రియములు. ఇవి మాత్రమే యింద్రియములని శాస్త్రకారులు గూడ జెప్పియున్నారు. ఎట్లనిన, శ్లో॥ "ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః" అనఁగా, "ఇంద్రియములు పదునొకండు వానిలో నింద్రియగోచరములయినవి అయిదు" అనెడి శాస్త్రమునందు నింద్రియగోచరములయినట్టి హస్తపాదాది కర్మేంద్రియము లయిదును పోఁగా, ఇంద్రియవిషయములు గానట్టి చక్షురాదీంద్రియము లయిదును మనస్సున్ను ఆఱు యింద్రియములుగా గ్రహింపఁబడియెను కాని, ముఖ్యప్రాణము ఇంద్రియముగా గ్రహింపఁబడ లేదు.

## ౧౯॥ సూ॥ భేదశ్రుతే ర్వైలక్షణ్యాచ్చ.

టీ॥ భేదశ్రుతేః = (చక్షురాదీంద్రియములకును ముఖ్యప్రాణమునకును) భేదమును దెలుపు శ్రుతి యుండుటవలనను, వైలక్షణ్యాచ్చ = (ఇంద్రియముల నుండి ముఖ్యప్రాణమునకు) వైలక్షణ్యము గన్పట్టు చున్నందునను,

తా॥ శ్రుతియందు ఇంద్రియములకును ముఖ్యప్రాణమునకును భేదము జెప్పియుండుటవలనను, వానికి పరస్పరము వైలక్షణ్యము గన్పట్టు చున్నందునను ఇంద్రియములు తత్త్వాంతరములుగాఁ దెలియవచ్చుచున్నవి.

శ్రీ॥ భా॥ "ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ" (ముఖ్యప్రాణమును, మనస్సును, సమస్తములయిన యింద్రియములును, ఈ పరబ్రహ్మమునుండి బుట్టుచున్నవి) అనెడి శ్రుతివాక్యమున ముఖ్యప్రాణము, ఇంద్రియములకంటె వేఱయినదిగాఁ జెప్పఁబడి యున్నందున, ముఖ్యప్రాణము తప్ప తక్కినవియే యింద్రియములని తెలియుచున్నది. ఈ పైవాక్యము నందు మనస్సున్ను వేఱయినదిగాఁ జెప్పఁబడియున్నను, "మనష్షష్ఠానీంద్రియాణి" (మనస్సుతోఁగూడ ఇంద్రియము లాఱు) అనెడిప్రమాణాంతరమున మనస్సున్ను ఒక యింద్రియముగాఁ జెప్పఁబడినది. ఇంద్రియములనుండి ముఖ్యప్రాణ మునకు వైలక్షణ్యము గూడ గన్పట్టుచున్నది. ఎట్లనిన, సుషుప్త్యవస్థయందు ముఖ్యప్రాణము తన వ్యాపారమునం దున్నట్లు మనము దెలిసికొనుచున్నాము. చక్షురాదీంద్రియములన్ననో, అట్టి సమయమున, తమతమ కార్యముల నొనర్చు చున్నట్లు మనకుఁ దెలియుచుండ లేదు. మఱియు వాని కృత్యమున్ను వేఱయినది. ఎట్లనిన, చక్షురాదీంద్రియములును మనస్సున్ను జ్ఞానమును గలుగఁజేయుటకు సాధనములగు చున్నవి. ముఖ్యప్రాణమో, శరీరమును, చక్షురాదీంద్రియములను ధరించుచున్నది. అయితే ఇంద్రియములు ముఖ్యప్రాణమున కధీనమగు ప్రవృత్తి గలవి యగుటనుబట్టి శాస్త్రకారులు వాటిని గూడ ప్రాణములని వ్యవహరించి యున్నారు. "త ఏతస్యైవ సర్వే రూప మభవన్ తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే" అనెడి శ్రుతివాక్యముగూడ "ఇంద్రియములు ముఖ్యప్రాణముయొక్క శరీర మయినందున ప్రాణములని పిలువఁబడుచున్నవి" అని చెప్పుచున్నది. ఈ పైశ్లోక మున "రూప మభవన్=రూపమయినవి" అనఁగా శరీరమయిన వాయె ననుట. ప్రాణాధీనమగు ప్రవృత్తి గలవి యాయెనని యర్థము.

ఇంద్రియాధికరణము ముగిసెను.

## —✤ సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము. ✤—

౧౭॥ సూ॥ సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్

టీ॥ తు = పూర్వపక్షము యుక్తము కాదు. సంజ్ఞామూర్తిక్లృప్తిః = (సంజ్ఞా = నామము, మూర్తి = రూపము, క్లృప్తిః = వ్యాకరణము) నామ రూప వ్యాకరణము, త్రివృత్కుర్వతః = త్రివృత్కరణము నొనర్చినవానికే ఉపపన్నమగును. ఏలననఁగా, ఉపదేశాత్ = శ్రుతి యట్లు జెప్పుటవలన,

తా॥ నామరూపవ్యాకరణము సర్వేశ్వర కర్తృకము. అట్లే గదా శ్రుతి జెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ భూతేంద్రియాదులయొక్క సమష్టిసృష్టియును, జీవులకుఁగల కర్తృత్వమును పరబ్రహ్మముయొక్క సంకల్పమున కధీనములని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడియె. మఱియు జీవులు తమతమ యింద్రియముల నధిష్ఠించి యుండుటయును పరబ్రహ్మముయొక్క సంకల్పమున కధీనమయినది యనెడి యంశము నీకమీఁదు స్థిరపరచుటకై యీ విషయము సూచింపబడియె. నామరూప విశదీకరణ రూపమగు ప్రపంచవ్యష్టిసృష్టిని గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

### —◆ సంశయము. ◆—

అది సమష్టిజీవస్వరూపుఁడగు హిరణ్యగర్భునియొక్క కార్యమా? కాక, ఉదకాదుల సృష్టి యగ్న్యాది శరీరుఁడగు పరబ్రహ్మముయొక్క కార్యమగునట్లు, అది హిరణ్యగర్భశరీరుఁడగు పరబ్రహ్మముయొక్క కార్యమా?

### —◆ పూర్వపక్షము. ◆—

అది సమష్టిజీవరూపుఁడగు హిరణ్యగర్భునిచేఁ జేయఁబడునది యనుట యుక్తము. ఏట్లనిన, ఛందోగులు "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను వాక్యమున "జీవరూపముతో పృథివ్యాది భూతములలోఁ బ్రవేశించి వాటి నామరూపములను స్పష్టపఱచుచున్నాను" అని పఠించుటచే నది జీవకర్తృకమని తెలియఁ జేయుచున్నారు. పరదేవత తనయొక్క రూపముతో నామరూపములను విశదపఱచుచున్నానని సంకల్పింపక, స్వాంశభూతమగు జీవరూపముతో నట్లు సంకల్పించెనని, "అనేన జీవేనాఽఽత్మనా" అను శ్రుతివలనఁ దెలియుచున్నది.

శంక:—అట్లగునేని, "చారుని ద్వారా పరసైన్యములోఁ బ్రవేశించి పరిశీలింపుచున్నాను." అను రాజోక్తిలోను వలెనే, ఈపై వాక్యములో "వ్యాకర

వాణి" అను ఉత్తమపురుష క్రియరూపమునున్ను దానితోసమానకర్తృకమగు "ప్రవిశ్య" అను క్రియారూపమునున్ను లాక్షణికార్థమున గ్రహింపవలసి వచ్చునే ?

సమాధానము:—ఈ పైయుదాహరణమున రాజభృత్యులు స్వరూపము చే వేఱయిన వారు గాన, నచట ఉత్తమపురుష ప్రయోగము లాక్షణికమనఁ దగును. ప్రకృతముననో, జీవాత్మ పరమాత్మయొక్క యంశ మగుటం జేసి, తన రూప మగుటచే, నట్టి రూపముతోఁ జేయఁబడు ప్రవేశవ్యాకరణములు తనవి యే (పరమాత్మవియే) గాన, 'వ్యాకరణవాణి' "ప్రవిశ్య" అను నవి లాక్షణిక ములు గానేరవు.

"[1] జీవేన" అను శబ్దమునందుండు తృతీయా విభక్తి "సహ యోగ లక్షణ తృతీయ" అనఁగా "కూడ" అను అర్థమును తెలియఁజేయునట్టితృతీయ కాదు. ఏలననిన, ఇది కారకవిభక్తి యగుట సంభవ మగుచుండ, ఉపదవిభక్తిని గ్రహించుట యన్యాయము. ఇది "కరణే తృతీయ" అనఁగా సాధనమును దెలియఁజేయు తృతీయయును కాదు. ఏలననిన, బ్రహ్మముచే నొనర్పఁబడు భూత ప్రవేశమునకును నామరూపవ్యాకరణమునకును జీవుఁడు సాధనభూతుఁడు గానేరడు.

భూతప్రవేశ మాత్రముతో జీవుని కర్తృత్వము ముగించునదనియు, నామరూప వ్యాకరణమునఁ గర్తృత్వము బ్రహ్మముదే యనియును జెప్పుట శక్యము గాదా? యని శంకింపఁదగదు. ఏలననిన "ప్రవిశ్య" అనుక్రియా రూప మునందుండు "క్త్వా" ప్రత్యయము ప్రవేశమున్ను, నామరూపవ్యాకరణమున్ను ఈ రెండును సమాన కర్తృకములని తెలియఁజేయుచున్నది. జీవుడు బ్రహ్మము యొక్క యంశమగుటచే బ్రహ్మముయొక్క రూపమే యైనను, బ్రహ్మస్వరూపము

'వేఱొక్కపదమును చేర్పనక్కరలేకుండ తృతీయావిభక్తియొక్క యర్థము నిచ్చునదిగా ను' "కర్తృకరణయో స్తృతీయా" ఇత్యాది సూత్రములచే విధింపఁబడినది "కారకవిభక్తి" యనఁ బడుచున్నది. దృష్టాంతము:-"రామేణ లంకా జితా=రామునిచే లంకాపట్నము జయింపఁబడి నది" వేఱొక్కపదమును జేర్చుటచే నట్టియర్థము నిచ్చునది ఉపపద విభక్తియనఁబడుచున్నది. దృష్టాంతము:-"పుత్రేణ సహ పితా ఆగచ్ఛత్=కుమారునితోఁగూడ తండ్రి వచ్చెను." ఈ పైని గనఁబఱచిన ఉపపద విభక్తిగాని, లేక, కరణే తృతీయ గాని, "అనేన జీవేన" అనుతావున గ్రహిం పఁబడినచో, "జీవునితోఁగూడ సర్వేశ్వరుఁడు భూతములలోఁ బ్రవేశించెననిగాని జీవరూపమగు సాధనముతోఁ బ్రవేశించెనని గాని" యర్థము ఏర్పడును. అందు మూలముగ భూతప్రవేశమున్ను నామరూప వ్యాకరణమున్ను సర్వేశ్వర కర్తృకములగునేమోయని తలంచి పూర్వపక్షి యీతా వుననుండు తృతీయావిభక్తి ఉపపదవిభక్తిగాని, కరణేతృతీయగాని కాదని తెలుపుచున్నాఁడు.

నుండి వైలక్షణ్యమును దెలుపుటకై "అనేన జీవేన" అను వాక్యమున జీవుఁడు వేఱుపదార్థముగాఁ బరామర్శింపఁబడెను. కావున, నామరూపవ్యాకరణము హిరణ్యగర్భ కర్తృకము. కనుకనే స్మృతులయందును చతుర్ముఖ బ్రహ్మ మొన ర్చిన సృష్టిని గుఱించి చెప్పు సందర్భమున, నామరూప వ్యాకరణము గూడఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ నామరూపంచ భూతానాం కృత్యానాంచ ప్రపఞ్చనం।
వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః॥ (వి. పు. ౧. ౫. ౬౩)

తా॥ ప్రథమమున చతుర్ముఖబ్రహ్మము భూతములయొక్కయు దేవతలు మొదలగు వారియొక్కయు కృత్యములయొక్కయును నామరూపములను ప్రక టితములుగ జేసెను.

## సిద్ధాంతము.

త్రివృత్కరణము నొనర్చిన పరబ్రహ్మముచేతనే నామరూపవ్యాకరణ మొనర్పఁబడుచున్నది. ఏలననిన, త్రివృత్కరణము నొనర్చినవాఁడే నామరూప వ్యాకరణమును గూడ నొనర్చుచున్నాఁడని శ్రుతి తెలుపుచున్నది. ఎట్లనిన, "సేయం దేవతైక్షత హన్తాఽహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కర వాణి" అను శ్రుతివాక్యము త్రివృత్కరణమున్ను నామరూప వ్యాకరణమున్ను ఈ రెండున్ను ఒక్కనిచే నొనర్పఁబడినవని తెలియఁజేయుచున్నది. అణ్డములోపల నుండు వాఁడగుటచే చతుర్ముఖ బ్రహ్మ మిట్టి త్రివృత్కరణము నొనర్చుట సంభ వము కాదు, ఏలననిన; త్రివృత్కృతములగు తేజో బన్నములవలన నణ్డము బుట్టు చున్నదనియు, అట్టి యణ్డములోపల చతుర్ముఖుఁడు బుట్టెననియును గదా "తస్మి న్నణ్డేఽభవద్బ్రహ్మా సర్వలోకపితామహః" అను స్మృతివాక్యము తెలుపుచున్నది. త్రివృత్కరణము పరబ్రహ్మముదే గాన, నామరూపవ్యాకరణమున్ను వానిదే యని యిందువలనఁ దెలియుచున్నది.

ఇట్లగు పక్షమున, "అనేన జీవేనాత్మనా" ఇత్యాది వాక్యముయొక్క యర్థ మెట్లు పొసగునని యంటివేని, ఈవాక్యమునందుండు "ఆత్మనా" అనియు "జీవేన" అనియు నీశబ్దములకు సామానాధికరణ్యముండుటచే నిచట 'జీవ' శబ్దమును "జీవశరీరుఁడు" అను అర్థమునఁదీసికొనునది. అదెటువలెననిన; "తత్తేజ ఐక్షత" "తదపోఽసృజత" "తా ఆప ఐక్షన్త" "తా అన్నమసృజన్త" అను తావుల తేజశ్శబ్దము, అప్ శబ్దము మొదలగునని "తేజస్సు మొదలగునవి శరీరము గాఁగల పరబ్రహ్మమును" తెలుపునట్లు, జీవశబ్దమున్ను జీవశరీరుఁడగు పరబ్రహ్మ

మును తెలుపునది. కావున జీవసమష్టిరూపుఁడగు హిరణ్యగర్భుఁడు శరీరముగాఁ గల పరబ్రహ్మమే నామ రూప వ్యాకరణము నొనర్చిన వాఁడని సిద్ధ మగుచున్నది. ఇట్లంగీకరించు పక్షమున, "ప్రవిశ్య" అనియు 'కరవాణి' అనియు నీధాతు రూపములు, వ్యాకరణ విరోధ మెద్దియును లేకయే, ముఖ్యార్థము లగును. భూతప్రవేశ నామరూపవ్యాకరణములు సమానకర్తృకము లగుటయును సంభవ మగును. మఱియు చతుర్ముఖబ్రహ్మశరీరుఁడగు పరబ్రహ్మమే దేవాది విచిత్ర సృష్టినొనర్చిన వాఁడును గాన, చతుర్ముఖ కర్తృకమగు దేవాదిసృష్టిని వర్ణించు సందర్భమున, నామరూప వ్యాకరణమును గూడ జెప్పుటయును ఉపపన్న మగును.

కనుక "సేయం దేవతైక్షత" ఇత్యాది శ్రుతివాక్యముయొక్క యర్థము నివ్విధమున నెఱుంగునది:-(ఇమాః=ఈ, తేజోభిన్న రూపములగు మూఁడు దేవతలను, జీవేన=జీవసమష్టివిశిష్టుఁడనగు నాచే అనఁగా నేను, ప్రవేశించి, నామ రూపే వ్యాకరవాణి = దేవాది విచిత్రసృష్టిని, వాని నామధేయములను జేయుచున్నాను.) అనఁగా, ఈ తేజోభిన్నములు ఒకటితో నొకటి సంబంధించి యుండని వగుటం జేసి, యివి యొకవిశేష సృష్టియందు వినియోగింపఁబడుటకుఁ దగినవి కావు గాన, వాటి నందులకుఁ దగిన వానినిగాఁ జేయుటకై వానిలో (ఏకైకాం = ఒక్కొక్కదానిని, త్రివృతం త్రివృతం కరవాణి = మూఁడేసి భూతములతోఁ గూడి యుండు లాగున త్రివృత్కరణమును జేయుచున్నాను.) అని యెఱుంగునది. కావున నామరూప వ్యాకరణము పరమాత్మయొక్క కార్యమే యని సిద్ధమగుచున్నది.

అవతారిక:—త్రివృత్కరణము నొనర్చిన వాఁడే నామరూప వ్యాకరణము నొనర్చిన వాఁడునని శ్రుతులు జెప్పుచున్నవి. త్రివృత్కరణ మన్ననో, పరమాత్మచే నొనర్పఁబడినది. కావున నామరూప వ్యాకరణము సయితము పరమాత్మచే నొనర్పఁబడినదియే యని పూర్వ సూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. అది యుక్తము కాదు. ఏలననిన; త్రివృత్కరణము జీవునిచే నొనర్పఁబడినది యగుటయును సంభవము. ఎట్లనిన, అణ్డము సృజింపఁబడిన పిదప, చతుర్ముఖబ్రహ్మముచే సృజింపఁబడిన జీవులను గుఱించి త్రివృత్కరణ ప్రక్రియ శ్రుతుల యందు వినఁబడుచున్నది. ఛందోగులు "యథాఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాః పురుషంప్రాప్య త్రివృత్త్రివృదేకైకా భవతి తన్మే విజానీహి" (ఈమూఁడు భూతములీపురుషునిబొంది యెవ్విధమున నొక్కొక్కటి మూఁడేసి విధములు గలదిగా నగునో, దానిని దెలుపుము" అని యిట్లు జెప్పుట కారంభించి, తరువాత, "అన్నమశితం త్రేధా విధీయతే తస్య యః స్థవిష్ఠోభాగః తత్పురీషం భవతి, యో

మధ్య మస్తన్మాంసం, యోణిష్ఠస్తన్మనః'' (అన్నము మనుష్యులు మొదలయిన ప్రాణులచే భక్షింపఁబడి, జఠరాగ్ని సంయోగముచే పచింపఁబడినదై, స్థూలాంశము, మధ్యమాంశము, సూక్ష్మాంశమని మూఁడు విభాగములగుచున్నది. వానిలో స్థూలాంశము పురీషముగాను, మధ్యమాంశము మాంసముగాను, సూక్ష్మాంశము మనస్సుగాను నగుచున్నది") అని యివ్విధముగ త్రివృత్కరణమును ఉదేశించి యున్నారు. అట్లే "యదగ్నే రోహితం రూపం తేజస స్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్య" (అగ్నియందెఱ్ఱగా నుండెడి రూప మేదియో, యది తేజస్సుయొక్క రూపము, తెల్లని రూపమేదియో, యది యుదకముల యొక్క రూపము, నల్లని రూపమేదియో, యది పృథివియొక్క రూపము"అను పూర్వవాక్యమునఁ గూడ చతుర్ముఖ బ్రహ్మసృష్టములగు నగ్న్యాదిత్య చంద్ర విద్యుత్తులయందు త్రివృత్కరణమును గానఁబఱచి యున్నారు. మఱియు "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" (ఛా. ౬ ప్ర. ౩. ఖ. ౨ వా.) ఇత్యాదివాక్యమున ప్రథమము నామరూప వ్యాకరణము జెప్పఁబడి, తరువాత, ''సేయం దేవ తేమా స్తిస్రో దేవతాః అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరోత్తాసాం త్రివృతం త్రివృత మేకైకా మకరోత్'' (ఛా, ౬ ప్ర.3ఖ.3వా) ఇత్యాది వాక్యమున త్రివృత్కరణము జెప్పఁబడుటచే త్రివృత్కరణము నామరూపవ్యాకరణమునకు తరువాతిది గాను తెలియవచ్చుచున్నదే యనిన.

## ౧౮॥ సూ॥ మాంసాది భౌమం యథాశబ్ద మితరయోశ్చ

టీ॥ మాంసాది = మాంసాదికము, భౌమం = భూమివికారము, ఇతరయోశ్చ = అప్తేజస్సుల యొక్కయు, యథాశబ్దం = శ్రుత్యనుసారముగ (వికారములు యోజనీయములు.)

తా॥ మాంసాదులు పృథివియొక్క వికారములు. అప్తేజస్సులయొక్క వికారములు గూడ శ్రుత్యనుసారము యోజనీయములు.

శ్రీ॥ భా॥ ''తాసాంత్రివృతం త్రివృతమేకైకామకరోత్" అను శ్రుతియందు వినఁబడు త్రివృత్కరణము అణ్డసృష్టికి తరువాత, చతుర్ముఖబ్రహ్మముచే సృజింపఁబడిన యగ్న్యాది దేవతలను గుఱించినదని జెప్పుట యుక్తము కాదు. ఏలననిన; ''అన్నమ శితం త్రేధా విధీయతే" అను శ్రుతివాక్యము త్రివృత్కరణము నుపదేశించునదియగు పక్షమున, నిచట పురీషమునకంటె సూక్ష్మమయినదిగాఁ జెప్పఁబడిన మాంసమున్ను, మిక్కిలి సూక్ష్మమయినది గాను జెప్పఁబడిన మనస్సున్ను, కారణపదార్థాను గుణమగు స్వభావము గలది గానే కార్యపదార్థ ముండవలయునన్న నియమమునుబట్టి, (మాంసము) ఉదక

వికారమయినదిగాను, మనస్సు తేజోవికారమయినదిగాను ప్రసక్తించు. అనఁగా, స్థూలపదార్థముగ జెప్పఁబడిన పురీషము స్థూలపదార్థమగు పృథివియొక్క వికారము గాను, సూక్ష్మపదార్థముగాఁ జెప్పఁబడిన మాంసము సూక్ష్మపదార్థమగు ఉదకముయొక్క వికారము గాను, మిక్కిలి సూక్ష్మపదార్థముగాఁ జెప్పఁబడిన మనస్సు మిక్కిలి సూక్ష్మపదార్థమగు తేజస్సుయొక్క వికారముగాను కావలయునని ప్రసక్తించును. ఇంతియె కాక, ''ఆపః పీతాస్త్రేధా విధీయంతే తాసాం యః స్థవిష్ఠో భాగ, స్తన్మూత్రం భవతి, యో మధ్యమ స్తల్లోహితం, యోఽణిష్ఠ స్సప్రాణః''(పురుషునిచే పానము చేయఁబడుచుండెడి యుదకములు స్థూలమనియు, మధ్యమమనియు, సూక్ష్మమనియును మూఁడు విభాగములుగా నేర్పడుచున్నవి. వానిలోని స్థూలాంశము మూత్రరూపముగాఁ బరిణమించుచున్నది. మధ్యమాంసము రక్తముగాఁ బరిణమించుచున్నది. సూక్ష్మాంశము ప్రాణముగాఁ బరిణమించుచున్నది) అనెడి యనంతరవాక్యమున, మూత్రము ఎక్కువ స్థూలమయిన పదార్థముగాను, ప్రాణము ఎక్కువ సూక్ష్మ మయిన పదార్థముగాను జెప్పఁబడుచున్నవి గాన, నింతకుముందు గనఁబఱచిన న్యాయప్రకారము, ఎక్కువ స్థూలపదార్థమగు మూత్రము ఎక్కువ స్థూలపదార్థమగు పృథివియొక్క వికారము గాను, ఎక్కువసూక్ష్మపదార్థమగు ప్రాణము ఎక్కువ సూక్ష్మపదార్థమగు తేజస్సుయొక్క వికారము గాను కావలయునని గూడ ప్రసక్తించును. అయితే యిది యంతయు నెంతమాత్రము శాస్త్రసమ్మతము కాదు. ఎట్లనిన, పురీష మాంస మనస్సులు పృథివీవికారములు. ''అన్నమశితం త్రేధా విధీయ తే'' ఇత్యాది శ్రుతివాక్యమట్లే గదా తెలుపుచున్నది. మఱియు, ఇవ్విధముగ అప్తేజస్సుల వికారములు గూడ శ్రుత్యనుగుణముగ యోజనీయములు, అనఁగా ''ఆపః పీతాః'' అనియు ''తేజోఽశితం'' అనియు నీశ్రుతులయందుఁ జెప్పియున్న ప్రకారము అప్తేజస్సుల వికారముల నెఱుఁగునది. ఏట్లనిన, ''ఆపః పీతా స్త్రేధా విధీయం తే'' అను శ్రుతివాక్యము ఉదకములు మాత్రమె మూఁడు విధములుగ అనఁగా మూత్రముగాను, రక్తముగాను, ప్రాణము గాను పరిణమించుచున్నవి''అని తెలియఁ జేయుచున్నది. ''తేజోఽశితం త్రేధా విధీయ తే'' ఇత్యాది శ్రుతివాక్యము తేజస్సుమాత్రము మూఁడువిధములుగ అనఁగా అస్థులు గాను, మజ్జగాను, వాక్కుగాను పరిణమించుచున్నది'' అని తెలుపుచున్నది. కావున నీపైని గనఁబఱచిన శ్రుతులనుబట్టి పురీష మాంస మనస్సులు పృథ్వీవికారములనియు, మూత్ర రక్త ప్రాణములు ఉదకవికారములనియు, అస్థి మజ్జా వాక్కులు తేజోవికారము లనియును తెలిసికొననది. మఱియు నిట్లు గ్రహించు పక్షమున, ''అన్నమయం హి సోమ్య మనః, ఆపోమయః ప్రాణః, తేజోమయీ వాక్'' (మనస్సు పృథ్వీవికార

ము, ప్రాణము ఉదక వికారము వాక్కు తేజోవికారము"అని జెప్పు వాక్యశేష ముతో విరోధములేకుండును. కాఁబట్టి, "తాసాం త్రివృతం త్రివృతమేకైకా మకరోత్" అను శ్రుతివాక్యముచేఁ జెప్పఁబడిన త్రివృత్కరణ ప్రక్రియ "అన్న మశితం త్రేధా విధీయతే" ఇత్యాది శ్రుతివాక్యములచేఁ దెలియజేయఁబడు చుండలేదు. ఆ త్రివృత్కరణమే, "అన్నమశితం,, ఇత్యాది వాక్యముచేఁ గూడ తెలుపఁబడుచున్నదను పక్షమున, కారణపదార్థమున కనుగుణమయినది గానే కార్యపదార్థ ముండవలయునను పూర్వోక్తన్యాయప్రకారము, మిక్కిలి సూక్ష్మ పదార్థములుగాఁ జెప్పఁబడిన మనః ప్రాణ వాక్కులు మూఁడును గూడ సూక్ష్మపదార్థమగు తేజస్సుయొక్క వికారములే యని ప్రసక్తించును. అట్లగుట "అన్నమయంహి సోమ్య మనః" (మనస్సు పృథివియొక్క వికారమనియు ప్రాణము ఉదకములయొక్క వికారమనియు) నిట్లు జెప్పు శ్రుతివాక్యముతో విరోధించును. అయితే త్రివృత్కృతములయిన పృథివ్యప్తేజస్సులు పురుషుని కుక్షిలోనికిఁ బోగా, వానిలో నొక్కొక్కటి మూఁడు మూఁడు విధములు గాఁ బరిణమించుచున్నదని, "అన్నమశితం త్రేధా విధీయతే" ఇత్యాది శ్రుతి వాక్యము తెలుపుచున్నది. మఱియు అణ్డసృష్టికి పూర్వమె తేజోబన్నములు త్రివృత్కృతములయియే యుండవలయును. ఏలననిన, త్రివృత్కృతములు గాక, పోయినచో, నవి యే కార్యమునున్ను బనర్చుటకుఁ దగినవి కానేరవు. అవి యొకదానితో నొకటి మిశ్రితమయి యుండునప్పుడు గదా, యేదయిన నొక కార్య మునందు ఉపయుక్తము లగుచున్నవి. ఇట్లు ఈభూతము లొకదానితో నొకటి మిశ్రితమయి యుండుటయే త్రివృత్కరణ మనఁబడుచున్నది.

శ్లో॥ నానావీర్యాః పృథగ్భూతాః తతస్తే సంహతిం వినా।
నాశక్నువన్ ప్రజాస్స్రష్టుమసమాగమ్య కృత్స్నశః॥

వి. పు. ౧ అం. ౨ అ. ౫౨ శ్లో.

తా॥ నానావిధ శక్తులతోఁ గూడియుండు పృథివ్యాది భూతములు వేఱు వేఱుగానుండినవై పరస్పరము సంపూర్ణముగ మిశ్రితములై యుండనందుచే జగత్సృష్టికిఁ దగినవికాకపోయెను.

శ్లో॥ సమేత్యాన్యోన్యసంయోగం పరస్పర సమాశ్రయాః।
మహదాద్యా విశేషాంతా హ్యణ్డముత్పాదయన్తి తే॥

వి. పు. ౧ అం. ౨ అ. ౫౩ శ్లో.

తా॥ మహదాది విశేషాంతములగు తత్వములు పరస్పరము సంయుక్త ములై యొకదాని యందొకటి గలవై బ్రహ్మాణ్డమును గలుగఁజేయుచున్నవి.

కనుకనే, "అనేన జీవేనాత్మనాఽ నుప్రవిశ్య నామరూపే వ్యాకరోత్తాసాం త్రివృతం త్రివృతమే కైకా మకరోత్" (జీవశరీరుఁడగు పరమాత్మ తేజోబన్నములలోఁ బ్రవేశించి నామరూపములను బ్రకటింపఁజేసెను. ఆ పరదేవత యా మూఁటిలో నొక్కొక్కటి మూఁడేసి భూతములతోఁ గూడియుండులాగున త్రివృత్కరణమును జేసెను.) అను శ్రుతియందు నామరూప వ్యాకరణమునకు తరువాత త్రివృత్కరణము పఠింపబడినను, ఈ పాఠక్రమము అర్థక్రమముచే (వస్తుస్థితిచే) బాధింపఁబడునది గాన, నర్థక్రమ ప్రకారము త్రివృత్కరణమును నామరూపవ్యాకరణమునకు పూర్వము జరిగిన దానినిగా నెఱుఁగునది.

అణ్డాన్తర్వర్తులగు నగ్న్యాదులను గుఱించి త్రివృత్కరణమును శ్రుతియందు గానఁబఱచుటకు హేతువేమనఁగా, ఉద్దాలకుఁడు తనకుమారుఁడును, శ్రోతయునగు శ్వేతకేతునికి త్రివృత్కరణ ప్రకారమును దెలుపఁబూని, శ్వేతకేతుఁడు బ్రహ్మాణ్డములోనివాఁడు గాన, వానికి బ్రహ్మాణ్డమునకు వెలుపల నుండు పదార్థములలోని త్రివృత్కరణమును జూపించుట యసంభవమని తలఁచి, త్రివృత్కృతములై బ్రహ్మాణ్డములోనుండునవియగు యగ్న్యాది కార్యపదార్థములలోని త్రివృత్కరణమును జూపించియుండెను. ఇదియే శ్రుతియందు బ్రహ్మాణ్డాంతర్గములగు నగ్న్యాదికార్యపదార్థములను గుఱించిన త్రివృత్కరణమును జూపించియుండుటకు హేతువు.

అవతారిక:— అట్లగు గాక, అయితే "అన్నమశితం" అనియు "ఆపః పీతాః" అనియు "తేజోఽశితం" అనియు నీశ్రుతులయందుఁ జెప్పియున్నట్లు త్రివృత్కృతములగు పృథివ్యాదులలో నొక్కొక్కటి తేజోబన్నాత్మకమై మూఁడురూపములు గలదిగానుండ, పృథివి యనియు, ఉదకము లనియు, తేజస్సనియు నిట్లొక్కరూపమును బట్టిమాత్రమే యొక్కొక్కదానిఁ బిలుచుచుండుటకు హేతువేమనిన ;

౧౭॥ సూ॥ వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః.

టీ॥ తు=పూర్వోక్త దోషములేదు. తద్వాదః=అగ్న్యాది వ్యపదేశము, వైశేష్యాత్=స్వభాగవిశేషత్వము వలన (ఉపపన్నః=ఉపపన్నమగు చున్నది).

తా॥ పృథివ్యాదులు త్రివృత్కృతములే యయినను, వానిలో నొక్కొక్కదానియందు ఒక్కొక్కదాని భాగమధికముగా నుండుటచే నది దాని పేరుచేఁ బిలువఁబడు చున్నది.

శ్రీ॥ భా॥ సూత్రమందలి "వైశేష్యాత్" అను పదము ఆధిక్యమును దెలియఁజేయునది. త్రివృత్కరణమువలన పృథివ్యాదులలో నొక్కొక్కటి మూఁడేసి రూపములు గలదియయినను, వాటిలో నొక్కొక్క దానియందు పృథివ్యాదులలో నొక్కొక్కదానిభాగ మధికముగా నుండుటచే నది దానిపేరున పిలువఁబడుచున్నది. సూత్రమునందు తద్వావదశబ్దముయొక్క పునరుక్తి యధ్యాయసమాప్తిని సూచింపుచున్నది.

—సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము ముగిసెను.—



గద్య॥ ఇది శ్రీ కృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు ద్వితీయాధ్యాయమున—చతుర్థపాదము.









శ్రీమతే రామానుజాయనమః

# శ్రీమ దాంధ్ర శ్రీభాష్యము

## తృతీయాధ్యాయము—ప్రథమపాదము

### తదనన్తరప్రతిపత్త్యధికరణము.

౧॥ సూ॥ తదనన్తరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్

టీ॥ ప్రశ్ననిరూపణాభ్యామ్ = (పంచాగ్నివిద్యాంతర్గత) ప్రశ్నోత్తరములను బట్టి, తదనన్తరప్రతిపత్తౌ = దేహాన్తరప్రాప్తిసమయమున, సంపరిష్వక్తః = (జీవుఁడు) భూతసూక్ష్మములతోఁ గూడినవాఁడై, రంహతి = వెళ్లుచున్నాఁడు.

తా॥ జీవుఁడు, దేహాంతరప్రాప్తికాలమున, భూతసూక్ష్మములతోఁ గూడుకొని వెళ్లుచున్నాఁడని పంచాగ్ని విద్యయందలి ప్రశ్నప్రతివచనములవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ సమస్తమయిన జగత్తునకును తానే కారణమైన వాఁడును, దోషము లేవియును లేశమాత్రమైనను లేనివాఁడును, అపరిమితోదారగుణసాగరుఁడును, తనకంటెను వేఱగు నన్నిపదార్థముల కంటెను విలక్షణమైనవాఁడునునగు పరబ్రహ్మమే ముముక్షువులచే నుపాసింపవలసిన వాఁడనెడి యంశమును వేదాంతశాస్త్రము ప్రతిపాదించుచున్నదని ప్రథమద్వితీయాధ్యాయములయందు స్థాపింపఁబడియె. అచటనే యీవిషయమును గుఱించిన స్మృతివిరోధముయొక్కయును, న్యాయవిరోధముయొక్కయును, పరపక్షములయొక్కయును, వేదాన్తవాక్యములకుఁగల పరస్పరవిరోధములయొక్కయును, పరిహారములు తత్తత్స్వరూప పరిశోధక హేతుప్రదర్శన పూర్వకముగాఁ గానిపింపఁబడియె. కావున గడచిన రెండధ్యాయములయందును బ్రహ్మస్వరూపము ప్రతిపాదింపఁబడినది, మిగిలిన రెండధ్యాయములయందు నట్టి బ్రహ్మమును పొందుట కుపాయమును

ప్రథమద్వితీయాధ్యాయములకును తృతీయచతుర్థాధ్యాయములకునుఁగల పరస్పరసంబంధము.

బ్రహ్మమును బొందు విధమును విచారింపఁబడును. ప్రస్తుత మీ యధ్యాయమున బ్రహ్మప్రాప్త్యుపాయభూతమగు నుపాసనమును గుఱించి విచారింపఁబడును.

ప్రాప్యవస్తువగు పరమాత్మకంటె నితరములగు పదార్థములయందు వైరాగ్యంబును, ప్రాప్యభూతుఁడగు పరమాత్మ యందాసక్తియును ఉపాసనారంభమునకు ముఖ్యసాధనములు. లోకాంతరములయందు సంచరించుచు జాగ్రత్స్వప్నసుషుప్తిమూర్ఛాద్యవస్థలను బొందుచున్న యీ జీవుఁడు అనేకదోషములను గలిగియుండుటయు, పరబ్రహ్మమన్ననో, అట్టి దోషములేవియునులేనివాఁడై యనేక కల్యాణగుణములను గలిగి యుండుటయును, ఈ పైనిగనఁబఱచిన వైరాగ్యాదులఁ గలుగఁజేయుటకై, ఈ యధ్యాయముయొక్క ప్రథమ ద్వితీయ పాదములయందు ప్రతిపాదింపఁబడుచున్నవి.

## సంశయము.

ఒక దేహమునుండి మఱియొక దేహమును బొందునప్పుడు, జీవుఁడు దేహోత్పత్తికారణములగు పృథివ్యాదిభూతసూక్ష్మములతోఁ గూడుకొని పోవుచున్నాఁడా? లేక వానితోఁ గూడుకొనక తానుమాత్రమే పోవుచున్నాఁడా?

## పూర్వపక్షము.

జీవుఁడు పోవుతావులనెల్లను పృథివ్యాదిభూతసూక్ష్మములు సులభముగాఁ దొరుకునవిగాన, నతఁడు దేహాంతరమును బొందునపుడు, వానితోఁ గూడుకొనియే పోవలయుననెడి నియమములేదు. కనుక నతఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొనకయే పోవుచున్నాఁడనిన,

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. జీవుఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొనియే దేహాంతరమును బొందుచున్నాఁడని "తదనన్తర ప్రతిపత్తౌరంహతి సంపరిష్వక్తః" ఇత్యాది సూత్రముచేఁ జెప్పుచున్నారు. ఈ సూత్రమునందు "తత్ + అనన్తర ప్రతిపత్తౌ" అను తావున "తత్" అను సర్వనామశబ్దము "సంజ్ఞామూర్తిక్లృప్తిః" అను సూత్రమున "మూర్తి" శబ్దముచేఁ బేర్కొనంబడిన శరీరమును పరామర్శించునది. కావున "తదనన్తర ప్రతిపత్తౌ = దేహాన్తరప్రాప్తి సమయమున, సంపరిష్వక్తః- భూతసూక్ష్మములతోఁ గూడుకొనినవాఁడై రంహతి =(జీవుఁడు) వెళ్లుచున్నాఁడని యర్థము. అది యెట్లు తెలియుననిన, పాంచలదేశ ప్రభురాజైన ప్రవహణుఁడు [1]పంచాగ్నివిద్యను గుఱించి శ్వేతకేతుఁడను బ్రాహ్మ

(1) పంచాగ్నివిద్య :—ఇది యయిదగ్నులను గుఱించిన యుపాసనము. ఇది ఛాందోగ్యోపనిషత్తునందు పఠింపఁబడినది. ఈ యుపాసనము ననుష్ఠించు వారలు అర్చిరాది

ణచిన్నవాని నడిగిన ప్రశ్నములను ఆప్రశ్నములకు ప్రవహణుఁడు స్వయముగాని చ్చిన యుత్తరములను బాగుగాఁ బరిశీలించుటచే నిర్వివాదముగాఁ దెలియుచున్నది.

ఎట్లన, కర్మిష్ఠులగు వారీదేహమును త్యజించిన తరువాత నెచటికిఁ బో వుచున్నారు? వారు మరల ఈలోకమున కేప్రకారము వచ్చుచున్నారు? దేవ యాన పితృయాణములనంబడు మార్గములకుభేదమెద్ది? మరల ఈలోకమునకు రాని వారెవరు? అని ప్రవహణుఁడీ నాలుగు ప్రశ్నముల నడిగిన తరువాత "వేత్థ. యథా పఞ్చమ్యామాహుతా వాపః పురుషవచసో భవన్తి" (ఛాం. ౫. ప్ర. 3ఖ. 3. వా) "ఓ శ్వేతకేతుఁడా! ఉదకము లయిదవ పర్యాయ మాహుతిగా హోమము జేయఁబడినవై పురుషరూపమును బొందుపద్ధతిని నీవెఱుంగుదువా?" అని యీ యయిదవప్రశ్నము నడిగెను. శ్వేతకేతుఁడా ప్రశ్నములకు సమాధానము.

మార్గముగుండా పరమపదమును పొందుదురనియు, ఇట్టియుపాసనము ననుష్ఠింపక కేవలము కర్మాను ష్ఠాన . పరులగు వారలు పితృయాణమార్గముగుండా లోకాంతరములకుఁ జని వారింతకు పూర్వమనుష్ఠించిన కర్మముల ఫలములననుభవించి కర్మశేషముతో నీలోకమునకు మరలవచ్చి వారివారి కర్మానుగుణముగా నిచట జనించుదురనియును చెప్పఁబడియెను. ఇందు ద్యులోకపర్జ న్యపృథివీ పురుషయోషిత్తులు అగ్నులుగా భావింపఁబడుచున్నవి.

☞ పంచాగ్నివిద్యయందు అగ్న్యాదులుగా భావింపఁబడువాని పట్టీ.

| ప్రశ్నసంఖ్య | అగ్నిగాను భావింపఁబడునది | సమిత్తుగాను భావింపఁబడునది | ధూమముగాను భావింపఁబడునది | అర్చిస్సుగాను భావింపఁబడునది | అంగారముగాను భావింపఁబడునది | విస్ఫులింగములుగాను భావింపఁబడునవి | హోమద్రవ్యము | హోమముచేయబడినద్రవ్యముయొక్కపరిణామము |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ద్యులోకము | సూర్యుఁడు | రశ్ములు | అహస్సు | చంద్రుఁడు | నక్షత్రములు | శ్రద్ధయనఁబడు ఉదకములు | సోమరాజు |
| ౨ | పర్జన్యుఁడు | వాయువు | అభ్రము | విద్యుత్తు | అశని | ఉరుము | సోమరాజు | వర్షము |
| 3 | పృథివి | సంవత్సరము | ఆకాశము | రాత్రి | దిక్కులు | విదిక్కులు | వర్షము | వ్రీహ్యాదిధాన్యపదార్థము |
| ౪ | పురుషుఁడు | వాక్కు | ప్రాణము | జిహ్వ | చక్షుస్సు | శ్రోత్రము | తండులాదిరూపముగుఅన్నము | రేతస్సు |
| ౫ | స్త్రీ | ఉపస్థము | ఉపమంత్రణము | యోని | అన్తఃకరణము | సుఖము | రేతస్సు | మనుష్యాదిశరీరము. |

లను జెప్పనేరనందున ప్రవహణుఁడు స్వయముగాఁ జెప్పనుద్యమించి ప్రథమమున నీయంతిమప్రశ్నమునకు సమాధానము నివ్విధముగాఁజెప్పెను.

"ఓ శ్వేతకేతుఁడా? దేవతలనంబడు జీవునియొక్క ప్రాణములు అగ్నిగాభావింపఁబడిన ద్యులోకమునందు శ్రద్ధయను పదార్థమును హోమము చేయుచున్నవి. అట్లు హోమము జేయఁబడిన శ్రద్ధయనఁబడునది సోమరాజనుపేరుచే ప్రసిద్ధినొందినదియు, అమృతమయమునునగు శరీరముగాఁ బరిణమించుచున్నది. అట్టి యమృతమయమగు శరీరము అగ్నిగాభావింపఁబడిన పర్జన్యునియందు ఆప్రాణములచే హోమముజేయఁబడి వర్షరూపముగాఁ బరిణమించుచున్నది. ఈవర్షము అగ్నిగాభావింపఁబడిన పృథివియందు హోమము జేయఁబడినదైఅన్నరూపముగాఁ బరిణమించుచున్నది. ప్రాణము లీయన్నమును అగ్నిగాభావింపఁబడిన పురుషునియందు హోమము జేయుచున్నవి. పురుషాగ్నియందట్లు హుతమైన యన్నము రేతోరూపముగాఁ బరిణమించుచున్నది. ప్రాణము లీరేతస్సును అగ్నిగాభావింపఁబడిన స్త్రీయందు హోమము జేయుచున్నవి. ఇట్లు హోమము జేయఁబడినరేతస్సు గర్భరూపమగును. "ఇతితుపఞ్చమ్యా మాహుతావాపః పురుషవచసోభవన్తి" అనఁగా నిట్లు ఉదకములయిదవపర్యాయము హోమము జేయఁబడి పురుషశబ్దముచే దెలుపఁదగినవగు చున్నవని చెప్పఁబడెను." ఇట్లు ప్రవహణుఁడు త్తరమిచ్చెను.

ఇట్లు చెప్పుటచే. పూర్వాహుతులయందును అనువర్తమానములును సూక్ష్మరూపములును నగు నుదకములు ఈ పంచమాహుతియందు పురుషరూపమును బొందుచున్నవని చెప్పఁబడుచున్నది. కనుక జీవుఁడు దేహోత్పత్తి హేతువులగు భూతసూక్ష్మములతోఁ గూడుకొనియే దేహాంతరమును బొందుచున్నాఁడని ఈ పైని గనబఁఱచిన ప్రశ్నప్రతివచనముల వలనఁ దెలియుచున్నది.

అవతారిక:— ఈ పైని యుదహరింపఁబడిన ప్రశ్నోత్తరములవలన నుదకములు పురుషాకారమును బొందుచున్నట్లు దెలియుచుండుటచే నుదకములతో మాత్రము గూడుకొనినవాఁడై యీ జీవుఁడు దేహాంతరమును బొందుచున్నాఁడని చెప్పవచ్చునుగాని, పృథివ్యాది భూతసూక్ష్మములతోనన్నింటితోఁ గూడుకొనిపోవుచున్నాఁడనియేల చెప్పఁదగునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

౨॥ సూ॥ త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్.

టీ॥ త్ర్యాత్మకత్వాత్ =పృథివ్యప్తేజోరూపమగుట వలనను, భూయస్త్వాత్ = అందు జలాంశము అధికమగుటవలనను, తు=పూర్వపక్షమయుక్తము.

తా॥ దేహోత్పత్తికి కారణభూతములగు నుదకములు పృథివ్యప్తేజోరూపములని త్రివృత్కరణమువలనఁ దెలియవచ్చుచున్నది. అయితే అందు జలాంశమధికమగుటను బట్టి జీవుఁడుదకములతో మాత్రము గూడుకొని పోవుచున్నాఁడని పంచాగ్నివిద్యయందు జెప్పబడెను.

శ్రీ॥ భా॥ కేవలముదకములు దేహోత్పత్తికి హేతుభూతములు గానేరవు. కనుకనే ఛందోగులు. "తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణి" అనుతావున, దేహోత్పత్తికిగాను పృథివ్యప్తేజస్సులకు మూఁడింటికిని [1]త్రివృత్కరణమును జెప్పియున్నారు. శరీరోత్పత్తికి హేతువులగు పృథివ్యాది భూతములు మూఁడింటిలో శరీరమునం దుదకభాగ మధికముగా నుండుటంజేసి, యుదకములుమాత్రమే పంచాగ్నివిద్యయందుఁ జెప్పఁబడెను. శరీరమునందు రక్తాదుల ధికముగా నుండుటనుబట్టి తత్కారణమగు నుదకముయొక్క భాగమధికమని తెలియుచున్నది.

3॥ సూ॥ ప్రాణగతేశ్చ.

టీ॥ ప్రాణగతేః - చ = ఇంద్రియోత్క్రమణమునుబట్టియు (జీవుఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొనియే పోవుచున్నట్లు సిద్ధమగుచున్నది.)

తా॥ "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి" ఇత్యాదిశ్రుతివాక్యము దేహాంతరప్రాప్తికాలమున ఇంద్రియములు జీవునితోఁగూడి పోవుచున్నవని చెప్పుచున్నందునను జీవుఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొనియే పోవుచున్నాఁడని సిద్ధమగుచున్నది.

శ్రీ॥ భా॥ ఇంద్రియములు శరీరములోనుండి బయలువెడలుటనుబట్టియు, జీవుఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొనియే దేహాంతరమును బొందుచున్నాఁడని తెలియుచున్నది. ఎట్లన, వాజసనేయులు "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామన్తంసర్వే ప్రాణా అనూత్క్రామన్తి" (బృ. ౬. అ. ౪. బ్రా. ౨వా) అనుచోట "జీవుఁడీశరీరములోనుండి బయలువెడలునపుడు ప్రాణము అతనిని వెంబడించి పోవుచున్నదనియు, అట్లు జీవుని వెంబడించిపోవుప్రాణము నింద్రియములు వెంబడించి బోవుచున్నవనియును" పఠించుచున్నారు. శ్రీభగవద్గీతలయందును,

శ్లో॥ "మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ।
శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్"

(భ. గీ. ౧౫. అ ౭. శ్లో.)

(1) మొదటి సంపుటము ౨౧౬-వ పత్రమున ౧-వ వివరణమును చూఁడుము.

తా॥ ఓయర్జునా! మనస్సుతోఁగూడ నాఱగు నింద్రియములు ప్రకృతి యందు అనఁగా శరీరమునందు కలవు. ఈ జీవుఁడు మఱియొక శరీరమును బొందుటకై యీ శరీరములోనుండి బయలువెడలునప్పుడు, వాయువు వస్తువులనుండి వాసనలను గొనిపోవు చందమున, నాయింద్రియములను తనతోఁగూడ దీసికొని పోవుచున్నాఁడు.

ఈ పైని గనఁబఱచిన ప్రమాణములవలన ప్రాణమున్ను ఇంద్రియములున్ను శరీరములోనుండి బయలువెడలుచున్నట్లు తెలియుచున్నది. నిరాశ్రయములుగా నవి బయలువెడలుట యసంభవముగాన, వానికాశ్రయములగు భూతసూక్ష్మములుగూడ బయలువెడలుచున్నవని విశదమగుచున్నది.

## ४॥ సూ॥ అగ్న్యాదిగతిశ్రుతేరితిచేన్న, భాక్తత్వాత్.

టీ॥ అగ్న్యాదిగతిశ్రుతేః = వాగాదీంద్రియములగ్న్యాదులను బొందుచున్నట్లు శ్రుతి తెలుపుచుండుటచే, ఇతిచేత్ = ప్రాణగతి మూలకమగు భూతసూక్ష్మగమనము సంభవింపదంటివేని, భాక్తత్వాత్ = అగ్న్యాదిగతి గౌణమగుటచే, న = వాగాందీంద్రియముల కగ్న్యాదులనుగురించిన గమనము ముఖ్యము కాదు.

తా॥ వాగాదీంద్రియము లగ్న్యాదులను బొందుచున్నట్లు శ్రుతి తెలుపుచున్నందున, అవి జీవునితోఁగూడ బోవుట యసంభవమంటివేని యదియుక్తము కాదు. ఏలననిన, అగ్న్యాదులను గూర్చిన వాగాదీంద్రియగమనము గౌణము.

ఆ క్షే ప ము

శ్రీ॥ భా॥ వాజసనేయులు "యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతివాతం ప్రాణ శ్చక్షురాదిత్యమ్" (బృ. ౫. అ౩బ్రా. ౧౩వా.) " అను తావున "మరణసమయమున నీపురుషుని వాక్కు అగ్నియందు లీనమగుచున్నదనియు, ప్రాణమువాయువునందు లీనమగుచున్నదనియు, చక్షుస్సు సూర్యునియందు లీనమగుచున్నదనియును" పఠించుచున్నారు. కావున మరణసమయమున చక్షురాదీంద్రియములు జీవుతోఁగూడబోవుచున్నవనుట యుక్తము కాదు. కాఁబట్టి యట్లు చెప్పునట్టి శ్రుతికి మఱియొకవిధముగా నర్థము జేయవలయుననిన,

స మా ధా న ము.

మరణకాలమున నీ పురుషుని వాగాదీంద్రియముల గ్న్యాదులయందు లయమగుచున్నవనుట గౌణార్థముగాని ముఖ్యార్థముకాదు. ఎట్లనిన, ఈవాక్యమునందే " ఓషధీర్లోమాని వనస్పతీన్ కేశాః" (పురుషుని లోమములు ఓషధులయందును,

తలవెంట్రుకలు వృక్షములయందును) అనుతావున వాస్తవముగా లోమములు, తల వెంట్రుకలు మొదలగునవి ఓషధ్యాదులయందు లీనములుగాకపోయినను, లీనము లగుచున్నవని చెప్పఁబడియే. ఇట్లు ఓషధ్యాదులయందు లీనములుగాని లోమాదు లతోఁగూడపఠింపఁబడినందున, లోమాదులు ఓషధ్యాదులయందు లీనమగుచున్న వనుట గౌణార్థమగు చందమున, వాగాదు లగ్న్యాదులయందు లీనమగుచు న్నవని చెప్పుటయును గౌణార్థమేయని తెలియవచ్చుచున్నది. అగ్న్యాదులు వాగాదీంద్రియముల కధిష్ఠాతృదేవతలని చెప్పుటయే ,,అగ్నిర్వా గప్యేతి" ఇత్యా దిశ్రుతియొక్క యభిప్రాయము.

౫॥ సూ॥ ప్ర థ మే శ్ర వ ణా ది తి చే న్న, తా ఏ వ హ్యు ప ప త్తేః.

టీ॥ ప్రథమే = మొదటిదగు ద్యులోకాగ్నియందు, అశ్రవణాత్ = ఉద కములు హోమద్రవ్యముగా వినఁబడకుండుటవలన, ఇతిచేత్ = పంచమాహు తియందు ఉదకములకు పురుషాకారము రాదంటివేని, న = ఇది దోషముకాదు. ఉపపత్తేః ప్రతివచనమునకుఁ బ్రశ్నానుగుణ్యారూపమగు నుపపత్తియుండుట వలన, తాః-ఏవ-హి = ఆయుదకములే కదా "శ్రద్ధా"శబ్దముచే నిర్దేశింపఁ బడు చున్నవి.

తా॥ "తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి" యను ప్రవహ ణునివాక్యమున శ్రద్ధయనఁబడునది హోమద్రవ్యముగాఁ జెప్పఁబడెనుగాని, యు దకములు జెప్పఁబడలేదు. అందువలనఁ పంచమాహుతియందు ఉదకములు పురు షాకారమును బొందునవి గావంటివేని, అది యొక దోషము కాదు. ఏలననిన, శ్రుతియందలి ప్రతివచనమునకు బ్రశ్నానుగుణ్యారూపమగు నుపత్తియుండుటవల ననుదకములే శ్రద్ధాశబ్దముచే నిర్దేశింపబడినట్లు నిశ్చయింపఁదగును.

## ఆ క్షే ప ము.

శ్రీ॥భా॥ తేజస్సు మొదలగు భూతాంతరములతోఁ గూడుకొనినవియు, సూక్ష్మ ములును నగు నుదకములతోఁగూడుకొనినవాఁడై జీవుఁడు దేహాంతరమును బొందు నట్లు పంచాగ్నివిద్యయందు ప్రవహణుని ప్రశ్నప్రతివచనములవలనఁ దెలియవచ్చు చున్నదని యింతకు పూర్వము చెప్పఁబడియె. అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏల ననిన, పంచాగ్ని విద్యయందుఁ జెప్పఁబడిన అయిదాహుతులలో మొదటి యాహుతియందుదకములు హోమము జేయఁబడినట్లు చెప్పియుండలేదు. అయి తే,, తస్మిన్నేతస్మిన్ దేవాః శ్రద్ధాం జుహ్వతి. "అను పంచాగ్నివిద్యావాక్యముదే వతలగ్నియందు శ్రద్ధను అనఁగా నట్టిపేరుచె లోకప్రసిద్ధమగు మనోవృత్తివిశేష మును హోమము జేయుచున్నట్లు చెప్పుచున్నదనిన,

## సమాధానము.

ఈ సందర్భమున "శ్రద్ధా" శబ్దము లోకప్రసిద్ధమగు మనోవృత్తి విశేషమును దెలుపునది కాదు. ఉదకములే యిచట శ్రద్ధయనఁబడుచున్నవి. ఎట్లనిన, " వేత్థ యథా పంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవన్తి " అను శ్రుతివాక్యము, పంచమాహుతియందుదకములు పురుషాకారమును బొందు పద్ధతిని నీవెఱుంగుదువా ? అని ప్రవహణుఁడు శ్వేతకేతుని ప్రశ్నించినట్లు చెప్పుచున్నది. ఈ ప్రశ్నముయొక్క ప్రతివచనమునఁ బేర్కొనఁబడినశ్రద్ధయనఁబడునది యుకదమే కావలయును. అట్లుకాకున్న, ఉదకవిషయమైన ప్రశ్నమునకు శ్రద్ధావిషయమగు ప్రత్యుత్తర మసంబద్ధమగును గదా ? కనుక ప్రవహణుని ప్రశ్నము ఉదకవిషయమైనందున తదుత్తరము సయితము ఉదకవిషయముగానే యుండవలయును. అందువలన నిచట "శ్రద్ధా"శబ్దము ఉదకవాచకము.

మఱియు ప్రవహణుఁడు పంచాగ్నివిద్యను వర్ణించి దానిని ముగించు సందర్భమున "ఇతి తు పంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవన్తి" అనువాక్యమున "ఈవిధముగ పంచమాహుతియందు దకములు పురుషాకారమగు చున్నవి" అనుటచే "శ్రద్ధా"శబ్దము ఉదకవాచకమని సూచితమగుచున్నది. "ఇతి తు పంచమ్యాం"అనువాక్యమునందలి "ఇతి" (ఈప్రకారముగ) అనుశబ్దము "వేత్థయథా" అను పూర్వవాక్యమున నారంభింపబడిన పంచాగ్నివిద్యయొక్క సమాప్తిని గదా తెలుపుచున్నది. అనఁగా నుదకము శ్రద్ధారూపముగాను, సోమరాజురూపముగాను, వర్షరూపముగాను, అన్నరూపముగాను, తేజోరూపముగాను, గర్భరూపముగానున్న పరిణమించుచున్నదని చెప్పి యనంతర మీవిధముగాను ఉదకముపురుషరూపముగాఁ బరిణమించుచునని యిట్లు నిగమింపబడియె.

"ఆపః ప్రణయతి శ్రద్ధావా ఆపః" (ఉదకమును తీసికొని వచ్చుచున్నాఁడు. శ్రద్ధయే యుదకము) ఇత్యాది వైదిక వాక్యములయందును "శ్రద్ధా" శబ్దమున కుదకపరముగాఁ బ్రయోగము గలదు. మఱియు "శ్రద్ధాంజుహ్వతి తస్యా ఆహుతే స్సోమో రాజా సంభవతి " అను శ్రుతివాక్యము శ్రద్ధను హోమము జేయుచున్నాఁడనియు అట్టి హోమమువలన సోమము గలుగుచున్నదనియును జెప్పుచున్నందున శ్రద్ధయనఁగా నుదకములని దెల్పియుచున్నది. ఉదకములు గదా సోమాకారముగాఁ బరిణమింపఁగలవు. గనుక తేజస్సుమొదలగు భూతాంతరయుక్తములగు నుదకములతోఁ గూడుకొనినవాఁడై జీవుఁడు దేహాంతరమును బొందుచున్నాఁడని సిద్ధమగుచున్నది.

౬॥ సూ॥ అశ్రుతత్వాదితి చేన్న, ఇష్టాదికారిణాం ప్రతీతేః

టీ॥ అశ్రుతత్వాత్ = జీవుఁడు ఉదకసంపరిష్వక్తుఁడై పోవునట్లు పంచాగ్నివిద్యాశ్రుతియందు జెప్పఁబడకుండుటవలన, ఇతిచేత్ =వాఁడట్లు పోవుట లేదం

టివేని, న = అదియుక్తముకాదు. ఏలననఁగా, ఇష్టాదికారిణాం = కేవలము యజ్ఞాదుల నొనర్చువారికి, ప్రతీతేః = ఉదకసంపరిష్వక్తగమనము గలదని ఉత్తరవాక్యమువలనఁ దెలియవచ్చుట వలన,

తా॥ జీవుఁడు ఉదకములతోఁగూడుకొని పోవునట్లు పంచాగ్ని విద్యాశ్రుతియందు జెప్పఁబడలేదని యంటివేని, అట్లు చెప్పుట యుక్తముకాదు. "య ఇమే గ్రామే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే' అను వాక్యము కేవలముఇష్టాదుల నొనర్చువారలు ద్యులోకమును బొందుచున్నారని స్పష్టముగాఁ జెప్పుచున్నది గదా ?

## ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ జీవుఁడు ఉదకములతోఁగూడుకొని దేహాంతరమును బొందుచున్నట్లుపంచాగ్ని విద్యావాక్యమువలనఁ దెలియవచ్చుచున్నదని యింతకు పూర్వము చెప్పఁబడియె. అది యసంభవము. ఏలననిన, జీవుఁడచటఁ జెప్పఁబడలేదు. ఉదకముయొక్క యాకారవిశేషములగు శ్రద్ధాదులు ద్యులోకాద్యగ్నులయందు హోమము జేయఁబడుచున్నవని గదా యచటఁ జెప్పఁబడెను. జీవుఁడు ఉదకములతోఁగూడుకొని పోవుచున్నట్లు చెప్పఁబడలేదే? అనిన,

## స మా ధా న ము.

బ్రహ్మవేత్తలుకాక కేవలము యజ్ఞ, కూపాదిఖనన, దానములనొనర్చువారలు ద్యులోకమునకుఁ జని యచట సోమరాజులుగా నగుదురనియు, పుణ్యకర్మావసానమున వారలు తిరిగి ఈలోకమునకువచ్చి గర్భమును బొందుచున్నారనియు ఈ వాక్యముననే చెప్పఁబడుచున్నది. ఎట్లనిన, "అథ య ఇమే గ్రామే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి" అనువాక్యము "కేవలము యజ్ఞ,కూపాదిఖనన, దానములనఁబడు కర్మముల ననుష్ఠించుచు గ్రామమున నుండువారలు ధూమమును బొందుచున్నారు" అని చెప్ప నారంభించి "పితృలోకాదాకాశం, ఆకాశాచ్చంద్రమసం ఏష సోమో రాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయన్తి తస్మిన్ యావత్సంపాతముషిత్వా అథైతమేవాధ్వానం పునర్నివర్తన్తే" (ఛాం. ౫. అ. ౧౦.ఖ. ౪. వా) అనఁగా "తరువాత వీరు పితృలోకమునకుఁ జని పితృలోకమునుండి యాకాశమును, ఆకాశమునుండి చంద్రుని బొందుచున్నారు అచట యీతఁడు సోమరాజుగా (దివ్యదేహసంపన్నుఁడుగా) నయి దేవతలకన్నమై దేవతలచే భక్షింపఁబడుచున్నాఁడు. వీరు, కర్మావసాన పర్యంతము, దేవతలతోఁగూడనుండి తిరిగి ఈలోకమునకు వచ్చుచున్నారు" అనియు "యో యోహ్యన్నమత్తి యో రేతస్సిఞ్చతి తద్భూయఏవభవతి"

(ఎవ్వఁడు ఎవ్వఁడు అన్నమును తినుచున్నాఁడో ఎవ్వఁడు ఎవ్వఁడు రేతస్సును తడుపుచున్నాఁడో, వానినీజీవుఁడుపొందుచున్నాఁడు) అనియును దశమఖండమునఁ జెప్పఁబడియె. ఇచటను అనఁగా చతుర్థఖండమునను దేవతలు శ్రద్ధయనఁబడు ఉదకమును హోమము జేయుచున్నారనియు "తస్యా ఆహుతేః సోమో రాజా భవతి" (ఛా. ౫. అ. ౪. ఖ. 3. వా) (ఆయాహుతివలన సోమరాజు గలుగుచున్నాఁడు) అనియును చెప్పఁబడియె. ఈ వాక్యమా వాక్యముతో నేకార్థముగల దయినందున అందు చంద్రరూపమగు దేహముతోఁ గూడియున్నట్లు చెప్పఁబడిన వాఁడే ఇందు సోమరూపమగు దేహముతోఁగూడిన వాఁడుగాఁ జెప్పఁబడినవాఁడని విశదమగుచున్నది. జీవునికి విశేషణభూతమగు దేహమును తెలుపునట్టి శబ్దము పర్యవసానమున విశేష్యమగు జీవునే తెలుపును. కావున ఉదకములతోఁ గూడిన వాఁడై జీవుఁడు పోవుచున్నాఁడనుట సంభవము.

అవతారిక:—సోమరాజును దేవతలు భక్షించుచున్నట్లు "తం దేవా భక్షయన్తి" అను శ్రుతి తెలుపుచున్నది. అయితే జీవుఁడు భక్షింపఁదగిన పదార్థము కాఁడు. కనుక నిచట సోమరాజనిన జీవుఁడు కాఁడని శంకింపఁగానట్టి శంకను పరిహరించుటకై,

౭॥ సూ॥ భా క్తం వా నా త్మ వి త్త్వా త్త థా హి ద ర్శ య తి.

టీ॥ అనాత్మవిత్త్వాత్ = [1] ఇష్టాదికారు లాత్మవేత్తలుగానందున, భాక్తం = (వారు దేవతలకన్న మగుదురను వచనము) గౌణము. తథాహి = అటులనే కదా! దర్శయతి = శ్రుతి తెలుపుచున్నది. వా = శంక యుక్తమైనదికాదు.

తా॥ అట్లుచెప్పుట యుక్తము గాదు. ఇష్టాదికారుఁడు బ్రహ్మవేత్తకాఁడు గాన, (మోక్షమును బొందక) దేవలోకమునుబొంది దేవతలకు భోగోపకరణమగుచున్నాఁడు. కాఁబట్టి వాఁడు దేవతలకన్న మగునను వచనము గౌణము. అటులనే శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ కేవలము ఇష్టాది కర్మముల నొనర్చువాఁడు బ్రహ్మజ్ఞాన శూన్యుఁడగుటచే వాఁడీలోకమునను, పరలోకమునను దేవతలకు భోగసాధనము గానుండును. వాఁడు ఈ లోకమున దేవతలకుఁ బ్రీతికరములగు ఇష్టాదికర్మముల నొనర్చుటచే వారలకు ఉపకారకుఁడగుచున్నాఁడు. ఈతఁడు తానొనర్చిన కర్మములవలన సంతుష్టినొందిన దేవతల యనుగ్రహముచే దేవలోకమునకుఁ జని యచట వారలతో సమానముగా భోగముల ననుభవించుచు వారలకుభోగసాధన

1. ఇష్టం=యాగాదికర్మ, పూర్తం=కూపాదిఖననము. దత్తం = దానము. ఈకర్మములనొర్చువారు ఇష్టాదికారు లనఁబడుదురు.

మగుచున్నాఁడు. కనుకనే ‚‚ యథా పశురేవం స దేవానాం'' అను శ్రుతియును "మనకు పశువెట్లో, అట్లే దేవతలకు కర్మిష్ఠుఁడగు పురుషుఁడు'' అనుచు ఆత్మజ్ఞానములేని వాఁడు దేవతలకు భోగసాధనమని తెలియఁజేయుచున్నది. శ్రీభగవద్గీతలయందును"దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి''(భ. గీ. ౭అ. ౨౩. శ్లో) అనుశ్లోకమున"దేవతల నారాధించు వారలు దేవతలను బొందుచున్నారు, నన్ను (భగవంతుని) ఆరాధించు వారలు నన్నుబొందుచున్నారు'' అని చెప్పియుండుటచే బ్రహ్మోపాసకులగు వారలకు బ్రహ్మప్రాప్తియు, బ్రహ్మోపాసకులుకాని వారలకు దేవతల యెడల భోగసాధనములుగా నుంటయును సంప్రాప్తము లగుచున్నట్లు స్మృతివలనను తెలియుచున్నది. కనుక జీవుఁడు దేవతలకు భోగసాధనమగుననెడి యభిప్రాయమునుబట్టి శ్రుతియందు "వారల కన్నమై వారిచే భక్షింపఁబడునట్లు'' చెప్పఁబడుచున్నాఁడు. కావున "భక్షింపఁబడు చున్నాఁడు'' అనునది ముఖ్యార్థముగలది కాదు. మఱియు, "న హ వై దేవా అశ్నన్తి న పిబన్తి ఏతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి'' అనఁగా "దేవతలు భక్షింపరు. పానము జేయరు. అయితే యీయమృతమునే చూచి తృప్తిని బొందుచున్నారు'' అనుశ్రుతియును దర్శనమాత్రమువలనఁ గలిగిన తృప్తియే దేవతలకుభక్షణమనియును చెప్పుచున్నది. కనుక జీవుఁడు భూతసూక్ష్మములతోఁ గూడుకొని దేహాంతరమును బొందుచున్నాఁడని సిద్ధమగుచున్నది.

తదనన్తరప్రతిపత్త్యధికరణము ముగిసెను.

## కృతాత్యయాధికరణము.

౮॥ సూ॥ కృతాత్యయేనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవంచ.

టీ॥ కృతాత్యయే: = కర్మఫలావసానమున, అనుశయవాన్ = కర్మశేషము గలవాఁడై (అవరోహతి = జీవుఁడు దిగుచున్నాఁడు, అనగా మరల ఈలోకమునకు వచ్చుచున్నాఁడు. ఏలననఁగా,) దృష్టస్మృతిభ్యాం = శ్రుతిస్మృతులవలన, అవగమ్యతే=ఇట్లు తెలియవచ్చుచున్నది. యథా = ఎట్లు, ఇతం = వెళ్లుటయో, అట్లును, అనేవంచ = అట్లుకాక, వేఱొకమార్గముననను (వచ్చుట దెలియవచ్చుచున్నది).

తా॥ జీవులు ఏ కర్మఫలము ననుభవించుటకై లోకాంతరమున కేగిరో, ఆ కర్మఫలము నచట ననుభవించి కర్మశేషముతోఁ గూడుకొనినవారై మరల ఈ లోకమునకు వచ్చుచున్నారని శ్రుతిస్మృతులవలన విశదమగుచున్నది. అయితే వారిచటికి వచ్చునప్పుడు వారిచటినుండి పోయిన లోకక్రమమును, ఆదికాక వేఱొక లోకక్రమమునున్ను అవలంబించి వచ్చుచున్నారు.

శ్రీ॥ భా॥ "యావత్సంపాత ముషిత్వాఽథైత మేవాధ్వానం పునర్ని వర్తన్తే" (ఛా. ఉ. ప్ర. ౧౦ ఖ. ౫ వా) అను శ్రుతి ప్రకారము "ఆత్మజ్ఞానములేక కేవలము యజ్ఞ,కూపాదిఖనన, దానకర్మముల నాచరించు వారలు ధూమము మొదలుగాఁగల పితృయాణమునఁబోయి కర్మఫలావసానమున తిరిగి ఈ లోకమున కేతెంచుదురని చెప్పఁబడియె. ఈ విషయమును గురించి యొక సంశయ ముగలుగుచున్నది.

## సంశయము.

కర్మఫలావసానమున తిరిగి ఈ లోకమున కేతెంచునప్పుడు జీవుఁడు కర్మశేషముగలవాఁడై, వచ్చుచున్నాఁడా? లేక, కర్మశేష మెంతమాత్రము లేని వాఁడై వచ్చుచున్నాఁడా?

## పూర్వపక్షము

కర్మమంతయు ననుభవింపఁబడుటచే జీవుఁడు కర్మశేష మెంతమాత్రము లేనివాఁడై యిచటికి వచ్చుచున్నాఁడనుట యుక్తము. ఏలననిన, అనుశయమనఁగా అనుభవింపఁగా మిగిలిన కర్మము గదా! అయితె కర్మఫలము సంపూర్ణముగా ననుభవింపఁబడుటచే కర్మమెట్లు మిగులఁగలదు? మిగులదే? "యావత్సంపాత ముషిత్వా" అను శ్రుతివలన కర్మమంతయు ననుభవింపఁబడినట్లు తెలియవచ్చు చున్నది. ఎట్లనిన, "యావత్సమ్పాత ముషిత్వా = కర్మ మున్నంతవఱకు స్వర్గమున నివసించి" అనుటచే నిచ్చటికి తిరిగి వచ్చునప్పుడు కర్మము నిశ్శేషముగా ననుభవింపఁబడు చున్నదని స్పష్టమగుచున్నది. "సమ్పత న్త్యనేన స్వర్గం లోకం" అనఁగా "దీనిచే స్వర్గలోకమును పొందుచున్నారు." అనెడి వ్యుత్పత్తి నిబట్టి సమ్పాతమనఁగా కర్మమని యర్థము గదా. కనుకనే "ప్రాప్యాంతం కర్మణ స్తస్య యత్కించేహ కరోత్యయం తస్మాల్లోకాత్పున రేత్యస్మై లోకాయ కర్మణే" (బృ. ౬అ. ౪బ్రా. ౬వా.) అను శ్రుత్యంతరము సయితము "జీవుఁడు ఈ లోకమునం దొనర్చిన కర్మమంతయు పరలోకమునందు ఫలానుభవముచే నిశ్శేషముగా నశింపఁగా మరల కర్మమును సంపాదించుకొనుటకై ఆ లోకమునుండి యీ లోకమునకు వచ్చుచున్నాఁడు" అని చెప్పుచున్నది. ఇట్లు పూర్వపక్షము రాఁగా.

## సిద్ధాంతము

జీవుఁడు కర్మశేషముతోఁ గూడుకొనియే యీ లోకమునకు తిరిగి వచ్చు చున్నట్లు శ్రుతి స్మృతులవలనఁ దెలియుచున్నది. శ్రుతులేవియనిన,

"తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహయత్తే రణీయాం యోనిమా పద్యేరన్ బ్రాహ్మణయోనిం క్షత్రియయోనిం వైశ్యయోనిం వా అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే కపూయాంయోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా ఛణ్డాలయోనిం వా" (ఛా. ౫. అ. ౧౦. ఖ౭ వా.) అను శ్రుతి వాక్యము "ఈలోకమునకు తిరిగి వచ్చు జీవులు పుణ్యావంతులైన చో, ఈ లోకమున పుణ్యజన్మమును అనఁగా బ్రాహ్మణజన్మమును గాని, క్షత్రియజన్మమును గాని, వైశ్యజన్మమునుగాని, బొందుచున్నారు, వారు పాపులయి నచో, పాపపుజన్మమును, అనఁగా శునకజన్మమును గాని, సూకరజన్మమును గాని, ఛణ్డాలజన్మమును గాని బొందుచున్నారు" అని యివ్విధముగ ఈలో మునకు తిరిగి వచ్చుచుండెడి జీవులను గుఱించి చెప్పుటచే, వారికి పుణ్యాపాప రూపమగు కర్మముతో సంబంధమున్నట్లు తెలియుచున్నది. స్మృతులేవి యనిన,

"వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫలమనుభూయ తతః శేషేణ విశిష్టదేశ జాతి కుల రూపాయు శ్శ్రుత విత్త వృత్త సుఖ మేధసో హిప్రతి పద్యన్తే విష్వఞ్చో విపరీతా నశ్యన్తి" అనఁగా "బ్రాహ్మణాది వర్ణములను బ్రహ్మ చర్యాద్యాశ్రమములను గలిగియుండు జనులు తమతమ వర్ణాశ్రమముల కను గుణములగు కర్మములనొనర్చి, పరలోకమునకుఁ జని, యచట నాకర్మ ఫల ముల ననుభవించి, తరువాత కర్మశేషమువలన శ్రేష్ఠమగు దేశమునందును, శ్రేష్ఠమగు బ్రాహ్మణాది వర్ణమునందును శ్రేష్ఠమయిన వంశమునందును రూప వంతులుగాను, ఆయుష్మంతులుగాను, విద్యావంతులుగాను, ధనవంతులుగాను, ఆచారవంతులుగాను, సుఖవంతులుగాను, బుద్ధిమంతులుగాను జన్మించుచు న్నారు" అని గౌతమధర్మసూత్రములయందు జెప్పఁబడియె.

"తతః పరివృత్తౌ కర్మఫలశేషేణ జాతిం రూపం వర్ణం బలం మేధాం ప్రజ్ఞాం ద్రవ్యాణి ధర్మానుష్ఠానమితి ప్రతిపద్యంతే తచ్చక్ర వదుభయోర్లోకయోః సుఖ ఏవ వర్తతే" (జీవులు అనఁగా యీలోకమునకు తిరిగి వచ్చినప్పుడు కర్మఫల శేషమువలన సద్వంశమునందు జన్మమును, మంచి రూపమును, మంచి దేహకాంతిని, బలమును, బుద్ధిని, ప్రజ్ఞను, ద్రవ్యమును, ధర్మానుష్ఠానమును బొందుచున్నారు. కనుక చక్రమువలెఁ దిరుగుచుండు ఈ జీవులకు, ఇహపర లోకముల యందంతటను సుఖము గలదు" అనియాపస్తంబధర్మసూత్రములందును జెప్పబడియె. కావున. ఫలము నిచ్చుటయందు ప్రవృత్తములగు కర్మములను గుఱించి "యావత్సంపాత ముషిత్వా" ఇత్యాది శ్రుతివాక్యము నిశ్శేషానుభవ మును జెప్పుచున్నది. "యత్కించేహ కరోత్యయం" అనిచెప్పినది గూడ వానిని గుఱించినదియే. ఇట్లు ఫలదాన ప్రవృత్తములగు ఇతర కర్మములు మా

త్రము నిశ్శేషముగా ననుభవింపఁబడుటచే అభుక్తఫలములగు కర్మములకును అనఁగా నేకర్మముల ఫలముల నీతఁడననుభవించలేదో వానికిని, అప్రాయశ్చిత్త కర్మములకును, అనఁగా నేకర్మములకు గాను ప్రాయశ్చిత్తమాచరింపఁబడలేదో వానికిని నాశముగలుగుట యసంభవము. కనుక తిరిగి ఈ లోకమునకు వచ్చునపుడు జీవులు కర్మశేషముతోఁ గూడుకొనియే వచ్చుచున్నారని సిద్ధమగుచున్నది. అప్పుడు వీరు వీరింతకుముందు పోయిన మార్గముననను వేఱొక్క మార్గముననున్ను వచ్చుచున్నారని యర్థము. అది యెట్లనిన,

వారలిచ్చటనుండి పోవునపుడు ధూమమునుండి రాత్రిని, రాత్రినుండి అపరపక్షమును, అపరపక్షమునుండి దక్షిణాయనమును, దక్షిణాయనమునుండి పితృలోకమును, పితృలోకమునుండి ఆకాశమును, ఆకాశమునుండి చంద్రుని బొందుచున్నారు. తిరిగి వారి చ్చటికి వచ్చునపుడు చంద్రుని స్థానము నుండి యాకాశమును, ఆకాశమునుండి వాయువును, వాయువునుండి ధూమమును, ధూమమునుండి అభ్రమును, (మేఘమును) అభ్రమునుండి మేఘమును (వర్షోన్ముఖమేఘమును) బొందుచున్నారు. ఈ లోకమునకు తిరిగి వచ్చునప్పుడు జీవులు ఆకాశమును బొందుటచే వీరింతకుముందు పోయియున్న మార్గమున వచ్చుచున్నట్లును, తరువాత వాయువు మొదలగువానిని పొందుటచేతను పితృలోకాదులను పొందకుండుట చేతనున్ను వీరింతముందు పోయియున్నమార్గము కంటె వేఱొక్కమార్గముననున్ను వచ్చుచున్నట్లు తెలియుచున్నది.

౯॥ సూ॥ చరణాదితి చేన్నతదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః

టీక॥ చరణాత్ = చరణశబ్దప్రయోగమువలన, ఇతిచేత్ = కర్మశేషము సిద్ధింపదంటివేని, న = ఇది యొక దోషము కాదు, ఉపలక్షణార్థా = చరణశ్రుతి కర్మోపలక్షణార్థము, ఇతి=ఇట్లని, కార్ష్ణాజినిః = కార్ష్ణాజిని మహర్షి, మన్యతే = తలఁచుచున్నాడు.

తా॥ "రమణీయచరణాః" ఇత్యాది శ్రుతులయందు చరణశబ్దప్రయోగముండుటచే, కర్మశేషము సిద్ధింపదంటివేని, యది యుక్తముకాదు. ఆ శ్రుతి [1]ఉపలక్షణచే కర్మశేషమునుబట్టియే ఉత్తమమధ్యమాధమ జన్మములను తెలియఁజేయుచున్నదని కార్ష్ణాజినిమహర్షి తలచుచున్నాఁడు.

---

౧ ఒకటినుద్దేశించి చెప్పినది సామాన్యధర్మముచే తదితరస్థలములయందును ప్రవర్తించుట ఉపలక్షణమనఁబడును.

—••◆ ఆ క్షే ప ము. ◆••—

శ్రీ॥ భా॥ "రమణీయచరణాః" "కపూయచరణాః" అను తావుల "చరణ" శబ్దము పుణ్యాపాపరూపమగు కర్మమును తెలుపునది కాదు. ఎట్లన, లోకమునందును, శాస్త్రమునందును "చరణ" శబ్దమున కాచారపరముగాఁ బ్రసిద్ధి గలదు. లౌకికులు చరణ, ఆచార, శీల, వృత్త, శబ్దములను పర్యాయపదములనుగాఁ దలంచుచున్నారు. వేదమునందును "యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని" "యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని" అను తావుల "నింద్యములు కాని కర్మములు సేవింపఁదగినవనియు సుచరితములుఉపాసింపఁదగినవనియును" చెప్పుటచే వేదవాక్యములు గూడ సుచరితముల కంటె అనఁగా చరణములకంటె కర్మములను వేఱయినవానినిగా నిర్దేశించుచున్నవి. కాఁబట్టి చరణమనఁగా శీలమని యర్థము. కావున వానివాని శీలమును అనఁగా ఆచారమునుబట్టి ఉత్తమమధ్యమాధమకులములయందు జన్మములు గలుగుచున్నవనుట యుక్తమే గాని, కర్మశేషమువలన నట్టి జన్మములు గలుగుచున్నవనుట యుక్తము గాదనిన,

—••◆ స మా ధా న ము ◆••—

"రమణీయచరణాః" అనియు "కపూయచరణాః" అనియు నీశ్రుతివాక్యములు ఉపలక్షణముచే కర్మమును బట్టియే యట్లు తెలియఁజేయుచున్నవని శ్రీకార్ష్ణాజినిమహర్షి తలఁచుచున్నాఁడు. ఏలయన, ఆచారము వలనమాత్రమే సుఖదుఃఖములు గలుగుట యసంభవము. అవి పుణ్యాపాపరూపములగు కర్మముల ఫలములు గదా!

౧౦॥ సూ॥ ఆ న ర్థ క్య మి తి చే న్న త ద పే క్ష త్వా త్॥

టీక॥ ఆనర్థక్యం = ఆచారమును విధించుట నిరర్థమనవలసివచ్చునే, ఇతి చేత్=ఇట్లంటివేని, న=అది సరికాదు. ఏలననిన, తదపేక్షత్వాత్ = కర్మమాచారమునపేక్షించునది యగుటవలన,

తా॥ అట్లయిన, శ్రుతిస్మృతులయందాచారమును విధించుట నిరర్థకమగునేయని శంకింపఁబనిలేదు. కర్మములన్నియు నాచారము నపేక్షించునవియే గదా.

—••◆ ఆ క్షే ప ము ◆••—

శ్రీ॥ భా॥ అట్లయిన పక్షమున, ఆచారము వలననేమియు ప్రయోజనము లేకపోవునుగాన, స్మృతులయందు విధింపబడిన యాచారము నిరర్థకమగునే యనిన,

## సమాధానము.

అట్లు చెప్పఁగట్టదు. ఏలననిన, పుణ్యాకర్మమాచారము నపేక్షించియుండు నది గదా, ఆచారవంతునికే గదా! పుణ్యాకర్మములయం దధికారము గలదు. కనుకనే " సన్ధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హస్సర్వకర్మసు " అనఁగా " సంధ్యావందనము నాచరింపని మనుజుఁడెప్పుడును అపరిశుద్ధుఁడుగాన, నతఁ డన్నికర్మములయందును అనర్హుఁడు"అనియు " ఆచారహీనం న పునన్తి వేదాః " అనఁగా "ఆచారహీనుని వేదములు పవిత్రునిగాఁ జేయవు" అనియు నీమొదలగు శాస్త్రవాక్యములు తెలుపుచున్నవి. కాఁబట్టి "రమణీయచరణాః" ఇత్యాది శ్రుతివాక్యములు ఉపలక్షణముచే కర్మమునుబట్టియే ఉత్కృష్ట నికృష్టజన్మములను దెలియజేయుచున్నవని కార్ష్ణాజిని మహర్షియొక్క యభిప్రాయము.

౧౧ సూ॥ సుకృత దుష్కృతే ఏ వేతి తు బాదరిః॥

టీ॥ తు = చరణశబ్దమునకు ఉపలక్షణార్థము గ్రాహ్యాము కాదు. సుకృత దుష్కృతే ఏవ=పుణ్యపాపములే "రమణీయచరణ" "కపూయ చరణ" శబ్దములచే నిర్దేశింపబడుచున్నవి, ఇతి=అని, బాదరిః = బాదరిమహర్షి. మన్యతే = తలంచుచున్నాఁడు.

తా॥ కార్ష్ణాజినిమహర్షి చెప్పినట్లు చరణశబ్దమునకు కర్మోపలక్షణార్థమును గ్రహింపఁబనిలేదు. "రమణీయచరణ" "కపూయచరణ" శబ్దములచే సుకృత దుష్కృతములే నిర్దేశింపబడెనని బాదరిమహర్షి తలఁచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ "పుణ్యాకర్మము నాచరించుచున్నాఁడు. "పాపకర్మము నాచరించు చున్నాఁడు" అనుతావుల కర్మము విషయమై "చర"ధాతువును ప్రయోగించియున్నందున చరణమనఁగా కర్మమేయని తెలియుచున్నది. శ్రుతియందు కర్మమునున్ను చరితమునున్ను వేఱువేఱుగా నిర్దేశించుటకు హేతువేమనఁగా, అందొక్కటి ప్రత్యక్షముగా శ్రుతులచే విధింపబడిన కర్మమును తెలుపుచున్నది. వేఱొక్కటి వాసుకలోనుండు ఆచారమునుబట్టి యూహింపఁబడిన శ్రుతులచేఁ దెలుపఁబడు కర్మమును తెలుపునది. ఇట్లు ఒక్కటియే కర్మమును వేఱువేఱుశబ్దములచే దెలుపుట [1]గోబలీవర్ద న్యాయప్రకారము పొసగుచున్నది. ఇట్లు చరణశబ్ద

1. గోబలీవర్దన్యాయము:— ఆవులును ఎద్దులును గోజాతిలోనే చేరినవిగాన, గోశబ్దమును ప్రయోగించినంతమాత్రముచే నవి తెలుపఁబడును. అట్లున్నను, గోశబ్దముతోఁ గూడ ఎద్దులను తెలుపునదియగు బలీవర్ద శబ్దమును సయితము ప్రయోగించుట భాషయందు గానఁబడుచున్నది. అట్టితావుల పౌనరుక్త్యదోషము ప్రాప్తించునే యని శకింపఁగా, గోశబ్దము

మునకు ముఖ్యార్థము సంభవమగుచుండగా, ఉపలక్షణార్థమును చెప్పుకొనుట న్యాయము కాదు. కనుక "రమణీయచరణాః" "కపూయచరణాః" అను శ్రుతివాక్యములయందుండు "చరణ" శబ్దము సుకృతదుష్కృతకర్మములనే చెప్పునది యని శ్రీ బాదరిమహర్షి తలఁచుచున్నాఁడు. బ్రహ్మసూత్రకారులమతము గూడ నిదియే. అయితే వీరు కార్ష్ణాజినిమహర్షి యానతిచ్చిన ప్రకారము [1]ఆచారములనుబట్టి యూహింపఁబడిన శ్రుతులచే సిద్ధించునట్టి సంధ్యావందనాది కర్మములకు ఇతర కర్మములయందు యోగ్యతను గలుగఁజేయుటయే ప్రయోజనమనెడి యంశమును మాత్ర మంగీకరించుచున్నారు. కావున జీవులు కర్మశేషముతోఁగూడుకొనియే తిరిగి ఈ లోకమునకు వచ్చుచున్నారని సిద్ధమగుచున్నది.

కృతాత్యయాధికరణము ముగిసెను.

## అనిష్టాదికార్యధికరణము.

### ౧౨॥ సూ॥ అ ని ష్టా ది కా రి ణా మ పి చ శ్రు త మ్.

టీ॥ అనిష్టాదికారిణామపి = అనిష్టాదికారులకుఁ గూడ చంద్రమండల ప్రాప్తి, శ్రుతం = శ్రుతులయందు వినఁబడుచున్నది.

---

సామాన్యముగా "గో" జాతిలోఁజేరిన వానినన్నింటిని (ఆవులను ఎద్దులను) తెలుపునది యైనను ఎద్దులు శీఘ్రముగా మనస్సున కవగాహమగుటకుగాను వానిఁదెలుపు బలీవర్దశబ్దము ప్రయోగింపఁబడియెనని శాస్త్రికారులు సమాధానము చెప్పుదురు. ఈ పైని గానఁబఱచిన విధమున పౌనరుక్త్యదోషము ప్రసక్తించు తావుల నెల్లను నిట్లే సమాధానమును చెప్పుకొనునది. దీనిని గోబలీవర్దన్యాయమందురు. ఇది వాచస్పత్యమున నిట్లు వివరింపఁబడినది:— "బలీవర్దస్య గోవిశేషత్వేపి బలీవర్దస్యఝటితి గోత్వేన బోధనార్థం యథాప్రయోగః తథాన్యయోః సామాన్యవిశేషరూపయో ర్ఝటితి బోధనార్థం యత్ర యత్ర ప్రయోగ స్తత్ర తత్రాస్య ప్రవృత్తిః"

అట్లే ప్రకృతమునను "యాన్యన వద్యాని కర్మాణి" అనుతావున నుండు "కర్మ" శబ్దముచే భాష్యమునందు గానఁబఱచిన, యుభయవిధ కర్మములును సామాన్యముగాఁ దెలుపఁబడినను, రెండవవిధమైన కర్మమును తెలుపుటకై "యాన్యస్మాకం సుచరితాని" అనుతావున "సుచరిత' శబ్దము; అట్టికర్మములు శీఘ్రముగా మనస్సున కవగాహమగుటకుగాను, ప్రయోగింపఁబడెనని యెఱుంగునది.

(1) కొన్నికర్మములు సాక్షాత్తుగా శ్రుతులచేతనే విధింపఁబడుచున్నవి. మఱికొన్నికర్మములట్లు సాక్షాత్తుగా శ్రుతులచేవిధింపఁబడుచుండలేదు. అయితే అవి యాచారము నందుండుటనుబట్టి వానిని విధించు స్మృతులు గలవనియు అట్టి స్మృతులనుబట్టి వానికి మూలాధారభూతములగు శ్రుతులు గలవనియును శాస్త్రకారులు కల్పించుకొనవచ్చును. అట్లే "ఆచారాచ్చ స్మృతింజ్ఞాత్వా స్మృతేస్తు శ్రుతికల్పనం" అను శాస్త్రవాక్యము చెప్పుచున్నది. ఈ న్యాయమునుబట్టి భాష్యకారులు సంధ్యావందనాదులు ఆచారమును బట్టి యూహింపఁబడిన శ్రుతులవలన సిద్ధించునవి యని చెప్పియున్నారు.

తా॥ యజ్ఞాదిశాస్త్రవిహిత కర్మములనాచరింపక శాస్త్రనిషిద్ధకర్మముల నాచరించు పాపాత్ములకుఁ గూడ చంద్రమండల ప్రాప్తిగలదని " చంద్రమసమేతే గచ్ఛన్తి " అను శ్రుతివాక్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ కేవలము ఇష్టాది కర్మములనొనర్చు వారలు చంద్రునిబొంది కర్మశేషముతోనే తిరిగి ఈలోకమునకు వచ్చుచున్నారని పూర్వము జెప్పఁబడియె.

సంశయము.

అనిష్టాదికారులు చంద్రుని బొందుచున్నారా? లేదా? శాస్త్రవిహిత కర్మముల నాచరింపనివారును, శాస్త్రనిషిద్ధములగు కర్మములనాచరించువారును నగు నీ రెండువిధములగు పాపాత్ములును అనిష్టాదికారులనఁ బడుచున్నారు.

పూర్వపక్షము

అనిష్టాది కారులును చంద్రుని బొందుచున్నారనుట యుక్తము. ఏలయన, కౌషీతకులు "యే వై కేచాస్మాల్లోకా త్ప్రయన్తి చంద్రసమేవ తే సర్వే గచ్ఛన్తి" (కౌ. ౧. అ. ౨) అనుతావున " ఈ లోకమునుండి పోవువారందఱును చంద్రుని బొందుచున్నారు " అనుటచే సామాన్యముగా ఇష్టాదికారులకును అనిష్టాదికారులకును చంద్రమండల ప్రాప్తిని జెప్పుచున్నారు.

అవతారిక:—అట్లయినచో, పుణ్యాత్ములును పాపాత్ములును అందఱును నొక్కటియే గతిని బొందుచున్నారని చెప్పినట్లగునే? యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౧౩॥ సంయమనేత్వనుభూయేతరేషా మారోహావరోహౌ తద్గతిదర్శనాత్.

టీ॥ తు = పూర్వపక్షమయుక్తము, ఇతరేషాం = అనిష్టాది కారులకు, ఆరోహావరోహౌ = చంద్రునిపొందుటయు, చంద్రునినుండి యిచటకి వచ్చుటయును, సంయమనే = యమశాసనమున, అనుభూయ = యమయాతనలననుభవించిన తరువాత, (సంభవతః = కలుగుచున్నవి. ఏలననఁగా,) తద్గతిదర్శనాత్ = వారికి యమప్రాప్తి శ్రుతియందు దెలుపఁబడియున్నందున.

తా॥ పుణ్యాత్ములను పాపాత్ములును అందఱును నొక్కటియేగతిని బొందుదురనుట యుక్తము కాదు. ఏలననిన, అనిష్టాదికారులు యమలోకమునకుఁ బోయి యచట యమయాతనల ననుభవించిన తరువాతనే చంద్రుని బొంది, యచటినుండి తిరిగి ఈ లోకమును బొందుచున్నారు. వారికి యమప్రాప్తిని శ్రుతి చెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ అనిష్టాదికారులు ప్రథమమున యమలోకమునకుఁ జని యముని యాజ్ఞవశమున యమయాతనల ననుభవించిన తరువాతనే చంద్రుని బొందుచున్నారు. ఎట్లనిన, "అయం లోకో నాస్తి నపర ఇతి మానీ పునః పునర్వశ మాపద్యతే మే" అను వాక్యము "ఈ లోకముగాని పరలోకముగాని లేదనెడి దురభిమానముగల పురుషుఁడునా (యముని) వశమును బొందుచున్నాఁడు" అని "వైవస్వతం సంగమనం జనానాం యమం రాజానం" (ఆరణ. ౨. ప్ర. ౧. ప) అనువాక్యము "జనులు వివస్వతుని కుమారుఁడగు యమధర్మరాజుయొద్దకుఁ బోవుచున్నారు" అనియు నీ మొదలగు వాక్యములు పాపాత్ములు యమునికి వశ్యులై యమలోకమునకుఁ బోవుచున్నారని తెలుపుచున్నవి.

౧౪॥ సూ॥ స్మ ర న్తి చ.

టీ॥ స్మరన్తి-చ=మఱియు పరాశరాది స్మృతికారులు స్మరించుచున్నారు.

తా॥ పరాశరాది స్మృతికారులు గూడ నటులనే స్మృతులయందుఁ జెప్పియున్నారు.

శ్రీ॥ భా॥ పరాశరాది స్మృతికారులును "సర్వేచైతే వశం యాన్తి యమస్య భగవన్ కిల" (ఈ జనులందఱును యమునికి వశ్యులు) అని స్మృతులయందుఁ జెప్పియున్నారు.

౧౫॥ సూ॥ అ పి చ స ప్త.

టీ॥ అపి-చ = మఱియు, సప్త=ఏడు నరకములును స్మరింపఁబడినవి.

తా॥ సప్తనరకములను గూడ స్మృతికారులు చెప్పుచున్నారు.

శ్రీ॥ భా॥ పాపాత్ములగువారు రౌరవము మొదలగు నేడు నరకములనున్ను బొందునట్లు స్మృతులు తెలుపుచున్నవి.

అవతారిక:—రౌరవము మొదలగు నేడు లోకములకుఁ బోవు వీరలు యమమందిరమున కేగుట యెట్లు సంభవమని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై,

౧౬॥ సూ॥ త త్రా పి త ద్వ్యా పా రా ద వి రో ధః

టీ॥ తత్రాపి=రౌరవాదిసప్తనరకములను బొందువిషయమునను, తద్వ్యాపారాత్ = యముని యాజ్ఞవలననే గాన, అవిరోధః = విరోధములేదు.

తా॥ యముని యాజ్ఞవలననే వీరు రౌరవాదులకుఁ బోవుచున్నారు గాన విరోధ మెద్దియును లేదు.

శ్రీ॥ భా॥ యముని యాజ్ఞ వలననే వీర లీశావాదిలోకములకుఁ బోవుచున్నారు. కావున విరోధమెద్దియు లేదు. కనుక అనిష్టాదికారులు ప్రథమమున యమలోకమునకుఁ జని, యచట తమతమ కర్మములకనుగుణముగా యాతనలననుభవించి, తరువాత చంద్రునిబొంది, చంద్రుని ద్వారా తిరిగి యీలోకమునకు వచ్చుచున్నారు.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షమురాఁగా, నందులకు సమాధానము చెప్పుటకై,

౧౭॥ సూ॥ విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్

టీక॥ తు=పూర్వపక్ష మయుక్తము, విద్యాకర్మణోః = ఉపాసనా కర్మములు, ఇతి = దేవయాన పితృయాణ ప్రాప్తిసాధనములుగా, ప్రకృతత్వాత్ = ప్రకరణసిద్ధము లగుటవలన.

తా॥ పూర్వపక్ష మయుక్తము. విద్యాకర్మములు మాత్రము ప్రకరణసిద్ధములగుటచేఁ దత్ఫలములగు దేవయానపితృయాణములు మాత్రము ఉదహరింపఁబడినవి.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "తు" శబ్దము పూర్వపక్షము యుక్తము గాదని తెలుపుచున్నది. అనిష్టాది కారులును చంద్రుని బొందుచున్నారనుట యుక్తము కాదు. దేవయానపితృయాణములు ఫలభోగమునకై యేర్పడినవి గదా! అనఁగా బ్రహ్మవిద్యా వంతులకు దేవయానమునఁ బోవుట బ్రహ్మవిద్యా ఫలమగునట్లు, ఇష్టాదికర్మముల నొనర్చిన వారలకును పితృయాణమునఁ బోయి చంద్రుని బొందుట వారలొనర్చిన ఇష్టాదికర్మముల ఫలము. అనిష్టాదికారులు బ్రహ్మవేత్తలుగానందున వారలకు దేవయానమునఁ బోవుట యెట్లు అసంభవమో, అట్లేవారుఇష్టాదికర్మము నొనర్చినవారు కానందున,వారికిపితృయాణగమనమును, చంద్రప్రాప్తియును అసంభవములు.

దేవయానము బ్రహ్మవిద్యను గుఱించినదనియు, పితృయాణము పుణ్యకర్మమును గుఱించినదనియు నెట్లు తెలియును? అనిన, ఈవిషయమును శ్రుతులే చెప్పుచున్నవి. ఎట్లనిన, ఛందోగులు "తద్య ఇత్థం విదుః యేచేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిష మభిసంభవన్తి అర్చిషోఽహః" (ఛా. ౫. ప్ర. ౧౦.ఖ.౧వా) అనఁగా "పంచాగ్ని విద్యయందు గనఁబఱచిన ప్రకారము ప్రకృతివినిర్ముక్తముగు ప్రత్యగాత్మను బహ్మాత్మకమయిన దానినిగా నుపాసించువారలును అరణ్యమున శ్రద్ధాపురస్సరముగ తపస్సనంబడు పరబ్రహ్మమును ఉపాసించువారలును

అర్చిస్సును, అర్చిస్సునుండి అహస్సును బొందుచున్నారు" అని దేవయానమును గుఱించియు "అథయఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే ధూమ మభి సమ్భవన్తి" (ఛా. ౫. ప్ర. ౧౦.ఖ ౩వా) అనఁగా యజ్ఞ, కూపాదిఖనన, దాన ములనఁబడు కర్మములను అనుష్ఠించువారలు ధూమమును బొందుచున్నారు" అని పితృయాణమును గుఱించియును పఠించుచున్నారు. ఇందువలన "యేవై కే చాస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమస మేవ తే సర్వే గచ్ఛన్తి" (ఈలోకమునుండి పోవువారందఱును చంద్రుని బొందుచున్నారు) అనువాక్యముు ఇష్టాదికారులను గుఱించి మాత్రమే అట్లు చెప్పుచున్నట్లు తెలియుచున్నది. ఈ తావున అందఱ నఁగా కర్మిష్ఠుల లందఱని యేఱుంగునది.

అవతారిక:—పాపకర్మము నాచరించిన వారలుచంద్రునిబొందరనుపక్షమున, వారివిషయమై పంచమాహుతి యసంభవముగాన, వారికి మరల శరీరము గలుగటయే యసంభవమగును.ఏలననిన, "పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి" అనఁగా "ఉదకములు పంచమాహుతియందు పురుషాకారము గలవగుచున్నవి" అని యివ్విధమునఁ గదా శరరోత్పత్తిని గుఱించి శ్రుతులయందు వినఁబడుచున్నది. మఱియు నట్టి పంచమాహుతి ఈ జీవుఁడు చంద్రునిబొందిన తరువాత గలుగునది యని గదా యింతకు పూర్వము గాన్పింపఁబడెను. కావున శరీరోత్పత్తికిగానే పాపాత్ములును చంద్రుని బొంది తిరిగి వచ్చుచున్నారని యవశ్యమంగీకరింవపలయునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

## ౧౮ సూ॥ న తృతీయే తథోపలబ్ధేః

టీక॥ తృతీయే = తృతీయస్థానమునసుండువాని విషయమై అనఁగా పాపాత్ముని విషయమైన, = పంచమాహుతిని బొందవలయునన్న నియమము లేదు, తథా = అట్లు, ఉపలబ్ధేః = గన్పట్టుచుండుట వలన.

తా॥ పాపాత్ములు దేహప్రాప్తికిగాను పఞ్చమాహుతిని బొందవలయునన్న నియమము లేదు. అట్లు శ్రుతులవలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ తృతీయస్థానము గలవానికి అనఁగా పాపాత్మునికి శరీరప్రాప్తికై పంచమాహుతిని బొందవలయునన్న నియమము లేదు. ఎట్లనిన, ప్రవహణుఁడను రాజు "వేత్థ యథా కేనా సౌ లోకో న సంపూర్యతే?" అనఁగా ఈ చంద్రలోక మెందువలన నిండింపఁబడలేదో తెలియునా? అను ప్రశ్నమున కుత్తరమును జెప్పుసందర్భమున, "అథైతయోః పథోర్న కతరేణ చ తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీనిభూతాని భవన్తి జాయస్వమ్రియస్వేత్యే తత్తృతీయం స్థానం తేనాऽసౌ లోకో న సంపూర్యతే" (పిమ్మట నీ రెండు మార్గములలో దేనితోఁడను

పోఁగూడని నరులు గమనాగమనములు గల క్షుద్రభూతములై మరల పుట్టుచు గిట్టుచుందురు. ఇది మూఁడవస్థానము. ఈ హేతువుచేఁ జంద్రలోకము పూర్తియగుటలేదు) అనిచెప్పెను. ఇట్లుపాపాత్ములు చంద్రలోకమునకుఁ బోవుటయు మరల నిచటికి వచ్చుటయును లేకుండుచే చంద్రలోకము నిండింపఁబడలేదని చెప్పియున్నందున వారలు శరీరారంభమునకుగాను పంచమాహుతిని బొందనక్కఱ లేదు. ఇంతేకాక, "పంచమ్యామాహుతౌ" అనువాక్యము ఉదకములకుఁ బంచమాగ్ని సంబంధము పురుషశబ్దవాచ్యమగుటకు హేతువగుచున్నదని చెప్పుచున్నదేగాని, వేఱొక్కదానిని నిషేధించుచుండ లేదు. అచట అవధారణమును తెలుపు శబ్దమేదియును లేదు గదా.

## ౧౯॥ సూ॥ స్మర్యతే పిచ లోకే

టీక॥ అపిచ = మఱియు, లోకే = లోకమునందు, = స్మర్యతే = ద్రౌపదీదృష్టద్యుమ్నాదుల కయోనిజత్వము స్మరింపఁబడినది.

తా॥ కనుకనే ద్రౌపదీదృష్టద్యుమ్నాదులకు పంచమాహుత్యపేక్ష లేకయే శరీరప్రాప్తి గలిగినట్లు భారతాదులయందుఁ జెప్పఁబడియె.

శ్రీ॥ భా॥ ద్రౌపదీ, దృష్టద్యుమ్నుఁడు మొదలగు పుణ్యాత్ములకు కొందరికికి పంచమాహుత్యపేక్షలేకయే శరీరోత్పత్తి కలిగినట్లు పురాణేతిహాసాదుల వలనఁ దెలియుచున్నది గదా.

## ౨౦॥ సూ॥ దర్శనాచ్చ

టీక॥ దర్శనాచ్చ = స్వేదజోద్భిజ్జములకు పంచమాహుత్యపేక్షలేకయే శరీరోత్పత్తి గలుగుచున్నట్లు శ్రుతివలనఁ దెలియవచ్చుట వలనను

తా॥ స్వేదజోద్భిజ్జములకు పంచమాహుత్యపేక్షలేకయే శరీరప్రాప్తి గలుగుచున్నట్లు శ్రుతులవలనఁ దెలిసికొనుచున్నాము.

శ్రీ॥ భా॥ కొన్నింటికి పంచమాహుత్యపేక్షలేకయే దేహోత్పత్తిగలుగుచున్నట్లు శ్రుతివలనఁ దెలియుచున్నది. ఎట్లన, "తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవన్తి అణ్డజం జీవజ ముద్భిజ్జమితి" అనువాక్యమున "ఈ భూతములకన్నింటికిని అణ్డజమనియు, జీవజమనియు, ఉద్భిజ్జమనియును మూఁడే బీజములు" అని చెప్పఁబడియె. వానిలో నుద్భిజ్జ స్వేదజముల నెడి భూతములు పంచమాహుత్యపేక్షలేకయే పుట్టుచున్నట్లు గాఁబడుచున్నవి.

అవతారిక:—అణ్డజ, జీవజ, ఉద్భిజ్జములనెడి మూఁడు బీజములు మాత్రమే యీ పై శ్రుతియందు జెప్పఁబడినవి గాని, స్వేదజము చెప్పఁబడ లేదే యని శంకింపఁగా, నట్టి శంక నుబరిహరించుటకై,

౨౧॥ సూ॥ తృతీయశబ్దావరోధస్సంశోకజస్య

టీ॥ సంశోకజస్య = స్వేదజమునకు, తృతీయశబ్దావరోధః = శ్రుతియందు మూఁడవదియగు "ఉద్భిజ్జ"శబ్దముచే నుపసంగ్రహము, (కృతః = చేయఁబడినది)

తా॥ పూర్వోక్త శ్రుతియందు ఉద్భిజ్జ శబ్దముచే స్వేదజములుగూడ గ్రహింపబడియె.

శ్రీ॥ భా॥ మూఁడవదియగు నుద్భిజ్జశబ్దముచే స్వేదజములున్ను గ్రహింపఁబడుచున్నవి. కనుక కేవలము పాపకర్మములనొనర్చు వారలు చంద్రుని బొందనేరరు.

అనిష్టాదికార్యధికరణము ముగిసెను.

---

తత్స్వాభావ్యాపత్త్యధికరణము.

౨౨॥ సూ॥ తత్స్వాభావ్యాపత్తిరుపపత్తేః

టీ॥ ఉపపత్తేః = ఉపపత్తివలన, తత్స్వాభావ్యాపత్తిః = వానితో సాదృశ్యమును బొందుట యగును.

తా॥ ఈ లోకమునకు తిరిగి వచ్చునపుడు జీవుఁడాకాశాదులతో సాదృశ్యమును బొందుచున్నాఁడనుట యుపపన్నయు.

శ్రీ॥ భా॥ ఇష్టాదికారులు భూతసూక్ష్మములతోఁ గూడుకొని కర్మశేషము గలవారయి చంద్రమండలమునుండి యీలోకమునకు తిరిగి వచ్చుచున్నారని చెప్పఁబడియె. మఱియు వీరలు ఇచటికి వచ్చుమార్గక్రమమును గుంటేచి "అథైత మేవాధ్వానం పునర్నివర్తన్తే యథైతమాకాశ మాకాశాద్వాయుః వాయుర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వాభ్రం భవతి అభ్రంభూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి" ఇత్యాది శ్రుతివాక్యము "ముందుపోయినట్టి యీ మార్గమున తిరిగి వచ్చున్నారు. ఆకాశమును బొంది యాకాశమునుండి వాయువయి ఈతఁడు ధూమమగుచున్నాఁడు ధూమమయి మేఘమండల మగుచున్నాఁడు. మేఘమండలమై మేఘమగుచున్నాఁడు. మేఘమయి వర్షించుచున్నాఁడు, అనగా వర్షరూపముగాఁ గ్రిందపడుచున్నాఁడు" అని చెప్పుచున్నందున

వీరలిచటినుండి లోకాంతరమునకుఁ బోయిన మార్గముననను, వేఱొక్క మార్గ మునను నిచటికి వచ్చుచున్నారనియును చెప్పఁబడియె. ఈ యంశమును గుఱించి యొకసంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ పైశ్రుతియందు జీవుఁడాకాశవాయ్వాదులుగా నగుచున్నాఁడనఁగా, ఈతఁడు దేవమనుష్యాది రూపమగు శరీరములను బొందుచున్నట్లు ఆకాశవా య్వాదిరూపమగు శరీరమును బొందుచున్నాఁడా? కాక, ఆకాశవాయ్వాదు లతో సాదృశ్యమును మాత్రము బొందుచున్నాఁడా?

## పూర్వపక్షము.

ఇందును గుఱించి విశేషమేదియును జెప్పియుండనందున, పూర్వము శ్రద్ధయనంబడు నుదకరూపముననుండు జీవుఁడు సోమశరీరమును బొందినట్లు ఇచటను ఆకాశాదిశరీరమును బొందుచున్నాఁడనుట యుక్తమనిన,

## సిద్ధాంతము.

ఈ జీవుఁడు ఆకాశాదులతో సాదృశ్యమును బొందుచున్నాఁడనుట యు క్తము. ఏలననిన, ఈతఁడు సుఖదుఃఖకర్మముల ననుభవించుటకై సోమ, దేవ, మనుష్యాది శరీరములను బొందుచున్నాఁడు. అట్లు ఇచట ఆకాశాదిరూపమును బొందినపుడు సుఖదుఃఖానుభవమేదియు గానఁబడుచుండ లేదే? గనుక నీతఁడా కాశాదిశరీరమును పొందుట యసంభవము. కాఁబట్టి యీ తనికిఁగల ఆకాశాది సంబంధమువలనఁగలుగు తత్సాదృశ్యమునుబట్టి యీతఁడు తద్భావమును బొందు చున్నాఁడని శ్రుతి చెప్పుచున్నది.

తత్స్వభావ్యాపత్త్యధికరణము ముగిసెను.

---

## నాతిచిరాధికరణము.

### ౨౩॥ సూ॥ నాతిచిరేణ విశేషాత్

టీ॥ విశేషాత్ = వ్రీహ్యాదినిష్క్రమమున విశేషమును జెప్పియున్నం దున, నాతిచరేణ = అతిశీఘ్రకాలమున (జీవునికాకాశాదికమునుండి నిర్గమనము కలుగును)

తా॥ వ్రీహ్యాది నిష్క్రమమున విశేషము జెప్పియుండుటచే, జీవుఁడా కాశాదులను శీఘ్రముగా వదలుచున్నాఁడని తెలియవచ్చుచున్నది.

## సంశయము.

శ్రీ॥ భా॥ ఇట్లు ఆకాశప్రాప్తిమొదలు వ్రీహ్యాదిప్రాప్తివఱకు ఆయాయ వస్థలయందు ఈ జీవుఁడు బహుస్వల్పకాలము మాత్రమే యుండునా? లేక ఇంతకాలముండు ననెడి నియమ మేదిమియును లేదా?

## పూర్వపక్షము.

ఇంతకాలముండు నని నిరూపించు హేతువు లేవియును లేనందున, అతఁడు ఇంతకాలముండు నను నియమము లేదనుట యుక్తమనిన,

## సిద్ధాంతము.

ఇట్లు చెప్పుట సరికాదు. "అతోవైఖలు దుర్నిష్ప్రపతరం" అనఁగా "వ్రీహ్యాదులనుండిజీవుఁడు కష్టముతో బయలువెడలుచున్నాఁడు" అనుశ్రుతివాక్య మున వ్రీహ్యాదినిష్క్రమమును గుఱించి "కష్టముతో బయలు వెడలుట" యనఁ బడు విశేషము జెప్పియున్నందున, ఈతఁడు ఆకాశాద్యవస్థలయందు స్వల్పకాలము మాత్రము ఉండునని తెలియచున్నది. "దుర్నిష్ప్రపతరం." అనునది ఛాందసరూపము "దుర్నిష్ప్రపతరం" అనఁగా "కష్టముతోబయలు వెడలుట" అని యర్థము.

నాతిచిరాధికరణము ముగిసెను.

---

## అన్యాధిష్ఠితాధికరణము.

### ౨౪॥ సూ॥ అన్యాధిష్ఠితేపూర్వవదభిలాపాత్॥

టీ॥ అన్యాధిష్ఠితే = అన్యజీవులచే సధిష్ఠింపఁబడిన వ్రీహ్యాదులయందు, పూర్వవత్ = పూర్వము ఆకాశవాయ్వాదులయందువలెనె సంసర్గమాత్రమును అభిలాపాత్ = ఇచటఁ గూడ చెప్పుటవలన,

తా॥ ఇంతకు పూర్వము "ఈ జీవులాకాశవాయ్వాదు లగుచున్నారు" అనుతావున ఆకాశవాయ్వాదులతో సంబంధమును బొందుచున్నారన్నట్లు, ప్రకృత మునను, వ్రీహ్యాదులతో సంబంధమునుమాత్రముబొందుచున్నారనుట యుక్తము.

శ్రీ॥ భా॥ ఈ లోకమునకు మరలవచ్చు జీవులను గుఱించి "మేఘో భూత్వా ప్రవర్షతి ఇహ వ్రీహియవా ఓషధి వనస్పతయస్తిలమాషా జాయన్తే" (ఛా. ౫ ప్ర. ౧౦ఖ. ౬వా) అను శ్రుతివాక్యము "మేఘములై వర్షరూపముగాఁ బడి వడ్లు, నువ్వులు, మినుములు, మొదలగునవిగా నిచట జన్మించుచున్నారు" అని చెప్పుచున్నది. ఇందును గుఱించి యొక సంశయము కలుగుచున్నది.

సంశయము.

ఈ జీవులు వ్రీహియవాదులను శరీరముగాఁగల జీవాంతరమునకు శరీరభూతములగు వ్రీహియవాదులతో సంబంధము గలవారగుచున్నారనుట యీ శ్రుతియొక్క యభిప్రాయమా? లేక, ఈ జీవులు వడ్లు మొదలగు ధాన్యరూపమగు శరీరము గలవారై యిచట జన్మించుచున్నారనుట యీపై శ్రుతియొక్క యభిప్రాయమా?

పూర్వపక్షము.

వడ్లు, నువ్వులు, యవలు మొదలగు ధాన్యములుగా జన్మించుచున్నారని శ్రుతియందుఁ జెప్పియున్నందున, వ్రీహియవాదిరూపమగు శరీరముగలవారై జీవులిచట జన్మించుచున్నారనుట శ్రుత్యభిప్రాయము. "జన్మించుచున్నారు" అని శ్రుతియందు జెప్పియున్నందున, "మనుష్యుఁడుగాఁ జన్మించుచున్నాఁడు దేవతగాఁ జన్మించుచున్నాఁడు" అను నీ మొదలగు తావుల మనుష్యాదిశరీరముగలవాఁడై జన్మించుచున్నాఁడని తెలియవచ్చునట్లు, ప్రకృతమునను వ్రీహ్యాది శరీరము గలవారై జన్మించుచున్నారని తెలియవచ్చుచున్నది.

సిద్ధాంతము.

ఇంతకుఁ బూర్వ మీజీవు లాకాశవాయ్వాదులగు చున్నారనుతావున, ఆకాశాదులతో సంబంధమును మాత్రముబొందుచున్నారనినట్లు, ప్రకృతమునను వ్రీహ్యాద్యవస్థను అనఁగా, జీవాంతరమునకు శరీరభూతములగు వ్రీహ్యాదులతో సంబంధమును మాత్రము బొందుచున్నారనుట యుక్తము. కర్మానుభవమునకు గానగు జన్మమును జెప్పదలఁచిన తావుల నెల్లను, "పుణ్యవంతులు పుణ్యజన్మమును బొందుదురు" అనియు "పాపాత్ములు పాపజన్మమును బొందుదురు" అనియు నిర్విరోధముగా నట్టి కర్మము నయితము గాన్పింపఁబడుచున్నది. ప్రకృతముననో, "ఆకాశాదులు గానగుచున్నారు" అనుతావున వలెనె కర్మమేదియు చెప్పఁబడలేదు. ఏలననిన, స్వర్గమునం దనుభవింపఁ దగిన ఫలము గలదియు, అట్టి ఫలమునిచ్చుటకై ప్రవృత్తమగు ఇష్టాదికర్మము స్వర్గానుభవమువలననే ముగియుచున్నది. ఫలము నిచ్చుటకై ప్రవృత్తముకానికర్మమన్ననో, మరల వీరిచటికి వచ్చినప్పుడు వీరికి జన్మహేతు వగుచున్నదని "రమణీయ చరణాః" "కపూయచరణాః" అనుటచే జెప్పఁబూనియున్నారు. ఈ మధ్యకాలమున వీరలచే ననుభవింపదగిన మఱియొక్క కర్మమేమున్నది? ఏమియును లేదు. కనుక వీరలి తకుఁ బూర్వము ఆకాశాదులతో సంబంధమును బొంది నటుల ప్రకృతమునను వ్రీహ్యాదులతో సంబంధమాత్రమును బొందుచున్నారనుట యుక్తము. శ్రుతియందు "జాయన్తే= జన్మించుచున్నారు" అనుపదము గౌణార్థము.

౨౫॥ సూ॥ అ శు ద్ధ మి తి చే న్న శ బ్దా త్

టీ॥ అశుద్ధం = (పశుహింసాదిసంబంధము గలదైనందున) యజ్ఞాది కర్మము, అశుద్ధం=అపవిత్రము, ఇతిచేత్ = ఇట్లుంటివేని, న = అదిసరికాదు, ఏలననఁగా, శబ్దాత్ = (జ్యోతిష్టోమాదియజ్ఞ కర్మమహింసాత్మకమని చెప్పునట్టి) శాస్త్రిమువలన,

తా॥ జ్యోతిష్టోమాదియజ్ఞకర్మమునకు పశుహింసాదిసంబంధముండుటచే నది యపవిత్రమంటివేని, యట్లు కాదు. జ్యోతిష్టోమాది కర్మము లట్టివి కావని శాస్త్రిము చెప్పుచున్నది గదా.

శ్రీ॥ భా॥ జన్మము కర్మోపభోగమునకు గానేర్పడునది గదా! అయితే ఈ లోకమునకుమరల వచ్చు జీవులు మార్గమధ్యమున ననుభవింపఁదగిన కర్మమేదియును లేనందున వీరలు మరల ఇచటకు వచ్చునపుడు జీవాంతరాధిష్ఠితమగు వ్రీహ్యాది శరీరముతో సంబంధమును మాత్రము బొందున్నారు గాని, వారువ్రీహ్యాది శరీరము గలవారై జన్మించుచుండ లేదని పూర్వసూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె.

## ఆ క్షే ప ము.

అయినను, అట్లు చెప్పుట సరికాదు. వీరలు వ్రీహ్యాదిరూపమగు శరీరము గలవారై జన్మించుచున్నారనుట యుక్తము. ఏలననిన, ఈ వ్రీహ్యాది శరీమునందుండు నపుడు వీరిచే ననుభవింపఁబడు కర్మము కలదు. ఎట్లన,వీరొనర్చు ఇష్టాది కర్మములే పాపమిశ్రమములు. అవి యగ్నీషోమీయము మొదలగు జంతుహింసతోఁ గూడి యున్నట్టివి గదా! హింసయన్నచో, "నహింస్యాత్సర్వాభూతాని" అను శాస్త్రిముచే నిషేధింపఁబడిన దగుటవలన నది పాపమే.

పదాహావనీయాదుల యందువలె [1]నుత్సర్గాపవాదన్యాయ ప్రకారము

(1) ఉత్సర్గాపవాదన్యాయము.—ఉత్సర్గము=సామాన్యము, అపవాదము=విశేషము సామాన్యముగా నొక విషయమును జెప్పి అందు కొంత విశేషవాక్యముచే నిషేధింపఁబడిచో, నది యుత్సర్గాపవాదన్యాయ మనఁబడుచున్నది. "సర్వేభ్యో బ్రాహ్మణేభ్యో దధి దీయతాం నతు మాణవకస్య" అనఁగా "బ్రాహ్మణులకందఱికి పెరుగునీయము మాణవకునికి మాత్రము ఈయవలదు" అనునప్పుడు బ్రాహ్మణులందఱికిని పెరుగునీయము అని సామాన్యముగా చెప్పుటచే మాణవకుఁడను బ్రహ్మణునికిని దధిదానము ప్రాప్తింపఁగా, మాణవకునికి మాత్రము ఈయవలననెడి విశేషవాక్యముచే తెలుపఁబడిన నిషేధము మాణవకునియెడల ప్రవర్తించుచున్నది. ఈరెండువాక్యములును దధిదానరూపమగు నొక్కటియే విషయమును గుఱించినవైనందున ఉత్సర్గాపవాదన్యాయమునకు ఈతావున ఉపయోగము గలదు. ప్రకృతమునన్నో, వాక్యములు భిన్నవిషయము లైనందున వానికి పరస్పరము విరోధములేదు గాన, నది ప్రవర్తింపదు. ఈ న్యాయమును ఆహవనీయాది హోమములను గుఱించి పూర్వమీమాంసకు లుపయోగపఱచి యున్నారు.

ఈ తావునను హింసను నిషేధించు " న హింస్యాత్సర్వా భూతాని " యను దానిని సామాన్య శాస్త్రిమునుగాను, అగ్నీషోమీయాది (జంతు) హింసను విధించు నట్టి, " అగ్నీషోమీయం - పశు మాలభేత " అను దానిని విశేషశాస్త్రిమును గానును గ్రహింపుదమంటివేని, అట్లు గ్రహింపఁదగదు. ఏలననిన, ఒక్క టియే విషయమును గుఱించి రెండు శాస్త్రిములు పరస్పరవిరుద్ధములగు విధు లను విధించియున్న ప్రదేశమున మాత్రమే యీ న్యాయము ఉపయుక్తమగుచు న్నది. ప్రకృతముననో, యీ రెండు శాస్త్రిములు భిన్నభిన్న విషయములను గుఱించి భిన్నభిన్న విధులను విధించుచున్నవి. అదెటులనిన,"అగ్నీషోమీయంపశుమాలభేత" అనెడి శాస్త్రిము జంతుహింస క్రతువును ఉపకరించునదని తెలుపుచున్నది. "న హింస్యాత్సర్వా భూతాని" అను శాస్త్రిము జంతుహింసవలన పాపము గలు గు నని విధించుచున్నది.

ఒకవేళ అగ్నీషోమీయాది జంతుహింస శాస్త్రిమునందు విధింపఁబడిన దైనందున, " న హింస్యాత్సర్వా భూతాని " అను శాస్త్రిమట్టి శాస్త్రివిధి ప్రవృత్తమగు హింసను నిషేధించుచుండ లేదు, అయితే యీ శాస్త్రిము రాగ పరవశమున జనులొనర్చు జంతు హింసను మాత్రము నిషేధించుచున్న దందు రేమో; అట్లు చెప్పుటయును యుక్తము కాదు. ఏలననిన, రాగపరవశత్వమనఁ బడునది ప్రకృతముననను సమానమే. ఎట్లన, " స్వర్గకామో యజేత " అనఁగా " స్వర్గమునందుఁ గోరికగలవాఁడు యజ్ఞమును జేయవలయును. "అను శాస్త్రి విధివలన స్వర్గమును గోరువానిచే నాచరింపవలసిన వానినిగా యజ్ఞాదులను ఉపదేశించుటవలన యజ్ఞాదులు స్వర్గప్రాప్తిసాధనములని యెఱింగి, యట్టి స్వర ప్రాప్తిరూపమగు ఫలమునం దనురాగమువలననే యజ్ఞాదుల నొనర్చుటయందు ప్రవర్తించుచున్నాఁడు. అట్లు పలసాధనభూతములగు యజ్ఞాదులకు అగ్నీషోమీ యాది జంతు హింస యుపకారకమని శాస్త్రిమువలన నెఱింగి దానియందును అనురాగమువలననే ప్రవర్తించుచున్నాఁడు. ఏదైన నొక ప్రమాణమువలన జంతు హింస ఇష్టసాధనమని యెఱింగి దానియందనురాగము వలననే లౌకికజంతు హింసయందును ప్రవర్తించుచున్నాఁడు. కావున శాస్త్రిమునందు విధింపఁబడిన జంతుహింసయును సాధారణముగా లోకమునందు జనులొనర్చు జంతుహింస వలెనె అనురాగపరవశత్వముచే నొనర్పఁబడునదియే. ఈ రెంటికిని భేదమేమి యునులేదు.

- ఇంతియెకాక, " సర్వవర్ణానాం స్వధర్మానుష్ఠానే పరమపరిమితం సుఖం " అనఁగా " బ్రాహ్మణాదివర్ణస్థులు తమ తమ వర్ణధర్మముల ననుష్ఠించినచో, అపరిమితమును శ్రేష్ఠమును నగుసుఖమును బొందుదురు " అను శాస్త్రిము వలన

పరమసుఖము నందలి యపేక్షతో ననుష్ఠింపఁబడు నిత్యకర్మములును అనురాగ పరవశత్వముచే నొనర్పఁబడునవియే. కాఁబట్టి నిత్యకర్మములును అపవిత్రములే.

కనుక, ఇష్టాదికర్మములు పాపమిశ్రితములగుటం జేసి వాని నొనర్చిన వారలు, స్వర్గాదిలోకముల యందట్టి కర్మములయొక్క ఫలము ననుభవించి, యందలి హింసారూపమగు పాపాంశమును ఈలోకమునకు మరల వచ్చునపుడు వ్రీహ్యాదిస్థావర శరీరములు గలవారై జన్మించి, యనుభవించుచున్నారనుట యుక్తము. "శరీరజైః కర్మదోషై ర్యాన్తి స్థావరతాం నరః" అనుస్మృతివాక్యము శరీరమువలనఁ గలుగు దుష్కర్మముల వలన, నరుఁడు స్థావరభావమును బొందు చున్నాఁడు" అనుచు స్థావరశరీరమును బొందుట పాపఫలమని చెప్పుచున్నది. కనుక ఈలోకమునకు మరలవచ్చు జీవు లట్టి పాపకర్మముల ననుభవించుటకు గాను వ్రీహ్యాది శరీరములుగలవారై జన్మించుచున్నారనుట యుక్తమనిన,

—•••◆ సమాధానము ◆•••—

అట్లు చెప్పుట యుక్తముకాదు. అగ్నీషోమీయాది(జంతు)హింస స్వర్గప్రాప్తిహేతు వగుచున్నదని వేదశాస్త్రములు చెప్పుచున్నందున దానినొక హింసనుగా నెన్నఁదగదు. ఎట్లన " హిరణ్యశరీర ఊర్ధ్వః స్వర్గం లోకమేతి " అను నీమొదలగు వేదవాక్యములు "యజ్ఞమునందు జంపబడిన జంతువు సువర్ణశరీరము కలదైఁస్వర్గలోకమును బొందుచున్నది"అనిచెప్పుచున్నవి. అత్యంత సుఖము నిచ్చు వ్యాపారము కొంచము దుఃఖము నిచ్చునదైనను నది హింసయని చెప్పఁబడకరక్షణమని చెప్పఁబడుచున్నది. అట్లే,మంత్రవర్ణము సయితము "న వా ఉ ఏత న్మ్రియసే నరిష్యసి దేవాన్ ఇదేషి పథిభి స్సుగేభిః యత్ర యన్తి సుకృతో నాపి దుష్కృత స్తత్ర త్వాదేవ స్సవితా దధాతు"అనఁగా "ఓయజ్ఞగత సత్వమా! నీ విందువలన మృతినొందవు, నశింపవు,అయితె సులభమార్గమున దేవతలను బొందుచున్నావు. ఎచ్చోటికిఁబుణ్యవంతులు పోవుదురో,పాపిష్ఠులు పోనేరరో,యచ్చోటికి నిన్నుసవితృ దేవతఁగొనిపోవుగాక" అనుటచే యజ్ఞమునందు జంపఁబడిన జంతువునకు దేవత్వప్రాప్తిని జెప్పుచున్నది. వైద్యుఁడు తత్కాలమునందు రోగికిఁగొంచము దుఃఖమును గలుగఁజేసినను, దాని నెఱింగిన వారలు వానిని రక్షకునిగాఁ జెప్పుచు పూజించు చున్నారు గదా!

౨౬॥ సూ॥ రేతస్సిగ్యో గోఽథ

టీక॥ అథ = వ్రీహ్యాదిభావానంతరము = రేతస్సిగ్యోగః = రేతస్సిక్కు తోటి సంబంధము = ఆమ్నాయతె (పఠింపఁబడుచున్నది.)

తా॥ వ్రీహ్యాదిభావానంతర మీా జీవులకు రేతస్సును విడుచునట్టి పురుషునితో సంబంధమును శ్రుతి చెప్పుచున్నది..

శ్రీ॥భా॥ మరల ఈలోకమునకు వచ్చునట్టి జీవుఁడు వ్రీహ్యాదిభావమును బొందుచున్నాఁడని చెప్పిన తరువాత " యో యో హ్యన్నమత్తి యోయోరేతస్సిఞ్చతి తద్భూయ ఏవ భవతి " (ఛా. ౫. ప్ర ౧౦. ఖ ౬వా) అనగా, "ఎవ్వఁడు ఎవ్వఁడు అన్నమును తినుచున్నాఁడో, మఱియు ఎవ్వఁడు ఎవ్వఁడు రేతస్సును (స్త్రీగర్భమునందుఁ విడుచున్నాఁడో, యట్టి పురుషునితో జీవుఁడు .సంబంధించుచున్నాఁడు") అను వాక్యమున, జీవులకు రేతస్సేచన మొనర్చునట్టిపురుషునితోఁ గేవలము సంబంధమాత్రము జెప్పియున్నట్లు, వ్రీహియవాదులతోను గూడ కేవలము సంబంధమాత్రమును జెప్పుటయే శ్రుత్యభిప్రాయము. కావున శ్రుతియందు వ్రీహ్యాదులు గాఁజన్మించు చున్నారనఁగా వ్రీహ్యాదులతో సంబంధము గలవారగున్నారని భావము.

౨౭॥ సూ॥ యో నే శ్శ రీ ర ం

టీక॥ యోనేః = యోనివలన, శరీరం = శరీరము, (జాయతే = కలుగుచున్నది.)

తా॥ యోనివలన శరీరము గలుగుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ లోకమునకు తిరిగి వచ్చుజీవులు యోనిని (స్త్రీగర్భమును) బొందిన తరువాత శరీరము గలవారగుచున్నారు. శరీరమునందే గదా వీరలు సుఖదుఃఖరూపమగు కర్మఫలము ననుభవించుచున్నారు. కనుక అంతకు పూర్వము వీరు బొందునట్టి యా కాశాదిభావమనఁబడునది యట్టి యాకాశాదులతో సంబంధమాత్రమని సిద్ధమగు చున్నది.

అన్యాధిష్ఠితాధికరణము ముగిసెను

గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బంధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేంకటేశ్వరసన్నిధ్యధ్యాపక కైంకర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర,శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకల విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్త తీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత,గీర్వాణాంగ్లద్రవిడాంధ్ర శుద్ధమాగధ్య వస్థాదిద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్రశ్రీభాష్యమునందు తృతీయాధ్యాయమున ప్రథమపాదము.

శ్రీరస్తు



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

తృతీయాధ్యాయము—ద్వితీయపాదము

## సన్ధ్యాధికరణము.

### ౧॥ సూ॥ సన్ధ్యే సృష్టిరాహహి

టీక॥ సన్ధ్యే = స్వప్నమున, సృష్టిః = సృష్టి, (జీవేనైన = జీవునిచేతనే క్రియతే = చేయఁబడుచున్నది), ఆహహి = అట్లు శ్రుతియే చెప్పుచున్నది గదా.

తా॥ స్వప్నమునందు రథాదులను సృజించువాఁడు జీవుఁడే. అట్లే గదా శ్రుతియును చెప్పుచున్నది.

ప్రథమద్వితీయ పాదములకుఁ గలపరస్పర సంబంధము.

శ్రీ॥ భా॥ జీవుఁడు స్వకర్మానుగుణముగ స్వర్గాదిలోకములకుఁ జని మరల ఇచటికి వచ్చి జన్మించుచున్నాఁడని చెప్పుటచే నతఁడు జాగ్రదవస్థయందు దుఃఖములననుభవించుచున్నాఁడని ప్రథమపాదమునఁ దెలుపఁబడెను. ఈ పాదమున నీతని స్వప్నావస్థను గుఱించి విచారింపఁబడును. వాజసనేయులు స్వప్నమును గుఱించి పఠించు సందర్భమున, "న తత్ర రథా న రథయోగా న పన్థానో భవంతి, అథ రథాన్ రథయోగాన్ పథ స్సృజతే న తత్రా నందా ముదః ప్రముదోభవన్తి అథానందాన్ ముదః ప్రముద స్సృజతే న తత్ర వేశాంతాః పుష్కరిణ్యా స్స్రవంత్యో భవంతి అథ వేశాంతాః పుష్కరిణ్యాః స్రవంత్యః స్సృజతే స హి కర్తా" (బృ. ౬అ. ౩బ్రా. ౧౦వా) అనగా స్వప్నమునందు రథములును గుఱ్ఱములును రథములు పోవుమార్గములును లేవు. అయినను రథములను గుఱ్ఱములను రథములుపోవుమార్గములను సృజించుచున్నాఁడు మఱియు నచట ఆనందములున్ను సుఖములున్ను సంతోషములున్ను లేవు ఆనందములనున్ను సుఖములను సంతోషములను

సృజించుచున్నాఁడు మఱియు నచటగృహములును పుష్కరిణులును నదులును లేవు గృహములను పుష్కరిణులను నదులను స్సృజించుచున్నాఁడు. అతఁడు కర్త) అని పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

సంశయము.

ఈశ్రుతివాక్యమునఁ బేర్కొనఁబడిన రథాదులను సృజించువాఁడు జీవుఁడా? లేక, యీశ్వరుఁడా?

పూర్వపక్షము.

స్వప్నమునందుఁ గాన్పించు రథాదులు జీవనిర్మితములు. సూత్రమునందుండు "సన్ధ్యే" శబ్దమునకు స్వప్నస్థానమని యర్థము "సన్ధ్యం తృతీయం స్వప్నస్థానం" (సన్ధ్య మనిన మూఁడవదియగు స్వప్నస్థానము" అని గదా శ్రుతి చెప్పుచున్నది. ఇట్టి స్వప్నమునందు రథాదులను సృజించువాఁడు జీవుఁడే. "సృజతే స హికర్తా" అనుశ్రుతి యట్లు చెప్పుచున్నది. స్వప్నదర్శియగు జీవుఁడే గదా యచటఁ దెలియవచ్చుచున్నాఁడు.

౨॥ సూ॥ నిర్మాతారంచైకే పుత్రాదయశ్చ

టీ॥ ఏకే = ఒకశాఖవారు, నిర్మాతారంచ = (జీవుని స్వప్నస్థానమున కామములను) నిర్మించువానినిగా (ఆమనంతి=పఠిచుంచున్నారు) పుత్రాదయశ్చ= పుత్రాదులే (ఆశ్రుతియందు కామశబ్దవాచ్యులు.

తా॥ కొన్నిశాఖల వారు జీవుఁడు స్వప్నమునందు కామములనఁబడు పుత్రాదులను నిర్మించువాఁడని పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ ఇంతియెకాక, కొన్ని శాఖలవారు ఈ జీవుని కామములను నిర్మించు వానినిగాఁ బఠించుచున్నారు. ఎట్లన, కాఠకులు "య ఏషు సుప్తేషుజాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" (కఠ ౨. ౫. ౭) (వీరలు నిద్రించుచుండఁగా నెవ్వఁడు కామములను నిర్మించుచున్నాఁడో) అని పఠించుచున్నారు. ఈ శ్రుతియందుండు"కామ"శబ్దము పుత్రాదులను తెలుపునది. ఏలననిన, "సర్వాన్ కామాన్ ఛన్దతః ప్రార్థయస్వ శతాయుషః పుత్ర పౌత్రాన్ వృణీష్వ" (కఠ ౧. ౧. ౨౨) "అన్నికామములను ప్రార్థించుము పుత్రపౌత్రాదులను కోరుము" అను పూర్వవాక్యమున పుత్రులు మొదలగు వారు గదా కామములుగా (కోరబడు వారుగా) ప్రకరణమునుబట్టి తెలియవచ్చుచున్నారు. కావున, జీవుఁడు స్వప్నమున రథాదులను సృజించుచున్నాఁడు. జీవుఁడు సత్యసంకల్పుఁడని ప్రజాపతి వాక్యము తెలుపుచున్నది. కావున ఉకరణాదులులేకున్నను జీవుఁడు రథాదులను సృజించుట సంభవము.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షమురాఁగా, దానిని పరిహరించుటకై:-

3॥ సూ॥ మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్

టీ॥ తు = పూర్వపక్షమయుక్తము, మాయామాత్రం = (స్వప్నసృష్టి) యాశ్చర్యకరమైనది, (కనుక నది సర్వేశ్వరనిర్మితము, ఏలననఁగా, జీవస్య = జీవుఁడు) కార్త్స్న్యేన=సంపూర్ణముగా, అనభివ్యక్తస్వరూపత్వాత్ = స్ఫుటముగాఁ బ్రకాశింపని స్వరూపము గలవాఁడైనందున.

తా॥ స్వప్నసృష్టి యాశ్చర్యకరమైనందున నది సర్వేశ్వరనిర్మితము. ఏలననఁగా, జీవుఁడు సంసారదశయందు స్ఫుటముగాఁ బ్రకాశింపని సత్యసంకల్పత్వాది స్వరూపము గలవాఁడు గదా! కావున పూర్వపక్ష మయుక్తము.

—సిద్ధాంతము—

శ్రీ॥ భా॥ స్వప్నమునందు గానఁబడు రథపుష్కరిణ్యాదిపదార్థసమూహము మాయామాత్రము అనఁగా సర్వేశ్వరనిర్మిత మనుట. ఏలననిన, సూత్రమునందు "మాయా" శబ్దము ఆశ్చర్యమును తెలుపునది. "జనకస్య కులేజాతా దేవమాయేవ నిర్మితా" (జనకుని వంశమునందు దేవతుల యాశ్చర్యకరమగు శక్తి మూర్తీభవించినట్లు) అను నీ మొదలగు తావుల మాయాశబ్దమునకు ఆశ్చర్యపరముగాఁ బ్రయోగము కలదు. ప్రకృతమునను "న తత్ర రథా న రథయోగాః" (స్వప్నమున రథములు లేవు. గుఱ్ఱములు లేవు) అనఁగా స్వప్నమును జూచు పురుషునికంటె నితరు లెవ్వరిచేతను అనుభవింపఁబడునవి గాను లేవని యర్థము. మఱియు "అథ రథాన్ రథయోగాన్ పథ స్సృజతే" (రథములను గుఱ్ఱములను మార్గములను సృజించుచున్నాఁడు) అనఁగా స్వప్నమును జూచువానిచే మాత్రము అనుభవింపఁబడునవియు, స్వప్నమున్నంతవఱకే యుండునవియునగు రథాదులను సృజించుచున్నాఁడనుట. ఇందువలన ఈ స్వప్నసృష్టి యాశ్చర్యకరమైనదిగాను గదా తెలుపఁబడుచున్నది. ఇట్టి యాశ్చర్యరూపమగు సృష్టిని గలుగఁజేయుట పరమపురుషునికి మాత్రము సంభవము గాని జీవునికది సంభవము గాదు. ఏలననఁగా, జీవుఁడు సత్యసంకల్పత్వాదులు గలవాఁడే యయినను, సంసారదశయందవి యన్నియును సంపూర్ణముగాఁ బ్రకాశింపక పోవుటచే, నతఁడు ఇట్టి యాశ్చర్యరూపమగు సృష్టిని గలుగఁజేయుట యసంభవము. "కామం కామం పురుషో నిర్మిమాణః" అనఁగా "సంకల్పించి పుత్రాదులను నిర్మించువాఁడు" అను శ్రుతివాక్యముగూడ సర్వేశ్వరునే తెలుపునది. ఏలననిన, "య ఏషు సుప్తేషు జాగర్తి" అనఁగా "ఈజీవులు నిద్రించుచుండఁగా నెవ్వఁడు మేలుకొని యున్నాఁడో" అనెడి యుపక్రమ వాక్యమునను, "తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే తస్మిన్ లోకాశ్శ్రితాస్స ర్వే తదునాత్యేతి కశ్చన"

(కఠ-౨-౪-౮) "అదియే పరిశుద్ధమైనది అదియే బ్రహ్మము. అదియే యమృతమని చెప్పఁబడుచున్నది. అన్నిలోకములు దానినే యాధారముగా నాశ్రయించియున్నవి. దాని నతిక్రమించునది యేదియును లేదు" అనెడియుపసంహార వాక్యమునను సర్వేశ్వరునికి మాత్రమే యుండునట్టివియగు గుణములు పేర్కొనఁబడినవి. "అథ వేశాన్తా పుష్కరిణ్యః స్రవన్త్యః సృజతే స హి కర్తా" (బృ. ౬అ. ౩బ్రా. ౧౦ వా) అను వాక్యము ఈపైని గానఁబడిచిన వాక్యముతో నేకార్థము గలదైనందున నిందు "స్వప్నదృష్టములగు రథాదులను సృజించువాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు" సర్వేశ్వరుఁడే యని యెఱుఁగునది.

అవతారిక:—అపహతపాప్మత్వము, సత్యసంకల్పత్వము మొదలగునవి జీవునికి స్వాభావికములగు పక్షమున, అవిసంసారావస్థయందెందువలన సంపూర్ణముగాఁ బ్రకాశింపక పోవుచున్నవనిన.

౪॥ సూ॥ పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధవిపర్యయౌ

టీ. తు=పూర్వపక్షమయుక్తము, పరాభిధ్యానాత్ = పరమపురుషుని సంకల్పమువలన. అస్య=ఈ జీవునియొక్క స్వాభావికమగు రూపము, తిరోహితం=సంకుచితమగుచున్నది, తతః-హి=అట్టి సంకల్పము వలననే, అస్య=ఈజీవునికి, బన్ధవిపర్యయౌ=బన్ధమోక్షములు (శ్రుతౌ = శ్రుతియందు వినఁబడుచున్నవి.)

తా॥ సర్వేశ్వరుని సంకల్పమువలన నీ జీవునియొక్క స్వాభావికరూపమగు సత్యసంకల్పత్వము మొదలగునది స్ఫుటముగాఁ బ్రకాశింపనిదిగాఁ జేయఁబడుచున్నది. అందువలననే సర్వేశ్వరుని సంకల్పమువలన జీవునికి బన్ధమోక్షములు గలుగుచున్నవని శ్రుతులు తెలుపుచున్నవి.

శ్రీ॥ భా॥ ఈజీవుని స్వాభావిక స్వరూపము సర్వేశ్వరుని సంకల్పమువలన ప్రకాశింపనిదిగాఁజేయఁబడుచున్నది. అనఁగా ననాదికర్మ పరంపరామూలముగా కృతాపరాధుండగు ఈజీవుని స్వాభావికమగు కల్యాణరూపమును పరమపురుషుఁడు కప్పివేయుచున్నాఁడు. కావున వాని సంకల్పము వలననే యీజీవునికి బన్ధమోక్షములు గలుగుచున్నవని శ్రుతులు చెప్పుచున్నవి. ఎట్లనిన. తైత్తిరీయులు "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథసోఽభయం గతో భవతి యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి" (తై. ఆ. ౭-౨-౧) (ఎప్పుడీయుపాసకుఁడు చక్షురాదీంద్రియములచే గ్రహింప శక్యము కానట్టియు, కర్మమూలమగుశరీరము లేనట్టియు, దేవాది శబ్దములచే జెప్పుటకలవిగానట్టియు, ఆధారము లేనట్టి పరబ్రహ్మమును గుఱించి నిరంతరస్మృతిరూపమగు నిష్ఠను అనఁగా ధ్యానమును అభయమునకై (మోక్షమునకై) గలవాఁడగుచున్నాఁడో, అప్పుడతఁ డభయ

మును బొందుచున్నాఁడు. ఎప్పుడీ యుపాసకుని ధ్యానమున నించుకైనను విచ్ఛేదము కలుగుచున్నదో, అప్పుడతనికి భయము అనఁగా సంసార బంధము కలుగుచున్నది) అనియు, " ఏష ఏవానందయతి " (ఈ పరమ పురుషుఁడే యుపాసకుల కానందమును గలుగఁ జేయుచున్నాఁడు) అనియు, "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః" (ఈ పరమపురుషుని భయమువలన వాయువు వీచుచున్నది సూర్యుఁడు ఉదయించుచున్నాఁడు) అనియును జెప్పుచు జీవునికిఁ గలుగు బన్ధమోక్షములు పరమపురుషుని సంకల్పమున కధీనము లైనవని తెలియఁజేయుచున్నారు. కనుక పరమపురుషుని సంకల్పమువలననే జీవునికి స్వాభావికమగు సత్యసంకల్పత్వము మొదలుగాఁగల కల్యాణరూపము గప్పి వేయఁబడుచున్నది.

౫॥ సూ॥ దే హ యో గా ద్వా సో ౽ పి

టీ॥ సో౽పి=స్వరూపతిరోభావమున్ను, దేహయోగాద్వా=దేహసంబంధమువలనఁగాని, సూక్ష్మాచిచ్ఛక్తి సంబంధమువలనఁగాని, భవతి=కలుగుచున్నది.

తా॥ దేహసంబంధము వలనఁగాని, సూక్ష్మాచిచ్ఛక్తి సంబంధమువలనఁగాని జీవుని స్వాభావికస్వరూపము తిరోహిత మగుచున్నది.

శ్రీ॥ భా॥ జీవునికిఁ గలుగు స్వరూపతిరోభావము అనఁగా నతని స్వాభావికస్వరూపమునందు సంకోచము దేహసంబంధద్వారాగాని, లేక,సూక్ష్మాచిచ్ఛక్తి సంబంధద్వారాగాని గలుగుచున్నది.

అందు సృష్టికాలమున దేహరూపమగు నచిత్పదార్థముతోఁ గల సంబంధమును బట్టియు, ప్రళయకాలమున నామరూపానర్హమగునంత సూక్ష్మమగు నచిత్పదార్థముతోఁగల సంబంధమునుబట్టియును జీవుని స్వాభావికస్వరూపమునకు సంకోచము గలుగుచున్నది. ఇట్లు అతని సత్యసంకల్పత్వాది స్వాభావికస్వరూపము ప్రకాశింపనందున, నతఁడు స్వప్నమునందు గానఁబడు రథాదులను సంకల్పమాత్రముచే సృజింప సమర్థుఁడు కాఁడు. మఱియు "తస్మిఀల్లోకాః శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన" (కఠ.౫-౮) ఇత్యాది శ్రుతివాక్యమునఁ జెప్పియున్న ప్రకారము జీవులందఱును నిద్రించునపుడు మేలుకొని యుండుటయు, సర్వలోకముల కాశ్రయ మగుటయు నీ మొదలగునవి పరమపురుషునికి మాత్రము సంభవములు. కనుక పరమపురుషుఁడే జీవులచే వారి స్వల్పస్వల్పములగు కర్మముల కనుగుణములగు ఫలముల ననుభవింపఁ జేయుటకై స్వప్నమున్నంతవఱకు మాత్రము ఉండునట్టివియు, స్వప్నగతులగు జీవులచే మాత్రము అనుభవింపఁబడఁదగినట్టివియునగు రథాదులను సృజించుచున్నాఁడు.

౬॥ సూ॥ సూ చ క శ్చ హి శ్రు తే రా చ క్ష తే చ త ద్వి దః

టీ. శ్రుతేః-చ=శ్రుతివలనను, హి=ఏకారణమువలన,తద్విదః-చ=స్వాప్నాధ్యాయవిదులు,అచక్షతే=చెప్పుచున్నారో, అందువలనను, సూచకః=స్వప్నము శుభాశుభసూచకము అని తెలియుచున్నది.

తా॥ స్వప్నము రాబోయ్యెడు శుభాశుభములను సూచింపునది యని శ్రుతుల వలనను స్వాప్నాధ్యాయవేత్తలగు పెద్దలవలనను దెలిసికొను చున్నాము.

శ్రీ॥ భా॥. స్వప్నమునఁ గానఁబడు పదార్థములు జీవుని సంకల్పమువలన సృజింపంబడినవి కావని యిందువలనఁ గూడ దెలియుచున్నది. స్వప్నము రాబొయ్యెడు వృద్ధిక్షయములను సూచింపునది యని శ్రుతులనుండి తెలిసికొను చున్నాము. ఎట్లన "యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్ స్వప్ననిదర్శనే" అనఁగా "కామ్యకర్మముల ననుష్ఠించు నపుడు స్వప్నమున స్త్రీని జూచెనేని ఆ స్వప్నదర్శనమువలనఁ దనకు జయము గలుగునని వాఁడు ఊహించునది"అనియు,"అథ స్వప్నే పురుషం కృష్ణంకృష్ణదంతం పశ్యతి స ఏనం హన్తి" అనఁగా "స్వప్నమున నల్లని దంతములుగల నల్లని పురుషుని జూచెనేని వానిని వాఁడు చంపును"అనియును గదా శ్రుతులు చెప్పుచున్నవి. స్వప్నములను గుఱించి చెప్పు వేదవాక్యములను బాగుగాఁ దెలిసికొనిన పెద్దలు గూడ స్వప్నములు శుభాశుభసూచకములని చెప్పుచున్నారు. తన శుభాశుభములను సూచింపునవి యెన్నఁడును తన సంకల్పమున కధీనములు గావు. అట్లగు పక్షమున, జీవుని కశుభము లనిష్టములు గాన, నీతఁడు శుభసూచములగు పదార్థములనే సృజించి, వానినే స్వప్నమునఁ జూచుగాక! కావున స్వప్నదృష్టములగు రథాదిపదార్థములు సర్వేశ్వరునిచే నిర్మింపఁబడుచున్న వనుట యుక్తము.

సంధ్యాధికరణము ముగిసెను.

---

## తదభావాధికరణము

౭॥ సూ॥ త ద భా వో నా డీ షు త చ్ఛ్రు తే రా త్మ ని చ.

టీ. తదవభావః = స్వాప్నాభావము అనఁగా సుషుప్తి, నాడీషు = నాడులయందును, ఆత్మని=బ్రహ్మమునందును, చ = (సముచ్చయముచే) పురీతత్తునందును, భవతి = కలుగుచున్నది. తచ్ఛ్రుతేః=అట్లు శ్రుతులుచెప్పుట వలన,

తా॥ సుషుప్తి నాడులయందును, పురీతత్తునందును, బ్రహ్మమునందును గలుగునది. నాడీపురీతద్బ్రహ్మములు సుషుప్తిస్థానములని గదా శ్రుతులుచెప్పుచున్నవి.

శ్రీ॥ భా॥ సుషుప్తిస్థానమునుగుఱించి యీ యధికరణమున విచారింపఁబడును. దీనిని గుఱించి చెప్పుసందర్భమున, ఛందోగులు “ అథ యత్రైతత్సుప్త స్సమస్త స్సంప్రసన్నః స్వప్నం న విజానాతి ఆసు తదానాడీషు సుప్తో భవతి ” (ఛా.౮.ప్ర. ౬ఖ-3వా) “ఏ కాలమున జీవుఁడు బాహ్యాంతఃకరణముల నుపసంహరించుకొని విషయసంపర్కమువలనఁ గలుగు మాలిన్యము లేనివాఁడై స్వప్నమును జూడఁడో ఆ కాలమున నీతఁడు నాడులలోఁ బ్రవేశించి యున్నాఁడు” అని పఠించుటచే నాడులను సుషుప్తిస్థానమునుగాఁ దెలియఁజేయుచున్నారు. ఈవిషయమును గుఱించి వాజసనేయులు “ అథ యదా సుప్తో భవతి, యదా న కస్యచన వేద, హితానామ నాడ్యో ద్వాసప్తతి సహస్రాణి హృదయాత్పురీతత మభిప్రతిష్ఠన్తే తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే” (బృ. ౪అ-౧బ్రా-౧౯వా) “ఎప్పుడు జీవుఁడు సుషుప్తిని పొంది దేనిని దెలిసికొనఁడో అప్పుడు హృదయమున నుండెడి పురీతత్తు అనంబడు మాంసపిండంబున కభిముఖముగ వ్యాపించియుండునవై హితము లనంబడు డెబ్బదిరెండు వేల నాడులగుండ వచ్చినవాఁడై పురీతతమున శయనించుచున్నాఁడు” అని పఠించుటచే పురీతత్తును సుషుప్తిస్థానమునుగాఁ దెలియఁజేయుచున్నారు. ఛందోగు లీవిషయమును గుఱించి మఱియొకచోట “యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి”(ఛా.౬ప్ర-౮ఖ. ౧వా) “ఎప్పుడు ఈజీవుఁడు సుషుప్తిని బొందుచున్నాఁడో, అప్పుడు అతఁడు నిత్యుఁడగు పరబ్రహ్మముతోఁ గలుసుకొనుచున్నాఁడు” అనుటచే పరబ్రహ్మమే సుషుప్తి స్థానమని తెలియఁజేయుచున్నారు. నాడులును పురీతత్తున్ను, బ్రహ్మమున్ను, ఈ పైని గనఁబఱచిన ప్రకారము, సుషుప్తిస్థానములుగా శ్రుతులనుండి తెలియవచ్చుచున్నందున నీ విషయమును గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

—సంశయము—

నాడీపురీతద్బ్రహ్మ ములలో నేదైన నొక్కటి మాత్రమే సుషుప్తిస్థానమా ? కాక, అవి యన్నియును జేరి సుషుప్తిస్థాన మగుచున్నవా ?

—పూర్వపక్షము—

నాడీపురీతద్బ్రహ్మములలో నొక్కటివేఱొక్కదానితో సంబంధించి యుండనందునను, వీని యన్నింటియందు నేకకాలమున జీవుఁడు ఉండుట యసంభవమగుటవలనను, యివి యన్నియును జేరి సుషుప్తి స్థానమనుట యుక్తము కాదు. కనుక వీనిలో నేదైననొక్కొక్కటి మాత్రమే సుషుప్తిస్థాన మనిపించుకొనుచున్నదనిన,

## సిద్ధాంతము

సూత్రమునందు "తదభావ" శబ్దమునకు "సుషుప్తి" యని యర్థము. నాడులును, పురీతత్తును, బ్రహ్మమున్ను సుషుప్తిస్థానమగుట సంభవము అనఁగా నివి యన్నియును జేరి సుషుప్తిస్థానమనుట యుక్తము. శ్రుతులును గూడ అట్లే చెప్పుచున్నవి. నాడీపురీతద్బ్రహ్మములలో నొక్కొక్కటి యొక్కొక్క విధముగ సుషుప్తియందు ఉపయోగపడుటచే నివియన్నియును జేరి సుషుప్తిస్థాన మగుట సంభవమగుచుండ, వానిలో నేదైన నొక్కటి మాత్రము సుషుప్తిస్థానమగు చున్నదను వికల్పమును గల్పించుకొనుట యసంగతము. ఎట్లన, నాడులు మొదలగునవి యీ జీవునికి గృహఖట్వాపర్యంకాది కార్యభేద ములయం దుపయోగపడుచున్నవి. నాడులు ఈజీవునికి గృహముగాను, పురీతత్తు మంచముగాను, బ్రహ్మముపక్కగాను నుపయోగబడుచున్నవి అనఁగా నాడు లనెడి గృహమున పురీతత్తనెడి మంచముపైని బ్రహ్మమను పక్కమీఁద జీవుఁడు నిద్రించుచున్నాఁడనుట. కనుక పర్యంకస్థానమగుటవలన బ్రహ్మమే ప్రత్యక్షముగా సుషుప్తిస్థానమని చెప్పవచ్చును.

౮॥ సూ॥ అతః ప్రబోధోఽస్మాత్.

టీ॥ అతః=బ్రహ్మమే సుషుప్తిస్థానమగుటనుబట్టి, అస్మాత్=బ్రహ్మము నుండి, ప్రబోధః = మెలకువ, ఉపపద్యతే=ఉపపన్నమగుచున్నది.

తా॥ బ్రహ్మమే సాక్షాత్తుగ సుషుప్తిస్థాన మగుటచే ప్రబోధ సమయమున జీవుఁడు బ్రాహ్మమునుండి వచ్చుచున్నాఁడు అని శ్రుతివాక్యము తెలుపుట యును సంభవ మగుచున్నది.

శ్రీ॥ భా॥ బ్రహ్మము సాక్షాత్తుగ సుషుప్తిస్థానమై నందుననే "సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహే" ఇత్యాది శ్రుతివాక్యములు "జీవులు నిత్యము ప్రభోధసమయమున పరబ్రహ్మమునుండి వచ్చుచు పరబ్రహ్మమునుండి వచ్చు చున్నామని తెలిసికొనక పోవుచున్నారు" అని చెప్పుచున్నవి.

తదభావాధి కరణము ముగిసెను.

## కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము

౯॥ సూ॥ స ఏవ తు కర్మానుస్మృతి శబ్ద విధిభ్యః

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః=కర్మము వలనను, స్మరణమువలనను, శ్రుతివలనను, బ్రహ్మవిద్యావిధులవలననున్ను, సఏవ=పూర్వము నిద్రపోయిన జీవుఁడే(పునరుత్తిష్ఠతి=మరల లేచు చున్నాఁడు.)

తా॥ పూర్వము సుషుప్తినిపొందిన జీవుఁడే మరల మేల్కాంచుచున్నాఁడని కర్మములవలనను, స్మరణమువలనను, శ్రుతులవలనను బ్రహ్మవిద్యావిధుల వలనను తెలియుచున్నది.

సంశయము.

శ్రీ॥ భా॥ ఇంతకుఁ బూర్వము సుషుప్త్యవస్థను బొందిన జీవుఁడే ప్రబోధ సమయమున మేలుకొను చున్నాఁడా? లేక, ప్రబోధసమయమున మేలుకొను వాఁడు పూర్వము సుషుప్త్యవస్థను బొందిన జీవునికంటె వేఱొక్కఁడా?

పూర్వపక్షము.

సకలోపాధివినిర్ముక్తుఁడై సుషుప్తిస్థానమున బ్రహ్మముతోఁ గలిసికొనిన జీవుఁడు ముక్తపురుషునితో సమానుఁడు. కనుక ఈతనికి యింతకుఁ బూర్వముండిన శరీరేంద్రియాదులతో సంబంధ ముండనేరదు. కాఁబట్టి నిద్రనుండి మేల్కాం చినవాఁడు పూర్వము నిద్రించినవానికంటె నన్యుఁడని చెప్పుట యుక్తమనిన.

సిద్ధాంతము.

సుషుప్తిని పొందినజీవుఁడే ప్రబోధసమయమున మేల్కాంచుచున్నాఁడని కర్మములవలనను, అనుస్మృతివలనను, శ్రుతివలనను, బ్రహ్మవిద్యా విధులవలనను దెలియవచ్చుచున్నది. ఎట్లనిన, సుషుప్తిని జెందినపురుషుఁడు తానింతకు పూర్వ మొనర్చిన పుణ్యపాపరూపములగు కర్మములను బ్రహ్మజ్ఞానము గలుగుటకు పూర్వము తానే యనుభవింపవలయును గదా. నిద్రనుండి మేల్కాంచినపుడు ప్రతిమనుజుఁడును తానే యింతకు పూర్వము నిద్రపోయి యిప్పుడు మేల్కొనినా నని యనుకొనుచున్నాఁడు. మఱియు "ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతంగో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తథా భవన్తి" అను శ్రుతి "సుషుప్తిని బొందుటకుపూర్వము ఈజీవులేశరీరముగలవారై యుండిరో అనఁగా వ్యాఘ్రముగాఁ గాని సింహముగాఁగాని తోడేలుగాఁ గాని వరాహముగాఁ గాని కీటకముగాఁ గాని పక్షిగాఁగాని యీఁగగాఁగాని దోమగాఁ గాని యేజంతువుగానుండిరో, ప్రబోధమున వారింత కుముదుండి నట్లే యగుచున్నారు" అనుచు పూర్వము సుషుప్తినిబొందిన జీవుఁడే యిప్పుడు మేల్కొనుచున్నాఁడని తెలియఁజేయుచున్నది. జీవుఁడు సుషుప్తిస్థానమును బొందినంత మాత్రముచే మోక్షమును బొందుపక్షమున, మోక్షమార్గము నుపదేశించుటకై ప్రవర్తించిన శాస్త్ర విధులును నిష్ప్రయోజనములగును. ఇంతియెగాక, సుషుప్తిస్థానమునందున్నప్పుడే జీవుఁడు సర్వోపాధివినిర్ముక్తుఁడై స్వస్వరూపావిర్భావము గలవాఁడగుట యసంభవము. ఏలనన, ఛన్దోగులు "తద్యత్రైతత్సుప్తః" అనువాక్యముచేసుషుప్తిస్థానమునందున్నట్టి యీజీవుని గుఱించి చెప్ప నారంభించి

"నాహంఖల్వాయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహమత్ర భోగ్యంపశ్యామి"(ఛా.౮ప్ర.౬ఖ 3వా)"సుషుప్తిస్థానమును బొందిన జీవుఁడు నేనిట్టివాఁడనని తనను దెలిసికొనఁడు మఱియు నీ భూతములనున్ను దెలిసికొనఁడు వినాశమును బొందినట్లగుచున్నాఁడు కనుక నీసుషుప్తిస్థానమునం దెవ్విధమైన భోగ్యమున్నట్లు గానఁబడదు"అని పఠించి యున్నారు. అయితే ముక్తపురుషుని గుఱించి యన్నచో, "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" (ఛా. ౮. ప్ర. 3ఖ-౪వా) "ఈ ప్రత్యగాత్మ పరజ్యోతిస్సును బొంది స్వస్వరూపావిర్భావము గలవాఁ డగుచున్నాఁడు" అనియు "స తత్ర పర్యేతి జక్షన్క్రీడన్రమమాణః" (ఛా. ౮. ప్ర. ౧౨ఖ-3 వా) "యీ ముక్తపురుషుఁడు బ్రహ్మలోకమునందు భోగముల ననుభవించుచు క్రీడించుచు రమించుచునున్నాఁడు" అనియు, "స స్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి"(ఛా. ౭ప్ర. ౨౫ఖ-౨వా) (యీ ముక్తపురుషుఁడు కర్మవశ్యత లేనివాఁడై సర్వలోకములయందును స్వేచ్ఛా సంచారముగలవాఁడగు చున్నాఁడు"అనియు, "సర్వం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః"(ఛా. ౭ప్ర. ౨౬.ఖ ౨వా)(పరబ్రహ్మమును సాక్షాత్కరించిన యీ ముక్తపురుషుఁడు సర్వమును దెలిసికొనుచు సర్వత్ర సర్వమును బొందుచున్నాఁడు" అనియును పఠించుటచే ముక్తునికి సర్వజ్ఞత్వము మొదలగునవి గలవని దెలియఁజేయుచున్నారు, కావున సుషుప్తిస్థానమును పొందిన జీవుఁడు బద్ధుఁడేయయి తత్కాలమునం దుపరమించిన యింద్రియవ్యాపారములు గలవాఁడై జ్ఞానభోగాదులయందు అశక్తుఁడై శుభాస్పదుఁడగు పరమాత్మనుబొంది కొంచెము విశ్రమించి, మరల కర్మానుభవమునకుఁగాను మేల్కాంచు చున్నాఁడు.

॥ కర్మానుస్మృతి శబ్దవిధ్యధికరణము ముగిసెను. ॥



## ముగ్ధాధికరణము

### ౧౦॥ సూ॥ ముగ్ధేర్ధసంపత్తిః పరిశేషాత్

టీ. ముగ్ధే=మూర్ఛాప్రాప్తుఁడగు జీవునియందు, అర్ధసమ్పత్తిః=మరణావస్థయొక్క యర్ధాంశము (భవతి=కలుగుచున్నది). ఏలననగా, పరిశేషాత్=సుషుప్త్యాద్యవస్థా చతుష్టయముకంటె మూర్ఛావస్థ మిగిలిన దగుటవలన

తా॥ మూర్ఛావస్థ సుషుప్త్యాద్యవస్థాచతుష్టయమునకంటె మిగిలిన దగుటవలనను, మరణావస్థయొక్క యర్ధాంశమును గలిగియున్నందున నది వేఱొక్క యవస్థయని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ మూర్ఛావస్థను బొందిన జీవుని గుఱించి యీ యధికరణమున విచారింపఁబడును. ఇంకను గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

**సంశయము**

మూర్ఛయనునది సుషుప్త్యాద్యవస్థలలో నొక్కటియా; లేక, అది వానికంటె విలక్షణమగు వేఱొక్క యవస్థా?

**పూర్వపక్షము**

మూర్ఛావస్థ సుషుప్త్యాద్యవస్థలలో నొక్కటి యనెడి ప్రసిద్ధి లోకమునఁ గలదు. మఱియు అది వానికంటె విలక్షణమగు వేఱొక్క యవస్థయని నిరూపించునట్టి ప్రమాణ మెద్దియును గానఁబడదు. కనుక నది సుషుప్త్యాద్యవస్థలలో నెద్దియో యొక్కటి యనుట యుక్తమనిన,

**సిద్ధాంతము**

మూర్ఛయనఁబడునది స్వప్నజాగర సుషుప్తి మరణావస్థలకంటె విలక్షణమయినది. కాఁబట్టి యిది వానిలో నొక్కటి గానేరదు. ఎట్లనిన, జాగరస్వప్నావస్థలయందు జ్ఞానము కద్దు. మూర్ఛావస్థయందు జ్ఞానము లేదు. మఱియు నిది నిమిత్తభేదమువలనను ఆకారభేదమువలనను సుషుప్తిమరణావస్థలలో నొక్కటికాదు. సహింపరాని దెబ్బ మొదలగునది తాకుటవలనఁగదా మూర్ఛగలుగుచున్నది. ఇట్లు మూర్ఛయనునది సుషుప్త్యాద్యవస్థాచతుష్టయమునకంటె మిగిలిన దగుటవలన నది మరణముయొక్క యర్ధాంశమనఁదగును. సర్వప్రాణములతోను, శరీరముతోనును సంబంధము విడిపోవుట మరణ మనఁబడును. సూక్ష్మప్రాణదేహములతో సంబంధమును గలిగియుండుట మూర్ఛయనఁబడును.

ముగ్ధాధికరణము ముగిసెను.

---

**ఉభయలిఙ్గాధికరణము.**

౧౧॥ సూ॥ న స్థానతోఽపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి.

టీ॥ పరస్య=పరమాత్మకు, స్థానతోఽపి = పృథివ్యాదిస్థానసంబంధమువలనను (దోషః=దోషము) న=సంభవింపదు, హి=ఏలననఁగా, సర్వత్ర=శ్రుతిస్మృతులయందంతటను, ఉభయలిఙ్గం = (పరబ్రహ్మము) నిరస్తనిఖిలదోషుఁడుగాను, కల్యాణగుణాకరుఁడుగానును వినఁబడుటవలన,

తా॥ పరమాత్మకు పృథివ్యాదులతో సంబంధమున్నను, అందుండు దోషము లెంతమాత్రము అతనిని సంబంధింపవు. ఏలననిన, పరమాత్మ దోషములు లేనివాఁడనియు, కల్యాణగుణాకరుఁడనియును గదా శ్రుతిస్మృతులయం దెల్లెడలను జెప్పఁబడుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ జాగరస్వప్నా ద్యవస్థలయందు జీవుఁడు పొందునట్టి దోషములను దెలియఁజేసి, యందు మూలముగా వైరాగ్యమును గలుగఁజేయుటకై, యీ యవస్థలనుగుఱించి యింతకుఁ బూర్వము నిరూపింపఁ బడినది. ఇప్పుడు బ్రహ్మప్రాప్తియం దాశపుట్టించుటకై ప్రాప్యుఁడగు బ్రహ్మమునం దట్టి దోషము లేవియును లేవనియు, అతఁడు కల్యాణగుణ స్వరూపుఁడనియును ఈ యధికరణమునఁ బ్రతిపాదింపఁబడును. ఇందొక సంశయము గలుగుచున్నది.

ఈపాదమునం దలి కడచిన యధికరణములతోఁ దీనికిఁ గల సంబంధము.

సంశయము

జాగరస్వప్న సుషుప్తి మూర్ఛోత్క్రాంతి స్థానములయం దంతటనుండు జీవునిలో నంతర్యామిగా నుండుటచే పరబ్రహ్మము ఆయా యవస్థలయందుండువాఁడు గాన, నతఁడును ఆయా యవస్థలయందు జీవునికి సంభవించిన దోషములతో సంబంధించి యుండునా? లేక ఆ దోషములు పరబ్రహ్మమును సంబంధింపవా?

పూర్వపక్షము

ఆయా యవస్థలతోఁ గూడుకొనిన శరీరమునం దుండుటవలన పరబ్రహ్మమున్ను అట్టి యవస్థలను బట్టియుండు దోషములతో సంబంధించి యుండు ననుట యుక్తము. అయితే సూత్రకారుఁడు "సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్" (బ్ర. సూ. ౧అ. ౨పా. ౮సూ) అనియు "స్థిత్యదనాభ్యాంచ" (బ్ర. సూ. ౧అ. ౩పా. ౬సూ) అనియు నీ మొదలగు సూత్రములయందు పరబ్రహ్మము కర్మవశ్యుఁడు గానందున, నతఁడు యే దోషములతోను సంబంధించి యుండువాఁడు గాఁడని ప్రతిపాదించి యుండెను. ఇట్లుండ, కర్మవశ్యుఁడుగాని పరబ్రహ్మము స్థానసంబంధమాత్రమున, అనఁగా జాగర స్వప్నాద్యవస్థలతోఁ గూడుకొనిన శరీరమునం దుండువాఁ డయినంతమాత్రమున, ఆయా యవస్థలయందుండు దోషములతో సంబంధించియుండు వాఁడని యెట్లు జెప్పఁదగునని శంకింపఁ బనిలేదు. ఏలననిన, సూత్రకారుఁడు "దేహయోగాద్వాసోఽపి" (బ్ర. సూ. ౩అ. ౨పా. ౬సూ) అనుసూత్రమున కర్మములు దేహసంబంధమును గలుగఁ జేయుచున్నవనియు దోషములను గలుగఁజేయు చున్నవనియును చెప్పియున్నాఁడు. దేహసంబంధము దోషభూతమగుటఁ జేసియే యిట్లు చెప్పవలసివచ్చెను. అట్లు కానిచో,

కర్మములు స్వయముగనే దోషమును గలుగఁజేయుచున్నవని చెప్పవచ్చునే? దేహసంబంధమును గలుగఁ జేయుచున్నని యేల చెప్పవలయును? కనుక, పరమాత్మ కర్మవశ్యుఁడు కాకపోయినను, ఈతనికి నానవిధా శుచియుక్తమగు శరీరముతో సంబంధమే యొక దోషము. అట్టి శరీరమును నియమించుటకై దానిలో స్వేచ్ఛచేఁ బ్రవేశించినను, అతనికి నందుండు దోషములతో సంబంధము తప్పక కలుగును. స్వేచ్ఛచేనైనను రక్తము మొదలగు నశుచి పదార్థములలో స్నానమొనర్చినచో, నది దోషముగానే గదా యెన్నఁబడును. కనుక, పరబ్రహ్మము జగదేక కారణత్వము, సర్వజ్ఞత్వము మొదలుగాఁగల కల్యాణ గుణములతోఁ గూడుకొనిన వాఁడయినను, "యః పృథివ్యాంతిష్ఠన్" (బృ. ౫ అ. ౭. బ్రా. 3 వా) అనియు, "య ఆత్మని తిష్ఠన్" (బృ. ౫ అ. ౭ బ్రా ౨౨ వా) అనియు, "యశ్చక్షుషి తిష్ఠన్" (బృ. ౫ అ ౭ బ్రా. ౧౮వా) అనియు "యో రేతసి తిష్ఠన్" (బృ. ౫ అ. ౭ బ్రా. ౨3 వా) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములయందుఁ జెప్పియున్న ప్రకారము పృథివి - చక్షుస్సు - రేతస్సు మొదలగు పదార్థములలో నుండువాఁడగుటం జేసి, తత్తత్పదార్థ సంబంధరూపములగు ఆయా దోషములతోను సంబంధించి యుండువాఁడనుట యుక్తమనిన,

## సిద్ధాంతము

పరబ్రహ్మము పృథివ్యాది స్థానములయందుండు వాఁడయినను, వానియందుండు దోషము లతని నెంతమాత్రము సంబంధింపవు. ఏలననిన, శ్రుతిస్మృతులు పరబ్రహ్మమును ఉభయలక్షణునిగా, అనఁగా నిరస్త నిఖిలదోషునిగాను (దోషము లేమాత్రము లేనివానినిగాను) కల్యాణ గుణాకరునిగాను తెలుపుచున్నవి. ఎట్లనిన, ఛందోగులు "అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసఙ్కల్పః" (ఛా. ౮. ప్ర. ౧ ఖ. ౫వా) అనఁగా "పరబ్రహ్మము పాపరహితుఁడును, ముసలితనము లేనివాఁడును, మరణము లేనివాఁడును, దుఃఖము లేనివాఁడును, ఆకలి లేనివాఁడును, దప్పిక లేనివాఁడును, సత్యకాముఁడును, సత్యసంకల్పుఁడును" అనిపఠించుచున్నారు. స్మృతియందును,

శ్లో॥ సమస్తకల్యాణ గుణాత్మకోఽసౌ స్వశక్తిలేశాత్ ధృతభూతవర్గః॥

విష్ణు. ౬ అం. ౫. అ. ౮౪ శ్లో॥

తా. పరబ్రహ్మము సమస్త కల్యాణగుణ స్వరూపుఁడును, స్వశక్తి యొక్క లేశమాత్రముచే పృథివ్యాది భూతవర్గమునంతయును ధరించినవాఁడును.

శ్లో॥ తేజో బలైశ్వర్య మహావబోధ సువీర్యశక్త్యాదిగుణైక రాశిః।
పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయ స్సన్తి పరావరేశే॥

తా॥ పరబ్రహ్మము, తేజస్సు, బలము, ఐశ్వర్యము, గొప్పజ్ఞానము, మంచివీర్యము, శక్తియీ మొదలగు గుణములయొక్క ముఖ్యరాశి. శ్రేష్ఠులగు దేవతలందఱిలో శ్రేష్ఠుఁడు. దేవమనుష్యాదుల కందఱికిని ప్రభువగు పరబ్రహ్మమునకు దుఃఖము మొదలగునవి యెంతమాత్రము లేవు,

శ్లో॥ సమస్తహేయరహితం విష్ణ్వాఖ్యం పరమంపదం ॥

విష్ణు. ౬ అం. ౫. అ. ౮౫ శ్లో॥

తా॥ విష్ణువని పిలువఁబడు ఈయుత్కృష్టస్థానమున హేయగుణము లేమాత్రము లేవు.

ఈవిధముగ స్మృతియందుఁ జెప్పియున్నందున పరబ్రహ్మము ఉభయ లక్షణుఁడని యవగత మగుచున్నది.

౧౨॥ సూ॥ భేదాదితి చేన్న ప్రత్యేక మతద్వచనాత్

టీ॥ భేదాత్=అవస్థాభేదమువలన, (అపురుషార్థయోగః = దోషసంబంధము, సంభవతి=కలుగుచున్నది) ఇతిచేత్=ఇట్లంటివేని, న=అది సరికాదు, ఏలననిన, ప్రత్యేకం = ప్రతిపర్యాయము, అతద్వచనాత్ = దోషసంబంధమును నిషేధించుట వలన.

తా॥ అంతర్యామి బ్రాహ్మణమున ప్రతిపర్యాయము బ్రహ్మమునందు దోషసంబంధమును నిషేధించుటవలన, బ్రహ్మమునకు దేవాది శరీర సంబంధ రూప మగు నవస్థాభేదమును బట్టియుండు దోషసంబంధము సంభవము కాదు.

ఆ క్షే ప ము

శ్రీ॥ భా॥ జీవుఁడు ఉభయలక్షణుఁడు అనఁగా అపహతపాప్మము, సత్యసంకల్పము మొదలగు గుణములుగలవాఁడని ప్రజాపతివాక్యమువలనఁ దెలియవచ్చు చున్నను, దేవమనుష్యాది దేహసంబంధ రూపమగు నవస్థావిశేషమును బొంది యుండుటచే నీతఁడు దోషయుక్తుఁ డగునట్లు, అంతర్యామియగు పరబ్రహ్మము నయితము, ఈపైని గానఁబఱచిన ప్రకారము, ఉభయలక్షణుఁడే యైనను, దేవ మనుష్యాది దేహసంబంధ రూపమగు నవస్థా విశేషములతోఁ గూడియుండు వాఁడగుటం జేసి, వాని యందుండు దోషములతో సంబంధింపక మానడనిన,

స మా ధా న ము

ఇట్లు చెప్పుట యుక్తము గాదు. అంతర్యామి బ్రాహ్మణము "యఃపృథివ్యాం తిష్ఠ" అనియు "య ఆత్మని తిష్ఠ" అనియు నీమొదలగు తావుల పృథివియందుండి పృథివిలోఁ బ్రవేశించి పృథివిని నియమించుచు పృథి

విచేఁ దెలిసికొనఁబడక, పృథివిని దెలిసికొను పరబ్రహ్మము నీ యొక్క యాత్మ, ఈతఁడు అమృతస్వరూపుఁడు" అనియు "ప్రత్యగాత్మ యందుండునదై, ప్రత్యగాత్మలోఁ బ్రవేశించి, ప్రత్యగాత్మను నియమించుచు, ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁబడక, ప్రత్యగాత్మను దెలిసికొను పరబ్రహ్మము నీయొక్క ఆత్మ, ఈతఁడు అమృత స్వరూపుఁడు" అనియు నీప్రకారము ప్రతిపర్యాయము పృథివ్యాద్యంతర్యామియగు పరమాత్మను "స త ఆత్మా అంతర్యా మ్యమృతః" అను వాక్యమున నమృతస్వరూపునిగాఁ బఠించుటచే, స్వేచ్ఛవలనఁ బృథివ్యాదులలోఁ బ్రవేశించి వానిని నియమించునట్టి యీతనియందు ఆయా పృథివ్యాది పదార్థముల దోషములను నిషేధించుచున్నది. అనఁగా, అవి యెంతమాత్రము ఈతనిని సంబంధింపవని తెలుపుచున్నది. అయితే జీవుఁడు అపహతపాప్మము, సత్యసంకల్పము మొదలగు స్వరూపము గలవాఁడేయైనను, ఇట్టి స్వరూపము తిరోహిత మగుచున్నది అనఁగా సంకోచమును పొందుచున్నదని "పరాభిధ్యానాత్తు తిరోహితం" (బ్ర. సూ. 3 అ. ౨ పా. ౪ సూ) అను సూత్రమున జెప్పఁబడియె.

అపవిత్రములగు శోణితాదులలో స్వేచ్ఛచే స్నానమొనర్చినను, వాని యందుండు దోషము లట్లు స్నానమొనర్చిన వానితో తప్పక సంబంధించు చందమున, దుష్టవస్తువులతో స్వేచ్ఛచేఁ జేరినను, ఆయా వస్తువులకు స్వాభావికములగు దోషము లట్లు వానితోఁ జేరినవానిని సంబంధింపక మానవని పూర్వపక్షి చెప్పినదియును సరిగాదు. ఏలననిన, అచిత్పదార్థమైనను, స్వాభావికముగ, దోషస్వరూపమైనది కాదు. అయితే కర్మవశ్యులగు జీవులయొక్క కర్మస్వభావానుగుణముగ పరమపురుష సంకల్పమువలన నొక్క పదార్థమే యొకని కొకసమయమున సుఖకర మగునదిగాను, వేఱొక్కనికి వేఱొక్క సమయమున దుఃఖకరమగునదిగానును దెలియవచ్చుచున్నది. సుఖస్వరూపముగాను గాని, దుఃఖస్వరూపముగాను గాని యుండుట వస్తువులకు స్వాభావికమగుపక్షమున, అన్ని పదార్థములు నందఱికిని నన్ని వేళలయందును సుఖకరములుగాను గాని, దుఃఖకరములుగానుగాని, యుండవలసివచ్చును. అట్లుండుట లేదు. శాస్త్రములందును,

శ్లో॥ నరక స్వర్గసంజ్ఞే వై పాపపుణ్యే ద్విజోత్తమ ॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! పాపపుణ్యములు నరకమనియు స్వర్గమనియును పిలువఁబడుచున్నవి.

"శ్లో॥ వస్త్వేకమేవ దుఃఖాయ సుఖాయేర్ష్యాగమాయచ ।
కోపాయచ యత స్తస్మాద్వస్తు వస్త్వాత్మకంకుతః ॥

తా॥ ఒక్కటియే పదార్థ మొకప్పుడు దుఃఖమును, వేఱొకప్పుడు సుఖమును,మఱియొకప్పుడు ఈర్ష్యను,మఱియొకప్పుడు కోపమును గలుగఁజేయునది యగుచున్నది. కావున, నట్లుండుట ఆవస్తువుయొక్క స్వభావమని యెట్లు జెప్పఁగలము.

శ్లో॥ తదేవ ప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే।
తదేవకోపాయ యతః ప్రసాదాయచ జాయతే॥

తా॥ ఒక్కటి యే వస్తువు ఒకప్పుడు సుఖమును గలుగఁజేయునదిగాను, వేఱొకప్పుడు దుఃఖమును గలుగఁజేయునది గాను, మఱియొకప్పుడు కోపమును గలుగఁజేయునది గాను, మఱియొకప్పుడు అనుగ్రహమును బుట్టించునదిగాను నగుచున్నది.

శ్లో॥ తస్మాద్దుఃఖాత్మకం నాస్తి న చ కించిత్సుఖాత్మకం॥

తా॥ కాఁబట్టి లోకమునందేదియు స్వాభావికముగ దుఃఖరూపమైనది గాని, సుఖరూపమైనది గాని లేదని యిందువలన సిద్ధ మగుచున్నది.

కనుక, జీవుఁడు కర్మవశ్యుఁ డైనందున, వాని విషయమై ఆయాకర్మముల కనుగుణముగ ఆయా పదార్థములతో సంబంధించి యుండుటయే యొక దోష మగును. కర్మవశ్యుఁడుగాక, స్వతంత్రుఁడగు పరమపురుషుని కన్ననో, అట్టి సంబంధమే ఆయా వస్తువులను గుఱించిన విచిత్రనియమన రూపమగు లీలారస మునకు హేతువగుచున్నది.

౧౩॥ సూ॥ అపి చైవ మేకే

టీ॥ అపిచ=మఱియు, ఏకే=కొన్ని శాఖలవారు, ఏవం=ఇటులనే, (అధీయతే=పఠించుచున్నారు.)

తా. మఱియు కొన్ని శాఖలవారిట్లు పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ కొన్ని శాఖలవారు "ద్వా సుపర్ణా సయుజా సఖాయాసమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి" అనఁగా "ఎన్నఁడును విడనాడని మిత్రులగు రెండుపక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఒక్కటే వృక్షమును (ఒక్కటే శరీరమును) ఆశ్రయించి యున్నవి వానిలో నొక్కటి (జీవాత్మ) రుచికరమగు ఫలమును (కర్మఫలమును) అనుభవించుచున్నది. రెండవది (పరమాత్మ) అట్లు కర్మఫలము ననుభవింపక ప్రకాశించుచున్నది" అని పఠించుటచే జీవాత్మ పరమాత్మలు ఒక్కటియే శరీరమునందుండినను, జీవాత్మను గుఱించి మాత్ర మట్టి దేహసంబంధము దుఃఖాదిదోషములకు హేతువగుచున్నదనియు, పరమాత్మనుగుఱించి యన్ననో, యదియట్టిది గాదనియును మఱియు నది

వానికి నియమనరూపమగు నైశ్వర్యమును బట్టి యుండునది యగుటచే ప్రకాశ మును గలుగఁజేయు నదియగుచున్న దనియును దెలియఁ జేయుచున్నారు.

అవతారిక:—"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాక రవాణి" అను శ్రుతివాక్యము "జీవశరీరుఁడగు పరబ్రహ్మము అన్ని పదార్థ ములలోఁ బ్రవేశించుటచే అవి స్పష్టములగు నామరూపములు గలవిగాఁ జేయఁ బడుచున్నవి" అని చెప్పుచున్నది. దీనివలన నిట్లు జీవాంతరాత్మయగు బ్రహ్మ మునకున్ను దేవమనుష్యాది శరీరములతోను వాని నామరూపములతోనున్ను సంబంధమున్నట్లు దెలియుచున్నది. కనుక "బ్రాహ్మణో యజేత" "బ్రాహ్మ ణుఁడు యజ్ఞము జేయవలయును" ఈ మొదలగు విధినిషేధము లన్నియును జీవాంతరాత్మయగు పరబ్రహ్మముతోనున్ను సంబంధించి యుండునవిగాన, పర బ్రహ్మమున్ను కర్మవశ్యుఁడే యని శంకింపఁగా, నాశంకను పరిహరించుటకై,

౧౪॥ సూ॥ అ రూ ప వ దే వ హి త త్ప్ర ధా న త్వా త్.

టీ॥ తత్ = బ్రహ్మము, అరూపవదేవ = రూపరహితమైన దాని వంటిదియే, ఏలననఁగా, ప్రధానత్వాత్ = నామరూపములను గలుగఁజేయు నది యగుటచే బ్రహ్మము ప్రధానమైనందున.

తా॥ బ్రహ్మము సర్వపదార్థములలో నుండునది యగుటచే నది వాని రూపము గలదైనను, వాస్తవమున కది రూపములేనిదాని వంటిదియే. బ్రహ్మము వానికి నామరూపములను గలుగఁజేయునది యగుటచే ప్రధానమైనది గదా.

శ్రీ॥ భా॥ బ్రహ్మము దేవమనుష్యాది శరీరములలోఁ బ్రవేశించి యున్న ప్పుడు ఆయా శరీరములతోఁ గూడుకొనినదియే యైనను, అది రూపాదులు లేని వస్తువువంటిదే అనఁగా జీవునివలెనే బ్రహ్మము శరీరసంబంధమునుబట్టి వచ్చిన కర్మవశ్యత్వము మొదలగునవి లేనిదనుట. ఏలననిన, "ఆకాశోహవై నామ రూపయోః నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ" అను శ్రుతివాక్యము "ఆకాశమను బ్రహ్మము నామరూపములను గలిగించునది. నీయొక్క లోపల నుండునది యేదియో అది బ్రహ్మము" అనుచు బ్రహ్మమన్ని వస్తువులలో ప్రవేశించియున్నను, ఆయావస్తువుల నామరూపములతో సంబంధింపక ఆయా వస్తువులకు నామరూపములను గలుగఁ జేయువాఁడు మాత్ర మగుచున్నాఁడని చెప్పుచున్నది. కానిమ్ము. అయినను, ఆయావస్తువులే శరీరముగానుండునట్లు వాని యం దంతర్యామిగా నుండగా, బ్రహ్మము వాని నామరూపములతో సంబంధము లేని దానివంటిదని యెట్లు జెప్పవచ్చునని యందు రేమో, చెప్పెదము. జీవుఁడు ఆయావస్తు సంబంధమువలనఁ గలుగు సుఖదుఃఖముల ననుభవించుటచే నాయా వస్తువుల రూపములతో సంబంధము గలవాఁడయినట్లు, పరబ్రహ్మము ఆయా

వస్తువులలో నుండినను వానినుండి గలుగు సుఖదుఃఖముల ననుభవింపనందున, అతఁడు వాని రూపములతో సంబంధము లేనివాఁడు. విధి నిషేధశాస్త్రము లున్ను కర్మవశ్యుఁడగు జీవునితోనే సంబంధించి యున్నవి. కావున పరబ్రహ్మము రూపములేని దాని వంటిదియే.

కావున, పరబ్రహ్మము అంతర్యామిగా, సమస్త వస్తువులలోఁ బ్రవేశించియున్నను, అతఁడు ఉభయలక్షణుఁడు అనగా దోషము లేమాత్రము లేనివాడును కల్యాణ గుణాకరుడును అయినందున, ఆయావస్తువుల నామరూపములతో నీతనికి సంబంధము లేదనుట యుక్తము.

అవతారిక:—"సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతివాక్యము వలన బ్రహ్మము నిర్విశేష ప్రకాశైక స్వరూపుఁడని, తెలియుచున్నది "నేతి నేతి" (బృ-౪. అ. ౩-బ్రా.౬-వా) అను శ్రుతివాక్యముచే నిర్విశేష ప్రకాశైక స్వరూపమగు బ్రహ్మముకంటె వేఱయినదంతయు అనఁగా సర్వజ్ఞత్వము, సత్యసంకల్పత్వము, జగత్కారణత్వము, సర్వాంతరాత్మత్వము, సత్యకామత్వము, ఈ మొదలగు విశేషములన్నియు నిషేధింపఁబడుటచే నసత్యములని తెలియుచుండ, ఈతఁడు ఉభయ లక్షణుఁడు అనఁగా కల్యాణగుణాకరుఁడును దోషము లేమాత్రము లేనివాఁడు నగుననుట యెట్లు సంభవమని శంకింపఁగా, నాశంకను పరిహరించుటకై :—

౧౫॥ సూ॥ ప్రకాశవచ్చావైయర్థ్యాత్.

టీ॥ అవైయర్థ్యాత్ = శ్రుతివాక్యము వ్యర్థము గాకుండుటకై, ప్రకాశవచ్చ=బ్రహ్మము ప్రకాశ స్వరూపమని యంగీకరించినట్లును.

తా॥ "సత్యం జ్ఞానం" ఇత్యాది శ్రుతివాక్యము వ్యర్థము గాకుండుటకై బ్రహ్మము ప్రకాశస్వరూపమని యంగీకరించినట్లు "సత్యసంకల్పః" ఇత్యాది శ్రుతి వాక్యము వ్యర్థముగాకుండుటకై బ్రహ్మము ఉభయలక్షణుఁడని యంగీకరించునది.

శ్రీ॥ భా॥ "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతివాక్యము వ్యర్థము గాకుండుటకై బ్రహ్మము ప్రకాశ స్వరూపమని యొప్పుకొనునట్లు, "బ్రహ్మము సత్యసంకల్పుఁడు, సర్వజ్ఞుఁడు, జగత్కారణుఁడు సర్వాంతరాత్మ నిరస్తనిఖిల విద్యాదిదోషుఁడు" అని చెప్పెడు శ్రుతివాక్యము వ్యర్థము గాకుండుటకై బ్రహ్మము ఉభయలక్షణుఁడని యొప్పుకొనవలయును.

౧౬॥ సూ॥ ఆహ చ తన్మాత్రం.

టీ॥ తన్మాత్రం = ప్రకాశస్వరూప మాత్రమును, ఆహచ = శ్రుతి

తా॥ "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యము ప్రకాశస్వరూప మాత్రమును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ ఇంతియె కాక "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతి వాక్యము బ్రహ్మను ప్రకాశ స్వరూపుఁడని మాత్రము తెలుపుచున్నదే గాని యది వాక్యాంతరమునం జెప్పియున్న సత్యసంకల్పత్వము మొదలగు వానిని నిషేధించు చుండలేదు. "నేతినేతి" అను శ్రుతివాక్యమునకు విషయ మెద్ది యనెడి యంశమును గుఱించి యింకమీఁదు చెప్పఁబోవు చున్నాము.

౧౭॥ సూ॥ దర్శయతి చాథో అపి స్మర్యతే.

టీ॥ దర్శయతి-చ = ఉపనిషత్సముదాయము సయితము కల్యాణగుణాకరత్వ నిరస్తనిఖిలదోషత్వములను ప్రదర్శింపుచున్నది, అథః=అట్లే, స్మర్యతే-అపి = స్మృతియందును తెలుపఁబడినది.

తా॥ శ్రుతిస్మృతులు సయితము కల్యాణగుణాకరత్వ నిరస్త నిఖిలదోషత్వములను తెలుపుచున్నవి.

శ్రీ॥ భా॥ బ్రహ్మము కల్యాణగుణాకరుఁడనియు,నిరస్త నిఖిలదోషుఁడని యును ఉపనిషద్వాక్యములు తెలుపుచున్నవి. ఎట్లనిన, శ్వేతాశ్వతరోపనిషత్తునందు "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తందైవతానాంపరమంచ దైవతం సకారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః న తస్య కార్యంకరణంచ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ" (శ్వే. ౬.౭) అను వాక్యమున "వైవశ్వతాదులకును ఇంద్రాది దేవతలకున్ను గొప్ప ప్రభువయిన పరబ్రహ్మమును దెలిసికొనుచున్నాము. ఆ పరబ్రహ్మము సర్వకారణుఁడు మఱియు నతఁడు ఇంద్రియాధిపతులగు జీవులకున్ను ప్రభువు. అతనిని బుట్టించినవాఁడును, అతనికి ప్రభువగువాఁడు నెవ్వఁడును లేడు. అతనికి శరీరసంబంధమున్ను ఇంద్రియసంబంధమున్ను లేదు, అతనితో సమానుఁడు గాని, అతనికంటె నధికుఁడుగాని ఎవ్వఁడును లేఁడు. అతని శక్తి ఉత్కృష్టమైనదిగాను విచిత్రమైనదిగాను వినఁబడుచున్నది. అతఁడు స్వాభావికములగు జ్ఞానమును, బలమును, క్రియను గలిగియున్నాఁడు" అని పఠింపఁబడియె.

"యస్సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః" (ము.౧ము.౧.౧౦.) అను శ్రుతివాక్యము "పరబ్రహ్మము సర్వమును సామాన్యముగాను విశేషముగాను తెలిసికొనినవాఁడు మఱియు జ్ఞానమయమగు తపస్సును గలిగియున్నాఁడు." అని చెప్పుచున్నది. తైత్తిరీయులు "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః" (తై. ఆ. ౮.౧) అను వాక్యమున ఈశుని భయమువలన వాయు[...]చుచున్నది.

మఱియు ఈతని భయమువలననే సూర్యుఁడు ఉదయించు చున్నాఁడు" అనియు "స ఏకో బ్రహ్మణ ఆనందః" (తై. ఆ. ౮. ౪) అను వాక్యమున "అట్టిది యొకటి బ్రహ్మానంద మనబడును" అనియు 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ। ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" (తై. ఆ. ౯. ౧) అను వాక్యమున "ఏ బ్రహ్మమును ఇంతయని తెలిసికొననేరక వాగాదీంద్రియములును మనస్సును మరలి పోవుచున్నవో అట్టి బ్రహ్మయొక్క ఆనందస్వరూపమును తెలిసికొనిన బ్రహ్మవేత్త దేనివలనను భయము నొందడు" అని పఠించుచున్నారు. "నిష్కళం నిష్క్రియంశాన్తం నిరవద్యం నిరఞ్జనం" (శ్వే. ౬-౧౯) అను శ్రుతి వాక్యము "బ్రహ్మము అవయవరహితుఁడు. క్రియారహితుఁడు, వికారరహితుఁడు. దోషరహితుఁడు మఱియు మాయారహితుఁడు" అనియును తెలుపుచున్నవి. స్మృతివాక్యములును అట్లే తెలుపుచున్నది. శ్రీభగవద్గీతలయందు,

శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం॥

(భ. గీ. ౧౦ అ. 3 శ్లో.)

తా॥ ఓ అర్జునా! ఎవఁడు నన్ను పుట్టుకలేని వానిని గానును, ఆద్యంతములు లేనివానిని గానును, గొప్ప యీశ్వరుని గానును తెలిసికొను చున్నాడో.

శ్లో॥ విష్టభ్యాహమిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్॥

(భ. గీ. ౧౦ అ. ౪౨ శ్లో.)

తా॥ ఓ అర్జునా! చేతనాచేతనవిశిష్టమగు ఈ జగత్తుయొక్క స్వరూపము సిద్ధించు విషయమునను, ఉనికి విషయమునను, ప్రవృత్తి విషయమునను, నాసంలకల్పము నతిక్రమింపకుండునట్లు నామహిమలో నతిస్వల్ప భాగముచేత దానినంతయును ధరించియున్నాను.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం
హేతునానేనకౌంతేయ జగద్ధి పరివర్తతే॥

(భ. గీ. ౯ అ. ౧౦ వా.)

తా॥ ఓ అర్జునా! అధ్యక్షుఁడనైన నాచే నధిష్ఠింపఁబడినదై ప్రకృతి స్థావర జంగమములతోఁగూడిన జగత్తును కనుచున్నది. ఈహేతువుచేతఁ జగత్తు ప్రవర్తింపుచున్నది. (అనఁగా క్షేత్రజ్ఞుల కర్మముల ననుసరించియే నేను ప్రకృతికి అధ్యక్షుఁడనై యుందును. ఇందువలననే నాకు నైర్ఘృణ్యాది దోషములులేవు.)

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

(భ. గీ. ౧౫. అ. ౧౭ శ్లో.)

తా॥ ఓ అర్జునా! ఎవ్వఁడు లోకత్రయమును ప్రవేశించి అనఁగా అచేతనంబును, దానితోఁ జేరియున్న జీవుఁడును, ముక్తుఁడును ఈమూడింటికిని ఆత్మ యై వానిలోఁ బ్రవేశించి వానిని పోషింపుచున్నాఁడో, నాశము లేనివాఁడో, ఈశ్వరుఁడు నగువాఁడో, మఱియు బద్ధముక్తులకంటె వేఱైనవాఁడో అట్టి యీ పురుషుఁడు పరమాత్మ యని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ సర్వజ్ఞస్సర్వకృత్సర్వశక్తిః జ్ఞానబలర్ధిమాన్ ।
అన్యూనశ్చాప్య వృద్ధిశ్చస్వాధీనో నాదిమాన్వశీ ।
క్లమతంద్రీభయక్రోధ కామాదిభి రసంయుతః ।
నిరవద్యః పరఃప్రాప్తేః నిరధిష్ఠోఽక్షరక్రమః ॥

తా॥ పరబ్రహ్మము సర్వమును దెలిసినవాఁడు, సర్వమునొనర్చినవాఁడు, సర్వశక్తి సంపన్నుఁడు, జ్ఞానమును బలమును ఆధిక్యమునున్ను గలవాఁడు. వృద్ధిక్షయములు లేనివాఁడు, స్వతంత్రుఁడు, ఆది లేనివాఁడు, సర్వమును తనవశమున నుంచుకొనినవాఁడు, బడలిక, కునికిపాటు, క్రోధము, కామము ఈమొదలగునవి లేనివాఁడు, దోషములు లేనివాఁడు, ఉత్కృష్టుఁడు, నిరాధారుఁడు మఱియు నాశరహితుఁడు.

కనుక, ఈపైని గనఁబఱచిన ప్రకారము, పరబ్రహ్మము ఉభయ లక్షణుఁడగుటవలన అనఁగా కల్యాణగుణాకరుఁడును నిరస్తనిఖిలదోషుఁడు నగుటవలన నీతఁడు సర్వపదార్థముల యందుండినను, ఆయాపదార్థ గతములగు దోషము లీతని నెంతమాత్రము సంబంధింపవు.

౧౮॥ సూ॥ అ త ఏ వ చో ప మా సూ ర్య కా ది వ త్ ॥

టీ॥ అతఏవ-చ=అందువలననే, సూర్యకాదివత్=జలస్థ సూర్య ప్రతిబింబము వంటివాఁడనెడి, ఉపమా=సామ్యము (క్రియతే=చేయఁబడుచున్నది.)

తా॥ కనుకనే బ్రహ్మము జలమునఁగానఁబడు సూర్యప్రతిబింబాదులతోఁ బోల్పఁబడుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మము నానావిధస్థానముల యందున్నను, ఆయాస్థానములయందుండు దోషము లీతని సంబంధింపవు. ఈ హేతువునుబట్టియే శాస్త్రములయం దచ్చటచ్చట పరబ్రహ్మము జలమునందుగాని దర్పణము నందుగాని ప్రతిఫలించిన సూర్యాదులతోఁ బోల్పఁబడియె. అనఁగా సూర్యచంద్రాదులు జలము నందుగాని దర్పణము నందుగాని ప్రతిఫలించునపుడు జలదర్పణాదులయందుండు మాలిన్యాదిదోషములు వీనిని సంబంధింపనట్లు, పరబ్రహ్మ

నానావిధస్థానముల యందుండినను, ఆయా స్థానములయందుండు దోషము లీతనిని సంబంధింపవని తెలిపియున్నారు. అదెట్లనిన,—

శ్లో॥ ఆకాశ మేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్ ।
తథాత్మైకోహ్యనేకస్థో జలాధారేష్వివాంశుమాన్ ॥

తా॥ ఆకాశము ఘటాదులయందుండునపుడు ఘటాదులయందలి దోషములతో సంబంధములేక యొక్కటిగా నుండునట్లున్ను, మఱియు సూర్యుఁడు అనేక జలాశయములయందు ప్రతిఫలించునపుడు అట్టి జలాశయములయందుఁ గల దోషములతో సంబంధింపక యొక్కఁడేయై యుండునట్లున్ను, పరమాత్మ అనేక ప్రదేశములయం దుండునపుడు వానియందుండు దోషములతో సంబంధములేక యొక్కఁడేయై యున్నాఁడు.

శ్లో॥ ఏకఏవ హిభూతాత్మా భూతే భూతే వ్యవస్థితః
ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్ ॥

తా॥ సర్వభూతాంతరాత్మయగు పరమాత్మ ఒక్కఁడేయైనను వేఱు వేఱు భూతములయం దుండుటవలన, జలమునందు ప్రతిఫలించు చంద్రునివలె, నొక్కవిధమైనవాఁడుగానును వేఱువేఱుగానును తెలియఁబడుచున్నాఁడు.

౧౭॥ అమ్బువదగ్రహణాత్తు న తథాత్వం ·

టీ॥ అమ్బువత్=జలమునందు (సూర్యుఁడు) వలెనే, అగ్రహణాత్తు=పృథివ్యాదులయందు పరమాత్మ గ్రహింపఁబడనందున, తథాత్వం=జలసూర్యకాది తుల్యత్వము, న=ఉపపన్నముకాదు.

తా॥ జలమునందు సూర్యుఁడువలెనే పృథివ్యాదులయందు పరమాత్మ గ్రహింపఁబడకున్నందున, పరమాత్మను జలసూర్యకాదులతోఁ బోల్చుట యనుపపన్నము.

—••—◆◆ ఆక్షేపము. ◆◆—••—

శ్రీ॥ భా॥ ఉదకము దర్పణము ఈ మొదలగు వస్తువులయందు సూర్యాదులు ఎట్లు గ్రహింపఁబడుచున్నారో, అట్లు పృథివ్యాదులయందు పరమాత్మ గ్రహింపఁబడుచుండ లేదు. ఎట్లనిన, సూర్యాదులు దర్పణాదులయందు వాస్తవముగాలేరు. వారచట నున్నారనుకొనుట భ్రాంతిమాత్రము. అయితే పరమాత్మయన్ననో, "యః పృథివ్యాం తిష్ఠన్" అనియు "యోఽప్సుతిష్ఠన్" అనియు ఈ మొదలగు శ్రుతివాక్యములయందుఁ జెప్పియున్న ప్రకారము వాస్తవముగా పృథివ్యాదులయం దంతర్యామిగా నుండువాఁడు. కనుక పరమాత్మ వానియందుండువాఁ డనుకొనుట భ్రాంతి కానేరదు. ఇట్లు సూర్యాదులు వాస్త

వముగా దర్పణము మొదలగు పదార్థములయందు లేరుగాన, వారని ఆయా దర్పణాదిపదార్థములయందుండు దోషములు సంబంధింపకపోవుట సహజమే. కనుక నిచట పరమాత్మను జలప్రతిబింబితులగు సూర్యచంద్రాదులతోఁబోల్చుట యెంతమాత్రము పొసగదు.

—•—◆ సమాధానము. ◆—•—

౨౦॥ సూ॥ వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవందర్శనాచ్చ.

టీ॥ అంతర్భావాత్ =పృథివాదులలోఁ బ్రవేశించుటవలన, (ప్రసక్తించు) వృద్ధిహ్రాసభాక్త్వం = వైపుల్యసంకోచాదిప్రాప్తి, (నివర్త్యతే = నివర్తింపఁ బడుచున్నది) ఉభయసామంజస్యాత్ =రెండువిధములగు దృష్టాంతముల కానుకూల్యమువలనను, దర్శనాచ్చ=అట్లుగానఁబడుట వలనను‌న్ను, ఏవం=ఇట్లు నిశ్చితమగుచున్నది.

తా॥ బ్రహ్మము పృథివ్యాద్యంత ర్భావము వలన, జలప్రతిబింబిత సూర్యునివలెనే, వృద్ధిహ్రాసాది ధర్మములను పొందదని యింతమాత్రమే యీ దృష్టాంతమువలనఁ గాన్పింపఁబడియె. కావున దృష్టాంతదార్ష్టాంతికములకు విరోధము లేదు.

శ్రీ॥ భా॥ పృథివి, ఉదకము, తేజస్సు ఈమొదలగు వానిలోనంతర్యామియై యున్నట్టి పరమాత్మ పృథివ్యాదిస్థానగతములగు న్యూనాధిక్యములను స్వరూపమునుబట్టియు గుణములనుబట్టియును పొందుననుటను నిషేధించుటకై మాత్రమే యిచట పరమాత్మను సూర్యచంద్రాదులతోఁ బోల్చియున్నారు. అది యెట్లు తెలియుననిన, ఇవ్విధమునఁ గైకొనినపక్షముననే ఈ పైని గనఁబఱచిన రెండువిధములగు నుదాహరణములును పొసగును. ఈ హేతువును బట్టియే యిట్లు నిశ్చయింపఁబడుచున్నది. అది యెట్లనిన, "ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్" అనియు "జలాధారేష్వివాంశుమాన్" అనియు నీతావుల దోషవంతములగు ననేక పదార్థములయందు వాస్తవముగా నున్నట్టి యాకాశమును, వానియందు వాస్తవముగా లేనట్టి సూర్యునిన్ని ఈ రెంటిని ప్రకృతమున దృష్టాంతములనుగాను గైకొనుట యనఁబడునది పరమాత్మకు పృథివ్యాధిదోషప్రాప్తి నివృత్తిని ప్రతిపాదించుటకు మాత్రమే యగునేని (అట్లు వానిని దృష్టాంతములనుగాఁ గైకొనుట) పొసగును. ఇచట దృష్టాంతములుగాఁ జెప్పఁబడిన ఆకాశసూర్యులలో, ఆకాశమనునది న్యూనాధిక్యములను పొందియున్న ఘటాది స్థానములతోఁ బ్రత్యేకము సంబంధించియున్నను, వానికిఁగల న్యూనాధిక్యములను బొందకయున్నట్లును, సూర్యుఁడు స్వయముగా నానావిధాకారములుగల జలాశయములయందుఁ గానఁబడునపు డతఁడు జలాశయ గతములగు న్యూనాధిక్యతలను బొందకయున్నట్లునున్ను, పర

మాత్మ నానావిధాకార యుక్తములగు పృథివ్యాద్యచేతన పదార్థముల యందును, దేవమనుష్యాది చేతనపదార్థములయందునున్నను, ఆయా పదార్థముల యందుండు న్యూనాధిక్యాది దోషములతో నెంతమాత్రము సంబంధము లేనివాఁడై, అనేకపదార్థముల యందంతర్యామిగానున్నను స్వయముగ తానొక్కఁడేయై యున్నాఁడు. కనుక నీతఁడు ఉభయలక్షణుఁడగుటకు అనఁగా దోషస్పర్శ మేమాత్రము లేనివాఁడును కల్యాణగుణాకరుఁడు నగుట కెద్దియును సంశయము లేదు. ఫలితార్థమేమన్నను, సూర్యుఁడు స్వయముగ జలాశయముల యందు లేనందున జలాశయములయందుండు దోషము లీతని సంబంధించుటకు హేతువులేదు. కావున నవి యతనిని సంబంధింపనట్లు, పరమాత్మయును దోషములకు విరుద్ధమైన స్వరూపముగలవాఁడైనందున, పృథివ్యాదులయం దీతఁ డంతర్యామిగా నున్నను, పృథివ్యాదుల యందుండు దోషము లీతనితో సంబంధించుటకు హేతువులేదు. కావున నవి యీతని నెంతమాత్రము సంబంధింపవు. దృష్టాంతమును జెప్పునపుడు దృష్టాంతదార్ష్టాంతికము లన్నియంశములయందును సమానముగా నుండవలయునను నియమము లేనట్లు "మాణవకుఁడు సింహము వంటి వాఁడు" అను నీమొదలగుతావుల గన్పట్టుచున్నది. కావున, స్వాభావికముగ అజ్ఞానాదిదోషము లెంతమాత్రము లేనివాఁడును, సమస్త కల్యాణగుణాకరుఁడు నగు పరమాత్మకు పృథివ్యాదులతో సంబంధమున్నను, అతనిని వానియందుండు దోషములు సంబంధింపవని సిద్ధమగుచున్నది.

అవతారిక:—వాజసనేయులు "ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తంచామూర్తమేవచ" (బ్రహ్మమునకు మూర్తామూర్తములగు రెండు రూపములు గలవు) అని చెప్పనారంభించి స్థూలసూక్ష్మ రూపమగు నీసమస్త ప్రపంచమును బ్రహ్మముయొక్క స్వరూపమునుగాఁ బరామర్శించి "తస్యహవా ఏతస్య పురుషస్య రూపం యథా మహారజనం వాసః" (ఈ పురుషుని యొక్క రూపము కుసుంభవర్ణముగల వస్త్రము వంటిది) ఇత్యాదివాక్యమున నట్టియాకారవిశేషమును జెప్పి, పిమ్మట. "అథాత ఆదేశో నేతినేతి నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" (అట్టి రూపమెద్దియును లేదు. ఇదియే యుపదేశము ఇంతకంటెఘనమైయేదియును లేదు.) అనుటచే నింతకుపూర్వము ఉపదేసించిన మూర్తామూర్తస్వరూపమును "ఇతి" శబ్దముచేఁ బరామర్శించి దానినంతయు నిషేధించి యట్టి విశేషముల కధిష్ఠానమగు సన్మాత్రమే బ్రహ్మమనియు ఇట్టిదియగు తన స్వరూపము నెఱుఁగని బ్రహ్మముచే నావిశేషములు అజ్ఞానమూలముగాఁ గల్పింపఁబడినవనియును తెలుపుచున్నారు. ఇట్లుండ, బ్రహ్మము ఉభయలక్షణములు గలదియనుట యెట్లుసంభవమని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై,

౨౧॥ సూ॥ ప్రకృతైతావత్త్వంహి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః

టీ॥ ప్రకృతైతావత్త్వం=ప్రకృతమగు మూర్తామూర్త శరీరముయొక్క పరిచ్ఛిన్నతను, ప్రతిషేధతి=నిరాకరింపుచున్నది, తతః=అందువలన, భూయః= మరల మరల, బ్రవీతి-చ=చెప్పుచున్నది.

తా. "నేతి నేతి" అను శ్రుతివాక్యము ప్రకృతమగు మూర్తామూర్త శరీరముయొక్క పరిచ్ఛిన్నత్వమును నిషేధించుచున్నది. కావుననే "అన్యత్పర మస్తి" అని మరల మరల చెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ "నేతినేతి" అను శ్రుతివాక్యము పూర్వవాక్యమునందుఁ జెప్పియున్న మూర్తామూర్తస్వరూపము మొదలగు బ్రహ్మస్వరూప విశేషములను నిషేధించుచున్న దనుట యెంతమాత్రము సమంజసము గానేరదు. అట్లయినచో, ఉపనిషద్వాక్యములు బుద్ధిహీనులుచేయునట్టి యసంగత ప్రలాపములనవలసివచ్చును. ఏలననిన, బుద్ధిమంతుఁడగు వాఁడెవ్వఁడును ప్రమాణాంతర గోచరములు గానట్టి యీ విషయములను తాను స్వయముగా నుపదేశించి అట్లు తాను ఉపదేశించిన వానిని తానే మరల నిషేధింపడు.

ఈపై శ్రుతియందుఁ గాన్పింపఁబడిన వానిలోఁ గొన్ని పదార్థములు మాత్రము ప్రమాణాంతర వేద్యములే యైనను, అవి పరబ్రహ్మముయొక్క స్వరూపాది విశేషములనెడి విషయమన్ననో, ప్రమాణాంతర వేద్యము గాదు. తక్కిన, వాని స్వరూపముగాని, అవి బ్రహ్మముయొక్క విశేషములగుట గాని ప్రమాణాంతర వేద్యముకాదు. కనుక నవి యిచట ననువదింపఁ బడుచున్న వనుట యసంభవము. కావున నవి యిచటనే యుపదేశింపఁ బడుచున్నవి. అందువలన నవి యిచటనే నిషేధింపఁబడుట యనుపపన్నము.

కనుక, "నేతినేతి" అను శ్రుతివాక్యము బ్రహ్మము మూర్తామూర్తాదులతో మాత్రము గూడుకొనినది యను యంశమును నిషేధించుచున్నది. అనఁగా పూర్వవాక్యమునందుఁ జెప్పిన మూర్తామూర్తాదులు మాత్రమే బ్రహ్మ స్వరూపము గావు. ఇవి కాక, గుణములు మొదలగునవి యనేకములు బ్రహ్మ స్వరూప మనిపించుకొనుచున్నవి. కనుక "నేతినేతి" "(నేతినేతి" = నైవంనైవం = ఇట్టిదియేకాదు ఇట్టిదియే కాదు) అనఁగా బ్రహ్మము మూర్తామూర్త విశిష్టమైనది మాత్రమే కాదు అనుట. ఈపైని చెప్పినప్రకారము బ్రహ్మమున కెట్టి పరిచ్ఛిన్నత్వము ప్రసక్తించినచో, అట్టి పరిచ్ఛిన్నత్వము ఈ శ్రుతియందుండు "ఇతి" అను శబ్దముచే బరామర్శింపఁబడుచున్నది. కావుననే ఇట్లు నిషేధించిన తరువాతను బ్రహ్మముయొక్క యనేక గుణములను శ్రుతి తెలుపుచున్నది. ఎట్లనిన, "నహ్యేతస్మాదితినేత్యన్య త్పరమస్త్యథ నామధేయం।

సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేష సత్యం" (బృ.౪అ.3 బ్రా.౬వా) అను వాక్యశేషము "ఇట్లు పరిచ్ఛేదములేని పరమాత్మకంటె స్వరూపమును బట్టి గాని గుణములనుబట్టి గాని యుత్కృష్టమయినది మఱియొకటి లేదు. ఈతనికి "సత్యములకును సత్యము" అని పేరు. సత్యములనిన ప్రాణములు అనఁగా జీవులెల్లప్పుడును ప్రాణములతో గూడుకొని యున్నందున వారే యిచట ప్రాణములని పిలువఁబడుచున్నారు. ఆకాశాదులవలె స్వరూపమున వికారములను బొందనివారైనందున జీవులు సత్యములనిపించుకొనుచున్నారు. జీవులవలె కర్మానుగుణముగ జ్ఞానమునందు సంకోచవికాసములను పొందక, అపహతపాప్మత్వాది కల్యాణగుణ పరిపూర్ణుఁడైనందున పరబ్రహ్మము సత్యములనఁబడు జీవులకంటెను సత్యమని చెప్పఁబడుచున్నాఁడు. వాక్యశేషమునందిట్టి గుణవిశేషములను ప్రతిపాదించి యున్నందున "నేతి నేతి" అను శ్రుతివాక్యము గుణవిశేషములను నిషేధించుచున్నదనుట యసంభవము. కనుక, ఈ నిషేధవాక్యము "బ్రహ్మము ఈ మూర్తామూర్తాది విశేషములతో మాత్రము గూడుకొని యున్నాఁడనెడి పరిచ్ఛిన్నత్వమును మాత్రము నిషేధించుచున్నదనుట యుక్తము. కావున బ్రహ్మ ఉభయలక్షణుఁడని సిద్ధమగుచున్నది.

అవతారిక:—"బ్రహ్మము ప్రమాణాంతర గోచరముకాదు గాన, నట్టి బ్రహ్మముతో సంబంధించినట్టి వానినిగా మూర్తామూర్త స్వరూపముల నను వదించి అందుమూలముగ వానిని నిషేధించుట యసంభవము. కావున నిచట నట్టి పరిచ్ఛిన్నత్వమే నిషేధింపఁబడుచున్నది" యని పూర్వసూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. ప్రకృతమున బ్రహ్మము ప్రమాణాంతర గోచరమైనది కాదనెడి యంశమును దృఢపఱచుటకై:—

౨౨॥ సూ॥ త ద వ్య క్త మా హ హి.

టీ॥ తత్ = బ్రహ్మము, అవ్యక్తం = ప్రమాణాంతరాగోచరమని, ఆహహి = శ్రుతి తెలుపుచున్నది గదా.

తా॥ బ్రహ్మము ప్రమాణాంతర వేద్యముకాదని శ్రుతివాక్యములు తెలుపుచున్నవి.

శ్రీ॥ భా॥ "న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం" (తై. నా. అం. 3) "ఈ బ్రహ్మముయొక్క రూపము చక్షురింద్రియ విషయమైనది గాదు ఎవ్వఁడును బ్రహ్మమును చక్షురింద్రియముచే జూడనేరడు" అనియు "న చక్షుషా గృహ్యతే నాపి వాచా" (ఈ బ్రహ్మము చక్షురింద్రియమునకును వాగింద్రియమునకును విషయము గాదు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు బ్రహ్మము ప్రమాణాంతర గోచరము గాదని తెలుపుచున్నవి.

అవతారిక:—బ్రహ్మము మూర్తామూర్తాది రూపముగలది యనెడి యంశము ఇంద్రియ గోచరమయినది కాదని నిరూపించునట్టి వేఱొక్క కారణ మును సయితము గాన్పించుటకై:—

౨౩॥ సూ॥ అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్.

టీ॥ అపి=మఱియు, సంరాధనే = సర్వేశ్వరునికి ఎక్కువ ప్రీతిని గలుగఁ జేయునదియు, భక్తియనఁబడునట్టి ధ్యానమునందే (అస్య=ఈమూర్తామూర్త స్వరూపముయొక్క, సాక్షాత్కారః=సాక్షాత్కారము, భవతి=కలుగుచున్నది వలననఁగా,) ప్రత్యక్షానుమానాభ్యాం=శ్రుతిస్మృతుల వలన, అవగమ్యతే = తెలియుచున్నది.

తా॥ సర్వేశ్వరునికి ఎక్కువప్రీతిని గలుగఁ జేయునదియు, భక్తియనఁబడు నట్టి ధ్యానము ననుష్ఠించు సమయముననే అతని మూర్తామూర్త రూపముయొక్క సాక్షాత్కారము గలుగుచున్నదని శ్రుతిస్మృతుల వలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "సంరాధన" శబ్దమునకు, "ఎక్కువ ప్రీతిని గలిగించునది" యని యర్థము. అనఁగా భక్తిరూపమైనదిగా నంగీకరింపఁబడినట్టి నిదిధ్యాసనమనుట. అట్టి నిదిధ్యాసనముననే యీ మూర్తామూర్తరూపము యొక్క సాక్షాత్కారము గలుగును గాని, వేఱొకప్పుడు గలుగదు. ఇట్లు శ్రుతి స్మృతులవలనఁ దెలియుచున్నది. ఎట్లనిన, "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం" (ము.3.ము.౨ఖ.3వా)(ఈపరమాత్మ వేదాధ్యయనము వలనఁ గాని, బుద్ధిచాతుర్యమువలనఁ గాని, ఎక్కువగా వినుట వలనఁగాని, పొందఁదగిన వాఁడు కాఁడు. ఎవ్వఁడీ పరమాత్మచే ప్రేమింపఁబడుచున్నాఁడో, వాఁడే యతనిఁ బొందఁగలఁడు. అట్టి వానికే యీపరమాత్మ తన స్వరూప మును విశదపఱచుచున్నాఁడు.) అనియు, "జ్ఞాన ప్రసాదేన విశుద్ధసత్త్వస్త తస్తు తం పశ్యతి నిష్కళం ధ్యాయమానః" (ము.3ము.౧ఖ.౮వా) అనఁగా (జ్ఞాన రూపమగు ప్రకాశముచే నిర్మలమగు మనస్సు గలవాఁడయి ధ్యానము జేయు వాఁడు ఆ యవయవ రహితుఁడగు పరబ్రహ్మమును సాక్షాత్కరించు చున్నాఁడు" అనియు నీమొదలగు శ్రుతివాక్యములవలన నట్లు తెలియుచున్నది. శ్రీభగవ ద్గీతలయందును,

శ్లో॥ "నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా"

"భక్త్యాత్వనన్యయా లభ్య అహమేవంవిధోఽర్జున"

"జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప"

తా॥ ఓ అర్జునా! ఇట్టి వాఁడనగు నేను వేదాధ్యయనము చేతను, తపస్సు చేతను, దానముచేతను, యాగముచేతనున్ను చూడ శక్యుఁడను కాను. పొందఁ దగిన వాఁడను కాను. ఓ అర్జునా! అయితే నాయెడల అసాధారణమగు భక్తి చేతఁ దెలిసికొనుటకును, తత్త్వమునఁ జూచుటకును, ప్రవేశించుటకును, అనఁగాఁబొందుటకును శక్యుఁడను.

ఇట్టి భక్తిరూపమునుబొందిన ఉపాసనము సంరాధనమని అనఁగా మిక్కిలి ప్రీతిఁ గలుగఁజేయునది యని పూర్వమే చెప్పఁబడియె. ఇట్టి నిదిధ్యాసనమునకుఁ గాను "ద్వే వావ బ్రహ్మణో రూపే" అను శాస్త్రము పరబ్రహ్మముయొక్క స్వరూపమును గుఱించి యుపదేశించుటకై యుద్దేశించి, ప్రమాణాంతరావేద్యమగు మూర్తామూర్త విశిష్టత్వమును ఉపదేశించుచున్నది. కావున నట్టి స్వరూపము ప్రకృతశ్రుతిచే ననువదింపఁ బడుచుండ లేదు.

౨౫॥ సూ॥ ప్రకాశాది వచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్.

టీ॥ ప్రకాశాదివత్ = పరమాత్మయొక్క జ్ఞానానందాది స్వరూపము వలె, (మూర్తామూర్తవిశిష్టత్వమున్ను ఒకగుణమగు విషయమై) అవైశేష్యం= విశేషాభావము, (ప్రతీయతే= తెలియ వచ్చుచున్నది. ఏలననఁగా), కర్మణి = సంరాధన కర్మమునను, అభ్యాసాత్ = పలుమాఱొనర్చుటవలన, ప్రకాశశ్చ = జ్ఞానానందాది స్వరూపమే గదా తెలియుచున్నది. చ=ఈ హేతువువలనను.

తా॥ పరమాత్మయొక్క జ్ఞానానందాది స్వరూపము ఎట్టిదో, మూర్తామూర్త స్వరూపమును అట్టిదియే. విశేషము లేదు. జ్ఞానానంద స్వరూపమున్ను, యోగాభ్యాసము వలనఁ దెలియునదియే గదా. ఈహేతువువలనను పరిచ్ఛిన్నత్వమే నిషేధింపఁ బడుచున్నది గాని, మూర్తామూర్త స్వరూపవిశిష్టత్వము నిషేధింపఁబడుచుండ లేదని విదితమగుచున్నది.

శ్రీ॥ భా॥ "నేతి నేతి" అను శ్రుతివాక్యము బ్రహ్మస్వరూపముయొక్క పరిచ్ఛిన్నత్వమునే నిషేధించుచున్నది గాని, యతఁడు మూర్తామూర్తాది విశిష్టుఁడగుటను నిషేధించుచుండ లేదని యీక్రిందు గాన్పింపఁబోవు హేతువు వలనను విశదమగుచున్నది. ఏలననఁగా, వామదేవాదిమహర్షుల సాక్షాత్కారమున, జ్ఞానానందాది స్వరూపమువలెనే మూర్తామూర్తాదివిశిష్టత్వమున్ను బ్రహ్మగుణముగాఁ దెలియవచ్చుచున్నది. ఎట్లనిన, "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే అహం మను రభవం సూర్యశ్చ" ఇత్యాది శ్రుతివాక్యములు (వామదేవుఁడను మహర్షి ఇట్టి బ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించి నేను మనువును నేను సూర్యుఁడనని తెలిసికొనెను) అని తెలుపుచున్నవి. నిదిధ్యాసనము నభ్యసించుట వలన వామదేవాదులకు పరబ్రహ్మముయొక్క జ్ఞానానందాది స్వరూపము

తెలియవచ్చినట్లు, అట్టి నిదిధ్యానముననే, అట్టి జ్ఞానానందాది స్వరూపము వలెనే మూర్తామూర్తాదివిశిష్టత్వమున్ను తెలియవచ్చుచున్నది. (కావున నిదియును జ్ఞానానంద స్వరూపమువలె బ్రహ్మముయొక్కరూపమే యని తాత్పర్యము)

అవతారిక:—బ్రహ్మము ఉభయ లక్షణుఁడను విషయమును ఈ సూత్రముచే నుపసంహరించుచున్నారు.

౨౫॥ సూ॥ అతో ఽనన్తేన తథా హి లిఙ్గమ్.

టీ॥ అతః=పూర్వోక్త హేతువులవలన, అనన్తేన=బ్రహ్మము అనంతములగు కల్యాణగుణములతోఁ గూడి యుండునది. తథాహి=కనుకనే, లిఙ్గమ్=బ్రహ్మము ఉభయలింగ మగుట సిద్ధించును.

తా॥ పూర్వము గానఁబడిన హేతువులవలన బ్రహ్మము అనంత కల్యాణగుణవిశిష్టుఁడని తెలియుచున్నది. అందువలన బ్రహ్మము ఉభయలక్షణుఁ డగుట సంభవము.

శ్రీ॥ భా॥ ఈపైని గానఁబడిన హేతువుల వలన బ్రహ్మము అనంత కల్యాణ గుణవిశిష్టుఁడని సిద్ధమగుచున్నది. అందువలన నతఁడు ఉభయలక్షణుఁడగుట అనఁగా నిరస్తసమస్త దోషుఁడును కల్యాణగుణాకరుఁడు నగుట సంభవము.

ఉభయలిఙ్గాధికరణము ముగిసెను.

అహికుణ్డలాధికరణము.

౨౬॥ సూ॥ ఉభయవ్యపదేశాత్త్వహికుణ్డలవత్.

టీ॥ ఉభయవ్యపదేశాత్తు=తాదాత్మ్య వ్యపదేశమున్ను, భేదవ్యపదేశమున్ను ఈరెండును గానఁబడుచున్నందున, అహికుణ్డలవత్ = అహికుణ్డల న్యాయప్రకారము.

తా॥ శ్రుతులయందుఁ గొన్ని తావుల బ్రహ్మమునకును అచేతనపదార్థములకును తాదాత్మ్యము జెప్పఁబడియున్నందునను, మఱికొన్ని తావుల వానికభేదము జెప్పఁబడియున్నందునను అహికుణ్డల న్యాయప్రకారము అచేతనవస్తువులు బ్రహ్మముయొక్క యాకార విశేషములని యెఱుంగునది,

శ్రీ॥ భా॥ "ద్వేవావ బ్రహ్మణో రూపే" (బ్రహ్మమునకు రెండు రూపములు గలవు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు మూర్తామూర్తాత్మకమగు నీ యచిత్ప్రపంచమంతయు బ్రహ్మముయొక్క రూపమని యుపదేశించు

పూర్వాధికరణముతోఁ గల సంబంధము.

చున్నవనియు, "అథాత ఆదేశోనేతినేతి" అను శ్రుతివాక్యము "బ్రహ్మము మూర్తామూర్తాచిద్వస్తుమాత్ర విశిష్టమైనది" యని యిట్లు బ్రహ్మస్వరూప విషయమగు పరిచ్ఛిన్నత్వమును మాత్రమే నిషేధించు చున్నదనియు, "నహ్యే తస్మాదితి నేత్యన్యత్పరమస్తి" అను శ్రుతివాక్యము "బ్రహ్మకంటె నుత్కృష్టమగు పదార్థము వేఱొక్కటి లేదని తెలియఁజేయుచున్నది" అనియును ప్రతిపాదింపఁబడియె. ఈవిషయమును ఉపపాదించుటకై "అథ నామధేయం సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషామేష సత్యం" అను శ్రుతివాక్యము "ప్రాణములనఁబడు జీవుల కంటె పరబ్రహ్మము సత్యము అనఁగా నీతఁడెన్నఁడును జీవులవలెనే జ్ఞాన సంకోచాదులను పొందువాఁడుకాఁడు" అని చెప్పఁబడియె. మఱియు "ప్రధాన క్షేత్రజ్ఞ పతిర్గుణేశః"(బ్రహ్మము ప్రకృతిపురుషులకును గుణములకును స్వామి) అనియు "పతిం విశ్వస్యాత్మేశ్వరం" (ఈ సర్వప్రపంచమునకును ప్రత్యగాత్మకును స్వామి యయిన పరబ్రహ్మమును ధ్యానించుచున్నాను) అనియు, "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం" (ఈపరబ్రహ్మము నిత్యులలో నిత్యుఁడు మఱియు చేతనులలో చేతనుఁడు అనఁగా నిత్యులును చేతనులునగు జీవులకంటె నెల్లప్పుడు నొక్కటియే రీతిగా నుండువాఁడయి ఉత్కృష్టమగు జ్ఞానముగలవాఁడు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములవలనను ఈవిషయము తెలియవచ్చుచున్నది. ఇట్లు అచిత్పదార్థజాతము బ్రహ్మముయొక్క యాకారముగా నుండినను, అందుండు దోషము లెంతమాత్రము బ్రహ్మముతో సంబంధింపవని నిరూపించుటకుగాను అది బ్రహ్మముయొక్క యాకార మగు విధమును గుఱించి ప్రకృతమున విచారింపఁబడును.

## సంశయము

అహికుణ్డల న్యాయప్రకారము అనఁగా సర్పము చుట్టచుట్టుకొని యుండుటయు నిడుపుగా నుండుటయును దానియొక్క యాకార విశేషములే యయినట్లు, అచేతన పదార్థములును బ్రహ్మయొక్క యాకారవిశేషములా?

లేక, సూర్యుఁడును సూర్యుని కాంతియును ఏకజాతీయము లయినట్లు అచేతనపదార్థమున్ను బ్రహ్మమున్ను ఏకజాతీయములా?

లేక, విశేషణ విశేష్య భావసంబంధముచే జీవుఁడు బ్రహ్మముయొక్క యంశ మయినట్లు ఈ యచేతనపదార్థమున్ను, అంశాంశిభావసంబంధముచే బ్రహ్మయొక్క యంశమా? ఏలననిన, ఇక్కడ స్థాపింపఁబోవు విశేషణ విశేష్యభావ సంబంధము నంగీకరించి "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్"(బ్ర. సూ.౧ అ.౪ పా. ౨౩ సూ) అనియు, "తదనన్యత్వమార

మ్భుణాశబ్దాదిభ్యః" (బ్ర. సూ. ౨ అ. ౧పా. ౧౫ సూ) అనియు నీసూత్రముల యందు, సూక్ష్మ చిదచిద్విశిష్టమగు బ్రహ్మమునుండి స్థూల చిదచిద్విశిష్టమగు నది పుట్టుచున్నదనియు, ఈ రెండును అభిన్నములనియును జెప్పఁబడియె.

## పూ ర్వ ప క్ష ము

ఉపనిషద్వాక్యములయం దచ్చటచ్చట "బ్రహ్మైవేదం సర్వం" (బృ. ౪.అ ౫.బ్రా. ౧వా) (ఈ దృశ్యమానమగు ప్రపంచమంతయును బ్రహ్మమే) అనియు, "ఆత్మైవేదం సర్వం" (ఛా. ౭.ప్ర ౨౫.ఖ ౨వా) (ఈ దృశ్యమానమగు జగత్తంత యునాత్మయే) అనియు, నిట్లు జగద్బ్రహ్మములకు తాదాత్మ్యమును జెప్పియున్నం దునను, "హన్తాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనా ఽనుప్రవిశ్య నామ రూపే వ్యాకరవాణి" (ఛా.౬ ప్ర.3ఖ. ౨వా) (నేను ఈ మూడుభూత ములయందును జీవశరీరుఁడుగాఁ బ్రవేశించి నామరూపములను విశద పఱచు చున్నాను," అనుటచేభూతాదిరూపమగు నీప్రపంచము బ్రహ్మకంటె భిన్న మయినట్లు జెప్పియుండుటవలన నున్ను అనఁగా అచేతనమగునట్టి యీజగత్తు బ్రహ్మముకంటె నభిన్నమయినదిగానును భిన్నమయినదిగా నున్ను జెప్పఁబడి యున్నందున నిచట అహికుణ్డలన్యాయానుసారము ఆనఁగా, సర్పము చుట్ట చుట్టుకొని యుండుటయు నిడుపుగానుండుటయును సర్పముయొక్క యాకార ములగునట్లు, అచిత్పదార్థము లన్నియును బ్రహ్మయొక్క ఆకారవిశేషములే.

## ౨౭॥ సూ॥ ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్.

టీ॥ వా=పైపక్షము యుక్తముకాదు, తేజస్త్వాత్ = తేజస్స్వరూప మగుటవలన, ప్రకాశాశ్రయవత్ = ప్రకాశ ప్రకాశవంతములగు పదార్థ ముల వలెనే,

తా॥ ప్రకాశమును ప్రకాశవంతమగు పదార్థమును తేజస్సగుటంజేసి యీ రెంటికిని తాదాత్మ్యము పొసగునట్లు, ఇవ్విధముగ అచేతనపదార్థము బ్రహ్మముయొక్క రూపమగుట పొసగును.

శ్రీ భా॥ బ్రహ్మముయొక్కస్వరూపమే అచిత్పదార్థమన్నచో, బ్రహ్మ మునకున్ను అచిత్పదార్థమునకున్ను భేదము గలదని తెలుపునట్టి శ్రుతులును, బ్రహ్మము అచేతనపదార్థమువలెనే పరిణమించునదిగాదని చెప్పునట్టి శ్రుతు లును బాధింపఁబడును. కనుక, సూర్యుఁడును సూర్యకాంతియును తేజస్సే యగుటచే వానికి తాదాత్మ్యము పొసగునట్లు, ప్రకృతమునను, అచిత్పదార్థము బ్రహ్మముయొక్క రూపము కాదగును.

## ౨౮॥ సూ॥ పూర్వవద్వా

టీ॥ వా=ఈపైనిగనఁబఱచిన రెండుపక్షములును యుక్తములు కావు. కావున, పూర్వవత్ =పూర్వమువలెనే.

తా॥ ఈపైని గానఁబఱచిన రెండుపక్షములను దోషములు ప్రసక్తించును. కావున పూర్వము గానబఁఱచిన అంశాంశిభావమే యుక్తమైనది.

### సిద్ధాంతము

శ్రీ॥ భా॥ ఒక్కటియే పదార్థము అవస్థాంతరమును బొందుచున్నదని వాదించినను, బ్రహ్మముయొక్క స్వరూపమే జడపదార్థ స్వరూపమయినందున పూర్వసూత్రమునఁ గానఁబఱచిన దోషము ప్రసక్తింపక తప్పదు. ఇంతియెకాక, సూర్య సూర్యకాంతులవలెనే బ్రహ్మమున్ను అచిత్పదార్థమున్ను బ్రహ్మత్వమనఁబడు యొక్కటియే జాతి గలవని మాత్రమే యిచట వివక్షితమనియెదవా? అట్లంటివేని, అశ్వత్వగోత్వముల వలెనే బ్రహ్మమనఁబడునది యీశ్వరుని యందును చిదచిత్పదార్థములయందును నుండునట్టి యొక సామాన్యధర్మ మనవలసినచ్చును. అట్లంటివేని, శ్రుతిస్మృతి వ్యవహారము లన్నియును విరోధించును. కనుక నింతకుఁ బూర్వము "అంశో నానావ్యపదేశాత్" (బ్ర. సూ. ౨అ. 3పా. ౪౨సూ) అనియు "ప్రకాశాది వత్తునైవంపరః" (బ్ర.సూ. ౨అ.3పా. ౪౬ సూ) అనియు నీసూత్రములయందు నిరూపింపఁబడిన ప్రకారము జీవునివలె నచిత్పదార్థమున్ను బ్రహ్మకంటె వేఱుగా నుండునదికాక, బ్రహ్మయొక్క విశేషణముగానుండునట్టి బ్రహ్మాంశమని చెప్పుట యుక్తము. ఇట్లు జెప్పినచో, విశేషణవస్తువు విశిష్టవస్తువుయొక్క యేకదేశమగుటంజేసి యభేదవ్యవహారము ముఖ్యమే యగును. విశేషణ విశేష్యముల స్వరూపస్వభావములు భిన్నములయినందున, భేదవ్యవహారమున్ను ముఖ్యమే యగును. ఇందువలన బ్రహ్మము నిర్దోషమనెడి యంశమును రక్షింపఁబడినదగును. కనుక మణియందుండు కాంతి మణికంటెను వేఱుగా గ్రహింపఁబడనిదై మణియొక్క గుణముగాఁ దానియొక్క యంశమగు చందంబునను, ఘటత్వాది జాతి ఘటాదివ్యక్తికంటె వేఱుగా గ్రహింపబడనిదై ఘటాదివ్యక్తియొక్క గుణముగాఁ దాని యంశమగు చందంబునను, గుణము గుణిపదార్థముకంటె వేఱుగా గ్రహింపబడనిదై గుణిపదార్థముయొక్క గుణమగుటచే దాని యంశగుమచందంబునను, శరీరము శరీరి యగు నాత్మయొక్క గుణమగుటచే ఆత్మయొక్క అంశమగు చందంబునను, చేతనాచేతన పదార్థములగు జీవజగత్తులు బ్రహ్మకంటె వేఱుగా గ్రహింపబడనివై బ్రహ్మవిశేషణము లగుటచే బ్రహ్మముయొక్క యంశములని చెప్పుట యుక్తము.

౨౯॥ సూ॥ ప్ర తి షే ధా చ్చ.

టీ॥ ప్రతిషేధాచ్చ=బ్రహ్మమునందు అచిత్పదార్థముయొక్క ధర్మములను నిషేధించుటవలనను.

తా॥ బ్రహ్మమునం దచిత్పదార్థముయొక్క ధర్మములను నిషేధించుటవలనను అంశాంశిభావము సిద్ధించుచున్నది.

శ్రీ॥ భా॥ "స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరః" (బృ.౬.అ.౪బ్రా.౨౫వా) (ఈ పరమాత్మ గొప్పవాఁడు, పుట్టుకలేనివాఁడు వ్యాపించియుండువాఁడు ముసలితనము లేనివాఁడు మరణరహితుఁడు) అనియు "నాస్యజరయైతజ్జీర్యతే" (ఛా.౮.ప్ర.౧ఖ.౫వా) (ఈ యచిత్పదార్థముయొక్క క్షీణదశచే పరమాత్మ క్షీణింపఁడు) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు బ్రహ్మమునం దచిత్పదార్థముయొక్క ధర్మములను నిషేధించుచున్నందునను, గుణము గుణిపదార్థముయొక్క యంశమగు రీతిని, చేతనాచేతన పదార్థములగు జీవజగత్తులు బ్రహ్మముయొక్క అంశములనియు బ్రహ్మము అంశియనియు నిట్లు అంశాంశిభావము నవలంబించుట యుక్తము. ఇట్లు సూక్ష్మచిదచిద్విశిష్టమయినది కారణబ్రహ్మమైనందునను, స్థూలచిదచిద్విశిష్టమయినది కార్యబ్రహ్మమైనందునను, కార్యకారణము లభిన్నములు. కారణపదార్థమును దెలిసికొనినచో, కార్యజాతమంతయును తెలియుచున్నదను వేదాంతశాస్త్రపు ప్రతిజ్ఞ మొదలయినదియంతయును ఉపపన్నమగుచున్నది. బ్రహ్మమునందు నిర్దోషత్వమున్ను రక్షితమగుచున్నది. ఇట్లు బ్రహ్మము నిర్దోషుఁడగుటవలనను, కల్యాణగుణాకరుఁ డగుటవలనను ఈతఁడు ఉభయలక్షణుఁడనియును సిద్ధమగుచున్నది.

అహికుణ్డలాధికరణము ముగిసెను.

---

## ప రా ధి క ర ణ ము

౩౦॥ సూ॥ పరమతస్సేతూన్మాన సంబన్ధ భేద వ్యపదేశేభ్యః.

టీ॥ సేతూన్మాన సంబన్ధ భేద వ్యపదేశేభ్యః=సేతువు (అడ్డుకట్టు) ఉన్మానము (తూనిక) కంటెను సంబంధము, భేదము వీనికథనమువలన, అతః = బ్రహ్మము, పరం=అన్యము(అస్తి=కలదు.)

తా॥ సేతువ్యపదేశమును బట్టియు, ఉన్మానవ్యపదేశమును బట్టియు, సంబంధవ్యపదేశమును బట్టియు, భేదవ్యపదేశమును బట్టియును పరమాత్మకంటె నన్యమగు ప్రాప్యవస్తువు కలదని చెప్పవచ్చును.

శ్రీ॥ భా॥ ఈ జగత్తునకు నిమిత్తోపాదానరూప పరమకారణమగు పరబ్రహ్మముకంటెను ఉత్కృష్టమగు వేఱొక్క తత్త్వము గలదని కొన్ని

కుయుక్తులచే శంకించియట్టి శంకను ఈ యధికరణమున ననువదించి నిరాకరించు చున్నారు. ఉపాస్య వస్తువగు బ్రహ్మము నిర్దోషమును, అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణాకరముననెడి యంశమును స్థిరపఱచుటయే యిందులకుఁ బ్రయోజనము.

—•••పూర్వపక్షము•••—

ఉభయలక్షణుఁడును, అఖిలజగత్కారణుఁడు నగు పరబ్రహ్మముకంటె నితరమును, ఉత్కృష్టమునునగు వేఱొక్క పదార్థము ఉన్నట్లు శ్రుతులవలనఁ దెలియుచున్నది. అదెట్లనిన, ఛందోగులు "అథ య ఆత్మా స సేతుర్విధృతిః" (ఏ యాత్మసేతువుగాను ధారకముగాను నున్నదో" అనుటచే పరబ్రహ్మమును సేతువుగాఁ జెప్పియున్నారు. లోకమునందు నది మొదలగు దానియొక్క ఒకతీరమునుండి మఱియొక తీరమునకుఁ జేరుటకు సాధన భూతమయిన గట్టును గాని లేక వంతెనను గాని సేతువని చెప్పుట గలదు. ఇందువలన నిట్లు సాధన భూతముగాఁ జెప్పబడిన పరబ్రహ్మము కంటెను ముముక్షువులచే బొందఁదగినది మఱియొక్కటి యున్నట్లు దెలియవచ్చుచున్నది. కనుకనే ఉత్తరత్ర "ఏతం సేతుం తీర్త్వాఽథ సన్నద్ధో భవతి" (ఛా. ౮ప్ర. ౪ఖ. ౧వా) (మానవుఁడీ సేతువును దాటి కృతకృత్యుఁడగుచున్నాఁడు" అనుటచే సేతువుగాఁ జెప్పఁబడిన పరమాత్మదాటఁ దగినవాఁడనియును జెప్పియున్నారు. ఇందు వలనను ముముక్షువులచేఁ బొందఁదగిన వస్తువు పరమాత్మకంటె వేఱొక్కటి యున్నట్లు సిద్ధమగుచున్నది.

మఱియు "చతుష్పాద్బ్రహ్మ" (ఛా. ౩ప్ర. ౧౮ఖ. ౨) (బ్రహ్మము నాలుగు పాదములు కలవాఁడు) అనియు, "షోడశకలం" (బ్రహ్మము పదునాఱుకళలు గలవాఁడు) అనియును నీ విధముగ శ్రుతులయందుఁ జెప్పియుండుటచే బ్రహ్మమునకు పరిమితియు నున్నట్లు దెలియుచున్నది. ఇందువలనను, పరిమితి యుక్తుఁడగు పరమాత్మను సాధనముగాఁ జేసికొని ముముక్షులచేఁ బొందఁదగినదై అపరిమిత మయినది మఱియొకటి యున్నట్లు విశదమగుచున్నది.

మఱియు "అమృతస్య పరం సేతుం" (ఈ పరబ్రహ్మమును సంసార సముద్రమును దాటించి మోక్షమును బొందించుట కొఱకు సాధనభూతమగు గొప్పసేతునువుగాఁ దెలిసికొనుము.) అనియు "అమృతస్యైష సేతుః" ఈ పరబ్రహ్మము సంసారసముద్రమును దాటించి మోక్షమును బొందించుటకై సాధనభూతమగు సేతువుగా నున్నది.) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములవలన పరబ్రహ్మము మరియొకవస్తువును బొందించుటకు సాధనము లేక

ప్రాపకమనియు, అట్టి పదార్థము ప్రాప్యమనియును దెలియుచుండుటచే, ఈ రెండు పదార్థములకును ప్రాప్యప్రాపక సంబంధముగూడ గానఁబడుచున్నది.

మఱియు "పరాత్పరం పురుషముపైతి" (ఆత్మజ్ఞానముగల మానవుఁడు పరాత్పరుఁడు అనఁగా, పరాత్ =జగత్కారణముకంటె, పరం=ఇతరుఁడగు పురుషునిఁ బొందుచున్నాఁడు.) అనియు, "పరాత్పరం యన్మహతో మహాన్తం" (ఏది జగత్కారణమగు వస్తువుకంటెను వేఱయినదో, గొప్పదానికంటెను గొప్పదైనదో) అనియు, "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" (అట్టి పురుషునిచే నిదియంతయు నిండియున్నది) అనియు, "తతో యదుత్తరతరం తదరూపమనామయం"(ఏది దానికంటె నితరమయినదియో, అది నామరూపములు లేనిది) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములవలన ఈ పైని జెప్పిన రెండు పదార్థములకున్ను భేద మున్నట్లున్ను తెలియుచున్నది.

ఈ కారణములవలన పరబ్రహ్మముకంటె నితరమగు మఱియొక గొప్ప పదార్థమున్నట్లు తెలియుచున్నది.

అవతారిక:—ఇట్లు పరబ్రహ్మముకంటె నితరమగు మఱియొకప్రాప్య వస్తువు గలదని శంకింపఁగా నట్టి శంకను పరిహరించుటకై,

## ౩౧॥ సూ॥ సా మా న్యా త్తు.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, ఏలననిన, సామాన్యాత్ =సేతుసాదృశ్యమువలన (పరమాత్మ సేతువుగాఁ జెప్పఁబడెను.)

తా॥ సేతుసాదృశ్యమునుబట్టి యీ తావున పరమాత్మ సేతువుగాఁ జెప్పఁబడెను.

### సి ద్ధాం త ము

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "తు" శబ్దము పూర్వపక్షము సరికాదని సూచింపుచున్నది. శ్రుతులయందు పరబ్రహ్మము సేతువుగాఁ జెప్పఁబడియున్నందున పరబ్రహ్మముకంటె వేఱొక్క ప్రాప్యవస్తువు గలదని పూర్వపక్షి చెప్పినది యనుపపన్నము. ఏలననిన, శ్రుతు లీతావున మఱియొక పదార్థమును బొందించుటకు సాధన భూతమగు సేతువునుగా పరబ్రహ్మమును పేర్కొనుచుండలేదు. అయితే "ఏషాం లోకానా మసంభేదాయ = ఈలోకములను చెదరిపోకుండ యుండునట్లు చేయుట కొఱకు" అని శ్రుతియందుఁ జెప్పియుండుటచే పరబ్రహ్మము సేతువువలె లోకములకు సంకరము గలుగకుండ వానిని దృఢముగ బంధించి యుండునదియనెడి విషయమున పరబ్రహ్మమును సేతువుతోఁబోల్చి చెప్పియున్నారు. "సినోతి=బధ్నాతి స్వస్మిన్ సర్వం చిద చిద్వస్తు

జాతమితి సేతుః" అను సేతుశబ్దముయొక్క వ్యుత్పత్తిని బట్టి విచారింపఁగా, "చిద చిద్విశిష్టమగు నీ జగత్తునంతయును తనయందు బంధించుకొనునది సేతువు" అని తెలిసికొనుచున్నాము. "ఏతం సేతుం తీర్త్వా" అనుతావున "తీర్త్వా" అనఁగా "పొంది" యని యర్థము. ప్రయోగము—"వేదాన్తం తరతి=వేదాన్తమును బొందుచున్నాఁడు" అను తావున వలెనె ప్రకృతమునను ఎఱుంగునది.

## ౩౨॥ సూ॥ బుద్ధ్యర్థః పాదవత్॥

టీ॥ పాదవత్=పాదవ్యపదేశమువలెనే, (ఉన్మాన వ్యపదేశః=ఉన్మాన వ్యపదేశము) బుద్ధ్యర్థః=ఉపాసనము కొఱకు చేయఁబడియె.

తా॥ బ్రహ్మము పాదములు గలదని చెప్పినట్లు, బ్రహ్మము పరిమితి గలదియని చెప్పుట యుపాసనమునకు గానని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ "చతుష్పాద్బ్రహ్మ=బ్రహ్మము నాలుగు పాదములు గలది" అనియు, "షోడశకలం బ్రహ్మ=బ్రహ్మము పదునాఱు కళలు గలది" అనియు "పాదోఽస్య విశ్వాభూతాని=సమస్తభూతములును జేరి ఈ పరబ్రహ్మముయొక్క పాదము" అనియు నివ్విధముగ శ్రుతివాక్యములయందుఁ బ్రహ్మమునకుఁ బరిమితినిఁ జెప్పియుండుట యుపాసనార్థము. ఏలననిన, "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతుల వలనఁ జగత్కారణమగు బ్రహ్మము ఎవ్విధమైన పరిచ్ఛేదమున్ను లేనిదిగాను తెలియవచ్చుచున్నది. మఱియు నట్టి వస్తువు స్వరూపసిద్ధముగఁ బరిమితిగలది యగుట యసంభవము. "తస్మా దేతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" (అట్టి పరబ్రహ్మమునుండి ఆకాశము బుట్టుచున్నది) అనియు, "సోఽకామయత బహు స్యాం ప్రజాయాయ" (ప్రజలను సృజించుటకు గాను నేననేకముగా నగుచున్నాను) అనియు నీ మొదలగు వాక్యములవలన నట్టి యనంతమగు వస్తువు నే గదా జగత్కారణమునుగాఁ దెలిసికొను చున్నాము.

కనుక "వాక్పాదః, ప్రాణఃపాదః, చక్షుఃపాదో, మనః పాదః" (వాక్కును, ప్రాణమును, చక్షుస్సును, మనస్సును పరబ్రహ్మముయొక్క పాదములనుగా నుపాసింపుము) ఈ మొదలగు స్థలములయందు వాగాదులను పరబ్రహ్మముయొక్క పాదములనుగాఁ జెప్పుట యుపాసకుల యుపాసనోపయోగమునకు గానయి నట్లు, ప్రకృతమునను, పరబ్రహ్మమును పరిమితియుక్తమగు సేతువునుగాఁ జేర్కొనుట యుపాసకుల యుపాసనోపయోగమునకు గానసుట.

అవతారిక:—కానిమ్ము స్వతస్సిద్ధముగ పరిమితిలేని పరబ్రహ్మమును ఉపాసకుల యుపాసనార్థముగానైనను, పరిమితి యుండుట యెట్లు సంభవమని శంకింపఁగా, నందులకు సమాధానమును ఈ సూత్రముచేఁ జెప్పుచున్నారు.

33॥ సూ॥ స్థా న వి శే షా త్ప్ర కా శా ది వ త్॥

టీ॥ ప్రకాశాదివత్ = ప్రకాశము మొదలగు వానివలెనే, స్థానవిశేషాత్=ఉపాధి విశేషమునుబట్టి (పరిమితివ్యపదేశము ఉపపన్నమగును.)

తా॥ గవాక్షాదిభిన్నభిన్నోపాధులతోఁగల సంబంధమునుబట్టి ప్రకాశాదులు తత్పరిమితములుగాఁ దెలియఁబడునట్లు, పరబ్రహ్మమున్ను వాగాది రూపమగు భిన్నభిన్నోపాధి సంబంధమునుబట్టి తత్పరిమితముగా ననుసంధింపఁ బడుచున్నది.

శ్రీ॥ భా॥ ప్రకాశము మొదలగునవి సర్వత్ర వ్యాపించి యుండునవియ యినను, గవాక్షాది భిన్నభిన్న ప్రదేశములయందు ప్రసరించి యుండునపుడు గవాక్షాదిప్రదేశ పరిమితము లయినట్లు దెలియఁబడు చున్నవి గదా! అట్లే పరబ్రహ్మమున్ను అనంతమై సర్వవ్యాపక మయినను, వాగాది స్థానరూపములగు నుపాధులకుఁగల భేదమునుబట్టి వాగాదిప్రదేశ సంబంధియగుటచే తత్పరిమిత మయినదిగా నను సంధింపఁ బడుచున్నది.

3౪॥ సూ॥ ఉప ప త్తే శ్చ॥

టీ॥ ఉపపత్తేశ్చ = శ్రుత్యుపపత్తి యుండుట వలనను (బ్రహ్మమే యుపాయము.)

తా॥ శ్రుత్యుపపత్తి యుండుటవలనను బ్రహ్మమే భక్తులు తనను జేరుటకుగానగు నుపాయముః

శ్రీ॥ భా॥ "అమృతస్యైష సేతుః" అను శ్రుతివాక్యము ప్రాప్యప్రాపక సంబంధమును తెలుపుచున్నది. కావున, ప్రాపకునికంటెను ప్రాప్యవస్తువు వేఱొక్కటి కలదని పూర్వపక్షి చెప్పినది యుక్తము కాదు. ప్రాప్యుఁడగు సర్వేశ్వరుఁడు తాను స్వయముగనే తనను పొందించునట్టి యుపాయమును నగుట సంభవము. ఏలననిన, "నాఽయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన య మేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం" (ము.౩ము.౨-౩) అను శ్రుతివాక్యము "ఓ శౌనకుఁడా! పూర్వము జెప్పఁబడిన పరమాత్మ వేదాధ్య యనముచేతను, బుద్ధిచేతను, ఎక్కువగా

వినుట చేతనున్ను బొందుట కలవి గాదు. అయితే ఎవనిని ఈ పరమాత్మ ప్రేమించుచున్నాఁడో, వానిచే నీతఁడు బొందఁదగినవాఁడు. అట్టి వానికే యీ పరమాత్మ తన స్వరూపమును విశదపఱచుచున్నాఁడు" అనుచు సర్వేశ్వరుని బొందుటకు సర్వేశ్వరునికంటె వేఱొక్కటి యుపాయము కాదని తెలుపుచున్నది.

3౫॥ సూ॥ తథాన్యప్రతిషేధాత్॥

టీ॥ తథా=అట్లే, అన్యప్రతిషేధాత్=సర్వేశ్వరునికంటెను పరమైనది వేఱొక్కటి లేదని చెప్పియుండుటవలన.

తా॥ శ్రుతులయందు పరబ్రహ్మముకంటె పరమైనది మఱియెద్దియును లేదని చెప్పియున్నందునను పరబ్రహ్మమే ప్రాప్యమును ప్రాపకమునని సిద్ధమగుచున్నది.

శ్రీ॥ భా॥ "తతో యదుత్తరం" (జగత్కారణముకంటెను యేది వేఱయినదో) అనియు"పరాత్పరం పురుషం" (జగత్కారణముకంటెను వేఱయిన పురుషుని) అనియు "అక్షరాత్పరతః పరః" (నాశరహితుఁడగు జీవునికంటె నుత్కృష్టుఁడగు బ్రహ్మముకంటె నుత్కృష్టుఁడు") అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు భేదమును తెలుపుచున్నందున పరబ్రహ్మముకంటెను పరమగునది వేఱొక్కటి గలదని పూర్వపక్షి చెప్పియుండెను. అది సంభవము కాదు. ఏలననిన, ఆ తావుననే " యస్మాత్పరం నాపరమస్తి కిఞ్చిత్ యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్" (ఏ పరబ్రహ్మముకంటె పరాపరమగు పదార్థమేదియును లేదో, మఱియు దేనికంటె గొప్పదిగాని చిన్నదిగాని మఱియొక్క టెద్దియును లేదో" అనియు నివ్విధమున పరబ్రహ్మకంటె పరమగు మఱియొక పదార్థము లేదని గదా! చెప్పఁబడియె. "పరం నాపరం" అనఁగా "దేనికంటెను వేఱుగా నెవ్విధముననను ఉత్కృష్టమైన వస్తు వెద్దియును లేదో" అని యర్థము. అట్లే మఱియొక తావునను "న హ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" అనఁగా, "ఏతావన్మాత్రమను పరిమితిలేని సర్వేశ్వరుని కంటె వేఱుగా శ్రేష్ఠమగు పదార్థములేదు" అనియును జెప్పఁబడియె.

ఇట్లే తైత్తిరీయులును "న తస్యేశే కశ్చన తస్య నామ మహద్యశః" అను వాక్యమున, "ఆ పరమపురుషుని నియమించు వాఁడెవఁడును లేడు ఆతనికి గొప్ప యశస్సని పేరు" అని పఠించి యున్నారు. ఈ వాక్యమునందు వివక్షితమయిన పదార్థము పరపురుషుఁడె. అదెట్లనిన, ఆ వస్తువే కదా "సర్వే నిమేషా

జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" (విద్యుద్వర్ణుఁడగు పరమపురుషునివలన సమస్తము లయిన నిమిషములు బుట్టినవి.) అనియు "స ఆపః ప్రదుఘే ఉభే ఇమే" (ఆపరమాత్మ అప్‌శబ్దోపలక్షితమైన భూతసముదాయమును సృజించి తరువాత ద్యులోకభూలోకములను సృజించెను" అనియు నీమొదలగు ఉత్తర వాక్యముల యందు ఆ పదార్థమే గదా జగత్తుయొక్క యుపాదాన కారణముగా వర్ణింపఁబడియె మఱియు "అద్భ్యః సంభూతో హిరణ్యాగర్భ ఇత్యష్టౌ" "హిరణ్యగర్భుఁడు ఉదకశరీరుఁడగు సర్వేశ్వరుని వలనఁ బుట్టెను. ఈ యెనిమిది ఋక్కులు (అనగా అంభస్యపారే" అను ఋక్కు మొదలుకొని "సర్వే నిమేషా జజ్ఞిరే" అను ఋక్కు వరకునుండు ఎనిమిది ఋక్కులు) విద్యుద్వర్ణాది లింగములతోఁ గూడుకొనిన భగవత్స్వరూపమును జెప్పుచున్నవి" యనెడి యుత్తరవాక్యమున్ను ఈసందర్భమునఁ జెప్పఁబడిన పరమపురుషుని జగత్కారణమునుగా సూచింపుచున్నవి. అయితె "తతో యదుత్తరతరం" అను వాక్యముయొక్క యర్థమేమని యడిగెదవేమో, చెప్పెదను.

ఇంతకుఁ బూర్వము "వేదాహమేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్" "తేజోరూపుఁడును, వ్యాపకుఁడును, అజ్ఞానమునకంటె నావలివాఁడునగు ఈ పరమపురుషుని నేను తెలిసికొంటిని" అనియు "తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతే ఉయనాయ" "ఆపరమపురుషుని ఇవ్విధమున నుపాసించు వాఁడు అమృతస్వరూపమగు మోక్షమును బొందుచున్నాఁడు. మోక్షమును బొందుట కింతకంటెను వేఱొక్క యుపాయములేదు" అనియును చెప్పుటచే పరమపురుషుని యుపాసించుటయే మోక్షసాధన మనియు అట్టిది మఱియొక్కటి లేదనియును ఉపదేశించి, ఈవిషయమును ఉపపాదించుటకై "యస్మాత్పరం నాపరమస్తి కిఞ్చిద్యస్మా న్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్ వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" అనఁగా "ఇట్టి పరమ పురుషునికంటె పరమయినదియు పూర్వమయినదియును మఱియొక్కటిలేదు. ఈతనికంటె చిన్నదియును పెద్దదియును మఱియొక్కటి లేదు ఈ పరమపురుషుడు వృక్షమువలె నిశ్చలుఁడయి ప్రకాశరూపమగు తన మహిమ యందు అద్వితీయుఁడై యున్నాఁడు. ఈ జగత్తంతయు నీపురుషునిచే వ్యాప్తమయి యున్నది." అనుటచే పూర్వవాక్యమునఁ జెప్పఁబడిన మహాపురుషునికంటె నితరమగు ఉత్కృష్టపదార్థ మెద్దియు నుండుట యసంభమనియును గూడ ప్రతిపాదించి, అనంతరము "తతో యదుత్తరతరం తదరూప మనామయం య ఏతద్విదురమృతాస్తే భవన్త్యథేతరే దుఃఖమేవాపియన్తి" అను వాక్యమున, పూర్వము ప్రతిపాదించిన విషయమును హేతుప్రదర్శన పూర్వకముగా

నిగమించుచున్నారు. అనఁగా ఏది యన్నింటిలో నెక్కువ గొప్పదయినదో, అదియే కర్మనిమిత్తమునఁ గలిగిన శరీరమును నామమును లేనిదియు, అందు వలనఁ గలుగు సుఖదుఃఖములు లేనిదియును, కావున అట్టి పరమపురుషతత్త్వమును ఉపాసించు వారును తాపత్రయ రహితులయి మోక్షమును బొందుచున్నారనియు, దానిని ఉపాసింపనివారు దుఃఖమునే బొందుచున్నారనియును చెప్పఁబడియే. కనుక "తతో యదుత్తరతరం" అను వాక్యమునకు (తతః= జగత్కారణముకంటె, యత్=ఏది, ఉత్తరతరం = ఇతరమయినదో—ఆ పరమాత్మకంటె నేది ఇతరమయిన వస్తువో, అని పూర్వపక్షి జెప్పిన అర్థము పూర్వోత్తర వాక్యార్థములతో విరోధించును.

"పరాత్పరం పురుషముపైతి" అను వాక్యమున కర్థమేమనఁగా, చెప్పెదను "అక్షరాత్ =అవ్యాకృతమున కంటెను (ప్రకృతికంటెను) ఎవఁడు, పరతః= పరుఁడగు సమష్టిపురుషుఁడో, వానికంటె, పరః=శ్రేష్ఠుఁడు అనఁగా అదృశ్యుఁడును, సర్వజ్ఞుఁడునగు పరమపురుషుఁడని "అక్షరాత్పరతః పరః" అను వాక్యము యొక్కయర్థము. ఈ వాక్యమునందు సమష్టిపురుషునికంటె పరుఁడుగాఁ జెప్పఁబడిన పరమపురుషుఁడే "పరాత్పరః" అను వాక్యమునఁ జెప్పఁబడుచున్నాఁడు అనఁగా "పరాత్ =ప్రకృతికంటెను పరుఁడగు సమష్టి పురుషునికంటెను, పరః= ఉత్కృష్టుఁడును అదృశ్యత్వ సర్వజ్ఞత్వాదిగుణ విశిష్టుఁడునగు పరమపురుషుఁడు" అని యర్థము.

## ౩౬॥ సూ॥ అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః

టీ॥ అనేన=పూర్వోక్త హేతువులనను, ఆయామశబ్దాదిభ్యః= వ్యాప్తిబోధకములగు శ్రుతిస్మృతుల వలననున్ను, సర్వగతత్వం=సర్వవ్యాపకత్వము (విజ్ఞాయతే= తెలియఁబడుచున్నది.)

తా॥ పూర్వము గానఁబఱచిన హేతువులవలనను, వ్యాప్తిబోధకములగు శ్రుతి స్మృతులవలననున్ను సర్వవ్యాపకత్వము తెలియఁబడుచున్నది.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మము అంతట నుండునది యనియు, సమస్త జగత్తున్ను బ్రహ్మముచే వ్యాపింపఁబడినది యనియును అట్టి వ్యాప్తిని తెలుపు శ్రుతి స్మృతులచేఁ దెలియవచ్చుటంజేసి పరబ్రహ్మముకంటె నుత్కృష్టమైనది వేఱొక్కటి లేదని యవగతమగుచున్నది. అట్టి శ్రుతిస్మృతు లేవియనిన, "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" (శ్వే. 3 అ. ౯ వా) (ఇది యంతయును ఆ పురుషునిచే వ్యాపింపఁబడియున్నది) అనియు "యచ్చకిఞ్చిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపివా అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"

(పురుషసూ) (నారాయణుఁడే జగత్తునందుండు దృశ్యమానములగు పదార్థముల యొక్కయు శ్రూయమాణములగు పదార్థములయొక్కయు అనఁగా అన్ని పదార్థముల యొక్కయు బాహ్యాభ్యంతర ప్రదేశముల యందంతటనున్ను వ్యాపించి యున్నాఁడు) అనియు "నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ము. ౧ ము. ౧ ఖ ౬ వా) (జ్ఞానులు సర్వభూతకారణుఁడగు పరమాత్మను శాశ్వతునిగాను, అంతటనుండు వానినిగాను, అన్నింటిలోను వ్యాపించియుండు వానినిగాను, అతి సూక్ష్మమయిన వానిని గానున్ను తెలిసికొనుచున్నారు." అను వాక్యముల వలన నట్లు తెలియుచున్నది. సూత్రమునందుండు "ఆది" శబ్దముచే "బ్రహ్మైవేదంసర్వం" (బృ. ౪అ-౫బ్రా ౧వా) (ఇదియంతయు బ్రహ్మసంబంధమయినది) "ఆత్మైవేదం సర్వం" (ఛా. ౭ప్ర-౨౧ఖ-౨వా) (ఇదియంతయు పరమాత్మ సంబంధమయినదే) అను నీమొదలగు వాక్యములనున్ను ఈసందర్భమున నుదహరించుకొనునది.

పరాధికరణము ముగిసెను.



## ఫలాధికరణము.

### ౩౭॥ సూ॥ ఫ ల మ త ఉ ప ప త్తేః.

టీ॥ అతః=సర్వేశ్వరునివలన, ఫలం=భోగాపవర్గాది రూపమగు ఫలము (భవితు మర్హతి = కలుగఁదగి యున్నది). ఏలననిన, ఉపపత్తేః=అట్లు ఉపపన్నమగుటవలన.

తా॥ భోగాపవర్గాదిరూపమగు ఫలము సర్వేశ్వరుని వలనఁ గలుగుచున్నది. సర్వేశ్వరుని వలననే గదా ఫలము గలుగుట సంభవము

శ్రీ॥ భా॥ పరమపురుషోపాసనమునం దిచ్ఛను గలుగఁజేయుటకై జీవుఁడన్ని యవస్థలయందును దోషయుక్తుఁడనియు, ప్రాప్యుఁడగు పరమపురుషుఁ డన్ననో, అట్లు దోషయుక్తుఁడు గాక, సమస్త కల్యాణగుణాకరుఁడనియు, అన్నింటికంటెను ఉత్కృష్టుఁడనియును ఇంతకుఁబూర్వము ప్రతిపాదింపఁబడియె. ఇప్పుడు ఉపాసనమును గుఱించి చెప్పఁదలఁచి, ఉపాసకు లీపరమపురుషుని వలననే పరబ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షమను ఫలమును బొందుచున్నారని చెప్పుచున్నారు. ఇట్లే శాస్త్రోక్తములగు ఐహికాముష్మికములగు ఫలాంతరములను గూడ నిచ్చువాఁడు పరమపురుషుఁడే యని తెలి

పూర్వాధికరణముతోఁ గల సంబంధము.

యవచ్చుచున్నది. కనుకనే సూత్రకారుఁడు ఈ పై సూత్రమున "ఇట్టిఫలము" అని ఫలవిశేషమును నిర్దేశింపక, సామాన్యముగా "ఫలం=ఫలము" అని చెప్పి యున్నాఁడు. ఏలఁననిన, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, మిక్కిలి యుదారుఁడునగు పరమపురుషుఁడు యాగ దాన హోమాదులచేతను, ఉపాసనము చేతనున్ను ఆరాధింపఁబడినవాఁడై ఐహికాముష్మికభోగములను, స్వస్వరూపావాప్తిరూప మగు మోక్షమునున్ను ఇచ్చుచున్నాఁ డనుట సంభవము గాని, అచేతన మును క్షణధ్వంసియునగు కర్మము కాలాన్తరభావియగు ఫలము నిచ్చుచున్న దనుట యెంతమాత్రము సంభవము గాదు గదా !

3౮॥ సూ॥ శ్రు త త్వా చ్చ.

టీ॥ శ్రుతత్వాచ్చ = శ్రుతులయందు వినఁబడుటవలనను (సర్వేశ్వరుఁడే ఫలము నిచ్చువాఁడు.)

తా॥ శ్రుతులను బట్టియును సర్వేశ్వరుఁడే ఫలము నిచ్చువాఁడని తెలియ వచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ వాజసనేయులు "స వా ఏష మహానజ ఆత్మా అన్నాదో వ సుదానః" (బృ.౬అ.౪బ్రా.౨౪వా) (ప్రసిద్ధమయినదియు, గొప్పదియు, పుట్టుక లేనిదియునగు పరమాత్మ అన్నము నిచ్చునదియు ధనరూపములగు కర్మఫలముల నిచ్చునదియును" అనియు, తైత్తిరీయులు "ఏష హ్యేవానందయాతి" (తై.ఆ.౭ -౧) (ఈ పరమాత్మ ఆనందము నిచ్చుచున్నాఁడు) అనియును పఠించుచు పరమపురుషుఁడేఁ బోగాపవర్గరూపములగు ఫలముల నిచ్చువాఁడని తెలియఁ జేయు చున్నారు.

అవతారిక:— ఈ విషయమును గుఱించిన పూర్వపక్షమును గానఁబఱు చుటకై:—

3౯॥ సూ॥ ధ ర్మం జై మి ని ర త ఏ వ.

టీ॥ అతఏవ = పూర్వపు హేతుద్వయము వలననే, ధర్మం = ధర్మమును (ఫలదాయకం=ఫలమునిచ్చు దానినిగా) జైమినిః=జైమిన్యాచార్యుఁడు, (మన్య తే = తలఁచుచున్నాఁడు.)

తా॥ ఉపపత్తిని బట్టియు, శ్రుతులను బట్టియును యాగదానాది రూప మగు దర్మమే ఫలమునిచ్చునదిగాఁ దెలియవచ్చుచున్నదని శ్రీజైమిన్యాచార్యుల వారు తలఁచుచున్నారు.

శ్రీ॥ భా॥ యాగ దాన హోమోపాసన రూపమగు కర్మమే స్వతంత్రముగ ఫలము నిచ్చునదియని శ్రీ జైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు. కర్మములు స్వయముగ ఫలము నిచ్చునని యగుట సంభవము. శాస్త్రము నయితము అట్లే తెలుపుచున్నది. ఎట్లనిన:—లోకమున కృష్యాది కర్మమును దానాది కర్మమును సాక్షాత్తుగాఁ గాని, పరంపరగాఁ గాని స్వయముగానే ఫలము నిచ్చునవి గాను గానఁబడుచున్నవి. అట్లే, వేదవిహితమగు యాగదాన హోమాది రూపమగు కర్మమున్ను, సాక్షాత్తుగా ఫలసాధనము గాకపోయినను, పరంపరగా అనఁగా అపూర్వద్వారా ఫలసాధనము గావచ్చును. "యజేత స్వర్గకామః" (స్వర్గముఁ గోఱువాఁడు యాగాదికర్మముల నొనర్పవలయును) అనెడి శాస్త్రవిధియును, స్వర్గప్రాప్తికిఁగాను యాగాది కర్మములను సాధనములనుగా నిర్దేశించుచు, నట్టి యాగాదికర్మము సాక్షాత్తుగ ఫల సాధనము గానందున, అపూర్వద్వారా యది ఫలసాధనమని తెలియఁజేయుచున్నది.

౪౦॥సూ॥ పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్

టీ॥ తు=పూర్వపక్షము యుక్తముకాదు. పూర్వం=పూర్వము చెప్పినట్లు సర్వేశ్వరుని, (ఫలహేతుం = ఫలప్రదాతనుగా) బాదరాయణః=బాదరాయణాచార్యుఁడు, (మన్యతే=తలఁచుచున్నాఁడు). ఏలననిన, హేతువ్యపదేశాత్ = శ్రుతులయందు హేతువును నిర్దేశించుటవలన.

తా॥ జైమిని చెప్పిన ప్రకారము అపూర్వము ఫలము నిచ్చునది కాదు. ఆయా శ్రుతివాక్యములయందు ఫలహేతువుగూడ నిర్దేశింపఁబడి యున్నందున, పూర్వము జెప్పఁబడినట్లు సర్వేశ్వరుని ఫలప్రదాతనుగా శ్రీ బాదరాయణాచార్యుఁడు తలఁచుచున్నాఁడు.

సిద్ధాంతము

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "తు" శబ్దము పూర్వపక్షము సరికాదని సూచింపుచున్నది. పూర్వము జెప్పిన ప్రకారము పరమపురుషుఁడే ఫలముల నిచ్చువాఁడని శ్రీ వేదవ్యాసులు తలఁచుచున్నారు. ఏలననిన, ఆయా యాగములను విధించునట్టి శ్రుతులయందే యట్టి హేతువు గాన్పింపఁబడినది. ఎట్లనిన, యాగశబ్దము "యజ దేవపూజాయాం" అనుధాతువునుండి పుట్టినది గాన యాగమనఁగా దేవతారాధన రూపమగు కర్మము. ఇట్లు ఆరాధన రూపములగు యాగములచే నారాధింపఁబడెడి వాయ్వాదిదేవతలే ఆ యాకర్మ ఫలముల నిచ్చునవి గాను "వాయవ్యం శ్వేతమాలభేత భూతికామో వాయుర్వై క్షేపిష్ఠా దేవతా వాయుమేవ స్వేన భాగధేయేనోపధావతి స

ఏవైనం భూతిం గమయతి" ఇత్యాది శ్రుతి వాక్యములు "ఐశ్వర్యమును గోరువాఁడు వాయుదేవతాసంబంధమగు శ్వేతపశువును జంపి యజ్ఞమును జేయనలయును. వాయువు గదా వేగవంతమగు దేవత. ఈ యజమానుఁడు వాయువును తనభాగముతో ననుసరింపఁగా, వాయువు ఈతనికి ఐశ్వర్యమును గలుగఁజేయుచున్నది" అని యివ్విధమునఁ జెప్పుచున్నవి. ఇందువలన ఫలేచ్ఛ గలవారలు తాము కోరు ఫలములను బొందునట్టి విధములనుగుఱించిన ఉపదేశముగూడ అట్టి ఫలములను విధించునట్టి వాక్యములనే యపేక్షించి యుండు నదిగాన, నది యట్టిది గాదని శంకించుట కవకాశము లేదు.

ఇట్లు శ్రుతులనుండియే ఫలమును బొందునట్టి విధ మిద్దియని తెలియవచ్చుచుండ, దీనిఁ బరిత్యజించి శ్రుతులయందెచటను జెప్పఁబడని యపూర్వకల్పనను ప్రామాణికు లెవ్వరు నంగీకరింపరు. విధివాక్యముల యందుండు "లిఙ్" ఈ మొదలగు విధ్యర్థక ప్రత్యయములును, వ్యుత్పత్తిసిద్ధముగాను, వ్యాకరణశాస్త్రసిద్ధముగానును. ప్రకృత్యర్థ మయినదే కర్తృవ్యాపార సాధ్యమని తెలియఁజేయుచున్నవి. అట్టిది దేవతారాధన భూతమగు యజ్ఞాది కర్మమేగాని, యది లోక ప్రసిద్ధముకాని యపూర్వము కాదని యింతకుఁ బూర్వమే ప్రతిపాదింపఁబడియెను. కావున "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" ఇత్యాది వాక్యములవలన వాయువు మొదలగునవియే ఫలము నిచ్చునవియని తెలియవచ్చుచున్నది. అప్పుడును, వాయ్వాదుల కంతరాత్మగానుండు సర్వేశ్వరుఁడే యీ కర్మములచే నారాధింపఁబడుచుండుననియు, ఆతఁడే కర్మ ఫలములనుగూడ ఇచ్చువాఁడనియును శ్రుతులవలనఁ దెలియవచ్చుచున్నది. ఎట్లనిన: "ఇష్టాపూర్తం బహుధా జాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్య నాభిః తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః" అనుయజుర్వేదవాక్యము "ఈ జగత్తున కంతకు నాధారభూతుఁడగు సర్వేశ్వరుఁడే శ్రౌతస్మార్తకర్మములను తన కారాధనములనుగా స్వీకరించుచున్నాఁడు. వాఁడే అగ్నియును (అగ్న్యంత రాత్మయును), వాఁడే వాయువును (వాయ్వంతరాత్మయును), వాఁడే సూర్యుఁడును (సూర్యాంతరాత్మయును)" అని చెప్పుచున్నది. అంతర్యామి బ్రాహ్మణమునఁగూడ "యో వాయౌ తిష్ఠన్" (ఎవఁడు వాయువునందు ఉన్నాఁడో) అనియు, "యస్య వాయుశ్శరీరం" (ఎవనికి వాయువు శరీరమో) అనియు "యో ఽగ్నౌ తిష్ఠన్" (ఎవఁడు అగ్నియందు ఉన్నాఁడో) అనియు "య ఆదిత్యే తిష్ఠన్" (ఎవఁడు సూర్యునియందున్నాఁడో) అనియు నిట్టి మొదలగు వాక్యములును అట్లే తెలుపుచున్నవి.

అట్లే స్మృతియందును,

"శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥"

(భ. గీ. ౭ అ. ౨౧ శ్లో.)

తా॥ ఎవఁడెవఁడు నాకు శరీరమగు దేవతయెడల భక్తిగలవాఁడగుచు, శ్రద్ధతోఁ బూజింపఁ గోరుచుండునో, వాని వాని శ్రద్ధను నిర్విఘ్నమైన దాని నిగాఁ జేయుచున్నాను.

"శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ "॥

(భ. గీ. ౭ అ. ౨౨ శ్లో.)

తా॥ వాఁడు అట్టి శ్రద్ధతోఁ గూడిన వాఁడై యాదేవతనారాధింపు చున్నాఁడు. అందువలన నాచేఁగలుగఁ జేయఁబడినట్టివియు, తనచేఁ గోరఁ బడినట్టియునగు ఫలములను బొందుచున్నాఁడు.

"శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవచ॥"

(భ. గీ. ౯. అ౨౪ శ్లో.)

తా॥ ఓ అర్జునా! నేనే సమస్తయజ్ఞములచే నారాధింపఁబడువాఁడను. నేనే ఫలముల నిచ్చువాఁడను.

"శ్లో॥ దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥"

(భ. గీ. ౭ అ.౨3 శ్లో)

తా॥ ఇంద్రాది దేవతల నారాధించువారు ఇంద్రాది దేవతలను బొందు చున్నారు. నాయందు భక్తిగలవారలు నన్ను బొందుచున్నారు.

"శ్లో॥ యాన్తి మద్యాజినోపిమాం॥" (భ. గీ. ౭ అ ౨౫ శ్లో)

తా॥ నన్ను ఆరాధించువారును నన్ను పొందుచున్నారు.

మఱియు లోకమునందును జనులు కృష్యాదిమూలముగ నానావిధ ద్రవ్యములను సంపాదించి తమను పాలించునట్టిరాజును భృత్యులద్వారా గాని స్వయముగ గాని ఆద్రవ్యములఁ గొని పూజించుచున్నారు. అట్లు వారిచేఁ బూజింపఁబడిన రాజు వారి వారి పూజలకుఁ దగినట్లు ఫలముల నొసంగు చున్నాఁడు గదా! అట్లే వేదాంతములును "పరమపురుషుఁడు ఇతర ప్రమాణములచేఁ దెలియ శక్యము కానివాఁడనియు, సమస్తములగు నవిద్యాది దోషము లెంతమాత్రము లేనివాఁడనియు, స్వాభావికములును, మితిలేని యతి

శయము గలవియును, లెక్కలేనివియునగు సౌదార్యాదిగుణములు గలవాఁడని యును ప్రతిపాదించి, యాగ దాన హోమాత్మకములగు కర్మములు, స్తుతి, నమస్కారము, కీర్తనము, పూజ, ధ్యానము ఇవియన్నియు అట్టి పురుషోత్తముని యారాధనములనియు, వానిచే నారాధింపఁబడిన పురుషోత్తముఁడును భోగాపవర్గ రూపములగు ఫలముల నిచ్చుచున్నాఁడనియును జెప్పుచున్నవి. కావున నిందెద్ది యును దోషము లేదు.

ఫలాధికరణము ముగిసెను



గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వర సన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణ తార్తి హరాచార్యకృపాపాత్ర, శ్రీపేరుళాళిరామా జయతివరపరమాను గ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేఙ్కటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరు దాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు తృతీయాధ్యాయమున ద్వితీయపాదము.









# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము.

## తృతీయాధ్యాయము—తృతీయపాదము.

### సర్వవేదాన్త ప్రత్యయాధికరణము

**౧॥ సూ॥ సర్వవేదాన్త ప్రత్యయం చోదనాద్యవిశేషాత్**

టీ॥ చోదనాద్యవిశేషాత్ = చోదనాదుల సామ్యమును బట్టి, సర్వవేదాంత ప్రత్యయం = సమస్త వేదాంతములయందు ప్రతీయమానమగు నుపాసము. (ఏకమేవ = ఒక్కటియే)

తా॥ చోదనాదు లొక్కవిధమయిన వగుటంజేసి, యుపనిషత్తులయందంతటను ప్రతిపాదింపఁబడునట్టి యుపాసనము ఒక్కటియే.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మోపాసనమునం దిచ్ఛను గలుగఁజేయుటకై యందులకు ఉపయుక్తమగు నదంతయును అనఁగా ఉపవాసకులుగోరు ఫలముల నిచ్చువాఁడును సర్వేశ్వరుఁడే యనువరకును ద్వితీయపాదమునఁ జెప్పఁబడియె. ప్రకృతమున, ఉపనిషత్తులయం దచ్చటచ్చట ఉపాసములను విధించుసందర్భమునఁ జెప్పఁబడిన గుణములు వేఱొక్క తావునఁగూడ గ్రహింపఁదగినవనియు, ఇందు విధింపఁబడునట్టి యుపాసనములలో దేని ననుష్ఠించిన నొక్కటియే యనియును ప్రతిపాదించుటకై ప్రస్తుతమున నిందుఁగాన్పింపఁబడినట్టి యుపాసనములు భిన్నములా ? అభిన్నములా ? అనెడి యంశమును గుఱించి విచారించుచున్నారు.

ద్వితీయపాదముతోఁగల సంబంధము.

## సంశయము

వైశ్వానరోపాసనము మొదలుగాఁగల యుపాసనము అనేక శాఖల యందు ఉపదేశింపఁబడుచున్నది. ఒక శాఖయందు ఉపదేశింపఁబడిన వైశ్వానరాద్యుపాసనము శాఖాంతరమునందు ఉపదేశింపఁబడిన దానికంటె భిన్నమయినదా? లేక, అన్ని శాఖలయందును ఉపదేశింపఁబడు వైశ్వానరాద్యుపాసన మొక్కటియేనా?

## పూర్వపక్షము

ఒకతడవ ఉపదేశించిన యుపాసనమునే మఱియొకచోట గూడ ఆ రీతిగానే యుపదేశించుటను బట్టియు, ప్రకరణభేదమును బట్టియు, శాఖాంతరముననో యీ రెండును తప్పక యుండుటను బట్టియును ఉపాసనములకు పరస్పరము భేదము గలదని తెలియుచున్నది.

అట్లగునేని, "తేషామేవ బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణం" అనువాక్యమున "శాస్త్రప్రకారము (1) శిరోవ్రతము నాచరించిన వారలకు బ్రహ్మవిద్యనుపదేశింపవలయును" అని విధింపఁబడిన బ్రహ్మవిద్యోపదేశనియమము ఆథర్వణికులకు మాత్రమే యని చెప్పుట పొసగును.

అట్లు కాకున్న, అనఁగా, ఆథర్వణిక శాఖయందు విధింపఁబడిన బ్రహ్మోపాసనము శాఖాంతరమునందు విధింపఁబడిన దానికంటె భిన్నము గాదనియు, బ్రహ్మోపాసన మన్ని శాఖలయందు నొక్కటియే యనియు నంగీకరించు పక్షమున, ఈ పైవాక్యమున నుపాసనాంగముగ విధింపఁబడిన శిరోవ్రత మాథర్వణికులకువలె నితర శాఖలవారికిఁ గూడ ఉపాసనాంగము గావలసివచ్చును. కావున నది యాథర్వణికులకు మాత్రమే యనెడి నియమము ఉపపన్నము గాదు. ఈ హేతువును బట్టి ఆథర్వణిక శాఖయందు విధింపఁబడిన బ్రహ్మోపాసనము నితర శాఖలయందు విధింపఁబడిన బ్రహ్మోపాసనముకంటె భిన్నమయిన దానినిగా గ్రహింపవలయును. కనుక నొక శాఖయందు విధింపఁబడిన యుపాసనము శాఖాంతరమున విధింపబడిన యుపాసనముకంటె భిన్నమయినదని సిద్ధమగుచున్నది.

## సిద్ధాంతము

ఇట్లు చెప్పుట యుక్తము గాదు. ఉపనిషత్తులం దన్నిచోట్లను విధింపఁబడినట్టి యుపాసన మొక్కటియే. ఏలననిన, ఉపాసనమును విధించువాక్యములలో

(1) శిరస్సున నంగారపాత్ర నుంచుకొని యనుష్ఠింపఁబడునట్టి యొక విధమయిన వ్రతము.

"విద్యాత్" అనియు "ఉపాసీత" అనియు నివ్విధములగు చోదనాదులు ఏక రూపములయినవి. సూత్రమునందుండు "ఆది" శబ్దముచే పూర్వమీమాంసా ప్రసిద్ధములగు సంయోగ రూప చోదనాఖ్యలను గూడ గ్రహించునది.

[1]ఛందోగులును వాజసనేయులును "వైశ్వానర ముపాస్తే" అని ప్రయోగించియున్నందున ఈ రెండుతావులను చోదన (ప్రేరణ) ఏకరూపమైనది. ఇచట నుపాస్యవస్తువగు వైశ్వానరుడును ఒక్కడే యయినందున స్వరూపమునను భేదములేదు. "వైశ్వానరవిద్య" యనెడి పేరును రెండుతావుల నొక్కటియే. మఱియు నీరెండుతావులను బ్రహ్మప్రాప్తిరూపమగు ఫలమొక్కటియే గాన నందును భేదములేదు. ఇట్లు ఈ రెండుతావులను విధింపఁబడు ఉపాసన మొక్కటి గానే గుర్తింపఁబడినందున, శాఖాభేద మున్నను, అందు విధింపఁబడు ఉపాసనమున భేద ముండజాలదు.

అవతారిక:—ఒక తడవ విధించిన ఉపాసనమును మరల ఆ ప్రకారము గానే విధించుటవలనను, ప్రకరణభేదము వలననున్ను ఉపాసనమునందుఁగూడ భేదముండునని పూర్వపక్షి చేసిన వాదమును అనువదించి, పరిహరించుటకై.

౨॥ సూ॥ భేదాన్నేతి చేదేకస్యామపి.

టీ॥ భేదాత్ = విశేషము లేకుండ మరల ఉపదేశించుట వలనను, ప్రకరణ భేదము వలననున్ను, న=విద్యైక్యము లేదు, ఇతిచేత్ =ఇట్లంటివేని, ఏకస్యామపి=ఒక్కటియే విద్యయందు (ఉపాసనమున)గూడ (విశేషము లేకుండ మరల ఉపదేశించుటయు, ప్రకరణ భేదమున్ను) ఉండవచ్చును,

తా॥ ఒకతడవ ఉపదేశించిన ఉపాసనమునే మరల ఎద్దియు విశేషము లేకుండ ఉపదేశించుటను బట్టియు, ప్రకరణ భేదమునుబట్టియు ఉపాసనైక్యము లేదంటివేని, యది యుక్తము కాదు. ఏలననిన, యొక్కటియే విద్యయందు నవి యుండవచ్చును గదా!

శ్రీ॥ భా॥ ఒకతావున విధించిన యుపాసనమును మరల వేఱొక్కతావున నింతకుఁ బూర్వము విధించిన ప్రకారము గానే విధించుటవలనను, ప్రక

(1) ఒక శాఖయందు విధింపబడిన కర్మముకంటె శాఖాంతరమునందు విధింపఁబడిన కర్మము శాఖాభేదమును బట్టి భిన్నమయినదా? కాదా? యని శంకించి, కర్మమును విధించుశబ్దమున్ను కర్మముయొక్క పేరున్ను యీ మొదలగునవి రెండు శాఖలయందును సమానములే యయినందున శాఖాభేదమున్నను కర్మమొక్కటియే యని "ఏకం వా సంయోగ రూపచోద నాఖ్యా విశేషాత్" అను సూత్రముచె పూర్వమీమాంసాశాస్త్రమున నిర్ణయించిన ప్రకారము, వేదాంతమునందును ఛాందోగ్య వాజసనేయి శాఖాలయందు వైశ్వానరాద్యుపాసనములను విధించు సందర్భమున సంయోగరూప చోదనాఖ్యలు సమానము లయినందున, శాఖాభేదమున్నప్పటికిన్ని, ఉపాసన మొక్కటియే యనుట యుక్తము.

రణభేదము వలననున్ను ఉపాసనమునఁగూడ భేదముండునని యంటివేని, యది యుక్తము కాదు. ఎట్లన, యుపాసన మొక్కటియే యయినను, ఒక ఋషి ఒక చోట ఒక ప్రకరణమునందు ఒక శిష్యునికై విధించిన దానినే మఱియొక చోట మఱియొక ప్రకరణమునందు మఱియొక శిష్యునికై విధింపవచ్చును. ఇట్లు రెండు చోట్లను ఉపదేశింపఁబడు శిష్యుఁడు భిన్నుఁడయినందున, ఒకచోట ఒక ప్రకరణమునందు విధింపబడిన యుపాసనము వేఱొక్కచోట గూడ మరల విధింపఁబడుచున్నదే గాని, యది యుపాసనమునఁ భేదముండుటవలనఁ గాదు. అయితే ఉపదేశింపఁబడు శిష్యుఁడొక్కఁడేయయి, ఆతనికై ఒకచోట ఒక ప్రకరణమునందు విధించిన యుపాసనమునే మఱియొక చోట మఱియొక ప్రకరణమునందు మరల విధించియున్నట్టి చోట మాత్రము ఉపాసనమున భేద మున్నదనవచ్చును.

అవతారిక :—అన్ని శాఖలయందును విధింపఁబడు ఉపాసన మొక్కటియే యగుపక్షమున ఆధర్వణిక శాఖయందు ఉపాసనాంగముగ విధింపఁబడిన శిరోవ్రత మితరశాఖలయందును గూడ ప్రాప్తించునని పూర్వపక్షి చేసిన వాదమును నిరసించుటకై.

3॥ సూ॥ స్వాధ్యాయస్యతథాత్వేహి సమాచారేఽ
ధికారాచ్చ సవవచ్చ తన్నియమః

టీ॥ స్వాధ్యాయస్య=వేదాధ్యయమునకు (శిరోవ్రతధర్మః = శిరోవ్రత మంగము. ఏలయన) తథాత్వేహి=ఒక సంస్కారమును గలుగఁజేయుటకైయే గదా, సవవత్=సప్తసూర్యాదిహోమమువలె, తన్నియమః=శిరోవ్రతము నియమింపఁబడినదని, సమాచారే=సమాచారమను నాథర్వణిక గ్రంథమునందు అధికారాచ్చ =అతిదేశించియున్నందున (తెలియుచున్నది)

తా॥ వేదాధ్యయనమునకొక సంస్కారమును గలుగఁజేయుటకై శిరోవ్రతము నియమింపఁబడినట్లు ఆథర్వణికులు దీనిని సమాచారమను గ్రంథమున వేదవ్రతమునుగా నతిదేశించుటచేఁ దెలియుచున్నది. అ దెటువలెననిన, సప్తసూర్యాది హోమము లాధర్వణికులకు మాత్రమే ఏకాగ్నియందు విధింపఁబడినట్లు ఇదియును వారికి మాత్రమే వేదాధ్యయనాంగముగ విధింపఁబడవచ్చును.

శ్రీ॥ భా॥ ఆధర్వణిక శాఖయందు ఉపాసనాంగముగ విధింపబడిన శిరోవ్రత మనఁబడు ఉపదేశ నిఃపమమువలనను, శాఖాభేదమువలనను ఉపాసనమునఁ గూడ భేద మున్నట్లు సిద్ధించునని పూర్వపక్షి చేసిన వాదము యుక్తమయినది కాదు. ఏలయన, ఆధర్వణిక శాఖయందు శిరోవ్రత ముపాస

సాంగముగ విధింపఁబడలేదు. ఏలననిన, ఆథర్వణికులు వేదాధ్యయనమున కొక విధమగు సంస్కారమును గలుగఁజేయుటకై దీనిని విధించియున్నారే గాని, ఉపాసనమునకై విధించి యుండలేదు. కనుకనే "నైతదచీర్ణవ్రతో ఽధీయీత" అనఁగా, "శిరో వ్రతము నాచరింపని మానవుఁడు వేదముల నభ్యసింపఁ గూడదు" అను శాస్త్రవిధియందు శిరోవ్రతము వేదాధ్యయనముతో సంబంధించినదిగాను కానఁబడుచున్నది. మఱియు "సమాచారము" అను ఆథర్వణిక శాఖా సంబంధమయిన నొక గ్రంథమునందు దీనిని వేదవ్రతమునుగాఁ జెప్పియున్నారు. ఇందువలన "బ్రహ్మవిద్యాం వదేత" అను ఆథర్వణికుల వాక్యమునందలి "బ్రహ్మవిద్యా" పదమునకు "వేదవిద్య" అని యర్థము. అయితే యీ వాక్యము ఆథర్వణికులకు మాత్రము శిరోవ్రతమును వేదాధ్యయనాంగమునుగా నెట్లు విధింపవచ్చు ననిన, చెప్పెదను. (1)సప్త సూర్యహోమములు మొదలుకొని శతౌదన హోమము పర్యంతము విధింపఁబడిన సవహోమముల నాథర్వణికులు ఏకాగ్నియందు మాత్రము హోమము జేయవలయుననియు వాటిని త్రేతాగ్నులయందు హోమము జేయఁగూడదనియు నొక నియమ ముండలేదా? అట్లే శిరోవ్రతము గూడ ఆథర్వణికులకు మాత్రము వేదాధ్యయనముతో సంబంధించిన యొక నియమ మని గ్రహించునది.

## ౪॥ సూ॥ ద ర్శ య తి చ.

టీ॥ దర్శయతిచ=శ్రుతియును విద్యైక్యమును బ్రదర్శింపుచున్నది.

తా॥ శ్రుతియందును విద్యైక్యము గాన్పించుచున్నది.

శ్రీ॥ భా॥ వేదాంతముల యందన్నితావులను విధింపఁ బడునట్టి యుపాసన మొక్కటియం యని శ్రుతియందే గాన్పించుచున్నది. ఎట్లనిన, ఛందోగులు దహర విద్యను గుఱించి ప్రస్తావించి "తస్మిన్ యదన్తస్తదన్వేష్టవ్యం"(ఛాం-౮ప్ర ౧-ఖ. ౧వా) (ఆ దహరాకాశములో నెద్ది కలదో, దానిని శ్రవణమననాదులచే దెలసికొన వలయును) అనిచెప్పి, తరువాత "కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం" (అట్టిదహరాకాశమునందు శ్రవణ మననాదులచేఁదెలిసికొనదగినది యేమున్నది?) అని శంకించి, యనంతరము అపహతపాప్మము, సత్యసంకల్పము మొదలగు నెనిమిది గుణములతోఁ గూడుకొనినట్టి పరమాత్మ నచట నుపాసింపవలయునని విధించి యున్నారు. తైత్తిరీయులు గూడ ఈ విద్యను గుఱించి చెప్పునపుడు ఛందోగులు చెప్పినదానినే యవలంబించి "తత్రాపి దహ్రం గగనం విశోకః

(1) ఆరోగహోమము, భ్రాజహోమము, పటరహోమము, పతంగహోమము, స్వర్ణరహోమము, జ్యోతిర్షద్హోమము, విభాసహోమము అనునవి సప్తసూర్యహోమము లనఁబడుచున్నవి.

తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యం" (తై. నా. ౧౨. అను) (అందును సూక్ష్మ మగు నాకాశము గలదు. అందు శోకరహితమైన దెద్దిగలదో దాని నుపాసింపుము) అని యారంభించి, ఛాందోగులు ఉపాస్యునిగా నుపదేశించినట్టియు అష్ట గుణవిశిష్టుఁడు నగు పరమాత్మనే తాము గూడ ఉపాస్యునిగా నుపదేశించి యున్నారు. ఇట్లు ఒక శాఖయందుఁ జెప్పఁబడిన యుపాస్యగుణములనే శాఖాంతరమునఁ గూడ చెప్పుట విద్యైక్యమున్నచో సంభవ మగును. కనుక నన్ని శాఖలయందును విధింపఁబడునట్టి యుపాసన మొక్కటియే యని సిద్ధమగుచున్నది.

అవతారిక:—ఇట్లు శాఖాంతరాధికరణ న్యాయములవలనఁ దెలియ వచ్చునట్టి విద్యైక్యమును స్థిరపఱచి అందువలనఁ బ్రయోజనమును దెలియఁ జేయుటకై.

౫॥ సూ॥ ఉపసంహారోఽర్థా భేదాద్విధి శేషవత్సమానేచ.

టీ॥ సమానే-చ=ఉపాసన మొక్కటి యగునపుడు, ఉపసంహారః=అన్య శాఖోదితములగు గుణములను ఉపసంహరించుకొనవలయును. ఏలననఁగా, అర్థా భేదాత్=ప్రయోజనైక్యమువలన, విధిశేషవత్=ఒకచోట ఉపాసనాంగము లుగా విధింపఁబడిన గుణములవలెనే.

తా॥ ఇట్లు ఉపనిషత్తులయం దంతటను, ఉపాసన మొక్కటియే యగు నపుడు, ఒక్క యుపనిషత్తునందుఁ జెప్పఁబడిన గుణములను వేఱొక్క యుపనిషత్తునందు ఉపసంహరించుకొనవలయును. ఏలననఁగా, విధిశేషమువలెఁ బ్రయోజనమునందు భేదములేదు గదా!

శ్రీ॥ భా॥ ఇట్లు అన్ని శాఖలయందును వైశ్వానరాద్యుపాసనములు సమానము లగునపుడు అనఁగా, సమాన నామములు గలవియును, సమాన ఫలము నిచ్చు నవియు నగునపుడు, ఒకశాఖ యందుఁ జెప్పఁబడిన గుణ ములను వేఱొక్క శాఖయందును సయితము గ్రహించుట యవశ్యకర్తవ్యము. అదెటువలెననిన, ఏదయిన నొక శాఖయందలి దహరాద్యుపాసన ముల కంగముగ విధింపఁబడిన గుణము లాయుపాసనములతో సంబంధించి యుండుటచే వాని కవి యొక విధమగు నుపకారము నొనర్చుచున్నవనెడి ప్రయోజనమును బట్టియే గదా ఆ యాగుణము లాయా యుపాసనముల యందు గ్రహింపఁ బడుచున్నవి. అట్లే ఆ గుణములు శాఖాంతరమునందు పఠింపఁబడినను, ఆయా యుపాసనములతో సంబంధించి యుండుటచే నచటను గూడ అవి ఆయా యుపాసనముల కొక విధమయిన యుపకారము నొనర్చునవి

యగుట సమానమే గాన, నవి యుపసంహరించుకొనవలసినవియే. సూత్రము నందుండు "చ" కారము అవధారణమును తెలుపునది.

సర్వవేదాన్త ప్రత్యయాధికరణము ముగిసెను.



## అన్యథాత్వాధి కరణము.

### ౬॥ సూ॥ అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్.

టీ॥ శబ్దాత్ =శ్రుతివాక్యమువలననే, అన్యథాత్వం = (బృహదారణ్యక ఛాందోగ్యశాఖలలో విధింపఁబడిన యుద్గీథ విద్యలకు) భేదము(స్యాత్ =అగును) ఇతిచేత్ =ఇట్లంటివేని, న=అట్లు చెప్పరాదు. ఏలననఁగా, అవిశేషాత్ = బహుతరవిషయ సామ్యముండుటవలన,

తా॥ ఛాందోగ్యవాజసనేయి శాఖలలో విధింపఁబడిన ఉద్గీథోపాసనముల రూపాదులకు భేదముండుటంజేసి, యవి భిన్నములని శ్రుతులనుండియే తెలియవచ్చుచున్న దంటివేని, యట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఆ యుపాసనములతో సంబంధించిన చోదనాద్యనేక విషయములు సమానములుగా నుండు నట్లు గన్పట్టుచున్నవి గదా !

శ్రీ॥ భా॥ ఇట్లు అన్ని శాఖలయందును చోదనాదులు భిన్నములు కానందున, విద్యలును భిన్నములు కావనియు, విద్యలు భిన్నములు కాకుండుటను బట్టి యీ విద్యల కంగములుగా నొకశాఖయందు విధింపఁబడిన గుణములను, శాఖాంతరమునందు సమితము, ఆ విద్యలే విధింపఁబడునపుడు, ఉపసంహరించుకొనవలయు ననియును పూర్వాధికరణమున సామాన్యముగాఁ బ్రతిపాదింపఁబడియె. ఇప్పుడు విద్య యొక్కటియేయని గుర్తించుటకు సాధనమగు సాద్యభేదము కొన్నివిద్యల విషయమై కలదా? లేదా? అనెడి యంశమును విచారించి నిర్ణయించుచున్నారు.

కడచిన అధికరణముతోఁగల సంబంధము.

వాజసనేయులును ఛందోగులును తమతమ శాఖలయందు ఉద్గీథోపాసనమును విధించి యున్నారు. వీరిలో వాజసనేయులు "ద్వయాహ ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ" (బృ. 3అ. 3బ్రా. ౧వా) అను వాక్యమున "దేవతలును అసురులును వీరు ఉభయులును ప్రజాపతియొక్క పుత్రులు" అని యివ్విధమునఁ జెప్పనారంభించి "తే హ దేవా ఊచుః హన్తాసురాన్ యజ్ఞఉద్గీథేనా

త్యయామ” అను వాక్యమున “వారిలో దేవతలు (అసురులచే తిరస్కరింపఁ బడి) అసురులను యజ్ఞమునందు ఉద్గీథవిద్యచే జయించెదము” అని తలంచి అసురనాశనమునకై ప్రతిజ్ఞచేసి, అందులకై చేయఁబడు యజ్ఞమునందు ఉద్గీథ మును, (ఓంకారమును) వాక్కు మొదలు మనస్సువరకు శ్రుతియందుఁ బేర్కొనఁ బడిన వానిలో దేనినిగా భావించి యుపాసించినను, అసురులచేఁ దిరస్కారము గలుగునని తలంచి “అథ హేమ మాసన్యం ప్రాణమూచుః” అను వాక్యమున “పిమ్మట వారు ముఖ్యప్రాణముతో నిట్లు చెప్పిరి” అనుచు ఉద్గీథమును ముఖ్యప్రాణమునుగా భావించి యుపాసన చేయుటచే అసురులు తిరస్కరింపఁబడి యును చెప్పి, యనంతరము “భవత్యాత్మనా పరాస్యద్విషన్ భ్రాతృవ్యో భవతి య ఏవం వేద” అను వాక్యమున “ఇట్లు ఉద్గీథమును ముఖ్యప్రాణమునుగా భావించి యుపాసనము ననుష్ఠించువాఁడు మంచి మనస్సు గలవాఁడగుచున్నాఁ డనియు ఇతనిని ద్వేషించువాఁడు అసురులవలె పరాభవమును బొందుచున్నాఁ డనియు, నిట్లు ఈ విద్యను దెలిసికొనినవాఁడును దీని ననుష్ఠించిన వాఁడు పొందు నట్టి ఫలమును బొందుచున్నాఁడనియును జెప్పుచు శత్రుపరాజయ రూపమగు ఫలమునకై ఉద్గీథమునందు ప్రాణదృష్టిని విధించియున్నారు అనఁగా నుద్గీథ మును ముఖ్యప్రాణమునుగా భావించి యుపాసింపవలయునని విధించియున్నారు.

ఇట్లే ఛందోగులను “దేవాసురా హ వై యత్ర సంయేతిరే” (ఛా.౧ప్ర. ౨ఖ.౧వా) అనువాక్యమున “దేవతలును అసురులును వీరు ఉభయులును యుద్ధ సన్నద్ధు లయిరి”అని యుపక్రమించి “తద్ధ దేవా ఉద్గీథ మాజహ్రు రనేనైనా నభి హనిష్యామ” అను వాక్యమున “దేవతలు ఉద్గీథమును సంపాదించి దానిచే నసురు లను పరిభవించెదము” అని నిశ్చయించి రనుచు వాజసనేయులు పఠించిన ప్రకా రము ఉద్గీథమును వాగాదీంద్రియములలో దేనినిగా భావించి యుపాసించినను, యవి యసురులచే బరిభవింపఁబడినందున “అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణః తముద్గీథ ముపాసాంచక్రిరే” ఇత్యాది వాక్యమున “అంతట వారు ఉద్గీథమును ప్రాణభావనతో నుపాసించి రనుటచే నందు మూల మున నసురపరాభవమును జెప్పి, పిమ్మట “యథా శ్మాన మాఖణం ఋత్వా విధ్వంసతే ఏవం హైవ స విధ్వంసతే య ఏవంవిది పాపం కామయతే” అను వాక్యమున “మట్టిగడ్డ రాతితో రాసుకొని తానే నశించిపోవునట్లు, ఈ ముఖ్యప్రాణము నుపాసించువానిని ద్వేషించుట కిచ్ఛయించువాఁడును నశించుచున్నాఁడు” అని చెప్పుచు శత్రు పరాభవమునకై ఉద్గీమథను ప్రాణ దృష్టితో నుపాసింపవలయునని విధించి యున్నారు.

ఈ పైని యుదహరించిన శ్రుతివాక్యములయందు ఉద్గీథవిద్యానుష్ఠా నమే విధింపఁబడినదై, అట్టివిద్యను గుఱించిన జ్ఞానముగూడ విధింపఁబడకపోయి

నను, అట్టి విద్యను దెలిసికొనినవాఁడును దాని ననుష్ఠించినవాఁడు పొందునట్టి ఫలమును బొందునట్లు చెప్పి యున్నందున, దానివిషయమగు జ్ఞానము సయితము ఈ తావున విధింపఁబడినట్లు ఊహింపవచ్చును. అయితే యుద్గీథవిద్య క్రత్వర్థము విధింపఁబడి యున్నందున క్రతువు కొక యతిశయమును గలుగఁ జేయుటయే యందువలనఁ గలుగు ఫలమైనను, ఆ విద్యను స్తుతి జేయుటకు గాను జెప్పఁబడిన ఫలమును సయితము, విరోధము లేనిచో, గ్రహింపఁదగునని దేవతాధికరణమునఁ బ్రతిపాదింపఁబడియెను. ఈసందర్భమున నొక సంశయము గలుగుచున్నది.

—•—సంశయము—•—

ఈ యుభయ శాఖలయందును విధింపఁబడు ఉద్గీథోపాసన మొక్కటియేనా? లేక, అవి వేఱు వేఱయినవా?

—•—పూర్వపక్షము.—•—

ఈ యుభయ శాఖలయందును ఉద్గీథమునే ప్రాణదృష్టితో నుపాసింపుమని విధించి యున్నందున చోదనాదులకు భేదము లేదు. ఎట్లనిన, శత్రుపరాజయమునే యుద్గీథోపాసనమునకు ఫలముగ రెండు తావులఁ జెప్పియున్నారు గాన, ఫలమున భేదము లేదు. రెండుచోట్లను ఈ విద్య "ఉద్గీథవిద్య" యనియే పిలువఁబడుచున్నందున, పేరును బట్టియు భేదము లేదు. ఇందు ప్రాణభావనతో నుపాసింపఁబడు ఉద్గీథమునందు భేదము లేనందున ఉపాస్యవస్తువున్ను ఒక్కటియే. కావున, నిందు స్వరూపభేదమున్ను లేదు. రెండు తావులను "య ఏవం వేద" అను తావున "విది" ధాతువువలనఁ దెలుపఁబడు చోదనయు నొక్కటియే. పైని గనఁబఱచిన ప్రకారము చోదనాదులయందు భేదము లేనందున నీరెండు శాఖలయందును విధింపఁబడునట్టి యుద్గీథవిద్య యొక్కటియే యనుట యుక్తము.

శంక:—వాజసనేయులు "అథ హేమమాసన్యం ప్రాణమూచుః త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్" (అంతట వారు మాకు గాను ఉద్గీథమును గానము చేయుమా! యని ప్రాణము నడుగఁగా, ప్రాణము ఉద్గీథమును గానము చేసెను) అని పఠించుటచే ఉద్గీథమును గానము చేయువానిని (ఉద్గాతను) ప్రాణదృష్టితో నుపాసించుటచే నసురులు పరాభవింపఁబడిరని చెప్పి, యనంతరము "య ఏవం వేద" (దీని నెఱింగినవాఁడును అట్టి ఫలమును బొందుచున్నాఁడు" అని పఠించియున్నారు. అందువలన వీరు ఉద్గీథమును గానము జేయువానిని ప్రాణదృష్టితో నుపాసింపుమని విధించినట్లు శ్రుతివలనఁ దెలియుచున్నది.

ఛందోగులో, "అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణ స్త ముద్గీథ ముపాసాం చక్రిరే" (ముఖ్యప్రాణ మెద్దియో, దానినిగా భావించి యుద్గీథము నుపాసించిరి) అని పఠించుటచే "గానము జేయఁబడునదియగు ఉద్గీథ మునఁ బ్రాణదృష్టి నుంచుటచే నసురులు పరాభవమును బొందిరని తెలిపి,యనంతరము "య ఏవంవిది పాపం కామయ తే"(ఈ విషయము నెఱింగినవానిని ద్వేషించువాఁడును అట్లు పరాభవమును బొందుచున్నాఁడు) అని పఠించి యున్నారు. ఇందువలన ఛందోగులు గానము జేయఁబడునదియగు నుద్గీథమును ప్రాణదృష్టితో నుపాసింపుమని విధించినట్లు శ్రుతులనుండియే తెలియుచున్నది.

ఇట్లు ఒక తావున గానము జేయునట్టివాఁడు (ఉద్గాత) ఉపాస్యవస్తువుగాను మఱియొకతావున గానము జేయఁబడునట్టిదియగు నుద్గీథము ఉపాస్య వస్తువుగాను విధింపఁబడినట్లు శ్రుతులనుండియే తెలియవచ్చుచున్నందున నీ తావుల నుపాసనాస్వరూపమున భేదము గలదు. అందువలన, కేవల చోద నాదులయందు భేదము లేకున్నను, విద్యైక్యము సిద్ధింపనేర దని శంకింపఁగా.

సమాధానము:—దేవతలు ఉద్గీథమును శత్రుపరాజయమునకుగా నగు సాధనమునుగా నంగీకరించినట్లు ఉభయశాఖలవారును ఉపక్రమమునందుఁ జెప్పి యున్నారు. ఎట్లనిన, వాజసనేయులు, ఉపక్రమమున, "తేహ దేవా ఊచు ర్హన్తా సురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామ" అనువాక్యమున (దేవతలు యజ్ఞమున నుద్గీథముతో నసురులను జయించుదుమనిరి) అని పఠించియున్నారు. ఛందోగులును "తద్ధ దేవా ఉద్గీథమాజహ్రు రనేనైనా నభిభవిష్యామ" అనువాక్యమున, (దేవతలు అసురులను హింసించుటకై ఉద్గీథముఁ గైకొనిరి) అని పఠించి యున్నారు. ఇట్టి యుపక్రమమునకు విరోధము లేకపోవుటకై "తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్" అనుతావున ప్రాణముగా భావింపఁబడిన ఉద్గీథము ఉద్గాన కర్మమే (గానము చేయఁబడునదియే) అవుగాక. అయినను దానిని ఈవాక్యము నందు, వంటకమున అన్న వ్యంజనాదులవలె, సౌకర్యాతి శయమునకుగాను ఉద్గానకర్తను (ఉద్గాతను) గ జెప్పి యున్నారనిగాని, యిచట దానికి ఉద్గాన కర్తృత్వము లాక్షణికము గాని ముఖ్యముకాదని గాని మెఱుఁగునది. కనుక విద్యైక్యము సిద్ధమగుచున్నది.

అవతారిక:—ఇట్లు విద్యైక్యము ప్రాప్తింపఁగా,

౭॥ సూ॥ న వా ప్ర క ర ణ భే దా త్ప రో వ రీ య స్త్వా ది వ త్.

టీ॥ ప్రకరణభేదాత్ =ఉపక్రమభేదమువలన, నవా=విద్యైక్యము లేదు. అది యెటువలెననిన—పరోవరీయస్త్వాదివత్ = పరోవరీయస్త్వాదిగుణ విశిష్ట మగు (శ్రేష్ఠమయిన దానికంటె నతిశ్రేష్ఠమయిన గుణము గలిగి యుండుట)

నుద్గీథోపాసనము హిరణ్మయపురుషదృష్టి విశిష్టమగు నుద్గీథోపాసనమునకంటె భిన్నమయినట్లు.

తా॥ ఒక్కటే శాఖయందు పఠింపఁబడిన నయినను, పరోవరీయస్త్వాది గుణవిశిష్టమగు నుద్గీథోపాసనము హిరణ్మయపురుషదృష్టి విశిష్టమగు నుద్గీథోపాసనమునకంటె నెట్లు భిన్నమయినదో, అట్లే, యుద్గాతను ప్రాణ దృష్టితో నుపాసింపుమను వాజసనేయుల యుద్గీథోపాసనమున్ను ఉద్గీథావయవమగు ప్రణవమును (ఓంకారమును) ప్రాణదృష్టితో నుపాసింపుమను ఛందోగుల యుద్గీథోపాసనమును ఉపక్రమభేదముచే భిన్నములు.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "నవా" అను పదము ఛాందోగ్యవాజసనేయి శాఖలయందు ఉపదేశింపఁబడిన ఉద్గీథోపాసన యొక్కటి యనెడి పక్షము యుక్తము కాదని సూచింపుచున్నది. ఛాందోగ్యవాజసనేయి శాఖల యందలి యుద్గీథోపాసనముల ప్రస్తావమున భేద మున్నది. కావున నచట విధింపఁబడు ఉద్గీథవిద్య యొక్కటియే యనుట యుక్తము కాదు. ఎట్లనిన, ఛందోగులు "ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత" అనువాక్యమున ("ఓం" అనెడి యీ యక్షరము నుద్గీథమునుగా నుపాసింప వలయును.) అనుటచే ప్రకరణ గతమై యుద్గీథావయవభూతమగు ప్రణవమును ప్రస్తాపించి "ఏతస్య హ వా ఽక్షరస్యోపవ్యాఖ్యానం భవతి దేవాసురాహ వై యత్ర సంయేతిరే" అను వాక్యము మొదలుకొని "అథ య ఏవాయం ముఖ్యః ప్రాణః తముద్గీథ ముపాసాం చక్రిరే" అను వాక్యము వరకు ఉద్గీథావయవమగు ప్రణవమును గుఱించిన యుపాసనమును పఠించుచున్నారు. వాజసనేయులన్ననో, వారికి ఛందోగులకువలె ప్రాచీనమగు ప్రకరణ సందర్భము లేనందున, "హంతాఽసురాన్ యజ్ఞ ఉద్గీథే నాత్యయామ" అనఁగా "అసురులను యజ్ఞమునందు ఉద్గీథముచే జయించుదము" అనుటచే సంపూర్ణోద్గీథమునే ప్రస్తాపించి "అథ హేమమాసన్యం ప్రాణమూచుః త్వం న ఉద్గాయేతి" ఇత్యాది వాక్యములచే సంపూర్ణోద్గీథమును గుఱించియే పఠించి యున్నారు.

ఈపైని గనఁబఱిచిన ప్రకారము ఛందోగులకును వాజస నేయులకును ప్రకరణభేద ముండుటను బట్టి ఉపాసనమునందును భేదము గద్దు. ఉపాసనము నందు భేదముండుటచే ఉపాసనాస్వరూపమునందును భేదము ఉన్నట్లు సిద్ధమగుచున్నది. ఇట్లు ఉపాసనా స్వరూపమునందు భేదము ఉండుటచే నీరెండు శాఖల యందును విధింపఁబడిన విద్య అనఁగా నుపాసన యొక్కటి కానేరదు.

ఇంతియెకాక, ఛందోగులు "అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణః తముద్గీథము పాసాంచక్రిరే" అనువాక్యమున "ప్రణవమును ప్రాణదృష్టితోను

పాసింపవలయును” అని విధించియున్నందున వారి యుద్గీథోపాసనమున నుద్గీథావయవభూతమును, ప్రాణముగా భావింపఁ బడినదియు నగు ప్రణవము ఉపాస్య వస్తువు. అయితే వాజసనేయులు “అథేమమాసన్యం ప్రాణమూచుః త్వం న ఉద్గాయ”అను వాక్యమున “ఉద్గీథమును గానము చేయునట్టి యుద్గాతయందు ప్రాణభావమును నిర్దేశించి, యట్టి యుద్గాతను ప్రాణదృష్టితో నుపాసింపవలయు నని విధించియున్నందున, వారి యుద్గీథోపాసనమున ఉద్గాతయే యుపాస్యవస్తువు. ఈకారణము వలనను ఉపాసనాస్వరూపమునందును భేదము ఉన్నట్లు సిద్ధమగుచున్నది. కాఁబట్టి యీరెండు శాఖల యందును విధింపఁబడిన యుద్గీథోపాసనముల కైక్యము సిద్ధింపదు.

శంక:—కానిమ్ము. ఇట్లు చెప్పినచో, వాజసనేయులు “ఉద్గీథేనాత్యయామ” (ఉద్గీథముచే నసురులను జయించుదము) అను ఉపక్రమవాక్యమున ఉద్గీథము నుపాస్యవస్తువునుగ ప్రస్తాపించి ఉపసంహారమునం దట్టి యుద్గీథమును గానము జేయునట్టి యుద్గాతను ఉపాస్యవస్తువునుగ విధించినా రనవలసి వచ్చును. అట్లు చెప్పినచో, నుపక్రమోపసంహారములు విరుద్ధము లగునే ?

సమాధానము :—ఇట్లు శంకించుట కవకాశము లేదు. ఎట్లనిన; ఉద్గాతయనఁగా నుద్గీథమును గానము జేయునట్టివాఁడు. కావున నతనిని యుపాసించునపుడు ఉద్గీథమున్ను అవశ్యముగ కావలసినదియే. మఱియు శత్రుపరాభవరూపమగు ఫలమునకు ఉద్గాత హేతుభూతుఁడగునట్లు,ఉద్గీథముగూడ హేతుభూతమయనదియే. ఇందువలనను గూడ ఉపక్రమవిరోధ మెంతమాత్రము లేదు.

కనుక చోదనాలకు భేదములేక పోయినప్పటికిని, విద్య యొక్కటియే యని చెప్పగిట్టదు. కావున పైని ప్రతిపాదించిన ప్రకారము ఉపాసనాస్వరూపమునందు భేదముండుటనుబట్టి యుపాసనములకుఁగూడ పరస్పరము భేదము ఉన్నట్లు సిద్ధించుచున్నది. అదెటువలెననిన, ఉద్గీథోపాసనము ఒక్కటియే శాఖయందు భగవద్ధ్యానమునకై విధింపఁబడినదియే యైనను, అందు పరోవరీయస్త్వాది గుణవిశిష్టదృష్టి విధానముకంటెను హిరణ్మయ పురుషదృష్టి విధానము వేఱయినది కాదా ? అట్లే ప్రకృతముననును ఎఱుంగునది.

౮॥ సూ॥ సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తితు తదపి.

టీ॥ సంజ్ఞాతః=సంజ్ఞైకత్వమువలన, తత్=విద్యైక్యము, ఉక్తంచేత్ = చెప్పఁబడుచున్న దంటివేని, తదపి=సంజ్ఞైక్యముగూడ, అస్తితు = (భిన్నకర్మములకును భిన్నోపాసనములకును) కలదు గదా.

తా॥ రెండు తావులను ఉద్గీథవిద్య యను పేరొక్కటి యగుటంజేసి, యందు ఉపదేశింపఁబడిన విద్యయు నొక్కటియే యంటివేని, యది న్యాయ్యము కాదు. ఏలననిన, భిన్నకర్మములకును భిన్నోపాసనములకును పేరొక్కటిగా నుండుట సంభవమే కదా!

శ్రీ॥ భా॥ ఈ రెండు శాఖలయందును ఈ విద్యలు ఉద్గీథమను పేరం బిలువఁబడుటను బట్టి యిచట ఉపదేశింపఁబడిన విద్య యొక్కటియే యనుట యుక్తము కాదు. ఏలయన; విద్యలు వేఱు వేఱయినను, పేరొక్కటిగా నుండ వచ్చును గదా! ఎట్లన; నిత్యాగ్నిహోత్రమున్ను కుండపాయినుల అయనాగ్నిహోత్రమున్ను వేఱువేఱు కర్మములయినను,ఇవి రెండును అగ్నిహోత్రమను పేరుచేఁ బిలువఁబడుచుండ లేదా? మఱియు ఛాందోగ్యోపనిషత్తుయొక్క ప్రథమ ప్రపాఠకమునందు ఉపదేశింపఁబడిన అనేకవిద్యలకు ఉద్గీథమను పేరు గలదు.

## ౯॥ సూ॥ వ్యాప్తేశ్చ సమఞ్జసం.

టీ॥ వ్యాప్తేశ్చ = (ప్రణవముకే ఛాందోగ్యోపనిషత్తునందు ఉత్తరత్ర) వ్యాప్తి యుండుటవలనను, సమఞ్జసం = (మధ్యను గూడ ప్రణవమే యుపాస్య వస్తువనుట) యుక్తము.

తా॥ ఉద్గీథావయవ భూతమగు ప్రణవమే యుపాస్య వస్తువుగ ఛాందోగ్యోపనిషత్తునందు ఉత్తరత్ర వ్యాపించియున్నందున మధ్యను గూడ అదియే యుపాస్యవస్తువు కాదగును.

శ్రీ॥ భా॥ ఛాందోగ్యోపనిషత్తుయొక్క ప్రథమ ప్రపాఠకమునను,ఉత్తరత్ర విధింపఁబడు విద్యలయందును ప్రథమమున ప్రస్తావింపఁబడిన ప్రణవమే యుపాస్యవస్తువు గాన,మధ్యనుండు "తద్ధేవా ఉద్గీథము పాసాం చక్రిరే"(ఛా.౧ప్ర. ౨ఖ. ౧వా) అనువాక్యమునను ఉద్గీథావయవ భూతమగు ప్రణవమే యుపాస్య వస్తువుగా విధింపఁబడుచున్న దనుట యుక్తము. అయితే సంపూర్ణోద్గీథమును దెలియఁజేయునట్టి "ఉద్గీథ" శబ్ద మీ వాక్యమున మాత్రము దాని యవయవమును మాత్రమే యెట్లు తెలియఁజేయునని శంకింపఁ బనిలేదు. ఏలననిన,సంపూర్ణ పదార్థమును దెలియఁజేయునట్టి శబ్దము తదవయవమును మాత్రమే తెలియజేయునదిగ ప్రయోగింపఁబడవచ్చును. దృష్టాంతము:-వస్త్రముయొక్క ఏదో యొకభాగము దహింపఁబడి పోయినను "వస్త్రము దహింపఁబడినది" అనుచుండ లేదా! కావున, ఛాందోగ్య శాఖయందు ఉద్గీథావయవ భూతమగు ప్రణవము ప్రాణదృష్టితో నుపాసింపవలసినదిగ విధింపఁబడినదని యెఱుంగునది. వాజసనేయి శాఖయందో, "ఉద్గీథ"శబ్దము సంపూర్ణోద్గీథ వాచక మయినందున,సంపూర్ణోద్గీథమును గానము

జేయునట్టి యుద్గాత యచట ప్రాణదృష్టితో నుపాసింపఁ బడువాఁడుగ విధింపఁ బడుచున్నాఁడు. ఈ పైని గనఁబఱచిన ప్రకారము ఈ యుభయ శాఖలయందును ఉపాస్యవస్తువు వేఱయినందున అనఁగా నొకచోట నుద్గీథావయవమగు ప్రణవ మున్ను మఱియొకచోట సంపూర్ణోద్గీథమును గానము జేయునట్టి యుద్గాతయు నయినందున, నిచ్చట విధింపఁబడు విద్యలును భిన్నములే యని సిద్ధమగుచున్నది.

అన్యథాత్వాధికరణము ముగిసెను.



## సర్వాభేదాధికరణము.

### ౧౦॥ సూ॥ సర్వాభేదాదన్యత్రేమే.

టీ॥ ఇమే=వసిష్ఠత్వాది గుణములు, అన్యత్ర=కౌషీతకుల ప్రాణవిద్య యందు (ఉపాస్యాః=ఉపాసితవ్యములు.) ఏలనిన, సర్వాభేదాత్ = జ్యైష్ఠ్య శ్రైష్ఠ్యగుణ ప్రతిపాదన ప్రకారమంతయు నచటను గూడ భిన్నమయినది కానందున.

తా॥ ఛాందోగ్య వాజసనేయుల ప్రాణవిద్యయందలి జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యగుణ ప్రతిపాదన ప్రకార మంతయును కౌషీతకుల ప్రాణవిద్యయందు నయితము భేదింపక యున్నందున, ఛాందోగ్య వాజసనేయులచే ప్రాణసంబంధములుగాఁ జెప్పఁబడిన వసిష్ఠ త్వాది గుణములు కౌషీతకుల ప్రాణవిద్యయందును నయితము ఉపాసింపఁదగినవి.

శ్రీ॥ భా॥ ఛందోగులును వాజసనేయులును ప్రాణోపాసనమును విధించియున్నారు. ఈ సందర్భమున వీరు ఉభయులును "యో హ వై జ్యేష్ఠంచ శ్రేష్ఠంచ వేద జ్యేష్ఠశ్చహ వై శ్రేష్ఠశ్చ భవతి ప్రాణో వావ జ్యేష్ఠశ్చశ్రేష్ఠశ్చ" (ఛా.౫.ప్ర.౧ఖ.౧వా.)"జ్యేష్ఠమును(వయస్సుచే గొప్పదయిన వస్తువును) శ్రేష్ఠము నున్ను (గుణములచే గొప్పదిగ ప్రశంసింపఁబడెడు వస్తువును) దెలిసికొనిన వాఁడు జ్యేష్ఠుఁడును (వయస్సుచే గొప్పవాఁడును) శ్రేష్ఠుఁడును (గుణవైశిష్ట్య ముచే ప్రశంసింపఁబడు వాఁడును) నగుచున్నాఁడు" అని పఠించుచున్నారు. వీరు, జ్యేష్ఠమును శ్రేష్ఠమునగు ప్రాణమును ఉపాస్యవస్తువునుగాఁ బ్రతిపాదించి వశిష్ఠత్వము, ప్రతిష్ఠాత్వము, సమ్పత్తి, ఆయతనత్వము లనెడి గుణములను క్రమముగ వాక్చక్షుశ్శ్రోత్ర మనస్సులయందుండు వానినిగాఁ బ్రతిపాదించి, తరువాత దేహేంద్రియాదుల స్థితిగతులును, వాని వ్యాపారములును ప్రాణాధీనము లయినందున ప్రాణమే శ్రేష్ఠమని ప్రతిపాదించి, వాగాదుల యందుండు

నవిగా వినఁబడిన వసిష్ఠత్వాది గుణములు ప్రాణముతో సంబంధించినవని యును ప్రతిపాదించియున్నారు. ఇందువలన ఛందోగులును వాజసనేయులును వీరు ఉభయులును ప్రాణోపాసనమున జ్యైష్ఠ్యశ్రైష్ఠ్య గుణములు గలదియు, వసిష్ఠత్వాదిగుణములు గలదియునగు ప్రాణమును ఉపాస్యవస్తువునుగ విధించియున్నారని విశదమగుచున్నది. కౌషీతకులును, ప్రాణోపాసనమును విధించుసందర్భమున, ఛందోగ వాజసనేయులవలెనే జ్యైష్ఠ్యశ్రైష్ఠ్య గుణములు గల ప్రాణమును ఉపాస్యవస్తువునుగా విధించియున్నారు గాని, వీర లీ సందర్భమున వాగాదుల యందుండునవిగాను వినఁబడు వసిష్ఠత్వాది గుణములు ప్రాణముతో సంబంధించినవని మాత్రము ప్రతిపాదించి యుండలేదు. అనఁగా వీరు వసిష్ఠత్వాది గుణములను గూడ గలిగియున్నట్టి ప్రాణమును ఉపాస్యవస్తువునుగ విధించియుండ లేదనుట. ఇచట నొక సంశయము గలుగుచున్నది.

## సంశయము

ఛందోగులును వాజసనేయులును విధించిన ప్రాణోపాసనముకంటె కౌషీతకులు విధించిన ప్రాణోపాసనము భిన్నమయినదా ? భిన్నమయినది కాదా ?

## పూర్వపక్షము

వీరు ఉభయులును జ్యైష్ఠ్యశ్రైష్ఠ్య గుణములతోఁ గూడుకొనిన ప్రాణమునే యుపాస్యవస్తువునుగాఁ బ్రతిపాదించి యున్నప్పటికిన్ని, వీరిలో నొక్కరు వసిష్ఠత్వాది గుణములతోను సయితము కూడియున్నట్టి ప్రాణమును ఉపాస్యవస్తువునుగాను, మఱియొక్కరు వసిష్ఠత్వాది గుణములు లేని ప్రాణమును ఉపాస్యవస్తువును గాను ప్రతిపాదించి యున్నందున, ఉపాస్య వస్తుస్వరూపమునందు అనఁగా ఉపాసింపఁబడు ప్రాణస్వరూపమునందు భేదము కలదు. ఇందువలన ప్రాణోపాసనముయొక్క స్వరూపమునందు సయితము భేదము గలుగును. కాఁబట్టి ఛందోగ వాజసనేయుల ప్రాణోపాసనము కంటె కౌషీతకుల ప్రాణోపాసనము భిన్నమయినది.

## సిద్ధాంతము

ఛందోగ వాజసనేయుల ప్రాణోపాసముకంటెను కౌషీతకుల ప్రాణోపాసనము వేఱయినది కాదు. ఏలయన; కౌషీతకుల ప్రాణోపాసనమునందు సయితము వసిష్ఠత్వాదిగుణములు ఉపాస్యములుగాఁ గలవు. ఏలననిన, జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యగుణములు మొదలగునది యంతయును రెండు తావులను సమానముగాఁ బ్రతిపాదింపఁబడి యున్నది గదా! ఎట్లనిన; ఛందోగులును వాజసనేయు

లును "తాహ వై దేవతా అహం శ్రేయసే వ్యూదిరే" అనియు "అహం శ్రేయసే వివదమానాః" అనియు నీమొదలగు వాక్యములయందు "వాగాదీంద్రియములొక్కటిగాఁ జేరి తమలో నెది శ్రేష్ఠమయిన దనెడి యంశమును గుఱించి వివాదపడి సృష్టికర్తయగు ప్రజాపతి యొద్ద కేగి "మాలో తాను నిలిచి సర్వమును నిలిపెడి దేది?" అని యడుగఁగా, అతఁడు "మీలో నేది యీ శరీరమును విడిచినపుడు లోకులీ శరీరమును పాపిష్ఠమయిన దానినిగాఁ దలంచుదురో, యది తాను నిలిచియుండి సర్వమును నిల్పునట్టిది" అని చెప్పఁగా, అంతట వానిలో నొక్కొక్కటి యొక్కొక్క సంవత్సరము వరకును శరీరమును విడిచి పోయినను, ప్రాణముతోఁగూడ ఇతరేంద్రియములును శరీరమున్ను తమతమ కార్యములకు లోపము గలుగకుండ నిలిచి యుండెను అని ప్రతిపాదించి, ప్రాణము శరీరమును విడుచునపుడు మాత్ర మవి శిథిలములై నిరుపయోగము లాయెనని తెలిపి, ఇట్లు శరీరేంద్రియాదు లన్నిటియొక్క స్థితులును వాని వ్యాపారములును ప్రాణాధీనము లగుటంజేసి ప్రాణము జ్యేష్ఠమయినదని యుపపాదించి, వాగాదుల వ్యాపారములు ప్రాణాధీనములనియు నిట్లు ఉపపాదింపఁబడిన యంశమునే "అథ హైనం వాగువాచ యదహం వసిష్ఠాస్మి త్వం తద్వసిష్ఠోఽసి" (ఓ ప్రాణమా! నా యందే వసిష్ఠత్వ గుణము కలదో, యది నీదే అని వాక్కు చెప్పెను.) అనియు నీమొదలగు వాక్యములచే వాగాదీంద్రియములు తమ యందుండు వసిష్ఠత్వాదిగుణములు ప్రాణసంబంధము లయినవని అనువదించినట్లు చెప్పియున్నారు.

కౌషీతకులును ప్రాణోపాసనమునందు ప్రాణము జ్యేష్ఠమని ప్రతిపాదించుటకై వాగాదులకు వసిష్ఠత్వాదులు గలవని ప్రతిపాదించి యున్నారు. "అథ హేమా దేవతాః ప్రజాపతిం పితర మేత్యాబ్రువన్" ఇత్యాది వాక్యములచే "వాగాదీంద్రియములును వానితో సంబంధించిన వసిష్ఠత్వాదిగుణములును శరీరములును ఇవి యన్నియును ప్రాణాధీనము లయినందున, ప్రాణము జ్యేష్ఠము" అనియును ఉపపాదించి యున్నా. అయితే వీరు ఛందోగవాజసనేయుల వలె వాగాదీంద్రియములు తమ యందుండు వసిష్ఠత్వాదిగుణములు ప్రాణసంబంధ మయినవని యనువదించినట్లు చెప్పియుండలేదు. ఇంత మాత్రముచే స్వరూపమునందు భేదము గలుగ నేరదు. ఏలననిన; వసిష్ఠత్వాది గుణములతోఁ గూడుకొనిన వాగాదీంద్రియముల వ్యాపారములు ప్రాణాధీనములని యుపాదించుట చేతనే వాగాదీంద్రియముల యందుండు వసిష్ఠత్వాది గుణములకును ప్రాణమే హేతుభూత మయినది యని సిద్ధ మగుచున్నది. ప్రాణము, వాగాదీంద్రియముల యందుండు వసిష్ఠత్వాది గుణములకు హేతు భూత మగుటయే గదా! వాగాదీంద్రియగతములగు వసిష్ఠత్వాది గుణములతో సంబంధించి

యుండుట యనునది; కావున, కౌషీతకుల ప్రాణోపాసనమునందును ప్రాణము వసిష్ఠత్వాది గుణములతో సంబంధించినందుననే యది జ్యేష్ఠ మని యంగీకరింపఁ బడుచున్నది. కాఁబట్టి ఛందోగ వాజసనేయుల ప్రాణోపాసనము కంటె కౌషీతకుల ప్రాణోపాసనము వేఱయినది కాదు.

సర్వాభేదాధికరణము ముగిసెను.



## ఆనందాద్యధికరణము.

అవతారిక:—ప్రాణోపాసనాంగములను గుఱించి యింకను విచారింపవలసియున్నది. అందును గుఱించి మఱియొకప్పుడే విచారింపఁబడును. ప్రాణోపాసనమునఁ బ్రాణము వసిష్ఠత్వాది గుణయుక్త మయినదిగా నుపాసింపఁ బడని పక్షమున, నది జ్యైష్ఠ్యశ్రైష్ఠ్య గుణయుక్త మయినదిగా నుపాసింపఁబడుట యసంభవమనెడి యభిప్రాయమును బట్టి, కౌషీతకుల ప్రాణోపాసనమున, వసిష్ఠత్వాది గుణములు స్పష్టముగాఁ జెప్పఁబడక పోయినను, వాటి నచట ఉపాస్యములనుగా నుపసంహరించుకొనునట్లు, యే యే గుణముల ననుసంధింపని యెడల బ్రహ్మస్వరూపానుసంధాన మసంభవమగునో, ఆయా గుణముల నచ్చటచ్చట బ్రహ్మోపాసనముల యందు ఉపసంహరించుకొనవలయునని ప్రకృతమునఁ బ్రతిపాదించుచున్నారు.

౧౧॥ సూ॥ ఆనందాదయః ప్రధానస్య.

టీ॥ ప్రధానస్య=బ్రహ్మముయొక్క, ఆనందాదయః=ఆనందాదిగుణము లన్నియు (అభేదాత్=ఉపాస్యమగు బ్రహ్మ మొక్కటియగుటచే, ఉపసంహర్తవ్యాః=సర్వవిద్యలయందును ఉపసంహరించుకొనఁదగినవి.)

తా॥ పరవిద్యలయం దంతటను ఉపాస్యవస్తువగు బ్రహ్మ మొక్కటియే యగుటంజేసి, యానందాదు లన్ని విద్యలయందును ఉపసంహర్తవ్యములు.

శ్రీ॥ భా॥ బ్రహ్మస్వరూప గుణములను పరవిద్యల యందంతటను ఉపసంహరించుకొను విషయమై యొక సంశయము గలుగుచున్నది.

సంశయము

బ్రహ్మస్వరూపగుణములను పరవిద్యలయం దన్నింటియందును ఉపసంహరించుకొన వచ్చునా? కూడదా?

—•••◆ పూ ర్వ ప క్ష ము ◆•••—

ప్రకరణమునఁ జెప్పఁబడని గుణముల నుపసంహరించుకొనుట కెద్దియు ప్రమాణము గానఁబడదు గాన, ప్రకరణమునఁ జెప్పఁబడిన గుణములను మాత్రమే యుపసంహరించుకొనుట న్యాయ్యమనిన.

—•••◆ సి ద్ధాం త ము ◆•••—

అది యుక్తముకాదు. అన్ని యుపాసనములయందును ఉపాసింపఁబడు బ్రహ్మ మొక్కటియే యయినందునను, గుణిని (అనఁగా గుణయుక్తమగు బ్రహ్మమును) విడిచి గుణములు ప్రత్యేకముగా నుండుట యసంభవమగుట వలననున్ను బ్రహ్మగుణములగు నానందాదులను పరవిద్యలయందంతటను ఉపసంహరించుకొన వలయును.

అవతారిక:—గుణములు గుణిని అనఁగా గుణయుక్తమగు పదార్థమును విడిచి ప్రత్యేకముగా నుండుట యసంభవ మగుటంజేసి, జ్ఞానానందాది గుణములను పరవిద్యలయందంతటను ఉపసంహరించుకొనవలసినట్లు "తస్యప్రియమేవ శిరః" ఇత్యాది తైత్తిరీయక వాక్యములయందు బ్రహ్మగుణములుగాఁ జెప్పఁబడిన ప్రియశిరస్త్వాదులను గూడ పరవిద్యలయందంతటను ఉపసంహరించుకొనవలసి వచ్చునేని అని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౧౨॥ సూ॥ ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌహి భేదే.

టీ॥ ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః = తైత్తిరీయోక్తములగు ప్రియశిరస్త్వాది గుణములు, పరవిద్యలయం దంతటను ప్రాప్తింపవు, హి=ఏలననిన, భేదే(సతి)= బ్రహ్మమునకు అవయవభేదము కలదేని, ఉపచయాపచయౌ = వృద్ధిక్షయములు, (సంభవతః=బ్రహ్మమునకుఁ గలవని సంభవించును.)

తా॥ తైత్తిరీయోక్తములగు ప్రియశిరస్త్వాదిగుణములు శాఖాంతరములయందలి బ్రహ్మోపాసనములయందుఁ బ్రాప్తింపవు. ఏలయన, బ్రహ్మమునకు ప్రియమయిన శిరస్సు మొదలుగాగల యవయవభేద ముండెనేని వృద్ధిక్షయములు సయితము బ్రహ్మమునకుఁ గలవని ప్రసక్తించును గదా!

శ్రీ॥ భా॥ బ్రహ్మస్వరూపగుణములగు జ్ఞానానందాదులు మాత్రము పరవిద్యలయందంతటను ఉపసంహరింపఁ దగినవే కాని, ప్రియశిరస్త్వాదులు సయితము అట్లు ఉపసంహరింపఁ దగినవి కావు. ఏలయన, ఇవి బ్రహ్మముయొక్క గుణములు కావు గదా! ఎందువలననఁగా, ఇవి బ్రహ్మమును పురుషునితోఁ బోల్చి బోధించుటకై శ్రుతియందుఁ జేర్కొనఁబడినవి. అట్లుకాకున్న, శిరస్సుఁ పక్షము, పుచ్ఛము మొదలుగాఁ గల యవయవ భేదము బ్రహ్మమునకుసయితము

ఉండియుండ వలసివచ్చును. అట్లయినచో, బ్రహ్మముకు వృద్ధి క్షయములు గలవని ప్రసక్తించును. అట్లగునేని "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములు విరోధించును.

అవతారిక:—ఇట్లే బ్రహ్మముతో సంబంధించినవియేమై యనంతము లగు గాంభీర్యౌ దార్య కారుణ్యాది గుణములును గుణియగు బ్రహ్మమును విడిచి ప్రత్యేకముగా నుండుట యసంభవము గాన, అవి యాయా విద్యలను పఠించునపుడు పేర్కొనఁబడక పోయినను, వాటిని గూడ పరవిద్యలయం దంతటను ఉపసంహరించు కొనవలసి వచ్చునే? మఱియు అవి యనంతము లయినందున వాటి నన్నింటిని ఉపసంహరించుకొనుటయును అశక్యమే? అని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

## ౧౩॥ సూ॥ ఇతరే త్వర్థ సామాన్యాత్.

టీ॥ తు=శంక యుక్తమయినది కాదు. ఏలయన, అర్థసామాన్యాత్= ఉపాస్యవస్తువగు బ్రహ్మముయొక్క స్వరూప మన్నివిద్యలయందు నొక్కటియే యయినందున, ఇతరే = ఆనందాదులు (ఉపసంహర్తవ్యాః = ఉపసంహరించు కొనదగినవి.)

తా॥ ఉపాస్యవస్తువగు బ్రహ్మము యొక్క స్వరూపము పరవిద్యలయం దంతట నొక్కటియే యయినందున, తన్నిరూపకములగు నానందాది గుణములు మాత్రమె వాటి యందంతటను ఉపసంహరించుకొనఁ దగినవి.

శ్రీ॥ భా॥ ఆనందాదులు అర్థసమానములయినందున, అనఁగా, ఉపాస్య వస్తువగు బ్రహ్మముయొక్క స్వరూపమును నిరూపించునట్టి ధర్మములగుటం జేసి బ్రహ్మము తెలియవచ్చునప్పుడు బ్రహ్మముతోఁగూడ ఉండునవి యయినందున, అట్టి ఉపాస్యవస్తువగు బ్రహ్మముయొక్క స్వరూపము పరవిద్యల యందంతట ననువర్తించునట్లు, అవియును పరవిద్యల యందంతటను అనువర్తించును. సత్యత్వము, జ్ఞానము, ఆనందము, అమలత్వము, అనంతత్వ మనునవి యట్టిగుణములు. కనుకనే తైత్తిరీయులు బ్రహ్మస్వరూపమును నిరూపించు సందర్భమున, ముందుగ "యతోవా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది వాక్యములచే బ్రహ్మముయొక్క జగత్కారణత్వము నొక యాగంతుకమగు గుర్తునుగాఁ జూపించి, తరువాత అట్టి బ్రహ్మము యొక్క స్వరూపమును నిరూపింపఁబూని "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనియు "ఆనందో బ్రహ్మ" అనియు నీ మొదలగు వాక్యములచే బ్రహ్మస్వరూపమును సత్యజ్ఞానానందాది గుణయుక్తమయిన దానినిగా నిరూపించి యున్నారు. కావున, ఉపాస్యవస్తు వగు బ్రహ్మ

ముయొక్క స్వరూపము తెలియుటకై ఆనందాది గుణములు పరవిద్యల యం దంతటను అనువర్తించునవి.

ఇట్లు నిరూపింపఁబడిన స్వరూపముగల బ్రహ్మముయొక్క గుణములు గాఁ దెలియఁబడు కారుణ్యాదులో, గుణియగు బ్రహ్మమును విడిచి ప్రత్యేకముగా నుండుట కర్హములు కాకపోయినను, అవి బ్రహ్మము తెలియవచ్చునపుడు బ్రహ్మముతోఁగూడ నుండునవిగాఁ దెలియునవి కానందున, వానిలో నేవి యే విద్యయందుఁ జేర్కొనఁబడునో, వానిని నా విద్యయందు మాత్రము ఉప సంహరించుకొన వలయును.

అవతారిక:—ప్రియశిరస్త్వాదులు బ్రహ్మముయొక్క గుణములగునేని, బ్రహ్మమునకు వృద్ధిక్షయములు ప్రసక్తించుటనుబట్టి, అవి బ్రహ్మగుణములు కావనియు, బ్రహ్మమును పురుషాకారముతోఁ బోల్చి తెలుపుటకై మాత్రము అది యట్టి ప్రియశిరస్త్వాదులు గలదిగాను వర్ణింపఁ బడినదనియును చెప్పఁ బడెను. ఇందొక్కటి యడుగవలసియున్నది. వాస్తవమునకు బ్రహ్మము ప్రియ శిరస్త్వాదులు లేనిది యగునేని, యది యట్టి ప్రియ శిరస్త్వాదులుగలదిగా శ్రుతుల యందేల వర్ణించియుండవలయును? అట్టిది కానిది యట్టిదిగాఁ జెప్పఁబడుట కెద్దియైన నొక్క ప్రయోజన ముండి యుండవలయునే? అది యెటువలెననిన, కాఠ కులాత్మను రథికుని గాను, దేహమును రథమ్మును గాను, బుద్ధిని సారధిని గాను, మనస్సును గుఱ్ఱపు కళ్లెమును గాను పఠించి యుండిరి. ఇచట ఉపాసకుఁడగు నాత్మయును, తదుపకరణము లగు దేహాంతఃకరణాదులును వాస్తవమునకు రథిక రథ తదుప కరణాదులు కాకపోయినను, ఉపాసనోపకరణములగు శరీ రేంద్రియముల వశీకరణమునకై వాటినట్లు పఠించి యున్నట్లు మనము తెలిసి కొనుచున్నాము గదా? అట్లే, ప్రకృతమునను, ఎద్దియయిన నొక ప్రయోజన మున్నట్లు గానఁబడదు. కావున, ప్రియశిరస్త్వాదులు బ్రహ్మగుణములని యంగీ కరింపక తప్పదని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౧౪॥ సూ॥ ఆ ధ్యా నా య ప్ర యో జ నా భా వా త్.

టీ॥ ఆధ్యానాయ = (శ్రుతియందు ప్రియశిరస్త్వాదులచే బ్రహ్మమును వర్ణించుట) ధ్యానోపయోగమునకై, ఏలననిన; ప్రయోజనాభావాత్ = అట్లు వర్ణించుటకు మఱియొక ప్రయోజనమెద్దియును లేనందున.

తా॥ శ్రుతియందు బ్రహ్మమును ప్రియశిరస్త్వాదులచే వర్ణించుటకు మఱియొక ప్రయోజన మెద్దియును లేదు గాన, నట్లు వర్ణించుట ధ్యానము నకు గానని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ ప్రియశిరస్త్వాదులచే బ్రహ్మమును వర్ణించుటకు వేఱొక్క ప్రయోజన మెద్దియును లేనందున, ఆధ్యానమునకు గాను అనఁగా ఉపాసనోపయోగార్థమై తైత్తిరీయు లట్లు వర్ణించినారని యెఱుంగునది. ఏలననిన, ఇంతకుఁ బూర్వము "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై. ఆ ౧ అను. ౧ వా) (బ్రహ్మమును ఉపాసించువాఁడు ఉత్కృష్టపదవిని (మోక్షమును) బొందుచున్నాఁడు.) అను వాక్యమున ఉపదేశింపఁబడిన బ్రహ్మధ్యాన రూపమగు జ్ఞానము సిద్ధించుటకై ఆనందమయ బ్రహ్మము తెలియ వలసియుండె. అందులకై యానందమయ బ్రహ్మమును ప్రియమోద ప్రమోదాది రూపముగ విభజించి, ఆ ప్రియ మోదాదులను శిరః పక్షాదులనుగా వర్ణించి యుపదేశించి యున్నారు. అదెటువలెననిన, ఇంతకుఁ బూర్వము అన్నమయ బ్రహ్మమగు దేహము "తస్యేదమేవ శిరః" (తై. ఆనం. ౧ అను. 3 వా.) ఇత్యాది వాక్యమున శిరస్సుపక్షము మొదలగునవి గలదిగాను వర్ణితమై యుపదేశింపఁబడి యుపాసకుని మనస్సున సులభముగా నవగాహమగునట్లు చేయఁబడినది. ఇంతియె కాక, ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములుగూడ "తస్య ప్రాణ ఏవ శిరః" (తై. ఆ.౨ అను 3.వా)అనువాక్యమున ఉపాసకుని బుద్ధియందు గ్రహింపఁబడునట్లు ప్రాణాద్యవయవములచే నుపదేశింపఁబడినవి. అట్లే ప్రకృతమునను, అన్నమయాదులకంటె భిన్నమై, తదంతరాత్మయగు నానందమయ బ్రహ్మము శిరః పక్షాదులుగా వర్ణింపఁబడిన ప్రియమోదాదుల మూలముగ సులభముగ ఉపాసకుని బుద్ధి కవగాహ మగునట్లు చేయఁబడుచున్నది. కావున ప్రియశిరస్త్వాదు లానంద మయ బ్రహ్మమునకు ఉపలక్షణ మాత్రములు గాని (ఆగంతుకములగు గుర్తుల వంటివి గాని), యవి యెప్పుడును ఆనందమయ బ్రహ్మముతో సంబంధించియుండునవి కావు.

### ౧౫॥ సూ॥ ఆత్మశబ్దాచ్చ.

టీ॥ ఆత్మశబ్దాత్ -చ=శ్రుతియందు "ఆత్మ" శబ్దమును ప్రయోగించుట వలనఁ గూడ (ప్రియశిరస్త్వాదులచే బ్రహ్మమును నిరూపించుట ధ్యానోపయోగమునకై.)

తా॥ శ్రుతియందు "ఆత్మ" శబ్ద ప్రయోగమువలనఁ గూడ బ్రహ్మమును ప్రియశిరస్త్వాదులచే నిరూపించుట ధ్యానోపయోగమునకు గానని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "అన్యోంతర ఆత్మా ౽౽నందమయః" అను శ్రుతివాక్యము ఆనందమయుని "ఆత్మ" శబ్దముచే నిర్దేశించుచున్నది. అనఁగా నానందమయుఁడాత్మయని తెలుపుచున్నది. అయితే ఆత్మకు శిరస్సు, పక్షము, పుచ్ఛము

ఈ మొదలగునవి యుండుట యసంభవము గాన, ఆనందమయ బ్రహ్మమును ఉపాసకుఁడు సులభముగఁ దెలిసికొనుటకై యది శిరః పక్షాదులు గలదిగాను వర్ణింపఁబడినట్లు విశదమగుచున్నది.

అవతారిక:—"అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః" అనియు నీమొదలగు పూర్వవాక్యముల యందు "ఆత్మ" శబ్దము ఆత్మలుకానివి యగు ప్రాణమయ మనోమయాదులను దెలియఁ జేయునదిగాను ప్రయోగింపఁబడి యుండ, ఇప్పుడు "అన్యోంతర ఆత్మాఽఽనందమయః" అను వాక్యమునందు మాత్రము అది పరమాత్మను తెలుపునదియని యెట్లు నిశ్చయింపఁ దగునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుకుటకై:—

౧౬॥ సూ॥ ఆత్మగృహీతిరితరవదుత్తరాత్.

టీ॥ ఇతరవత్ = ఇతర శ్రుతుల యందువలెనే (ప్రకృతమున) ఆత్మగృహీతిః=ఆత్మశబ్దప్రయోగము, (పరమాత్మ వాచకముగానే యని) ఉత్తరాత్ = ఇఁక మీఁదు రాఁబోవు శ్రుతివలన (తెలియుచున్నది.)

తా॥ ఇతర శ్రుతుల యందువలె నిచటను "ఆత్మ" శబ్దము పరమాత్మ వాచకము గానే గ్రహింపఁ బడినట్లు రాఁబోవు శ్రుతివలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "ఆత్మా వా ఇదమేక ఏ వాగ్ర ఆసీత్ స ఈక్షత లోకాన్ను సృజా" ; (ఐ ౧-అ. ౧-ఖ. ౧-వా.) ఇత్యాది శ్రుతివాక్యములందుండు "ఆత్మ" శబ్దము పరమాత్మ వాచకమగునట్లు, "అన్యోంతర ఆత్మాఽఽనందమయః" (తై ఆ-౫. అను ౨ వా) అను వాక్యము నందుండు "ఆత్మ" శబ్దము సయితము పరమాత్మ వాచకమే. ఏలననిన,—ఈవాక్యముచేఁ జెప్పఁబడిన యానందమయుని, "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" (తై ఆ. ౬ అను. ౨ వా) అను ఉత్తరవాక్యమున "సః" అను తచ్ఛబ్దముచే పరామర్శించి వానిని జగత్కారణునిగ తైత్తిరీయులు పఠించుచున్నారు. అయితే, "అన్యోంతర ఆత్మా ఽఽ ఆనందమయః" అనువాక్యమునందుండు "ఆత్మ" శబ్దము పరమాత్మ వాచకమగు పక్షమునఁ గదా, పూర్వోత్తర వాక్యములు సంగతార్థము లగును.

అవతారిక:—"అన్యోంతర ఆత్మా ప్రాణమయః" ఇత్యాది పూర్వవాక్యములయం దుండు "ఆత్మ" శబ్దము ఆత్మలుకానివియగు ప్రాణ మయాదులను దెలియఁ జేయునదిగాను కనఁబడుచున్నది. కావున ఈ యాత్మశబ్దముయొక్క యర్థమును ఉత్తరవాక్యముచే నిర్ణయించుట యశక్యమే యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౧౭॥ సూ॥ అన్వయాదితి చేత్స్యాదవధారణాత్॥

టీ॥ అన్వయాత్ = పూర్వవాక్యములయందు "ఆత్మ" శబ్దము ఆత్మలు కానివి యగు ప్రాణమయాదులతో సంబంధించి నందున (ఉత్తరాత్ = ఉత్తర వాక్యమునుండి, నిశ్చేతుం="ఆత్మ "శబ్దార్థమును నిశ్చయించుట, న శక్యతే=శక్యము కాదు) ఇతిచేత్ =ఇట్లంటివేని, స్యాత్ =శక్యమగును. ఏలననిన, అవధారణాత్ =పూర్వవాక్యముచేతనే పరమాత్మ బుద్ధి నిశ్చయింపఁ బడుటవలన.

తా॥ పూర్వ వాక్యములయం దాత్మ శబ్దము ఆత్మలు కానివియగు ప్రాణమయాదులను దెలియఁ జేయునదిగఁ గానఁబడుచుండఁగా, అది పరమాత్మ వాచకమని యుత్తరవాక్యమువలన నెట్లు నిశ్చయింపఁ దగునంటివేని, పూర్వ వాక్యము ఉపాసకుని మనస్సునందు పరమాత్మబుద్ధిని ధ్రువపరచుచున్నది.

శ్రీ॥ భా॥ పూర్వోత్తర వాక్యార్థ సందర్భమును బాగుగ పరిశీలించుటచే "అన్యోఽన్తర ఆత్మా ఽఽనన్దమయః" అను వాక్యము నందుండు "ఆత్మ" శబ్దము పరమాత్మ వాచకమని స్పష్టపడును. ఎట్లనిన, తైత్తిరీయు లింతకు పూర్వము, "తస్మాద్వా ఏ తస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" (తై. ఆ-౧. అను) (ఈ పరమాత్మనుండి యాకాశము పుట్టినది.) అనియు నీ మొదలగు వాక్యములచే నుపాసకుని మనస్సున పరమాత్మ విషయమగు బుద్ధిని ధ్రువపరచి యున్నారు. పిమ్మట వారు, అట్టి పరమాత్మ బుద్ధినే ముందుగ అన్నమయాంతర్గతమగు ప్రాణమయాత్మయందుఁ గలుగఁ జేసి, తరువాత ప్రాణమయాంతర్గతమగు మనోమయాత్మయందుఁ గలుగఁ జేసి, యనంతరము మనోమయాంతర్గతమగు విజ్ఞాన మయాత్మయందుఁ గలుగఁ జేసి, తుట్టతుదకు విజ్ఞానమయాంతర్గతమగు ఆనన్దమయాత్మయందుఁ గలుగఁ జేసియున్నారు. ఇట్లానందమయునియందు పరమాత్మబుద్ధినిఁ గలుగఁ జేసిన పిదప మఱియొక దేనియందును పరమాత్మ బుద్ధినిఁ గలుగఁ జేసి యుండ లేదు. మఱియు "సోఽకామయత" అను ఉత్తరవాక్యమున పూర్వవాక్యమునందుఁ జెప్పఁబడిన ఆనన్దమయునే "సః" అనెడి తచ్ఛబ్దముచేఁ బరామర్శించి అతనిని జగత్కారణునిగానును చెప్పియుండుటచే ఆనన్దమయుఁడనఁగా పరమాత్మయని తెలియఁ జేసి యున్నారు. కాఁబట్టి, "అన్యోఽంతర ఆత్మా ఆనందమయః"।అను వాక్యమున "ఆత్మ"శబ్దము పరమాత్మ వాచకమని నిశ్చయింపఁబడుచున్నది. అయితే,"అన్యోఽంతర ఆత్మా ప్రాణమయః" ఇత్యాది పూర్వ వాక్యములకు ఈపైని చెప్పినప్రకారము ఆత్మలు కానివియగు ప్రాణమయాదులయం దాత్మబుద్ధినిఁ గలుగఁ జేయుటయందే తాత్పర్యము.కనుక నిచట"ఆత్మ"శబ్దనము ఆత్మలు కానివియగు ప్రామయాదులఁ జెప్పుచున్నను, దోషము లేదు.

ఆనన్దాద్యధికరణము ముగిసెను.

## కార్యాఖ్యానాధికరణము

### ౧౮॥ సూ॥ కార్యాఖ్యానాదపూర్వమ్.

టీ॥ కార్యాఖ్యానాత్=అప్రాప్తమయిన దానిఁ జెప్పుటయే యుద్దేశమగుట వలన, (ఇహ=ఇచట) అపూర్వం=అప్రాప్తమగునది (ఉదకము ప్రాణమునకు వస్త్రమను అను సంధానమే, విధీయతే=విధింపఁ బడుచున్నది.)

తా॥ ప్రమాణాన్తరములచేఁ దెలియని దానిఁ దెలియఁజేయుటచేఁగదా వేదములు సార్థకము లగుచున్నవి. కావున ఇచట ఇంతకు పూర్వము ప్రమాణాన్తరప్రాప్తముకానిది యగు అనగ్న చింతనము (ఉదకములు ప్రాణమునకు వస్త్రమనెడి యను సంధానము) విధింపఁబడుచున్నది.

శ్రీ॥ భా॥ ప్రాణవిద్యను గుఱించి యింకను విచారింప వలసి యున్నదని యింతకు పూర్వము చెప్పఁబడియె. ఆ విచారము ఈ యధికరణమునఁ జేయఁబడుచున్నది. ఛందోగులును వాజసనేయులును ప్రాణవిద్యా సందర్భమున జ్యైష్ఠ్య శ్రైష్ఠ్యగుణ యుక్తమగు ప్రాణమును ఉపాస్యవస్తువునుగా నుపదేశించి అనంతర మిట్టి యుపాస్యవస్తువగు ప్రాణమునకు ఉదకములు వస్త్రమని విధించియున్నారు. ఎట్లనిన, ఈ విషయమును గుఱించి ఛందోగులు, "స హోవాచ కిం మే వాసో భవిష్యతీ త్యాప ఇతి హోచుః తస్మాద్వా ఏత దశిష్యంతః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరి దధతి లంబుకో హ వాసో భవత్యనగ్నో భవ తీతి"(ఛా.౫-ప్ర.౨-ఖ.౨-వా.) (శ్రేష్ఠత్వాది గుణ విశిష్టమై యుండెడి ముఖ్యప్రాణము వాక్కు మొదలగు వానిఁ జూచి నాకు వస్త్రరూపముగా పరిగ్రహించుటకు యోగ్యమైన వస్తువు ఏద్ది? అని యడుగఁగా, ఉదకములే నీకు వస్త్రమని వాక్కు మొదలగునవి ప్రత్యుత్తర మిచ్చిన వాయెను. అందువలననే అభిజ్ఞులయిన వారు భోజనాత్పూర్వమునను భోజనానంతరమునను ఆచమన రూపముగా వినియోగింపఁబడు నట్టి యుదకములతో ప్రాణమునకు వస్త్రము గలుగఁ జేయఁబడునని యాచమనమును జేయుచున్నారు" అని పఠించుచున్నారు.

ఈ విషయమును గుఱించి వాజసనేయులు "కిం మే వాసః ఆపో వాస ఇతి తద్విద్వాంగ్‌స శ్రోత్రియా అశిష్యన్త ఆచామన్త్య శిత్వాచాచామన్త్యేత మేవత దన మనగ్నం కుర్వన్తో మన్యన్తే తస్మాదేవం విదశిష్యన్నాచామేదశిత్వా చాచామే దేత మేవ తదన మనగ్నం కురుత ఇతి" (బృ.౮-అ.౧-బ్రా.౪-వా.) (ప్రాణము నాకు వస్త్రమేది? అని వాగాదుల నడుగఁగా, నవి యుదకములు నీకు వస్త్రమని చెప్పెను. కనుకనే లోకమునందు పండితులును వేదాధ్యయన పరులును నగువారు భోజనము జేయుటకు ముందును భోజనము చేసినతరు

పాతను ఆచమనమును జేయుచు దీనినే ప్రాణమునకు వస్త్రమునుగా భావించుచున్నారు. కాఁబట్టి యుదకములు ప్రాణమునకు వస్త్రమని తెలిసినవారు భోజనము జేయబోవునపుడు భోజనాత్పూర్వమునను భోజనాంతరమునను ఆచమనమును జేయవలయును. ఇట్లు చేయుటచే ప్రాణమును వస్త్రయుక్తమయిన దానినిగాఁ జేయుచున్నారు” అని పఠించుచున్నారు. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

### సంశయము

ఈ పైని యుదహరింపఁబడిన శ్రుతివాక్యములు భోజనమునకు పూర్వమునను భోజనానంతరమునను ఆచమనమును జేయవలయునని విధించుచున్నవా? లేక, ఆచమనమునందు ఉపయోగింపఁబడు ఉదకములను ప్రాణముయొక్క వస్త్రమునుగాఁ దెలిసికొనవలయునని విధించుచున్నవా?

### పూర్వపక్షము

ఈపై శ్రుతివాక్యములు ఆచమనమును విధించుచున్న వనుట యుక్తము. కనుకనే “ అశిష్యన్నాచామేత్ ” అనియు “ అశిత్వాచాచామేత్ ” అనియు నీవాక్యములయందు “ ఆచామేత్ ”(ఆచమనమును చేయవలసినది) అని యిట్లు విధ్యర్థకధాతు రూపము ప్రయోగింపఁబడినది. ఈ తావుననే తప్ప “ఏతమేవ తదనమగ్నంకురుతే” (ఆచమనమును జేయుటచే ప్రాణమునకు వస్త్రమును గలుగఁ జేయుచున్నా మనుకొనుచున్నారు) అని యట్టిజ్ఞానమును తెలుపు వాక్యమునందట్టి విధ్యర్థక ధాతురూపము ప్రయోగింపఁబడలేదు. కాఁబట్టి యీ పై వాక్యము లాచమనమునందు ఉపయోగింపఁబడునట్టి యుదకమును ప్రాణముయొక్క వస్త్రమునుగాఁ దెలిసికొనవలయునని విధించుచున్న వనుట కవకాశము లేదు. అయితే శ్రుతియందు ఉదకమును ప్రాణముయొక్క వస్త్రమును గాను చెప్పియుండుట స్తుత్యర్థముగా నైనను ఉండవచ్చును.

అయిన నిచట విధింపఁబడునది భోజనసమయమున భోజనాంగముగ నాచరింపబడునట్టి యాచమనము కాదు. దానిని స్మృతియే విధించి యున్నది. అది యాచారమునను గూడ గలదు, కావున దాని నిపుడు విధింపఁ బనిలేదు. అయితే ఈ వాక్యములయందు, “ఆచామేత్” అను విధ్యర్థకధాతు రూప ప్రయోగము సార్థక మగుటకు గాను, ఇచట ప్రాణవిద్యాంగ భూతమగు వేఱొక్క యాచమనము విధింపఁబడు నట్లెలుంగునది యనిన.

### సిద్ధాంతము.

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఈపై శ్రుతివాక్యములు ఆచమనార్థము ఉపయోగింపఁబడునట్టి యుదకమును ప్రాణముయొక్క వస్త్రమునుగా

నెఱుంగ వలయునని విధించుచున్నవి. ఏల ననిన, ఇంతకుముందు తెలిసిన దానిని గదా మరల విధింప నక్కఱలేదు. అయితే ఈవిషయము మనకు ఇంతకు పూర్వము తెలియనిదై, యిప్పుఁడు శ్రుతివలనఁ దెలియఁజేయఁ బడుచున్నది. తెలియని వానిని తెలియఁ జేయుటచేఁ గదా వేదములు సార్థక్యమును పొంద గలవు. మఱియు ఛందోగ వాజసనేయులు "జ్యైష్ఠ్య శ్రైష్ఠ్య గుణ విశిష్ట మగు ప్రాణము నాకు వస్త్రమేది? అని వాగాదుల నడుగఁగా, అవి యుదక ములు నీకు వస్త్రమని బదులు జెప్పినవాయెను" అని యుపక్రమించి "ఆచమ నార్థము ఉపయోగింపఁబడు ఉదకమును ప్రాణముయొక్క వస్త్రమునుగా నెఱుంగవలయునని యుప సంహరించియున్నారు. ఇట్లు ఉపక్రమోప సంహార ములను బాగుగ పరిశీలింపఁగా, ఉదకమును ప్రాణముయొక్క వస్త్రమునుగా నెఱుంగు మనుటయే ఈ పైవాక్యములయొక్క తాత్పర్యమని విశదమగు చున్నది. భోజనసమయమున అనుష్ఠింపఁ బడునట్టి యాచమనమన్ననో, స్మృత్యా చారములనుండి ప్రాప్తమైనదియే గాన, ఈ పై వాక్యములు అట్టి యాచమ నమునందు ఉపయోగింపఁబడునట్టి యుదకమును ప్రాణముయొక్క వస్త్రము నుగ నెఱుంగవలయుననియే విధించుచున్నట్లు సిద్ధమగు చున్నది. కనుకనే ఛందో గులు, అంతమున "తస్మాద్వా ఏత దశిష్యన్త పురస్తాచ్చో పరిష్టాచ్చాద్భిః పరిదధతి" అను వాక్యమున "భోజనము చేయఁబోవుచు భోజనమునకు ముందును భోజనా నంతరమునను ప్రాణమును ఉదకములచే కప్పుచున్నారు అనఁగా ప్రాణమును వస్త్రయుక్తమయిన దానినిగాఁ జేయుచున్నారు" అని పఠించి యున్నారే గాని, ఆచమనమును జేయుచున్నారని పఠించియుండలేదు.

॥ కార్యాఖ్యానాధి కరణము ముగిసెను. ॥



## సమానాధి కరణము.

### ౧౯॥ సూ॥ సమాన ఏవంచా భేదాత్.

టీ॥ సమానే-ఏవం = అగ్నిరహస్యమునను, బృహదారణ్యకమునను మనోమయత్వాదులు సమానము లగుటవలనను, అభేదాత్ =తక్కిన వశిత్వా దులు సత్యసంకల్ప త్వాదులతో నభిన్నము లగుటవలనను (ఉపాస్య స్వరూ పమున భేదము లేదు.)

తా॥ అగ్నిరహ్యామునను బృహదారణ్యకమునను శాణ్డిల్య విద్యా సందర్భమునఁ జెప్పఁబడిన మనోమ యత్వాది గుణములు సమానములే మైనందునను, బృహదారణ్యకమునఁ జెప్పఁబడిన తక్కిన వశిత్వాది గుణ

ములు అగ్నిరహస్యమునఁ జెప్పఁబడిన సత్యసంకల్పాదులతో నభిన్నము లయిన వగుటచేతనున్ను యుపాస్య స్వరూపమున భేదములేదు. కావున నీ రెండుతావులను విధింపఁబడిన శాణ్డిల్యవిద్య యొక్కటియే.

శ్రీ॥ భా॥ వాజసనేయులు అగ్నిరహస్యమున శాణ్డిల్యవిద్యను విధించి యున్నారు. అచ్చట వీరు "సత్యం బ్రహ్మేత్యుపాసీత" (సత్యమని బ్రహ్మమును ఉపాసింపవలయును" అని యారంభించి, అనంతరము "స ఆత్మాన ముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపం సత్య సఙ్కల్ప మాకాశాత్మానం" (పరిశుద్ధమగు మనస్సుచే గ్రహింపఁబడువాడును, ప్రాణమున కాధార భూతుఁడును, ప్రకాశ స్వరూపుఁడును, సత్యసంకల్పుఁడును, ఆకాశమువలె వ్యాపకుఁడును నగు పరమాత్మను ఉపాసింపవలయును) అని పఠించి యున్నారు.

వీరే మరల బృహదారణ్యకమున శాణ్డిల్య విద్యను విధించియున్నారు. ఈసందర్భమున వీరు "మనోమయోఽయం పురుషో భాస్సత్యం తస్మిన్నన్తర్హృదయే యథా వ్రీహిర్వా యవో వా స ఏష సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః సర్వమిదం ప్రశాస్తి యదిదం కిఞ్చ" (బృ. ౭-అ. ౬-బ్రా.౧-వా) (ఈ పురుషుఁడు పరిశుద్ధమగు మనస్సుచే గ్రహింపఁదగినవాఁడు ప్రకాశ స్వరూపుఁడు, నిర్వికారుఁడు, హృదయాంతరాళమున వ్రీహియవలవలె సూక్ష్మముగ నుండువాఁడు, సర్వమును నియమించువాఁడు, సర్వమునకును శేషి, ఈసమస్త ప్రపంచమును పాలించు వాఁడు) అని పఠించి యున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈపైని గనఁబఱచిన ప్రకారము వాజసనేయులచే అగ్ని రహస్యమునను బృహదారణ్యకమునను ఈరెండుతావులను విధింపఁబడిన శాణ్డిల్యవిద్య యొక్కటి యేనా? లేక, ఈ రెండుతావులను విధింపఁబడిన శాణ్డిల్య విద్యలు భిన్నము లయినవా?

## పూర్వపక్షము

ఈ రెండు తావులను సంయోగ చోదనాఖ్యలయం దెద్దియు భేదము లేకపోయినను, బృహదారణ్యకమునఁ జెప్పఁబడిన వశిత్వాది (నియన్తృత్వాది) గుణములు అగ్ని రహస్యమునఁ జెప్పఁనకపోవుటచే స్వరూపమునందు భేదము సిద్ధించు చున్నది. కావున నీవిద్యలు భిన్నములే యనిన.

## సిద్ధాంతము

అది సరి కాదు. మనోమయత్వము ప్రాణశరీరత్వము, భారూపత్వమను గుణములు రెండుతావులను సమానములే. అయితే ఒకచోట వశిత్వాదిగుణ

ముల నధికముగాను మఱియొకచోట సత్య సఙ్కల్పత్వాది గుణముల నధికము గానును చెప్పియుండినను, వశియన్నను (సర్వమును తన వశమున నుంచుకొని యుండు వాఁడనినను) సత్యసంకల్పుఁ డనిన నొక్కటియెగాన, అనఁగా వశిత్వ సత్య సఙ్కల్పత్వములు భిన్నగుణములు కావు గాన, నీ రెండుతావులను విధింపఁబడిన శాణ్డిల్యవిద్య యొక్కటియే యనుట యుక్తము.

॥ సమానాధికరణము ముగిసెను. ॥

---

## సంబన్ధాధి కరణము

### ౨౦॥ సూ॥ సంబన్ధాదేవమన్యత్రాపి.

టీ॥ ఏవం=శాణ్డిల్య విద్యలో వలె, అన్యత్రాపి=అన్యమగు సత్త్య విద్య యందును, సంబంధాత్ =ఏకవిద్యా సంబంధమువలన, నామద్వయోప సంహారము యుక్తము.

తా॥ అగ్ని రహస్య బృహదారణ్యకములలోని శాణ్డిల్య విద్యలయందు విద్యైక్యమునుబట్టి గుణోపసంహార మెట్లు ఆవశ్యకమయ్యెనో, అట్లే బృహ దారణ్యమున, అధి దైవతా ధ్యాత్మములయందు సత్త్య విద్యైక్యమును బట్టి, "అహః అహం" అను నామద్వయాను సంధాన మావశ్యకమగును.

శ్రీ॥ భా॥ వాజసనేయులు సత్త్యవిద్యను విధించు సందర్భమున, "సత్యం బ్రహ్మ" (బృ. ౭-అ. ౪-బ్రా. ౨-వా.) అని యుపక్రమించి "తద్యత్స త్య మసౌ స ఆదిత్యోయ ఏష ఏతస్మిన్ మండలే పురుషో యశ్చాయం దక్షిణే ఽక్షిన్ పురుషః" (బృ. ౭-అ. ౫-బ్రా. ౧-వా.) (ఈ సత్యబ్రహ్మమే యీ యా దిత్య మండలమునందలి సూర్యుఁడును, ఈదేహమునందుండు కుడినేత్రమునం దలి పురుషుఁడును) అనుటచే నాదిత్య మండలమునను కుడినేత్రమునను సత్య బ్రహ్మమును వ్యాహృతి శరీరునిగా (భూః, భువః, సువః ఇత్యాది శరీరునిగా) నుపాసింపవలయునని యుపదేశించి, యనంతరము, "తస్యోపనిష దహరిత్యధి దైవతం" (బృ. ౭-అ. ౫-బ్రా. 3-వా.) (ఆ సత్యబ్రహ్మమున కధి దైవతమున ననఁగా నాదిత్య మండలమున "అహః" అనురహస్య నామము కలదు) అనియు "తస్యోప నిషద హమిత్యధ్యాత్మం" (అతని కధ్యాత్మమున ననఁగా కుడినేత్ర మున "అహం" అను రహస్య నామమున్ను కలదు) అనియును జెప్పి యీ రహస్యనామములను ఉపాసనాంగములనుగాను ఉపదేశించి యున్నారు. ఇచట నొక సంశయము గలుగుచున్నది.

—∘∘◆ సంశయము ◆∘∘—

శ్రుతివాక్యములచే నిర్దేశింపఁబడిన ప్రకారము ఈ రెండు నామముల లో నొకదాని నధిదైవతము నను, రెండవదాని నధ్యాత్మమునను, అను సంధించుకొన వలయునా? కాక, ఈ రెండు నామముల నధిదైవతమునను అధ్యాత్మమునను సమానముగ నను సధించుకొనవచ్చునా?

—∘∘◆ పూర్వపక్షము. ◆∘∘—

అధిదైవతాధ్యాత్మము లనంబడు యీ రెండు స్థానములయందును సత్య బ్రహ్మమే వ్యాహృతి · శరీరుఁడుగా నుపాసింపఁ బడుటచే నిచట ఉపాస్యవస్తువునం దెద్దియును భేదములేదు. ఇంతియె కాక, ఈ రెండు తావులను సంయోగ చోదనాదులు సయితము సమానములే. కాఁబట్టి యిచట విద్యైక్యము గద్దు. అందువలన నీ రెండు నామముల నధిదైవతమునను అధ్యాత్మమునను సమానముగ అను సంధించుకొనవచ్చును, ఎటువలెననిన; అగ్నిరహస్య బృహదారణ్యకముల లోని శాణ్డిల్య విద్యయందు మనోమయత్వాది గుణవిశిష్టమగు బ్రహ్మము అనఁగా నుపాస్యవస్తు వొక్కటి యగుటచే ఉపాస్యవస్తు స్వరూపమున భేదము లేనందున, ఆ రెండుతావులను ఉపదేశింపఁబడినట్టి యుపాసన మొక్కటి యగుటనుబట్టి యొకతావున నుపదేశింపఁబడిన గుణములను రెండవ తావున సయితము అనుసంధించుకొనుట యావశ్యకమగు చందంబున, ప్రకృతమునను అక్ష్యాదిత్య స్థానములయందు ఉపాసింపఁబడు సత్యబ్రహ్మ మొక్కటియే యయినందున స్వరూపమున భేదము లేకుండుటచే విద్యైక్య ముండుటనుబట్టి "అహః" అనియు "అహం" అనియు నీ రెండు నామములను రెండుతావులను ఉప సంహరించు కొనుట యావశ్యకమనిన;

అవతారిక:—ఈపైని గనఁబఱచిన ప్రకారము "అహః" అనియు, "అహం" అనియు నీ రెండునామములు రెండుతావులను అను సంధించుకొన వలసినవని ప్రాప్తింపఁగా, నందులకు సమాధానము చెప్పుటకై.

౨౧॥ సూ॥ న వా వి శే షా త్.

టీ॥ విశేషాత్=(స్థానభేదమునుబట్టి) యుపాస్యవస్తు స్వరూపమున భేద మున్నందున, నవా=ఉభయ నామములు ఉభయత్ర ప్రాప్తింపవు.

తా॥ స్థానభేదమునుబట్టి యుపాస్య వస్తు స్వరూపమునందు భేదము గన్పట్టుచున్నందున, ప్రకృతమున విద్యైక్యములేదు. కాఁబట్టి యీ రెండు నామములు ఉభయత్ర ప్రాప్తింపవు.

## సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ శాణ్డిల్య విద్యయందువలె ప్రకృతమునను విద్యైక్యము గలదను కొని అందువలన "అహః" "అహం" అను రెండు నామములను రెండు తావులను అను సంధించుకొనవలయునని చెప్పఁదగదు. ఏలననిన; ప్రకృతమున, ఉపాస్య వస్తువు అనఁగా సత్యబ్రహ్మ మొక్కటియే యయినను, దానిని ఒకతావున నా దిత్యమణ్డలమున నుండునట్టి దానిని గాను, మఱియొకతావున కుడికన్నేత్రమున నుండునట్టి దానినిగాను ఉపాసింపవలయునని యుపదేశించి యున్నందున, ఉపాస్య వస్తువగు సత్యబ్రహ్మముయొక్క స్థానమునందు భేదము కలదు. ఇందువలన స్వరూపమునను భేదము కలుగును. కావున ప్రకృతమున విద్యైక్యము లేదు. అగ్నిరహస్య బృహదారణ్యకములలోని శాండిల్యవిద్యల యందన్ననో, బ్రహ్మమును హృదయ స్థానమునందుండునట్టి దానినిగా నుపాసింప వలయునని యుపదేశించుటచే, అచట ఇట్టి స్థానభేదము లేదు. కావున యే స్థానమున నుపాసనాంగముగా నుపదేశించిన నామధేయము నాస్థానముననే యను సంధించుకొనవలయునని సిద్ధమగుచున్నది.

### ౨౨॥ సూ॥ దర్శయతి చ.

టీ॥ చ=మఱియు, దర్శయతి=శ్రుతియే తెలుపుచున్నది.

తా॥ మఱియు ఈవిషయమును శ్రుతియే తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ "అహః" "అహమ్" అను రెండు నామములు రెండుతావులను అను సంధించుకొనవలసినవి కావని శ్రుతియే తెలుపుచున్నది. ఏలననిన; "తస్యైతస్య తదేవరూపం యదముష్యరూపం" (ఈ యాదిత్యపురుషుని రూప మెట్టిదియో, యట్టిదియే యీ యక్షిపురుషుని రూపము సయితము) అను శ్రుతి వాక్యము హిరణ్యకేశాది రూపము లాదిత్యపురుషునికిఁ గలవని ముందుగ ఉపదేశించి, యా హిరణ్య కేశాదిరూపములే యక్షిపురుషునికిఁగూడ గలవని యతిదేశించుచున్నది. విద్యైక్యము లేమిం జేసి యొకతావున నుపదేశింపఁ బడిన రూపాదులు మఱియొకతావున నుప సంహర్తవ్యములు కానందునఁ గదా, యిట్లతి దేశము చేయవలసి వచ్చెను. ఈ హేతువును బట్టి యిచట విద్యైక్య ము లేదని స్పష్టమగుచున్నది.

సంబన్ధాధికరణము ముగిసెను.

## సమ్భృత్యధి కరణము.

### ౨౩॥ సూ॥ సమ్భృతి ద్యువ్యాప్త్యపి చాతః.

టీ॥ సంభృతి ద్యువ్యాప్తి- అపిచ=వీర్య సంభరణ ద్యులోకవ్యాప్తులును, అతః=స్థానభేదమునుబట్టి, (ఉపసంహర్తవ్యం = ఉపసంహరించు కొనఁదగినవి.)

తా॥ వీర్య సంభరణ ద్యులోకవ్యాప్తులను ఆయాస్థాన భేదమునుబట్టి యుపసంహరించు కొనవలయునే గాని, వానిని ప్రతితావునను ఉపసంహరించు కొనకూడదు.

శ్రీ॥ భా॥ తైత్తిరీయకమునందును నారాయణీయక ఖిలలయందును అనఁగా విధి నిషేధ రహిత వాక్యములయందును, "బ్రహ్మజ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివమాతతాన బ్రహ్మ భూతానాం ప్రథమోఽత జజ్ఞే తేనార్హతి బ్రహ్మణా స్పర్ధితుం కః" అను శ్రుతివాక్యము "బ్రహ్మము కారణముగాఁ గల యాకాశాదుల యుత్పాదనాది శక్తులు బ్రహ్మముచే భరింపఁబడుటయు, సర్వమునకు జ్యేష్ఠ కారణమగు బ్రహ్మము ద్యులోకమును వ్యాపించి యుండుటయు నీమొదలగు గుణాంశులు బ్రహ్మమునకుఁ గలవని తెలుపుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

#### సంశయము.

ఈ శ్రుతియందుఁ జెప్పఁబడిన వీర్య సంభృతి ద్యువ్యాప్త్యాది గుణములు అన్ని విద్యలయందును అను సంధించుకొనవలసినవా? లేక, అవి యుపదేశింపఁబడిన స్థానములయందు మాత్రమే యను సంధించుకొనవలసినవా?

#### పూర్వపక్షము.

ఈ గుణములు ఏదైన నొక యుపాసనముతో సంబంధించినవి గాను పఠింపఁబడక పోవుటచే, నివి యన్ని విద్యలయందును అను సంధించు కొనవలసినవనుట యుక్తమనినచో,

#### సిద్ధాంతము.

వీర్య సంభృత్యాది గుణము లిట్టి యుపాసనము నొనర్చునపుడు అను సంధించుకొనవలసినవని శ్రుతియందు నిర్దేశించి చెప్పియుండక పోయినను, ఈ గుణముల నన్ని యుపాసనములయందును అను సంధించు కొన కూడదు. అయితే స్థానభేదమునుబట్టి ఇట్టి స్థానముతో సంబంధించిన విద్యయం దీగుణములు అనుసంధాతవ్యము లనియు ఇట్టి స్థానముతో సంబంధించిన విద్యలయందీ గుణములు అను సంధాతవ్యములు కావనియును నిశ్చయింపవలయును. ఈ గుణము

లోకవిద్యను గుఱించి పఠించినవి కావే? ఇట్లుండ, ఇవి యొకస్థానముతో సంబంధించినవని యెట్లు నిశ్చింపఁ దగునంటివేని, వాటి సామర్థ్యమునుబట్టి కనుగొనునది. అది యెట్లనిన, ఈశ్రుతియందుఁ జెప్పఁబడిన ద్యువ్యాప్తి (ద్యులోకమును వ్యాపించి యుండుట) అను గుణమును హృదయాద్యల్ప స్థానములతో సంబంధించిన శాణ్డిల్య దహరాది విద్యలయందు అను సంధించుకొనుట యశక్యము. మఱియు వీర్య సమ్భృతియనఁబడు గుణము ద్యువ్యాప్తియనఁబడు గుణముతోఁ గూడ శ్రుతియందుఁ జెప్పియున్నందున, నట్టి ద్యువ్యాప్తి యను గుణము నను సంధించుకొనఁదగిన విద్యలయందే దీనిని గూడ అనుసంధించు కొనవచ్చునే కాని, యల్ప స్థానములతో సంబంధించిన విద్యలయందు దీని నను సంధించుకొనుట యశక్యము. అయితే "జ్యాయాన్ పృథివ్యాః" (ఛా-3. ప్ర. ౧౪-ఖ 3-వా.) అను శ్రుతివాక్యము శాణ్డిల్యవిద్యయందు ఉపాస్యుఁడగు పరబ్రహ్మము పృథివ్యాదులకంటె గొప్పవాఁడనియు "యావాన్వా అయమాకాశః తావానేషోఽన్త ర్హృదయ ఆకాశః" (ఛా. ౮-ప్ర. ౧-ఖ. 3-వా.) అను శ్రుతి వాక్యము దహర విద్యయందుఁ జెప్పఁబడిన హృదయాకాశ మీ పాంచభౌతికా కాశమునకంటె గొప్పదనియును చెప్పుచున్నను, శాణ్డిల్య దహరాద్యల్ప స్థాన సంబంధులగు విద్యలయం దట్టి గుణములు అను సంధించుకొనుట కశక్యములు. కావున, ఈ పై శ్రుతులు మనోమయత్వ అపహత పాప్మత్వాది విశిష్టుఁడుగా నా విద్యలయందు ఉపాస్యుఁడగు పరబ్రహ్మముయొక్క మాహాత్మ్యమును ప్రతిపాదించుటకై యుపయుక్తము లగుచున్నవి.

సమ్భృత్యధికరణము ముగిసెను.



## పురుష విద్యాధికరణము.

౨౪॥ సూ॥ పురుషవిద్యాయామపి చేతరేషామనామ్నానాత్.

టీ॥ పురుషవిద్యాయామపి చ=ఉభయత్రను, పురుషవిద్యయను పేరొక్కటియే యైనను, ఇతరేషాం=ఒకతావునఁ జెప్పఁబడిన గుణములు వేఱొక్కతావునఁ జెప్పఁబడక పోవుటచే (విద్యాభేదః=విద్యలకు భేదము, అస్తి=కలదు.)

తా॥ ఛాందోగ్య తైత్తిరీయోపనిషత్తులయందు రెండుతావులను పురుషవిద్యయనెడి పేరొక్కటియే యైనను, ఒకతావునఁ జెప్పఁబడిన గుణములు వేఱొక్కతావునఁ జెప్పఁబడక పోవుటచే నందు పఠింపఁబడిన పురుష విద్యలకు భేదము కలదు.

శ్రీ॥ భా॥ తైత్తిరీయులు పురుష విద్యను పఠించి యున్నారు. అందు వీరు "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః, శ్రద్ధా పత్నీ, శరీర మిధ్మ, మురో వేది, ర్లోమాని బర్హిః" (తై. నా. ౮౦ అను) ఇత్యాది వాక్యములచే "ఇట్లు ఎఱింగిన విద్వాంసునియొక్క యాత్మను యజ్ఞముయొక్క యజమానుని గాను, ఆస్తిక్యబుద్ధిని పత్నిని గాను, దేహమును సమిత్తునుగాను, వక్షుస్థలమును యజ్ఞ వేదికనుగాను, శరీరమునందలి వెండ్రుకలను దర్భలను గాను, శిఖను వేదమును గాను, హృదయమును పశువును గాను, నివ్విధమున భావించి యుపాసింప వలయును" అని పఠించియున్నారు.

ఛందోగులును పురుషవిద్యను పఠించియున్నారు. ఇందు వీరు "పురుషో వావ యజ్ఞః తస్య యాని చతుర్వింశతి వర్షాణి" (ఛా. 3-ప్ర. ౧౬-ఖ. ౧-వా.) అను వాక్యమున "పురుషుని యజ్ఞమునుగాను వాని యాయుస్సును మూఁడు విధములుగ విభజించి వానిని ప్రాతర్మాధ్యందిన తృతీయ సవనములనుగాను భోజనేచ్ఛాదులను దీక్షాదులనుగానును అను సంధించుకొనునది" అని యీవిధ మునఁ బఠించియున్నారు. ఇందొక సంశయ గలుగుచున్నది.

సంశయము.

ఇట్లు ఛాందోగ్య తైత్తిరీయోపనిషత్తులయందు ఉపదేశింపఁబడిన పురుషవిద్య యొక్కటియేనా? లేక, అవి భిన్నములయినవా ?

పూర్వపక్షము

ఈ రెండు తావులను ఉపదేశింపఁబడు విద్య పురుషవిద్యయనియే పిలువఁ బడుచున్నందునను, రెండుతావులను పురుషావయవములు యజ్ఞావయవములు గాను భావింపఁ బడుటచేతను విద్యాస్వరూపమునం దెద్దియు భేదము లేదు, తైత్తిరీయకమునందు ఫలము జెప్పఁబడక పోవుటచే ఛాందోగ్యమునందు "ప్రహ షోడశం వర్షశతం జీవతి" (ఛా. 3. ప్ర. ౧౬. ఖ. ౭ వా) అను వాక్యమునఁ జెప్పఁబడిన సంపూర్ణాయుర్దాయప్రాప్తియే (యుభయత్ర) ఫలమగుటం జేసియు నీరెండుతావులను ఫల సంయోగమునందున భేదము లేదు. కావున, ఈ రెండు తావులను పఠింపఁబడిన విద్య యొక్కటియే యనుట యుక్తము.

సిద్ధాంతము

ఛాందోగ్య తైత్తిరీయోపనిషత్తులయందు రెండుతావులను పఠింపఁబడినది పురుష విద్యయే యయినను, అందు ఒకతావునఁ జెప్పఁబడిన గుణములు రెండవతావునఁ జెప్పియుండక పోవుటం జేసి, యిచట ఉపదేశించిన విద్యలకు భేదము ఉన్నట్లు స్పష్టపడుచున్నది. అదెటు లనిన, తైత్తిరీయులు సాయంప్రాత

ర్మధ్యందినకాలములనుసవనత్రయమునుగా భావించునదియని పఠించియున్నారు. ఛందోగులో, అట్లు పఠింపక, పురుషుని యాయుస్సును మూఁడువిభాగములుగ విభజించి దానిని సవనత్రయమునుగా భావించునదియని పఠించియున్నారు. మఱియు ఛందోగులు భోజనేచ్ఛాదులను దీక్షాదులనుగా భావించుచున్నారు. తైత్తిరీయులో, అట్లు వానిని భావించి యుండలేదు. మఱియు తైత్తిరీయకమునందు ఉపదేశింపఁబడిన యజమానపత్న్యాదిభావన ఛాందోగ్యమున వేఱొక్కవిధమునఁ జేయఁబడినది. ఈ హేతువులవలన నీరెండుతావులను ఉపదేశింపఁబడు పురుష విద్యాస్వరూపమునందు భేదము గద్దు. ఇంతియె కాక, తైత్తిరీయులు పూర్వానువాకమున "బ్రహ్మణే త్వామహస ఓమిత్యాత్మానం యుఞ్జీత" (తై. నా. ౭౯ అను) అను వాక్యమున బ్రహ్మవిద్యను ఉపదేశించి, తరువాత "బ్రహ్మణోమహిమాన మాప్నోతి" (తై. నా. ౮౦. అను) అను వాక్యమున నిట్టి బ్రహ్మవిద్యకు పరబ్రహ్మము యొక్క మహిమను బొందుటయే ఫలమని చెప్పి, అనంతరము "తస్యైవం విదుషః" (తై. నా. ౮౦. అను) అను వాక్యమున అట్టి బ్రహ్మవిద్యా నిష్ఠుని పరామర్శించి యుపదేశించిన పురుషవిద్య వానియందు యజ్ఞత్వ భావనయేయని తెలియుచున్నది. కావున ఈ పురుషవిద్య పూర్వానువాకమునందు ఉపదేశింపఁబడిన బ్రహ్మవిద్యకు అంగభూతమగుటఁజేసి దీనికి బ్రహ్మప్రాప్తియే ఫలము. ఫలనిర్దేశపూర్వకముగఁ జెప్పఁబడిన దాని సాన్నిధ్యమున వేఱొక్కటి ఫలనిర్దేశము జేయకయే చెప్పఁబడినచో, నది ఫలనిర్దేశపూర్వకముగఁ జెప్పఁబడిన దానికంగిమనుకొనుట న్యాయము. కావున తైత్తిరీయులచే పూర్వానువాకమున ఫలనిర్దేశ పూర్వకముగ ఉపదేశింపఁబడిన బ్రహ్మవిద్యకు ఈ యనువాకమున ఫల నిర్దేశము జేయకయే యుపదేశింపఁబడిన పురుష విద్య యంగమని యెఱుఁగునది. ఛందోగులచే నుపదేశింపఁబడిన పురుషవిద్యకు ఫలము సంపూర్ణాయుర్దాయప్రాప్తి యని యీ పైని చెప్పియుంటిమి. ఈ పైని గనఁబఱచిన హేతువులవలన ఛందోగుల యొక్కయు, తైత్తిరీయుల యొక్కయును పురుషవిద్యల స్వరూపమునను, ఫల సంయోగమునను భేదము గద్దు. ఇందువలన నిచట విద్యాభేదము గలదని సిద్ధమగుచున్నది. కావున నిందొకతావునఁ బఠింపఁబడిన గుణములను వెఱొక్కతావునను సంధించుకొన కూడదు.

ఇతి పురుష విద్యాధికరణము ముగిసెను. ఇతి



## వేధాద్యధి కరణము.

### ౨౫॥ సూ॥ వేధాద్యర్థ భేదాత్.

టీ॥ వేధాద్యర్థభేదాత్ =[1]అభిచారాధ్యాయ నాదులయందు "శుక్రంప్ర విధ్య" ఇత్యాది వాక్యములకు ఉపయోగము గానఁబడు చున్నందున, నవి బ్రహ్మ విద్యాంగములు కావు.

తా॥ భిన్నభిన్న శాఖల వారిచే ఉపనిషదా రంభమునఁ బఠింపఁబడిన "శుక్రం ప్రవిధ్య" ఇత్యాది వాక్యములకును ప్రవర్గ్యాది కర్మములకును అభి చారాధ్యయనాదులయందు వినియోగము గానఁబడుటం జేసి, యవి బ్రహ్మ విద్యాంగములు కావు.

శ్రీ॥ భా॥ ఆథర్వణికులు ఉపనిషదారంభమున, "శుక్రం ప్రవిధ్య హృద యం ప్రవిధ్య" ఈ మొదలగు మంత్రములను పఠించుచున్నారు.

సామవేదులు రహస్య బ్రాహ్మణా రంభమున "దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ" ఈ మొదలగు మంత్రములను పఠించుచున్నారు.

కాఠకులును తైత్తిరీయులును ఉపనిషత్తుల యారంభమున, "శంనో మిత్ర శ్శం వరుణః" ఈ మొదలగు మంత్రములను పఠించుచున్నారు.

శాట్యాయనులు ఉపనిషదారంభమున "శ్వేతోఽశ్వో హరినీలోఽసి" ఈమొదలగు మంత్రములను పఠించుచున్నారు.

ఐతరేయులు ఉపనిషదా రంభమున "ఇన్ద్రోహ వై వృత్రం హత్వా మహానభవత్" ఈ మొదలగు మహావ్రత బ్రాహ్మణమును పఠించుచున్నారు.

కౌషీతకులును "ప్రజాపతిర్వై సంవత్సర స్తస్యైష ఆత్మాయన్మహా వ్రతం" ఈ మొదలగు మహావ్రత బ్రాహ్మణమునే పఠించుచున్నారు.

వాజసనేయులు ఉపనిషత్తుయొక్క యారంభమున "దేవా హవై సత్రం నిషేదుః" ఈమొదలగు ప్రవర్గ్య బ్రాహ్మణమును పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఇట్లు ఉపనిషదా రంభమునఁ బఠింపఁబడిన, "శుక్రం ప్రవిధ్య" "శంనో మిత్రశ్శం వరుణః" ఇత్యాది మంత్రములును ప్రవర్గ్యాది కర్మములును ఆ యా యుపనిషత్తులయందు ఉపదేశింపఁబడిన విద్యల కంగములా ? కావా ?

### పూర్వపక్షము.

ఆయా యుపనిషత్తులయందు ఉపదేశింపఁబడు విద్యల సాన్నిధ్యమునఁ బఠింపఁబడి యుండుటచే, నివి విద్యాంగము లనుట యుక్తము. "శుక్రం ప్రవిధ్య"

1. అభిచారకర్మమనఁగా, శత్రుహింసార్థము ఆచరింపఁబడు "శ్యేనయాగము" "రక్తసా ... సహోమము" మొదలగునవి. వీనికి లోకమున "శాతపడి చేసి చంపుట" అను వాడుక కలదు.

ఇత్యాది మంత్రములకును ప్రవర్గ్యాది కర్మములకున్ను ఆయా కర్మలయందు విని యోగ మున్నట్లు బలవత్ప్రమాణములగు శ్రుతి లింగవాక్యములవలనఁ దెలియ వచ్చుచున్నను, "శంనోమిత్రః" "సహనావవతు" ఇత్యాది మంత్రముల కెచ్చ టను వినియోగము లేనందునను, ఇవి విద్యాప్రకరణమునఁ బఠింపఁబడిన వయిన వగుటంజేసియును తప్పక విద్యాంగములు గావలయును. కనుక ఈ మంత్రముల నన్ని విద్యలయందును అనుసంధించు కొనవలయు ననినచో,

## —◆ సిద్ధాంతము. ◆—

"శుక్రం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య" ఇత్యాది మంత్రము "ఓ దేవతా నా శత్రువుయొక్క ఘుాస్త్వమును భేదింపుము. వాని హృదయమును విదా రింపుము" అని తెలియఁజేయు చున్నందునను, ఇటులనే "ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి" అనుమంత్రము "సరిగా ఉచ్చరించుచున్నాను సత్యమును జెప్పుచున్నాను" అనియు "ఋతము వాదిషమ్ సత్యమ వాదిషమ్" అను మంత్రము "సరిగా ఉచ్చరించితిని సత్యమును చెప్పితిని అనియు, "తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై" అనుమంత్రము "మాచేత నధ్యయనము జేయఁబడినది తేజోవంతమగు గాక శిష్యాచార్యులమగు మా యిద్దఱికిని ద్వేషము గలుగక పోవుగాక" అనియు నిట్లు చెప్పుచు న్నందునను ఈపై మంత్రములు అభిచార కర్మముతోను వేదాధ్యయన ముతోను సంబంధించియున్నట్లు దెలియనచ్చుచున్న వనుటకు సందియము లేదు. కనుక నీమంత్రములు విద్యాంగములు అనఁగా నుపాసనాంగము లెంతమాత్ర ము కావు. ఎట్లనిన, "హృదయం ప్రవిధ్య" ఇత్యాది మంత్రమునఁ జెప్పఁబడిన హృదయచ్ఛేదనాది రూపమగు విషయమునుబట్టి "శుక్రం ప్రవిధ్య" ఇత్యాది మంత్రములు అభిచార కర్మముతో సంబంధించి యున్నట్లు దెలియవచ్చురీతిని "ఋతం వదిష్యామి" "సత్యం వదిష్యామి" "తేజస్వినా వధీతమస్తు" ఇత్యాది మంత్రార్థములను పరిశీలించుటచే "శంనోమిత్ర శ్శంవరుణ" ఇత్యాది మంత్రములు వేదాధ్యయనముతో సంబంధించినట్లు విదితమగుచున్నది గాన నీమంత్రము లెంతమాత్రము ఉపాసనముతో సంబంధించినవి అనఁగా ఉపాసనాంగములు గానేరవు. అయితే శుక్రం ప్రవిధ్యేత్యాది మంత్రములును ప్రవర్గ్యాది బ్రాహ్మ ణములున్ను పగటివేళ పఠింపకూడనివై (ఉపనిషత్తులవలె) నరణ్యమునందు పఠింపవలసిన వగుటం జేసియును ఉపనిషదారంభమునఁ బఠింపఁబడినవి.

వేధాద్యధికరణము ముగిసెను.



## —హాన్యధి కరణము.—

౨౬॥ సూ॥ హానౌ తూపాయన శబ్ద శేషత్వాత్కుశాచ్ఛన్దస్స్తుత్యుప గాన వత్తదుక్తం॥

టీ॥ తు=పూర్వపక్షమయుక్తము, కుశాచ్ఛన్దస్స్తుత్యుపగానవత్ =కుశాచ్ఛన్దస్స్తుత్యుపగానములయందు ఒకశాఖయందుఁ బఠింపఁబడిన వాక్యము శాఖాన్తరమునఁ బఠింపఁబడిన వాక్యముయొక్క శేషమగునట్లు, ఉపాయన శబ్ద శేషత్వాత్ = హానవాక్యమునకు ఉపాయనవాక్యము శేషమగుటం జేసి, హానౌ=హానము నను సంధించుకొను తావున ఉపాయనమును సయితము అను సంధించుకొనునది. తత్ = అది, ఉక్తం=పూర్వమీమాంసయందుఁ జెప్పఁబడినది.

తా॥ హానమును గాని, యుపాయనమును గాని, దేనినైన నొక్కదానిని మాత్ర మొక్క విద్యయందను సంధించు కొనవలయు ననెడి పూర్వ పక్షము యుక్తము కాదు. ఏలననిన, కుశాచ్ఛన్దస్స్తుత్యుప గానములయందు ఒకశాఖయందుఁ బఠింపఁబడిన వాక్యము శాఖాన్తరమునఁ బఠింపఁబడిన వాక్యమునకు శేషమగునట్లు, హానవాక్యమునకు ఉపాయన వాక్యము శేషమగుటం జేసి, హానము నను సంధించుకొను తావున ఉపాయనమును సయితము అను సంధించు కొనునది. అది పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షమును బొందునట్టి బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపములను గుఱించి పఠించు సందర్భమున, ఛందోగులు "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చన్ద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" (ఛా. ౮-ప్ర-౧3. ఖ.) అను వాక్యమున "బ్రహ్మవేత్త అశ్వము రోమములను విదలించి వేయునట్లు, పాపములను విదిలించి రాహు ముఖములోనుండి చంద్రుఁడు బయలు వెడలునట్లు, శరీరములో నుండి బయలువెడలి కృతార్థుఁడయి యసృజ్యమానమగు బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు" అని పఠించి యున్నారు.

ఆథర్వణికులు, ఈసందర్భమున, "తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి" (ము. 3-ము. ౧-ఖ. 3-వా.) అను వాక్యమున "బ్రహ్మవేత్త పుణ్యపాపములను విదల్చి పరిశుద్ధుఁడై బ్రహ్మముతో పరమసామ్యమును బొందుచున్నాఁడు" అని పఠించుచున్నారు.

శాట్యాయనులు ఈ సందర్భమున "తస్య పుత్రా దాయ ముపయన్తి సుహృదః సాధుకృత్యాం" అను వాక్యమున "బ్రహ్మవేత్తయొక్క పుత్రులు

వాని దాయలబ్ధమగు ద్రవ్యమును బొందుదురు. సుకృతకర్మములను వాని మిత్రులును పాపకర్మములను వాని శత్రువులును బొందుదురు" అని పఠించు చున్నారు.

కౌషీతకులు "తత్సుకృత దుష్కృతే తస్య ప్రియా జ్ఞాతయః సుకృత ముపయన్త్యప్రియా దుష్కృతం" (కౌ-౧. అ-౪.) అను వాక్యమున "బ్రహ్మ వేత్తయగు పురుషుఁడు తన సుకృత దుష్కృతములను విడల్చును. వానికిఁ బ్రియు లగు జ్ఞాతులు సుకృతములను అప్రియులగు జ్ఞాతులు దుష్కృతములనున్ను బొందుదురు" అని పఠించుచున్నారు.

ఈ పైని యుదహరించిన శ్రుతివాక్యములలోఁ గొన్నితావుల సుకృత దుష్కృతములు బ్రహ్మవేత్తను విడుచునని వినఁబడుచున్నది. కొన్ని తావుల వానియొక్క ప్రియులగు జ్ఞాతులు సుకృతమును అప్రియులగు జ్ఞాతులు దుష్కృ తమునున్ను బొందుదురని వినఁబడుచున్నది. మఱి కొన్నితావుల ఈ పైని చెప్పిన రెండును వినఁబడుచున్నవి.

బ్రహ్మప్రాప్త్యుపాయములుగా శ్రుతులయందు విధింపఁబడిన యుపా సనములలో దేని ననుష్ఠించుచున్నను, బ్రహ్మమును బొందువాఁడు పుణ్య పాప రహితుఁడు తప్పక కావలయును. ఇట్లు పుణ్య పాపరాహిత్యమును తెలుపుటకు గాను శ్రుతులు బ్రహ్మవేత్తయొక్క పుణ్యముల నతని స్నేహితులు పొందు చున్నారనియు, పాపముల నతని శత్రువులు పొందుచున్నారనియును తెలుపు చున్నవి. "బ్రహ్మవేత్త పుణ్యపాపములను విడల్చు చున్నాఁడు" అని యొక విద్యయందును "అతని పుణ్యమును స్నేహితులును పాపమును శత్రువులును పొందుచున్నారు" అని మఱియొక విద్యయందును పఠించియున్నను, అనఁగా నీరెంటిని ప్రతి విద్యయందును పఠింపక పోయినను, ఈ పైని గనఁబఱచిన ప్ర కార మేవిద్య ననుష్ఠించుచున్నను, పుణ్యపాప రాహిత్య మావశ్యక మగుటం జేసి, ఈ రెండును అన్నివిద్యల కంగములు కాఁదగినవి. ఇట్లుండ, ఇందొక్కటి విచారింపవలసియున్నది.

సంశయము.

ఈ పై శ్రుతివాక్యములయందుఁ బఠింపఁబడిన హాన చింతన, (విద్వాం సుఁడు పాపములను విడల్చుచున్నాఁడనెడి యను సంధానము) ఉపాయన చింత న, (విద్వాంసుని పుణ్యపాపములను ప్రియాప్రియులు బొందుచున్నా రనెడి యను సంధానము) తదుభయ చింతనము (ఈరెంటి ననుసంధించు కొనుటయు)

లలోఁ దేనినైన నొక్కదానిని మాత్రము ఒక్కవిద్యయందు మాత్ర మనుసంధించుకొన వలయునా? లేక, అన్నింటిని ప్రతివిద్యయందు ననుసంధించుకొన వలయునా?

—•—◆ పూర్వపక్షము. ◆—•—

హానోపాయనములను ప్రత్యేకించి పఠించియున్నందున అనఁగా నొకతావున హానమును మాత్రము, మఱియొకతావున ఉపాయనమును మాత్రము పఠించియుండుటం జేసి హానమునైనను ఉపాయనమునైనను దేనినైన నొకదాని నొకవిద్యయందను సంధింపవలయునని తెలియవచ్చుచున్నది. హానోపాయముల ను రెంటిని యితరత్రయుపసంహరించుకొను పక్షమున, ఈ రెంటిని ప్రతివిద్య యందును అను సంధించుకొనవలయునే? అట్లగునేని, కౌషీతక శాఖయందు హానోపాయనములు రెండును పఠింపఁబడిన వగుచు, ఇతర శాఖలయందు ఉపసంహరింపఁ బడుచున్నవిగాన, వాని ననేక తావులఁ బఠింపవలసిన యావశ్యక మేమున్నది? ఇట్లు ఒకతావునఁ బఠింపఁబడినంత మాత్రమున నన్నితావులను సంప్రాప్త మగుచుండ, మరల పఠించుట నిరర్థకమగును. కనుక ననేకతావుల హానోపాయనములను ప్రత్యేకించి పఠించుటకుఁ బ్రయోజనము హానమునైనను ఉపాయనమునైనను దేనినైన నొకదానిని మాత్ర మొకతావున ననుసంధింప వలయుననుటయే యనిసూచితమగుచున్నది. శ్రోత లనేకు లగుటం జేసి అనేకుల కనేకతావుల వీని నుపదేశించియుండిరి గాన, నిట్లు చెప్పుట నిరర్థకము కాదని యందు వేమో? ఇట్లు చెప్పుట సరియయిన సమాధానము కాదు. ఏలననిన, ఒకతావునఁ బ్రతిపాదించిన దానినే అనేకతావుల నదే ప్రకారముగ (భేదము లేకుండ) ప్రతిపాదించియుండినచోఁ గదా, వక్తలు గాని శ్రోతులు గాని యనేకు లయినందున ననేకతావుల నొక్కవిషయము నొక్కప్రకారము గానే ప్రతిపాదించిరి గాన మరల మరల ప్రతిపాదించుట నిరర్థకము కాదనుట సరియయిన సమాధానమగును. ప్రకృతమున నన్ననో, అట్లు కాదు. ఏలననిన, రెండు శాఖలయందు హానము మాత్రము పఠింపఁబడినది. ఒకశాఖయందు ఉపాయనము మాత్రము పఠింపఁబడినది. కానిమ్ము, విద్యాభేద ముండుటం జేసి కొన్నితావుల హానము మాత్రము, మఱికొన్నితావుల నుపాయనము మాత్రము పఠింపఁబడిన వనియెద వేమో? అట్లు చెప్పుట కవకాశములేదు. ఏలననిన, అన్నివిద్యలయందును హానోపాయనము లంగములుగ నను సంధాతవ్యములని యింతకు ముందు చెప్పఁబడియెను గదా! (కావున విద్యాభేద మెంతమాత్రము కారణము గానేరదు) కనుక హానమునైనను ఉపాయనమునైనను దేనినైన నొకదాని నొకతావున మాత్ర మను సంధించుకొనవవలయుననుట యుక్త మనినచో,

## సిద్ధాంతము

ఒకతావున హానము మాత్రము, మఱియొక తావున ఉపాయనము మాత్రము పఠింపఁబడియున్నను, హానప్రతిపాదక వాక్యమునకు ఉపాయనప్రతిపాదక వాక్యము శేషమగుటం జేసి, హానోపాయనములను రెంటిని ప్రతివిద్యయందును ఉపసంహరించు కొననలయును. హానవాక్యము పుణ్యాపాపములు విద్వాంసుని ఎడబాయు చున్నవని తెలుపఁగా, ఉపాయన వాక్య మట్లు విద్వాంసుని ఎడబాసినవి యగు పుణ్యాపాపములు పోవునట్టి ప్రదేశములను వివరించు చుండుటం జేసి, హానవాక్యమునకు ఉపాయన వాక్యము శేషమగుట యుచితమే. అయితే ఒకతావునఁ బఠింపఁబడిన హానవాక్యమునకు వేఱొక్క తావునఁ బఠింపఁబడిన యుపాయన వాక్యము శేష మెట్లు కాఁదగునని శంకింపఁ బనిలేదు. ఏలననిన, ఒకతావునఁ బఠింపఁబడిన వాక్యమునకు వేఱొక్కతావునఁ బఠింపఁబడిన వాక్యము శేషమగు విషయమై కుశాచ్ఛన్దస్స్తుత్యుపగానా ద్యనేక దృష్టాంతములు గలవు.

ఎట్లనిన:—"కుశావాన స్పత్యాః" అను కాలాపుల శ్రుతియందు కుశలకు వనస్పతిప్రభవత్వము సామాన్యముగఁ జెప్పఁబడినది. "ఔదుంబర్యః కుశాః" అను శాట్యాయనుల విశేషవచనము వలన ఆ కుశలౌదుంబరములని సిద్ధించుచున్నది. ఇచట కాపాలుల వాక్యమునకు శాట్యాయనుల వాక్యము శేషమగుచున్నది. అనఁగా కాపాలుల వాక్యముచేఁ జెప్పఁబడిన దానిని శాట్యాయనుల వాక్యము పూర్తి చేయునది యగుచున్నది.

మఱియు "దేవా సురాణాం ఛన్దోభిః" అను వాక్యము "దేవాసుర ఛందస్సులచే" అని మాత్రము చెప్పుచున్నది. ఇచట దేవాసుర ఛన్దస్సులు సామాన్యముగాఁ బ్రాప్తించుటం జేసి, వీనిలో దేనిని ముందుగ ప్రయోగింపవలయునో, దేనిఁ బిమ్మట ప్రయోగింపవలయునో నిశ్చయములేక యుండఁగా, "దేవచ్ఛన్దాంసి పూర్వం" అను పైంగి రహస్య బ్రాహ్మణము దేవచ్ఛన్దస్సులను పూర్వము ప్రయోగింపవలయు ననుచు దేవాసుర ఛందస్సులను ప్రయోగించు క్రమవిశేషమును జూపించుటచే "దేవాసురాణాం ఛన్దోభిః" అను వాక్యమున కిది శేషమగుచున్నది.

మఱియు "హిరణ్యేన షోడశినః స్తోత్ర ముపాకరోతి" అను శ్రుతివాక్యము అతిరాత్ర యాగమునందు, షోడశి గ్రహాంగ భూతమగు స్తోత్రమును విధించుచున్నది. ఈ వాక్యమునందట్టి స్తోత్రమునకు కాల విశేషము చెప్పఁబడక పోవుటం జేసి, యన్ని కాలములయందును సామాన్యముగ ఈ స్తోత్రము ప్రాప్తింపఁగా, "సమయాధ్యుషితే సూర్యే షోడశినః స్తోత్ర ముపాకరోతి" అను

ఋగ్వాక్యము సూర్యోదయమయి యవకుండఁగా నుండు సమయమున ఈ స్తోత్రమును జేయవలయు ననుచు షోడశిగ్రహ స్తోత్రమునకు కాలవిశేషమును విధించుటం జేసి, యీ ఋగ్వాక్యము పై వాక్యమునకు శేషమగు చున్నది.

మఱియు "ఋత్విజ ఉపగాయన్తి" అను వాక్యమువలన సామాన్యముగ ఋత్విక్కులందఱు గానము చేయవలయునని ప్రాప్తిపఁగా, "నాధ్వర్యురుపగాయతి" అను కాలాపుల వాక్యము అధ్వర్యుఁడు గానము జేయఁడనుచు అధ్వర్యుఁడు తప్ప తక్కిన వారు మాత్రము గానము జేయవలయునని విశేషమును దెలుపుచున్నది.

ఇట్లు ఏదైన నొక విషయమును సామాన్యముగ స్థాపించు వాక్యమునకు ఆ విషయమునే విశేషముగ నిర్ధారణ చేయునట్టి వాక్యాంతరము శేషభూతమని యంగీకరింపనియెడల, వికల్పమునే యాశ్రయింపవలయును. అనఁగా నారెంటిలో నెద్దియైన నొక్కదానియందుఁ జెప్పియున్నట్లు మాత్ర మనుష్ఠింప వచ్చునని ప్రాప్తించును. అయితే అట్టి వాక్యములకుఁ గల యేకవాక్యత యనునది శేషత్వమును సంఘటింపఁ జేయఁగగి యుండగా, వికల్పము నాశ్రయించుట తగదని పూర్వమీమాంసకులు "[1]అపి తు వాక్య శేషత్వా దన్యాయ్యత్వాద్వికల్పస్య విధీ నామేకదేశః స్యాత్" (పూ.మీ.౧౦ అ. ౮. పా. ౧౫ సూ)అను సూత్రముచేఁ జెప్పియున్నారు.

ఈపైని ప్రతిపాదించిన ప్రకారము హానోపాయన వాక్యముల కేక వాక్యత ఘటింపుచుండుటం జేసి, కేవల హానము గాని, కేవల యుపాయనము గాని ప్రమాణ సిద్ధము కానందున, ఒక్కొక్క విద్యయందును వానిలోఁ దేనినైన నొక దానిని మాత్ర మను సంధించు కొనవలయుననుట యుక్తము కాదు. కౌషీతకులు హానోపాయనములను రెంటిని ఇతర స్థలములయందుఁ బఠిం

(1.) "దీక్షితో నజుహోతి" అను శ్రుతివాక్యము "దీక్షితుఁడు హోమము జేయఁగూడదు" అని తెలుపుచున్నది. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతివాక్యము "బ్రతికియున్నంతవరకును హోమము చేయవలయును"అని తెలుపుచున్నది. ఇందు వికల్పము నాశ్రయించి మొదటివాక్య ప్రకారము హోమమును చేయకయే యుండుటగాని, లేక రెండవవాక్య ప్రకారము హోమమును చేయుచునే యుండుటగాని ప్రాప్తింపఁగా, పూర్వ మీమాంసకులు మొదటివాక్యమును రెండవవాక్యమునకు శేషమునుగాఁ గొని దీక్షితుఁడుగానుండునప్పుడు మాత్రము హోమముచేయ కూడదనియు తక్కిన సమయమునందు యెల్లకాలమును హోమము చేయవలయుననియును నిర్ణయించియున్నారు. ఈపైని యుదహరింపఁబడిన పూర్వ మీ మాంసాసూత్రమునకు "అపితువాక్యశేషత్వా దితరపర్యు దాసస్స్యాత్ ప్రతిషేధే వికల్పస్స్యాత్" అను పాఠభేదము పూర్వ మీ మాంసాగ్రంథములయందుఁ గానఁబడుచున్నవి.

చినప్రకారము గానే పఠించుటం జేసి, యందుండు పునరుక్తి శ్రోతృ భేదమును బట్టి యుండునది యని యెఱుంగునది.

॥ హాన్యధికరణము ముగిసెను. ॥

—✦—

## సామ్పరాయాధి కరణము

౨౭॥ సూ॥ సా మ్ప రా యే త ర్త వ్యా భా వా త్త థా హ్యా న్యే ॥

టీ॥ సామ్పరాయే=దేహములోనుండి జీవుఁడు బయలు వెడలు సమయమున, (సుకృత దుష్కృతే=బ్రహ్మవేత్తను పుణ్యపాపములు, హీయేతే=విడుచుచున్నవి, ఏలననఁగా) తర్తవ్యాభావాత్=తరువాత వానివలనఁ బొందవలసినది మఱి యెద్దియును లేనందున, తథాహి=అట్లే కదా, అన్యే=ఇతర శాఖలవారు (పఠన్తి=పఠించుచున్నారు.)

తా॥ దేహములోనుండి జీవుఁడు బయలు వెడలిన తరువాత, పుణ్యపాపముల వలన బ్రహ్మవేత్త పొందవలసిన దెద్దియును లేనందున, దేహవియోగ కాలముననే యవి యాతని వదలుచున్నవని యేర్పడుచున్నది. అట్లే కదా ఇతర శాఖలవారు కొందఱు పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్త సుకృత దుష్కృతముల నెడఁబాయుటయు, అట్లు వానిచే నెడఁబాయఁబడిన సుకృతదుష్కృతములు వాని ప్రియాప్రియులకుఁ బోవుటయను నీరెంటిని ప్రతివిద్యయందు నను సంధించుకొనవలయునని పూర్వాధి కరణమున నిశ్చయింపఁబడెను.

ఇట్లు బ్రహ్మవేత్తకుఁ గలుగు సుకృత దుష్కృత వియోగమును గుఱించి యొక సంశయము కలుగుచున్నది.

### సంశయము

ఈపైని చెప్పఁబడిన ప్రకారము బ్రహ్మవేత్తకుఁ గలుగు సుకృత దుష్కృత వియోగము దేహవియోగ కాలమునందును, ఈ దేహమును విడిచి దేవయాన మార్గమునఁ బోవునట్టి సమయమున మార్గ మధ్యముననున్ను గలుగుచున్నదా? లేక, దేహ వియోగ కాలమునందు మాత్రమే కలుగుచున్నదా?

### పూర్వపక్షము.

బ్రహ్మవేత్తకు దేహ వియోగ కాలమునందును, దేవయాన మార్గ మధ్యముననున్ను సుకృత దుష్కృత వియోగము గలుగు చున్నట్లు శ్రుతుల

వలనఁ దెలియవచ్చుచుండుటం జేసి, యా రెండు సమయములయందు నతని కట్టి సుకృత దుష్కృత వియోగము గలుగుచున్నదనుట యుక్తము.

ఎట్లనిన:—కౌషీతకులు "స ఏతం దేవయానం పన్థాన మాపద్య అగ్నిలోక మాగచ్ఛతి" (కౌ. ౧-3-౪.) ఇత్యాది వాక్యమున "బ్రహ్మవేత్త దేవయాన మార్గమునఁ బోయి, అగ్న్యాది లోకములను బొందుచున్నాఁడు" అని యివ్విధమునఁ జెప్పుట కారంభించి, అనంతరము. "స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మన సాఽత్యేతి తత్సుకృత దుష్కృతే ధూనుతే" అను వాక్యమున "అతఁడు విరజా నదిని బొంది దానిని మనస్సుచేఁ దాటి సుకృత దుష్కృతములను విదల్చి వేయుచున్నాఁడు" అని చెప్పి యుండుటం జేసి, బ్రహ్మవేత్తకు దేవయాన మార్గ మధ్యమున సుకృత దుష్కృత వియోగము గలుగుచున్నట్లు తెలిపి యున్నారు.

మఱియు తాండినులు "అశ్వ ఇవ రోమాణి విధూయ చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభి సంభవామి" అను వాక్యమున, "బ్రహ్మవేత్త అశ్వము రోమములను విదలించి వేయునట్లు పాపములను విదలించి, రాహు ముఖమునుండి చంద్రుఁడు బయలు వెడలునట్లు,శరీరములోనుండి బయలు వెడలి కృతార్థుఁడయి నిత్యమగు పరమపదమును బొందుచున్నాఁడు" అనుటం జేసి బ్రహ్మవేత్తకు శరీర వియోగకాలమున సుకృత దుష్కృత వియోగము గలుగుచున్నదని తెలిపియున్నారు.

మఱియు శాట్యాయినులు "తస్య పుత్రా దాయ ముపయన్తి సుహృద స్సాధు కృత్యాం ద్విషన్తః పాపకృత్యాం" అను వాక్యమున "బ్రహ్మవేత్తయొక్క పుత్రులు వాని దాయలబ్ధమగు ద్రవ్యమును బొందుదురు. సుకృత కర్మలను వాని మిత్రులును పాపకర్మములను వాని శత్రువులును బొందుదురు" అనుటావున బ్రహ్మవేత్తయొక్క పుత్రులకు వాని దాయలబ్ధమగు ద్రవ్యము వచ్చు సమయముననే వాని సుకృత దుష్కృతములు గూడ వానిని వదలుచున్నవని తెలియఁజేసి యున్నారు. పుత్రులు తండ్రియొక్క దాయలబ్ధమగు ద్రవ్యమును బొందుట శరీర వియోగకాలమునందు గాన, సుకృత దుష్కృత వియోగము సయితము శరీర వియోగ కాలమునందే గలుగునది యని యిందువలనఁ దెలియవచ్చుచున్నది.

ఈపై శ్రుతులవలన దేహవియోగ సమయమునను, మార్గమధ్యమునను ఈ రెండు సమయములయందును బ్రహ్మ వేత్తకు సుకృత దుష్కృత వియోగము గలుగుచున్నట్లు తెలియ వచ్చుచున్నది. కావున బ్రహ్మవేత్తయొక్క

సుకృత దుష్కృతములలో కొంతభాగము దేహవియోగ సమయమునను, శేషించినది దేవయాన మార్గ మధ్యమునను న్నశించు చున్నదనుట యుక్తమనిన,

—∘∘◆◂ సిద్ధాంతము. ▸◆∘∘—

ఇట్లు చెప్పుట యుక్తముకాదు. సామ్పరాయమునవే అనఁగా శరీర వియోగ కాలముననే బ్రహ్మవేత్తయొక్క సుకృత దుష్కృతములు నిశ్శేషముగ నశించుచున్నవి. ఏలననిన, శరీర వియోగానంతరము బ్రహ్మవేత్త సుకృత దుష్కృతములవలన పొందవలసిన భోగములేవి యున్నవి ? అతని కప్పుడు బ్రహ్మ విద్యాఫలమగు బ్రహ్మ ప్రాప్త్యనుభవము తప్ప సుకృత దుష్కృతములవలన నతఁడనుభవింపవలసిన సుఖదుఃఖము లతనికి లేవే ? కనుకనే ఛందోగులు, "అశరీరం వావసన్తం న ప్రియా ప్రియే స్పృశతః" అను వాక్యమున "శరీర రహితునికి, అనఁగా శరీరమును బరిత్యజించిన వానికి సుఖదుఃఖానుభవము లేదు" అనియు "ఏష సం ప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి సంపద్యతే" అను వాక్యమున "ఈ జీవుఁడు శరీరములోనుండి బయలు వెడలి, పరజ్యోతిస్సును బొంది, స్వస్వరూపముతో నభి నిష్పన్నుఁ డగును" అనియు, "తస్యతావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అను వాక్యమున "బ్రహ్మవేత్త ఈ శరీరమును దవలు వరకే యతనికి మోక్షమును బొందుటకు విళంబము. అనంతర మతఁడు మోక్షమును బొందుచున్నాఁడు" అనియును జెప్పుచు బ్రహ్మవేత్తకు దేహవియోగానంతరము బ్రహ్మప్రాప్తి తప్ప సుఖదుఃఖానుభవ మెద్దియును లేదని తెలియఁజేయుచున్నారు.

౨౮॥ సూ॥ ఛన్దత ఉభయా విరోధాత్ ॥

టీ॥ ఉభయా.విరోధాత్ =శ్రుతులకును వస్తుస్థితికిని విరోధము లేకుండ, ఛన్దతః=ఇష్టాను గుణముగ పదముల నన్వయించు కొనవచ్చును.

తా॥ శ్రుతులకును వస్తు స్థితికిని విరోధము లేకుండ, యథేష్టముగ పదముల నన్వయించు కొనునది.

శ్రీ॥ భా॥ ఇట్లు వస్తుస్థితినిబట్టి అనఁగాశరీర వియోగానంతరము బ్రహ్మప్రాప్తి తప్ప సుకృత దుష్కృత కర్మఫలములగు సుఖదుఃఖముల యనుభవమను నది మఱియొకటి లేకుండుటంజేసి, బ్రహ్మవేత్తకు సుకృత దుష్కృత వియోగము శరీర వియోగ కాలముననే గలుగుచున్నదనుటచే సుకృత దుష్కృత వియోగ కాలము పూర్వ సూత్రమున నిర్ణయింపఁబడియె. ఇట్టి నిర్ణయము ఈపైని గనఁబఱిచిన వస్తుస్థితితోను శ్రుతులతోనును విరోధింపకుండునట్లు పదములను

యథేష్టముగ నన్వయించు కొనునది. అది యెట్లనిన, కౌషీతక శ్రుతియొక్క చివరనుండు "తత్సుకృతదుష్కృతే ధూనుదే" అను వాక్యా వయవము "సతం దేవయానం పన్థాన మాపద్య" అను ప్రథమ వాక్యమునకు ముందుగా నున్నట్లు అన్వయించు కొనవలయును. అనఁగా బ్రహ్మవేత్త శరీర వియోగ సమయ మున సుకృత దుష్కృతములను విదల్చి అర్చిరాది మార్గము నాశ్రయించి అగ్న్యాదిలోకములను బొందుచున్నాఁడని యిట్లు అర్థము జెప్పుకొనవలయును.

అవతారిక:—ఇట్లు యింతకు పూర్వము చేయఁబడిన నిర్ణయమును పూర్వపక్షి యీ సూత్రమున నాక్షేపించుచున్నాఁడు.

## ౨౯॥ సూ॥ గతేరర్థవత్త్వ ముభయథాన్యథా హి విరోధః.

టీ॥ ఉభయథా = రెండు పక్షములను, కర్మక్షయమయిన తరువాతనే, గతేః=అర్చిరాది మార్గగమనమును తెలుపు శ్రుతులకు, అర్థవత్త్వం=సార్థక్య ము కలుగును. హి=ఏలననఁగా, అన్యథా=అట్లు కాకున్న, విరోధః=విరోధము ప్రసక్తించును.

తా॥ సుకృత దుష్కృతములలో, కొంతభాగము దేహవియోగ కాల మునను, తక్కినది తరువాతనుచ్చు నశించు నని యిట్లు రెండు భాగములుగ కర్మ క్షయమైననే అర్చిరాదిమార్గ గమనమును విధించునట్టి శ్రుతి సార్థకమగును. అట్లు కాకున్న, అనఁగా దేహవియోగకాలముననే కర్మము నిశ్శేషముగా నశిం చునేని, యట్టి జీవునికి అర్చిరాదిమార్గ ప్రయాణ మసంభవ మగును.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తయొక్క సుకృత దుష్కృతములలో కొంత భాగము శరీరవియోగ కాలమునను శేషించినది మార్గ మధ్యమునను ఇట్లు రెండు భాగములుగ కర్మము నశించుచుండిననే బ్రహ్మవేత్తకు అర్చిరాది మార్గ మున ప్రయాణము గలదని బోధించు శ్రుతి సార్థకమగును. అట్లంగీ కరింపనిచో, అనఁగా దేహవియోగ సమయముననే అన్నికర్మములును నిశ్శేషముగ నశించుచున్నవనినచో, అప్పుడు సూక్ష్మ శరీరమునకు సయితము వినాశము సంప్రాప్త మగును. అట్లు సూక్ష్మశరీరము సయితము నిశించినచో, కేవలాత్మ అర్చిరాది మార్గమునఁ బోవుట యసంభవమగును. కనుక శరీర వియోగకాల ముననే బ్రహ్మవేత్తయొక్క యన్ని కర్మములు నిశ్శేషముగ నశించుట సంభ వము కాదు.

అవతారిక:—ఇట్లు ఆక్షేపము రాఁగా, నందులకు సమాధానము నీసూ త్రముచేఁ జెప్పుచున్నారు.

## 30॥ సూ॥ ఉపపన్న స్తల్లక్షణార్థోపలబ్ధే ర్లోకవత్.

టీ॥ ఉపపన్నః=శరీర వియోగ సమయముననే సర్వకర్మములు నిశ్శేషముగా నశించుట సంభవము, ఏలననఁగా, తల్లక్షణార్థోపలబ్ధేః=అట్టి శరీరము వలనఁ గలుగవలసిన కార్యములు జరుగుచున్నట్లు గానఁబడు చున్నందున, అదెటువలెననిన, లోకవత్=లోకము నందువలెనే.

తా॥ శరీర వియోగ కాలముననే సర్వ కర్మములు నిశ్శేషముగా నశించుట సంభవమే. ఏలననిన, అప్పుడును శరీరమువలనఁ గావలసిన కార్యములు జరుగుచున్నట్లు లోకమునందువలెఁ జూచుచున్నాము గదా!

శ్రీ॥ భా॥ శరీర వియోగ కాలమునందే బ్రహ్మవేత్తయొక్క సర్వకర్మములును నిశ్శేషముగ నశించుట సంభవమే, అయితే సర్వకర్మములు క్షయించినను, అతఁడు ఆవిర్భూత స్వరూపుఁడగుటం జేసి(స్వస్వరూపావిర్భావరూపమగు మోక్షము గలవాఁ డగుటంజేసి) దేహసంబంధము వలనఁ గలుగవలసిన కార్యమతనికి అప్పుడును గలుగుచున్నది. ఏలననిన, ఛందోగులు "పరం జ్యోతిరుప సంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే" అను వాక్యమున "బ్రహ్మవేత్త పరజ్యోతిస్సును బొంది స్వస్వరూపావిర్భావమును బొందుచున్నాఁడు" అని చెప్పి, అనంతరము "స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్రమమాణః" అను వాక్యమున "అట్టి ముక్తపురుషుఁడు భోగముల ననుభవించుచు, క్రీడించుచు, రమించుచు, యథేష్టముగ సంచరించుచున్నాఁడు." అనియు "స స్వరాట్ భవతి తస్యసర్వేషు లోకేషు కామచారోభవతి" అనువాక్యమున "అతఁడు కర్మవశ్యత లేనివాఁడగుచున్నాఁడు, అన్ని లోకములయందును యథేష్టముగ సంచరించును" అనియు "స ఏకధా భవతి త్రిధా భవతి" (ఛా-౭. ప్ర-౨౬, ఖ-౨. వా.) అను వాక్యమున "అతఁడు ఒక విధముగాను మూఁడువిధములుగాను నగుచున్నాఁడు" అనియును జెప్పుచున్నారు. ఈవాక్యముల వలన శరీర సంబంధమును గలిగియున్నప్పుఁడు జేయు క్రీడనాది కార్యముల నన్నింటిని శరీర సంబంధము లేనప్పుఁడును ముక్తపురుషుఁడు చేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది. కనుక ముక్తపురుషుని కర్మము లన్నియును దేహవియోగ సమయముననే నిశ్శేషముగ నశించినను, సూక్ష్మశరీర యుక్తుఁడగుటంజేసి, యాతఁడు అర్చిరాది మార్గమునఁ బ్రయాణము జేయుట సంభవమే. కానిమ్ము, సూక్ష్మ శరీరమునకును కర్మమే కారణము గదా! ఇట్లుండ, శరీర వియోగ కాలముననే యాతని సర్వ కర్మములును నిశ్శేషముగ నశించుచున్నచో, ఈతనికి సూక్ష్మశరీర ముండుటయెట్లు సంభవమని శకింపఁ బనిలేదు. ఏలననిన, బ్రహ్మవిద్యా మాహాత్మ్యము వలన నది యుండవచ్చును. అది యెట్లనిన, బ్రహ్మవిద్య స్వయముగా సూక్ష్మ

శరీరమునకుఁ గారణము కాదు. అయితే ప్రాకృత సుఖదుఃఖోప భోగసాధన మగు స్థూలశరీరమున్ను సర్వ కర్మములున్ను నిశ్శేషముగ నశించినను, ఇది స్వఫలమగు బ్రహ్మప్రాప్తిని గలుగఁజేయుటకై, అర్చిరాదిమార్గమున, ముక్తపురుషునికి ప్రయాణము సంభవ మగునట్లు చేయవలయును. అందులకు గాను ఇది సూక్ష్మశరీరమును నిలుపుచున్నది. అది యెటువలె ననిన, [1]లోకమున సస్యాది సమృద్ధికిగాను చెఱువులను త్రొవ్వించుచున్నాము. అయితే కొంత కాలమునకు ఆచెఱువుల నీటివలన సస్యమును వృద్ధి పరచవలయుననెడి యిచ్ఛ లేకపోయినను, అనఁగా నాచెఱువు నీటిని మనము సస్యములకు ఉపయోగ పఱచకపోయినను, స్నానపానాదులకు ఉపయోగ పఱచుకొనుచు అందులకై యాచెఱువులను కాపాడు కొనుట లేదా. అట్లే ప్రకృతమునను ఎఱుంగునది.

అవతారిక:—పరతత్త్వమును సాక్షాత్కరించిన జ్ఞానులకు దేహవియోగకాలముననే సర్వకర్మములును నిశ్శేషముగ నశించు గాక! తదనంతరము అర్చిరాది మార్గమునఁ బ్రయాణముఁ జేయుటకు గాను సాధనభూతమగు సూక్ష్మశరీరము అప్పుడు వానితో నుండు గాక! అయితే అప్పుడు వానికి సుఖదుఃఖానుభవము లేకపోవుట యనునది యసంభవము. ఏలననిన, పరతత్త్వమును సాక్షాత్కరించిన వారగు వసిష్ఠుఁడు, అపాంతరతపస్కుఁడు మొదలగు మహర్షులకు దేహవియోగానంతరము దేహాంతరసంబంధమును పుత్రజన్మ విపత్త్యాది నిమిత్తములగు సుఖదుఃఖాదుల యనుభవమున్ను ఉండి యున్నట్లు తెలియవచ్చుచున్నదే యని శంకింపఁగా, నందులకు సమాధానము జెప్పుటకై.

౩౧॥ సూ॥ యావదధికారమవస్థితిరాధికారికాణామ్.

టీ॥ ఆధికారికాణామ్=ఒక కార్యమున నియమింపఁ బడినవారికి, యావదధికారం=ఆకార్యము పూర్తియగు వరకును, అవస్థితిః=కర్మము ఉండును.

తా॥ ఒక కార్య విశేషమున నియమింపఁబడిన వసిష్ఠాదుల విషయముననో, ఆకార్యము ముగించు వరకును వారి కర్మములు నశింపవు.

శ్రీ॥ భా॥ దేహ వియోగకాలమున జ్ఞానులందఱి యొక్కయును సర్వకర్మములు నిశ్శేషముగ నశించుచున్నవని మేము జెప్పి యుండలేదు. అయితే

(1) ఏ యిచ్ఛవలన చెఱువును త్రొవ్వించితిమో, ఆ యిచ్ఛ మనకిప్పుడు లేకపోయినను, అందువలన త్రొవ్వించిన చెఱువు స్నానపానాదుల కుపయోగపడుచు స్థాపితముగ నుంటున్నది. ఇచ్ఛ నశించుటచే అట్టి యిచ్ఛాకార్యమగు చెఱువుగూడ నశించుట లేదు. అటులనే సూక్ష్మశరీరమున్ను స్వోత్పత్తి కారణ భూతములగు కర్మములు నశించినను ముక్తునికి అర్చిరాది మార్గప్రయాణ సాధనముగ నుపయోగపడుచు బ్రహ్మవిద్యచే స్థాపితముగ నుంచఁబడుచున్నది.

శరీర పాత సమయమున వెంటనే యర్చిరాది మార్గ ప్రయాణము ఏ జ్ఞానులకు సంప్రాప్తమగుచున్నదో, వారి కర్మములు మాత్రమే శరీర వియోగకాలమున నశించుచున్నవని చెప్పియుంటిమి. ఇంతియే. వసిష్ఠాదులు (లోక స్థితి హేతు భూతమగు వేదప్రవర్తనాది) అధికారమునందు సర్వేశ్వరునిచే నియమింపఁ బడినవారు గాన, వీరిచే ప్రారబ్ధమగు (ఆరంభింపఁబడిన) కార్యము సమాప్తి కాకపోవుటంజేసి, వీరికి దేహపాతానంతరము అర్చిరాదిమార్గ ప్రయాణము సంప్రాప్తింపదు. వారి కొకవిధమయిన కర్మముండుటచే వారి కార్యవిశేషమునందు నియోగింపఁ బడిరి. వారు ఈ కార్యమును ముగించువరకట్టి కార్యమునకు హేతుభూతమగు వారి కర్మము నశింపదు. ప్రారబ్ధకర్మ మనుభవమువలనఁ గదా నశింపవలయును. కనుక అధికారమున నియుక్తులగు వసిష్ఠాదుల యధికారము ముగించువరకును అట్టి యధికారమునకు హేతుభూతమైన కర్మము ఉండును. అందుచే వారికి దేహపాతానంతరము అర్చిరాది మార్గప్రయాణము సంప్రాప్తముకాదు.

సావ్వరాయాధికరణము ముగిసెను



## అనియమాధికరణము

౩౨॥ సూ॥ అనియమస్సర్వేషామవిరోధశ్శబ్దానుమానాభ్యామ్.

టీ॥ సర్వేషాం=బ్రహ్మవిద్యా నిష్ఠుల కందఱికిని అర్చిరాదిగతి గలదు. అనియమః=ఉపకోసల విద్యానిష్ఠులకే యనెడి నియమము లేదు. ఏలననిన, శబ్దానుమానాభ్యాం=శ్రుతులను బట్టియు, స్మృతులను బట్టియును, అవిరోధః=విరోధము లేదు గదా!

తా॥ బ్రహ్మవిద్యలలో దేని ననుష్ఠించినను, అర్చిరాది గమనము కలదు. ఉపకోసల విద్యానిష్ఠులకే యది కలుగు ననెడి నియమము లేదు. ఇందు శ్రుతి విరోధముగాని, స్మృతి విరోధము గాని లేదు గదా!

సంశయము.

శ్రీ॥ భా॥ ఉపకోసల విద్య మొదలగు ఏయుపాసనములయందు అర్చిరాది మార్గప్రయాణము పఠింపఁబడినదో, ఆ యుపాసనముల ననుష్ఠించువారలు మాత్రమే అర్చిరాది మార్గమునఁ బ్రయాణము జేసి బ్రహ్మమును బొందుచున్నారా? లేక, బ్రహ్మోపాసన నిష్ఠులందఱును అర్చిరాది మార్గముననే ప్రయాణము జేసి బ్రహ్మమును బొందుచున్నారా?

### పూర్వపక్షము.

ఇతర విద్యలయం దర్చిరాదిగతి చెప్పఁబడ కుండుటచేతను, అర్చిరాదిగతి చెప్పఁబడిన "యేచే మేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" అను ఛాందోగ్య శ్రుతి యందలి "తపః" అను శబ్దమున్ను, "శ్రద్ధాం సత్య ముపాసతే" అను వాజసనేయ శ్రుతియందలి "సత్యం" అను శబ్దమున్ను బ్రహ్మవాచకము లగుటచేసి బ్రహ్మోపాసనములలోఁ దేని ననుష్ఠించినను అట్టి వారందఱును అర్చిరాది మార్గమునఁ బ్రయాణముచేయుదు రంటివేని, యా శబ్దములు బ్రహ్మవాచకము లగుటకు ప్రమాణ మెద్దియును లేకపోవుటవలనను, యేయే విద్యలయందు అర్చిరాది మార్గము ఉపదేశింపఁబడినదో, ఆయావిద్యలను మాత్ర మనుష్ఠించు వారలే యర్చిరాది మార్గమునఁ బ్రయాణము చేయుదురని సిద్ధ మగు చున్న దనిన,

### సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. బ్రహ్మోపాసనములలోఁ దేని ననుష్ఠించినను, అర్చిరాది మార్గమునఁ బోయియే పరబ్రహ్మమును బొందవలయును గాన, ఉపకోసలాది విద్యానిష్ఠులు మాత్ర మర్చిరాది మార్గమునఁ బోవుదురనియు, ఇతర విద్యానిష్ఠు లామార్గమునఁ బోరనియు నిట్టి నియమ ముండ జాలదు. అందఱును ఆ మార్గమునఁ బోవు పక్షముననే శ్రుతి స్మృతి ప్రమాణములు విరోధింపవు. అట్లు కాకున్న, శ్రుతిస్మృతులు విరోధించును. ఛందోగులును వాజసనేయులును పంచాగ్ని విద్యను బోధించునపుడు, బ్రహ్మవిద్యలలో నే విద్య ననుష్టించినను, అర్చిరాది మార్గముననే పోవలయునని తెలియఁజేసి యున్నారు.

ఎట్లనిన, వాజసనేయులు "య ఏవమే తద్విదుః యేచే మేఽరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే" (బృ-౮. అ-౨. బ్రా-౧౫. వా.) అను వాక్యమున "పంచాగ్ని విద్యానిష్ఠులును, అరణ్యమున శ్రద్ధా పురస్కరముగ సత్యశబ్ద వాచ్యుఁడగు పరమాత్మను ఉపాసించు వారలున్ను అర్చిరాది గతిని బొందుచున్నారు"అనియు, ఛందోగులు గూడ "తద్య ఇత్థం విదుః యేచే మేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిష మభి సంభవంతి" అను వాక్యమున "పంచాగ్ని విద్యానిష్ఠులును, అరణ్యమునందు శ్రద్ధా పురస్కరముగ తపశ్శబ్ద వాచ్యుఁడగు పరమాత్మను ఉపాసించు వారున్ను అర్చిరాది గతిని బొందుచున్నారు"అనియును పఠించుచున్నారు. ఈ వాక్యమునందు "య ఏవ మేతద్విదుః""అనుచోట, పంచాగ్ని విద్యానిష్ఠులను"ముందుగ పరామర్శించి, పిమ్మట"యేచే మేఽరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే" అనుచోట, విద్యాంతర నిష్ఠులనుగూడ అనఁగా అరణ్యము

నందు శ్రద్ధాపురస్కరముగ బ్రహ్మమును ఉపాసించు వారలను గూడ పరామర్శించి, కడపట "తేఽర్చిషమభి సంభవంతి" అనుచో, వారి కుభయులకుఁ గూడ సమానముగ అర్చిరాదిగతి గలుగునని తెలుపుచున్నారు.

ఇట్లు ఈపై వాక్యములు కేవల పంచాగ్ని విద్యానిష్ఠులనే యుద్దేశించియే కాక, విద్యాంతర నిష్ఠులను ఉద్దేశించియును అర్చిరాదిగతిని విధించుచున్నవి. కావున బ్రహ్మవిద్యలలో నేవిద్య ననుష్ఠించినను, అర్చిరాదిగతి గలదని ఇందువలన స్పష్ట మగుచున్నది.

ఈ పై వాక్యములయందుండు"సత్య""తప"శ్శబ్దములు బ్రహ్మవాచకములు. "సత్యం జ్ఞాన మనం తం బ్రహ్మ" "సత్యం త్వేవ విజిజ్ఞాసి తవ్యం" అను ఈమొదలగు శ్రుతివాక్యములయందు "సత్య" శబ్దము బ్రహ్మపరముగ ప్రయోగింపఁబడి యున్నట్లు ప్రసిద్ధమే కదా. అయితే "తప" శ్శబ్దము "తద్య ఇత్థం విదుః" అను ఛాందోగ్య శ్రుతియందుఁ బ్రయోగింపఁబడి యున్నది. ఈ శ్రుతి "య ఏవమేతద్విదుః" అను వాజసనేయ శ్రుతితో నేకార్థ మయినందున ఛాందోగ్య శ్రుతి యందుండు"తప"శ్శబ్దము వాజసనేయ శ్రుతియందుండు "సత్య"శబ్దముతో నేకార్థము. అనఁగా నీరెండు శబ్దములకును ఒక్కటియే యర్థము. అందువలన, "సత్య" శబ్దము బ్రహ్మవాచకము గాన "తప" శ్శబ్దమున్ను బ్రహ్మవాచకమే.

"సత్యం త్వే వ విజిజ్ఞాసితవ్యం" అను వాక్యము మొదలు "శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసి తవ్యం" అను వరకును శ్రుత్యంతరమునందుఁ గూడ 'శ్రద్ధా పూర్వకమగు బ్రహ్మోపాసనము విధింపఁబడి యున్నది గాన, నిట్టి యుపాసన మొకటి యున్నదనియును శ్రుతియే తెలుపుచున్నది.

మఱియు, "అగ్ని ర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణం, తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" అను శ్రీ భగవద్గీతా వాక్యము "అర్చిస్సు, దినము, శుక్లపక్షము ఆఱుమాసంబులగు ఉత్తరాయణంబును" అను మార్గమున ప్రయాణము జేసిన వారు పరమాత్మను బొందుచున్నారనుచు బ్రహ్మ విద్యానిష్ఠు లందరికిని అర్చిరాది గతి గలదని తెలియఁజేయుటం జేసి ఈ విషయమును గుఱించి స్మృతి ప్రమాణమున్ను గద్దు. ఇంతియె కాక, ఈ విషయమును గుఱించి అనేక శ్రుతి స్మృతి ప్రమాణములును గలవు.

కనుక బ్రహ్మవిద్యలలో నేవిద్య ననుష్ఠించినను, అర్చిరాదిమార్గప్రయాణము గలదు. ఇట్లు ఈ యర్చిరాది మార్గప్రయాణము సర్వసాధారణముగ నన్ని బ్రహ్మవిద్యలయందును సంప్రాప్తమయి యున్నను, ఉపకోసలాది విద్యలయందు దీనిని ప్రత్యేకించి చెప్పుట అనువాద మాత్రము గాని, యుపకోస

లాది విద్యానిష్ఠులకు మాత్ర మర్చిరాది మార్గప్రయాణము గలదనియు, తది తరులకు లేదనియు నిట్లొక నియమమును దెలియఁ జేయుటకు గాదు.

౧౩ అనియమాధి కరణము ముగిసెను. ౧౩

---

## అక్షరధ్యధి కరణము.

33॥ సూ॥ అక్షరధియాం త్వవరోధ స్సామాన్య తద్భావాభ్యామౌ పసదవ త్తదుక్తం.

టీ॥ తు=పూర్వపక్ష మనుచితము, అక్షరధియాం=అక్షరబ్రహ్మ సంబంధులుగాఁ జెప్పఁబడిన అస్థూలత్వాది ధర్మములకు, ఔపసదవత్ = ఉపసద్వాగాంగ మంత్రములకువలె, అవగోధః = బ్రహ్మవిద్యలయం దన్నిటియందును ఉపసంగ్రహము, స్యాత్=కలుగును. (ఏలనఁగా) సామాన్య తద్భావాభ్యాం= అన్ని యుపాసనములయందును ఉపాసింపఁబడు అక్షర బ్రహ్మ మొక్కటియే యైనందునను, ఆ ధర్మములు బ్రహ్మస్వరూపముతో నెప్పుడును ఉండునవి యైనందునను. తత్=అది, ఉక్తం=పూర్వ మీమాంసయందుఁ జెప్పఁబడినది.

తా॥ అక్షరబ్రహ్మముతో సంబంధించినవి గాను పఠింపఁబడిన అస్థూలత్వాదిధర్మములు అన్ని యుపాసనములయందును అనుసంధింపవలసినవి. ఏలననఁగా, అన్ని యుపాసములయందును ఉపాసింపఁబడునట్టి అక్షర బ్రహ్మ మొక్కటియే. మఱియు ఆ ధర్మములు బ్రహ్మముయొక్క స్వరూపము దెలియవచ్చునప్పుడు దానితో సంబధించి యుండునవిగాఁ దెలియవచ్చునవి. ఉపసద్యాగాంగములగు మంత్రములకువలె ప్రకృతమున నెఱుఁగునది. దీనిని గుఱించి పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

శ్రీ॥ భ॥ వాజసనేయు లక్షర బ్రహ్మమును గుఱించి ప్రస్తాపించి, "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి అస్థూల మనణ్వ హ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽవాయ్వ నాకాశ మసంగ మరస మగన్ధ మచక్షుష్క మశ్రోత్ర మవాగమనోఽతే జస్కమప్రాణ మముఖ మమాత్ర మనంతర మబాహ్యం న తదశ్నాతి కిఞ్చన ఏతస్యవాఽక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" (బృ. ౫-అ.౮-బ్రా.౮-వా.) ఇత్యాది వాక్యమున ఓగార్గి ! ఏది స్థూలము కాదో, పొట్టిది కాదో, పొడుగుది కాదో, (అగ్నియొక్క గుణమయిన) లోహితము కాదో. (ఉదకముయొక్క గుణ

మయిన) స్నేహనమును కాదో, ఛాయయును కాదో, తమస్సును కాదో, వాయువును కాదో, ఆకాశమును కాదో, (లెక్కవలె వేరుపదార్థము)నంటికొనియుండునదియును కాదో, రసమును కాదో, గంధమును కాదో, దేనికి నేత్రేంద్రియమును లేదో, శ్రోత్రేంద్రియమును లేదో, వాక్కును లేదో, మనస్సును లేదో, (అగ్ని మొదలగు వానివంటి నశ్వరమైన) ప్రకాశమును లేదో, ప్రాణమును లేదో, ముఖమును లేదో, పరిమితియును లేదో, దేనిచే వ్యాపింపఁబడని అంతరప్రదేశముగాని బాహ్యప్రదేశము గాని లేదో, ఏది అవాప్త సమస్త కామమగుటచే దేనిని తినునది గాదో. దేని యాజ్ఞవలన సూర్య చంద్రు లాయా కాలములయందు తప్పకుండ తమ తమ స్థానములయందుండి యున్నారో, దానిని బ్రహ్మవేత్తలు అక్షరమగు బ్రహ్మమునుగాఁ జెప్పుచున్నారు" అనియు, ఆథర్వణికులు ఈ విషయమునే గుఱించి ప్రస్తావించి, "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే య త్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్ర మపాణిపాదం" (ము. ౧-ము.౧) ఇత్యాది వాక్యమున, "అక్షరబ్రహ్మమును ప్రతిపాదించు విద్య పరవిద్యయని చెప్పఁబడుచున్నది. అక్షరబ్రహ్మము జ్ఞానేంద్రియములచేఁ దెలిసికొనుటకును కర్మేంద్రియములచేతఁ దీసికొనుటకును శక్యము కానిది, కులరహితమయినది, బ్రహ్మ క్షత్రియాది వర్ణము లేనిది, జ్ఞానేంద్రియములగు చక్షురాదీంద్రియములును కర్మేంద్రియములగు పాదాదులును లేనిది" అనియు నివ్విధమునఁ బఠించుచున్నారు. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

జగత్తునందుండు పదార్థములకంటె అక్షరబ్రహ్మము విలక్షణమయినదను భావనను దెలియఁజేయునవియు, ఈపైని యుదహరించిన శ్రుతులయందు అక్షరమనఁబడు బ్రహ్మముతో సంబంధించినవిగాఁ బఠింపఁబడినవియునగు అస్థూలత్వాది ధర్మములు బ్రహ్మవిద్యలయం దన్నింటియందు నను సధింపవలసినవియా? లేక, అవి యే విద్యయందు పఠింపఁ బడుచున్నవో, ఆ విద్యయందు మాత్రమే యను సంధింపవలసినవియా?

### పూర్వపక్షము.

ఏ విద్యయందీ గుణములు పఠింపఁబడుచున్నవో, ఆవిద్యయందే వీని నను సంధించుకొన వలయుననుట యుక్తము. ఎందువల ననిన, ఏదైన నొక విద్యకు ఆకార భూతములగు గుణములు విద్యాంతరమునకుఁ గూడ ఆకార భూతములు గావచ్చుననుటకు ప్రమాణ మెద్దియును లేదు. మఱియు అస్థూలత్వాదులు బ్రహ్మమునందు జగద్ధర్మములగు స్థూలత్వాదులను నిషేధించుటకు గాను జెప్పఁబడినవి గాని ఇవి యానందాదులవలెనే బ్రహ్మస్వరూపమును దెలియఁబఱచు

టకు సాధన భూతములుగాఁ జెప్పఁబడినవి కావు. అయితే బ్రహ్మ మెట్టిదియో, ఆ విషయమును నిరూపింపకయే, దానియందు దేనినిన్ని నిషేధించుట యసంభవము గాన, అందులకై యానందాది గుణములచే బ్రహ్మస్వరూపము నిరూపింపఁబడఁగా, ఈపైని యుదహరింపఁబడిన శ్రుతులు జగద్ధర్మములగు స్థూలత్వాదుల నట్టి బ్రహ్మస్వరూపమునందు నిషేధించుచున్న వనిన,

## సిద్ధాంతము.

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. అక్షర బ్రహ్మముతో సంబంధించినవి గాను శ్రుతులయందు వినఁబడు అస్థూలత్వాది ధర్మములు బ్రహ్మవిద్యలయందన్నింటియందును అను సంధింపవలసినవి. ఏలననఁగా, ఉపాస్య వస్తువగు అక్షర బ్రహ్మము అన్ని యుపాసనములకును సాధారణమైనది. అట్టి బ్రహ్మము తెలియ వచ్చునప్పుడు, అస్థూలత్వాదులు సయితము దానితో నుండునవిగాఁ దెలియవచ్చునవి. దీని యభిప్రాయ మేమనఁగా, ఏదైన నొక ప్రదార్థమును బాగుగ గ్రహించుట యనునది, ఆ పదార్థముయొక్క యసాధారణ స్వరూపమును దెలిసికొనుటచేతను గదా, గలుగునది. కేవలానందాదులు సామాన్యముగ ప్రత్యగాత్మకుఁ గూడ గలవు గాన, నవి బ్రహ్మముయొక్క యసాధారణ స్వరూపమును దెలుపఁజాలవు. హేయ ప్రత్యనీకములగు నానందాదులను గలిగియుండుటయేగదా బ్రహ్మముయొక్క యసాధారణస్వరూపము. ప్రత్యగాత్మ యన్ననో, స్వరూపమునుబట్టి హేయగుణ రహితమయినదియే యైనను, హేయగుణములతో సంబంధించుటకుఁ దగినది. బ్రహ్మమన్ననో, ఇట్టి ప్రత్యగాత్మనంటి వాఁడు కాఁడు. అయితే యీతఁడు హేయ ప్రత్యనీకుఁడు అనఁగా చిద చిదాత్మకమగు నీప్రపంచముయొక్క ధర్మములగు స్థూలత్వా ణుత్వాదిదోషముల కెంతమాత్ర మవకాశ మీయని స్వరూపము గలవాఁడు. కావున బ్రహ్మముయొక్క యసాధారణ స్వరూపము నను సంధింపఁ గోరువాఁడు, బ్రహ్మము సామాన్యముగ ప్రత్యగాత్మ యందుండు జ్ఞానానందాదులతోఁ గూడుకొనిన వాఁడనియే కాక, అస్థూలత్వానణుత్వాదులను గూడ గలిగియుండువాఁడను భావనతో ననుసంధింపవలయును. ఈప్రకారము అస్థూలత్వాదులుగూడ, ఆనందాది గుణములవలె, బ్రహ్మస్వరూపము తెలియవచ్చుటతోఁ జేరియున్నవి గాన, బ్రహ్మవిద్యలయందన్నింటియందును బ్రహ్మము నవ్విధముననే యనుసంధింపవలయును. ఇట్లొక ప్రదేశమునఁ బఠింపఁబడిన గుణములకు ప్రదేశాంతరమందుఁ బఠింపఁబడిన గుణితో సంబంధము గలుగునని బోధించుటకై సూత్రకారులు ఔపసద దృష్టాంతము నిచట చెప్పుచున్నారు. ఉపసద్యాగమునఁ బఠింపఁబడిన మంత్ర మిచట జౌపసద మనఁబడెను. "అగ్నేర్వైహోత్రం వేరధ్వరం" అనునదియా

[1]యాపసద మంత్రము. ఇది సామవేదమునఁ బఠింపఁబడినదియే యైనను, జామదగ్న్య చతూరాత్ర యాగమున, విధింపఁబడిన ఉపసద్ధోమమున కంగభూత మగుటం జేసి, ప్రధానమగు పురోడాశము ననుసరించి యుండుట వైనందున యజుర్వేదాధ్యాయియగు నధ్వర్యునిచే అనుదాత్తస్వరమునఁ బఠింపఁ బడినట్లు ప్రకృతమునను ఎఱుంగునది. ఈ విషయమును గుఱించి శ్రీ జైమిన్యాచార్యుల వారు "గుణముఖ్య వ్యతిక్రమే తదర్థత్వాన్ముఖ్యేన వేదసంయోగః" అను సూత్రమున నిరూపించి యున్నారు.

అవతారిక:—బ్రహ్మవిద్యలయం దన్నింటియందును బ్రహ్మమే గుణి గాన, నట్టి గుణియొక్క గుణము లెచట పఠింపఁబడినను, గుణిని బోధించును. కావున బ్రహ్మవిద్యలయం దన్నిటియందును, వాని నీపైని చెజెప్పినపద్ధతి ప్రకారము, ఉపసంహరించుకొనవలసి వచ్చును. అట్లయినచో, సర్వకర్మత్వము, సర్వ గన్ధత్వము, సర్వరసత్వము మొదలగు గుణములు కొన్నికొన్ని విద్యా విశేషముల యందు మాత్ర మనుసంధాతవ్యములుగ పఠింపఁబడినవియే యైన నవి ఈపైని జెప్పిన న్యాయప్రకారము సర్వబ్రహ్మ విద్యలయందును ఉపస్థితము లగును. ఇందువలన నవి యీ విద్యయం దను సంధాత్యములనియు, ఆ విద్యయం దను సంధాతవ్యములు గావనియు నిట్లొక వ్యవస్థ లేక పోవునని శంకింపఁగా, నందులకు సమాధానము నీసూత్రముచేఁ జెప్పుచున్నారు.

## ౩౪॥ సూ॥ ఇయ దా మ న నా త్.

టీ॥ ఆమననాత్ =ధ్యానమునుబట్టి, ఇయత్ = ఇంతమాత్రమే అనుసంధింపవలసినది.

---

(1) జామదగ్న్య౽హీన యాగమునందు ఉపసద్యాగము లంగములుగ విధింపఁబడుచున్నవి. ఆ యుపసద్యాగములకు పురోడాశము హోమద్రవ్యము. ఆ పురోడాశప్రదానమునందు, "అగ్నేర్వైహోత్రం" ఇత్యాది మంత్రము వినియోగింపఁబడుచున్నది. ఇది సామవేదము నందుఁ బఠింపఁబడి నదగుటంజేసి యుద్గాతచే నుచ్చైస్స్వరములోఁ గానము జేయవలసినదియే యైనను, ప్రధానమగు పురోడాశ ప్రదానమునందు వినియోగింపఁబడుటచే యజుర్వేది యగు అధ్వర్యునిచే నీచై స్స్వరములో నుచ్చరింపఁబడుచున్నది. అనఁగా నిచట శేషియగు పురోడాశ ప్రదాన మధ్వర్యు కర్తృక మగుటచేతను, అట్టి పురోడాశ ప్రదానమునకు శేషమగు మంత్రము శేషిపరతంత్రమగుటచేతను దాని కధ్వర్యు సంబంధము గలుగుచున్నది. ఇట్లే ప్రస్తుతాంశమునందును అస్థూలత్వాది విశేషము లక్షరబ్రహ్మ పరతంత్రము లగుటచే నవి యే శాఖయందు పఠింపఁబడినను, ప్రధానుఁడగు అక్షరబ్రహ్మములో బ్రహ్మవిద్యలయం దన్నితావులను సంబంధించుచున్నవి. ఈ విషయము పూర్వమీమాంసయొక్క ప్రథమకాండమున, "గుణముఖ్య వ్యతిక్రమే తదర్థత్వాన్ముఖ్యేన వేద సంయోగః" అను సూత్రమున జైమిన్యాచార్యునిచేఁ జెప్పఁబడియె.

తా॥ ఇంతమాత్రమే అను సంధింపవలసినది గాను ధ్యానమునుబట్టి తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ అస్థూలత్వాదులతోఁ గూడుకొనిన ఆనన్దాదులు మాత్రమే పరమాత్మధ్యానమున కావశ్యకములు. ఏ గుణముల ననుసంధింపక, ఇతర వ్యావృత్తమగు అనఁగా అసాధారణమగు పరమాత్మ స్వరూపము నను సంధించుట యసంభవమో, ఆ గుణములను మాత్రము బ్రహ్మవిద్యలయం దన్నింటియందు నను సంధించుకొన వలయును. అట్టి గుణము లీయ స్థూలత్వాదులును ఆనన్దాదులును మాత్రమే. ఇతరములగు సర్వకర్మత్వాదులు బ్రహ్మముతో సంబంధించి యుండునవియే యయినను, అవి కొన్ని ఉపాసనములయందు మాత్రమను సంధాతవ్యములుగ నియమింపఁ బడుచున్నవి.

అక్షరధ్యధి కరణము ముగిసెను.



## అన్తరత్వాధి కరణము

**౩౫॥ సూ॥ అన్తరా భూతగ్రామవత్స్వాత్మనోఽన్యథా భేదానుపపత్తిరితి చేన్నోపదేశవత్ ॥**

టీ॥ అన్తరా=సర్వాంతరాత్మయనుట, భూతగ్రామవత్ =పృథివ్యాది భూత సముదాయముతోఁ జేరి యున్నట్టి, స్వాత్మనః=వారివారి యాత్మలను గురించి జెప్పఁబడినది, అన్యథా=అట్లుకాకున్న, భేదానుపపత్తిః=ప్రతివచనములకు భేదము సిద్ధింపదు. ఇతిచేత్ =ఇట్లంటి వేని, న = అట్లు చెప్పఁదగదు. ఉపదేశవత్ =సద్విద్యాద్యుపదేశములందు వలెనె యెఱుఁగునది.

తా॥ ప్రథమ ప్రశ్న ప్రతివచనమున సర్వాంతరాత్మగాఁ జెప్పఁబడిన వాఁడు పృథివ్యాది భూత సంబంధియగు జీవుఁడే యని యెఱుంగునది. అట్లు కాకున్న, ప్రతివచనములకు భేదము సంభవముకాదు. ఇట్లంటివేని యది యుక్తముకాదు. సద్విద్యాద్యుపదేశములందు వలెనే ప్రకృతమునను ఎఱుంగునది.

శ్రీ॥ భా॥ ఉషస్తునికిని యాజ్ఞ్యవల్క్యునికిని జరిగిన ప్రశ్నోత్తరరూపమగు సంభాషణము బృహదారణ్యకోపనిషత్తునందు వినఁబడుచున్నది. ఉషస్తుఁడు "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః తన్మే వ్యాచక్ష్వ" (బృ-౫. అ-౪. బ్రా-౧. వా.) (సన్నిహితమై యంతటనుండు బ్రహ్మస్వ

రూపమును నాకొఱకు విస్పష్టముగ జెప్పుమా!) అని ప్రశ్న చేయఁగా, యాజ్ఞ్యవల్క్యుఁడు "యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాన్తరః యోఽపానేనాపానితి సత ఆత్మా సర్వాన్తరః" (బ-౩. అ-౪. బ్రా-౧. వా.) (ఏది ప్రాణవాయువువలన ప్రాణనవ్యాపారమును జేయించుచున్నదో, అది నీయొక్క సర్వాంతరమగు ఆత్మ. ఏది అపానవాయువుచేత అపానవ్యాపారమును జేయించుచున్నదో, అది నీయొక్క సర్వాంతరమగు ఆత్మ" అనియు నివ్విధముగ ప్రత్యుత్తర మిచ్చెను. ఉషస్తుఁ డీమాత్రమున తృప్తినొందక, మరల యాజ్ఞ్యవల్క్యునితో ఈ ప్రశ్నను గుఱించియే ప్రస్తావింపఁగా, నతఁడు "న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః, న శ్రుతే శ్శ్రోతారం శృణుయాః, న మతే ర్మన్తారం మన్వీథాః, న విజ్ఞాతే ర్విజ్ఞాతరం విజానీయాః ఏష త ఆత్మా సర్వాంతరః అతోఽన్యదార్తం" (బృ-౩. అ-౩. బ్రా-౧. వా.) (ఓ ఉషస్తుఁడా! "దర్శనక్రియకు కర్తయగు దానిని సర్వాన్తరాత్మనుగ జూడకుమా! శ్రవణవ్యాపారమునకు కర్తయగుదానిని సర్వాన్తరాత్మనుగ వినకుమా! మననవ్యాపారమునకు కర్తయగుదానిని సర్వాన్తరాత్మనుగ తలంపకుమా! విజ్ఞానవ్యాపారమునకు కర్తయగు దానిని సర్వాన్తంతరాత్మనుగ దెలిసికొనకుమా, ఈతఁడే నీయొక్క సర్వాంతరమగు ఆత్మ ఇతరమయినదంతయు దుఃఖయుక్తమగు జీవజాతము" అనియు నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. మఱియు అంతట కహోళుఁడనువాఁడు వేఱొక్కఁడు యాజ్ఞ్యవల్క్యునితో ఈ ప్రశ్నను గుఱించియే ప్రస్తావింపఁగా, నతఁడు "యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి ఏవం హైత మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రేషణాయాశ్చ విత్తేషణాయాశ్చ" (బృ-౩. అ-౩. బ్రా-౧. వా.) ఇత్యాది వాక్యమున "ఏది ఋత్పిపాసలను శోకమోహములను జరామరణములనున్ను అతిక్రమించియున్నదో, దేని నిట్లు ఉపాసించిన బ్రహ్మవేత్త పుత్రైషణము విత్తేషణము మొదలగువాని నుండి విరక్తుఁడగుచున్నాఁడో, దానిని సర్వాంతరుండగు నాత్మనుగా నుపాసింపుము తదితరమయిన దంతయును దుఃఖయుక్తమగు జీవజాతము" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

## సంశయము

ఉషస్త యాజ్ఞవల్క్యుల సంభాషణ సందర్భమున నుపదేశింపఁబడిన యుపాసనము. కహోళయాజ్ఞవల్క్యుల సంభాషణ సందర్భమున నుపదేశింపఁబడిన యుపాసనమునకంటె భిన్నమయినదా? లేక, ఉభయత్రను ఉపదేశింపఁబడిన యుపాసన మొక్కటియేనా?

## పూర్వపక్షము.

ఉషస్త కహోళు లడిగిన ప్రశ్న యొక్కటియే యయినను, వారికి యాజ్ఞవల్క్యుఁ డిచ్చిన యుత్తరములు భిన్నము లగుటంజేసి, యా తావుల నుపదేశింపఁబడిన యుపాసనముల రూపమునందు భేదము గద్దు. కావున నచట ఉపదేశింపఁబడిన యుపాసనములు భిన్నము లనుట యుక్తము. ఎట్లనిన, యాజ్ఞవల్క్యుఁడు ప్రాణనాదులకు కర్తయగు వానిని సర్వాంతరాత్మనుగా నెఱుంగుమని యుషస్తునితోఁ జెప్పెను. కహోళునితో నన్ననో, క్షుత్పిపాసాద్యతీతుఁడగు వానిని సర్వాన్తరాత్మనుగా నెఱుంగుమని చెప్పెను. అందువలన, యాజ్ఞవల్క్యుఁడు ఉషస్తునితో "ప్రాణాపానాదులయొక్క- ప్రాణనాపాననాది కార్యములను చేయువాఁడు సర్వాంతరాత్మ" యనుటచే, దేహేంద్రియమనఃప్రాణవ్యతిరిక్తుఁడగు జీవుఁడే సర్వాంతరాత్మ యని యుషస్తునికి బోధించినట్లు తెలియుచున్నది. కహోళుని కన్ననో, క్షుత్పిపాసాది రహితుఁడు సర్వాంతరాత్మయనుటచే జీవేతరుఁడగు పరమాత్మయే సర్వాంతరాత్మయని బోధించినట్లు తెలియుచున్నది. ఇట్లు ఒకతావున ఆత్మను మఱియొకతావున పరమాత్మనున్ను సర్వాన్తరాత్మనుగా నుపాసింపుమని బోధించియుండుటంజేసి ఈ రెండుతావుల నుపదేశింపఁబడిన యుపాస్యవస్తువులు భిన్నములనందున నుపాసనా స్వరూపమునందు భేదము గద్దు.

ఇట్లు మొదటి ప్రత్యుత్తరమునందుఁ, బేర్కొనఁబడిన జీవుఁడు పృథివ్యాది భూతములలో నుండువాఁడు గాన, నతఁడు తానుండు భూత సమూహములో నంతట వ్యాపించియుండుటచే సర్వాన్తరాత్మ (అంతట వ్యాపించియుండువాఁడు) యనవచ్చును. భూతసముదాయము నందీతనికిఁ గల యాన్తరాత్మ్యమునుబట్టి ప్రతివచనమునం దీతఁడు సర్వాన్తరాత్మగ జెప్పఁబడి యున్నాఁడని గ్రహించునది. ఈపైని గనఁబఱచిన ప్రకారము సర్వాంతరాత్మ్యమును గ్రహించుట యంత యుక్తముః కాక పోయినను, అట్లే యీ స్థలమున గ్రహింపవలయును. అట్లు గ్రహింపక, సర్వాంతగుఁడనఁగా జగత్తునందంతటను వ్యాపించియుండువాఁడను అర్థము నిచట గ్రహించిన పక్షమున, పరమాత్మనే యీతావునను జెప్పినట్లు అంగీకరింపవలసి వచ్చును. అట్లయినచో, నిచట గాన్పింపఁబడిన ప్రతివచనములకు భేదము సిద్ధింపకపోవును. ఎట్లనిన, ఈరెండు ప్రతివచనములలో, మొదటిదానియందుఁ బేర్కొనఁబడిన ప్రాణనాపాననాది ధర్మములు పరమాత్మయందు లేనివై జీవాత్మయందు గానఁబడుచున్నవి గాన, నిచట జీవాత్మయే పేర్కొనఁబడియె. రెండవ ప్రతివచనమునందుఁ బేర్కొనంబడిన క్షుత్పిపాసాది రాహిత్యము మొదలగు నవి జీవాత్మధర్మములు కాజాలవు. అయితె అవి పర

మాత్మధర్మములు. కావున నిచట పరమాత్మయే పేర్కొనఁబడుచున్నాఁడు. కనుక భూత సముదాయములో నుండు జీవుఁడే అతనికి గల భూతాంతరాత్మమునుబట్టి సర్వాంతరుఁడుగ జెప్పఁబడుచున్నాఁడని యంగీకరించునది. అట్లు అంగీకరింపని పక్షమున, ఈపైని గనఁబచిన ప్రకారము "యః ప్రాణేన ప్రాణితి" అను మొదటి ప్రత్యుత్తరమునకును, "యోశనాయా పిపాసాద్యతీతః" అను రెండవ ప్రత్యుత్తరమునకును భేదము సిద్ధింపక పోవుననిన,

## సిద్ధాంతము

ఈపైని గనఁబఱచిన ప్రశ్న ప్రతి వచనములు, రెండుతావులను, పరమాత్మ విషయములే యైనందున అచట ఉపదేశింపఁబడిన ఉపాసనములకు భేదములేదు. అది యెట్లనిన, "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను వాక్యమున ఉషస్తుఁడడిగిన ప్రశ్నము పరమాత్మవిషయమైనదియే. ఏలననిన, బ్రహ్మ శబ్దము, ముఖ్యముగ పరబ్రహ్మవాచకమే యైనను, దాని కొకప్పుడు జీవాత్మ వాచముగాను శ్రుతులయందుఁ బ్రయోగము కలదు. ఈతావున నది జీవాత్మవాచకముగ గ్రహింపఁబడకుండుటకు గాను, శ్రుతియందు "యత్ సాక్షాత్ బ్రహ్మ"అని యిట్లు విశేషణముతోఁ జెప్పఁబడినది. కనుక సాక్షాద్బ్రహ్మము పరమాత్మయే గాని జీవాత్మకాఁడు, మఱియు ఇచట "అపరోక్షాత్" అను మఱియొక విశేషణము గూడ జెర్పఁబడియె. అపరోక్షమనఁగా సర్వదేశములయందును, సర్వకాలములయందునుండునది యనుట గాన, నిట్టి యపరోక్షత్వము "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతియందు అనంతుఁడుగ వినఁబడిన పరబ్రహ్మముకే చెల్లునది. మఱియు ఈ తావున "సర్వాన్తరః" అను విశేషణమున్ను జెప్పఁబడినది. సర్వాన్తరుఁడనఁగా, "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరః" (బృ-౬.అ-౧.బ్రా-౩.వా.) అనువాక్యము మొదలుకొని "య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరః" అనువాక్యము వరకును పృథివ్యాద్యాత్మ పర్యంతము పేర్కొనఁబడినట్టి వానిలో నన్నింటిలోను నన్తరాత్మగాఁ జెప్పఁబడిన పరమాత్మకే సంభవము. ఇట్లు ప్రశ్నవాక్యమే కాక, "యః ప్రాణేన ప్రాణితి" అను ప్రతివచన వాక్యము సయితము పరమాత్మవిషయమైనదియే. ఏలననిన, సుషుప్త్యవస్థయందు జీవాత్మ ప్రాణనకార్యము నొనర్చుట లేనందున, అప్పుడు నిరుపాధికమగు అనఁగా నింద్రియాపేక్ష లేకయే ప్రాణనకార్యము నొనర్చు వాఁడు పరమాత్మయే. ఉషస్తుఁ డీవిషయము నెఱుంగక, ప్రతివచనమునందు సామాన్యముగ ప్రాణనకార్యము జెప్పఁబడినదనియు, అందువలన ఆ ప్రతివచనము సామాన్యముగ జీవాత్మ విషయమైనది గూడ కావచ్చునని యును తలఁచి యా ప్రత్యుత్తరముచేఁ దృప్తినొందక, అతఁడు మరల ఆప్రశ్న

నే యడిగెను. అంతట యాజ్ఞవల్క్యుఁడు ప్రత్యగాత్మకంటె విలక్షణుఁడును, ఇంద్రియాద్యుపాధుల నపేక్షింపకయే ప్రాణనకార్యము నొనర్చువాఁడును పరమాత్మయే యని "న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః" ఇత్యాది వాక్యమునఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఏలననిన, "ఇంద్రియాధీనములగు దర్శన శ్రవణ మనన విజ్ఞానములకు కర్తయగు జీవుని ప్రాణనకార్యమునకు కర్తనుగాఁ దలంపకుమా! ఏలననిన, అతఁడు సుషుప్తిమూర్ఛాద్యవస్థలయందు ప్రాణనకార్యము నొనర్పఁ జాలఁడు గదా!" అని యీపై వాక్యమున కర్థము. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ య ఏష ఆకాశ ఆనందో న స్యాత్" అను శ్రుతియుసు "ఈ యపరిచ్ఛిన్నుఁడగు ఆనందమయుఁడు లేనిచో, నెవఁడు జీవింపగలఁడు (ఉచ్ఛ్వాసనిశ్వాసములను విడవగలడు)" అనుచు ఆనంద మయుఁడగు పరబ్రహ్మమునే ప్రాణనకార్యమునకు కర్తనుగ ప్రతిపాదించుచున్నది. ఈపైని గానఁబఱచిన హేతువులను బట్టి మొట్టమొదట ఉషస్తుఁ డడిగిన ప్రశ్నమున్ను, దాని యుత్తరమున్ను పరబ్రహ్మవిషయములే యని సిద్ధమగుచున్నది. ఇట్లే కహోళునికిచ్చిన ప్రత్యుత్తరమునందుఁ బేర్కొనఁబడిన క్షుత్పిపాసాది రాహిత్యము మొదలగునవి పరమాత్మకే సంభవములు గాన, ఉత్తరత్ర చెప్పఁబడిన కహోళుని ప్రశ్నమున్ను దాని ప్రత్యుత్తరమున్ను పరమాత్మవిషయములే. ఈరెండు తావులను, ముగింపున "అతోఽన్యదార్తం" అనుటచే ముగింపు గూడ సమానముగా నున్నది.

అయితే సర్వప్రాణులయొక్కయును ప్రాణనకార్యమునకు కర్తయగు పరమాత్మ క్షుత్పిపాసాది రహితుఁడనియును ప్రతిపాదించుటకై యనేకమాఱులు ప్రశ్నించుటయు, అనేకమాఱులు ప్రత్యుత్తర మిచ్చుటయును సంభవించె. స్థలాంతరమునఁగూడ ఇట్టి మర్యాద గలదు. అదెటువలెననిన, ఛందోగులు సద్విద్యను ఉపదేశించు సందర్భమున, "ఉత త మాదేశ మప్రాక్ష్యః" అని యారంభించి, "భగవాం స్త్వేవ మే తద్బ్రవీతు" (పూజ్యులగు తామే నాకా విషయమును గుఱించి తెలుపుదురు గాక) అనియు "భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు"(మరల ఆ విషయమును గుఱించి తెలుపుమా) అనియును శ్వేతకేతుఁడు పలుమాఱు ప్రశ్నించుటయు, ఉద్దాలకుఁడు "స య ఏషోఽణి మా ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం" (ఇది సూక్ష్మమైనది ఈ జగమంతయును పరమాత్మసంబంధమైనది. అది సత్యము) అనియు నిర్విధముగ పలుమాఱు ప్రత్యుర మిచ్చుటయును, పరమాత్మయొక్క మాహాత్మ్యమును పలుతెఱంగుల ఎఱింగించుటకు గాను ప్రసక్తమైనట్లు తెలిసికొను చున్నాము. అట్లే, ప్రకృతమునను గ్రహింపవలయును.

ఈహేతువులవలన నీరెండుతావులను సర్వాన్తరాత్మయగు పరమాత్మయే సర్వప్రాణులయొక్కయును ప్రాణన వ్యాపారము నొనర్చు వాఁడుగను, క్షుత్పిపాసాదిరహితుఁడుగను, ప్రతిపాదింపఁబడు చున్నాఁడు గాన,ఈ రెండుతావుల నుపదేశింపఁబడి విద్యల స్వరూప మొక్కటియే. ఇట్లు ఉపాసనస్వరూప మొక్కటియే యైనందున నీరెండు తావులను ఉపదేశింపఁబడిన ఉపాసనము నొక్కటియే యని సిద్ధమగుచున్నది.

అవతారిక:—కానిమ్ము, పూర్వ సూత్రమునఁ బ్రతిపాదించిన ప్రకారము రెండుతావులను, ప్రశ్న ప్రతివచనములు పరమాత్మ విషయములే యవు గాక! అయినను, ఇందు విద్యాభేదము తప్పక యుండును. ఏలననిన, ఒకతావునఁ బరమాత్మను సర్వప్రాణులయొక్క ప్రాణన వ్యాపారమునకు కర్తనుగా నుపాసింపవలయునని విధింపఁబడియె. రెండవ తావున, నతనిని క్షుత్పిపాసాదిరహితునిగా నుపాసింపవలయునని విధింపఁబడియె. ఇట్లొకతావున ప్రాణన వ్యాపార కర్తృత్వమును, మఱియొకతావున క్షుత్పిపాసాది రాహిత్యమునున్ను, ఉపాస్య గుణములనుగా నుపదేశించి యుండుటం జేసి, యుభయత్ర యుపదేశింపఁబడిన యుపాస్యగుణములు భిన్నము లైనందున, యుపాసనా స్వరూపమున భేదము గలదు. ఇదియె కాక, ఇందొకతావున ఉషస్తుఁడు ప్రశ్న చేయువాఁడు రెండవతావున కహోళుఁడు ప్రశ్న చేయువాఁడు. ఇట్లు ఈ రెండుతావులను ప్రశ్నచేయువారలు గూడ భిన్ను లైనందున, నిచట ఉపాసనములకు భేదమవర్జనీయమని శంకింపఁగా, నందులకు సమాధానము నీసూత్రముచేఁ జెప్పుచున్నారు.

3౬॥ సూ॥ వ్యతిహారో విశింషన్తిహీతరవత్.

టీ॥ హి = ఎందువలన, విశింషన్తి = యాజ్ఞవల్క్యుని ప్రతివచనములు పరమాత్మను ప్రాణనాదికర్తగను అశనాయాద్యతీతునిగానున్ను విశేషింపు చున్నందున, ఇతరవత్ = సద్విద్యయందువలెనే, వ్యతిహారః = ఉషస్తకహోళుల జ్ఞానముల కిచట వినిమయముఁ జేయునది.

తా॥ యాజ్ఞవల్క్యుని ప్రతివచనములు పరమాత్మను ప్రాణనాదికర్తనుగాను, అశనాయాద్యతీతునిగానున్ను విశేషింపుచున్నందున నీతావున సద్విద్యయందు వలెనే ఉషస్తకహోళుల జ్ఞానములకు వినిమయముఁ జేసికొనునది.

శ్రీ॥ భా॥ ఈరెండుతావులను, ప్రశ్న ప్రతివచనము లేకరూపములును ఏకార్థమును గురించినవియు నైనందునను, రెండుతావులను విధి ప్రత్యయ మొక్క

టియే యైనందుననున్ను, ఈ రెండు వాక్యములకు ఏకవాక్యతగలదు. అనఁగా నీ రెండుతావుల నొక్కటియే విషయమును గుఱించి చెప్పఁబడుచున్నది. కాఁబట్టి యిచట విద్యాభేదము లేదు. ఏలననిన, ఈ రెండు ప్రశ్నలును సర్వాంతరాత్మత్వగుణవిశిష్టుఁడగు పరమాత్మను గుఱించి యడుగఁబడినవి. అనంతరము "యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను రెండవ ప్రశ్నవాక్యమునందుండు "ఏవ" కారము పూర్వము ఉషస్తుఁడడిగిన సర్వాంతరాత్మ్యవిశిష్టుఁడగు పరమాత్మను గుఱించియే కహోళుఁడు అడిగినదియు ననెడి విషయమును స్పష్టపఱచుచున్నది. ప్రత్యుత్తరములును, "స త ఆత్మా సర్వాంతరః" అనియే యున్నందున, సర్వాంతరాత్మత్వ విశిష్ట బ్రహ్మమును గుఱించినవియే యైనందున, నవియును సమానములే. మఱియు అంతమునందు రెండుతావులను "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" అను వాక్యమున వినఁబడు విధి ప్రత్యయమునను భేదములేదు. ఇట్లు ఈ రెండుతావులను ఉపదేశింపఁబడిన యుపాసనములును సర్వాంతరాత్మ్య విశిష్టుఁడగు పరమాత్మను గుఱించినవియే యని నిరూపింపఁబడుటచే, నీ రెండుతావులను ఉపాస్యవస్తువగు సర్వాంతరాత్మ్య విశిష్టుఁడగు పరమాత్మ విషయమై యుషస్తకహోళుల జ్ఞానములకు పరస్పరము విని మయముఁజేసికొనునది. అదియెట్లనిన, సర్వాంతరాత్మ్య విశిష్టుఁడగు పరమాత్మ సర్వప్రాణుల ప్రాణనకార్యమునకు కర్తయని యిట్లు ఉషస్తునికిఁగల జ్ఞానము కహోళునికిఁగూడ ఉండవలయుననియు, సర్వాంతరాత్మ్య విశిష్టుఁడగు పరమాత్మ క్షుత్పిపాసాద్య తీతుఁడని యిట్లు కహోళునికిఁగల జ్ఞానము, ఉషస్తునికిఁగూడ ఉండవలయుననియును, గ్రహింపవలయును. ఇట్లు వినిమయముఁజేసినచో, వీర లిద్దఱికిని సర్వాంతరాత్మయగు పరమాత్మ జీవునికంటె విలక్షణుఁడని తెలిసినట్లగును. ఇట్లు సర్వాంతరాత్మయగు పరమాత్మ ప్రత్యగాత్మకంటె విలక్షణుఁడని తెలుపుటకైయే గదా యాజ్ఞవల్క్యుఁడు ఉషస్తకహోళుల ప్రశ్నలకు ఉత్తర మిచ్చునప్పుడు తన ప్రతివచనములయందు సర్వాంతరాత్మయగు పరమాత్మను, సర్వప్రాణుల ప్రాణనవ్యాపారమునకు కర్తగను, క్షుత్పిపాసాశనాయాద్యతీతుని గాను ప్రతిపాదించుటచే విశేషించి చెప్పెను. ఈ హేతువులవలన నీ రెండుతావులను సర్వాంతరాత్మత్వమే బ్రహ్మముయొక్క యుపాస్య (యుపాసింపవలసిన) గుణము. ప్రాణన హేతుత్వాదులన్ననో, అట్టి సర్వాంతరాత్మ్యమునకు ఉపపాదకములే గాని, యవి యుపాస్య గుణములు గావు. ఇట్లు సర్వాంతరాత్మత్వమే యుపాస్య గుణమైనచో, అందును గుఱించిన జ్ఞానము ఉషస్తకహోళులకు ఉభయులకును సమానముగాఁ గలదు గాన, వీరిలో నుషస్తునికిఁ గల జ్ఞానము అనఁగా సర్వాంతరాత్మ యగు పరమాత్మ

సర్వప్రాణి ప్రాణనకార్యమునకు కర్తయను జ్ఞానము కహోళునికి ఉండవలయు ననియు, మఱియు కహోళునికిఁగల జ్ఞానము అనఁగా సర్వాంతరాత్మయగు పరమాత్మ క్షుత్పిపాసాద్య తీతుఁడను జ్ఞానము ఉషస్తునికి ఉండవలయు ననియు నిట్లు విని మయముఁజేసికొని యను సంధించుటవలన ప్రయోజన మేమున్న దని శంకింపఁ బనిలేదు. ఏలననిన, ప్రథమమున సర్వ ప్రాణులయొక్కయు ప్రాణనకార్యమునకు హేతువగుటం జేసి సర్వాంతరాత్మయును, కనుకనే జీవుని కంటెను విలక్షణుఁడునగు పరమాత్మను ఉషస్తుఁడు తెలిసికొనఁగా, కహోళుఁడు అన్ని విధములచేతను జీవునియం దుండుట కసంభవమగు స్వభావ విశేషముతోను గూడ పరమాత్మను విలక్షణునిగా నను సంధింపవలయునని యుద్దేశించి, మరల ప్రశ్నించెను. కహోళునియొక్క యీ యుద్దేశమును యాజ్ఞవల్క్యుఁ డెఱింగి జీవుని కసంభవమైనట్టి క్షుత్పిపాసాద్యతీతత్వమును ఉపదేశించెను. కావున తదితర పదార్థములనుండి పరమాత్మకుఁగల వైలక్షణ్యమును బ్రకటింపఁ జేయుటకుగాను, పైనిఁజెప్పిన ప్రకారము, వీరిద్దఱిలో నొక్కనికిఁగల జ్ఞానమును మఱియొకనికిఁగూడ ఉండియున్నట్లను సంధింపవలయును. ఇట్టి యాచార మితర విద్యలయందు సయితము గలదు. అదెటువలెననిన, సద్విద్యయందు ఉపాస్య పదార్థమునకు తదితర పదార్థములనుండి వైలక్షణ్యమును గానఁబఱచుటకై పలుమాఱు ప్రశ్నించుటయు, పలుమాఱు ఉత్తరముల నిచ్చుటయును ప్రవర్తించినవియే గాని, పూర్వము తెలిసిన గుణములకంటె వేఱు గుణములను గల దానినిగాను ఉపాస్యవస్తువును ఉపపాదించుటకై ప్రవర్తింపలేదు గదా! అట్లే ప్రకృతమునను, గ్రహింపవలయును.

అవతారిక:—సద్విద్యయందును ప్రశ్న ప్రతివచనములకు భేదముండుటంజేసి యచట విద్యైక్య మెట్లు సమకూడునని శంకింపఁగా, నందులకు సమాధానము నీ సూత్రముచేఁ జెప్పుచున్నారు.

## ౩౭॥ సూ॥ సైవ హి సత్యాదయః॥

టీ॥ సైవ=మొదటి తడవ పేర్కొనఁబడిన పరదేవతయే తరువాతను పేర్కొనఁబడుచున్నది, హి=ఏలననఁగా, సత్యాదయః=మొదటి తడవ పేర్కొనఁబడిన సత్యాదులు తరువాతనున్న ఉప సంహరింపఁబడుచున్నవి.

తా॥ మొదటి తూరి పేర్కొనఁబడిన పరదేవతయే తరువాతనన్ను పేర్కొనఁబడుచున్నది. ఏలననఁగా, మొదటి తూరి పేర్కొనఁబడిన సత్యాదిగుణములు తరువాతనున్న ఉప సంహరింపఁబడుచున్నవి గదా.

శ్రీ॥ భా॥ "సత్" అని పిలువఁబడునదియు, పరమ కారణమునగు పరదేవతయే "సేయందేవతైక్షత" అనియు "తేజః పరస్యాం దేవతాయాం" అనియు నీ వాక్యములయందుఁ బేర్కొనఁబడి, "యథా సౌమ్య మధు మధుకృతో నిస్తిష్ఠన్తి" ఇత్యాది పర్యాయ వాక్యముల యందంతటను ఉపపాదింపఁబడుచున్నది. ఏలననిన, "ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా" అని యిట్లు మొదటి పర్యాయమునఁ బేర్కొనఁబడిన సత్యాదిగుణములే ద్వితీయాది పర్యాయములయందు ఉపపాదింపఁబడినవై, ఉపసంహరింపఁ బడుచున్నవి.

కొందఱు భాష్యకారులు "వ్యతిహారో విశింషన్తి హీతరవత్" అను సూత్రమును మాత్ర మొక యధికరణముగను, "సైవహిసత్యాదయః" అను సూత్రమును మాత్రము మఱియొక యధికరణముగను, గొని వ్యాఖ్యానము జేసియున్నారు. ఆరెంటిలో "వ్యతిహారో విశింమంతి హీతరవత్" అను వ్యతిహారాధికరణ సూత్రమునకు "త్వం వాఽహ మస్మి భగవో దేవతే అహం వై త్వమసి భగవో దేవతే తద్యోఽహం సోఽసౌ యోఽసౌ సోఽహం" (నే నెవ్వాడనో, యీ యీశ్వరుఁడును వాఁడే, వాఁడెవ్వడో, నేనును వాఁడినే, నేనే వాఁడు, వాఁడే నేను.) అను శ్రుతిప్రకారము జీవేశ్వరులను వ్యతిహారముగ అనఁగా నొక్కని వేఱొక్కనిగ ఉపాసింపవలయునని అనఁగా జీవుని యీశ్వరుని గాను, ఈశ్వరుని జీవుని గాను ఉపాసింపవలయునని వ్యాఖ్యానముఁ జేసియున్నారు.

అయితే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనియు, "ఐతదాత్మ్య మిదంసర్వం" అనియు "తత్త్వమసి"అనియు ఈ మొదలగు శ్రుతివాక్యములచేఁ బ్రతిపాదింపఁబడిన సర్వాత్మభావమునే అనఁగా సర్వమునకును పరమాత్మ యంతరాత్మ యను భావననే యీపై వాక్యము ప్రతిపాదించుచున్నది గాని, క్రొత్తవిషయమును దేనిని ప్రతిపాదించుచుండలేదు. మఱియు ఈవిషయమును, సూత్రకారులు "ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తిచ" (బ్ర. సూ. ౪ అ. ౧ పా. 3.సూ) అను సూత్రమునఁ బ్రతిపాదింపఁ బోవుచున్నారు. కాఁబట్టి వారు చెప్పునది యిచట గ్రహింపఁదగినది కాదు. ఈ పై వాక్య మిట్టి సర్వాంతరాత్మత్వానుసంధానమును తప్ప, ఈశ్వరుని జీవునిగను, జీవుని యీశ్వరునిగను,ఇవ్విధమగు అను సంధానమును ప్రతిపాదించుచున్న దనునది యసత్యము.

మఱియు వారలు "సైవహి సత్యాదయః" అను సత్యాద్యధికరణమున "స యోహ వైతన్మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మ"ఇత్యాది శ్రుతి వాక్యముచే ప్రతిపాదింపబడిన సత్యోపాసనమునకును, "తద్యత్సత్యమసౌస ఆదిత్యోయ ఏష ఏతస్మిన్మండలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షిన్" అను శ్రుతివాక్యముచే ప్రతిపాదింపఁబడిన యుపాసనమునకును ఐక్యము ప్రతిపాదిం

పఁబడఁ చున్నదని వ్యాఖ్యానము జేసి యుండిరి. ఇదియును యుక్తము కాదు. ఏలననిన, ద్వితీయవాక్యమునఁ జెప్పఁబడిన అక్షిస్థానమును ఆదిత్యస్థానమున్ను భిన్నములైనందున నిచట స్థానభేదమునుబట్టి విద్యాభేదముగలదని "నవా విశేషాత్" అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. ఇంతియె కాక, ఈ శ్రుతియందు ఉపదేశింపఁబడిన యుపాసనములు రెండును వ్యాహృత్యాది శరీరకములగుటచే రూపవంతము లగుటవలనను, "హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద" (ఇట్లు ఉపాసించువాఁడు పాపమును నశింపుచున్నాఁడు. సంసారబంధమును విడనాడుచున్నాఁడు) అన్నట్లు వేఱువేఱు సంయోగ చోదనాదులు గలవి యగుటవలననునానికి "స యో హవై తన్మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి విజానీయాత్" అని యిట్లు సంయోగ చోధనాదులు గలది యగుటచే స్వతంత్రమును, పూర్వవాక్యమునఁ జెప్పఁబడినదియునగు ఒక్కయుపాసనముతో నైక్యము సంభవము గాదు. ఒక వేళ ద్వితీయ వాక్యమునందు వినఁబడిన పాపహానన త్యాగములు ప్రధానములగు ఫలములు కావనుట కవకాశము లేదు. ఇట్లు జెప్పుటకెద్దియును ప్రమాణము గానఁబడదు గదా! ఒక వేళ పూర్వవాక్యగతమగు విద్యతో నుత్తరవాక్య గతమగు విద్యకుఁగల యైక్యమే ప్రయాణమనియెదవా, అట్లైనచో, ఈతావున ఇతరేతరాశ్రయదోషము ప్రాప్తించును.

ఏలయన:—పూర్వోత్తర వాక్యగతములగు విద్యల కైక్యము నిశ్చితమైన తరువాతను గదా పూర్వవాక్యగతమగు విద్యయొక్క ఫలము అనఁగా లోక జయరూప యగు ఫలము ప్రధానమనియు, ఉత్తర వాక్య గతమగు విద్యయొక్క ఫలములు అనఁగా పాపహానన త్యాగము లప్రధానములనియును సిద్ధమగును. మఱియు పూర్వవాక్యగతమగు విద్యయొక్క ఫలము ప్రధానమనియును, ఉత్తర వాక్యగతమగు విద్యయొక్క ఫలము లప్రధానములనియును నిశ్చయింపఁబడిన తరువాతను గదా, సంయోగ చోదనాది భేదములేక పోవుటచే, పూర్వోత్తర వాక్య గతములగు విద్యల కైక్యము సిద్ధింపును. ఇట్లు ఈ రెంటిలో నొకటి నొకటి యాశ్రయించి యుండుటంజేసి యీవాద మితరేత రాశ్రయదోష దూషితము. కనుక "వ్యతిహారో విశింషన్తి హీతరవత్" "సైవహి సత్యాదయః" అను నీరెండు సూత్రముల నొక యధికరణముగ భావింపవలయును.

॥ అన్తరత్వాధికరణము ముగిసెను. ॥



## కామాద్యధి కరణము

౩౭॥ సూ॥ కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః.

టీ॥ ఆయతనాదిభ్యః=ఆయతనాదులనుబట్టి, ఇతరత్ర=వాజసనేయకము నను, తత్ర చ=ఛాందోగ్యముననుు, కామాది=సత్యకామాది విశిష్టమగు బ్రహ్మ మే యుపాస్యవస్తువు.

తా॥ ఆయతనాదులను బట్టి వాజసనేయకముననుు, ఛాందోగ్యముననుు సత్యకామాది విశిష్టమగు బ్రహ్మమే యుపాస్య వస్తువుగాను తెలియుటచే నిందు ఉపాసనా స్వరూపమున భేదములేదు.

శ్రీ॥ భా॥ ఛందోగులు దహరవిద్యను గుఱించి, "అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశ స్తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం" (ఛా.౮ ప్ర.౧ ఖ.౧ వా) ఇత్యాది వాక్యమున "ఈశరీ రమునందు సూక్ష్మమగు కమలమువంటి స్థానము కలదు. అస్థానమునందు దహర మనఁబడు ఒక యాకాశము కలదు. దానిలో నెద్దికలదో, దానిని వెదకి తెలిసి కొనునది" అని పఠించుచున్నారు. వాజసనేయులు ఈవిషయమును గుఱించి "స వా ఏష మహానజ ఆత్మా విజ్ఞానమయః ప్రాణేషు య ఏషో న్తర్హృదయ ఆకాశ స్తస్మిం చ్ఛేతే సర్వస్య వశీ సర్వస్యేశానః" (బృ.౬అ.౪బ్రా.౨౨వా) ఇత్యాదివాక్యమున, "ఎవఁడు ప్రాణములయందు విజ్ఞానమయుఁడుగా నున్నాఁడో, ఎవఁడు హృదయములోని యాకాశమున శయనించియున్నాఁడో, ఎవఁడు సర్వ మును తనవశమున నుంచుకొనిన వాఁడై సర్వమును నియమించుచున్నాఁడో" అని యిట్లు పఠించుచు న్నారు. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఈ రెండుతావులను ఉపదేశింపఁబడిన దహరోపాసనములు భిన్నములా! కావా?

### పూర్వపక్షము.

ఈ రెండుతావులను ఉపదేశింపఁబడిన దహరోపాసనముల రూపమునం దు భేద ముండుటంజేసి అవి భిన్నము లనుట యుక్తము. ఎట్లనిన, ఛందోగుల దహరోపాసనమునందు అపహత పాప్మము మొదలుగాఁగల యెనిమిది గుణ ములతోఁ గూడుకొనిన యాకాశము ఉపాస్యవస్తువుగా నుపదేశింపఁబడి నది. వాజసనేయుల దహరోపాసనమునం దన్ననో, ఆకాశమున శయనించి యున్నట్టియు, వశిత్వాది గుణములతోఁ గూడుకొనినది యుపాస్య వస్తువుగా

ను ఉపదేశింపఁబడినది. కనుక ఈతావులను ఉపాసనా స్వరూపమునందు భేదము గలదు. అందువలన నీరెండుతావులను ఉపదేశింపఁబడిన దహరోపాసనములు భిన్నములని సిద్ధమగుచున్నది.

## సిద్ధాంతము.

వాజసనేయకమునను ఛాందోగ్యముననున్ను, సత్య కామాదిగుణ విశిష్టుఁడగు బ్రహ్మమే యుపాస్యవస్తువుగా నుపదేశింపఁబడి యున్నందున, నీరెండు తావులను, విధింపఁబడిన దహరోపాసనముయొక్క రూపమునందు భేదము లేదు. అదెట్లు తెలియు ననిన, ఈ రెండు శ్రుతులయందును, హృదయాయతనత్వము, సేతుత్వము, విధరణత్వము మొదలగు గుణములు సమానముగ వర్ణింపఁబడుటం జేసి, యొక తావున విధింపఁబడిన యుపాసనమే రెండవతావునను విధింపఁబడినట్లు గుర్తింపఁబడుచున్నది. వాజసనేయ శ్రుతియందు పఠింపఁబడి నట్టి వశిత్వము మొదలగు గుణములు ఛాందోగ్య శ్రుతియందు పఠింపఁబడిన యష్టగుణములలో నొక్కటియగు సత్యసంకల్పత్వమను గుణముయొక్క విశేషములే గాన, నవి, ఛాందోగ్యశ్రుతియందు సత్య సంకల్పత్వ గుణముతోఁ గూడ (సత్యకామత్వము మొదలుకొని అపహత పాప్మత్వ పర్యంతము) పఠింపఁబడిన గుణములకు వాజసనేయక శ్రుతియందుఁ గూడ సద్భావమును (ఉనికిని) దెలియఁ బఱచుచున్నవి. ఈహేతువునుబట్టి యీ రెండు శ్రుతులయందును ఉపదేశింపఁబడిన దహరోపాసనముల స్వరూపమునందు భేదము లేదు. మఱియు ఛందోగులు, "పరం జ్యోతి రుప సంపద్య స్వేన రూపేణాభిసంపద్యతే" అను వాక్యమున "దహరోపాసకుఁడు, పరజ్యోతిస్సును బొంది, స్వస్వరూపావిర్భావము గలవాఁడగును" అనియు, వాజసనేయులు, "అభయంవై బ్రహ్మ భవతి" అను వాక్యమున, "దహరోపాసకుఁడు సంసారభయము లేని బ్రహ్మము ఎవ్విధమైన వాఁడో అవ్విధమైన వాఁడగుచున్నాఁడు" అనియును, జెప్పుచుండుటం జేసి వీరు ఉభయులును తమతమ శాఖలయందు పఠింపఁబడిన దహరోపాసనములకు బ్రహ్మప్రాప్తినే ఫలమునుగాఁ జేర్కొనియున్నారు. ఈ హేతువువలన నీరెండు తావులను విధింపఁబడిన దహర విద్యల ఫలమునందును భేదము లేదు. ఛాందోగ్య వాక్యమునందుండు "ఆకాశ" శబ్దము బ్రహ్మవాచకమని "దహర ఉత్తరేభ్యః" అను సూత్రమున నిర్ణయింపఁబడెను. వాజసనేయుల శ్రుతియందు ఆకాశశాయిగా వర్ణింపఁబబడినవాఁడు వశిత్వాది గుణ విశిష్టుఁడగుటం జేసి యతఁడు పరమాత్మయే యై యుండవలయును. అట్టి పరమాత్మయొక్క శయనమును దెలుపు ఆకాశశబ్దము "తస్యాంతే సుషిరం సూక్ష్మం" అను మహాభారత వాక్యమునందు "సుషిరం" అని చెప్పఁబడినదియు, హృదయాంతర్గతమగు సూక్ష్మ

కాశమునే బోధింపుచున్నట్లు దెలియుచున్నది. ఈహేతువులవలన ఛాందోగ్య వాజసనేయ శ్రుతులయందు విధింపఁబడిన దహరవిద్యల కైక్యము సిద్ధమగుచున్నది.

అవతారిక:—అయినను, వాజసనేయకశ్రుతియందు వశిత్వాదిగుణములతోఁ గూడ సత్య కామత్వాదులును ఉపాస్యగుణములుగ ఉపస్థితములగుచున్నట్లు దెలియఁబడుచున్నవని పూర్వసూత్రమునఁ జెప్పఁబడియె. అది యసంభవము. ఏలననిన, ఉపాస్యుఁడగు బ్రహ్మమునందు వశిత్వాదిగుణములు వాస్తవముగ లేవు. ఏలననిన, "మనసైవానుద్రష్టవ్యం నేహనానాస్తి కిఞ్చన మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతివాక్యము, "ఈ బ్రహ్మము మనస్సుచే భావింపఁదగినది. దీనియందనేక మెద్దియును లేదు, దీనియందనేకమును జూచువాఁడు జన్మమరణరూపమగు సంసారమును బొందుచున్నాఁడు" అనియు, "ఏకధైవాను ద్రష్టవ్యం ఏతదప్రమేయం ధ్రువం" (బ్రహ్మమును ఒక్కవిధమైన దానిని గానే భావింపవలయును. ఇది ప్రత్యక్షాది ప్రమాణములకు విషయమైనదికాదు. ఇది నిశ్చితము) అనియు "స ఏష నేతి నేత్యాత్మా" అను ఉత్తరవాక్యము "ఈబ్రహ్మమునందు విశేషము లేవియును లేవు." అనియును జెప్పుచుండుటం జేసి పరబ్రహ్మమునం దెట్టి విశేషములును లేవని తెలియవచ్చుచున్నది. కనుక స్థూలత్వము, అణుత్వము మొదలగునవి బ్రహ్మమునందుండుట కసంభవములగుటం జేసి, నిషేధార్హములైనట్లు, వశిత్వాదిగుణములు గూడ నిషేధార్హములని యిందువలనఁ దెలియవచ్చుచున్నది. ఈహేతువువలన ఈపైని యుదహరింపఁబడిన ఛాందోగ్యశ్రుతి సత్యముగ బ్రహ్మమునకు సత్యకామత్వాది గుణములు గలవని జెప్పుచుండలేదు. అనఁగా నీశ్రుతియందుఁ జేర్కొనఁబడిన సత్యకామత్వాది గుణములు వాస్తవముగ బ్రహ్మమునందు లేవనుట. కాఁబట్టి యిట్లు అసత్యములగు గుణములను మోక్షోపయుక్తములగు నుపాసనములయందు లోపింపవలయును. అనఁగా వాని నిట్టి యుపాసనములయందు ఉపాస్య గుణములనుగా గ్రహింపఁ గూడదనుట. ఇట్లు శంకింపఁగా, నిందులకు సమాధానమును ఈ సూత్రముచేఁ జెప్పుచున్నారు.

౩౯॥ సూ॥ ఆదరాదలోపః.

టీ॥ ఆదరాత్=సత్య కామత్వాదులను ఆదరముతో నుపదేశించినందున, అలోపః=వాటిని ఉపాసనములయందు లోపింపఁగూడదు.

తా॥ శ్రుతులు సత్యకామత్వాదులను ఆదరముతో నుపదేశించుచున్నందున వాటిని ఉపాసనములయందు లోపింపఁదగదు.

శ్రీ॥ భా॥ శాస్త్రప్రమాణము వలననే తప్ప, ఇతర ప్రమాణములవలనఁ దెలియరానివి యగు సత్య కామత్వాదులను "తస్మిన్ యదన్త స్తదన్వేష్టవ్యం" "ఏష త ఆత్మాఽపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" ఇత్యాది ఛాందోగ్య శ్రుతులును, "సర్వస్య వశీ సర్వస్యేశానః" "ఏష సర్వేశ్వర ఏషభూతాధిపతి రేష భూతపాల ఏష సేతుర్వి ధరణ ఏషాం లోకానామసంభేదాయ" ఇత్యాది వాజసనేయ శ్రుతులును, మఱియు ఇతర శాఖాశ్రుతులును గూడ మోక్షమునకై యుపాసింపఁబడు పరబ్రహ్మముయొక్క గుణముల నాదరముతో నుపదేశింపుచున్నవి. కనుక ఈ గుణములను మోక్షార్థములగు నుపాసనములయందు లోపించుట న్యాయము కాదు. కావున వాని నచట అవశ్యముగ ఉప సంహరించు కొనవలయును. మఱియు ఛందోగులు, "తద్య ఇహాత్మాన మనువిద్య వ్రజన్త్యే తాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామ చారో భవతి" అను వాక్యమున, "ఈ లోకమున నెవరు పరమాత్మను, అతని సత్యకామత్వాది గుణములనున్ను దెలిసికొని శరీరమును వదలుచున్నారో, వారలకు సర్వలోకములయందును స్వేచ్ఛావిహారము గలదు" అనుటచే సత్య కామత్వాది గుణ విశిష్టుఁడగు పరమాత్మను గుఱించిన యుపాసనమును విధించి, అనంతరము "అథయ ఇహాత్మాన మననువిద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేష్వ కామ చారో భవతి" అను వాక్యమున "ఎవరు పరమాత్మను, అతని సత్య కామత్వాది గుణములనున్ను ఎఱుంగక శరీరమును వదలుచున్నారో, వారలకు సర్వలోకములయందును స్వేచ్ఛా విహారము లేదు" అనుటచే సత్య కామత్వాది గుణ విశిష్టమగు పరమాత్మ నెఱుంగకుండుటను నిందించుచు, పరమాత్మను గుణవిశిష్టునిగా నెఱుంగుటయం దాదరమును గానఁబఱిచి యున్నారు. అట్లే వాజసనేయులును, "సర్వస్య వశీ సర్వస్యేశానః" ఇత్యాది వాక్యమున "పరబ్రహ్మము సర్వమును తన వశమున నుంచుకొని యున్నాఁడనియు, సర్వమున కీశుఁడే నియామకుఁ డనియు, "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష భూతపాలః" ఇత్యాది తావుల "పరబ్రహ్మము సర్వమున కీశ్వరుఁడనియు, భూతముల కధిపతియనియు, భూతములఁ బాలించువాఁడనియు, నివ్విధముగ పలుమాఱు పరబ్రహ్మముయొక్క గుణములను జేర్కొనుచు గుణములయం దాదరమును గానఁబఱిచియున్నారు. ఇట్లే ఇతర శాఖలవారును గూడఁ బరమాత్మగుణముల నాదరముతోఁ జేర్కొనియున్నారు. ఇంతియే కాక, వేలకొలది మాతాపితృలకంటె నెక్కువ వాత్సల్యముతోఁ గూడుకొనినదియగు శాస్త్రము పారమార్థికములు గానట్టియు, నిషేధార్హములు లైనట్టి

గుణములను, అత్యాదరముతో వంచకునివలె నుపదేశించి, సంసారసముద్రము నందు క్రిందు మీదుపడుచు, యింతకుముందే భ్రాంతచిత్తులగు ముముక్షువు లను, మఱియంత భ్రమియింపఁ జేయుచున్న దనుట యసంభవము. అయితే "నేహ నానా స్తి కిఞ్చన" "ఏక ధైవాను ద్రష్టవ్యం" ఇత్యాది శ్రుతులు సర్వము బ్రహ్మ ముచే సృజింపఁబడిన దగుటంజేసి బ్రహ్మాత్మకమైన దనుచు సర్వము బ్రహ్మా త్మకముగా నొక్కవిధమైన దనెడి జ్ఞానమును విధించి, యిట్టి జ్ఞానము గలుగుట కు పూర్వ ముండినట్టిదియు, సర్వము బ్రహ్మాత్మకము కాదనెడి నానాత్వ జ్ఞానమును నిషేధింపుచున్నవి. ఈ వాక్యముల కిదియే యర్థమని యింతకుపూ ర్వమే సవిస్తరముగాఁ బ్రతిపాదింపఁబడియె. "స ఏష నేతి నేత్యాత్మా" అను వాక్యమునకు, "సః ఏషః=ఆ పరమాత్మ, ఇతి=ఇట్లు అనఁగా నీ దృశ్యపదార్థము లవంటి వాఁడు, న=కాడు" అని యర్థము. ఈ వాక్యమునందలి 'ఇతి' అను శబ్దను ప్రమాణాంతరములచేఁ దెలిసికొనఁ దగినట్టి ప్రపంచాకారమును బరా మర్శించి, పరమాత్మ ప్రపంచమునందలి ఘటపటాది పదార్థముల వంటివాఁడు కాడనుచు, సర్వాన్తరాత్మయగు పరమాత్మకును, ప్రపంచమునకును గల వై లక్షణ్యమును, ప్రతిపాదించుచున్నది. ఏలననిన, "అగ్రాహ్యో నహి గృహ్యతే, అశీర్యో నహి శీర్యతే, అసంగో నహి సజ్యతే, అవ్యథితో నహి వ్యథతే,నరిష్యతి" (బృ. ౬-అ. ౪-బ్రా. ౨౨-వా.) అను తరువాతి వాక్యమున్ను "పరమాత్మ గ్రహింప శక్యుఁడు గానందున, నతఁడు గ్రహింపఁబడడనియు, అతఁడు నాశము ను బొందింపఁదగినవాఁడు గానందున నశింపఁబడ డనియు, అతఁడు దేనితో సంబంధింపఁ దగినవాఁడు కానందున, దేనితోను సంబంధింపఁ బడడనియు, అతఁడు బాధింపఁ దగినవాఁడు గానందున, బాధింపఁబడడనియు" నిర్విధముగ జెప్పుచు పరబ్రహ్మముకును ప్రపంచమునందలి పదార్థములకును గల వైల క్షణ్యమునే దృఢపఱచుచున్నది. ఇచట పరబ్రహ్మము గ్రహింప శక్యుఁడు గాడ నఁగా అతఁడు ప్రమాణాంతరములచేఁ దెలిసికొనుటకు శక్యములైన ఘటపటాది పదార్థముల వంటి వాఁడు గానందున, నతఁ డట్టి ఘటపటాది పదార్థములవలెనే ప్రత్యక్షాది ప్రమాణాంతరములచేఁ దెలిసికొనుటకు శక్యుఁడు గాడనుట. మఱి యు నిచట పరబ్రహ్మము నాశమును బొందింపఁ దగినవాఁడు కాడనఁగా నతఁడు నశ్యములగు ఘటపటాది పదార్థములవంటి వాఁడు గానందున వాటివలె నీతఁడు నశింపఁజేయుటకర్హుఁడు గాడనుట. ఈ వాక్యమునందలి యితర విశేషణ ముల యర్థమున్ను ఈ రీతిగానే గ్రహింపవలయును. ఛందోగులును, "నాస్య జరయై తజ్జీర్యతి, న వధే నాస్య హన్యతే, ఏతత్సత్యం బ్రహ్మపుర మ స్మిన్ కామాస్సమాహితాః" (ఛా-౮. ప్ర-౧. ఖ-౫. వా.) అను తావున "పర

బ్రహ్మము ముసలితనముచే జీర్ణించునదియు, వధచే హింసింపఁ దగినదియును గాదు. ఇది వికారమును పొందనిదియగు బ్రహ్మపురము. దీనియందు సర్వ కామములును అనఁగా సత్యకామత్వాది గుణములన్నియును జేరియున్నవి" అనుచు ప్రపంచమునందలి పదార్థములకును బ్రహ్మమునకును గల వైలక్షణ్యమును గానఁబఱచి, అట్టి బ్రహ్మమునందే సత్యకామత్వాది గుణములను విధింపుచున్నారు.

అవతారిక:—అట్లయినను, "తద్య ఇహాత్మాన మనువిద్య వ్రజన్త్యేతాగ్‌శ్చ సత్యాన్ కామాగ్‌స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి స యది పితృలోక కామో భవతి" ఇత్యాది శ్రుతివాక్యమున, పరబ్రహ్మము సత్యకామాది గుణవిశిష్టుఁడను జ్ఞానమునకు పితృలోకాదులయందు స్వేచ్ఛా సంచారమును ఫలమునుగాఁ జెప్పుచు, ఇట్టి జ్ఞానమును సాంసారిక ఫలముతో సంబంధించిన దానినిగాఁ దెలియఁజేయుచున్నందున, పరబ్రహ్మప్రాప్తిని గోరునట్టి ముముక్షువులచే నట్టి గుణవిశిష్టమగు బ్రహ్మము ఉపాసింపవలసినది గానేరదు. "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే" అను శ్రుతిప్రకారము "పరజ్యోతిస్సును బొందిన తరువాత స్వస్వరూప మావిర్భూతమగుట గదా" బ్రహ్మవిద్యాఫలము. కనుక బ్రహ్మప్రాప్తిని గోరు ముముక్షువులచే మోక్షార్థముగ నాచరింపఁబడు ఉపాసనములయందు సత్యకామత్వాది గుణములు గ్రాహ్యములు గావని శంకింపఁగా, నందులకు సమాధానము నీ సూత్రముచేఁ జెప్పుచున్నారు,

## ౪౦॥ సూ॥ ఉ ప స్థి తే ఽ త స్త ద్వ చ నా త్.

టీ॥ ఉపస్థితే=జీవుఁడు బ్రహ్మమును పొందఁగా, అతః=అట్లు పొందుట వలనఁ గలుగునదిగా, తద్వచనాత్=పితృ లోకాది సంచారము చెప్పఁబడినందున.

తా॥ బ్రహ్మమును బొందిన జీవుని విషయమై అట్లు పొందుటవలనఁ గలుగు ఫలముగా పితృలోకాది సంచారము శ్రుతులయందుఁ జెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే స ఉత్తమః పురుషః స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్రమమాణః స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా నోపజనం స్మరన్ స స్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" అను శ్రుతివాక్యము "ప్రత్యగాత్మ పరమాత్మను బొంది స్వస్వరూపావిర్భావము గలవాఁడగుచున్నాఁడు, అట్టివాఁడు ఉత్తమపురుషుఁడు. అట్టి దశయం దతఁ డంతట: సంచరించుచున్నాఁడు. అతఁడు స్త్రీలతోఁగాని, యానములతోఁ గాని, జ్ఞాతులతోఁ గాని భుజింపుచు, క్రీడించుచు, రమించుచు,

శరీరమును స్మరింపఁడు. కర్మవశ్యత లేనివాఁ డగుచున్నాఁడు. అతనికి సర్వలోకములయందును స్వేచ్ఛావిహారము గలదు" అనుచు, పరబ్రహ్మమును బొందుటచే సర్వ బంధవినిర్ముక్తుఁడై స్వస్వరూపా విర్భావముగల ప్రత్యగాత్మను గుఱించి యట్టి బ్రహ్మ ప్రాప్తిమూలకమగు సర్వలోకస్వేచ్ఛా సంచారమును, జెప్పుచున్నది. ఈ విషయము చతుర్థాధ్యాయమునందు సవిస్తరముగ బ్రతిపాదింపఁబడును. ఈపైని గనఁబఱిచిన హేతువువలన సర్వలోకములయందు స్వేచ్ఛాసంచారమనునది ముక్తులచే ననుభవింపఁదగిన ఫలమని స్పష్టమగుచున్నది. కాఁబట్టి సత్యకామత్వాది గుణములు ముముక్షువులచే ఉపాసనములయందు ఉపాస్యగుణములుగ గ్రాహ్యములని సిద్ధమగుచున్నది.

కామాద్యధికరణము ముగిసెను.



## తన్నిర్ధారణానియమాధి కరణము.

౪౧॥ సూ॥ తన్నిర్ధారణానియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలం॥

టీ॥ తన్నిర్ధారణా నియమః=ఉద్గీథాద్యుపాసనములు కర్మములతోడనే నియతముగ అనుష్ఠింపవలసినవి యనెడి నియమము లేదు. తద్దృష్టేః = అట్లు శ్రుతులయందుఁ గానఁబడుచున్నది, హి=ఏలననఁగా, పృథక్=కర్మఫలముకంటె వేఱుగా, అప్రతి బంధఃఫలమ్=కర్మఫలములకు ప్రతిబంధకము గలుగకుగుండ జేయుట యనఁబడు వేఱొక్క ఫలము ఉద్గీథాద్యుపాసనములకుఁ గలదు గదా.

తా॥ ఉద్గీథాద్యుపాసనములు కర్మములతోఁ గూడనే యనుష్ఠింపవలసినవి యనెడి నియమము లేదు. అట్లు శ్రుతులయందుఁ గానఁబడుచున్నది. ఏలననఁగా, కర్మఫలములకు ప్రతిబంధకము గలుగకుండ చేయుట యనఁబడు ఫలము ఉద్గీథాద్యుపాసనములకు ప్రత్యేకముగా విధింపఁబడినది.

శ్రీ॥ భా॥ కర్మాంగాశ్రములగు కొన్ని యుపాసములు గలవు. అవి "ఓమిత్యే తదక్షర యుద్గీథ ముపాసీత" (ఛా-౧. ప్ర-౧. ఖ- ౧. వా) ఇత్యాది వాక్యములచే విధింపఁబడిన యుద్గీథా ద్యుపాసములు. వీనిని గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

సంశయము.

ఈ యుపాసనములు కర్మాంగములగుటంజేసి కర్మములతోఁ గూడ నియతముగ నాచరింపవలసినవియా? లేక అవి యట్టివికావా?

**పూర్వపక్షము.**

యజ్ఞాది కర్మములయం దుపయోగింపఁబడు [1]జుహ్వాదుల (పాత్రాదుల) ద్వారా పర్ణతాదులు (మోదుగ కఱ్ఱతోఁ జేయఁబడుట మొదలగునవి) కర్మాంగములుగాను అనుష్ఠింపఁబడు చందంబున, ఈ యుద్గీథాద్యుపాసములును, కర్మాంగములగు ఉద్గీథాదుల ద్వారాకర్మములతో సంబంధించినవై, కర్మాంగములుగాను అనుష్ఠింపఁబడు చున్నందున, పర్ణమయములగు జుహ్వాదులకు "పాపపువార్తలు వినబడకుండుట" యనఁబడునది ప్రత్యేకఫలముగా నూహింపఁబడుట ఘటింపన ట్లు "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయో పనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఏకర్మమును ఉద్గీథాద్యుపాసనముతోడను, ఆస్తిక్య బుద్ధితోడను, రహస్య దేవతా ధ్యానముతోడను చేయఁబడునో, అదియే ఫలము నొసంగువిషయమై యెక్కువ వీర్యము గలది యగుచున్నది.) అను శ్రుతియందు "భవతి" యని వర్తమానకాల నిర్దేశ ముండుటచే నందుఁ జెప్పఁబడినది ఉద్గీథాద్యుపాసనములకుగాను ప్రత్యేకముగాఁ జెప్పఁబడిన ఫలమని యూహించుట యసంభవము. (ఉద్గీథాద్యుపాసనములు ప్రత్యేకముగ నాచరింపఁబడినచో, వాటికి కర్మఫలమునకంటె వేఱు ఫలము జెప్పఁబడ కుండుటంజేసి) అవి కర్మముతోఁ గూడనే నియతముగ నాచరింప వలసినవని సిద్ధమగుచున్న దనిన,

**సిద్ధాంతము.**

ఇట్లు ప్రాప్తింపఁగా నిందులకు సమాధానము నీ సూత్రముచేఁ జెప్పుచున్నారు. సూత్రమునందలి "నిర్ధారణ" శబ్దమునకు నిశ్చలముగా మనస్సు నుంచు

(1) "యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపగ్గ్ శ్లోకగ్ం శృణోతి" అను శ్రుతి వాక్యము పర్ణమయమగు జుహువు గలవానికి అపాప శ్లోక శ్రవణ రూపమగు ఫలము గలుగునని తెలుపుచున్నది. అయితే యీ ఫలోపదేశవాక్య మర్థవాదమాత్ర మనుట (కర్మమును స్తుతించుటకై యట్లు చెప్పినది యనుట) యుక్తము. ఏలననిన, ఈవాక్యము క్రతుప్రకరణమునఁ బఠింపఁబడలేదు. అయినను క్రతువునకు నిత్యాంగమగు జుహువునందుఁ జెప్పఁబడినది. కావున తద్వారముగఁ బర్ణమయీత్వము క్రతువుతో సంబంధించి తత్ప్రకరణ పఠితములగు నంగముల వలెనే క్రతువుతో నియతముగా ననుష్ఠింపఁ బడుచున్నది. కావున క్రతువుల ఫలమే ఫలము గాని వీటికి ప్రత్యేకముగా ఫలములేదు. ఇవ్విధముగ నుద్గీథాద్యుపాసనములును ఉద్గీథాది ద్వారముగఁ గ్రతువుతో సంబంధించి క్రతువులతో నియతముగా ననుష్ఠింపవలసినవి యగుచున్నవి. వీటి ఫలమును జెప్పినట్టి శ్రుతివాక్యమున "భవతి" యని వర్తమానకాల నిర్దేశముండుటచే నీ ఫల శ్రవణ మర్థవాదమాద మాత్రము. అనఁగా నివి యాశ్రయించి యుండు ఉద్గీథాదులే క్రతువు కంగములో, దాని ఫలమే ఫలముగాని వీనికిఁ బ్రత్యేకముగా ఫలము లేదు. ఈపైని చెప్పినప్రకారము ఈసందర్భమున పూర్వపక్షి యభిప్రాయము తెలియంగునది.

కొనుట యనఁగా ధ్యానమని యర్థము. ఉద్గీథా ద్యుపాసనములను నియతముగ కర్మములతోఁ గూడనే యనుష్ఠింపవలయునన్న నియమము లేదు. ఏలననిన, "తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద" అను శ్రుతివాక్యమే "యుపాసించువాఁడును ఉపాసింపనివాఁడును గూడ క్రతువును జేయనచ్చును" అనుచు నిందు మూలముగ ఉపాసనారహితులుగూడఁ గ్రతువుల నాచరింప వచ్చునని యనుజ్ఞ నిచ్చుటచే ఉపాసనమును కర్మముతోఁ గూడనే నియతముగ ననుష్ఠింపవలయునన్న నియమము లేనట్లు తెలుపుచున్నది. ఉపాసనము కర్మముతోఁ గూడ నియతముగా ననుష్ఠింపవలసిన యంగమగుచో, దానితోఁ గూడనే కర్మమున నుష్ఠింపవలయు ననెడి నియమము లేకుండుట యసంభవము గదా! ఇట్లు ఉద్గీథా ద్యుపాసనము కర్మమునకు నియతమైన యంగము కాదని, నిశ్చయింపఁబడగా, అట్టి యుపాసనములను విధించుటకు ఫలమేమని యడిగితివేని, [1]రాత్రి సత్రన్యాయప్రకారము, కర్మములను స్వీయఫలముల నిచ్చు విషయమై, ఎక్కువ వీర్యము గల వానినిగాఁ జేయుటయే వీనికి అనఁగా నుద్గీథా ద్యుపాసనములకు కర్మఫలమునకంటె వేఱగు ఫలమని తెలియవచ్చుచున్నది. కర్మములకు స్వస్వఫలముల నిచ్చు విషయమై యెక్కువ వీర్యమును గలుగఁజేయుట యనునది వీనికంటె ప్రబలములగు కర్మముల నుండి వీనికిఁ గలుగు ప్రతిబంధకములను బోఁగొట్టుటయే. ప్రబలములగు కర్మాంతరముల ఫలము గలుగువరకు ప్రకృత కర్మఫలము ప్రతి బంధింపఁ బడుచున్నది గదా! ఇట్లు

---

(1) "ప్రతితిష్ఠన్తి హవా ఏతే య ఏతా రాత్రీ రుపయన్తి" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు త్రయోదశరాత్ర, చతర్దశరాత్రాది సత్రము లనఁబడు కొన్నికర్మములను విధించుచున్నవి. ఇట్లు వీనిని విధించునట్టి విధు లున్నను, వీనికిగా నొక ఫలము ప్రత్యేకముగ క్రతు ప్రకరణమునఁ జెప్పఁబడలేదు. అయితే యర్థవాద వాక్యములయందు మాత్రము ప్రతిష్ఠా రూపమగు ఫలము చెప్పఁబడినది. అయితే అర్థవాదవాక్యములయందుఁ జెప్పఁబడిన ఫలము నొకఫలమును గాను గణించుటలేదు. అయితే యీ కర్మములను విధించియున్న విధులున్నందున ఫలముగూడ నొక్కటి యుండవలయును గాన, అర్థవాద వాక్యములయందుఁ జెప్పఁబడిన ఫలమునే యీ విధులకు గానగు ఫలమునుగాను పూర్వ మీమాంసకు లంగీకరించి యున్నారు. ఇట్టి యంగీకారమును శాస్త్రకారులు "రాత్రి సత్రన్యాయము" అని వ్యవహరించుచున్నారు.

ప్రకృతమున నుద్గీథా ద్యుపాసనములు కర్మాంగములు గావు. అవి శాస్త్రమున విధింపఁబడినవి. అట్టి విధులకు ఫల ముండవలయును. ఫలమో, అర్థవాద వాక్యమునఁ జెప్పఁబడినది. వాస్తవమునకు అర్థవాద వాక్యమునఁ జెప్పఁబడిన ఫలము నొక ప్రధాన ఫలమునుగా నంగీకరింపఁదగదు. అయినను, ఈపైని గనఁబఱచిన రాత్రిసత్రన్యాయప్రకారము అంగీకరింప వచ్చునని యభిప్రాయము.

ప్రతిబంధకములను లేకుండఁజేయుట యనునది స్వర్గాదిరూపమగు ఫలమునకంటె వేఱగు ఫలము గదా! ఇట్లు ఉద్గీథాద్యుపాసనములు కర్మాంగాశ్రయము లైనను, వానికి కర్మఫలమునకంటె వేఱగు ఫలమున్నట్లు సిద్ధమగుటంజేసి [1] గోదోహనాదులు కర్మములకు నియతములగు అంగములు గానట్లు, ఈ యుద్గీథాదులును, నియతములగు అంగములు గావు. కావున వీనిని కర్మములతోఁ గూడనే నియతముగా ననుష్ఠింప వలయునన్న నియమము లేదు.

తన్నిర్ధారణా నియమాధికరణము ముగిసెను.

---

## ప్రదానాధికరణము.

### ४३॥ సూ॥ ప్రదానవదేవ తదుక్తం.

టీ॥ ప్రదానవదేవ=పురోడాశ ప్రదానమువలెనే పరమాత్మోపాసనము మరల చేయవలసినది, తదుక్తం=ఇందును గుఱించి పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

తా॥ పురోడాశ ప్రదానమువలెనే, గుణోపాసన సందర్భమునను, పరమాత్మోపాసనము మరల చేయవలసినది. ఇందును గుఱించి పూర్వమీమాంసమునఁ జెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ ఛందోగులు దహరవిద్యా ప్రకరణమున "తద్య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యే తాంశ్చ సత్యాన్ కామాన్" (ఛా. ౮-ప్ర. ౧-ఖ. ౬-వా.) అను వాక్యమున దహరాకాశ మనంబడు పరమాత్మను గుఱించిన యు

(1) ఏది దేనితో నియతముగా ననుష్ఠింపఁబడునో, అది దాని యంగ మందురు. పశువులఁ గోరువాఁడు గోదోహనమున (ఆవుపాలు పితుకు పాత్రమునందు) జలము నుంచునది అని శ్రుతి వాక్యము విధింపుచున్నది. పశువులు కావలయు ననెడి కోరికయుంచే గోదోహనమును ఉపసంహరించుకొనును. లేకపోతే లేదు. కావున నిది యొక్క క్రతువుతో నియతముగా ననుష్ఠింపఁబడునది కాదు. కావున నిది యొక క్రతువునకు అంగము కాదు. అట్లే "కర్మములు ఉపాసనములో ననుష్ఠింపఁబడిన యెడల కర్మఫలములు ప్రతిబంధకము లేనివి యగును" అని శ్రుతి విధింపుచున్నది. కర్మఫలములు ప్రతిబంధ రహితములు కావలయునని కోరువాఁడు కర్మములను ఉపాసనముతో ననుష్ఠించును. అట్టి కోరిక లేనివాఁడు ఉపాసనము లేకయే యనుష్ఠించును. కావున ఉద్గీథాద్యుపాసనములును కర్మములతో నియతముగా ననుష్ఠింపవలసినట్టివి యగు అంగములు కావు.

పాసనమును జెప్పి, అచటనే "సత్యాః కామాః" అనుటచే సత్య కామాది గుణములను గుఱించిన యుపాసనమును గూడ ప్రత్యేకముగా విధించియున్నారు. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

—••◆ సంశయము. ◆••—

గుణములను ఉపాసింపునపుడును తద్గుణవిశిష్టునిగాను దహరాకాశమనఁబడు పరమాత్మను సయితము మరల ఉపాసింపవలయునా ? లేక, అట్లు మరల ఉపాసింప వక్కఱలేదా ?

—••◆ పూర్వపక్షము. ◆••—

దహరవిద్యయందు అపహతపాప్మత్వము మొదలగు కల్యాణగుణముల తోఁ గూడుకొనిన వాఁడు దహరాకాశమనఁబడు పరమాత్మయే. అతఁడట్టి గుణములతోఁ గూడుకొనిన వాఁడుగ దహరవిద్యయందొకతూరి ఉపాసింపఁ బడుచున్నాఁడు గాన, గుణోపాసన సందర్భమును మరల అతని నుపాసించుట యావశ్యకము గాదనిన.

—••◆ సిద్ధాంతము. ◆••—

అట్లు జెప్పుట యుక్తము కాదు. అపహత పాప్మత్వాది గుణములతోఁ గూడుకొనినవాఁడు దహరాకాశ మనంబడు పరమాత్మయే యయినను, మఱియు అతఁడు పూర్వము దహరవిద్యయందు ఉపాసింపఁబడినను, గుణోపాసన మునను గూడ నతనిని గుణవిశిష్టునిగాను మరల ఉపాసింపవలయును. ఏలననిన, స్వరూపమాత్రమున కంటె గుణవిశిష్టాకారము వేఱయినందునను, "అపహత పాప్మా విజరః" ఇత్యాది వాక్యముచే గుణవిశిష్టోపాసనమున్ను విధింపఁబడు చున్నందునను, ఇంతకు పూర్వము స్వరూపమాత్రముతో నుపాసింపఁబడిన పరమాత్మనే అపహత పాప్మత్వాది గుణవిశిష్టునిగాను ఉపాసించుటకై గుణో పాసన సందర్భమున అతనిని మరల ఉపాసింపవలయును. అదెట్లువలెననిన, అధిరాజత్వాది గుణవిశిష్టుఁ డింద్రుఁడే యయినను, కర్మకాండమున కేవలుఁ డగు ఇంద్రుని యాకారముకంటె అధిరాజత్వాది గుణ విశిష్టమగు నాకారము వేఱగుటచే "ఇంద్రాయ రాజ్ఞే పురోడాశ మేకాదశ కపాలం" అనుమంత్రముచే కేవలుఁడగు ఇంద్రునికి ఏకాదశకపాల పురోడాశాహుతిని విధించి, అనంతరము "ఇంద్రా యాధిరాజాయ" "ఇంద్రాయాధిరాజ్ఞే" ఇత్యాది మంత్ర ములచే అధిరాజత్వాది గుణవిశిష్టుఁడగు ఇంద్రునికి ప్రత్యేకముగ నాహుతు లను విధించునపుడు ఇంతకుపూర్వము కేవలుఁడుగా గ్రహింపఁబడిన ఇంద్రుఁడు,

అతనిని గుణవిశిష్టునిగా నుద్దేశించి యాహుతినిచ్చు సందర్భమున, గుణవిశిష్టుఁడుగా మరల గ్రహింపఁబడు చుండలేదా ? అట్లే యిచటను గూడ నెఱుఁగునది. "నానా వాదేవతా పృథక్త్వాత్" అను వాక్యమున, సంకర్షణుఁడును "ఆకార భేదముచే దేవత లనేకులు" అనుచు దేవతల కిట్టి భేదము నంగీకరించియున్నాఁడు.

ప్రదానాధికరణము ముగిసెను.

---

## లిఙ్గభూయస్త్వాధి కరణము.

### ४३॥ సూ॥ లిఙ్గభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి.

టీ॥ లిఙ్గభూయస్త్వాత్=అనేకచిహ్నము లుండుటవలన, "సహస్రశీర్షం" ఇత్యాదివాక్యము పరవిద్యలయం దన్నింటియందును ఉపాస్యమగు వస్తువు యొక్క స్వరూపమును నిరూపించునది, హి=ఏలననఁగా, తత్=చిహ్నము, బలీయః=ప్రకరణముకంటెను ఎక్కువ బలముగలది. తదపి=ఈ విషయమును పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

తా॥ చిహ్నము లనేకము లుండుటంజేసి "సహస్రశీర్షం" ఇత్యాది తైత్తిరీయ వాక్యము పరవిద్యలయం దన్నింటియందును ఉపాస్య వస్తువగు పరమాత్మయొక్క స్వరూపమును నిర్ణయించునది. ప్రకరణముకంటెను చిహ్నము బలమైనది గదా ! ఈ విషయము పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ తైత్తిరీయులు "సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువం విశ్వం నారాయణం దేవం అక్షరం పరమం పదం" (తై. నా. ౧౩ అను.) అని యారంభించి "సోఽక్షరః పరమ స్స్వరాట్" అను పర్యంతము హృదయాంతర్వర్తియగు పరమాత్మను వర్ణింపుచు వేఱొక్క దహరవిద్యను పఠింపుచున్నారు. ఈ సందర్భమున నొక సంశయము గలుగుచున్నది.

#### సంశయము.

ఈ దహరవిద్య ఇంతకు పూర్వము ఉపదేశింపఁబడిన దహరవిద్యతో నొక్కటి యగుటచే ఈపై వాక్యము అందలి ఉపాస్యవస్తువు ఇట్టిదియని అట్టి యుపాస్యవస్తువుయొక్క స్వరూప విశేషమును నిరూపించుచున్నదా ? కాక, అది యుపనిషత్తులయం దన్నింటియందును ఉపదేశింపఁబడిన పరవిద్యల యందలి యుపాస్యవస్తు విట్టిదియని యట్టి యుపాస్యవస్తువుయొక్క స్వరూప విశేషమును నిరూపించుచున్నదా ?

## పూర్వపక్షము.

ఇంతకు పూర్వము ఉపదేశింపఁబడిన దహరవిద్యయందలి యుపాస్య వస్తువుయొక్క స్వరూపవిశేషమును ఈ పై శ్రుతి వాక్యము నిరూపించుచున్న దనుట యుక్తము. ఏలననిన, "దహ్రం విపాప్మం పరవేశ్మభూతం యత్పుణ్డరీకం పురమధ్యసంస్థం తత్రాపి దహ్రం గగనం విశోకస్తస్మిన్ యదన్తస్తదుపాసితవ్యం" అను పూర్వానువాకము "సూక్ష్మమును, పాపరహితమును, పరమాత్మకు శ్రేష్ఠమగు గృహమై యుపాసకుని దేహమధ్యము నందున్న హృత్పుండరీక మేదియో, ఆ హృత్పుండరీకమునందు ఆకాశమువలెనే స్వచ్ఛమై దుఃఖరహితమగు నది యేదియో దానిని ధ్యానింపవలయును" అనుచు దహరోపాసనమును కదా విధింపుచున్నది. ఇందువలన ప్రకృతమున నుపదేశింపఁబడునది దహరవిద్యయని సిద్ధమగుచున్నది. కనుక నిది దహరవిద్యా ప్రకరణము. ఇచట "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం" అను వాక్యమున హృదయ పుండరీకము పేర్కొనఁ బడుటచే ఈ నారాయణానువాకము దహరవిద్యతో సంబంధించినదై, అచట ఉపదేశింపఁబడిన యుపాస్య వస్తువుయొక్క స్వరూపవిశేషమును నిరూపించునది యనెడి యంశమును బలపఱచుచున్నది.

## సిద్ధాంతము.

ఇట్లు జెప్పుట యుక్తము కాదు. ఈ నారాయణానువాకము ఉపనిషత్తుల యందన్నింటియందును విధింపఁబడిన పరవిద్యలయందు ఉపదేశింపఁబడిన యుపాస్య వస్తువుయొక్క స్వరూప విశేషమును నిరూపించుచున్న దనుట యుక్తము. ఈ యభిప్రాయమును దృఢపఱచునట్టి చిహ్నము లనేకము లీయనువాకమునఁ గలవు. ఏలననిన, పరవిద్యలయందు కొన్ని తావుల నుపాస్య వస్తువు అక్షరుఁడనియు, మఱికొన్ని తావుల శివుఁడనియు, మఱికొన్ని తావుల శంభువనియు, మఱికొన్ని తావుల పరబ్రహ్మమనియు, పరజ్యోతిస్సనియు, పరతత్త్వమనియు, పరమాత్మయనియు నివ్విధమునఁ జెప్పఁబడియె. ఇట్లు ఉపనిషద్భాగములయందలి పరవిద్యలయందు శివుఁడనియు శంభువనియు నివ్విధముగ పేర్కొనఁబడిన యుపాస్య వస్తువును ఆ శివాది శబ్దములచే అనువదించుచు, అతఁడు నారాయణుఁడే యని యీ నారాయణానువాకము ప్రతిపాదించుచున్నది. ఇట్లు అనేక పరవిద్యలయందు ఉపాస్య వస్తువులుగ వినఁబడు అక్షర శివశంభ్వాదులను మరల ఇచట అనువదించి, యట్టి యుపాస్య వస్తువులన్నియు నారాయణుఁడే యని యనేక పర్యాయములు విధించుట యనునది పరవిద్యలయం దన్నిటియందును ఉపాస్యుఁడు నారాయణుఁడే యని

యు, అట్టి నారాయణుఁడే అస్థూలత్వాదులతోఁ గూడుకొనినట్టి యానందాది గుణములుగల పరబ్రహ్మ మనియును సూచింపునట్టి యొక గొప్పలింగ (చిహ్న) మగుచున్నది. సూత్రము నందుండు "లింగ" శబ్దమునకు చిహ్నమని యర్థము. అనఁగా నిట్టి యభిప్రాయమును దెలియఁజేయు చిహ్నములుగల శ్రుతి వాక్యము లనేకములు కలవనుట. ఏదైన నొక విషయమును స్థిరపఱచు విషయమై ప్రకరణమునకంటెను చిహ్నము ఎక్కువ బలముగలది. ఏలననఁగా శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థానాదులన్నియు ప్రాప్తము లయినచోఁ, వానిలో నుత్తరోత్తరమునకంటెను పూర్వ పూర్వము బలవత్తర మగునది గాను గ్రహింపఁ బడుచున్నది. ఈవిషయము "శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్య మర్థ విప్రకర్షాత్" (పూ. మీ. 3-అ. ౧3-పా. 3-సూ.) అను పూర్వ మీమాంసా సూత్రమునందు నిర్ణయింపఁబడియె.

"పద్మకోశ ప్రతీకాశం" ఇత్యాది వచనము యీ యను వాకమున నుపదేశింపఁబడిన యుపాసనమునకు పూర్వానువాకమందలి దహరవిద్యతో సంబంధమును బలపఱచుచున్నదని పూర్వపక్షి చేసిన వాదమున్ను సరి యైనది కాదు. ఏలననిన, బలవత్ప్రమాణమువలన నీవాక్యము పరవిద్యలయం దన్నింటియందును ఉపాస్యుఁడగు పరబ్రహ్మముయొక్క స్వరూప విశేషమును నిరూపించుచున్నట్లు సిద్ధమగుచున్నది. దహరవిద్యయందుఁ గూడ నారాయణుఁడే యుపాస్యుఁడు గాన, ఆవాక్య మట్లు దెలియఁజేయవచ్చును.

శంక:—"సహస్రశీర్షం దేవం" ఇత్యాది పదములు ద్వితీయా విభక్త్యంతములు. పూర్వానువాకమునందలి "ఉపాసితవ్యం" యను క్రియాపదము కర్మణి ప్రయోగమందు ప్రయుక్తమైనది గాన, నీ ద్వితీయాంత పదము లాక్రియా పదముతో నన్వయింప నేరవే ?

సమాధానము:—"తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యం" అను వాక్యమున నుండు "ఉపాసితవ్యం"అను క్రియ యందుండు కృత్ప్రత్యయముతో ఉపాస్య వస్తువు కర్మణి ప్రయోగమునఁ జెప్పఁబడినందున నా యుపాస్యవస్తువు విషయమై ద్వితీయావిభక్తి యసంభవమై నందునను, "విశ్వమే వేదం పురుషః" "తత్త్వం నారాయణః పరః" ఇత్యాద్యనంతర వాక్యమునందలి పదములు ప్రథమా విభక్తియందు ప్రయోగింపఁబడినందునను ఇచట నుండు ద్వితీయా విభక్త్యంత పదములను ప్రథమా విభక్త్యర్థమున గ్రహింపవలయును. మఱియు "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అను శ్రుతివాక్యము "నారాయణుఁడు లోపలను వెలుపలను అంతటను ఉన్నాఁడు" అనియును "తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః స బ్రహ్మ స శివస్సేంద్ర

నోఽ౽క్షరః పరమ స్స్వరాట్" అను శ్రుతివాక్యము "అట్టి జ్వాలయొక్క మధ్య మునందు పరమాత్మయగు నారాయణుఁడు ఉన్నాఁడు. అతఁడే శివుఁడు, చతు ర్ముఖబ్రహ్మ, ఇంద్రుఁడు, నాశములేనివాఁడు, శ్రేష్ఠుఁడు, స్వయం ప్రకాశుఁడు" అనుటచే అందఱికంటెను శ్రేష్ఠుఁడగు నారాయణుఁడే యన్ని యుపాసనముల యందును ఉపాస్యుఁడని తెలియుచున్నందునను "సహస్ర శీర్షం దేవం" ఇత్యాది ద్వితీయావిభక్త్యంత పదములు ప్రథమావిభక్త్యర్థముననే ప్రయోగింపఁబడిన వని నిశ్చితమగుచున్నది.

లిఙ్గభూయస్త్వాధికరణము ముగిసెను.

---

## పూర్వవికల్పాధికరణము.

**౪౪॥ సూ॥ పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్క్రియామానసవత్.**

టీ॥ ప్రకరణాత్ = ప్రకరణమువలన, పూర్వవికల్పః = మనశ్చితాదికము పూర్వోక్తక్రియయొక్క ప్రకారాంతరము. (కావున నది) మానసవత్ = ద్వాద శ రాత్ర క్రతువునందు దశమ దివసమునఁ జేయఁబడు మానస గ్రహమువలె, క్రియా = క్రియాశేషము, (స్యాత్ = అగును.)

తా॥ ప్రకరణ సామర్థ్యమువలన మనశ్చితాదులు పూర్వోక్తక్రియా మయాగ్నికిఁ బ్రకారాంతములు గాన, నవి ద్వాదశరాత్ర క్రతువునందు దశమ దివసమునఁ జేయఁబడు మానస గ్రహమువలెనే క్రియాశేషములు.

శ్రీ॥ భా॥ వాజసనేయు లగ్నిరహస్యాధ్యాయమున, "మనశ్చితో వాక్చి తః ప్రాణచితః చక్షుశ్చితః శ్రోత్రచితః కర్మచితో ౽గ్నిచితః" అను వాక్యము న, "మనశ్చిత (మనోనిర్మిత) మనియు, వాక్చితమనియు, ప్రాణచితమనియు, చక్షు శ్చితమనియు, శ్రోత్రచితమనియు" ఈ మొదలగు కొన్ని యగ్నులను పేర్కొని యున్నారు. ఇచట ఒక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

సాంపాదికాగ్నులగుటచే విద్యారూపములగు నీ మనశ్చితాద్యగ్నులు క్రియారూపమగు యజ్ఞముతోఁ జేరిన వగుటచేత క్రియారూపములా? లేక, అవి విద్యారూపమగు ధ్యానముతోఁ జేరిన వైనందున విద్యారూపము లేనా?

## పూ ర్వ ప క్ష ము.

చిత్యాగ్నులుగ సంపాదితములైన మనశ్చితాద్యగ్నులు క్రతుసంబంధము నపేక్షించుచున్నవి. అయితే ప్రకృతవాక్యమున క్రతు వెద్దియును విధింపఁబడి యుండలేదు. అయినను, ఇంతకుపూర్వము "అసద్వా ఇదమగ్ర ఆసీత్" ఇత్యాది వాక్యములయందు ఇష్టకచిత్యగ్ని విధింపఁబడియె. అది క్రతువును విడనాడక యుండున దగుటచే అందు క్రతువు సన్నిహితమైనది. కావున ఈ మనశ్చితాద్యగ్నులు చిత్యగ్నిప్రకరణమునఁ బఠింపఁబడి, క్రియారూపమగు ఇష్టకచిత్యగ్ని యొక్క వికల్పములుగ (ప్రకారాంతరములుగా) అనుష్ఠింపఁబడుచు, క్రియారూపములే యగుచున్నవి. ఈ మనశ్చితాదులు ఉపాసనారూపము లయినను, వీటికి క్రియాను ప్రవేశ ముండుటం జేసి, యివి క్రియారూపములుగ గ్రహింపఁబడుచున్నవి. ఎట్లనిన:—దశరాత్ర క్రతువున, అవివాక్య నామముగల దశమాహస్సునందు మానస గ్రహ మొకటి విధింపఁబడినది. అందు మనస్సుచేఁ జేయఁబడునవి యగు గ్రహణాసాదన స్తోత్ర శస్త్ర ప్రత్యాహరణ భక్షణ క్రియలు జెప్పఁబడినవి. ఇందువలన ఈ గ్రహకల్పము విద్యామయమే యైనను, క్రియారూపమగు క్రతువుతోఁ జేరినది యగుటం జేసి క్రియారూప మగుచున్నది. అట్లే ప్రకృతమున మనశ్చితాద్యగ్నులు విద్యామయము లయినను, క్రియారూపములని యెఱుంగునది.

## ౪౫॥ సూ॥ అ తి దే శా చ్చ.

టీ॥ అతిదేశాచ్చ=అతిదేశము వలనను.

తా॥ అతిదేశమువలనఁ గూడ మనశ్చితాదులు క్రియారూపములని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ మనశ్చితాద్యగ్నులు ఇష్టకచితాగ్నియొక్క ప్రకారాంతరములనియు, క్రియారూపము లనియును, అతిదేశము వలనఁ గూడఁ దెలియవచ్చు చున్నది. ఎట్లనిన, "తేషామేకైక ఏవ తావాన్ యావానసౌ పూర్వః" అను శ్రుతివాక్యము "ఆ ముప్పదియాఱువేల అగ్నులలో నొక్కొక్కటి, పూర్వాగ్నులలో నొక్కొక్కటి యెంతసామర్థ్యము కలదియో, అంత సామర్థ్యము కలది" అనుచు పూర్వము విధింపఁబడిన ఇష్టకచితాగ్నుల వీర్యమును మనశ్చితాద్యగ్నులయం దతిదేశించుచున్నది, అనఁగా వాటియందుండు వీర్యము ఈ మనశ్చితాదులయందును గూడఁ గలదని తెలుపుచున్నది. ఇట్లు మనశ్చితాదులు ఇష్టకచితాద్యగ్నులతో తుల్యబలము లగుటచే, తుల్యఫలములును గాన, నవి యిష్టకచితాద్యగ్నుల యొక్క ప్రకారాంతరము లగుచున్నవి. మఱియు ఈ మనశ్చితా

దులు ఇష్టక చితాద్యగ్నివలెనే క్రతువు నుపకరించుటచే క్రత్వంగములు. ఇట్లు మనశ్చితాదులకు క్రియాను ప్రవేశ ముండుటం జేసి, అవి క్రియా రూపములనుట యుక్తము.

అవతారిక:—ఇట్లు మనశ్చితాద్యగ్నులు క్రియారూపములని ప్రాప్తింపఁగా, దీనిని పరిహరించుటకై.

౪౬॥ సూ॥ వి ద్యై వ తు ని ర్ధా ర ణా ద్ద ర్శ నా చ్చ॥

టీ॥ తు=పూర్వపక్షమయుక్తము, నిర్ధారణాత్=శ్రుతియందలి నిర్ధారణమువలనను, దర్శనాచ్చ=అట్లు గానఁబడుచున్నందునను, విద్యైవ=మనశ్చిదాదులు విద్యాత్మకములే.

తా॥ మనశ్చితాద్యగ్నులు విద్యాత్మకములు గాని క్రియాశేషములు కావు. శ్రుతి యిట్లు నిర్ధారణమును జేయుచున్నది. అట్లు గానఁబడుచున్నది.

సి ద్ధా ం త ము

శ్రీ॥ భా॥ మనశ్చితాద్యగ్నులు క్రియారూపములగు యజ్ఞాది క్రతువులతోఁ జేరిన వనియు, అందువలన నవి క్రియారూపములనియును జెప్పుట యుక్తము కాదు. అవి యుపాసనా రూపములే. ఏలననిన, “తేహైతే విద్యాచిత ఏవ విద్యయా హైవైత ఏవంవిద శ్చితా భవన్తి” అను శ్రుతివాక్యము “ఈ మనశ్చితాదులు ఉపాసనముచేతనే సంపాదింపఁబడును” అనుచు, వాఙ్మనశ్చక్షురాదీంద్రియ వ్యాపారములు ఇటికలవలె నొకదానితో నొకటి చేరి యుండుట యసంభవ మగుటచే మనశ్చితాద్యగ్నులు మనస్సుచేతనే సంపాదింపఁబడినట్లు గ్రహింపవలసి యుండుటం జేసి అవి విద్యారూపములే యని సిద్ధమగుచున్నను, “తేహైతే విద్యాచితఏవ విద్యయా హైవైత ఏవం విదశ్చితాభవంతి” అను శ్రుతివాక్యము “ఈ మనశ్చిదాద్యగ్నులు యుపాసముచేతనే సంపాదింపఁబడిన వైనందున ఉపాసనారూపములే” అని నిర్ధారణ పూర్వకముగ జెప్పుటకు ప్రయోజన మేమనఁగా, ఈ మనశ్చిదాదులు ఉపాసనారూపమగు క్రతువుతో సంబంధించిన వైనందున నుపాసనా రూపములేయని తెలియఁజేయుటకు గానే యని, నిశ్చయింపఁ బడుచున్నది. ఇట్లు ఈ మనశ్చితాద్యంగముల కంగియగు నుపాసనా రూపమగు క్రతువు శ్రుతియందుఁ గానంబడుచున్నది. “తే మనసైవాధీయన్త, మనసైవాచీయన్త, మనసైషు గ్రహా అగృహ్యన్త, మనసాస్తువన్త, మనసాశంసన్, యత్కిఞ్చయజ్ఞే కర్మక్రియతే యత్కిఞ్చ యజ్ఞీయం కర్మ మనసైవ తేషు మనోమయేషు మనశ్చిత్సు మనోమయ మక్రియత” అను శ్రుతివాక్యము, “మనస్సుచేతనే వీనియందు సోమపాత్రలను గ్రహించునది. మనస్సు

చేతనే యుద్గాతలు స్తుతించునది. మనస్సుచేతనే శస్త్రములను పఠించునది, యజ్ఞమునం దేప్రధానకర్మము చేయఁబడునో, మఱియు నేయంగకర్మము చేయఁబడుచున్నదో, అది యంతయును, మనస్సుచేత సంపాదింపఁబడిన మన శ్చితాగ్నులయందు మానసికము గానే చేయఁబడుచున్నది" యని చెప్పుచు ఇష్టకచితాద్యగ్నులయందు ఏక్రియామయమగు యజ్ఞముతో సంబంధించిన కర్మము జేయఁబడుచున్నదో, అది మనస్సంపాద్యములగు మనశ్చితాద్యగ్నుల యందు మనోమయము గానేచేయఁబడు చున్నదని తెలుపుటచే ఉపాసనారూ పమైన క్రతువుగూడ ఇచట విధింపఁబడి యున్నట్లు తెలియుచున్నది.

అవతారిక:—మనశ్చితా ద్యగ్నులను పేర్కొను శ్రుతివాక్యమున కర్మ మును విధించు పద మెద్దియు లేనందున నిచట కర్మసంబంధ మున్నట్లు తెలి యవచ్చుచుండలేదు. అయితే ప్రకరణమునుబట్టి విచారింపగా, నింతకు పూర్వ ము విధింపఁబడిన ఇష్టకచితాగ్నిచే సూచింపఁబడిన కర్మముతో నీ మనశ్చి తాదు లన్వయించుచున్నట్లు దెలియవచ్చుచున్నది. ఇట్లు మనశ్చితాదులు క్రియారూపములని ప్రకరణ సామర్థ్యముచే సిద్ధమగుచుండ, ఇవి యుపాసనా రూపమగు క్రతువుతో నన్వయించిన వగుటచే నుపాసనా రూపములనినచో, దీనిని ప్రకరణము బాధింపునే యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౪౭॥ సూ॥ శ్రు త్యా ది బ లీ య స్త్వా చ్చ న బా ధః.

టీ॥ శ్రుత్యాది బలీయస్త్వాచ్చ=శ్రుతి లింగ వాక్యములకుఁ ప్రాబల్య ముండుటవలన, బాధః = (మనశ్చిదాదులు విద్యాత్మకము లగుటకు) హాని, న=లేదు.

తా॥ శ్రుతి లింగ వాక్యములు బలీయము లగుటచే మనశ్చితాదులు విద్యాత్మకము లగుట కెద్దియును హాని కలుగదు.

శ్రీ॥ భా॥ శ్రుతి లింగ వాక్యములు ప్రకరణమునకంటె నెక్కువ బల మయినవి. కాఁబట్టి, ఈ శ్రుతిలింగ వాక్యములనుండి తెలియవచ్చునట్టి యుపా సనా రూపమగు క్రతువును దుర్బలమగు ప్రకరణము బాధింప నేరదు.

ఈ విషయమును ప్రతిపాదించునట్టి శ్రుతిలింగ వాక్యము లేవియనిన:- "తేహైతే విద్యాచితఏవ" అను శ్రుతివాక్యము "మనశ్చితాదులు విద్యామయ ములే" యని చెప్పుచున్నది. అనంతరము "విద్యయాహైవైతఏవం విదశ్చితాభ వంతి" అను శ్రుతివాక్యమును "ఇట్లు తెలిసికొనినవాని విషయమున, ఈ మన శ్చితాదులు విద్యచే సంపాదింపబడునవి అనఁగా నుపాసనారూపమగు క్రతు వుతో సంబంధించినవై సంపాదింపఁ బడుచున్నవి." అనుచు, పూర్వము

జెప్పిన విద్యామయత్వమును వివరించుచున్నది. "తాన్ హైతానేవం విదే సర్వదా సర్వాణి భూతాని చిన్వంత్యపి స్వపతే" (ఇట్లు ఉపాసించువాఁడు నిద్రబోవుచున్నను, సర్వభూతములును వాని కార్యమును జేయుచున్నవి) అను వాక్యము దీనికి సూచకము. "ఏవం విదే చిన్వన్తి=ఇట్లు ఉపాసించువానికై చేయుచున్నవి" అనునది వాక్యము. సమన్వయముగలది గదా వాక్యమనఁబడుచున్నది. ఈ పై వాక్యమున "ఏవంవిదే=ఇట్లు ఉపాసించువానికొరకు" అనఁగా ఉపాసనాత్మకమగు క్రతువు నొనర్చువానికై సర్వభూతములు తోడ్పడుచున్నవనుటచే సర్వభూతములచే నొనర్పఁబడునదియు, సర్వకాల వ్యాపియునగు చయనము (పేర్చుట) మనస్సుచే నొనర్పఁబడునదగుచు, పరిమిత కర్తృకాలక్రియామయమగు ఇష్టకచిత (ఇటుకలను పేర్చుట మొదలగు) కర్మముద్వారా క్రతురూపమయిన దగుట కవకాశము లేనిదై, అందువలన నది యుపాసనాత్మక మగుక్రతువుతోఁ జేరినది గాను సూచిత మగుచున్నది.

అవతారిక:—శ్రుతియందు విధిప్రత్యయము వినఁబడక పోవుటం జేసియు, ఫలసంబంధము తెలియకపోవుటం జేసియును ఇచట ఉపదేశింపఁబడినది కర్మాత్మకమగు క్రతువుకంటెను వేఱయినదగు ఉపాసనాత్మకమగు క్రతువగుట యసంభవము. ఇట్లు శంకింపఁగా, నందులకు సమాధానము చెప్పుటకై,

౪౮॥ సూ॥ అనుబన్ధాదిభ్యః ప్రజ్ఞాన్తర పృథక్త్వవద్దృష్టశ్చ తదుక్తం.

టీ॥ (అయం=ఉపాసనాత్మకమగు క్రతువు, క్రియామయాత్క్రతోః = కర్మాత్మకమగు క్రతువుకంటె, పృథక్త్వేన=వేఱయినదిగా) ప్రజ్ఞాన్తర పృథక్త్వవత్ =ఇతరములగు దహరోపాసనాదులు వేఱయినట్లు, అనుబన్ధాదిభ్యః= స్తోత్రశస్త్రాద్యనుబంధములనుబట్టి తెలియుచున్నది. దృష్టః=విధి ఊహింపఁబడునట్లు గానఁబడుచున్నది, తదుక్తం=అది పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడినది.

తా॥ దహరోపాసనాదుల వలెనే ఉపాసనాత్మకమగు క్రతువు కర్మాత్మకమగు క్రతువునకంటెను వేఱయినది గాను గ్రహస్తోత్ర శస్త్రాద్యనుబంధములను బట్టి తెలియుచున్నది. అందువలన, విధి ఊహింపఁబడునట్లు గానఁబడుచున్నది. ఈ విషయమును గుఱించి పూర్వ మీమాంసమునఁ జెప్పఁబడియె.

శ్రీ॥ భా॥ ఇష్టకచితముతో సంబంధించినదియు, కర్మాత్మకము నగు క్రతువుకంటెను ఉపాసనాత్మకమగు క్రతువు వేఱయినది గాను, అందులకు హేతుభూతములగు అనుబంధాదులను బట్టి తెలియుచున్నది. ఈతావున, అనుబంధము లనఁగా, యజ్ఞముతో సంబంధించినవి యగు గ్రహ స్తోత్ర శస్త్రాదులు. ఇవి "మనసైషు

గ్రహా అగృహ్యన్త మనసా స్తువన్త మనసా శంసన్” (మనస్సుచే వీనియందు సోమపాత్రలను గ్రహింపవలయును. మనస్సుచే నుద్గాతలు స్తుతింపవలయును, మనస్సుచే హోతలు శస్త్రములను పఠింపవలయును) అను శ్రుతివాక్యమునఁ బ్రతిపాదింపఁబడుచున్నవి. సూత్రమునందలి “ఆది” శబ్దముచే పూర్వోక్తములగు శ్రుతివాక్యములును ఈతావున గ్రహింపఁబడుచున్నవి. అనఁగా అనుబంధములతోఁ గూడియుండు శ్రుతులనుబట్టి ఉపాసనాత్మకమగు క్రతువు వేఱయినదిగాఁ దెలియవచ్చుచున్నదనుట. అది యెటువలెననిన, దహరవిద్యాద్యుపాసనము కర్మమయమగు క్రతువునకంటెను వేఱయినదిగాను శ్రుతులు మొదలగు వానినుండి తెలియవచ్చు చందంబున, ఇదియును అట్లే వేఱయినదిగాఁ దెలియవచ్చుచున్నదని యెఱుంగునది. ఇట్లు అనుబంధాదులనుబట్టి ఉపాసనాత్మమగు యజ్ఞము వేఱయినదిగాను తెలియుచుండఁగా, ఈతావున విధి యున్నట్లు ఊహింపఁబడుచున్నది. అనువాదముతో సమానములగు వాక్యములయందు విధి యున్నట్లు ఊహింపఁబడునదిగాను పూర్వమీమాంసమునఁ గానఁబడుచున్నది గదా! ఈ విషయమును గుఱించి “వచనానిత్వపూర్వత్వాత్” (పూ. మీ. ౧. అ. ౪. పా. ౨౧. సూ) అను పూర్వమీమాంసాసూత్రమునఁ జెప్పఁబడినది. ఫలమున్ననో, “తేషామేకైకఏవ తావాన్ యావాన సౌపూర్వః” (పూర్వమందుఁ జెప్పఁబడిన క్రియామయాగ్నికి యెంత మాహాత్మ్యము కలదో, ఉపాసనాత్మకములగు నగ్నులలో నొక్కొక్కటి యంత మాహాత్మ్యము గలది” అని యతిదేశించుటచే స్వకర్మద్వారా ఇష్టకచితాగ్నికి యెంత ఫలము గలదో, అంత ఫలమే మనశ్చితాద్యగ్నులకును స్వక్రతుద్వారా కలదని తెలియవచ్చుచున్నది.

అవతారిక:—అతిదేశమునుబట్టి యివి సమానకార్యములు (సమానకర్మములు)గాఁ దెలియవచ్చుచున్నవి. అందువలన వీటికి కర్మమయమగు క్రతువుతోఁ జేరియుండుట సంభవించునే యని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౪౯॥ సూ॥ న సామాన్యా దప్యుపలబ్ధే ర్మృత్యువన్న హి లోకాపత్తిః.

టీ॥ న=అతిదేశమాత్రమున అవాన్తర వ్యాపారమున్ను అట్లు అతిదేశింపఁబడిన దానితో తుల్యము కాఁదగదు. ఏలననఁగా, సామాన్యాదపి=ఏదైన నొక సమానధర్మమునుబట్టి యైనను, ఉపలబ్ధేః=అతిదేశము గానఁబడుచున్నందున, ఇతరతావుల మృత్యువుతో నతిదేశించునపుడు, మృత్యువత్=మృత్యుదేవతవలెనే, లోకాపత్తిః=లోకప్రాప్తి, నహి=లేదు గదా!

తా॥ సూర్యాంతరాత్మయగు పురుషుని మృత్యువుతో నతిదేశించి (పోల్చి) చెప్పినను, మత్యువలె నతనికి లోకప్రాప్తియును లేదు గదా!

శ్రీ॥ భా॥ అతిదేశము చేసినంత మాత్రమున అవశ్యముగా నవాంతర వ్యాపారమునయితము అట్టిదియేయయి యుండవలయునన్న నియమము లేదు. అట్టినియమ మున్నపక్షమునఁ గదా! మనశ్చితాద్యగ్నులు కర్మమయమగు క్రతువుతోఁ జేరినవియగును. ఏలననిన, ఏదైన నొక సాదృశ్యమునుబట్టి యతి దేశము చేయఁబడునటులమనము చూచుచున్నాము. అదియెటులనిన,"స ఏష ఏవ మృత్యుర్య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషః" అను వాక్యమున ఆదిత్య మండలముననుండు పురుషుఁడు మృత్యువుతో సమానుఁడుగాఁ జెప్పఁబడుట యనునది మృత్యువువలె నతఁడును సంహారకుఁ డగుటను బట్టియే గాని, యింతమాత్రమున నతఁడును మృత్యులోకమును బొందిన వాఁడును, మృత్యువుండు ప్రదేశమున నుండువాఁడునునయి యుండవలయునన్న నియమము లేదు గదా! అటులనే ప్రకృతముననను, మనశ్చితాద్యగ్నులు ఇష్టక చితాగ్నుల వంటివి యని చెప్పినంతమాత్రమున నవి యిష్టకచితాగ్నుల దేశమును, రూపమును, క్రియామయమునున్ను క్రత్వనుప్రవేశత్వమునున్ను గలిగియుండిన వియై యుండవలయునన్న నియమము లేదు. కాఁబట్టి ఇష్టకచితాగ్నులకు స్వక్రతుద్వారా ఎట్టిఫలము గలదో, అట్టిఫలమే మనశ్చితాద్యగ్నులకును ఉపాసనాత్మకమగు స్వక్రతుద్వారా కలదని తెలియుచున్నది.

౫౦॥ సూ॥ పరేణచ శబ్దస్యతాద్విధ్యం భూయస్త్వా త్త్వనుబన్ధః

టీ ॥ పరేణచ = తరువాతనుండు బ్రాహ్మణవాక్యమును బట్టియును, శబ్దస్య = మనశ్చితాదులను తెలుపుశబ్దమునకు, తాద్విధ్యం = విద్యామయ ప్రతిపాదకత్వము (అవగమ్యతే = తెలియవచ్చుచున్నది), భూయస్త్వాత్తు = అగ్న్యంగము లనేకములయినందున, అనుబంధః=ఇచట చెప్పఁబడుచున్నవి.

తా॥ మనశ్చితాదులను తెలుపు శబ్దము విద్యామయమయినదానినే ప్రతిపాదించునదిగాను, బ్రాహ్మణవాక్యమును బట్టియును తెలియ వచ్చుచున్నది. అగ్న్యంగములు మిక్కుటము లైనందున నని యిచట ఉపదేశింపఁ బడుచున్నవి.

శ్రీ॥ భా॥ మనశ్చితాదులను తెలుపు శబ్దము ఉపాసనాత్మకమైనదానినే ప్రతిపాదించునదిగాను బ్రాహ్మణవాక్యమును బట్టియును తెలియవచ్చుచున్నది. ఎట్లనిన, బ్రాహ్మణవాక్యము "అయంవావ లోక ఏషోఽగ్నిచిత స్తస్యాప

వీవ పరిశ్రితాః" (ఈ యగ్నిచిత్తునకు ఈ భూలోకమే లోకము. ఉదకములే పరిస్తరణములు) అని చెప్పి, తరువాత "సయోహైతదేవం వేద లోకం పృణానమేనం భూతమే తత్సర్వ మభిసమ్పద్యతే" (ఎవఁడు ఇట్లు ఈయగ్నిని లోకమంతట నిండియున్న దానినిగా నుపాసించునో, వాఁడు సర్వమును పొందుచున్నాడు) అనుటచే నీతావున స్వతంత్ర ఫలముగల యుపాసనమే విధింపఁబడుచున్నట్లు తెలియుచున్నది. ఇట్లే వైశ్వానర విద్యాదులను విధించుతావులనున్ను ఉపాసనమే విధింపఁబడుచున్నది. కావున అగ్నిరహస్యము కర్మమును మాత్రమే విధించునదియని చెప్పఁదగదు. ఇట్లు అగ్నిచితాదులు ఉపాసనాత్మకములగు పక్షమున, వాటిని జ్ఞానకాండమగు బృహదారణ్యకమునఁ బఠించియుండవలయునే? ఇట్లుండ, వాటిని యీ యగ్నిరహస్యమునం దేల పఠించి యుండవలయు నంటివేని, చెప్పెదను. మనశ్చితాదుల విషయమై సమ్పాదింపవలసిన యంగములు అనేకములయినందున సమీపమగుటచే నిచటనే యవి పఠింపఁబడుచున్నవి. ఇంతియే

పూర్వ వికల్పాధికరణము ముగిసెను.

—

## శరీరే భావాధికరణము.

౫౧॥ సూ॥ ఏక ఆత్మ నశ్శరీరే భావాత్॥

టీ॥ (జ్ఞాతృత్వాది=జ్ఞాతృత్వాదిరూపమే, అనుసన్ధాతవ్యం=ఉపాసనము ననుష్ఠించుసమయమున ననుసంధింపవలసినదని) ఏకే=కొందఱు, మన్యన్తే=తలంచుచున్నారు. ఏలననఁగా; శరీరే=శరీరమునందుండునట్టి, ఆత్మనః=ఉపాసకునియాత్మ, భావాత్=అట్టిదిగా నుండుటవలన.

తా॥ శరీరముననుండునట్టి యుపాసకుని యాత్మ జ్ఞాతృత్వాది స్వరూపముగలది గాన, నదే యట్టిదిగానే, యుపాసనము ననుష్ఠించు సమయమున, ననుసంధించుకొన వలసినదని కొందఱు తలంచుచున్నారు.

శ్రీ॥భా॥ పరవిద్యలయందన్నింటియందును ఉపాస్య వస్తుస్వరూపమును, ఉపాసనాస్వరూపమునున్ను దెలిసికొనుట యావశ్యకమైనటుల, ఉపాసక స్వరూపమును సయితము దెలిసికొనుట యావశ్యకమని "త్రయాణామేవచైవ ముపన్యాసః ప్రశ్నశ్చ" అను సూత్రముచే ప్రతిపాదింపఁబడియె. ప్రత్యగాత్మనుపాసించునపుడు దానిని పరమాత్మయే యాత్మగా గలదానినిగా ననుసంధింప వలయునని "ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తిచ" అను సూత్రమున సూత్ర

కారులు జెప్పఁబోవుచున్నారు. ఈసందర్భమున నొక సంశయము గలుగు చున్నది.

## —సంశయము.—

ఇట్లు పరమాత్మ శరీరమునుగా ప్రత్యగాత్మ ననుసంధించుకొనునపుడు దానిని జ్ఞాతయనియు, కర్తయనియు, భోక్తయనియు, ఇహలోక పరలోకము లయందు సంచరింప సమర్థమనియు నిట్టి యాకారము గలదానినిగా ననుసంధింప వలయునా? లేక, ప్రజాపతివాక్యమునందుఁ జెప్పియున్న ప్రకారము అపహత పాప్మత్వాదిగుణములు కలదానినిగా ననుసంధింపవలయునా?

## —పూర్వపక్షము.—

ప్రత్యగాత్మను జ్ఞాతయనియు, కర్తయనియు, భోక్తయనియు నివ్విధము సమాత్ర మనుసంధింప వలయునని కొందఱుతలంచుచున్నారు. ఏలయన,ప్రత్యగాత్మ శరీరములోనుండునపుడు దాని స్వరూప మట్టిదియేకదా! ఇటుల ఉపాసకుడు ప్రత్యగాత్మ జ్ఞాతయనియు, కర్తయనియు, నివ్విధముగ ననుసంధించుకొనిన మాత్రముననే యట్టి యుపాసనమువలన సిద్ధింపవలసిన ఫలమున్ను సిద్ధింపుచున్నది గదా! అదెటువలెననిన, స్వర్గాది ఫలప్రాప్తికై యజ్ఞాది కర్మముల నొనర్చువాఁడు తన ప్రత్యగాత్మ జ్ఞాతయనియు, కర్తయనియు నివ్విధముగ ననుసంధింపక, స్వర్గఫలానుభవ దశయందు తన కుండబోవునట్టి స్వరూపమును తత్సాధనములగు యజ్ఞాదుల ననుష్ఠించునప్పుడు అనుసంధింపుచుండ లేదు గదా! ఏలననగా, వాఁడంతమాత్ర మనుసంధించుట చేతనే యతనికి ఫలసిద్ధి గలుగుచున్నది. మఱియునంతమాత్రముననే వాఁడు కోరిన ఫలము సిద్ధింపుచుండఁగా, తదితరమగు దాని ననుసంధించుటవలనఁ బ్రయోజనమేమి? అటులనే యుచటగూడ యోచింపఁ దగినది. ఒకవేళ "యథాక్రతురస్మిన్‌లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" అను శ్రుతివాక్యము పురుషుఁ డీలోకమునున్నపు డెట్టి భావనను కలిగియుండునో, యీలోకమును వదలినతరువాత అతఁ డట్టి వాఁడగుచున్నాడు" అనుచు ఉపాసకుఁడు పొంద బోవు ఫలము వాని భావన కనుగుణముగానుండువని తెలియఁజేయు చున్నందున ఉపాసకుఁడు ప్రత్యగాత్మ అపహత పాప్మత్వాదిగుణములు గలదియనియే యనుసంధింప వలయునని శంకించెదవేమో, అట్లు శంకింపఁ బని లేదు. ఏలననఁగా, "తంయథా యథోపాసతే" (ఉపాసకుడు ఆ పరమాత్మ

నెట్టి భావనతో నుపాసించుచున్నాడో) అను శ్రుతి ప్రకార మీపైనియుదహరింపబడిన శ్రుతి పరమాత్మను గుఱించిన భావనను జెప్పుచుండుటచే నది యుపాస్యుడగు పరమాత్మతో సంబంధించినది.

అవతారిక:—ఇట్లు ప్రసక్తించిన పూర్వపక్షమును ముగించుటకై

౫౩॥ సూ॥ వ్యతిరేక స్తద్భావ భావిత్వాన్నతూ పలబ్ధివత్.

---

టీ॥ నతు=పూర్వపక్షము సరికాదు, వ్యతిరేకః=ఇప్పుడుండునట్టిస్వరూపముకంటెను వేఱయిన స్వరూపమే (అనుసంధాతవ్యః = అనుసంధించుకొనఁదగినది. ఏలననఁగా) తద్భావభావిత్వాత్ =అట్టిస్వరూపము నేగదా యాతఁడు ఇఁకమీఁదు పొందబోవుచున్నాడు. (అదియెటువలెననిన), ఉపలబ్ధివత్ =బ్రహ్మోపలబ్ధివలెనే,

తా ॥ బ్రహ్మోపలబ్ధి యథావస్థిత బ్రహ్మస్వరూప విషయిక మైనట్లు ఆత్మోపలబ్ధియును యథావస్థితాత్మ స్వరూపవిషయిక మైనది గాన, ఆత్మకిప్పుడుండు స్వరూపముకంటెను వేఱయినదియగు అపహత పాప్మత్వాది స్వరూపమే యుపాసనము ననుష్ఠించు సమయమున ననుసంధించుకొన వలసినది. ఏలననఁగా, అట్టి స్వరూపము నేగదా యీయాత్మ యిఁకమీఁదు పొందబోవుచున్నాడు.

—⊶ సిద్ధాంతము. ⊷—

శ్రీ ॥ భా ॥ ఉపాసకుఁడు ప్రత్యగాత్మను జ్ఞాతృత్వ కర్తృత్వాది సామాన్య స్వరూపముతో మాత్రము కూడుకొనిన దానినిగా ననుసంధింప వలయుననుట యుక్తము కాదు. ఏలననిన, ఈ ప్రత్యగాత్మకు సంసార దశయందుండు స్వరూపమున కంటెను వేఱగు మోక్ష దశయందుండు అపహత పాప్మత్వాది గుణయుక్తమగు స్వరూపమునే యుపాసకుఁ డనుసంధింప వలయును. అనఁగా నీయుపాసకుఁడు మోక్షదశయం దెట్టి స్వరూపము గలవాఁడగుచున్నాడో, అట్టి స్వరూపమునే సంసారదశయం దుపాసనము నొనర్చునపు డనుసంధింప వలయుననుట, ఏలయన,—ఉపాసనా సమయమున నెట్టి భావనతో నుండునో అట్టిస్వరూపమునే యాతఁడు బొందుననికదా శ్రుతులు చెప్పుచున్నవి. అది యెట్లనిన, "యథాక్రతు రస్మిన్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్యభవతి" అను శ్రుతివాక్యము "ఉపాసకుఁ డీలోకమున నెట్టిభావనతో నుండునో, యీలోకమును వదలిన తరువాత అట్టి స్థితినే పొందును",

అనియు "తం యథా యథోపాసతే తథైవ భవతి" అను శ్రుతివాక్యము "ఈ యుపాసకుఁడట్టి సర్వేశ్వరుని యేభావనతో నుపాసించుచున్నాఁడో అట్టి వాఁడే యగుచున్నాఁడు" అనియును జెప్పుచు ఈపై విషయమునే ప్రతిపాదించుచున్నవి. అయితే పరమాత్మనుగుఱించిన భావన మాత్రమే యీ శ్రుతులయందు వివక్షితమనుట యుక్తముకాదు. ఉపాస్యుఁడగు పరమాత్మకు శరీరభూతుఁడగుటచే ప్రత్యగాత్మసయితము ఉపాస్యవస్తువుగాఁగొనఁబడుచున్నాఁడు. కనుక నీశ్రుతివాక్యములచే ప్రత్యగాత్మనుగుఱించిన భావన సయితము వివక్షితమని యెఱుంగునది. కాఁబట్టి ప్రజాపతివాక్యమునందుఁ జెప్పియున్నప్రకారము అపహతపాప్మత్వాది గుణములతోఁ గూడుకొనిన ప్రత్యగాత్మ శరీరముగాఁగల పరమాత్మను గుఱించిన యుపాసనమునకును అట్టి స్వరూపమే ప్రాప్యమని చెప్పఁబడినది. కనుకనే" "ఏవంక్రతుర్హ్యాముం లోకం ప్రేత్యాభిసంభవితాస్మి" అనుశ్రుతివాక్యము "ఇట్టి భావనతోనుండి యీలోకమును పొందిన వాఁడనయితిని" అని తెలుపుచున్నది. కావున ప్రత్యగాత్మ తాను పొందబోవు ఆకారముగలదిగానే యనుసంధింప వలసినది. * బ్రహ్మసాక్షాత్కారమునందువలెనే ప్రకృతమునను ఎఱుంగునది. అది యెట్లనిన, శాస్త్రమునందు విధింపఁబడిన బ్రహ్మసాక్షాత్కారము బ్రహ్మముయొక్క యథావస్థిత స్వరూప విషయమైనదగు చందంబున, ప్రత్యగాత్మయొక్క సాక్షాత్కారమును ప్రత్యగాత్మయొక్క యథావస్థిత స్వరూపవిషయమైనదియే యని యెఱుంగునది. కర్మములయందన్ననో, ఆత్మస్వరూపానుసంధానము కర్మాంగముగా నేర్పబడినది. ఏలననిన, "యజేత స్వర్గకామః" ఇత్యాది శ్రుతులచే కర్మానుష్ఠానమే గదా అచట ఫలము నిచ్చుటకై విధింపఁబడుచున్నది. దేహముకంటెను వేఱుగా జ్ఞాతయగు నాత్మ యొక్కఁడు గలఁడను జ్ఞానముండియుండుట యనునది ఇఁకమీఁదు రాబోవు ఫలమునకై సాధనములగు కర్మముల ననుష్ఠించు విషయమై యోగ్యతకుగాను ఆవశ్యకము. కావున నప్పుడంతమాత్రము జ్ఞానమే కావలసినది. కాఁబట్టి దోషమెద్దియును లేదు.

శరీరే భావాధికరణము ముగిసెను.

---

* బ్రహ్మసాక్షాత్కారము యథావస్థితమగు బ్రహ్మస్వరూపమును ధ్యానించువానికే కలుగునట్లు, ఆత్మ సాక్షాత్కారమున్ను యథావస్థితమగు నాత్మస్వరూపము ననుసంధించువానికే గలుగును. కావున యథావస్థితమగు అపహత పాప్మత్వాది యాత్మస్వరూపమే యనుసంధేయమని యాచార్యుల వారు వేదాంత దీపమున ప్రసాదించి యున్నారు.

## అఙ్గావ బద్ధాధి కరణము.

౫౩॥ సూ॥ అఙ్గావ బద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్ ॥

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, అఙ్గావబద్ధాః=ఉద్గీథా ద్యంగముల తో సంబంధించిన ఉపాసనములు, న=ఆయా శాఖలతో మాత్రము సంబంధించినవని చెప్పఁదగదు. హి = ఏలననఁగా, అవి ప్రతివేదం=ప్రతివేదమునను, శాఖాసు=సర్వ శాఖలయందును, సంబధ్యంతే=సంబంధించియుండునవి.

తా॥ ఉద్గీథా ద్యంగములతో సంబంధించిన ఉపాసనములు అన్ని వేదములయందలి యన్ని శాఖలతోనను సంబంధించియుండునవి యగుటంజేసి, యవి ఏ శాఖయందుఁ బఠింపఁబడుచున్నవో, ఆ శాఖతోను మాత్రమే సంబంధించినవి యని చెప్పఁదగదు.

శ్రీ॥ భా॥ "ఓ మిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత" (ఓమ్ అను అక్షరమును ఉద్గీథమునుగా నుపాసించునది) అనియు, "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" (లోకములయందు అయిదు విధములుగల సామము నుపాసించునది) అనియు, "ఉక్థముక్థమితివై ప్రజా వద న్తి తదిదమే వోక్థం ఇయమేవ పృథివీ"(ఉక్థము ఉక్థము అని ప్రజలు చెప్పుదురు. అది యీపృథివియే) అనియు "అయం వావలోక ఏషోఽగ్నిచితః" (అగ్నిచితునికిఁగల లోకమే యీ యుపాసకునికిని) అనియు నీతావుల క్రత్వంగా శ్రయములగు నుపాసనములు పఠింపఁబడుచున్నవి. వీనిని గుఱించి యొక సంశయము గలుగు చున్నది.

### సంశయము.

ఈ పైని యుదహరింపఁ బడినట్టి యుపాసనములు ఏ యే శాఖలయందు వినఁబడుచున్నవో,ఆయా శాఖలతోను మాత్రమే యవి నియతముగా సంబంధించినవియా? కాక, అవి సర్వ శాఖలయందలి యుద్గీథాదులతో సంబంధించి యుండునవియా? సర్వ వేదాంత ప్రత్యయన్యాయమున్నను, ప్రతియొక్క వేదమునకును స్వరభేద ముండుటంజేసి యుద్గీథాదులు భిన్నములు. కావున నవి యాయా శాఖలయందలి యుద్గీథాదులతోను మాత్రమే సంబంధించి యుండునవి యని శంకింపవచ్చును.

### పూర్వపక్షము.

"ఉద్గీథ ముపాసీత" అని యిట్లు సామాన్యముగ ఉద్గీథముతో సంబంధించినదిగాను వినఁబడునట్టి యుపాసనము ఏ శాఖయందుఁ బఠింపఁబడుచున్న

దో, ఆశాఖయందలి స్వరవిశేషములతోఁగూడుకొనిన ఉద్గీథము సమీపమున నుండునది యగుటంజేసి యందు అట్టి స్వరవిశేషముతో గూడుకొనిన యుద్గీథముతోనే సంబంధించి యుండునది యనుట యుక్తము. కావున నీయుద్గీథాద్యుపాసనము లన్నియును ఆయా శాఖలయందలి యుద్గీథములతో మాత్రము సంబంధించినవిగాను గ్రహింపఁదగినవి.

—సి ద్ధా ం త ము.—

ఉద్గీథా ద్యంగముల నాశ్రయించియుండునవియగు ఉపాసనములు ఆయా శాఖలయందలి యుద్గీథములతో మాత్రమే సంబంధించి యుండునవి యనెడి నియమము లేదు. అయితే యవి ప్రతివేదముయొక్కయును ప్రతిశాఖయందలి యుద్గీథములతోనును సంబంధించినవి. ఏలననఁగా, శ్రుతివాక్యమే యీయుపాసనములు ఉద్గీథా ద్యంగములతోను మాత్రము సంబంధించినవి యనితెలుపుచున్నవి. కావున ఏవేదమున ఏశాఖయందు ఉద్గీథాదులు పఠింపఁబడుచున్నవో వాటియన్నింటితోనును ఈ యుపాసనములు సంబంధించి యుండునవి. స్వరభేదమునుబట్టి యొక్కొక్క శాఖయందలి యుద్గీథముల స్వరూపములు భేదించినను, సామాన్యముగా నవి యుద్గీథముతో సంబంధించినవి యని శ్రుతియందు వినఁబడుటంజేసి యన్నివిధములగు ఉద్గీథ స్వరూపములును ఈ తావున గ్రహింపఁ బడుచున్నవి. కావున నెద్దియయిన నొక శాఖయందుఁ బఠింపఁబడినట్టి యుద్గీథములు అట్టి శాఖతో మాత్రమే సంబంధించినవి యని నియమించునట్టి ప్రమాణ మెద్దియును గానఁబడదు. సర్వ శాఖా ప్రత్యయన్యాయమును బట్టి యన్ని వేద శాఖలయందును విధింపఁబడునట్టి క్రతు వొక్కటమే యైనందున అన్ని శాఖలయందును ఆ యొక్క క్రతువే బుద్ధిస్థమగుటంజేసి యాయొక్కటియే క్రతువు అన్ని శాఖలయందును సన్నిహిత మైనందున అట్టి క్రతువున కంగభూతములగు ఉద్గీథాదులును దానికే సన్నిహితములుగాన, నవి యేదో యొకదానికి మాత్రమే సన్నిహితము లనెడి నియమము లేదు.

౫౮॥ సూ॥ మన్త్రాదివద్వాఽవిరోధః

టీ॥ మన్త్రాదివద్వా=మంత్రాదులకు వలెనున్ను, అవిరోధః=విరోధము లేదు.

తా॥ మంత్రాదులకు వలెనున్ను విరోధము లేదు.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "వా" శబ్దము సముచ్చయ వాచకము. అందుండు "ఆది" శబ్దముచే జాతి, గుణ, సంఖ్యా, సాదృశ్య, క్రమ,

ద్రవ్య, కర్మములు గ్రహింపఁబడుచున్నవి. ఈమంత్రములు మొదలగునవి యొక్కొక్క శాఖయందుఁ బఠింపఁ బడినను, ప్రధాన భూతమగు క్రతువు అన్ని శాఖలయందు నొక్కొక్కటియే యైనందున, సమయోచితముగా నవి శ్రుత్యాదులనుబట్టి యన్ని శాఖలయందును వినియోగింపఁ బడుట విరోధింపని చందంబున ప్రకృతమునను విరోధ మెద్దియును లేదు.

అఙ్గావబద్ధాధికరణము ముగిసెను.

## భూమజ్యాయస్త్వాధికరణము.

౫౭॥ సూ॥ భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి

టీ॥ భూమ్నః=విపులమగు సమస్తమునకె, క్రతువత్=క్రతువునకువలెనే జ్యాయస్త్వం=ప్రామాణికత్వము, (అస్తి=కలదు) తథాహి=అట్లేకదా, దర్శయతి=శ్రుతివాక్యము తెలుపుచున్నది.

తా॥ భూమవిద్యయందు విపులమగు సమస్తమునకే క్రతువునకువలెనే ప్రామాణికత్వముకలదు. అట్లేకదా శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ప్రాచీనశాలజౌపమన్యవః" (ఛా. ౫. ప్ర ౧౧. ఖ. ౧. వా) అని యారంభించి వైశ్వానరోపాసనమును పఠించుచున్నారు.అచట వైశ్వానరుఁ డనఁబడు పరమాత్మను త్రైలోక్య శరీరునిగా నుపాసించునదియని యుపదేశింపఁబడియె. అట్లు ఉపాసింపఁబడునట్టి పరమాత్మయొక్కయవయవములుగాను, స్వర్గలోకాదిత్య వాయ్వాకాశాప్పృథువులు ఉపాసింపవలసినవి. వానిలో ద్యులోకము శిరస్సుగాను, ఆదిత్యుఁడు చక్షుస్సుగాను, వాయువుప్రాణముగాను, ఆకాశము మధ్యశరీరముగాను, ఉదకములు మూత్రస్థిత్తిగాను,పృథివి పాదములుగానును ఉపాసింపవలసినవిగాఁ జెప్పఁబడినవి. ఇందొకసంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఇట్లు త్రైలోక్య శరీరమునందలి యొక్కొక్క యవయవమును ప్రత్యేకముగా నుపాసింపవలయునా? కాక, వానినిట్లు ప్రత్యేకముగానున్ను మొత్తముగానున్ను ఉపాసింపవలయునా? కాక, మొత్తముగాను మాత్రమే యుపాసింపవలయునా?

## —పూర్వపక్షము.—

ఆయవయవములలో నొక్కొక్కదానిని ప్రత్యేకముగానే యుపాసింపవలయుననుట యుక్తము. ఏలననిన, ఛందోగులు ఉపక్రమమున నట్లు ప్రత్యేకము గానే యుపాసనమును ఉపదేశించియున్నారు గదా! అదియెట్లనిన, ప్రాచీనశాల ఔపమన్యవుఁడు మొదలుకొని యుద్దాలకునితో నాలుగురు మహర్షులును కేకయదేశపురాజగు అశ్వపతియొద్దకుఁబోయి ‘‘ఆత్మానమేవేమం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి’’ (నీవు వైశ్వానరుఁడనఁబడు పరమాత్మను ఉపాసించుచున్నావు గాన, వానిని గుఱించి మాకుఁదెలుపుమా!) అని యడిగిరి. అంతట అశ్వపతి యామహర్షులలో నొక్కొక్కఁడు దేనిని వైశ్వానరునిగా నుపాసించుచున్నాఁడో, ఆ విషయమును తెలియఁగోరి యడుగఁగా, వారు ద్యులోకాదులలో నొక్కొక్కదాని నొక్కొక్కఁడు వైశ్వానరునిగా నుపాసించుచున్నామని బదులు చెప్పిరి. అంతట అశ్వపతియును వారికి వైశ్వానరుని మూర్ధాద్యవయవములగు ద్యులోకాదులలో నొక్కొక్క దానిని మాత్రము ప్రత్యేకముగా నుపాసించుటచేతఁ గలుగు ఫలమును గూడ జెప్పినట్లు ‘‘అత్త్యన్నం పశ్యతిప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం యఏతమేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే మూర్ధా త్వేష ఆత్మనఇతి ఏషవైసుతేజా ఆత్మావైశ్వానరః’’ (ఎవ్వఁడు ఇవ్విధమున వైశ్వానరుని యుపాసించునో, వాఁడు ఈలోకమున అన్నసమృద్ధిగలవాఁడగును ఇష్టమును లభించును. వానివంశమున బ్రహ్మవర్చస్సుగల వాఁడు జనించును. నీవు ఉపాసించునట్టి ద్యులోకమట్టి వైశ్వానరాత్మయొక్క శిరస్సు) ఇత్యాది శ్రుతివాక్యముల వలనఁదెలియుచున్నది. అనఁగా, ఔపమన్యవాదులు తాముపాసించునట్టి ద్యులోకాదుల నశ్వపతికి తెలుపఁగా, అశ్వపతియును ద్యులోకకాదులగు మూర్ధాదులను గుఱించిన ప్రత్యేకోపాసనములను ఆయాయుపాసనములకు ఫలవిశేషములనున్ను చెప్పినట్లు తెలియుచున్నది. ఆయాయుపాసనములయందు ఉపాస్యుఁడు వైశ్వానరుఁడని యును చెప్పియున్నాఁడు. కావున ద్యులోకాదులలో నొక్కొక్కదానిని ప్రత్యేకముగా నుపాసింపవలయును. ఇందే వేఱొక్కతావునను ‘‘యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమానమాత్మానం వైశ్వానర ముపాస్తే’’ (ఎవఁడు ఇట్లు ద్యులోకాదులతో సంబంధించిన వాఁడును, సర్వజ్ఞుఁడునగు వైశ్వానరాత్మను ఉపాసించుచున్నాఁడో) అనుటచే ద్యులోకాది ప్రదేశావచ్ఛిన్నమాత్రుఁడగు వైశ్వానరాత్మను గుఱించి చెప్పఁబడిన మూర్ధా ద్యుపాసనము

సర్వావయవ విశిష్టుని గుఱించినదిగాను గ్రహింప వలసినదిగా దెలియు చున్నది.

ఇందునుగుఱించి వేఱొక్కఁడు ఇట్లు వాదించుచున్నాఁడు.

ఇటులనే పొంత్తముగాను సయితము ఉపాసింపవలయును. ఏలననిన, "యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేషాత్మ స్వన్నమత్తి" (ఎవఁడు ఇవ్విధమున ద్యులోకాద్యవచ్ఛిన్నుఁడును, సర్వజ్ఞుఁడునగు వైశ్వానరాత్మను ఉపాసించుచున్నాఁడో, వాఁడు అన్నిలోకములయందును, అన్నిభూతములయందును, అన్నియాత్మలయందును అన్నమును భుజించుచున్నాఁడు" అను శ్రుతి వాక్యమున సమస్తోపాసనమునకు ప్రత్యేకముగా ఫలము చెప్పఁబడినది. ఇంత మాత్రమున వాక్యభేదము గలుగునని శంకింపఁదగదు. ఏలననిన, ఛందోగులు భూమవిద్యను ఉపదేశింపఁదలఁచి ప్రథమమున నామాదులను గుఱించిన ఉపాసనములను,వానివలనఁ గలుగు ఫలములను జెప్పి, తరువాత, "ఏషతు వా అతి వదతి యస్సత్యేనాతి వదతి" (ఎవఁడు సత్యమునుఁ జెప్పునో వాఁడే అతిక్రాంతదర్శి) అనుటచే భూమవిద్యను ఉపదేశించి "సస్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారోభవతి" (అట్టి భూమోపాసనము ననుష్ఠించినవాఁడు కర్మవశ్యత లేనివాఁడై అన్నిలోకములయందును సేచ్ఛా సంచారముగలవాఁడగు చున్నాడు) అనుటచే నట్టి భూమోపాసనా నుష్ఠానమువలనఁ గలుగు ఫలమునుగూడ తెలిపి యున్నారు. మొత్తముమీద, ఈవాక్యము భూమవిద్యనే తెలుపునదియైనను, ఇచట మధ్యమధ్య నామాద్యుపాసనములును, వాని ఫలములున్ను ఉపదేశింపఁబడినట్లు మనము అంగీకరించుచున్నాము. అట్లే ప్రకృతమునను ఎఱుంగునది.

## సిద్ధాంతము.

విపులమగు సమస్తమునే అనఁగా ద్యులోకాదులతోఁగూడిన వైశ్వానరాత్మను మొత్తము గానే యుపాసించుట ప్రామాణికము. అందువలన నీతావున ఏకవాక్యత సిద్ధించును. అది యెట్లనిన, ఛందోగులు "ప్రాచీన శాల ఔపమన్యవః" అని యారంభించి, "ఉద్దాలకో హవై భగవన్తోఽయ మారుణిస్సమ్ప్రతీ మమాత్మానం వైశ్వానరమధ్యేతి తం హన్తాభ్యగచ్ఛామ" అనువాక్యమున "వైశ్వానరాత్మను తెలిసికొనుటకై ఔపమన్యవుఁడు మొదలుగాఁగల అయిదుగురు మహర్షులు ఉద్దాలకునియొద్ద కేతెంచి, అతని సాన్నిధ్యమున వై

శ్వానరునిగుఱించి తెలిసికొనుటకు సంధర్భ పడకపోవుటచే, అంతట కేకయ దేశపు రాజగు అశ్వపతియొద్దకేఁ, «ఆత్మానమేవేమం వైశ్వానరం సమ్ప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి" (ఇప్పుడు నీవుఉపాసించుచున్నట్టి వైశ్వానరాత్మను గుఱించి మాకెఱింగింపుమా) అని యడిగి, వానిసన్నిధిని వైశ్వానరుఁ డనఁబడు పరమాత్మను స్వర్లోకము మొదలుకొని పృథివివఱకును శ్రుతియందుఁ జెప్పఁబడిన పదార్థములు శరీరముగాఁగల వానినిగా నుపాసింపవలయునని యెఱింగి, సర్వలోకములలోను, సర్వభూతములలోను, సర్వాత్మలలోనును భోగ్యభూతమగు పరమాత్మ ననుభవించుటయే యట్టి యుపాసనమునకు ఫలమనియు నెఱింగిరనియు నిట్లు చెప్పి ముగించి యున్నారు. దీనిని విచారించితిమేని, యిచట యేకవాక్యతయున్నట్లు, అనఁగా, ఈ గ్రంథ సందర్భమున నొక్క వైశ్వానర యుపాసనమే ఉపఁదేశింపఁ బడినట్లు తెలియుచున్నది. ఇట్లు ఈతావున ఏకవాక్యత యున్నట్లు తెలియ వచ్చుటనుబట్టి యిచట అవయవ విశేషములను గుఱించిన యుపాసనములను చెప్పుటయు, అట్టియుపాసనముల ఫలములఁ జెప్పుటయును సమస్తోపాసనముయొక్కవిభాగములననువదించుటకై మాత్రమే చెప్పఁబడినట్లు నిశ్చయింపఁ బడుచున్నది. అదెటువలెననిన, కర్మకాండమున «వైశ్వానరం ద్వాదశ కపాలం నిర్వపేత్ పుత్రే జాతే" (పుత్రుఁడు కలిగినపుడు వైశ్వానర దేవతాకమగు ద్వాదశ కపాలయాగము నొనర్పవలెను) అని యొక క్రతువు విధింపఁబడి, తరువాత దానియొక్క విభాగములు «యదష్టాకపాలో భవతి" ఈ మొదలగు వాక్యములయందు అనువదింపఁబడు చందంబున ప్రకృతమునను ఎఱుంగునది. కావున వైశ్వానరుని మొత్తముగా నుపాసించుట న్యాయము గాని, వాని యవయవములను ప్రత్యేకముగా నుపాసించుట న్యాయము కాదు. కనుకనే «మూర్ధా తే వ్యపతిష్యద్యన్మాం నాగమిష్యః" (నాయొద్దకు రాకపోయితివేని, నీశిరస్సు విరిగి పడిపోవును) అనియు, «అన్ధో భవిష్యసి యన్మాం నాగమిష్యః" (నాయొద్దకురాక పోయితివేని, యంధుఁడవయి యుందువు) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు వైశ్వానరాత్మయొక్క మూర్ధాద్యవయవములగు ద్యులోకాదులను ప్రత్యేకముగా నుపాసించుటవలన ననర్థము గలుగునని తెలుపుచున్నవి.

పూర్వపక్షి వ్యస్తోపాసనమునకు నామాద్యుపాసనములతో సామ్యమును చెప్పినదియును యుక్తము కాదు. ఏలననిన, అచట నామాద్యుపాసనముల ననుష్ఠించుటవలన ననర్థ మేదియును చెప్పియుండలేదు. అయితే «ఏష తు

వా అతివదతి యస్సత్యేనాతి వదతి'' ఇత్యాది వాక్యముచే నామాద్యుపాసనములకంటెను భూమోపాసనమువలన నెక్కువ ఫలము గలుగునని చెప్పఁబడెను. అందువలననే యిచటనుండు వాక్య సందర్భము భూమవిద్యను తెలుపునదియే యైనను,నామాద్యుపాసనములును వానిఫలములును వివక్షింపఁబడుచున్నవి. *అట్లుకాకున్న,యిచట ఫలాధిక్యమునకు హేతుభూతమగు సతివాదిత్వమునుబట్టి యీనామాద్యుపాసనములు భూమవిద్యను స్తుతించుటకై యేర్పడినవగుట సంభవము కాకపోవును. కావున నట్లు ప్రకృతమున ఫలాధిక్యము చెప్పఁబడక పోవుటంజేసి, మొత్తమునే యుపాసింపవలయునని సిద్ధమగుచున్నది. వైశ్వానరాత్మను మూర్ధాదులగు ద్యులోకాదులతోఁ గూడియుండునట్టి దానినిగానే యుపాసించునది.

భూమజ్యాయస్త్వాధికరణము ముగిసెను.



* ఫలతారతమ్యముఁ జూపింపవలయునన్న, ముందు తక్కువఫలము గలవానిని జూపించి తరువాత యెక్కువ ఫలముగలవానిని జూపింపవలయును. నామాద్యుపా ద్యుపాసనములు భూమవిద్యకుఁగల ఫలాధిక్యముఁ జూపించుటకై పేర్కొనఁబడినవి గాన,నవి ఫలయుక్తములుగాఁ గొనఁబడుచున్నవి. అందులకుగాను ఉపయోగము గలవియు నగుచున్నవి. అట్లు కాకున్న, అవి యుపయోగపడుట సంభవింపకపోవును. ఇట్లు నామాద్యుపాసనములకును భూమోపాసనమునకును పరస్పర సంబంధ ముండుటంజేసి, యవి భూమోపాసనములోఁ జేరిన వగుచున్నవి. అందువలన నీతావున వాక్యభేదములేదు. ప్రకృతమునన్, ద్యులోకాది వ్యస్తోపాసనములకును సమస్తోపాసనమునకుఁగల ఫలతారతమ్యమును ననువదించుటకై యవి పేర్కొనఁబడనందున, వాటికి ప్రత్యేకఫలముండుపక్షమున నవి ప్రత్యేకోపాసనములగును. అందువలన వాక్యభేదము గలుగును. కావున వానికి ప్రత్యేకముగా ఫలము చెప్పుటయందు తాత్పర్యము కాదనియు, వ్యస్తోపాసనమువలనఁ గలుగు అనర్థమునుఁజూచి సమస్తోపాసనమే ప్రామాణికమనుటకైయిచట పేర్కొనఁబడుచున్నవనియును యేర్పడుచున్నది. ఇవ్విధమున నవి సమస్తోపాసనమున నుపయోగ పడుచున్నందున నవి దానితోఁజేరిన వగుచున్నది. అందువలననే యిచట యేకవాక్యత గలదు. ఇట్లు శ్రుతప్రకాశితయందు వివరింపఁ బడినది.

## —శ బ్దా ది భే దా ధి క ర ణ ము.—

౫౬॥ సూ॥ నానాశబ్దాది భేదాత్

టీ॥ శబ్దాదిభేదాత్ =శబ్దాది భేదమువలన, నానా=విద్య లనేకములు.

తా॥ శబ్దాదిభేదమువలన విద్యలనేకములని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇచట బ్రహ్మవిద్యలన్నియును బ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షమే ఫలముగాఁగలవి. అవి సద్విద్యయనియు, భూమవిద్యయనియు, ఉపకోసలవిద్యయనియు, శాణ్డిల్యవిద్యయనియు, వైశ్వానరవిద్య యనియు, ఆనందమయ విద్యయనియు,అక్షరవిద్య యనియు నీమొదలగునవి. వీనిలో కొన్ని యొక్కటి యే శాఖయందుఁ బఠింపఁబడినవియును, మఱికొన్ని శాఖాంతరమునఁ బఠింపఁబడినవియును. ప్రాణాద్యేక ఫల విషయములగు ఇతరవిద్యలును మఱి కొన్ని గలవు. ఇందొక సంశయము గలుగుచున్నది.

## —స ం శ య ము.—

ఇవి యన్నియునుచేరి యొక్కటియేనా? కాక, ఇవి వేఱువేఱయినవా? ఈ విషయమునుగుఱించి సర్వవేదాన్త ప్రత్యయాధికరణమున విచారింపఁబడినను,వానిని మరల విచారించుట పౌనరుక్త్యమని శంకింపఁ దగదు. ఏలననఁగా, ఈతావున విద్యలకు పరస్పరము భేదము కలదని నిరూపింపఁబడగా, భిన్నభిన్న తావుల నుపదేశింపఁబడిన దహరవిద్యాదిరూపమగు నొక్కటియేవి ద్యకు భేదము లేదని సర్వవేదాంతప్రత్యయాధి కరణమున నిరూపింపఁ బడుచున్నది.

## —పూ ర్వ ప క్ష ము.—

ఈపైని పేర్కొనఁబడిన విద్యలన్నియునుచేరి యొక్కటియే విద్యయనుట యుక్తము. ఏలననిన, వీటియందు ఉపాసింపఁబడునట్టి వస్తువగు బ్రహ్మ మొక్కటియే గదా! ఉపాస్యవస్తువే గదా ఉపాసనముయొక్క రూపమనఁబడుచున్నది. రూప మొక్కటియే యగుటంజేసి, యుపాసనము సయితమొక్కటి యేయనినిశ్చయింపఁ బడుచున్నది.

## —సి ద్ధా ం త ము.—

ఈపైని పేర్కొనఁబడిన విద్యలు వేఱువేఱయినవి. ఏలననఁగా, వీని శబ్దాదులయందు భేదము కలదు. శబ్దాదులనఁగా శబ్ద, అభ్యాస, సంఖ్యా, గుణ ప్రక్రియా, నామధేయములు. ఇట్లు శబ్దాదులు భిన్నములయినందున ఇచట విధింపఁబడినట్టి యుపాసనములున్ను భిన్నములని తెలుపునట్టి కొన్ని హేతువులు గానఁబడు చున్నవి. ఈ వాక్యముల యందుఁ "వేద" "ఉపా

సీత" ఈమొదలగు విధ్యర్థక క్రియాపదములు జ్ఞానముయొక్క పునరావృత్తిని తెలుపునవియు, అట్టి జ్ఞానములు బ్రహ్మమునే గుఱించినవియును అయినను, ఆయా ప్రకరణములయందుఁ జెప్పఁబడిన జగదేక కారణత్వము, అపహత పాప్మత్వము ఈమొదలగు విశేషణములతోఁ గూడియున్నదియగు బ్రహ్మమును గుఱించిన జ్ఞానముయొక్క యభ్యాసరూపములగు విద్యలు భేదించుచున్నవి. బ్రహ్మప్రాప్తిరూపమగు ఫలముతో సంబంధించిన ఉపాసనవిశేషములను తెలుపునవియు, దేనితో నన్వయము లేనివియునగు వాక్యములు ప్రతిప్రకరణమునను వేఱువేఱుస్వరూపముగల విద్యలను తెలుపుచున్నవని నిశ్చయింపఁ బడుచున్నది. ఈవిషయము పూర్వమీమాంసమునందలి "శబ్దాన్తరేకర్మభేదః" ఇత్యాది సూత్రములచేతనే ప్రతిపాదింపఁబడినను, దానిని మరల ఈతావుననున్ను ప్రతిపాదించుటవలని ప్రయోజనము ఒక విధికివిషయముకానిదియగు జ్ఞానమును వేదాంతవాక్యములు తెలుపుచున్నవియని యద్వైతులు చేయునట్టి వాదమును నిరసించుటయేయని యెఱుంగునది. కావున విద్యలు భిన్నములని సిద్ధమగుచున్నది.

శబ్దాదిభేదాధికరణము ముగిసెను.

## వికల్పాధికరణము.

౫౯॥ సూ॥ వికల్పోఽవిశిష్ట ఫలత్వాత్

టీ॥ అవిశిష్ట ఫలత్వాత్ = బ్రహ్మవిద్యల ఫలమున భేదము లేకపోవుటంజేసి, వికల్పః = వానికి వికల్పమే.

తా॥ అన్ని బ్రహ్మవిద్యలయొక్కయును ఫల మొక్క విధమైనదియే యగుటంజేసి, వానిలో నెద్దియయిన నొక్కదానిని అనుష్ఠించునది.

శ్రీ॥ భా॥ బ్రహ్మప్రాప్తి రూపమగు ఫలము నిచ్చునవియగు సద్విద్యాదహర విద్యాదులు అనేకములని చెప్పఁబడియె. వీనినిగుఱించి యొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈవిద్య లన్నియును పరమపురుషుని యొక్కనియెడలనే యుపయోగపడునవియగుటంజేసి, వాటినన్నింటిని యీపురుషుఁ డనుష్ఠింప వలయునా? కాక, అట్లు వాటి నన్నింటిని అనుష్ఠించి నందువలనఁ బ్రయోజన మెద్దియును లేకపోవుటంజేసి, వానిలో దేనినైన నొక్కదాని ననుష్ఠించినఁజాలునా?

## పూ ర్వ ప క్ష ము.

ఈతఁడు వాటినన్నింటినిగూడ అనుష్ఠింప వలయునని చెప్పవచ్చును. ఏలననిన, ఒక్క విధమైన ఫలము నిచ్చునవియే యైనను, భిన్నభిన్న శాస్త్ర వాక్యములయందు విధింపఁబడిన వానినన్నింటిని యీ పురుషుఁడనుష్ఠించుచున్నట్లు మనము చూచుచున్నాము. ఎట్లనిన, అగ్నిహోత్రదర్శపూర్ణమాస్యాది కర్మములలో నొక్కొక్కటియును స్వర్గాది రూపమగు ఫలము నిచ్చునదియేయైనను, అట్టి స్వర్గాది ఫలమున నొక యాధిక్యముఁగోరి యీపురుషుఁడు వాటినన్నింటిని అనుష్ఠించు చున్నాఁడు. అట్లే ప్రకృతమునను బ్రహ్మానుభవ రూపమగుఫలమున నొక యాధిక్యముఁగోరి యీపురుషుఁడు బ్రహ్మవిద్యల నన్నింటిని యనుష్ఠించుటయును సంభవము.

## సి ద్ధా ం త ము

బ్రహ్మవిద్యలలోఁ దేనినైన నొక్కదాని ననుష్ఠింపవలయు ననుటసంభవమే గాని, యన్నింటిననుష్ఠింప వలయుననుట సంభవముకాదు. ఏలననిన, "బ్రహ్మవిదాప్నోతి పరం" (తై. ఆ. ౧. అను) (బ్రహ్మమును ఉపాసించువాఁడు మోక్షమును బొందుచున్నాఁడు) అనియు, "స ఏకో బ్రహ్మణ ఆనన్దః శ్రోత్రియస్యచాకా మహతస్య" (తై. ఆ. ౮. అను) (కామాది పీడితుఁడుగాని శ్రోత్రియునిదిని, బ్రహ్మదిని యొక్కటియే యానందము") అనియు, "యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి" (ము. ౩. ము. ౧.౩.౫.)(ఎప్పుడీయుపాసకుఁడు సువర్ణ చ్ఛాయగలవాఁడును,కర్తయును, నియామకుఁడును, బ్రహ్మాండమునకుఁ గారణభూతుఁడునగు పరమపురుషుని సాక్షాత్కరించుచున్నాఁడో,అప్పుడు ఈ యుపాసకుఁడు పుణ్యపాపములను విదల్చివేసి కర్మసంబంధము లేనివాఁడై పరబ్రహ్మమువ్విధమైనవాఁడో అవ్విధమైన వాఁడగు చున్నాడు) అనియు నీమొదలుగాఁగల శ్రుతివాక్యములు బ్రహ్మవిద్య లన్నింటికిని అనవధికాతిశయానన్ద బ్రహ్మానుభవ రూపమగు నొక్కవిధమైన ఫలమునే తెలుపుచున్నవి. అట్టి బ్రహ్మము తనకుగాని యితరునికి గాని స్వయముగ అనుభవమునకువచ్చునపుడు అనవధికాతిశాయనంతముగానగుచున్నది. అట్టి బ్రహ్మానుభవ మనునది బ్రహ్మవిద్యలలో దేనినైన నొక్కదానిని మాత్ర మనుష్ఠించుటచే లభించుపక్షమున,వేఱొక్కదానిఁగూడ ననుష్ఠింపవలసిన దేమున్నది? కావున వాటినన్నింటిని అనుష్ఠింప వలయుననుట సంభ

వము కాదు. స్వర్గాదులఫలమన్ననో, దేశమునుబట్టియు, కాలమును బట్టియు, స్వరూపమును బట్టియును ఇంతమాత్రమనెడి యొకవిధమైన పరిమితి గలది యగుటంజేసి దానివిషయమై దేశకాలాదులనుబట్టి యుండునదియగు నొకవిధమైన యతిశయముండుట సంభవము. కావున దాని్ం గోరువాఁడు అందులకు సాధన భూతములగు కర్మముల ననేకములఁ జేర్చి యనుష్ఠించుట సంభవము. బ్రహ్మమన్ననో, అట్లు ఒకవిధమైన పరిమితిగలది కాదు. కావున దీని విషయమై యిట్లు అనేకోపాసనములఁ జేర్చి యనుష్ఠింపవలయు ననుట సంభవముకాదు. ప్రతి బ్రహ్మవిద్యయును బ్రహ్మానుభవ విరోధియగు అనాది కర్మమనెడి యవిద్యను తొలఁగించి, అందుమూలముగ బ్రహ్మప్రాప్తిని గలుగజేయునది. కావున ఆయావిద్యల ఫలమున నెద్దియును భేదము లేకపోవుటంజేసి వానిలోఁ దేని ననుష్ఠించిన నొక్కటియే.

అవతారిక:—"బ్రహ్మప్రాప్తినితప్ప, తక్కినఫలముల నిచ్చునవియగు ఉపాసనములను, స్వర్గాది ఫలముల నిచ్చు కర్మములను వలెనే, వానిలో నెద్దియైన నొక్కదానినైనను, లేక వాటినన్నింటినైనను యథేష్టముగా ననుష్ఠించునది. ఏలననిన, వాటిఫలము పరిమితమైనది గాన, అందొకవిధమైనట్టి యాధిక్య ముండుట సంభవము" ఈవిషయమును తెలుపుటకై:—

౬౦॥ సూ॥ కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్నవా పూర్వహేత్వభావాత్

టీ॥ కామ్యాస్తు=కామ్యఫలముల నిచ్చునవియగు ఉపాసనములన్ననో, యథాకామం=యథేష్టముగ, సముచ్చీయేరన్ = అనేకములఁ జేర్చి యనుష్ఠించునది, నవా=అట్లుచేయక, వాటిలో నెద్దియైన నొక్కదాని ననుష్ఠించునది. ఏలననఁగా, పూర్వహేత్వభావాత్=వాటివిషయమై పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన హేతువు లేనందున,

తా॥ కామ్యఫలములనిచ్చు ఉపాసనముల ఫలము బ్రహ్మమువలె నపరిమితమైనది కానందున, వాటినన్నింటిని గాని, కాక, వానిలో నేదైన నొక్కదానినిగాని యథేష్టముగా ననుష్ఠించునది.

శ్రీ॥ భా॥. సూత్రమునందుంపు "పూర్వహేత్వభావాత్" అను పదమునకు అపరిమిత ఫలము గలవి కానందున నని యర్థము.

వికల్పాధికరణము ముగిసెను.



## —యథాశ్రయభావాధికరణము.—

### ౯౮॥ సూ॥ అంగేషు యథాశ్రయ భావః

టీ॥ అంగేషు = ఉద్గీథాది కర్మాంగోపాసనములయందు, ఆశ్రయభావః = అంగస్వభావము, యథా = ఎట్టిదో, (తథా = ఉపాసన స్వభావము నట్టిదియె.)

తా॥ ఉద్గీథాది కర్మాంగోపాసనములయందుఁ గర్మాంగస్వభావమెట్టిదియో, తదుపాసన స్వభావము నట్టిదియే.

శ్రీ॥ భా॥ “ఓ మి త్యే తదక్షర ముద్గీథ ముపాసీత” అనియు నీమొదలగు శ్రుతివాక్యములు కర్మాంగములగు నుద్గీథాదుల నాశ్రయించిన యుపాసనములను విధింపుచున్నవి. వీటినిగుఱించి యొకసంశయము గలుగు చున్నది.

#### —సంశయము.—

ఉద్గీథాదులవలె నివి కర్మములకుగా నేర్పడిన వైనందున, వీటిని కర్మములతోఁగూడనే యనుష్ఠింప వలయునా? లేక, ఇవి గోదోహ నాదులవలె నొక ఫలాంతరముగల వైనందున, వీటిని యథేష్టముగా, ననఁగా కర్మములతోఁ గూడగాని, ప్రత్యేకముగ గాని యెటుల నిష్టమో,యటుల నాచరింపవచ్చునా?

#### —పూర్వపక్షము.—

కర్మములతోఁ గూడనే యీయుపాసనముల ననుష్ఠింపవలయు ననుట యుక్తము.—“తన్నిర్ధారణా నియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్య ప్రతిబంధః ఫలం” అను సూత్రమున నీయుపాసనములకు కర్మ ఫలముకంటె వేఱగుఫలముచెప్పఁబడియున్నందున, నివి యిట్టి ప్రత్యేక ఫలమునకై పురుషునిచేఁ గోరబడునవి యనియు, కాఁబట్టి వీటిని కర్మములతోఁ గూడనే యనుష్ఠింప వలయునన్న నియమ మేదియు లేదనియును నిర్ణయింపఁబడెను గదా! యిట్లుండ,యీవిషయమును గుఱించి మరల యేల విచారింప వలసినది యని యడుగఁ బనిలేదు, ఏలనఁగా, ఈ విషయమునే దృఢపరచుటకై కొన్ని లింగములచేతను మరల దీని నాక్షేపించు చున్నారు. మఱియు, “తేనోభౌ కురుతః” అను శ్రుతివాక్యము ఉపాసించువాడు,ఉపాసింపనివాడును క్రతువులను జేయుచున్నారనుటచే యుపాసనమును క్రతువులతోఁగూడనే యనుష్ఠింపవలయునన్న నియమము లేదని తెలియ వచ్చుచున్నది. అందువలన నుపాసనములకు కర్మఫలమునకంటె

వేఱుగ ఫలమొక్కటి కలదని తెలియ వచ్చుచున్నది యని "తన్నిర్ధారణానియమః" ఇత్యాది సూత్రములచే నిర్ణయింపఁ బడియె. అయినను, యిట్టియుపాసనముల కాశ్రయములగు నుద్గీథాదు లెటుల కర్మాంగములో, యటులనే యాయుద్గీథాదుల నాశ్రయించిన యుపాసనములుగూడ కర్మాంగము లేయని, నిరూపించు హేతువు లనేకములు గలవు. ఏలయన;— "గోదోహనేన పశుకామస్య ప్రణయేత్" అను గోదోహనమును విధించు వాక్యమునసే పశుప్రాప్తి రూపమగు ఫలముగూడ జెప్పఁబడినట్లు, ఉద్గీథాద్యాశ్రయములగు నుపాసనములను విధించువాక్యమునను నట్టి యుపాసనముల ఫలము గూడ జెప్పఁబడలేదు. మఱియు "ఉద్గీథ ముపాసీత" అను వాక్యమున నుపాసనముద్గీథముతోఁ గూడనే పేర్కొనఁ బడినందున, నది యుద్గీథముతో సంబంధించినట్లు విశదమగుచున్నది. అయితే ఫలమన్ననో "య దేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" అను మఱియొక వాక్యమునందుఁ జెప్పఁబడియె. ఇట్లు యుపాసనములకు కర్మాంగములగు నుద్గీథాదులతోనుండు సంబంధము స్వవాక్యమునఁ జెప్పఁబడుచుండుటచే వాక్యాంతరమునఁ జెప్పఁబడిన ఫల మట్టి యుపాసనమును స్తుతిజేయుటకుఁగానుగూడ జెప్పియుండవచ్చునేదృష్టాంతము:—పర్ణజుహువును, యజ్ఞమునందుపయోగ పరచువాడు పాపపు వార్తలను వినడని చెప్పువాక్య మట్లు చెప్పుటచే పర్ణజుహువును స్తోత్రము జేయుచుండలేదా? అట్లే ప్రకృతమునను ఎఱుఁగునది. కావున నుద్గీథాదులు కర్మాంగము లగుటంజేసి యవి కర్మములతోఁ గూడనే యెట్లాచరింపఁ బడుచున్నవో, అటులనే యట్టి యుద్గీథాదుల నాశ్రయించియుండు యుపాసనములును అట్టి యుద్గీథాదుల ద్వారా కర్మాంగము లగుటంజేసి వాటినిగూడ కర్మములతోఁగూడనే యాచరింప వలయును.

౬౦॥ సూ॥ శిష్టేశ్చ

టీ॥ శిష్టేశ్చ=శాసనమును బట్టియును.

తా॥ ఉద్గీథాంగమునుగా నుపాసనమును విధించుటను బట్టియును అటులఁ దెలియు చున్నది.

శ్రీ॥ భా "ఉద్గీథ ముపాసీత" అను విధివాక్యము, ఉపాసనమును ఉద్గీథమున కంగముగ విధించుచున్నది. కాఁబట్టి యీ యుపాసనమును, కర్మాంగభూతమగు నుద్గీథముద్వారా కర్మాంగముగానే గ్రహింపవలయును. "గోదోహనేన పశుకామస్య ప్రణయేత్" (పశువులఁ గోరువానిచే గోదోహనముఁ తే

ఋంపవలయును) అను వాక్యముచే విధింపబడిన గోదోహనాదులకు ఫలాంతరము జెప్పఁబడినట్లు, ఈ యుద్గీథాద్యుపాసనముల కట్లు జెప్పియుండనందున నివి యుద్గీథా ద్యంగములుగానే విధింపఁబడుచున్నవి యని తెలియు చున్నది.

౬౧॥ సూ॥ సమాహారాత్

టీ॥ సమాహారాత్ = సమాహార నియమముండుటవలనను.

తా॥ ఉపాసనమునకు సమాహార నియమముండుటవలనను అటులఁ దెలియు చున్నది.

శ్రీ॥ భా॥ "హోతృషదనాద్ధైవాపి దురుద్గీథమనుసమాహరతి" అను వాక్యము "ఉపాసనా లోపముచే భ్రిష్టమగు నుద్గీథమును ఉద్గాత హోతృశంసనమువలన సరిచేసికొను చున్నాడు" అనుచు, ఉద్గీథమును భ్రిష్టము కాకుండజేయుటకై యుపాసన మావశ్యమని తెలియఁజేయు చున్నది. ఉపాసనా రహితమగు నుద్గీథము పై శ్రుతియందు దురుద్గీథమని పేర్కొనఁబడుచున్నది. ఇటుల నీశ్రుతి యుపాసనమునకు హానిగలుగునపు డట్టి దోషమును మఱియొకదానిచే సరిచేసికొనునది యనుటచే నుపాసనము నుద్గీథముతో నియతముగా ననుష్ఠింపవలసిన దానినిఁగాఁ దెలియఁజేయు చున్నది.

౬౨॥ సూ॥ గుణసాధారణ్య శ్రుతేశ్చ

టీ॥ గుణసాధారణ్య శ్రుతేశ్చ=ఉపాసనా విశిష్టమగు ప్రణవమే సర్వత్ర యనువర్తించుటవలనను.

తా॥ అంతటను ఉపాసన విశిష్టమగు ప్రణవమే యనువర్తించుట వలనను సమాహార నియమమున్నట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "తేనేయం త్రయీ విద్యావర్తతే ఓ మిత్యాశ్రావయత్యో మితి శంసత్యో మిత్యుద్గాయతి" అను శ్రుతివాక్యము "యజుర్వేది "ఓం" అని ప్రేష నిచ్చుచున్నాడు, ఋగ్వేది "ఓం" అని కీర్తింపుచున్నాడు. సామవేది "ఓం" అని యుద్గానము జేయుచున్నాడు గాన, వేదత్రయోక్తమగు కర్మము ఉపాసనా విశిష్టమగు ఓంకారముచే ప్రవర్తింపుచున్నది" అనుచు "ఉపాసనాశ్రయమై, యుపాసనముతోఁ గూడుకొనియున్న ప్రణవము, వేదత్రయోక్తములగు కర్మముల కన్నింటికిని సర్వసాధారణమైనదని తెలియజేయుచున్నందున నుద్గీథముతోఁగూడనే యుపాసనముగూడ నుండునదియని తెలియు చున్నది. ఈ శ్రుతియందలి "తేన" అను సర్వనామశబ్దము, ప్రకృతమున్న నుపాసనావిశి

ష్టమగు ప్రణవమును పరామర్శించుటచే నదియే వేదత్రయోక్తములగు కర్మము లన్నింటియందును అనువర్తించునట్లు దెలియుచున్నది. ఇటుల నీశ్రుతివాక్యము ఉపాసనములకు ప్రణవముతో నియతమగు సహభావమును దెలియఁజేయుచున్నందున, నుద్గీథాదులకు కర్మములతో సహభావము నియతమైనటుల, నట్టి యుద్గీథాదుల నాశ్రయించియుండు యుపాసనములకును కర్మములతో సహభావమునియతమని సిద్ధమగుచున్నది.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షమురాఁగా, నందులకు సమాధానము చెప్పుటకై

౬౩॥ సూ॥ నవాతత్సహభావాశ్రుతేః

టీ॥ తత్సహభావాశ్రుతేః = అంగత్వమును తెలుపు శ్రుతిలేనందున, నవా=సహభావము లేదు.

తా॥అంగత్వమును తెలుపు శ్రుతిలేనందున సహభావముండ నేరదు.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ ఉద్గీథాదులకు కర్మములతో నియతమగు సహభావమున్నట్లు అనగా నుద్గీథాదులు కర్మములతోటి గూడనే యనుష్టింపఁ బడునటుల, ఉద్గీథాద్యుపాసనములును కర్మములతోఁ గూడనే యనుష్ఠింప వలసినవి యని చెప్పఁ దగదు. ఏలయన, ఈ యుద్గీథాద్యుపాసనములు కర్మములకు నియతములగు అంగములైనట్లు శ్రుతులయందెచటను జెప్పియుండ లేదు గదా? అట్లు ఈ యుపాసనములు కర్మముల కంగములని చెప్పియున్న పక్షమునఁ గదా, యీ యుపాసనములకు కర్మములతో నియతమగు సహభావము గలదని చెప్పవచ్చును. పూర్వపక్షి గనఁబఱచిన ప్రకారము "ఉద్గీథ ముపాసీత" అను విధివాక్యమున ఫలాంతరము నిర్దేశింపఁ బడకపోయినను, "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అను అనంతర వాక్యమే "ఏకర్మము నుద్గీథాద్యుపాసనముతోడను, ఆస్తిక్య బుద్ధితోడను, దేవతా ధ్యానముతోడను జేయుదురో, అద్దియే ఫలము నిచ్చు విషయమై యెక్కువ సామర్థ్యము గలదియగును" అనుటచే నుపాసనము, కర్మములను ఫలము నిచ్చుటయందత్యంత సామర్థ్యము గలవాటినిగఁ జేయుటకై సాధనమని ప్రతిపాదించుచున్నది. కాఁబట్టి కర్మఫలమునకంటె వేఱగు మఱియొక ఫలమునకు సాధనభూతమగు నుపాసనము "ఉద్గీథ ముపాసీత" అను శ్రుతివాక్యముచే విధింపఁ బడుచున్నదీ. ఈ హేతువువలన కర్మఫలమునకంటె వేఱగు మఱియొకఫల

మునకు సాధనముగ విధింపఁబడు యుపాసనము కర్మాంగమగు నుద్గీథమునకంగ
ముగా నెట్లు ఉపయోగపడును? అయితే యీయుపాసనముల కాశ్రయ మెద్దియ
నెడి వివక్షవచ్చినప్పుడు మాత్రముఉద్గీథమునకును వీనికినియుండు సామీప్యము
నుబట్టి యుద్గీథము వీనికాశ్రయమని మాత్రము జెప్పవచ్చును. అయితే యుద్గీ
థము కర్మాంగము గాన, కర్మముల నొనర్చు యధికారియె తానొనర్చు కర్మ
ములను ఫలమునిచ్చువిషయమై ఎక్కువ సామర్థ్యముగల వాటినిగాఁజేయుటకై
యట్టి యుద్గీథము నాశ్రయించినవియగు ఈ యుపాసనముల నొనర్చువాఁడని
చెప్పవచ్చును. ఇంత మాత్రమున నీయుపాసనము లట్టికర్మములకునియతములగు
అంగములు కానేరవు. ఈ సందర్భమున కర్మములకు ఫలము నిచ్చు విషయమై
ఎక్కువ సామర్థ్యమును గలుగఁజేయుట యనఁగా బలవత్తరములగు కర్మము
లచేఁగలుగు ప్రతిబంధకములను బోగొట్టుటచే కర్మములను శీఘ్రముగ ఫలము ని
చ్చువాటినిగఁ జేయుట యని యెఱుంగునది. పర్ణమయమగు జుహూవును య
జ్ఞమునం దుపయోగించుటచే పాపపు వార్తలను వినకుండుట యను ఫలము
గలుగునని చెప్పుట యట్టి జుహూవును స్తుతిచేయుటకుగా నయినట్లు, కర్మములకు
ఫలమిచ్చు విషయమై యెక్కువసామర్థ్యమునుగలుగఁజేయుట యనునది కూడ
ఉపాసనమును స్తుతిఁ జేయుటకుగాను జెప్పఁబడినది కావచ్చునని పూర్వపక్షి
వాదించియుండెను. అయితే ఈ రెంటికిని భేదము గద్దు గాన, వీటిలో నొకటితో
నొకటిని పోల్చుట యుక్తము కాదు. ఏలయనిన, కర్మములకు ఫలమునిచ్చు
విషయమై యెక్కువ సామర్థ్యమును గలుగఁజేయుట యీ యుపాసనమునకు
ఫలమని « యదేవ విద్యయా కరోతి ” ఇత్యాది శ్రుతియందు ప్రత్యక్షముగఁ
జెప్పఁబడినట్లు, పాపపు వార్తలను వినకుండఁజేయుట పర్ణజుహూవును యజ్ఞ
మునం దుపయోగించుటచేఁగలుగు ఫలమని శ్రుతియందుప్రత్యక్షముగఁ జెప్పఁ
బడి యుండలేదు. కనుక ఇందువలన క్రత్వంగ భూతమగు జుహూవు మొదల
గునది యట్టి క్రతువున కంగముగానే యుపయోగ పడవచ్చును గాన, నంగ
భూతములగు నవి యాకర్మ ఫలముకంటెను వేఱొక్క ఫలమునకు సాధనములని
కల్పించుట యసంభవము. ఈ హేతువులనుబట్టి ఫలశ్రుతి యర్థవాదము మా
త్రము కావచ్చును.

౬౪॥ సూ॥ దర్శనాచ్చ

టీ॥ దర్శనాచ్చ=శ్రుతియందు నియమము గానఁబడ నందునను.

తా॥ శ్రుతియందు ఉద్గాత్రాదులకు ఉపాసనము దెలియ వలయునన్న నియమము జెప్పియుండ లేదు గాన, సమాహారాది లింగములు సామాన్యములు.

శ్రీ॥ భా॥ శ్రుతియును ఉద్గీథా ద్యుపాసనములు కర్మాంగములుకావని తెలియఁ జేయుచున్నది. వలయన, "ఏవం విద్ధవై బ్రహ్మాయజ్ఞం యజమానం సర్వాంశ్చ ర్త్విజోభిరక్షతి" అను శ్రుతివాక్యము "ఈప్రకార మెఱిఁగిన బ్రహ్మాయజ్ఞమును, యజమానుని, ఋత్విక్కులనందఱిని రక్షించును" అనుచు బ్రహ్మ మెఱింగిన యుపాసనముచే యజమానాదు లందఱును రక్షింపఁ బడుచున్నారని జెప్పుచున్నది. ఉద్గాత మొదలగు ఋత్విక్కులు ఉపాసనము నెఱింగియుండ వలయునన్న నియమము లేకపోవుటంజేసియే గదా ఈ శ్రుతి బ్రహ్మకుండుకున్న యుపాసన జ్ఞానమును సర్వరక్షకముగఁ జెప్పుచున్నది.

ఈ పైని చెర్కొనఁబడిన హేతువులనుబట్టి పూర్వపక్షి కనఁబఱచిన సమాహారాది లింగములన్నియు సామాన్యము లయినవని తెలియవచ్చుచున్నది. కనుక నీయుద్గీథా ద్యుపాసనమును కర్మములతోఁగూడఁ గాని ప్రత్యేకముగను గానియథేష్టముగ ననుష్ఠింప వచ్చును.

గద్య॥ ఇది, శ్రీకృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగానమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తి హరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగత సకలవిశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ గ్రంథతత్వార్థ, వాధూలకులతిలక వేఙ్కటాచార్య రంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్ల ద్రవిడాంధ్ర శుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు

తృతీయాధ్యాయమున

తృతీయపాదము









శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము.

## తృతీయాధ్యాయము—చతుర్థపాదము.

### పురుషార్థాధికరణము.

౧॥ సూ॥ పురుషార్థోఽతశ్శబ్దాదితి బాదరాయణః

టీ॥ అంతః=బ్రహ్మోపాసనమువలన, పురుషార్థః = మోక్షఫలము (సిద్ధ్యతీతి=సిద్ధించునని) బాదరాయణః=బాదరాయణాచార్యుఁడు, (మన్యతే=తలంచుచున్నాడు, ఏలననఁగా,) శబ్దాత్=అట్లు శ్రుతియందుఁ జెప్పియుండుటవలన.

తా॥ బ్రహ్మోపాసమువలన మోక్షము సిద్ధించునని శ్రీబాదరాయణాచార్యుఁడు తలచుచున్నాడు. శ్రుతులునుగూడ నటులనే చెప్పుచున్నవి గదా.

శ్రీ॥భా॥ బ్రహ్మవిద్యలయందు గుణోప సంహారానుపసంహారములను నిరూపించుటచే నావిద్యలలో కొన్నింటి కైక్యము గలదనియు మఱికొన్నింటి కైక్యము లేకపోవుటచే నవి వేఱువేఱు విద్యలనియును తృతీయపాదమున నిర్ణయింపఁబడియె. ఇప్పుడట్టి బ్రహ్మవిద్యచే మోక్షమనంబడు పరమపురుషార్థము సిద్ధించుచున్నదా ? లేక, బ్రహ్మవిద్య యంగముగాఁ గల కర్మమువలన నట్టి పరమపురుషార్థము సిద్ధించుచున్నదా? అను విషయమువిచారింపఁబడుచున్నది. బ్రహ్మవిద్యచే స్వతంత్రముగ పురుషార్థము సిద్ధించునని శ్రీమద్బాదరాయణాచార్యుఁడు తలంచుచున్నాడు. వీరిట్లు తలంచుటకు శ్రుతివాక్యములే హేతువులు.

ఎట్లన, "బ్రహ్మవిదాప్నోతిపరం" అను తైత్తిరీయ వాక్యము "బ్రహ్మమునుపాసించినవాఁడు పరమ పురుషార్థ రూపమగు మోక్షమును బొందుచున్నాడు" అనియు, "వేదాహమేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అనెడి పురుషసూక్తవాక్యము "విరాట్పురుషువి గొప్పవానినిగాను అజ్ఞానమున

కావల నాదిత్యునివలె ప్రకాశించు వానినిగానును దెలిసికొని యుపాసించెడి విద్వాంసుడు జన్మమరణ రహితమగు మోక్షమును బొందుచున్నాడు మోక్షముకొఱకిట్టి విరాట్పురుషోపాసనమునకంటె వేఱొక మార్గము లేదు" అనియు "యథా నద్యస్స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అనెడిముండకోపనిషద్వాక్యము మొదలగునవి "గంగా యమునా సరస్వత్యాదినదులు తమతమ జన్మస్థానములనుండి బయలువెడలి గంగా యమునాదినామములను, శుక్లకృష్ణాది రూపములనున్న వదలుకొని సముద్రముతోఁగలియునట్లు,బ్రహ్మోపాసకుడును నామరూపాదులనుండి విముక్తుఁడయి స్వయంప్రకాశుడును పరాత్పరుడునునగు పరమపురుషుని బొందుచున్నాడు. అనఁగా పరబ్రహ్మముతో పరమసామ్యమును బొందుచున్నాడు" అనియు నివ్విధమునఁ జెప్పుచుండుటంజేసి బ్రహ్మోపాసనముచే పరమపురుషార్థము సిద్ధించునని శ్రుతులవలననే తెలియవచ్చుచున్నది.

ఈ విషయమును శ్రీజైమిన్యాచార్యులవా రిట్లు యాక్షేపించు చున్నారు.

౨॥ సూ॥ శేషత్వా త్పురుషార్థవాదో యథాన్యే ష్వితిజైమినిః

---

టీ॥ శేషత్వాత్=విద్య కర్మాంగ మగుటచే,పురుషార్థవాదః=అది పరమార్థ మనంబడు మోక్షము నిచ్చుననుట, అన్యేషు యథా=ద్రవ్యసంస్కారాదులయందువలె (అర్థవాదః=గౌణము,)(ఇతి=అని జైమినిః=జైమిన్యాచార్యుఁడు,(మన్యతే=తలంచుచున్నాఁడు.)

తా॥ విద్య కర్మాంగ మగుటంజేసి యది మోక్షసాధనమని చెప్పుట ద్రవ్యగుణ సంస్కారాదులవిషయమునవలె గౌణముగాని ముఖ్యము గాదని జైమిన్యాచార్యులు తలచుచున్నారు.

## పూ ర్వ ప క్ష ము.

శ్రీ॥ భా॥ బ్రహ్మోపాసనమువలననే పురుషార్థము అనఁగా మోక్షము సిద్ధించునని శ్రుతులనుండి తెలియ వచ్చుచున్నదనుట యుక్తము కాదు. ఏలయన, "బ్రహ్మవిదాప్నోతి పరం" ఇత్యాదిశ్రుతివాక్యములు బ్రహ్మోపాసనమువలన పురుషార్థము సిద్ధించుచున్నదని దెలియపఱచు చుండ లేదు. అయితే యవి కర్మముల నొనర్చువాఁడగు నాత్మయొక్క యాథాత్మ్య జ్ఞానమును మాత్రమె ప్రతిపాదించుచున్నవి. ఇట్లుకర్తకొక సంస్కారమును గలుగజేయుచు నందుమూలముగ

జ్ఞానము కర్మాంగ మగుచున్నది. కనుక నిట్టి జ్ఞానమునకొఱకు ఫలమును జెప్పు శ్రుతు లర్థవాదములు మాత్రమె. పూర్వ మీమాంసమున "ద్రవ్యగుణ సంస్కార కర్మసు పరార్థత్వా త్ఫలశ్రుతి రర్థవాదస్స్యాత్" (ద్రవ్యగుణ సంస్కారములు క్రత్వంగము లగుటంజేసి వాని కొఱకు ఫలమును జెప్పు శ్రుతు లర్థవాదములు) అని చెప్పియున్నటుల నిచటనుగూడ నెఱుంగునది యని శ్రీజైమిన్యాచార్యులవారు తలంచు చున్నారు.

శంక:—అయితే కర్మము నొనర్చువాఁడగు జీవునికంటె నన్యుఁడును, ముముక్షువులచేఁ బ్రాప్యముగ నెఱుంగఁదగిన వాఁడునగు పరమాత్మయే వేదాంతములచే నుపదేశింపఁబడుచున్నాడని పూర్వము "నేతరోఽనుపపత్తేః" (బ్ర.సూ.౧. అ. ౧.పా. ౧౬. సూ.) "భేదవ్యపదేశాచ్చ" (బ్ర. సూ. ౧.అ. ౧. పా. ౧౭. సూ.) "అనుపపత్తేస్తు నశారీరః" (బ్ర. సూ. ౧ అ. ౨.పా. 3.సూ.) "ఇతరపరామర్శాత్స ఇతిచేన్నా సంభవాత్" (బ్ర. సూ. ౧. అ.3. పా. ౧౮. సూ.) ఇత్యాదిసూత్రములచే ప్రతిపాదింపఁ బడియె. మఱియు, తత్త్వమస్యాది మహావాక్యములు జీవాత్మ పరమాత్మలను సామానాధికరణ్యముచే నుపదేశించుచుండుటచే నట్టిపరమాత్మ జీవునికంటెను వేఱుగాడని కొందఱు శంకింపఁగా, "అధికంతు భేదనిర్దేశాత్" (బ్ర. సూ. ౨. అ. ౧. పా. ౨౨.సూ.)ఇత్యాది సూత్రములచే నట్టి శంకయును నిరాకరింపఁ బడియె. మఱియు "యః పృథివ్యాం తిష్ఠన్" "య ఆత్మని తిష్ఠన్" ఇత్యాది శ్రుతులు పరమాత్మ యచేతనములగు పృథివ్యాదులయందును చేతనులగు జీవులయందును నంతరాత్మగా నున్నట్లు జెప్పుచున్నవి గాన, నట్టి యంతరాత్మత్వమును బట్టి "ఐతదాత్మ్య మిదం సర్వం" "సర్వంఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులు పరమాత్మకును చేతనా చేతనవిశిష్టమగు జగత్తుకును సామానాధికరణ్యమును జెప్పుచున్నటుల, నట్టి యంతరాత్మత్వమును బట్టియే జీవేశ్వరులకును సామానాధి కరణ్యము జెప్పఁబడుచున్నదని "అవస్థితే రితికాశకృత్స్నః" (బ్ర.సూ. ౧. అ. ౪. పా. ౨౨. సూ.) ఇత్యాది సూత్రములచే ప్రతిపాదింపఁబడియె. ఇటుండ, (వేదాంతములు ముముక్షుజన ప్రాప్యుఁడగు పరమాత్మను ప్రతిపాదించుచుండ) అవి కర్మముల నొనర్చువాఁడగు జీవునియొక్క యాథాత్మ్యమును నుపదేశించుటచే జ్ఞానము కర్మాంగమని యెట్లు జెప్పందగును?

సమాధానము:—వేదాంతములయందే యుపాసనమునకు కర్మశేషత్వమును సూచింపునట్టి కొన్ని చిహ్నములు గలవు. వాటిని బట్టియే జీవేశ్వ

ర్థులకు సామానాధికరణ్యము గూడ ననఁగా జీవునికంటె నీశ్వరుఁడు వేఱొక్కఁడు గాడని గూడ వేదాంతములయందు ప్రతిపాదింపబడియె. కాఁబట్టి వేదాంతములు శరీరమునకంటె వేఱగు జీవుని యాథాత్మ్యమును దెలియఁబఱచునవి యని యెటులనైన నంగీకరింప వలయును.

శంక: — జీవుఁడు వైదికకర్మములను, లౌకికకర్మములను ఈరెంటిని గూడ సామాన్యముగ నాచరింపుచు నీరెంటికిని కర్త్తయగు చున్నాడు. కావున నతఁడు వైదికకర్మములకుమాత్రము కర్త్తయగు చుండలేదు. అందువలన జ్ఞానము కర్తృసంస్కారద్వారా వేదవిహితములగు క్రతువుల కంగమని చెప్పుట యశక్యమనినచో,

సమాధానము:—ఈతఁడు దేహమే యాత్మ యనుకొనినను, (దృష్ట ప్రయోజనములగు) లౌకిక కర్మములయందుఁ బ్రవృత్తి గలుగుచున్నది. (మరణానంతరము ఫలము నిచ్చు) వైదిక కర్మములయందన్ననో, దేహముకంటె వేఱుగ నిత్యుఁడగు నాత్మ యొక్కఁడు గలఁడనెడి యాత్మ స్వరూపజ్ఞానము లేకయే ప్రవృత్తి సంభవింపదు. కావున నట్టి జ్ఞానము క్రతువునందే యుపయోగపడుచున్నది. వేదాంతము లట్టి యాత్మస్వరూపజ్ఞానమును బోధింపుచుండుటం జేసి యది క్రత్వంగమనుట యుపపన్నము. కనుక నిట్లు క్రత్వంగ మయినందున విద్య స్వతంత్రముగ మోక్షసాధనము గానేరదు.

అవతారిక:—వేదాంతములయందే విద్యకు కర్మాంగత్వమును సూచింపు కొన్ని చిహ్నములు గనఁబడుచున్నవనియు, వాటినిబట్టియే జీవేశ్వరులకు సామానాధికరణ్యముగూడ శ్రుతులయందుఁ జెప్పబడియెననియు, కాఁబట్టి వేదాంతములు జీవస్వరూపమునే నిరూపించునవి యనియును పూర్వము జెప్పఁబడియె. ఆచిహ్నము లెవ్వియనిన.

3॥ సూ॥ ఆచారదర్శనాత్

టీ॥ ఆచారదర్శనాత్ = (బ్రహ్మవేత్తలయందు) కర్మానుష్ఠానము గనఁబడుచుండుటవలన.

తా॥ అశ్వపతి మొదలుగాఁగల బ్రహ్మవేత్తలయందు కర్మానుష్ఠానము గానఁబడు చున్నందున, జ్ఞానము స్వతంత్రముగ పురుషార్థదాయక మనుట యుక్తముకాదు.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తల యాచారమును పరిశీలించిచూడఁగా, వారలకు

కర్మమే ప్రధానమయినట్లు గన్పట్టు చున్నది. ఏలయన:—ఒకానొక సమయమున, కొందఱు ఋషులు బ్రహ్మవేత్తయును, కేకయదేశపురాజగు నశ్వపతికడకు ఆత్మజ్ఞానమును సంపాదించుకొనుటకై రాఁగా, నతఁడు నేను యజ్ఞము ననుష్ఠించు చున్నానని వారికి బదులు చెప్పెను. మఱియు "కర్మణైవహి సంసిద్ధి మాశ్రితా జనకాదయః" అనియు "ఇయాజ సోపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః" అనియు నీమొదలగు స్మృతివాక్యములవలన బ్రహ్మవిదగ్రేసరులగు జనకాదులుగూడ కర్మనిష్ఠులయినట్లు తెలియ వచ్చుచున్నారు. ఇట్లు బ్రహ్మవేత్తలకు కర్మమే ప్రధానముగ గన్పట్టుచున్నందున, విద్యయనఁగా కర్తృస్వరూపజ్ఞానమే గాన, నట్టి జ్ఞానము కర్మాంగమనియే సిద్ధమగుచున్నది. కావున విద్య స్వతంత్రముగ పురుషార్థహేతువు గానేరదు.

అవతారిక: — స్మృతియుండు గాక! అట్టి స్మృతికి మూలభూతమగు శ్రుతి యెద్దియనిన.

౪॥ సూ॥ తచ్ఛ్రుతేః

టీ॥ తచ్ఛ్రుతేః=విద్యకు కర్మాంగత్వమును దెలుపు శ్రుతియుండుటవలన.

తా॥ విద్య కర్మాంగమని శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ విద్య స్వతంత్రముగ మోక్షసాధనమనుట గౌణము. ఏలననిన, "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" అనెడి శ్రుతివాక్యమే "ఉపాసనముతోడను, శ్రద్ధతోడను, రహస్య విజ్ఞానముతోడను, ఏ కర్మ మనుష్ఠింపఁ బడుచున్నదో, యది ఫలము నిచ్చుటయందెక్కువ సామర్థ్యము గలదగును" అనుచు, నిందు మూలముగ కర్మమునకు జ్ఞానమంగమని తెలియఁ బఱచుచున్నది. అయితే యీశ్రుతి యుద్గీథ ప్రకరణమునఁ బఠింపఁబడుటచే నుద్గీథ విద్యను గుఱించిమాత్ర మిది యిట్లుల జెప్పుచున్నదని శంకించుట కవకాశము లేదు. ఏలయన:—ప్రకరణముకంటె శ్రుతి బలమైనది గదా! ఇట్లుండ, ప్రకరణమునుబట్టి యీశ్రుతి యుదీథోపాసనమును గుఱించి మాత్రమే యట్లులఁ జెప్పుచున్నదని స్థాపించుట యశక్యము. మఱియు నీ శ్రుతి "విద్యయా కరోతి" అనుటచే విద్యను గుఱించి మాత్రమే చెప్పునది గదా!

౫॥ సూ॥ సమన్వారమ్భణాత్

టీ॥ సమన్వారమ్భణాత్=విద్యాకర్మములు కలిసియుండునవైనందున

తా॥ «తంవిద్యాకర్మణీ» త్యాది శ్రుతివాక్యము విద్యాకర్మములను పరస్పరము కలిసియుండువానినిగాఁ జెప్పుచున్నందున విద్యకర్మాంగమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ «తం విద్యాకర్మణీ సమన్వారభేతే» అను శ్రుతివాక్యము విద్యాకర్మములు (ఫలము నిచ్చుటకై పరలోకమునకుఁ) గలిసి పోవుచున్నవని తెలుపుటచే విద్యాకర్మముల కొక విధమైనకూడిక యున్నట్లు గన్పట్టుచున్నది. పూర్వము జెప్పినప్రకారము విద్య కర్మాంగమగు పక్షముననే యీ రెంటికి నిట్టి కూడిక సంభవమగును.

౬॥ సూ॥ తద్వతో విధానాత్

టీ॥ తద్వతః=వేదార్థజ్ఞానముగలవానికి, విధానాత్=కర్మానుష్ఠానమును విధించుటవలన.

తా॥«ఆచార్య కులాద్వేద మధీత్యే» త్యాది శ్రుతివాక్యము అర్థయుక్తముగ వేదాధ్యయన మొనర్చినవానికే కర్మములను విధించుచున్నందున బ్రహ్మవిద్యగూడ కర్మములకుగానే నియోగింపఁ బడునదిగాఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ విద్యావంతునికి కర్మానుష్ఠానము శ్రుతులయందు విధింపఁబడుటవలనను, విద్య కర్మాంగమని తెలియుచున్నది. ఏలయనిన:—«ఆచార్యకులాద్వేదమధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుమ్బే శుచౌదేశే స్వాధ్యాయ మధీయానః» (ఈపురుషుఁ డాచార్య సన్నిధిలో నివసించి స్మృతులయందుఁ జెప్పఁబడినప్రకారము బ్రహ్మచర్యాది నియమములతో వేదముల నభ్యసించి, ధర్మజిజ్ఞాసను నవాప్తిఁ జేసికొని, గురుకుల వాసమును విడిచి, శాస్త్రోక్తవిధిచేత దారాపరిగ్రహముఁ జేసి గృహస్థాశ్రమ సంపన్నుఁడై, పరిశుద్ధమైన ప్రదేశమందు స్వాధ్యాయమును జేసికొనుచుండవలయును) అనియు, «వేదమధీత్య» అనియు నీమొదలగు శ్రుతులు వేదాధ్యయన మొనర్చినవానికే కర్మములను విధించుచున్నవి. * అర్థజ్ఞానయుక్తముగ వేద

* అర్థవిచారణ పూర్వకముగానే వేదముల నభ్యసించుట వేదాధ్యయన మనఁబడుచున్నదని పూర్వ మీమాంసకులలో భాట్టులును ప్రాభాకరులును తలంచుచున్నారు. శబ్దములను వినుటచేతనే యర్థము మనస్సునకు వచ్చుటంజేసి, «స్వాధ్యాయో ధ్యేతవ్యః» అను వేదాధ్యయన విధివాక్యమున అర్థజ్ఞానముగూడ విధింపఁబడుచుండ లేదనియు, కావున గురువు ఉచ్చరించురీతిని వే

ముల నభ్యసించుటయే వేదాధ్యయనమనిపించుకొను చున్నదని ప్రతిపాదింపఁబడియె. కాఁబట్టి బ్రహ్మవిద్యగూడ కర్మములకుగానే విధింపఁబడినది గాన, నది ప్రత్యేకముగ నొక ఫలము నీయఁజాలదు.

౭॥ సూ॥ నియమాత్

టీ॥ నియమాత్ =(యావజ్జీవము కర్మమునాచరింపవలయునను) నియమమువలన.

తా ॥ యావజ్జీవము కర్మముల నాచరింపవలయుననెడి నియమము వలన, కర్మమే మోక్షదాయకమని తెలియ వచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ ఈక్రిందుగాన్వింపఁబడు హేతువులనను విద్య పురుషార్థమును గలుగఁజేయునట్టి హేతువు గాదని తెలియవచ్చుచున్నది. "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః"(పురుషుఁడు కర్మములననుష్ఠించుచునే నూరు సంవత్సరములు జీవింప నిచ్ఛయించవలయును)అనెడి శ్రుతివాక్యము పురుషుఁడు తన యాయుర్దాయము నంతయును కర్మానుష్ఠానమునందు వినియోగింప వలయునని నియమించుటచే పరమపురుషార్థరూపమగు ఫలమును గలుగఁజేయునది కర్మమే యని తెలియవచ్చుచున్నది. కనుక బ్రహ్మవిద్య కర్మాంగము మాత్రమే.

అవతారిక:—ఇట్లు బ్రహ్మవిద్యకు కర్మాంగత్వము ప్రాప్తింపఁగా,దానిని నిరాకరించుటకై

౮॥ సూ॥ అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్॥

టీ॥తు=పూర్వపక్ష మయుక్తము, అధికోపదేశాత్ =కర్తయగు జీవుని కంటె గొప్పవాఁడగు సర్వేశ్వరుని శ్రుతు లుపదేశించుటవలన, బాదరాయణస్య=శ్రీబాదరాయణుని (మతము), ఏవం=ఇట్లు, (విద్యవలననే పురుషార్థము సిద్ధించునని).ఏలననిన:—తద్దర్శనాత్ =అట్టిగొప్పవానిని శ్రుతులు ప్రదర్శించుటవలన:

---

దాక్షరములను ఆయా స్వరవిశేషములతో నుచ్చరించుట నభ్యసించుటమే వేదాధ్యయన మనియును జిజ్ఞాసాధికరణమున నాచార్యులవారు ప్రతిపాదించియున్నారు. వీరిమతమే సూత్రకారుని మతమునని "అధ్యయన మాత్రవతః" (బ్ర. సూ. ౩.అ.౪.పా.౧౨ సూ.) అను సూత్రమువలనఁ దెలియుచున్నది.

తా॥ కర్తయగు జీవునికంటెను గొప్పవాఁడగు సర్వేశ్వరుఁడే వేదాంతములయం దెల్లెడల నుపాస్యుఁడుగా నుపదేశింపఁబడుటచే బ్రహ్మవిద్యయే స్వతంత్రముగ పరమపురుషార్థము నిచ్చునని శ్రీబాదరాయణుఁడు తలంచుచున్నాఁడు. అటులనే కదా శ్రుతులయందుఁ గన్పట్టుచున్నది.

—సిద్ధాంతము.—

శ్రీ॥ భా॥ హేయగుణము లెంతమాత్రము లేనివాఁడును, లెక్కలేని కల్యాణ గుణములు గలవాఁడు నగుటంజేసి కర్తయగు జీవునికంటెను గొప్పవాఁడును, కనుకనే వానికంటెను భిన్నుఁడునగు పరమాత్మయే ముముక్షువులచే నుపాసింప వలసినవాఁడుగా వేదాంతములయం దెల్లెడల నుపదేశింపఁ బడుచున్నాఁడు. కాఁబట్టి బ్రహ్మోపాసనమే స్వతంత్రముగ మోక్షమనంబడు పరమ పురుషార్థము నిచ్చునదియని శ్రీబాదరాయణుఁడు తలఁచుచున్నాడు. బ్రహ్మవిద్యకు కర్మాంగత్వమును సూచింపు లింగము లటుండనిమ్ము. అయితే వేదాంతములయందు కర్తయగు ప్రత్యగాత్మకంటెను గొప్పవాఁడగు పరమాత్మయే ముముక్షువులచే నుపాసింప వలసినవాఁడుగా నుపదేశింపఁ బడుచున్నాఁడు. ఎట్లనిన:—ఛందోగులు «అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘిత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః" అనెడి వాక్యమున « పరబ్రహ్మము పాపము లేమాత్రము లేనివాఁడనియు, ముసలితనము లేనివాఁడనియు, మరణము లేనివాఁడనియు, దుఃఖము లేనివాఁడనియు, ఆకలి లేనివాఁడనియు, దప్పిక లేనివాఁడనియు, సత్యకాముఁడనియు, సత్య సంకల్పుఁడనియును" జెప్పియుండుటచేతను « తదైక్షత బహుస్యాంప్రజాయేయేతి తత్తేజోఽసృజత" అనెడి వాక్యమున «అట్టి పరబ్రహ్మము సృష్టికిగాననేకముగ నగుదునని సంకల్పించి తేజస్సును సృజించెను" అనియు నీవిధముగ జెప్పియుండుటచేతను, ముండకోపనిషత్తునందు «యస్సర్వజ్ఞ స్సర్వవిత్" (పరబ్రహ్మము సర్వజ్ఞుఁడనియు సర్వవేత్త" యనియును జెప్పియుండుటచేతను, శ్వేతాశ్వతరోప నిషత్తునందు «పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ " (పరబ్రహ్మము నానావిధములైనట్టిశక్తులు గలవాడనియు, వానికి స్వాభావికములయిన జ్ఞానబలక్రియలు గలవు" అనియును జెప్పియుండుటచేతను, తైత్తిరీయులు «స ఏకో బ్రహ్మణ ఆనందః" అనువాక్యమున «అట్టిది యొక్కటి బ్రహ్మానందము" అని వర్ణించి యుండుటచేతను«యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" అనెడి వాక్యమున « అట్టి

పరబ్రహ్మము వాచామ గోచరుఁడనియు వాని యానందమును దెలిసికొనిన విద్వాంసునికి సంసారభయము లేదు" అనియును జెప్పియుండుటచేత ను, వాజసనేయులు "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణే" అనెడి వాక్యమున "పరబ్రహ్మము సర్వమున కీశ్వరుఁడని యు, భూతముల కధిపతియనియు, భూతములనుపాలించు వాఁడనియు, సేతువు వలె నన్నింటిని ధరించియున్నాఁడు" అనియును జెప్పియుండుటచేతను, శ్వేతా శ్వతరోప నిషత్తునందు "సకారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చి జ్జనితా న చాధిపః" (పరబ్రహ్మము కారణభూతుఁడనియు, జీవుల కధిపతియనియు,అత నిని పుట్టించువాఁడును అతని కధిపతియును వేఱొక్కఁడు లేడు" అనియును జెప్పియుండుటచేతను, వాజసనేయులు"ఏతస్యవా ప్రశాసనే గార్గి సూర్యాచంద్ర మసౌ విధృతౌ తిష్ఠతః ఏతస్యవా ప్రశాసనే గార్గి ద్యావా పృథివీ విధృతే తిష్ఠ తః" అనెడివాక్యమున "పరబ్రహ్మముయొక్క యాజ్ఞవలననే సూర్యచంద్రులు తమతమ స్థానములను వదలక యున్నారనియు వాని యాజ్ఞవలననే భూమ్యం తరిక్షములు గూడ వాటివాటి స్థానములను పట్టుకొని యున్నవి" అనియును జెప్పియుండుటచేతను, తైత్తిరీయులు:— "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మాదింద్ర శ్చాగ్నిశ్చ మృత్యుర్ధావతి పంచమః" అనెడి వాక్య మున "పరబ్రహ్మముయొక్క భయమువలననే వాయువు వీచుచున్నదనియు, సూర్యుఁ డుదయించుచున్నాఁడనియు, ఇంద్రుఁడును, అగ్నియును అయిదవదగు మృత్యువును, తమతమ కార్యములయందుఁ బ్రవర్తించుచున్నారు" అనియును జెప్పియుండుటచేతను, ఈ పైని యుదహరింపఁబడిన వాక్యములయందే కాక, ఇఁక, యివ్విధముగ బ్రహ్మజ్ఞానము నుపదేశింపునట్టి యనేక వేదాంత వాక్య ములయందునుగూడ నిట్లు జెప్పియుండుటచేతనున్ను,పరిశుద్ధుఁడుగా నుండునప్పు డుగాని, యనఁగా మోక్షదశయందుగాని, లేక అపరిశుద్ధుఁడుగా నుండునప్పు డుగాని, అనఁగా సంసారదశయందుగాని ప్రత్యగాత్మ యందుండునవిగ భా వింప శక్యములు కానట్టి యనంత కల్యాణగుణముల కాకరుఁడును, ఉపా స్యుఁడును, హేయగుణరహితుఁడును, స్వసంకల్పమాత్రకృత జగత్సృష్టిస్థితి సంహార లీలుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, మనోవాగపరిచ్ఛేద్యా నందుఁడును, జీవుల కధిపుఁడును, సర్వనియామకుఁడుననగు పరబ్రహ్మమే యు పాస్యుఁడుగ వేదాంతములయం దెల్లెడల నుపదేశింపఁబడుచున్నట్లు స్పష్టమ గుచున్నదియే గాని, విద్యోపదేశకములగు వేదాంతవాక్యములయం దెచటను

కర్తయును, ఖద్యోతమాత్రుఁడును, అవిద్యా సంబంధార్హుఁడును నగు ప్రత్యగాత్మను గుఱించి లేశమాత్రమయినను, జెప్పఁబడియున్నట్టు గానఁబడుచుండలేదు. కనుక పరబ్రహ్మము విషయమగు నుపాసనముకే శ్రుతులయం దచ్చటచ్చట బ్రహ్మప్రాప్తి రూపమగు నమృతత్వము ఫలముగాఁ జెప్పఁబడినది గాన, విద్యయే స్వతంత్రముగ మోక్ష మనంబడు పరమ పురుషార్థము నిచ్చునది యనుట యుక్తము.

అవతారిక:—బ్రహ్మవిద్యకు కర్మాంగత్వమును సూచింపు కొన్ని లింగములను పూర్వపక్షి గనఁబఱచియుండె. వాటిని నిరసించుటకై,

౯॥ సూ॥ తుల్యంతు దర్శనం

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, దర్శనం = ఆచార దర్శనము, తుల్యం=(రెండుపక్షములయందును) సమానము.

తా॥ విద్య కర్మాంగమను పక్షమునందువలెనే యది కర్మాంగము కాదను పక్షమునందుఁగూడ శిష్టాచారము సమానముగ గన్పట్టుచున్నది.

శ్రీ॥భా॥ బ్రహ్మవేత్తలుగూడ కర్మముల ననుష్ఠింపు చున్నట్లు శ్రుతుల యందుఁగన్పట్టు చుండుటవలన విద్య కర్మాంగమని పూర్వపక్షి చెప్పినది సరి కాదు. ఏలయన,విద్య కర్మాంగమను పక్షమునందువలెనే యది కర్మాంగము గాదను పక్షమునఁగూడ,శిష్టాచారము సమానముగ గన్పట్టుచున్నది. అనఁగా బ్రహ్మవేత్తలకు కర్మానుష్ఠానము లేనటులఁగూడ శ్రుతులవలనఁ దెలియవచ్చుచుండుటవలన వారియందు కర్మానుష్ఠానము నియతముగ గన్పట్టు చుండ లేదు. ఎట్లనిన,“ఋషయః కావషేయాః కిమర్థా వయమధ్యేష్యామహే కిమర్థా వయం యక్ష్యామహే” ఇత్యాది శ్రుతివాక్యము “కావషేయులను ఋషులు మన మేల యధ్యయనము జేయవలయును?ఏల యజ్ఞముల ననుష్ఠింపవలయును?” అని యిట్టు జెప్పుచు పూర్వీకులగు ఋషులు కర్మములను త్యజించినారని దెలియఁ జేయుచున్నది. ఇట్లు బ్రహ్మవేత్తలు కర్మములను పరిత్యజించినట్లు శ్రుతుల యందు గన్పట్టుచున్నందున విద్య కర్మాంగమనుట యుక్తము గాదు. అయితే శ్రుతులయందుఁ గొన్నితావుల బ్రహ్మవేత్తలకు కర్మానుష్ఠాన మున్నట్లు గన్పట్టటయు, మఱి కొన్నితావుల వారి కది లేనట్లు గన్పట్టటయును, సంభవములా? యని శంకింపఁ బనిలేదు. ఫలమునపేక్షింపకయే యనుష్ఠింపఁబడు కర్మములు బ్రహ్మవిద్యాంగము లగుటంజేసి వాటి యనుష్ఠానము బ్రహ్మవేత్తల యందు గన్పట్టట సంభవము. “సర్వాపేక్షాచ యజ్ఞాది శ్రుతేరశ్వవత్”

(ప.సూ.3.అ.౪.పా.౨౬.సూ.)అనెడిసూత్రముచే సూత్రకారులుగూడ ఈవిషయమును నిరూపింపఁబోవుచున్నారు. స్వర్గాది ఫలాపేక్షచే నొనర్పఁబడు కర్మములు మోక్షైక ఫలమగు బ్రహ్మవిద్యకు విరుద్ధము లగుటంజేసి వాటియనుష్ఠానము బ్రహ్మవేత్తలయందు లేకబోవుటయును సుతరాం సంభవము. అయితే బ్రహ్మవిద్య కర్మాంగమగు పక్షమున మాత్రము బ్రహ్మవేత్తలయందు కర్మానుష్ఠానము గన్పట్టుటయు గానఁబడక పోవుటయును యీరెండును యెంతమాత్రము సంభవములు గావు.

అవతారిక:—బ్రహ్మవిద్య కర్మాంగమని శ్రుతియే తెలుపుచున్నదని పూర్వపక్షి చెప్పినది సరికాదనుటకై

౧౦॥ సూ॥ అసార్వత్రికీ

టీ॥ అసార్వత్రికీ=«యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి సర్వ విద్యా విషయము కాదు.

తా॥ «యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి ప్రకృతమగు నుద్గీథ విద్యతో సంబంధించినదియే కాని, సర్వ విద్యలతోను సంబంధించినది కాదు.

శ్రీ॥ భా॥ విద్యకు కర్మాంగత్వమును దెలియజేయునదిగాను పూర్వపక్షి యుదహరించిన «యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అనెడి శ్రుతి ప్రకృతమగు నుద్గీథ విద్యతో సంబంధించినదియే కాని, అన్ని విద్యలతోను సంబంధించినది కాదు. ఏలననిన, ఈ శ్రుతి యందలి «యత్" అనెడి శబ్దము «ఉద్గీథ ముపాసీత" అను యనంతర వాక్యమునందుండు «ఉద్గీథ" శబ్దముతో నన్వయించు చున్నది. అనఁగా ఈశ్రుతి విద్యతోఁ జేయఁబడు కార్యమును «యత్" శబ్దముచే నిర్దేశించి ఆ కార్యము వీర్యత్తరమని చెప్పుచున్నందున విద్యతో నేది జేయబడుచున్నదో, అది వీర్యతత్తర మనుట ఈ శ్రుత్యర్థము గాని, పురుషుడే యేకార్యములను జేయుచున్నాడో వాటిన న్నింటిని విద్యతోడనే జేయవలయు ననుట యీశ్రుతి కర్థము కాదు.

అవతారిక:—«తం విద్యా కర్మణీ సమన్వా రభేతే" అను శ్రుతివాక్యమున విద్యయును కర్మమున్ను ఒకదానితో నొకటి జేరియున్నట్లు జెప్పఁబడియున్నందున విద్య కర్మాంగమనెడి యాక్షేపమును తొలగించుటకై

౧౧॥ సూ॥ విభాగ శ్శతవత్

టీ॥ శతవత్ =నూటిలోవలె, విభాగః=విద్యాకర్మఫల విభాగము (ద్రష్టవ్యః=యోచింపఁ దగును)

తా॥ నూటిలోనువలె విద్యాకర్మములకుఁగల విభాగ మిచట యోచింప దగును.

శ్రీ॥ భా॥ విద్యాకర్మ ఫలములు భిన్నములని యింతకు పూర్వము జెప్పబడిన ప్రకారము “విద్యా కర్మణీ సమన్వా రభేతే” అను శ్రుతివాక్యము విద్య తన ఫలము నిచ్చుటకై పురుషుని యనుసరించి పోవుచున్నదనియు, కర్మము తన ఫలము నిచ్చుటకై పురుషుని యనుసరించి పోవుచున్న దనియును జెప్పుచుండుటంజేసి యిచట విద్యా కర్మములకుఁగల విభాగము యోచింప దగును. ఎటువలెననిన: భూమినిన్ని రత్నమునున్ను అమ్మిన వర్తకులతోఁ గూడ రెండు వందల రూప్యములు బోవుచున్నవనినచో, భూమికిగాను నూరు రూప్యములు రత్నమునకుగాను నూరు రూప్యములను,విభజనము మనకుఁదోచుచుండలేదా? అటులనే యిచటనుగూడ విద్యా కర్మములకు విభాగ మున్నటుల నెఱుంగు నది.

౧౨॥ సూ॥ అధ్యయన మాత్రవతః

టీ॥ అధ్యయన మాత్రవతః=అధ్యయనమాత్రము కలవానికి (కర్మము విధింపఁ బడినది)

తా॥ “ఆచార్య కులాద్వేద మధీత్య” అనుచో, అధ్యయనముమాత్రము వినఁబడుటచే, నధ్యయన మాత్రము గలవానికే కర్మము విధింప బడియెనని నిశ్చయింపఁ దగును.

శ్రీ॥భా॥ విద్యావంతునికి అనఁగా వేదార్థ జ్ఞానము గలవానికి శ్రుతులు కర్మములను విధించు చున్నందున, విద్య కర్మాంగమని పూర్వపక్షి చెప్పినది యును సరికాదు. ఏలననిన, “ఆచార్య కులాద్వేద మధీత్య” అనుచో అధ్యయనమాత్రము వినబడు చున్నందున, నధ్యయన మాత్రము గలవానికి కర్మము విధింపఁ బడియెనని నిశ్చయింపఁ దగును. ఇచట “వేద మధీత్య” అను వేదాధ్యయన విధివాక్యము కేవలము వేదాధ్యయనమువను మాత్రమేఅనఁగా నక్షరరాశి గ్రహణమున మాత్రమే పురుషుని ప్రవర్తింప జేయుచున్నదేగాని తదర్థ జ్ఞానము నందును గూడ ప్రవర్తింపఁజేయు చుండ లేదు. అంతటితో నీవిధి యొక్క కర్తవ్యము ముగించుచున్నది. ఎటువలెననిన, “అగ్ని నాదధీత” అను

అగ్న్యాధాన విధివాక్యము అగ్నిని సంపాదించుకొనవలయునని మాత్రమే విధింపఁగలదు గాని అగ్ని క్రతూపయుక్తమయినదనియును గూడ విధింపఁగలదా? విధింప నేరదు. తానభ్యసించిన వేదములు ఫలవంతములగు కర్మములను బోధించునవని యెఱింగిన మానవుడు తన్నిర్ణయమునకై తదర్థ విచారమునందు స్వయముగానే ప్రవర్తించు చున్నాడు. అట్టి సమయమున కర్మములయందభిరుచిగలవాడు కర్మ విచారమునను, మోక్షమును కోరువాడు బ్రహ్మ విచారమునను ప్రవర్తించు చున్నాడు. కనుక విద్య కర్మాంగము గానేరదు. అథవా, వేదాధ్యయన విధివాక్యము పురుషుని వేదాధ్యయనము నందే గాక తదర్థ జ్ఞానము నందుగూడ ప్రవర్తింపజేయు చున్నదను పక్షమునను, విద్య కర్మాంగము గానేరదు. ఏలననిన, వేదార్థ జ్ఞానముపకంటె విద్య వేఱయినది. జ్యోతిష్టోమాది కర్మ స్వరూపమును గుఱించిన జ్ఞానమువకంటె తత్ఫల సాధన భూతమగు తత్కర్మానుష్ఠానము వేఱయినది గదా: అటులనే వేదార్థజ్ఞానరూపమగు బ్రహ్మస్వరూప జ్ఞానమునకంటె ధ్యానమనియును ఉపాసనమనియును జెప్పఁబడునట్టియు పురుషార్థ సాధనమగు విద్య వేఱయినది. అట్టి విద్యకు కర్మసంబంధము లేశమాత్రమయినను లేదు.

౧౩॥ సూ॥ నా విశేషాత్

టీ॥ అవిశేషాత్ = విశేష హేతువు శ్రుతియందుఁ గానఁబడకున్నందున, న = కర్మనియమము ఫలసాధన భూత స్వతంత్ర కర్మ విషయమయినది కాదు.

తా॥ విశేష హేతు వేదియును జెప్పబడకున్నందున "కుర్వన్నేవేహ కర్మాణి" ఇత్యాది శ్రుతిలోఁ జెప్పఁబడిన కర్మ నియమము ఫలసాధనభూతములగు స్వతంత్ర కర్మలను గుఱించినది కాదు.

శ్రీ॥ భా॥ "కుర్వన్నేవేహ కర్మాణి" ఇత్యాది శ్రుతివాక్యము బ్రహ్మవేత్తను జ్ఞానమునుండి మఱలించి యావజ్జీవము కర్మానుష్ఠానమునందు నియమించు చున్నదని పూర్వపక్షి జెప్పియుండె. అదియు నసంభవము. ఏలననిన, ఈ వాక్యము ఫలసాధన భూతములై దేనికి నంగములుగాని స్వతంత్రములగు కర్మలయందు జ్ఞానిని నియమించు చున్నదని నిరూపించు విశేష హేతువేదియయిన నిచట జెప్పఁబడియుండ లేదు. కాఁబట్టి యీవాక్యము బ్రహ్మవేత్తను బ్రహ్మవిద్యా సాధనమగు అనఁగా విద్యాంగమగు కర్మమునందు నియమించునదియునుగూడ గానవచ్చును. "కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః" అను శ్రీభగవద్గీతావాక్యము "బ్రహ్మవేత్తలగు జనక చక్రవర్తి మొదలగువా

రు బ్రహ్మవిద్యాంగముగ కర్మముల ననుష్ఠించినారని జెప్పుచున్నది. ఉపాసన ముగూడ యావజ్జీవ మనుష్ఠింప వలసినదియే గదా?

అవతారిక:—పూర్వసూత్రమున వేదార్థజ్ఞానమునకంటె ధ్యానమనం బడు విద్యవేఱయినదగుటనుబట్టి పూర్వపక్షమును తొలఁగించి, యిప్పుడు కుర్వన్నే వేహకర్మాణీత్యాది శ్రుత్యర్థమును దెలియఁ జేయుటకై

౧౪॥ సూ॥ స్తుతయేఽనుమతిర్వా

టీ॥ స్తుతయేవా = బ్రహ్మవిద్యను స్తుతించుటకొఱకే, అనుమతిః=అనుజ్ఞ(శ్రుతిచేనీయఁబడెను).

తా॥ కుర్వన్నేవేహకర్మాణీత్యాది శ్రుతిచే కర్మానుష్ఠానానుజ్ఞ బ్రహ్మవిద్యను స్తుతించుటకొఱకే యీయఁబడియెనని యెఱుంగఁదగును.

శ్రీ॥ భా॥ "ఈశావాస్య మిదంసర్వం" అనునది బ్రహ్మవిద్యా ప్రకరణమగుటంజేసి, అందు పఠింపఁబడినట్టి కుర్వన్నేవేహకర్మాణీత్యాది వాక్యమావిద్యాప్రకరణమున పఠింపబడినదగుటంజేసి విద్యను స్తుతించుటకుగానే యావజ్జీవము కర్మలననుష్ఠించునదియని నియమించుచున్నది. కావుననే "కుర్వన్నపి నలిప్యతే" అనువాక్యమున యావజ్జీవము కర్మలననుష్ఠించినను, బ్రహ్మవిద్యా సామర్థ్యమువలన నాకర్మములు బ్రహ్మవిద్యావంతుడగు కర్తతో సంబంధింపవని జెప్పుటచే విద్య స్తుతింపఁబడుచున్నది. "ఏవంత్వయి నాన్యథేతోఽస్తి న కర్మణా లిప్యతే నరః" అను వాక్యశేషముచే విద్వాంసుకు కర్మములచే బంధింపఁబడడని తెలుపబడియెను గదా! కాఁబట్టి విద్య కర్మమునకంగము గానేరదు.

౧౫॥ సూ॥ కామకారేణచైకే

టీ॥ చ = మఱియు, ఏకే = కొందఱు, కామకారేణ = స్వేచ్ఛచే (బ్రహ్మవిద్యానిష్ఠస్య=విద్వాంసునికి, గార్హస్థ్యత్యాగం = గృహస్థధర్మపరిత్యాగమును, అధీయతే=పఠించుచున్నారు.)

తా॥ కావుననేబ్రహ్మవిద్యానిష్ఠులు స్వేచ్ఛచే గార్హస్థ్యమును పరిత్యజించిరనికొన్నిశాఖలవారు పఠించుచున్నారు.

శ్రీ॥భా॥ కొన్ని శాఖలవారు "కింప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయంలోకః" అనఁగా బ్రహ్మవిద్యానిష్ఠులు బ్రహ్మప్రాప్తినిగోరు మనకు సంతానము నిష్ప్రయోజనమని భావించి స్వేచ్ఛచే గార్హస్థ్యమును త్యజించి

రని పఠించుచున్నారు. వాస్తవముగ బ్రహ్మవిద్య యజ్ఞాదికర్మముల కంగమగు పక్షమున బ్రహ్మవిద్యానిష్ఠులు గార్హస్థ్యధర్మమును బరిత్యజించుట యసంభవము గదా! కాఁబట్టి విద్య కర్మాంగము గానేరదు.

౧౬॥ సూ॥ ఉపమర్దంచ.

టీ॥ చ=మఱియు, ఉపమర్దం=కర్మవినాశమును (ఆమనన్తి=శ్రుతులు జెప్పుచున్నవి).

తా॥ మఱియు, విద్యామూలముగ కర్మవినాశముగలుగునని శ్రుతులుజెప్పుచున్నవి.

శ్రీ॥ భా॥ పుణ్యాపాపరూపమై సంసార దుఃఖములకు మూలభూతమగు కర్మము బ్రహ్మవిద్యచే నశించుచున్నదని వేదాంత వాక్యములన్నియు ను తెలుపుచున్నవి ఎట్లనిన,“భిద్యతే హృదయగ్రన్థిఃఛిద్యంతే సర్వసంశయాః। క్షీయన్తేచాస్యకర్మాణి తస్మిన్‌దృష్టేపరావరే. అనఁగా బ్రహ్మేశానాదులకంటె నుత్కృష్టుఁడగు పరమాత్మను ఉపాసించుటచే హృదయమునందుండు రాగద్వేషాదులు నశింపుచున్నవనియు సంశయములన్నియును విడిపోవుచున్నవనియు ప్రారబ్ధకర్మముతప్ప తక్కిన కర్మములన్నియును క్షీణించుచున్నవనియు నివ్విధముగ నుపనిషత్తులయందుఁ జెప్పబడియె.ఇట్లు బ్రహ్మవిద్యామూలమునఁ గలుగు కర్మవినాశము, బ్రహ్మవిద్య కర్మాంగమగు పక్షమున, సంభవింపదు.

౧౭॥ సూ॥ ఊర్ధ్వరేతస్సుచశబ్దేహి

టీ॥ చ=మఱియు, ఊర్ధ్వరేతస్సు=ఊర్ధ్వరేతస్కాశ్రమములయందు (విద్యా=బ్రహ్మోపాసనము, శ్రూయతే=వినఁబడుచున్నది, తే=అట్టి యాశ్రమములు) శబ్దే=వేదమునందు, హి=ప్రసిద్ధములు గదా.

తా॥ ఊర్ధ్వరేతస్కాశ్రమనిష్ఠులకు బ్రహ్మోపాసనము శ్రుతులయందు వినబడుచున్నది. అట్టి యాశ్రమములు శ్రుతిప్రసిద్ధములు గదా!

శ్రీ॥భా॥ *ఊర్ధ్వరేతస్కాశ్రమనిష్ఠులకు బ్రహ్మవిద్యయున్నట్లు శ్రుతులు

---

* ఏ యాశ్రమములయందు ఈ పురుషునికి స్త్రీసంబంధము బొత్తుగ లేదో,అవి యూర్ధ్వరేతస్కము లనఁబడు చున్నవి. అవి సాధారణముగ బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసాశ్రమములు గావచ్చును. ఈ యాశ్రమ విశేషములు కాణ్వాయన స్మృతియం దిట్లు వివరింపఁ బడినవి.

తెలుపుచున్నవి. వారికగ్నిహోత్ర ధర్మపూర్ణమాస్యాది కర్మములన్నవో, లేవు. ఇందువలన బ్రహ్మవిద్య యగ్నిహోత్రాది కర్మముల కంగము గాదని స్పష్టమగుచున్నది.

---

౧. గాయత్ర, బ్రాహ్మ, ప్రాజాపత్య, బృహత్తులని బ్రహ్మచారి నాల్గు విధములు. ఉపనయనానంతరము మూఁడుదినములు క్షార లవణ వర్జితముగ భుజింపుచు గాయత్రిని బఠించువాడు గాయత్రుఁడు. వేదగ్రహణ పర్యంతము బ్రహ్మచర్యము నలుపువాడు బ్రాహ్మఁడు. ఋతుకాలమందే స్వభార్యను బొందుచు నిత్యమును బరస్త్రీ విముఖుఁడుగ నుండువాడు ప్రాజాపత్యుఁడు; ఒండె నొకసంవత్సరము వేదవ్రతము నాచరించువాడు ప్రాజాపత్యుఁడు. మరణపర్యంతము గురుకులవాసియై నైష్ఠికుఁడుగ నుండువాడు బృహత్తు.

౨. వార్తాక, శాలీన, యాయావర, ఘోరసన్న్యాసికులని గృహస్థు నాల్గువిధములు. కృషి గోరక్షాదులను జేసికొని వైశ్యాదివృత్తిచే జీవించుచు నిత్యనైమిత్తికాది క్రియాపరుఁడగువాడు వార్తాకుఁడు. యాజనాధ్యాపన ప్రతిగ్రహ విముఖుఁడై యయాచితవృత్తిచే జీవించువాడు యాయావరుఁడు. షట్కర్మ నిరతుఁడై యాజనాది వృత్తులచే నార్జించువాడు శాలీనుఁడు. వడకట్టిన శుద్ధజలములతో స్వకార్యముల నిర్వర్తించి ప్రత్యహమును హింసావిముఖతచే శిలోంఛ వృత్తికుఁడై గ్రామవాసియగువాడు ఘోరసన్న్యాసికుఁడు.

౩. వైఖానస, ఔదుంబర, వాలఖిల్య, ఫేనపులని వానప్రస్థులు నాల్గువిధములు. గ్రామములకు వెలపల దున్నని భూమియందుఁ బండిన ధాన్యములతో నగ్నిహోత్రాదులను జేయుచుండువాడు వైఖానసుఁడు. ప్రొద్దున లేచి యే దిశనుజూచునో యటుపోయి యందున్న యౌదుంబరీ బదర నీవార శ్యామాకాదులచే గర్మముల నాచరించు వాడౌదుంబరుఁడు. జటావల్కలధారియై యెనిమిదిమాసము లార్జించి, యట్లార్జించినదానిని దక్కుఁడు నాల్గు మాసములయందు భుజింపుచు మిగిలినవానిని గార్తికమాసమునఁ బరిత్యజించువాడు వాలఖిల్యుఁడు. స్వచ్ఛందముగ రాలిన పర్ణఫలముల భుజింపుచు నెచ్చటనైననుండి కర్మముల నాచరించువాడు ఫేనపుఁడు.

౪. కుటీచక, బహూదక, హంస, పరమహంసలని పరివ్రాజకులు నాల్గు తెఱఁగులు. స్వపుత్ర గృహమున భిక్షను జేయుచుఁ ద్రిదండులయియుండువారు కుటీచకులు. త్రిదండులును శిక్య కమండలు పాదుకాసన శిఖాయజ్ఞోపవీత కౌపీన కాషాయ వేషధరులును దీర్ఘయాత్రాపరులునునై భిక్షమును జేసికొనుచు

శంక :—"యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది శ్రుతివాక్యము బ్రతికియున్నంతవర కగ్నిహోత్ర దర్శపూర్ణమాస్యాదికర్మముల నాచరింపవలయునని విధించుటచే, అగ్నిహోత్రాది కర్మరహితమై యూర్ధ్వరేతస్క మనఁబడు నాశ్రమమే లేనట్లు తెలియుచున్నది. ఒకవేళ, స్మృతియందట్టి యాశ్రమము జెప్పబడుచున్న దనియెదవా? అట్లుచెప్పుటకు నవకాశము లేదు. శ్రుతివిరుద్ధములగు స్మృతులు ప్రామాణికములు గావుగదా?

సమాధానము:—ఊర్ధ్వరేతస్కాశ్రమములు శ్రుతులయందుఁబలుతావుల వినబడుచున్నవి. ఎట్లనిన, "త్రయోధర్మ స్కంధాః" (ఆశ్రమములుఁమూడనియు "యేచామేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" (ఎవ్వరు అరణ్యమునను౦డి శ్రద్ధతో తపస్సనఁబడు బ్రహ్మము నుపాసించు చున్నారో) అనియు, "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజంతి" (ఈలోకమును బొందుట కిచ్ఛయించువారై వైరాగ్యవంతులు సన్యసించు చున్నారు)అనియు నీమొదలగు తావులయం దూర్ధ్వ రేతస్కాశ్రమములు వినబడుచున్నవి. కాఁబట్టి "యావజ్జీ మగ్నిహోత్రం జుహూయాత్" ఇత్యాది శ్రుతి సంసార విరక్తులుగాని వారిని గుఱించి మాత్రమె యావజ్జీవ మగ్నిహోత్రాది కర్మముల ననుష్ఠింపవలయునని విధించుచున్నటుల నెఱుంగునది.

౧౮॥ సూ॥ పరామర్శం జైమిని రచోదనాచ్చాపవదతి

టీ॥ జైమినిః = జైమినాచార్యుడు, పరామర్శం (స్కంధ శ్రుతియం దూర్ధ్వరేతస్క శ్రమములయొక్క) యనువాదమును, (మన్యతే=తలంచుచున్నాఁడు), హి=ఏలననఁగా, అచోదనాత్=ఆ శ్రుతియందు విధి లేను. చ = మఱియుఅపవదతి=(శ్రుత్యంతర మట్టి యాశ్రమములను) నిషేధింపు చున్నది.

తా॥ "త్రయోధర్మ స్కంధాః" ఇత్యాది వాక్యమున నూర్ధ్వరేతస్కాశ్రమము లను వదింపఁబడుచున్నవియే గాని, యవి యచట విధింపఁబడుచుండ లేదని శ్రీజైమిన్యాచార్యులవారు తలఁచుచున్నాఁరు. ఏలననిన, అచట

---

నాత్మధ్యానము సల్పువారు బహూదకులు. ఏకదండులును శిఖావర్జముగ యజ్ఞోపవీతధారులును శిక్యకమండలు పాణులును గ్రామైక రాత్రవాసులును గృచ్ఛ్రి చాంద్రాయణ పరులును నగువారు హంసలు. ఏకదండ ధరులును శిఖాయజ్ఞోపవీత రహితులును సర్వకర్మ వర్జితులును నాత్మ నిష్ఠులు నగువారు పరమ హంసలు.

విధి వాచకమగు శబ్ద మేదియును లేదు సరియేగదా శ్రుత్యంతర మట్టి యా శ్రమములను నిషేధింపు చున్నది.

శ్రీ॥ భా॥ శ్రుతులయందే "త్రయోధర్మ స్కంధాః" ఈ మొదలగు తావుల నూర్ధ్వ రేతస్కము లనంబడు ఆశ్రమములు వినఁబడుచున్నవి గాన నట్టి యాశ్రమములు గలవని పూర్వసూత్రమునఁ బ్రతిపాదింపఁబడియెనుగాని యది యుక్తము గాదు. ఏలయన, "త్రయో ధర్మ స్కంధాః" ఇత్యాది శ్రుతి వాక్యములు ఆయాశ్రమములను పరామర్శించు చున్నవి, అనఁగా ననువదించుచున్నవి గాని, వాటిని విధించుచుండ లేదు. ఆ శ్రుతులయందు విధివాచకము లగు లిఙ్, లోట్, తవ్య ప్రత్యయము లేవియును లేవు గదా. అయితే "త్రయో ధర్మ స్కంధాః" ఇత్యాది వాక్యము ప్రకృతమగు బ్రహ్మోపాసనమును బ్రణవముచే స్తుతింపు చున్నది. కనుకనే "బ్రహ్మసంస్థో ఽమృత త్వమేతి" (బ్రహ్మోపాసన నిష్ఠుఁడు అమృతత్వమును అనఁగా మోక్షమును బొందుచున్నాఁడు)అను ఉప సంహార వాక్యమున బ్రహ్మోపాసనము పరామర్శింపఁ బడియె. కనుక ప్రయోజనాంతరమునకై యిచ్చట ఊర్ధ్వరే తస్కాశ్రమముల యనువాదము మాత్రమే జేయఁబడినదని స్పష్ట మగుచున్నది. "యేచేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే"అను వాక్యము దేవయానవిధితో సంబంధించిన దయినందున నచటను గూడ నాశ్రమాంతరము విధింపఁబడుట యసంభవము. ఇంతియెకాక, "వీరహవా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయతే" ఇత్యాది శ్రుతివాక్యమే "అగ్న్యుద్వాసనమును జేసినవాడు మనుష్య హత్య జేసినవాడే"యనుచు గృహస్థా శ్రమమునకంటె నన్యమగు నాశ్రమమును అనఁగా నగ్నిహోత్రాది రహితమగు నాశ్రమాంతరమును నిషేధింపు చున్నది గదా! కనుకనూర్ధ్వ రేతస్కము లనంబడు ఆశ్రమములు లేనే లేవని శ్రీజైమిన్యాచార్యులవారు తలఁచుచున్నారు.

౧౯॥ సూ॥ అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః

టీ॥ సామ్యశ్రుతేః = గృహస్థోర్ధ్వరే తస్కాశ్రమములు శ్రుతియందు సమానముగ జెప్పఁబడుటవలన, అనుష్ఠేయం = ఊర్ధ్వరేతస్కాశ్రమములనుష్ఠేయములని, బాదరాయణః=కృష్ణద్వైపాయనుడు (మన్యతే=తలఁచుచున్నాఁడు)

తా॥ శ్రుతిసామ్యమునుబట్టి యూర్ధ్వరేతస్కాశ్రమముగూడ ననుష్ఠేయమే యని కృష్ణద్వైపాయనుఁడు తలఁచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ గృహస్థాశ్రమమువలె నితరాశ్రమములు సయిత మనుష్ఠేయ ములని శ్రీబాదరాయణుఁడు తలఁచుచున్నాఁడు. పూర్వపక్షి కభిమతమగు గృహస్థాశ్రమమువలె నితరాశ్రమములు గూడ శ్రుతులయందు వినబడుచున్నవి గదా! ఎట్లనిన, «త్రయో ధర్మ స్కన్ధాః'' ఇత్యాది శ్రుతివాక్యము బ్రహ్మనిష్ఠను స్తుతించుటకై గృహస్థాశ్రమమును పరామర్శించుచు నటువలె నితరాశ్రమ ములనుగూడ పరామర్శించు చున్నది. ఇటుల నీశ్రుతి బ్రహ్మనిష్ఠను స్తుతించు టకై గృహస్థాశ్రమమును పరామర్శించు చున్నదని యంగీకరించు పక్షమున, గృహస్థాశ్రమ మింతకుపూర్వ మొకతావునవిధింపఁబడినదై యీతావునననువ దింపఁ బడుచున్నదని యొప్పుకొనవలయును. ఇచట పేర్కొనఁబడినట్టియితరాశ్ర మములుగూడ నట్టివియే గదా. అయితే ఈ శ్రుతియందుఁ బేర్కొనంబడిన యజ్ఞము అధ్యయనము దానము తపస్సుబ్రహ్మచర్యము ఇవియన్నియును గృ హస్థాశ్రమ ధర్మములే యని జెప్పనేరము. వాటిలో తపోబ్రహ్మ చర్యములు గృహస్థునికి మాత్రమే యుండునవి యని జెప్పనేరము. గదా ! అటుల ఇచట పేర్కొనఁబడిన యజ్ఞాధ్యయనాదు లన్నియును గృహస్థాశ్రమ ధర్మములే యను పక్షమున «త్రయోధర్మస్కంధాః'' అను శ్రుతివాక్యము ధర్మస్కంధములు అనఁగా ధర్మాశ్రయములు (ఆశ్రమములు) మూడనుటయు అనంతర మీ మూ ఁడింటిని మొదటి దనియు రెండవ దనియు మూఁడవ దనియు నివ్విధముగ విభజించుటయు ననుప పన్నమగును. కనుక నీశ్రుతియందుఁ బేర్కొనంబడిన ధర్మములలో యజ్ఞ దానా ధ్యయనములు మాత్రము గృహస్థాశ్రమ ధర్మము లు. అధ్యయనమనఁగా నిచట వేదాభ్యాసమని యెఱుంగునది. తపస్సనునది కాయక్లేశ సాధ్యముగాన నది వానప్రస్థులయొక్కయు సన్యాసుల యొక్కయు ను ధర్మము. బ్రహ్మచర్య మనునది బ్రహ్మచర్యాశ్రమ ధర్మము. ఇటుల నీవా క్యము బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములను పేర్కొనుచున్నది. మఱియు «బ్రహ్మసంస్థోఽమృతత్త్వమేతి'' అను తరువాతి వాక్యమునందుండు« బ్రహ్మ సంస్థ'' శబ్దము «బ్రహ్మణి సమ్యక్ తిష్ఠతి'' అను వ్యుత్పత్తిసిద్ధమయినది గాన, నది యౌగిక శబ్దము. కావున నది బ్రహ్మనిష్ఠుఁడుగా నుండు స్థితిని దెలుపు నది. అట్టి స్థితి బ్రహ్మచర్యాది చతురాశ్రమముల వారికిని సంభవము. కావు న నిది యందఱికిని సమానమే. కనుక « త్రయోధర్మస్కంధాః'' అనునది మొదలుకొని «బ్రహ్మసంస్థోఽమృతత్త్వమేతి'' అనువరకు నీ శ్రుతివాక్యము బ్రహ్మనిష్ఠ లేక కేవల బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మములను మాత్ర మనుష్ఠిం

26

చుపారు పుణ్యలోకమును బొందుచున్నారనియు, అట్టి బ్రహ్మనిష్ఠను గూడ గలిగియున్నట్టి యాశ్రమ ధర్మనిష్ఠులు మోక్షమును బొందుచున్నా రనియును జెప్పుచున్నది. శ్రీపరాశరుల వారుగూడ, "ప్రాజాపత్యం బ్రహ్మణానాం" అని యారంభించి "బ్రాహ్మం సన్న్యాసినాం స్మృతం" అను పర్యంతము కేవల వర్ణాశ్రమ ధర్మములను మాత్ర మనుష్ఠించు వారలకు చతుర్ముఖ బ్రహ్మలోక ప్రాప్తివరకు ఫలములను జెప్పి, యనంతరము "ఏకాంతినస్సదా బ్రహ్మధ్యాయినో యోగినోహి యే। తేషాం తత్పరమం స్థానం యద్వై పశ్యంతి సూరయః" అను శ్లోకమున, అట్టి యాశ్రమ ధర్మనిష్ఠులలో నేకాంతమున నెల్లప్పుడు పరబ్రహ్మమును ధ్యానించునట్టి యోగులు మాత్రము నిత్యసూరులచే నెల్లప్పుడు సేవింపఁబడుచుండు పరమపదమును బొందుచున్నారనుచు నింతకు పూర్వము పేర్కొనంబడిన బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములవారిలో బ్రహ్మధ్యానపరులకు మోక్షము జెప్పుటచే నీశ్రుతిచే జెప్పఁబడిన యంశమునే స్పష్టపఱచియున్నారు. ఇట్లు గృహస్థాశ్రమమువలె తదితరములగు నూర్ధ్వ రేతస్కాశ్రమములుగూడ శాస్త్రమునందు గన్పట్టుచుండుటంజేసి గృహస్థాశ్రమమువలె నవియు ననుష్ఠేయములు. "యేచేమే రణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" అను వాక్యముచే విధింపఁబడిన దేవయానము ఆ శ్రుతియందలి "అరణ్యే" అను శబ్దముచే దెలియచేయబడిన తపస్సు ప్రధానముగాగల వానప్రస్థ సన్న్యాసాశ్రమములతో సంబంధించినది గాన నిచటను వానప్రస్థ సన్న్యాసాశ్రమములు వినఁబడుచున్నవని యంగీకరింప వలయును॥

అవతారిక:—అనువాద పక్షమునఁ గాని, విధి పక్షమునఁగాని, గృహస్థాశ్రమమువలె తదితరములగు నూర్ధ్వ రేతస్కాశ్రమములు గూడ ననుష్ఠేయములని పూర్వసూత్రముచే ప్రతిపాదించి, యిప్పు డాయాశ్రమము లిచట విధింపఁబడు చున్నవేకాని, యనువదింపఁబడు చుండలేదని యుపపాదించుటకై

**౨౦॥ సూ॥ విధిర్వాధారణవత్**

టీ॥ ధారణవత్=ఉపరిధారణమువలెనే, విధిః- వా=(స్కంధశ్రుతి)యాశ్రమ విధిపరమే.

తా॥స్కంధ శ్రుతి యుపరిధారణమును గుఱించిన శ్రుతివలె విధిపరమే యనఁదగును.

శ్రీ॥ భా॥ "అధస్తా త్సమిధంధార యన్ననుద్రవేదు పరిదేవేభ్యోధారయతి" అను శ్రుతివాక్యము మహా పితృ యజ్ఞమందలి ప్రేతాగ్నిహోత్రమున

స్రుక్కులలో నుంచబడిన హవిస్సును నాహవనీయాగ్ని యొద్దకు దీసికొనిపోవు నప్పుడు ఆహవిస్సునకు క్రింద సమిధను ధరించి పోవలయును. దేవతా కర్మం యందు కర్త సమిత్తును హవిస్సునకు పైభాగమున ధరించును గద్యా).అని తెలుపుచున్నది. అయితే ఈ శ్రుతి అనువాద రూపమయినదయినను యీ వాక్యముచే నధోధారణమువలెను ఉపరిధారణముగూడ విధింపఁబడుచున్నదా? లేక ఉపరిధారణ మనువదింపఁ బడుచున్నదా యని శంకించి, యుపరిధారణ మింతకు పూర్వ మెచటను విధింపఁబడి యుండమిచే యప్రాప్త మయినది గాన నదియు నావాక్యముచే విధింపఁబడుచున్నదని శేషలక్షణమున «విధిర్వా ధారణేఽపూర్వత్వాత్ '' అను సూత్రమున దెలుపఁబడెను. అదే న్యాయ ప్రకార మిచటనుగూడ «త్రయోధర్మస్కంధాః'' అను శ్రుతివాక్యమున పేర్కొనంబడిన బ్రహ్మచర్యాది చతురాశ్రమములు మఱియేతావున విధింపఁబడినటుల గానంబడ కుండుటచే నప్రాప్తములయినవి. కావున నవి యీశ్రుతిచే విధింపఁబడు చున్నవనుట యుక్తము. «బ్రహ్మచర్యం సమాప్య గృహీభవేత్ గృహాద్వనీభూత్వా ప్రవ్రజేత్ యదివేతరథా బ్రహ్మచర్యాదేవప్రవ్రజేత్ '' (బ్రహ్మచర్యమును సమాప్తిజేసి గృహస్థాశ్రమము నవలంబింపవలయును. గృహస్థుఁడై వానప్రస్థాశ్రమము నవలంబింప వలయును. వానప్రస్థుడై సన్యసింప వలయును. అట్లుకాకున్న, బ్రహ్మచర్యమునుండియే సన్యసింపవలయును. గృహస్థాశ్రమమునుండిగాని వానప్రస్థాశ్రమమునుండిగాని సన్యసింపవలయును. అనఁగా నేరోజున వైరాగ్యము గలుగుచున్నదో, ఆరోజుననే సన్యసింపవలయును) అనుచు బ్రహ్మచర్యాది చతురాశ్రమములనువిధించు జాబాలవాక్యమున్నను దానిని లేనిదానినివలెఁజేసి, «త్రయోధర్మస్కంధాః'' ఇత్యాది శ్రుతివాక్యములు అన్యపరములయినను అనఁగా బ్రహ్మ సంస్థను స్తుతించుటయే ప్రధానముగాగలవయినను వాటియందే బ్రహ్మచర్యాది చతురాశ్రమములును విధింపఁబడి నట్లవశ్యాంగీకర్తవ్యమని యీసూత్రము ప్రతిపాదింపుచున్నది.

ఇట్లు (కర్మప్రధానమగు) గృహస్థాశ్రమమేకాక, (కర్మప్రధానములుగాని) బ్రహ్మచర్య, వానప్రస్థ సన్యాసాశ్రమములుగూడ శ్రుతులయందు విధింపఁబడుచుండుటంబట్టి, ఋణశ్రుతియు (అనఁగా దేవాది ఋణమును దీర్చుకొనుటకై యజ్ఞాదికర్మముల నొనర్చవలయునను శ్రుతియు) యావజ్జీవ శ్రుతియు (అనఁగా బ్రతికియున్నంతవరకు కర్మముల నాచరింప వలయునను శ్రుతియు) అపవాద శ్రుతియును (అనఁగా కర్మత్యాగమును నిషేధించు శ్రుతియును) సంసారమునుండి

విరక్తులు గాని వారిని గుఱించి ప్రవర్తించినవే యని యెఱుంగునది. కనుక బ్రహ్మవేత్తలకుగూడ శరీర వియోగము వఱకు కర్మము లనుష్ఠేయములని విధించునట్టి యితర శ్రుతులును స్మృతులును వారివారి యాశ్రమ ధర్మములను మాత్రమె అట్లు విధించు చున్నవి. ఇటు (కర్మరహితులగు) ఊర్ధ్వరేతస్కులకు బ్రహ్మవిద్య విధింపఁ బడుచుండుటచే బ్రహ్మవిద్య కర్మాంగము గానేరదు. కాఁబట్టి బ్రహ్మవిద్యయే పురుషార్థ హేతువని సిద్ధ మగుచున్నది.

పురుషార్థాధికరణము ముగిసెను.



## స్తుతిమాత్రాధికరణము.

### ౨౧॥ సూ॥ స్తుతిమాత్ర ముపాదానాదితిచేన్నా పూర్వత్వాత్

టీ॥ ఉపాదానాత్=కర్మాంగములగు నుద్గీథాదుల నవలంబించుటవలన, స్తుతిమాత్రం=(రసతమత్వాది శ్రుతి) కేవల మర్థవాదము, ఇతిచేత్=ఇట్టిదని యంటి వేని, అపూర్వత్వాత్=అది యపూర్వ మగుటవలన, న=అట్లుచెప్పఁదగదు.

తా॥ కర్మాంగములగు నుద్గీథాదుల నవలంబించి రసతమత్వాది గుణములు చెప్పబడుటచే నవి స్తుత్యర్థము లంటివేని, యట్లు చెప్పఁదగదు. ఏలన నిన, ఆగుణములు ప్రమాణాంతరాప్రాప్తము లగుటచే విధ్యర్థము లనుట యుక్తము.

శ్రీ॥ భా॥ ఛందోగులు "స ఏష రసానాం రసతమః పరమః పరార్థ్యో ఽష్టమో యదుద్గీథః" (ఉద్గీథమురసతమ మయినదియు పరమాత్మోపాసనమునకు ముఖ్యస్థానమైనదియు పృథివ్యాది భూతములందు నిరూపింపఁబడిన రసతమత్వాది సంఖ్యలలో నెనిమిదవదియయి యింతకంటె వేఱుగా అతిశయమయినదిగాని సారతరమయినదిగాని లేనిదియును) అని యివ్విధముగ పఠించుచున్నారు. ఇచట నొక సంశయము గలుగు చున్నది.

## సంశయము.

ఈ పైవాక్యములు క్రత్వంగములగు నుద్గీథాదులనుస్తుతించుటకై యీ విధముగ జెప్పుచున్నవా? కాక, ఇవి యుద్గీథాదులను రసతమత్వాది గుణ యుక్తములనెడి భావనతో నుపాసింప వలయుననెడి విధి నొకదానిని విధించు చున్నవా?

### పూర్వపక్షము.

కర్మాంగములగు నుద్గీథాదులనుగుఱించి రసతమత్వాది గుణములను జెప్పునవి యగుటచే నీవాక్యములు స్తుతిపరములు. ఎటువలెననిన “ఇయమేవ జుహూః స్వర్గలోక మాహవనీయః” ఇత్యాది వాక్యములు(ఈ జుహువు భూమియే ఆవహనీయము స్వర్గలోకమే) యనుచు జుహ్వాదుల నవలంబించి పృథివ్యాదులను ప్రతిపాదించు చుండుటంజేసి జుహ్వాది స్తుతిపరములుగ గ్రహింపబడు చుండలేదా? అటువలెనే యీ పైశ్రుతి వాక్యములును కర్మాంగ భూతములగు నుద్గీథాదుల నవలంబించి రస తమత్వాది గుణములను ప్రతిపాదించు చుండుటంజేసి యవి యుద్గీథాదులను స్తుతి జేయునవి యనుట యుక్తమనినచో

### సిద్ధాంతము.

ఈ పైనియుదహరింపఁబడిన శ్రుతులు యుద్గీథాదులను స్తుతించుటకై ప్రవర్తించినవి కావు. ఏలయనిన,|ఇంతకు పూర్వ మేదియయినప్రమాణముచే నుద్గీథాదు లత్యంత రసయుక్తము లయినట్లు తెలియఁజేయఁబడినచో, నట్టి ప్రాశస్త్యమునుగుఱించి విశ్వాసమును బుట్టించుటకై యీ శ్రుతివాక్యము లుద్గీథాదులను స్తుతిజేయు నవియనవచ్చును. అయితే యుద్గీథాదులటుల రసతమత్వాది గుణయుక్తము లయినటులనేప్రమాణముచేతను దెలియఁజేయఁబడి యుండలేదు. మఱియు ఉద్గీథాదులను విధించువాక్యమైనను “స ఏష రస తమః” ఇత్యాది శ్రుతివాక్యమునకు సమీపమున లేదు. అట్లున్నచో, నిది దానితో నేకవాక్యత గలదయినందున “ఇయమేవ జుహూః” ఇత్యాదివాక్యముజుహ్వాదులను పృథివ్యాదులనుగా ప్రతిపాదించుచు వాటిని స్తుతించునదయినట్లు, “స ఏష రస తమః” అను వాక్యముగూడ యేదొకవిధమున స్తుతిపరమని గ్రహింపవచ్చును.కనుక క్రతువుల నెక్కువ ఫలమునిచ్చు సామర్థ్యముగల వాటినిగ జేయుటకై క్రత్వంగములగు నుద్గీథాదులను రస తమత్వాది గుణములు గల వాటినిగ నుపాసింప వలయునని “స ఏష రసానాం రస తమః” ఇత్యాది వాక్యములు విధించు చున్నవనుటయుక్తము.

### ౨౨॥ సూ॥ భావ శబ్దాచ్చ

టీ॥ భావ శబ్దాత్-చ=విధివచనము వలనను, రస తమాది శ్రుతులు ఉపాసనా విధానార్థములు.

తా॥ "ఉద్గీథ ముపాసీత" ఇత్యాది శ్రుతులలో విధివాచక శబ్దములు వినఁబడుట వలనను రస తమత్వాదిప్రతిపాదక శ్రుతు లుపాసన విధానార్థములు.

శ్రీ॥ భా॥ "ఉద్గీథ ముపాసీత" ఇత్యాది వాక్యములలో "ఉపాసీత" యీ మొదలుగాగల విధిశబ్దములు వినబడుచున్నందున నీవాక్యములు విధిపరములనుట న్యాయము. విధి ప్రత్యయ యుక్తమయిన క్రియాశబ్దము విధినిగడా తెలుపును. కనుక నీశ్రుతులు ఉపాసనమును విధించు నవియే.

స్తుతిమాత్రాధికరణము ముగిసెను.

## పా రి ప్ల వా ర్థా ధి క ర ణ ము.

### ౨౩॥ సూ॥ పారి ప్లవార్థా ఇతిచేన్న విశేషి తత్వాత్

టీ॥ (ఆఖ్యాయికాః=కథలు, పారిప్లవార్థాః ఇతిచేత్=పారిప్లవార్థము లంటివేని, న=అది సరికాదు, (ఏలననఁగా) విశేషితత్వాత్=ప్రత్యేకముగ జెప్పఁబడినందున,

తా॥ ఆఖ్యాయికలు పారిప్లవార్థము లంటివేని,యది యుక్తము కాదు. అవిప్రత్యేకముగ చెప్పఁబడి యున్నది.

శ్రీ॥ భా॥ "ప్రతర్దనోహవై దైవోదాసి రింద్రస్య ప్రియం ధామోపజగామ" "శ్వేతకేతు ర్హారుణేయ ఆస" ఇటుల వేదాంత పఠితములగు నాఖ్యాయికలు * పారిప్లవ ప్రయోగార్థములా? కాక, సన్నిహిత విద్యా విశేషమును ప్రతిపాదించుటకుగానుప్రవృత్తములా?

#### పూ ర్వ ప క్ష ము.

"ఆఖ్యానాని శంసంతి" అను విధివాక్యము అఖ్యాయికలు పారిప్లవమందు బ్రయోగింపఁ బడవలయునని విధించుచుండుటచే నవి విద్యాప్రధానములనుట న్యాయము గాదనినచో,

#### సి ద్ధా ం త ము.

ఆఖ్యాయికలన్నియును అనఁగా వేదాంత పఠితములగు నాఖ్యాయికలు గూడ పారిప్లవార్థము లనుట యుక్తము గాదు. ఏలయనిన పారిప్లవ సంబంధులగు నాఖ్యాయికలు ప్రత్యేకముగ జెప్పఁబడినవి. శ్రుతి "ఆఖ్యానాని శంసం

* అశ్వమేధయాగమునందు స్వపుత్రాది పరివృతుడైన రాజునకు నానావిధా ఖ్యాయికలను జెప్పుట పారిప్లవ మనఁబడును.

తి'' అని యుపక్రమించి «మనుర్వైవ స్వతో రాజా'' ఇత్యాది వాక్యములచే మన్వాద్యాఖ్యాయికలను మాత్రమే పారిప్లవార్థముగ ప్రయోగింప వలయునని విశేషించి చెప్పుచున్నది. కనుకనట్టి మన్వాద్యాఖ్యాయికలు మాత్రము పారిప్లవమున ప్రయోగింపఁ బడుచున్నవని స్పష్టమగుచున్నది. కనుక వేదాంత పఠితములగు నాఖ్యాయిక లన్నియును పారిప్లవార్థము ప్రయోగింపఁ బడునవి గావు. అయితే అవి విద్యా విశేషమును విధించుటకుగా నుపయోగింపఁ బడు చున్నవి.

౨౪॥ సూ॥ తథా చైక వాక్యోప బంధాత్

టీ॥ తథాచ=అట్లగునేని, ఏకవాక్యోపబన్ధాత్ = ఏకవాక్యత సిద్ధించుటవలన,

తా॥ అట్లు గొనినచో, ఏవాక్యత సిద్ధించును.

శ్రీ॥ భా॥ వేదాంత పఠితములగు నాఖ్యాయికలకు «ఆత్మావాఽరే ద్రష్టవ్య''ఇత్యాది విద్యా ప్రతిపాదక వాక్యములతో నేకవాక్యత గన్పట్టుచున్నం దున నవి విద్యా విశేష ప్రతిపాద నార్థములని విదిత మగుచున్నది. ఎట్లని న, «సోఽరోదీత్'' లోనగు నాఖ్యాయికలు సన్నిహితములగు కర్మవిధులకు గా నున్నవి గాని, పారిప్లవార్థములుగ లేవు గదా. అట్లేప్రకృతమున నెఱుంగునది.

పారిప్లవార్థాధికరణము ముగిసెను.

అగ్నీంధనాధికరణము.

౨౫॥ సూ॥ అత:ఏవచాగ్నీ న్ధనాద్య నపేక్షా

టీ॥ అతఏవ=కనుకనే, విద్యా=ఊర్ధ్వరేతస్కాద్యాశ్రమస్థులబ్రహ్మవిద్య, అగ్నీన్ధనాద్యనపేక్షా=అగ్న్యాధానాదికర్మములనపేక్షించునది గాదు.

తా॥ కనుకనే యూర్ధ్వరేతస్కాద్యాశ్రమస్థులకుఁగల బ్రహ్మవిద్యకు అగ్న్యాధానాది కర్మ్మముల సహకార మనావశ్యకము.

శ్రీ॥ భా॥ ప్రథమాధి కరణమున స్తుత్యర్థ ప్రసక్తిరాగా ప్రసంగ వశమున ద్వితీయ తృతీయాధి కరణములయందు ఉద్గీథాదులను రసతమములుగనను సంధించుకొొన వలయునను నది విధి గాని,స్తుతి గాదనియు,వేదాంత పఠితములగు నాఖ్యాయికలు విద్యా విశేష స్థాపకములుగాని పారిప్లవార్థములు గావనియు నీరెండు విషయములను ప్రతిపాదించిరి. ప్రథమాధి కరణమునందలి «ఊ

ర్ధ్వరేత స్సుచశబ్దేహి" ఇత్యాదిసూత్రములచే ఊర్ధ్వరేతస్కా-శ్రమనిష్ఠులుబ్రహ్మవిద్యా వంతులు గలరని జెప్పఁబడియె. ఇప్పు డాయూర్ధ్వ రేతస్కా-శ్రమ నిష్ఠులకు యజ్ఞాది కర్మములు లేవు గాన, నట్టి కర్మములచే సాధింపఁ బడు నట్టి బ్రహ్మవిద్యవారలకు సంభవము గాదని శంకింపగా, నిట్లు జెప్పుచున్నారు.

ఊర్ధ్వ రేతస్కా-శ్రమ నిష్ఠులు బ్రహ్మవిద్యతో సంబంధించినటుల శ్రుతులవలనఁ దెలియఁబడు చున్నది. ఏలయనిన, "బ్రహ్మసంస్థో అమృతత్వమేతి" "ఏతే మేరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" ఇత్యాది ఛాందోగ్యవాక్యములు యేయాశ్రమమునందు నున్నను బ్రహ్మవిద్యా నిష్ఠుఁడు జన్మ మరణ రహితముగు మోక్షమును బొందుచున్నాడనియు, అరణ్యమున శ్రద్ధతో తపస్సనుబ్రహ్మమునుపాసన జేయువారు బ్రహ్మను బొందుచున్నా రనియును జెప్పుచుండుట వలనను "ఏతమేవ ప్రవ్రాజనో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి" అను బృహదారణ్యవాక్యము సన్యాసులు బ్రహ్మప్రాప్తినిగోరి తమ యాశ్రమమును గ్రహించుకొను చున్నారనియు జెప్పుచుండుట వలనను "యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి" అను కఠోప నిషద్వాక్యము మొదలగునవి జనులీ బ్రహ్మప్రాప్తినిగోరి బ్రహ్మచర్యము ననుష్ఠించు చున్నారనియు నీవిధము జెప్పుచుండుటవలన నూర్ధ్వరేతస్కా-శ్రమ నిష్ఠులకు బ్రహ్మవిద్యతో సంబంధమున్నట్లు శ్రుతులవలననే స్పష్టమగుచున్నది. కనుక నూర్ధ్వరేతస్కా-శ్రమ నిష్ఠులకు బ్రహ్మవిద్య తత్సాధనభూతములగు నగ్న్యాధానాదికర్మముల సపేక్షింపకయే గలుగు చున్నది. అనఁగా వారుబ్రహ్మవిద్యా ప్రాప్తికిగాను అగ్న్యాధాన పూర్వకములగు అగ్నిష్టోమియదర్శపూర్ణ మాస్యాది కర్మముల నాచరింప నవసరము లేదు. ఊర్ధ్వ రేతస్కుఁడుగాని సాధారణునికి మాత్రమే బ్రహ్మవిద్యా ప్రాప్తికిగాను యజ్ఞాది విహితకర్మముల నాచరింప వలయు ననుట.

అగ్నిష్ఠనాద్యధికరణము ముగిసెను.

—•—

సర్వాపేక్షాధి కరణము.

౨౬॥ సూ॥ సర్వాపేక్షా చయజ్ఞాది శ్రుతేరశ్వవత్

టీ॥ యజ్ఞాదిశ్రుతేః=యజ్ఞేన దానేనేత్యాది శ్రుతినిబట్టి, సర్వాపేక్షాచ=విద్య సర్వాశ్రమ కర్మాపేక్షగలది, ఎట్లనిన, అశ్వవత్=గుఱ్ఱము వలెనే,

తా॥ యజ్ఞేన దానేనేత్యాది శ్రుతినిబట్టి విద్య సర్వాశ్రమ కర్మములనపేక్షించుచునదియని తెలియు చున్నది.

—పూ ర్వ ప క్ష ము.—

శ్రీ ॥ భా ॥ బ్రహ్మవిద్య: ఊర్ధ్వరేతస్కుల విషయమై యజ్ఞాది కర్మముల నపేక్షింపకయే మోక్షసాధన మగునటుల, గృహస్థుని విషయమైయ్యును నటులనే యజ్ఞాది కర్మముల నపేక్షింపకయే మోక్షసాధనము కాదగును. మఱియు "యజ్ఞేన దానేన" ఇత్యాది శ్రుతివాక్యము గూడ "వివిదిషంతి" అను శబ్దముచే యజ్ఞదానాది ద్వారా బ్రహ్మమును దెలిసికొనుటకిచ్ఛయించుచున్నారని జెప్పుచున్నదయే గాని, మోక్షప్రాప్తిని గలుగఁజేయు విషయమై బ్రహ్మవిద్యకు యజ్ఞాదులు ఉపకారములని ప్రతిపాదించుచుండ లేదే? యనినచో,

—సి ద్ధా ం త ము.—

కర్మనిష్ఠులగు గృహస్థుల విషయమై మోక్షప్రాప్తిని గలుగఁజేయుటకు గాను బ్రహ్మవిద్య యజ్ఞాది కర్మముల నపేక్షించు చున్నది. ఏలననిన, "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసానాశకేన" ఇత్యాది శ్రుతివాక్యము "బ్రాహ్మణులు యజ్ఞముచేతను దానముచేతను ఆహారనియమముతోఁ గూడిన తపస్సు చేతనున్ను బ్రహ్మమునుదెలిసికొనుట కిచ్ఛయించు చున్నారు" అనుచు యజ్ఞాదులు బ్రహ్మవిద్యాంగములని తెలియఁజేయుచున్నది. అదెటులనిన, ఇచట యజ్ఞాదులచేఁ దెలిసికొనుట కిచ్ఛయించు చున్నారనఁగా యజ్ఞాదులచే జ్ఞానమునుబొందుట కిచ్ఛయించు చున్నారని యర్థము. యజ్ఞాదులు జ్ఞానసాధన భూతములగు పక్షముననే గదా వానిమూలముగ జ్ఞానమునుబొందుట కిచ్ఛయించు చున్నారను శ్రుత్యర్థము ఉపపన్నమగును. దృష్టాంతము:—కత్తి నరుకుటకు సాధన మగుటవలనఁ గదా కత్తితో నరుకుటకిచ్ఛయించు చున్నాడని మనము చెప్పుదుము. కనుక యజ్ఞము మొదలగునవి జ్ఞానసాధనములని యిందు మూలముగ స్పష్టమగుచున్నది. జ్ఞానమనునది కేవలవేదాంత వాక్యార్థ జ్ఞానరూప మయినది కాక, ధ్యానమనియు, ఉపాసన మనియును జెప్పఁబడున దనియు, సాక్షాత్కారరూపమైనట్టి స్మృతియనియు, అత్యంత ప్రియమయిన దనియు, ప్రతినిత్య మభ్యసించుటచే వృద్ధి బొందునట్టి దనియు, మరణ పర్యంత మనుష్ఠింప వలసినదనియును మోక్షసాధన మనియునింతకు పూర్వమే చెప్పి యుంటిమి. "ఆవృత్తి రస కృదుపదేశాత్" (బ్ర సూ ౪ అ ౧ పా ౧ సూ) ఇత్యాది సూత్రములచే సూత్రకారులు గూడ ఈ విషయము నిట్లు ఇఁకమీఁదు జెప్పఁబోవు చున్నారు.

27

బ్రాహ్మణులు ప్రతిదినము తామనుష్ఠించు నిత్యనైమిత్తికాది కర్మములచే సర్వేశ్వరు నారాధించి వాని యనుగ్రహమువలన నిట్టి ధ్యానరూపమగు జ్ఞానమును బొందుచున్నారని “యజ్ఞేనదానేనే” త్యాది శ్రుతివాక్యము ప్రతిపాదించు చున్నది. కనుక బ్రహ్మవిద్య కర్మష్ఠులగు గృహస్థుల విషయమై మోక్షప్రాప్తి హేతుభూతమగునప్పు డవశ్యముగ యజ్ఞాదికర్మముల సహాయము నపేక్షించు చున్నది. దృష్టాంతము:—ప్రయాణ సాధన భూతమగు అశ్వమునకు కళ్లెము మొదలగు ఉపకరణము లావశ్యకము లయినటుల, మోక్షసాధన భూతమగు జ్ఞానమునకు యజ్ఞాది కర్మముల సహాయ మపేక్షితము. భగవంతుఁడే స్వయముగ నిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం ॥

భ. గీ. ౧౮. అ. ౫. శ్లో.

తా॥ యజ్ఞము, దానము, తపస్సు, అను నీకర్మములు నాచరింప వలసినవి. వీటి నెన్నఁడును వదలగూడదు. ఈ యజ్ఞదాన తపస్సులనఁబడు వర్ణాశ్రమ కర్మములు ఉపాసకులకు పావనములు. అనఁగా వారి యుపాసనము సిద్ధించుటకు విరోధులగు ప్రాచీన కర్మములను నశింపఁజేయునవి,

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతం ।
స్వ కర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥

భ. గీ. ౧౮ అ. ౪౬ శ్లో.

తా॥ ఎవనివలన పృథివ్యాది భూతములు ఉత్పన్నము లగుచున్నవో, ఎవఁడట్టి భూతముల యందంతట వ్యాపించియున్నాడో, అట్టి నన్ను స్వవర్ణాశ్రమకర్మములచే ఆరాధించి మానవుఁడు నన్ను జేరుటయును సిద్ధిని బొందుచున్నాడు.

సర్వాపేక్షాధికరణము ముగిసెను.

---

## శమదమాద్యధికరణము.

౨౭॥ సూ॥ శమదమా ద్యుపేతస్స్యా త్తథాపితు తద్విధే స్తదంగతయా తేషామప్యవశ్యానుష్ఠేయత్వాత్

టీ॥ తథాపితు=గృహస్థుఁడు కర్మాదుల నాచరించు చున్నను, శమదమా ద్యుపేతః=అతఁడు శమదమాదులు గలవాఁడు, స్యాత్ =కావలయును

ఫలసనఁగా, తద్విధేః=అవి విధింపఁబడినందున, తదంగతయా=బ్రహ్మవిద్యాంగములుగా, తేషామపి=శమదమాదులును,అవశ్యానుష్ఠేయత్వాత్ =అవశ్యమనుష్ఠింప వలసిన వయినందునను,

తా॥ గృహస్థుంఁడు కర్మములను ఆచరించుచున్నను,అతఁడు శమదమాదులనుగూడ గలిగియుండవలయును. అవి శాస్త్రమున విధింపఁబడినవి. మఱియు నవి బ్రహ్మవిద్యకు అవశ్యము కావలసినవి.

## సంశయము.

గృహస్థుఁడు శమదమాదులనుగూడ ననుష్ఠింపవలయునా? లేక, వాటి నతఁ డనుష్ఠింప నక్కఱ లేదా?

## పూర్వపక్షము.

గృహస్థునిచే నవశ్య మాచరణీయమగు వర్ణాశ్రమకర్మానుష్ఠానము అంతరింద్రియ బహిరింద్రియ వ్యాపారరూపమయినది. శమదమాదు లన్ననో, యట్టి అంతరింద్రియ బాహ్యేంద్రియ వ్యాపార విరుద్ధములు. కనుక నవి యట్టి వర్ణాశ్రమకర్మానుష్ఠాన పరుఁడగు గృహస్థునిచే నాచరణీయములు గావనినచో,

## సిద్ధాంతము.

గృహస్థుఁడు ఇంద్రియ వ్యాపార రూపములగు కర్మములయందు ప్రవృత్తుఁడయినను, బ్రహ్మవేత్తయగు నాతఁడు శమదమాది యుక్తుఁ డవశ్యముగ గావలయును. ఏలయనిన "తస్మాదేవం విచ్ఛాంతోదాన్త ఉపరత స్తితిక్షుస్సమాహితోభూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యేత్" అను బృహదారణ్యకవాక్యము "శమదమాది యుక్తుఁడును, వైరాగ్యసంపన్నుఁడును, శీతోష్ణ సుఖదుఃఖములను సహించువాడును, చిత్తైకాగ్రతగలవాడునై తనయందు పరమాత్మను జూచునది"యనుచు శమదమాదులను బ్రహ్మవిద్యాంగములనుగా విధించుచున్నది. విద్యోత్పత్తి చిత్త నైశ్చల్య రూపమయినది గదా! శమదమాదుల వలనఁ గదా చిత్తనైశ్చల్యము గలుగు చున్నది. కనుక చిత్తనైశ్చల్య హేతువులగు శమదమాదులు జ్ఞానసాధము లన్నసంగతి మనమెఱింగినదే. కావునబ్రహ్మవిద్యాప్రాప్తికిగాను శమదమాదులు గూడ ననుష్ఠేయములు గాన, నవియును విద్యాకామునిచే నాచరింపవలసినవి. వర్ణాశ్రమ కర్మములు అంతరింద్రియ బాహ్యేంద్రియ వ్యాపార రూపము లగుటంజేసియు, శమదమాదు లట్టి వ్యాపా

రాభావరూపము లగుటం జేసియును కర్మములును శమదమాదులును పరస్పరము విరుద్ధములని పూర్వపక్షి చెప్పినది యుక్తము కాదు. ఏలననిన, వానికి విషయభేదము గలదు. ఎటులనిన, శాస్త్ర విహితములగు విషయములయందు నియోగింపఁబడు ఇంద్రియ వ్యాపారము కర్మ మనఁబడుచున్నది. శాస్త్ర విహితములు గానట్టియు, నిష్ప్రయోజనములగు విషయములనుండి ఇంద్రియ వ్యాపారమును నిరోధించుట శమదమాదిరూప మయినది. ఇట్లు వర్ణాశ్రమ కర్మములకును శమదమాదులకును విషయభేద ముండుటచే నవి పరస్పర విరుద్ధము లెంతమాత్రము గానేరవు. ఎప్పుడును ఇంద్రియ వ్యాపార రూపములగు కర్మములయందు వ్యాసక్తుఁడయియుండు గృహస్థునికి వాసనా వశమున నింద్రియ వ్యాపారాభావరూపమగు శమదమాద్యనుష్ఠాన మసంభవమని శంకింపఁ బని లేదు. గృహస్థునిచే ఆచరింపఁబడు వర్ణాశ్రమ కర్మములు సర్వేశ్వరారాధన రూపములయినవి. వీటి ననుష్ఠించుటచే నతఁడు సర్వేశ్వరు నారాధించి వాని యనుగ్రహమును సంపాదించుకొనుచున్నాడు. అట్టి సర్వేశ్వరానుగ్రహమువలన గృహస్థుని విపరీత వాసన లన్నియును నశించుచున్నవి. కనుక శమదమాదులు గూడ గృహస్థునిచే ననుష్ఠింపవలసిన వని సిద్ధ మగుచున్నది.

శమదమాద్యధికరణము ముగిసెను.

---

## సర్వాన్నానుమత్యధికరణము.

అ॥ సూ॥ సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్

---

టీ॥ ప్రాణాత్యయే=ప్రాణాపాయ దశయందే, సర్వాన్నానుమతిః = సర్వాన్న భక్షణాభ్యనుజ్ఞ (భవతి=కలుగుచున్నది). ఏలననిన, తద్దర్శనాత్ =అప్పుడు మాత్రమే యట్టి భక్షణము శ్రుతిచే ప్రదర్శింపఁ బడుటవలన.

తా॥ ప్రాణాపాయ దశయందే సర్వాన్నభక్షణాభ్యనుజ్ఞ యివ్వఁబడెను. అట్టిదశయందుమాత్రము అభక్ష్యభక్షణము కూడునని శ్రుతి ప్రదర్శించుచున్నది.

శ్రీ॥ భా॥ ప్రాణవిద్యా సందర్భమున వాజసనేయులు “న హ వా అస్యానన్నం జగ్ధం భవతి నానన్నం పరిగృహీతం భవతి” అను వాక్యమున “ప్రాణవిద్యోపాసకునిచే భక్షింపఁబడిన దద్దియు నభక్ష్యము గాదు” అనియు, ఛందోగులు “న హ వా ఏవంవిది కిఞ్చనానన్నం భవతి” అను వాక్యమున “ప్రాణో

పాసకునిచే భక్షింపకూడని ద్రవ్యము లేదు" అనియును జెప్పుచు ప్రాణవిద్యో పాసకుఁ డెవని యన్నము నయినను తినవచ్చునని తెలియఁబఱచి యున్నారు. ఈసందర్భమున నొక సంశయము గలుగు చున్నది.

—సంశయము.—

ఈ పైవాక్యములు ప్రాణవిద్యోపాసకుఁ డెప్పుడు పడితె యప్పు డెవని య న్నమునయినను తినవచ్చునని తెలియఁ జేయుచున్నవా? లేక, అన్నము లేక ప్రాణములు బోవునట్టి యాపత్తు సంభవించినప్పుడు మాత్రమే ప్రాణవిద్యోపా సకుఁ డెవని యన్నమునయినను భుజింప వచ్చుననుచున్నవా?

—పూర్వపక్షము.—

ఇక్కాలమునందు మాత్రము ప్రాణవిద్యోపాసకుఁ డెవని యన్నమున యినను తినవచ్చునని నియమమెద్దియు నీపై శ్రుతివాక్యములయందుఁ గానఁ బడనందున, నతఁ డెప్పుడు పడితె యప్పు డెవని యన్నమునయినను తినవచ్చు ననినచో,

—సిద్ధాంతము.—

ప్రాణములు బోవునట్టి యాపత్తు సంభవించినప్పుడు మాత్రమె ప్రాణ విద్యోపాసకుఁ డెవనియన్నము నయినను భుజింపవచ్చుననుట యుక్తము. ఏలన నిన, సామాన్యముగా బ్రహ్మవేత్తలు గూడ ప్రాణములు బోవునట్టి యాపత్తు సంభవించి నప్పుడు మాత్రమె యెవనియన్నమునైనను తినవచ్చునని శాస్త్రాం తరమునందుఁ జెప్పఁబడియున్నది. ఇఁక, ప్రాణవిద్యోపాసకుని విషయమై చె ప్పవలసిన దేమున్నది? ఈ విషయమును గుఱించి ఛాందోగ్యమున నొక యితి హాసము గలదు. అది యెట్టులనిన, ఒకానొక కాలమున కురుదేశమందలి సస్యము లుమిడుతలచేతను రాళ్లవానచేతను హతములు కాఁగా, దుర్భిక్షము కలిగెను. అప్పుడు చాక్రాయణముని బాలికయగు తనభార్యతోఁ గూడ దేశాంతరమున కుఁబోవుచు గజపోషకుల(మావటుల)గ్రామ మొక్క దానిఁ జేరి, యచ్చట క్షు ద్బాధితుడై యొక మావటివానిచే సగము భక్షింపఁబడిన మినపగుగ్గిళ్ల ను యాచించి, వానిఁ గొన్ని తాఁదిని తక్కిన వానిం దన భార్యకొసఁగెను. జల ముఁ గూడఁ ద్రాగుమని మావటివాఁ డివ్వగా, దానిం ద్రాగక, త్రాగినచో, తా ను ఉచ్ఛిష్టపానము చేసినవాఁడ నగుదునని నిషేధించెను. అంతట మావటివాఁ డు మినపగుగ్గిళ్లు మాత్ర ముచ్ఛిష్టములు కావా? యని యడుగఁగా, ప్రాణాపా యదశయందుండుటచే గుగ్గిళ్లఁదిని ప్రాణములఁ గాపాడుకొంటిని. జలపానమును

కట్టి యావశ్యకత లేదు. కావున బుద్ధిపూర్వకముగ నీ యుచ్ఛిష్టోదకముఁ ద్రాగి శాస్త్రనిషిద్ధమగు కార్యము నొనర్చినవాఁడ నగుదునని యతఁడు దెలిపి స్వేచ్ఛం జనియె. మరునాడాతఁడు యజ్ఞమునకుగాఁ బోవందలఁచి మరలక్షుద్బాధాపీడితుఁడై తన భార్యదగ్గిర నుంచియున్న గుగ్గిళ్లను గైకొని భుజించెను. అందువలన (అనఁగా ఈ యాఖ్యాయికయం దుచ్ఛిష్టోచ్ఛిష్ట పర్యుషిత భక్షణము ప్రదర్శింపఁబడుటచేఁ బ్రాణాత్యయ సమయమునఁ బ్రాణసంధారణమునకై యభక్ష్యమునయినను భక్షింపఁదగుననియు, జలపాన ప్రత్యాఖ్యానముచే స్వస్థావస్థయందు విద్వాంసులచేఁగూడనది యకర్తవ్య మనియును ద్యోతక మగుటవలన) బ్రహ్మవేత్తలయినను, ప్రాణాపాయ సమయమున మాత్రమె ఎవనియన్నము నయినను భుజింపవచ్చునని విశదమగుచున్నది. కాఁబట్టి ప్రాణవిద్యాసందర్భమున సర్వాన్నభక్షణమునకు కాలవిశేష మెద్దియును జెప్పఁబడక పోయినను, ప్రాణోపాసకుఁడు ప్రాణాపాయ సమయమున మాత్రము ఎవనియన్నమునయినను భుజింప వచ్చునని నిశ్చయింపఁ బడుచున్నది.

౨౯ ॥ సూ ॥ అబాధాచ్చ

టీ॥ అబాధాచ్చ=శాస్త్రవిధిని బాధింపనందునను.

తా॥ శాస్త్రవిధికి బాధ లేనందునను, సర్వాన్నభక్షణాభ్యనుజ్ఞ ఆపద్విషయమైనదని యెఱుంగునది.

శ్రీ॥ భా॥ పూర్వోక్తప్రకారము ప్రాణాపాయ సమయమున మాత్రమే ఎవని యన్నమునైనను భుజింప వచ్చునని యంగీకరించిన పక్షమున, "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" అను శాస్త్రవిధికి అనఁగా పరిశుద్ధమగు ఆహారమును భుజించినచో, మనస్సు పరిశుద్ధమగును. మనస్సు పరిశుద్ధమయినచో, నిశ్చలమగు ధ్యానము ఉత్పన్నమగును" అను శాస్త్రవిధికి బాధ లేకపోవును. ఈ హేతువువలన బ్రహ్మవేత్తలు నయితము ప్రాణాపాయ సమయమునమాత్రమే యభక్ష్య భక్షణమును జేయవచ్చునని విశదమగుచున్నది. ఇట్లు అధికశక్తులగు బ్రహ్మవేత్తలు గూడ ప్రాణాపాయ సమయమున మాత్రమె అభక్ష్య భక్షణము జేయవచ్చునని దెలియవచ్చు చుండుటచే అల్పశక్తియుక్తుఁడగు ప్రాణోపాసకుఁడు ప్రాణాపాయ రూపమగు ఆపత్తు సంభవించినప్పుడుమాత్రమె యెవని యన్నము నయినను భుజింపవచ్చునని విశద మగుచున్నది.

౩౦॥ సూ॥ అపి స్మర్యతే

టీ॥ అపి=మఱియు, స్మర్యతే=స్మృతియందును జెప్పఁబడినది.

తా॥ స్మృతియందును అట్లు చెప్పఁబడియె.

శ్రీ ॥ భా ॥ “ ప్రాణసంశయ మాపన్నో యోన్నమత్తి యతస్తతః। లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా ” అను స్మృతివాక్యము గూడ “ప్రాణాపాయ దశలోనున్నప్పు డెవని యన్నమును తిన్నను తామరాకును జలమంటని చందంబునఁ బాపములు వానినంటవు” అనుటచే ఆపత్కాలమున మాత్రమే విద్వాంసులకును ఇతరులకును సర్వాన్న భక్షణ ముచితమని తెలియఁజేయు చున్నది.

౩౧॥ సూ॥ శబ్దశ్చాతోఽకామకారే

టీ ॥ అతః=కనుకనే,అకామకారే=బుద్ధిపూర్వకమగు సర్వాన్నభక్షణమును నిషేధించునట్టి, శబ్దః=వేదవాక్యము (అస్తి=కలదు)

తా॥ కనుకనే వేదవాక్యము బుద్ధిపూర్వకమగు సర్వాన్న భక్షణమును నిషేధించు చున్నది.

శ్రీ ॥ భా ॥ ఆపత్కాలమున మాత్రమే విద్వాంసులకును ఇతరులకును సర్వాన్న భక్షణ ముచిత మగుటంజేసియే కాఠకశ్రుతివాక్యము తదితర కాలముల యందండఱికిని స్వేచ్ఛాప్రవృత్తి రూపకమగు సర్వాన్న భక్షణమును నిషేధించుచున్నది. ఎట్లనిన, “తస్మా ద్బ్రాహ్మణః సురాం న పిబతి పాప్మనా నోత్సృజా ఇతి”(పాపాత్ముఁడను కాకపోవుదును గాక!యనుకొనుచు బ్రాహ్మణుఁడు సురాపానముఁజేయడు) అని కాఠకశ్రుతి తెలియఁజేయు చున్నది.

సర్వాన్న భక్షణాను మత్యధికరణము ముగిసెను.

విహితత్వాధికరణము

౩౨ ॥ సూ॥ విహితత్వా చ్చాశ్రమ కర్మాపి

టీ॥ విహితత్వాచ్చ=విధింపఁబడుటవలనను, ఆశ్రమకర్మాపి = ఆశ్రమ కర్మమును ముముక్షువులకుఁగూడ అనుష్ఠేయము.

తా॥ శాస్త్రమున విధించియుండుటచే ఆశ్రమకర్మములు ముముక్షువులచేఁగూడ అనుష్ఠేయములు.

శ్రీ॥ భా॥ యజ్ఞము మొదలగుకర్మములు బ్రహ్మవిద్యాంగములని యిం లకు పూర్వము నిశ్చయింపఁ బడియె. ఈసందర్భమున నొక సంశయము కలుగు చున్నది.

## సంశయము.

మోక్షేచ్ఛ లేక కేవల యాశ్రమమాత్రనిష్ఠుడుగనుండు వానిచే నట్టియ జ్ఞము మొదలగు కర్మము లనుష్ఠేయములా? కావా?

## పూర్వపక్షము.

బ్రహ్మవిద్యాంగములగు యజ్ఞము మొదలుగాఁగల కర్మములు ఆశ్రమమాత్ర నిష్ఠుఁడగు వానిచే ననుష్ఠింపవలసినవై ఆశ్రమశేషములయినచో, *నిత్యా నిత్య సంయోగవిరోధము ప్రసక్తించును గాన, నవి యాశ్రమమాత్ర నిష్ఠు నిచే యనుష్ఠింప వలసినవి కావు.

## సిద్ధాంతము.

ఇట్లు చెప్పుటయుక్తము కాదు. యజ్ఞము మొదలగు కర్మములు బ్రహ్మ విద్యాంగములయినను, ఆశ్రమకర్మములు గూడ కావచ్చును. అనఁగా ముముక్షు వు కాక ఆశ్రమమాత్రనిష్ఠుఁడగు వానిచేఁగూడ నవి యనుష్ఠింప వలసినవి. వలసనఁ గా« యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాదిశ్రుతి వాక్యము జీవించియు న్నంతవఱకు నగ్నిహోత్రాది కర్మముల ననుష్ఠింప వలయునని తెలియఁజేయు చున్నది. అనఁగా యజ్ఞము మొదలగు కర్మములను జీవితముతో నిత్యము సం బంధించినవాటినిగా విధించుచున్నది.

అవతారిక—మఱియు «తమేతం వెదానువచనేన" ఇత్యాది శ్రుతి వాక్యముచే యజ్ఞము మొదలగు కర్మములు బ్రహ్మవిద్యాంగములుగాను విధిం

---

* యజ్ఞాదికర్మము లాశ్రమధర్మములగు పక్షమున, పురుషుం డెప్పుడును ఏదియొక నొక యాశ్రమమున నుండును గాన, నతనితో నీ కర్మములకు నిత్య సంయోగముండును. ఇవి బ్రహ్మవిద్యాంగములగు పక్షమున, బ్రహ్మ విద్యయందు కోరుచి ప్రతిమనుజునికిని యెల్లకాల ముండునది కాదుగాన, నట్టి వానిలో కొందఱితోనో, కొన్నికాలముననో, యీ కర్మములకు సంబంధముం డును. ఇట్లు ఈ కర్మములకు పురుషునితో నిత్యసంయోగమును అనిత్యసం యోగమును ఉండుట పరస్పర విరుద్ధము.

పబడుటచే వాటిని విద్యాంగములుగానుగూడ ననుష్ఠింప వలయునని తెలుపుటకై:—

౩౩॥ సూ॥సహకారిత్వేనచ.

టీ॥ సహకారిత్వేనచ = యజ్ఞాదికర్మములు విద్యాసాధనములు గాను గూడ అనుష్ఠేయములు.

తా॥ యజ్ఞాది కర్మములు విద్యా సాధనములుగాను గూడ ననుష్ఠేయములు.

శ్రీ॥ భా॥ యజ్ఞాదికర్మములు బ్రహ్మవిద్యోత్పత్తి ద్వారా విద్యాసాధనము లగుటచేతంగూడ ననుష్ఠేయములు. యజ్ఞాదికర్మ మొక్కటియేయైనను, అది జీవననిమిత్తముగానును, బ్రహ్మవిద్యా సహకారిగానును, వినియోగపడుటచే విని యోగ భేదముండుటవలన ఉభయార్థము అనఁగా నాశ్రమ శేషముగాను, విద్యాంగముగానును గూడ అనుష్ఠింపవలసినది. ఈ విషయమున నిత్యానిత్య సంయోగవిరోధమును శంకింపఁదగదు. అదెటువలెననిన, అగ్నిహోత్రాది కర్మములు జీవనాధికారమునకుగాను, స్వర్గాధికారమునకుగానును అనుష్ఠింపఁబడు చుండ లేదా?

అవతారిక:—అటులనె ఆశ్రమవిహిత యజ్ఞాదికర్మములకంటె విద్యా సహకారులుగావిధింపఁబడిన యజ్ఞాదికర్మములు భిన్నములుగావని తెలుపుటకై,

౩౪॥ సూ॥సర్వథాపి త ఏవోభయలింగాత్.

టీ॥ సర్వథాపి=ఆశ్రమకర్మత్వ పక్షమునను, విద్యాసహకారిత్వ పక్షమునను, ఉభయలింగాత్ =ఉభయత్రశ్రుతి యుండుటవలన, తఏవ=యజ్ఞాదికర్మము లవియే.

తా॥ ఆశ్రమకర్మత్వ పక్షమునను, విద్యాసహకారిత్వపక్షమునను, యజ్ఞాదికర్మములకు భేదము లేదు.

శ్రీ॥భా॥ విద్యార్థముగ విధింపబడినను, ఆశ్రమార్థముగ విధింపబడినను, యజ్ఞాదికర్మము లవియె యని, అనఁగా అభిన్నములని యెఱుంగునది. కర్మ స్వరూపమునం దెద్దియు భేదము లేదనుట. ఏలయన, ఉభయశ్రుతులలో అనఁగా నీ కర్మముల నాశ్రమ శేషములనుగా విధించు శ్రుతులలోను, విద్యాసహకారులనుగా విధించు శ్రుతులలోను నొక తావున ప్రయోగింపబడిన యజ్ఞాది శబ్దమునే మఱియొక తావున గూడ ప్రయోగింప బడుటచే ఆయజ్ఞాది

కర్మములే ఇవియని గుర్తించుచున్నాము. మఱియు నీ రెండుతావులయందు విధింపబడు కర్మముయొక్క స్వరూపమునందు భేదమున్నట్లు ప్రమాణ మెద్దియును గానబడదు.

౩౫॥ సూ॥ అనభి భవంచ దర్శయతి

టీ॥ అనభిభవంచ = విద్యోత్పత్తికి ప్రతిబంధము లేకపోవుటను గూడ, దర్శయతి=శ్రుతి ప్రదర్శించుచున్నది.

తా॥ కర్మములనుండి విద్యోత్పత్తికి ప్రతిబంధకము లేకపోవుటనున్న శ్రుతులు తెలుపుచున్నవి,

శ్రీ॥ భా॥ కనుకనే "ధర్మేణపాప మపనుదతి" ఇత్యాది శ్రుతివాక్యము మానవుడు యజ్ఞాదికర్మముల నాచరించుటచే పాపమును పోగొట్టుకొనుచున్నాడనుచు నాశ్రమ శేషభూతములుగ విధింపఁబడిన యజ్ఞాది కర్మములనే నిర్దేశించి వాటిసామర్థ్యముచే పాపకర్మములవలన విద్యోత్పత్తి కెద్దియు నిర్బంధము గలుగనేరదని తెలుపుచున్నది. ప్రతిదిన మాచరింపబడు యజ్ఞాది కర్మములవలన మనస్సు నిర్మల మగుటంజేసి సదా ప్రకాశమానమగు జ్ఞానము కలుగుచున్నది. కనుక నొకతావున ఆశ్రమ శేషములుగ జెప్పబడిన యజ్ఞాదికర్మములే మఱియొక తావున విద్యాసహకారులుగ జెప్పబడినవి.

విహితత్వాధి కరణము ముగిసెను.

## విధురాధికరణము.

౩౬॥ సూ॥ అన్తరాచాపితు తద్దృష్టేః.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, అన్తరాచాపి=ఆశ్రమరహితులకును బ్రహ్మవిద్యయం దధికారము గలదు, తద్దృష్టేః=అట్లుశ్రుతులవలనఁ దెలియుట వలన.

తా॥ ఆశ్రమ రహితులకు గూడ బ్రహ్మవిద్యయం దధికారముగలదని శ్రుతులవలనఁ దెలియుచున్నది.

శ్రీ॥భా॥ బ్రహ్మచర్యము మొదలుగా గల నాలుగాశ్రమముల వారికిని బ్రహ్మవిద్యయం దధికారము గలదనియు, ఆశ్రమ ధర్మములు బ్రహ్మవిద్యకు సహాయకము లనియును చెప్పబడియె. ఈ సందర్భమున నొక సంశయము గలుగుచున్నది.

—ఃః సంశయము. ఃః—

ఆశ్రమరహితులగు విధురాదులకు (అపత్నీకులు మొదలగువారికి). బ్రహ్మవిద్యయం దధికారము కద్దా? లేదా?

—ఃః పూర్వపక్షము. ఃః—

బ్రహ్మవిద్య యాశ్రమధర్మముల సహాయము నపేక్షించునది. ఆశ్రమరహితులకన్ననో, ఆశ్రమధర్మములు లేవు. కావున వారికి బ్రహ్మవిద్యయం దధికారము లేదు.

—ఃః సిద్ధాంతము. ఃః—

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఆశ్రమరహితులకును బ్రహ్మవిద్యయం దధికారము గలదు. అట్లు శాస్త్రమున గానబడు చున్నది. రైక్వ, భీష్మ, సంవరాదులు ఆశ్రమరహితులయినను, వారు బ్రహ్మవిద్యా నిష్ఠులుగా దెలియ వచ్చుచున్నారు. ఇంతియెకాక, ఆశ్రమధర్మము లే బ్రహ్మవిద్యకు తోడ్పడవలయునన్న నియమమున్ను లేదు. ఏలననిన, ,, యజ్ఞేన దానేన తపసా నాశకేన'' అను శ్రుతివాక్యమే నియతముగ నెట్టి యాశ్రమమునునాశ్రయించియుండనివియగు దానాదులు గూడ బ్రహ్మవిద్యకు సహాయకములని తెలుపుచున్నది. ఊర్ధ్వరేతస్కాదులు బ్రహ్మవిద్యా నిష్ఠులుగా దెలియవచ్చుచున్నందున అగ్నిహోత్రాదిభిన్నములగువానిచే వారి బ్రహ్మవిద్యయుపకరింపంబడు చున్నది. అట్లే ఆశ్రమ రహితులును బ్రహ్మవిద్యా నిష్ఠులుగా దెలియ వచ్చుచున్నారు. కావున వారి బ్రహ్మవిద్యయును నియతముగ నాశ్రమములతో సంబంధించినవి కానట్టి జప, ఉపవాస, దాన, దేవతారాధనాదులచే నుపకరింపంబడవచ్చును.

32॥ సూ॥ అపిస్మర్యతే.

టీ॥ అపి=మఱియు, స్మర్యతే=స్మృతియందును అట్లుచెప్పబడినది.

తా॥ స్మృతియును అట్లు తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ మఱియు ఆశ్రమహితులకు జపాదిమూలముగ బ్రహ్మజ్ఞానము గలుగ శక్యమని స్మృతిగూడ జెప్పుచున్నది.

శ్లో॥ జపేనాపిచ సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః ।
కుర్యాదన్యన్నవాకుర్యాత్ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥

తా॥జపమాలముగనైనను బ్రహ్మనిష్ఠుడు గాఁవచ్చును. ఇందుకు సంశయము లేదు. ఏదైన నొకదాని నాచరించినను, ఆచరింపకపోయినను, భూతదయగలవాడు బ్రహ్మనిష్ఠుడనబడుచున్నాడు.

ఈ వాక్యము జపమాలముగ గూడ బ్రహ్మవిద్య సహకరింపబడినదై సిద్ధిని గలుగజేయవచ్చునని తెలుపుచున్నది.

౩౭॥ సూ॥ విశేషానుగ్రహాచ్చ

టీ॥ విశేషానుగ్రహాచ్చ=ధర్మవిశేషములచేగూడ విద్యకు సహాయము గలుగుచున్నది.

తా॥ ఆశ్రమ నియతములుగాని ధర్మవిశేషములచేగూడ విద్యకు సహాయము గలుగుచున్నట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ కేవలము యుక్తివలనను స్మృతివలనను మాత్రమే ఈ విషయము సాధింపబడుచుండలేదు. అయితే "తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాఽఽత్మాన మన్విష్యేత్" అను శ్రుతివాక్యము గూడ "తపస్సుచేతను బ్రహ్మచర్యముచేతను శ్రద్ధచేతను విద్యచేతను పరమాత్మ నెఱుంగవలయును" అనుచు ఆశ్రమనియతములుగానట్టి తపస్సు మొదలగు ధర్మవిశేషములుగూడ బ్రహ్మజ్ఞానోత్పత్తి సాధనములని తెలుపుచున్నది.

౩౮॥ సూ॥ అతస్త్వితరజ్జ్యాయోలింగాచ్చ.

టీ॥ అతస్తు = అనాశ్రమిత్వముకంటె, ఇతర్ = ఆశ్రమిత్వము, జ్యాయః=శ్రేష్ఠము. ఏలననిన, లింగాత్ = శ్రుతి స్మృతులవలన.

తా॥ అనాశ్రమిగా నుండుటకంటె నాశ్రమిగా నుండుట శ్రేష్ఠమని శ్రుతి స్మృతులవలన దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ అయితే ఆశ్రమరహితుడుగా నుండుటకంటె నాశ్రమయుక్తుడుగా నుండుట శ్రేష్ఠము. ఆశ్రమరహితునికిని విద్యాధికారము గద్దనుట ఆపద్విషయమని యెఱుంగునది. స్వల్పధర్మములను మాత్రమాచరించు ఆశ్రమరహితునికంటె ననేకధర్మముల నాచరించు ఆశ్రమయుక్తునికి ధర్మాధిక్యతవలన ఫలాధిక్యతయును గద్దు. కనుక సమర్థుడగువాడు ఆశ్రమయుక్తుడుగానుండుట చాలామంచిది. "అనాశ్రమీనతిష్ఠేత్తు దిన మేక మపి ద్విజః." అను స్మృతివాక్యముగూడ ఒకరోజయినను బ్రాహ్మణుడాశ్రమరహితుడు గానుండగూడదనుట శక్తుడగువాడేదైన నొకయాశ్రమమును గ్రహించుటమంచిదని తెలుపుచున్న

ది. బ్రహ్మచర్యావధి ముగించినవానిని, భార్యచనిపోయినవానికిని, సంసారసుఖ మనందిచ్చు యున్నప్పటికిన్ని పెళ్లికి పిల్ల దొరకక పోవుట యావత్తు. (ఈయా పదలవలన ఆశ్రమరహితుఁడుగా నుండినవానికి బ్రహ్మవిద్యాధికారముండ వచ్చును.)

విధురాధికరణము ముగిసెను.

## తద్భూతాధికరణము.

౪౦॥ సూ॥ తద్భూతస్యతు నాతద్భావో జైమినేరపి నియమా త్తద్రూపా భావేభ్యః

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము, తద్భూతస్య=నైష్ఠికాద్యాశ్రమ నిష్ఠునికి- అతద్భావః=ఆశ్రమ రాహిత్యము, న=కూడదు. ఏలననఁగా. తద్రూపాభావేభ్యః=వారల నట్టియాశ్రమ ధర్మత్యాగమునుండి శాస్త్రము నియమించుచున్నందున, జైమినేరపి=జైమినియొక్క మతము నిట్టిదియే.

తా॥ నైష్ఠికాద్యశ్రమనిష్ఠులును తమతమ యాశ్రమ ధర్మములను విడువ గూడదని శాస్త్రము నియమించుచున్నది. జైమినియొక్క మతము నిద్దియె,

### సంశయము.

నైష్ఠిగబ్రహ్మచర్యవానప్రస్థ సన్యాసాశ్రమములనుండి భ్రష్ఠులయిన వారిని గూడ బ్రహ్మవిద్యయం దధికారమున్నదా? లేదా?

### పూర్వపక్షము.

విధురాదులు (అనఁగా భార్యావియోగమువలన గృహస్థాశ్రమమునుండి భ్రష్ఠులయినవారు) ఆశ్రమ రహితులయినను, వారికి దానాది మూలముగ బ్రహ్మవిద్యయం దధికారమున్నటుల, బ్రహ్మచర్యాద్యాశ్రమ భ్రష్ఠులయినవారికిని బ్రహ్మవిద్యయం దధికార ముండవచ్చుననినచో,

### సిద్ధాంతము.

ఇట్లు జెప్పుట యుక్తము కాదు. బ్రహ్మచర్యాద్యాశ్రమ నిష్ఠులయినవారు తమతమ యాశ్రమములను వదలి యాశ్రమరహితులుగ నుండుట యసంభవము. వీరలు తమ యాశ్రమ ధర్మముల నొకప్పుడును విడనాడగూడదని శాస్త్రము నియమించు చున్నది. అది యెట్లనిన, "బ్రహ్మచార్యాచార్యకుల

వాసీ తృతీయోత్యంత మాత్మాన మాచార్యకులేఽవసాదయన్'' అను శ్రుతి వాక్యము ''మూడవ బ్రహ్మచారి అనఁగా నైష్ఠికబ్రహ్మచారి ఆచార్య గృహము న వసింపవలయును. వేదాధ్యయన గురుశుశ్రూషాదులచే శరీరమును కృశింపఁ జేయవలయును'' అనుచు నైష్ఠిక బ్రహ్మచారి తనయాశ్రమధర్మములగు గురుకుల వాసము మొదలగువాని నెన్నఁడును విడనాడ గూడదని విధించుచున్నది. ''అరణ్య మియాత్తతో న పునరేయాత్'' అను శ్రుతివాక్యము ''వానప్రస్థుఁడు అరణ్యమునకుఁబోయి అచటనుండి ఎన్నఁడును మరల రాగూడదు'' అనుచు వానప్రస్థుకు తనయాశ్రమ ధర్మమగు అరణ్యావాసము నెన్నడును విడనాడ గూడదని విధించుచున్నది. మఱియు, ''సన్యస్యాగ్నిం న పునరావర్తయేత్'' అను శ్రుతివాక్యము ''సన్యాసాశ్రమమును బుచ్చుకొనినవాడు మరల నగ్నిహోత్రాదికర్మముల నాచరింపఁ గూడదు'' అనుచు సన్యాసి తన యాశ్రమ ధర్మమునకు విరుద్ధములగు నగ్నిహోత్రాదుల నెన్నఁడును మరల నాచరింపగూడదని విధించుచున్నది. ఈ పైనిగానఁబఱచిన హేతువులవలన విధురాదులవలె నైష్ఠిక వానప్రస్థ సన్యాసులు ఎన్నఁడును ఆశ్రమ రహితులుగ నుండుట యసంభవము గాన, వీరలు తమతమ యాశ్రమములనుండి భ్రష్టులయినయెడల వీరికి బ్రహ్మవిద్యాధికార ముండనేరదు. ఈ విషయము జైమినికిఁగూడ సమ్మతమనుచు సూత్రకారుఁడు స్వాభిప్రాయమును దృఢపరచి యున్నాడు.

అవతారిక:—కానిమ్ము. అయినను ఆశ్రమభ్రష్టులయిన నైష్ఠికాదులకు ప్రాయశ్చిత్తముండుటంజేసి వారలకు బ్రహ్మవిద్యాధికార ముండవచ్చును. ''అవకీర్ణి పశుశ్చతద్వత్'' అను అధికారి లక్షణవాక్యము స్వాశ్రమవిరుద్ధమయిన వ్యభిచార కర్మమువల్ల ఆశ్రమభ్రష్టులయిన నైష్ఠికబ్రహ్మచారి మొదలగువారికి ప్రాయశ్చిత్తమును విధించుచున్నది. కనుక నైష్ఠిక బ్రహ్మచారి యాశ్రమ భ్రష్టుడయినను, ప్రాయశ్చిత్తము జేసికొనినయెడల, బ్రహ్మవిద్యయందధికారము గలవాడగునని యాక్షేపింపఁగా.

౪౧॥ సూ॥ న చాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్

టీ॥ (స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠికాదులకు) ఆధికారికమపి=స్వాశ్రమ లక్షణమునఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమున్ను, న=లేదు, ఏలయనఁగా, పతనానుమానాత్ = అట్టివారు పతితులని స్మృతియందుఁ దెలిపియుండుటచే, తదయోగాత్=అట్టివారికి ప్రాయశ్చిత్త మసంభవమగుట వలన.

తా॥ స్వాశ్రమ భ్రష్టులగు నైష్ఠికాదులకు స్వాశ్రమలక్షణమున జెప్పఁబడిన

ప్రాయశ్చిత్తమున్న లేదు. ఏలయనఁగా అట్టివారు పతితులుగా స్మృతియందు జెప్పబడినందున వారు ప్రాయశ్చిత్తార్హులును కారు.

శ్రీ॥ భా॥ అధికారి లక్షణగ్రంథమున ప్రాయశ్చిత్తము జెప్పబడినను, అది స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠికబ్రహ్మచారుల కసంభవము. స్వాశ్రమభ్రష్టులయిన నైష్ఠికబ్రహ్మచారులు పతితులని స్మృతి యందు జెప్పియుండుటచే వారలకు ప్రాయశ్చిత్త మెట్లుండ గలదు? అసంభవము. ఎట్లనిన,

శ్లో॥ ఆరూఢో నైష్ఠికంధర్మం యస్తు ప్రచ్యవతే ద్విజః।
ప్రాయశ్చిత్తం నపశ్యామి యేనశుద్ధ్యేత్స ఆత్మహా ॥

తా॥ నైష్ఠిక బ్రహ్మచర్యము నవలంబించి, దానినుండి భ్రష్టుడయిన ద్విజుఁడాత్మ ఘాతకుఁడు. వానిని పరిశుద్ధునిగాఁ జేయునట్టి ప్రాయశ్చిత్త మెచటను గానఁ బడదు.

కనుక అధికారి లక్షణగ్రంథమునఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్త మితర బ్రహ్మచారుల విషయకమైనదిగా నెఱుంగునది.

౪౨॥ సూ॥ ఉపపూర్వమపీత్యేకే భావమశనవత్తదుక్తం.

టీ॥ ఏకే=కొందఱు (నైష్ఠికాదుల బ్రహ్మచర్యలోపము.) ఉపపూర్వమపి =ఉపపాతకమునుగానునుఎన్నఁబడుటచే,) దానికిప్రాయశ్చిత్తము, అశనవత్ = మధ్వశనమునకువలెనె కలదనుచున్నారు. తదుక్తం=అది శాస్త్రమునఁ జెప్పఁబడినది.

తా॥ నైష్ఠికాదుల బ్రహ్మచర్యమునకు లోపము గలిగినను, అది యుపపాతకముగానెన్నఁబడుటచే దానికిగా నతనికి మధ్వశనమునకుగాను వలెనే ప్రాయశ్చిత్తము గలదని కొందరు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ నైష్ఠిక బ్రహ్మచారులు మొదలగువారి బ్రహ్మచర్య భంగము మహాపాతకముగ పరిగణింపఁబడియుండలేదు. కాఁబట్టి యది యుపపాతకముగా నెన్నఁబడుచున్నది. కావున దానికి ప్రాయశ్చిత్తము సంభవమని కొంద రాచార్యులు తలఁచుచున్నారు. బ్రహ్మచారులు నిషిద్ధమగు మదమాంసభక్షణము జేసిరేని, అందులకుగాను విధింపబడిన ప్రాయశ్చిత్తము సాధారణ బ్రహ్మచారులకును నైష్ఠికబ్రహ్మచారులకును సమానమే. "ఉత్తరేషాంచైతదవిరోధి" అను స్మృతివాక్యముగూడ సాధారణ బ్రహ్మచారులకుగాఁ జెప్పబడిన నియమములు పై బ్రహ్మచారులకును అనఁగా నైష్ఠికాదులకును సమానములే యని తెలుపుచున్నది. అనఁగా గురుకులవాసియగు బ్రహ్మచారిని గుఱించి చెప్పఁ

బడిన నియమము తదితరాశ్రమములవారికిని వారి యాశ్రమమునకు విరుద్ధముగా నంతమట్టుకు సమానమే యనుట. అటులనే యిచట గూడ సాధారణ బ్రహ్మచారులకు బ్రహ్మచర్య భంగము గలుగు పక్షమున విధింపఁబడిన ప్రాయశ్చిత్తము తదితరులగు నైష్ఠికాదులకుగూడ సమానమె. అనఁగా నట్టి ప్రాయశ్చిత్తము నైష్ఠికాదులకు కూడ సంభవించు చున్నది. కాఁబట్టి స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠికాదులకును బ్రహ్మవిద్యతో సంబంధము గద్దు.

౪౩॥ సూ॥ బహిస్తూభయథాపిస్మృతేరాచారాచ్చ.

టీ॥ తు=ఆక్షేప మయుక్తము, ఉభయథాపి=బ్రహ్మచర్యలోపము మహాపాతకమైనను, ఉపపాతకమైనను, అట్టివాఁడు బ్రహ్మవిద్యాధికారము నుండి బహిర్భూతుండుగా, స్మృతేః=స్మృతులనుండియు, అచారాచ్చ=శిష్టాచారమునుండియును(జ్ఞాయతే=తెలియవచ్చుచున్నాఁడు.)

తా॥ నైష్ఠిక బ్రహ్మచారుల బ్రహ్మచర్యలోపము మహాపాతకమైనను, ఉపపాతకమైనను, అట్టివాఁడు బ్రహ్మవిద్యనుండి బహిర్భూతుండుగా స్మృతులనుండియు శిష్టాచారమునుండియును తెలియవచ్చుటవలన వానికి బ్రహ్మవిద్యాధికారము లేదు.

శ్రీ ॥ భా ॥ నైష్ఠికాదుల స్వాశ్రమ లోపము ఉపపాతకముగ గణింపఁబడినను, మహాపాతకముగ గణింపఁబడినను వారు బ్రహ్మవిద్యాధికారమునుండి బహిర్భూతులే అనఁగా వారికి బ్రహ్మవిద్యయం దధికారములేదనుట. ఏలయన, ఇంతకుపూర్వము ప్రదర్శింపఁబడిన స్మృతివాక్య మాశ్రమభ్రష్టులయిన నైష్ఠికాదులు పతితులని తెలుపుచున్నది. ఇట్లు స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠికాదులకు పాపనాశమునకై శాస్త్రమునందు కొన్నితావుల ప్రాయశ్చిత్తము న్నట్లు జెప్పఁబడినను, అట్టి ప్రాయశ్చిత్త మట్టివారిని కర్మాధికారులగు నంతపరి శుద్ధులనుగాఁ జేయునట్టి ప్రాయశ్చిత్తముగానేరదు. కనుకనేఁ "ప్రాయశ్చిత్తంన పశ్యామి యేనశుధ్యేత్స ఆత్మహా" అను స్మృతివాక్య మట్టి యాత్మఘాతకుని పరిశుద్ధునిగాఁ జేయునట్టి ప్రాయశ్చిత్తమే లేదని తెలుపు చున్నది. మఱియు స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠిక వానప్రస్థ సన్న్యాసులు ప్రాయశ్చిత్తము నొనర్చుకొనినను, శిష్టులు వారిని విసర్జించు చున్నారు. అట్టివారికి బ్రహ్మవిద్య నుపదేశింపరు. కనుక స్వాశ్రమ భ్రష్టులయిన నైష్ఠికాదులకు బ్రహ్మవిద్యయం దధికారము లేదు.

తద్భూతాధికరణము ముగిసెను.

---

## స్వామ్యధికరణము.

౪౪॥ సూ॥ స్వామినః ఫలశ్రుతే రిత్యాత్రేయః

టీ॥ స్వామినః=కర్మాంగాశ్రియములగు నుద్గీథాద్యుపాసనములు యజమానకర్తృకములని, ఫలశ్రుతేః=ఫల[illegible], ఆత్రేయః=ఆత్రేయమహర్షి, మన్యతే=తలంచుచున్నాఁడు.

తా॥ కర్మాంగాశ్రయములగు ఉద్గీథాద్యుపాసనములు యజమానకర్తృకములని యాత్రేయమహర్షి తలంచుచున్నాఁడు.

## సంశయము.

శ్రీ॥ భా॥ కర్మాంగాశ్రయభూతములగు నుద్గీథాద్యుపాసనములు యజమానునిచే నొనర్పఁబడునవియా? లేక, అవి ఋత్విక్కుచే నొనర్పఁబడునవియా?

## పూర్వపక్షము.

ఉద్గీథాద్యుపాసనములు యజమానునిచే నొనర్పఁబడునవియని యాత్రేయుడు తలచుచున్నాఁడు. ఏలయనిన, వేదాంతవిహితములగు దహరాద్యుపాసనముల నొనర్చువాఁడే యట్టి యుపాసనముల ఫలముల ననుభవించువాఁడును గదా! అందుచే ఉపాసనా కర్తృత్వమున్ను ఫలభోక్తృత్వమున్ను ఒక్కనినే చెందినవియని తెలియుచున్నది. అటులనే యిచటగూడ కర్మఫలముల కెద్దియు నాటంకమురాకుండ జేయుటయనునట్టి యుద్గీథాద్యుపాసనాఫలము యజమానాశ్రయ మయినట్లు వినబడుటవలన నట్టి యుద్గీథాద్యుపాసనముల విషయమున కర్తృత్వముగూడ యజమానాశ్రయమనుట యుక్తమని చెప్పవచ్చునే.

## ఆక్షేపము.

గోదోహనాదులు కర్మాంగాశ్రియ భూతము లగుటంజేసి వాటిని యజమానుఁడాచరించుట యసంభవము గదా! అటులనే, యుద్గీథాద్యుపాసనములు గూడ కర్మాంగాశ్రయ భూతములగుటంజేసి వీటినిగూడ యజమానుఁడాచరించుట యసంభవమేయనిన,

## సమాధానము.

ఇట్లు ఆక్షేపింపఁబనిలేదు. యజ్ఞమునందు పాలుపితుకుట యధ్వర్యుని కృత్యము గాన, నందుకుగాను గోదోహన పాత్రమును (పాలు పితుకుటకు పాత్రము) దెచ్చుకొనుటయును వానికార్యమే. దానిని యితరుఁడు జేయుట యసంభవము. అట్లే ఈ తావుననుద్గీథము ఉద్గాతచే నొనర్పఁబడునదయినను,

అట్టియుద్గీథాదు లత్యంతము రసయుక్తములని యనుసంధించుకొనుట యజమాన కృత్యము గాన,వీటిని యజమానుఁడుతప్ప తక్కినవారు జేయుట యశక్యము.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షము రాఁగా సమాధానము చెప్పుటకై.

౪౫॥ సూ॥ ఆర్త్విజ్య మిత్యౌడులోమి స్తస్మైహి పరిక్రియతే

టీ॥ ఆర్త్విజ్యమితి=ఉద్గీథాద్యుపాసనము ఋత్విక్కర్తృకత్వము, ఇతి=అని, ఔడులోమిః=ఔడులోమ్యాచార్యుండు, మన్యతే=తలంచుచున్నాడు.ఏల ననఁగా, తస్మైహి=క్రతుసంపాదనమునకై గదా, పరిక్రియతే = ఋత్విక్కు నియమింపఁ బడుచున్నాడు.

తా॥ ఉద్గీథాద్యుపాసము ఋత్విక్కర్తృకమని యౌడులోమ్యాచార్యుఁడు తలంచుచున్నాడు. ఏలననఁగా, క్రతుసంపాదనమునకై గదా వాడు నియమింపఁబడు చున్నాడు.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ ఋత్విక్కు ఫలసాధనభూతమగు సాంగక్రతువు నొనర్చుటకు గొను యజమానునిచేఁ గోరఁబడుటంజేసి అట్టి క్రత్వంగాశ్రయ భూతమగునుద్గీథోపాసనము ఋత్విక్కర్తృకమేయని యౌడులోమ్యాచార్యుఁడు తలంచుచున్నాడు. ఏలననఁగా, „ ఋత్విజో వృణీతే ” అనియు „ఋత్విగ్భ్యో దక్షిణాం దదాతి” ఈ మొదలగు కర్మవిధివాక్యములు ఋత్విగ్వరణము దక్షిణాదానము మొదలగు వానిని విధించుచు ఫలసాధన భూతమగు కర్మముసాంగముగ ఋత్విక్కులచే నాచరింప వలసినదని తెలియఁ బఱచుచున్నవి. కావున తత్తత్కర్మాంగములగు కాయిక, మానసిక కర్మంబులన్నియును ఋత్విక్కుచే నాచరింప వలసినవియే. ఈ కర్మయం దీతఁడు సమర్థుఁడు, దీని నొనర్చుట కతఁడు సమర్థుఁడుగాడను నట్టి దెద్దియు నిందు విషయమై నిబంధనము గానేరదు. ఉద్గీథాద్యుపాసన మొక పురుషార్థమేయైనను, క్రతువునందు నియుక్తుఁ డయినందునను, క్రతువును సాంగముగ నొనర్చుటకు గొనబడుటంజేసియును „యదేవవిద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి” అను వాక్యము ఋత్విక్కర్తృకములగు కర్మములకుపయోగకరముగ ఉపాసనమును విధించుచు కర్మము లెవనితో సంబంధించినవియో,అట్టి కర్మముల కుపయోగముగ విధింపఁబడిన ఉపాసనము గూడ వానితోనే సంబంధించినదని తెలియఁజేయుట వలన నున్న యుద్గీథాద్యుపాసనములు ఋత్విక్కర్తృకములనుట యుక్తము. అయితే సహారాద్యుపాసనములు ఋత్విక్కర్తృకములని శ్రుతులయందు జెప్పి

యుండకపోవుటంజేసి “శాస్త్రఫలం ప్రయోక్తరి” అను న్యాయప్రకారము దహరాద్యుపాసనా ఫలముల ననుభవించువాఁడే వాని నొనర్చువాఁడునని చెప్పవచ్చును.

స్వామ్యధికరణము ముగిసెను.

---

## సహకార్యంతరవిధ్యధికరణము.

౪౭॥ సూ॥ సహకార్యంతరవిధిః పక్షేణతృతీయం తద్వతో విధ్యాదివత్

టీ॥ తద్వతః = బ్రహ్మవిద్యావంతునకు, విధ్యాదివత్ = యజ్ఞాదిసర్వాశ్రమ ధర్మములవలెనే, తృతీయం=మూఁడవదియగు మౌనమున్ను, సహకార్యంతరవిధిః=సహాయకాంతరముగా విధింపఁబడుచున్నది. (ఏలననఁగా) పక్షేణ = మననశీలులగు వ్యాసాదులయెడల మునిశబ్దము ప్రయోగింపఁబడు చున్నది.

తా॥ బ్రహ్మవిద్యావంతునికి యజ్ఞాది సర్వాశ్రమ కర్మములవలెనే మౌనమున్ను విద్యోత్పత్తి విషయమున సహాయకాంతరముగా విధింపఁబడుచున్నది. కనుకనే అట్లు మననశీలులగు వ్యాసాది మహర్షులయెడల మునిశబ్దము ప్రయోగింపఁబడు చున్నది.

శ్రీ॥ భా॥ “తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యంచ పాణ్డిత్యంచ నిర్విద్యాథమునిః” అను బృహదారణ్యకవాక్యము బ్రహ్మవేత్త పాణ్డిత్యమనంబడు ఆత్మజ్ఞానమును బాగుగనెఱింగి బాల్యమనంబడు డంబాద్యభావ రూపమగు బాలభావముతోనుండ గోరునది. ఇట్లు పాండిత్యమును బాల్యమును బాగుగనెఱింగి బ్రహ్మవేత్త మౌనవంతుడు అవఁగా నిదిధ్యాసనపరు డగుచున్నాడని జెప్పుచున్నది.

### సంశయము.

ఈ వాక్యము బాల్యపాణ్డిత్యములనుమాత్రమే బ్రహ్మవేత్తచే గ్రాహ్యములనుగవిధించుచున్నదా? లేక, మౌనమును గూడనటులనే విధించుచున్నదా? లేక మౌనమును బాల్యపాణ్డిత్యములతో ననువదించుచున్నదా?

### పూర్వపక్షము.

పాణ్డిత్యమనినను మౌనమనినను జ్ఞానమే కదా. ఈ జ్ఞానము పాణ్డిత్యం నిర్విద్య” అనుచో విధింపఁబడి “అథమునిః” అనుతావున ననువదింపఁ

బడుచున్నది. "అథమునిః" అనుచో విధ్యర్థక శబ్ద మెద్దియు లేదు; కావున మౌన మిచట ప్రత్యేకముగ విధింపఁ బడుచుండ లేదనిన.

## సిద్ధాంతము.

సూత్రమున "విధ్యాదివత్" అను తావుననుండు విధిశబ్దమునకు "విధీయతే ఇతి విధిః" అను వ్యుత్పత్తినిబట్టి శాస్త్రముచే విధింపఁబడునవి అనఁగా, యజ్ఞాది సర్వాశ్రమకర్మములును శమదమాదులు ననియర్థము. ఆదిశబ్దముచే శ్రవణ మననములు సూచింపఁ బడుచున్నవి. "సహకార్యంతరవిధిః" అను తావునను విధిశబ్దమునకు సహాయకాంతరమై విధింపఁ బడినది యని యర్థము. అది యెట్లనిన, విద్వాంసునకి సర్వాశ్రమ ధర్మములగు యజ్ఞాదులును శమదమాదులును శ్రవణాదులును విద్యాసహకారులుగ విధింపఁ బడినట్లు, మౌనముగూడ వేఱొక విద్యాసహకారిగ విధింపఁ బడుచున్నది. అనఁగా "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేనదానేన" ఇత్యాది వాక్యము జ్ఞాను లిట్టి పరమాత్మను వేదాధ్యయన యజ్ఞ దానాదులచే దెలిసికొనుటకిచ్ఛయించు చున్నారనుచు వేదాధ్యయన యజ్ఞదానాదులను విద్యాసహకారులనుగా విధించుచున్నట్లును "శాంతోదాంత" ఇత్యాది వాక్యము బ్రహ్మవిద్యను దెలిసికొన కోరువాఁడు శమదమాది గుణములు గలవాఁడుగ నుండవలయుననుచు శమదమాదులను విద్యాసహకారులనుగావిధించుచున్నట్లును, "శ్రోతవ్యో మంతవ్యః" అను వాక్యముచేనే నర్థప్రాప్తములయిన శ్రవణమననాదులు విద్యాసహకాలుగ గ్రహింపఁబడుచున్నట్లును "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య" ఇత్యాది వాక్యము బాల్యపాండిత్య మౌనములను మూడింటిని వేఱొక్క విద్యాసహకారులనుగా విధించుచున్నది. సూత్రము నందుండు "పక్షేణ" అను పదము మౌనమనునది బాల్యపాండిత్యములకంటెను వేఱయినదని తెలుపుచున్నది. ఏలననఁగా, మునిశబ్దము ప్రకృష్ట మననశీలులగు వ్యాసాదులకు వాచకముగ ప్రయోగింపబడుచుండుటచే మౌనము బాల్య పాండిత్యములనుబట్టి మూఁడవది. "అథమునిః" అనుచో విధ్యర్థక ప్రత్యయ మెద్దియు లేకపోయినను, మౌనము స్వతఃప్రాప్తము కాదు గాన,నిది యిచట విధింపబడినట్లంగీకరింప వలయును. ఇట్టి మౌనము శ్రవణమున కాధారముగ విధింపఁబడు మననమునకంటెను భిన్నమయినది.అనఁగా ఉపాస్యవస్తువును మనస్సునందు మరలమరల భావనలో నుంచుకొనుట మౌన మనిపించు కొనుచున్నది. "తస్మాద్బ్రాహ్మణః" ఇత్యాది శ్రుత్యర్థము నిటుల నెఱుఁగునది. బ్రాహ్మణః =

విద్వాంసుడు, పాణ్డిత్యం నిర్విద్య=ఉపాస్యమగు బ్రహ్మతత్త్వమును పరిశుద్ధమయిన దానినిగాను, పరిపూర్ణమయిన దానినిగాను నెఱింగి అనఁగా శ్రవణమననములనుండి ప్రాప్తమయిన జ్ఞానమును బొంది అనియర్థము. ఆ జ్ఞానము భగవద్భక్తిమూలకముగఁ గలిగిన సత్త్వవృద్ధిచేఁ గలుగఁజేయఁ బడుచున్నది. కనుకనే శ్రీభగవద్గీతలయందు "నాహం-వేదైః" (భ. గీ. ౧. అ. ౫౩. శ్లో.) ఇత్యాది శ్లోకము మొదలుకొని "భక్త్యాత్వనన్యయాశక్యః" అను పర్యంతము భగవంతుండు వేదాధ్యయనాది సాధనములచే తాఁ దెలిసికొనుటకు శక్యుఁడు గాడనియు అయితే అసాధారణమయిన భక్తిచేఁ దెలిసికొనుటకు శక్యుఁడననియును చెప్పఁబడియె. "యస్య దేవే పరాభక్తిః" "నాయమాత్మా ప్రవచనేన లభ్యః" ఇత్యాది శ్రుతులుగూడ నట్లే తెలుపుచున్నవి. "బాల్యేన తిష్ఠాసేత్" అనుతావునఁ జెప్పఁబడిన బాల్యముయొక్క స్వరూప మిఁకమీఁదు జెప్పఁబడును. "బాల్యంచ పాండిత్యంచ నిర్విద్యాథ మునిస్స్యాత్" అనఁగా విద్వాంసుడు బాల్యపాండిత్యములను బాగుగ గ్రహించి నిదిధ్యాసన రూపమగు విద్యను సంపాదించుకొనుటకై పరిశుద్ధుడును పరిపూర్ణుడునగు పరబ్రహ్మమును గుఱించి మనన శీలుడు కావలయునని యీ వాక్యమున కర్థము. కనుకనే "అమౌనం మౌనం నిర్విద్యాథ బ్రాహ్మణః" అను బృహదారణ్యకవాక్యము మౌనేతరమగు విద్యాసహకారి కలాపమును అనఁగా బాల్యపాండిత్యములను మౌనమునున్ను వాస్తవముగ గ్రహించిన విద్వాంసుడు వాటివలన మాత్రమే పొంద శక్యమయిన విద్యాపూర్తిని బొందుచున్నాడనుచు బాల్యపాండిత్యమౌనములను నీ మూడింటిని మాత్రమే విద్యాసహకారులనుగ దెలియపఱచుచున్నది. మఱియు కహోళుఁడు "కేన బ్రాహ్మణస్స్యాత్" (దేనిచే బ్రహ్మవేత్తయగును?) అని యడుగఁగా, అనఁగా నిట్లు విద్యాపూర్తిని బొందుటకు వీటికంటె నితరములయిన సాధనము లేవియయిన గలవా? యని ప్రశ్నింపఁగా, యాజ్ఞవల్క్యుండు "యేనస్యాత్తేన ఈదృశ ఏవస్యాత్" దేనిచేనగునో, దానిచే నిట్టివాడే యగును. ఇందుల కీమూడింటికంటె నితరములయిన సాధనములు లేవని బృహదారణ్యకమునఁ జెప్పబడియె. కనుక "తత్ప్రత్యుత్తర మిచ్చినట్లు బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య" ఇత్యాది వాక్యము ఏ యాశ్రమమునున్నవాడైనను విద్వాంసుడు స్వాశ్రమ విహితములగు యజ్ఞాదికర్మములవలెనే బాల్యపాండిత్య మౌనములనుగూడ బ్రహ్మవిద్యా సహకారులనుగా గ్రహింపవలయుననుచు నీసూత్రమును సహకార్యంతరముగ విధించుచున్నది.

అవతారిక: — కానిమ్ము, విద్వాంసుండేయాశ్రమముననున్నను, దానికి దాని యాశ్రమ ధర్మములతోఁగూడ బాల్యపాండిత్య మౌనములును విద్యాస హకారులవుగాక! అయితే ఇందువలననేయాశ్రమము నందున్నను, బాల్యపాం డిత్యాది మూలముగ జ్ఞానము గలుగుచుండగా, ఛాందోగ్యమున «అభిసమా వృత్య కుటుంబేశుచౌ దేశే" అని యారంభించి «సఖల్వేవం వర్తయర్ యా వదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే" అను పర్యంతము బ్రహ్మచర్యమును ముగించి గృహమునందుండి శుద్ధప్రదేశమునందు బ్రతికియున్నంతవరకును స్వా ధ్యాయము నధ్యయనముచేయు మానవుఁడు బ్రహ్మలోకమును బొందుచున్నా డు. వాఁడు మరల నీలోకమున జన్మింపడనుచు బ్రతికియున్నంతవరకు గార్హ స్థ్యముతో నుండవలయునని యేల చెప్పఁబడియెనని శంకింపగా, నిందుకు స మాధానము నీసూత్రముచేఁ జెప్పుచున్నారు.

౪౮॥ సూ॥ కృత్స్న భావాత్తు గృహిణోప సంహారః

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము. కృత్స్నభావాత్=అన్నియాశ్రమ ములయందును బ్రహ్మవిద్యకలుగుట సంభవము గాన, గృహిణా=గృహస్థాశ్ర మముతో, ఉపసంహారః=ఆవిషయము ముగింపఁబడియె.

తా॥ అన్ని యాశ్రమములయందును బ్రహ్మవిద్య కలుగుట సంభవము గాన, గృహస్థాశ్రమమునను కలుగునని చెప్పి ముగింపఁ బడెను.

శ్రీ॥ భా॥ అన్ని యాశ్రమములయందును విద్య గలుగవచ్చునుగాన, గృ హస్థాశ్రమమునను విద్య గలుగుట సంభవమనుచు నిచట గృహస్థాశ్రమము తో నుపసంహరించి యున్నారు. కనుక నన్నియాశ్రమములయందును విద్యా ప్రాప్తి గలుగవచ్చునను యభిప్రాయముచే నిచట గృహస్థాశ్రమముతో ము గించిన ట్లెలుంగునది.

అవతారిక: — అట్లే యీ వాక్యమునను «బ్రాహ్మణాః పుత్రేషణాయా శ్చ విత్తేషణాయాశ్చ లోకేషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరతి" అనుచో విద్వాంసుఁ డీషణాత్రయ వినిర్ముక్తుడయి భిక్షాటనము జేయుటయను సన్యాసియొక్క అసాధారణధర్మమును ప్రతిపాదించి, అనంతరము «త స్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య" అనుచో సన్యాసియొక్క ధర్మస్థితికి హేతుభూతములగు బాల్య పాండిత్య మౌనములను విధించుటయును

ఈ బాల్యపాండిత్యాదులు సన్న్యాసాశ్రమమున నుండువానికే గావు, అన్ని యాశ్రమ ములవారికిని విద్యాసహకారులను విషయమును విశదపఱచుటకని తెలుపుటకై ఈ సూత్రము ప్రారంభింపఁబడుచున్నది.

౪౮॥ సూ॥ మౌన వదితరేషా మప్యుపదేశాత్

టీ॥ మౌనవత్ =మౌనమువలెనే, ఇతరేషామపి=ఇతరాశ్రమస్థుల ధర్మములనున్ను, ఉపదేశాత్ =ఉపదేశించుటవలన,

తా॥ మౌనమునువలెనే ఇతరాశ్రమ ధర్మములనున్ను ఉపదేశించుట వలన నట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ సర్వేషణా వినిర్ముక్తుండగు (కోరికలన్నియు నుడిగిన) బ్రహ్మవేత్తకు భిక్షాచరణ పూర్వకముగ మౌనము నుపదేశించుటయనునది బాల్యపాండిత్యాదులు, అన్ని యాశ్రమముల వారికిని విద్యాసహకారులని తెలియ పఱచుటకు గానని యొఱుంగునది. ఏలయనిన ఈ తావున 'మౌనము నుప దేశించిన చందంబున, ఛాందోగ్యమున, "త్రయో ధర్మస్కంధాః" అని యారంభించి, "బ్రహ్మసంస్థో అమృతత్వమేతి" అను పర్యంతము బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమములు ధర్మసాధకమార్గములని చెప్పి వీటిలో నేయాశ్రమముననుండినను బ్రహ్మనిష్ఠుండయినవాడు ముక్తిని బొందుచున్నా డనుచు అన్ని యాశ్రమములవారికిని బ్రహ్మనిష్ఠామూలముగ బ్రహ్మప్రాప్తియు పదేశింపబడియె. ఇట్లు బ్రహ్మనిష్ఠ యన్ని యాశ్రమములవారికిని పొదువయి నది గాన, తత్సాధనమగు బ్రహ్మవిద్యయు పొదువగుటంజేసి తత్సహకారియగు మౌనమున్ను అన్నియాశ్రమములవారికిని పొదువుగానుపదేశింపబడినట్లు స్పష్ట మగుచున్నది. బ్రహ్మసంస్థ శబ్దము కేవల సన్న్యాసులనే కాక, ఇత రాశ్రమస్థులను గూడ సామాన్యముగ దెలియజేయుచున్నదని యింతకుపూర్వము ప్రతిపాదించి యున్నాము. కనుక యజ్ఞాది సర్వాశ్రమ ధర్మములవలె బాల్యపాండిత్య మౌ నములు గూడ విద్యా సహకారులుగ విధింపఁబడుచున్నవనుట యుక్తము.

సహకార్యంతర విధ్యధికరణము ముగిసెను.

---

అనావిష్కారాధికరణము

౪౯॥ సూ॥ అనా విష్కుర్వ న్నన్వయాత్

టీ॥ అనావిష్కుర్వన్ = డంబాదులను జూపింపకుండుటయే కావలసిన దని, అన్వయాత్ =సంబంధమునుబట్టి తెలియుచున్నది.

తా॥ విధివాక్య సంబంధమునుబట్టి బాలునియొక్క డంబాదిరాహిత్య మే వివక్షింపఁబడినట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ “తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్” అను బృహదారణ్యకవాక్యము బ్రహ్మవేత్త పాండిత్యమును బాగుగనెఱింగి బాల్యముతో నుండుటకు కోరవలసినదని తెలుపుచున్నది. ఈ వాక్యమునందుఁ జెప్పఁబడిన బాల్యమనునది బాల్యావస్థయా? లేక, బాలుని చర్యయా? బాల్య వయస్సనంబడు బాల్యావస్థ యిచట నుపాదేయము గాదు. కావున బాల్యమ నఁగా బాలునిచర్యయనుట యుచితము. ఇచట నొకసంశయము గలుగుచున్నది.

—స ం శ య ము.—

అయితే బాలుని చర్యయనఁగా స్వేచ్ఛా సంచారము మొదలగు బాల్యచర్యల నన్నింటిని విద్వాంసుడు గ్రహింపవలయునని ఈ శ్రుత్యభిప్రాయ మా? కాక, బాలునివలె విద్వాంసుడు తన్నుతాను పొగడుకొనక డంబాది రహితుడై యుండవలయు ననియా,

—పూ ర్వ ప క్ష ము.—

బాలునియొక్క డంబాదిరాహిత్యమును మాత్రము విద్వాంసుడు గ్రహింప వలయునను విశేష మెద్దియు నిచట గానఁబడదు గాన, స్వేచ్ఛా సంచారము మొదలగు బాల్యచర్య లన్నింటిని యతం డవలంబింప వలయు ననుట శ్రుత్యభిప్రాయమనవచ్చును. అట్లయినచో, శాస్త్రాంతరములయందు విద్వాంసుని నడవడికను గుఱించి చెప్పఁబడియున్న నియమములన్నియు నీశ్రుతిచే బాధింపబడుచున్నవనినచో,

—సి ద్ధా ం త ము.—

ఇటు జెప్పుట యుక్తము కాదు. విద్వాంసుడు బాలునివలె తన్ను తా నితరులయొద్ద ప్రకటించుకొనక డంబదర్పాది రహితుండై యుండవలయు నని శ్రుత్యభిప్రాయము. ఏలననిన ఇట్లు డంబదర్పాది రాహిత్యము మాత్ర ము బ్రహ్మవేత్తయొక్క బ్రహ్మవిద్యాభ్యాసమున కనుకూల మయినది. “బాల్యే నతిష్ఠాసేత్” అను విధియందు దానికే సంబంధము గలదు. స్వేచ్ఛా విహారము మొదలగు బాల్యచర్యలు బ్రహ్మవిద్యాభ్యాసమునకు విరుద్ధ ములు. కనుకనే, “నావిరతో దుశ్చరితాత్ నాశాంతోనా సమాహితః నా శాంతమానసోవాపి। ప్రజ్ఞానేనైన మాప్నుయాత్” అను కఠోపనిషద్వా క్యము “చెడునడవడికగలిగి, ఇంద్రియ చలనముడుగక, ఏకాగ్రచిత్తము లేక, అన్నిం

టియందు వ్యాపించు చిత్తముగలవాఁడీపరమాత్మను బొందదు అనియును "ఆహార శుద్ధౌసత్వశుద్ధిః" అను ఛాందోగ్యవాక్యము మొదలగునవి పరిశుద్ధమైనపదార్థములను భుజించిన మనస్సునందు నైర్మల్యతగలుగుననియును జెప్పుచున్నది.

అనావిష్కారాధికరణము ముగిసెను.

—✦—

## ఐహికాధికరణము.

౫౧॥ సూ॥ ఐహిక మప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్

టీ॥ఐహికం=ఇహలోకసుఖములనిచ్చువిద్య, అప్రస్తుతప్రతిబంధే=ప్రతిబంధక మెద్దియు లేనిపక్షమున; (పుణ్యకర్మములనుండి వెంటనే గలుగవచ్చును. ఏల ననఁగా) తద్దర్శనాత్ =అట్లు శ్రుతులయందుఁ గానఁబడుటవలన.

తా॥ఐహిక ఫలసాధనమగు విద్యనిర్బంధ మెద్దియును లేనిపక్షమున పుణ్యకర్మములనుండి వెంటనేగలుగవచ్చును. అట్లు శ్రుతు లంగీకరించు చున్నవి.

శ్రీ॥ భా॥ శాస్త్రమునందు రెండువిధములగు విద్యలు విధింపఁబడినవి. వానిలో నొక్కటి సాంసారిక సుఖము నిచ్చునది. వేఱొక్కటి మోక్షము నిచ్చునది. ఈసందర్భమున నొక సంశయము గలుగు చున్నది.

### సంశయము.

పుణ్యకర్మములచే సంపాదింపఁ బడునట్టియు సాంసారిక ఫలము నిచ్చునట్టి విద్య కర్మముల నాచరించిన వెంటనే గలుగుచున్నదా? లేక, అది యట్టి కర్మముల నాచరించిన వెంటనే గాని, లేక మఱియొకప్పు డెప్పుడైనను గాని యిప్పుడను నియమ మెద్దియు లేకయే గలుగు చున్నదా?

### పూర్వపక్షము.

పుణ్యకర్మముల నాచరించినవెంటనే అభ్యుదయఫలసాధనభూతమగు విద్య గలుగుచున్నదనుట యుక్తము. ఏలయనిన, పూర్వమొనర్చిన పుణ్యకర్మమువలనఁగదా విద్య గలుగుచున్నది. కనుకనే శ్రీభగవద్గీతయందు "చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున" అను శ్లోకమున పుణ్యాత్ములగు నాలుగు తెగలవారు నన్ను భజించుచున్నారని భగవంతునిచే స్వయముగ జెప్పఁబడియె. విద్యాసాధన భూతములగు కర్మము లాచరింపఁబడిన వెంటనే విద్యోత్పత్తి గలుగక విళంబమగుటకు తగు కారణమెద్దియు గానఁబడదు గాన, వెంటనేం విద్య యుత్పన్న మగుచున్నదనుట యుక్తము.

## సిద్ధాంతము.

అభ్యుదయ ఫలసాధన భూతమగు విద్య స్వసాధన భూతములగుపుణ్య కర్మములాచరింపఁబడిన వెంటనే గలుగుటకు ప్రబలకర్మ మేదియు నిర్బంధముగ లేనియెడల నవి వెంటనే గలుగుచున్నది. అట్టి నిర్బంధ మేదియయిన నున్నచో, విద్య వెంటనే గలుగక మఱియొకప్పుడు గలుగుచున్నది. కావున నవి యిక్కాలమున గలుగుననెడి నియమ మేదియు నుండజాలదు. ఒక కర్మమువలనఁ గలుగవలసినది యాకర్మముకంటె బలవత్తరమయిన కర్మమువలననాటంకపఱుపఁబడునని “యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరంభవతి” ఇత్యాది శ్రుతియే ఉద్గీథ విద్యాయుక్తమయిన కర్మమునకు ఫలము నిచ్చు విషయమై నిర్బంధము గలుగనేరదనుటచే నంగీకరించుచున్నది.

ఐహికాధికరణము ముగిసెను.

---

## ముక్తిఫలాధికరణము.

౫౨॥ సూ॥ ఏవం ముక్తిఫలానియమస్తదవస్థావధృతేః తదవస్థావధృతేః

టీ॥ ఏవం=ఇట్లు, ముక్తిఫలానియమః=ముక్తిఫలమునిచ్చు బ్రహ్మవిద్య గలుగుటకును, అనియమః=ఇక్కాలమున గలుగుననెడి నియమము లేదు. తదవస్థావధృతేః=అది కలుగుటకును ప్రతిబంధక ముండవచ్చును గదా?

తా॥ మోక్షము నిచ్చునట్టి బ్రహ్మవిద్య గలుగుటకు ప్రతిబంధ ముండవచ్చునుగాన, అదియును ఇక్కాలమున గలుగుననెడి నియమ ముండజాలదు.

శ్రీ॥ భా॥ ఇట్లు మోక్షసాధన భూతమయిన బ్రహ్మవిద్యగూడ గలుగుటకు ప్రతిబంధకముండుటయు, లేకపోవుటయును సంభవములుగాన నిదియును స్వసాధన భూతములగు నుత్కృష్ట కర్మము లాచరింపఁబడిన వెంటనే గాని, కాలాంతరమునఁ గాని కలుగవచ్చును. కనుక దీనికిగూడ కాలనియమముండజాలదు.

శంక: — కర్మములన్నిటికంటెను మోక్షసాధన భూతమగు బ్రహ్మవిద్యకు సాధనభూతములగు కర్మములు ప్రబలములయినందున నట్టి కర్మఫలమునకెద్దియయిన ప్రతిబంధముండుట యసంభవమనిన చో,

సమాధానము: — కర్మములు మోక్షసాధనభూతమగు బ్రహ్మవిద్యను గలుగఁజేయునపుడు వానికంటె బలవత్తరములగు పూర్వకృత భాగవతాపచారములు నిర్బంధములుగావచ్చును.

తృతీయాధ్యాయము ముగిసెను.

---

    

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## చతుర్థాధ్యాయము——ప్రథమపాదము

### ఆవృత్త్యధికరణము

### ౧॥ సూ॥ ఆవృత్తిరసకృదుపదేశాత్

టీ॥ ఉపదేశాత్ = ధ్యానపర్యాయమును, ఉపాసనపర్యాయమునునగు వేదనశబ్దముచే నుపదేశించుటవలన, అసకృత్ =పలుమాఱు, ఆవృత్తిః=బ్రహ్మవేదనాభ్యాసము, (కర్తవ్యా=చేయఁదగినది).

తా॥ శ్రుతులయందు బ్రహ్మవేదనమును ధ్యానపర్యాయమును, ఉపాసనపర్యాయమునునగు వేదనశబ్దముచే నుపదేశించి యున్నందున, బ్రహ్మవేదనాభ్యాసము పలుమాఱు చేయఁదగినది.

శ్రీ॥ భా॥ తృతీయాధ్యాయమున బ్రహ్మవిద్యయు, తత్సాధనములును, నిరూపింపఁబడినవి. తరువాత ఈయధ్యాయమున బ్రహ్మవిద్యాస్వరూప విశోధనపూర్వకముగా, విద్యాఫలమును గుఱించి విచారించుచున్నారు.

#### సంశయము.

౧. "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై. ఆ. ౧-౧) (బ్రహ్మమునుపాసించువాఁడు పరమగు మోక్షమును బొందుచున్నాఁడు.) అనియు, "తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి" (శ్వే. 3. ౮.) (అట్టి బ్రహ్మము నివ్విధముగా నుపాసించి జన్మమరణరహితమగు మోక్షమును బొందుచున్నాఁడు.) అనియు, "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ము. 3 ము. ౨ ఖ. ౯.) (బ్రహ్మము నుపాసించువాఁడు బ్రహ్మము ఎవ్విధమైనవాఁడో అవ్విధమైన వాఁడగుచున్నాఁడు) అనియు

"యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం" (ము. 3 ము. ౧ ఖ. 3) (ఎప్పుడు ఈ విద్వాంసుఁడు బంగారపు వర్ణముగల పరమాత్మను సాక్షాత్కరించునో) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములచే బ్రహ్మప్రాప్తిసాధనముగా విధింపఁబడు బ్రహ్మవేదనమును ఒక్కమాఱు అనుష్ఠింపవలయుననుట శాస్త్రాభిప్రాయమా? లేక అట్టి వేదనమును పలుమాఱు అనుష్ఠింపవలయుననియా?

## పూర్వపక్షము.

ఒక్కమాఱు అనుష్ఠించుట యుక్తము. ఏలననిన, "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అను నీ మొదలగు శ్రుతివాక్యములు వేదనమాత్రమును విధించుచున్నది. వేదనమును పలుమాఱు అనుష్ఠింపవలయు ననుటకుఁ బ్రమాణమేమియు లేదు.

[1]అవఘాతాది కర్మముల వలెనే బ్రహ్మవేదనము బ్రహ్మ సాక్షాత్కారమును గుఱించి [2]దృష్టోపాయ మగుటవలన నది కార్యము గలుగు వఱకు పలుమాఱు అనుష్ఠింప వలసినదని యెందువలన గ్రహింపఁగూడదని శంకింపఁదగదు. ఏలననిన, అవఘాతాదికర్మములు దృష్టోపాయము లగునట్లు బ్రహ్మవేదనము దృష్టోపాయము కాదు. ఏలననిన, "ఫలమతఉపపత్తేః" (బ్ర. సూ. 3 అ. ౨ పా. 3౨ సూ.) అను సూత్రమున జ్యోతిష్టోమాది కర్మములున్ను వేదాంతశాస్త్రముచే విధింపఁబడు బ్రహ్మవేదనమున్ను, పరమపురుషారాధనములనియు, వీనిచే నారాధింపఁబడు పరమపురుషుని వలన ధర్మార్థకామమోక్షము లనఁబడు పురుషార్థములు పొందఁబడు చున్నవనియును బ్రతిపాదింపబడియె. అట్టి జ్యోతిష్టోమాది కర్మము లొక్క

---

(1) కర్మకాండమున విధింపఁబడు దర్శపూర్ణమాస్య కర్మము నాచరించుటకై పురోడాశమను వంటకమును చేయవలసియుండె. అందు నిమిత్తము బియ్యము గావలసియున్నందున "వ్రీహీనవహంతి" అను వాక్యము "వడ్లను కొట్టవలయును, అనఁగా దంపవలయునని విధించుచున్నది. ఈ సందర్భమున నొక రోకటిపోటును వడ్లమీద వేయవలయునని శాస్త్రాభిప్రాయమా? లేక, అనేక రోకటి పోట్లను వేయవలెననియా? యని విచారించి యనేక రోకటి పోట్లను వేసినగాని, బియ్యపుగింజలు వడ్లనుండి బయలు వెడలవు. గాన, బియ్యము బయలుపడు వరకు ననేక రోకటి పోట్లను వేయవలయునని జెప్పుట కెద్దియుఁ బ్రమాణము లేకున్నను యనేక రోకటి పోట్లను వేయవలయుననుట శాస్త్రాభిప్రాయమని పూర్వ మీమాంసాశాస్త్రమున నిర్ణయింపఁబడియె. అటులనే యిచటగూడ వేదనమును బదేపదే యాచరించినఁగాని బ్రహ్మపరోక్ష్యమును సాక్షాత్కారముగాదు. కావున దీనిని బదేపదే యాచరింపవలయు ననుటకు ప్రమాణ మెద్దియు లేకున్నను అట్టి సాక్షాత్కార మగువరకును వేదనమును బదేపదే యాచరింపవలయుననుట శాస్త్రాభిప్రాయమని యెందువలన గ్రహింపగూడదనిన

(2) దృష్టోపాయము=ఉపాయముగా ననుభవమునఁ దెలియఁబడినది.

మాఱు మాత్రమే యనుష్ఠింపఁ బడుచున్నట్లు బ్రహ్మవేదనమును సయితము, శ్రుతులయందుఁ జెప్పియున్నట్లు, ఒక్కమాఱు మాత్రము అనుష్ఠింప వలయు ననుట శాస్త్రాభిప్రాయ మనిన,

సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. బ్రహ్మవేదనమును పలుమాఱు అనుష్ఠింపవలయుననుట శాస్త్రాభిప్రాయము. ఏలననిన, అట్టి బ్రహ్మ వేదనము ధ్యాన పర్యాయమును, ఉపాసనపర్యాయమునునగు వేదనశబ్దముచేఁ జెప్పఁ బడుచున్నవి.[1] అదెటులనిన, బ్రహ్మజ్ఞానోపదేశములగు వాక్యములయందు, ఒక్కటే విషయమును గుఱించి "విది" "ఉపాస్తి" "ధ్యాయతి" ధాతువులను ప్రయోగించియుండుటవలన వేదనమన్నను, ధ్యానమన్నను ఉపాసనమన్నను, ఒక్కటియేయని తెలియనచ్చుచున్నది.

అదెటులనిన:—"మనో బ్రహ్మేత్యుపాసీత" అను వాక్యమున "ఉపాసీత" అని యుపాసనముతో నుపక్రమించిన యర్థము "భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద" అనువాక్యమున "వేద" అని వేదనముతో నుపసంహరింపఁబడుచున్నది.

అట్లే "యస్తద్వేద యత్స వేద సమయైతదుక్తః" అనువాక్యమున రైక్వుని జ్ఞానము "వేద" అని వేదనముతో నుపక్రమింపఁబడి "అనుమ ఏతాం భగవో దేవతాం శాధి యాందేవతా ముపాస్సే" అనువాక్యమున "ఉపాస్సే" అని యుపాసనముతో నుపసంహరింపఁబడుచున్నది.

అట్లే "బ్రహ్మ విదాప్నోతి పరం" (తై ఆ. ౧. ౧) ఇత్యాది వాక్యములతో సమానార్థములగు "ఆత్మానా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" అనియు, "తతస్తు తం పశ్యతి నిష్కళం ధ్యాయమానః" అనియు నీ మొదలగు వాక్యములయందు వేదనము "నిదిధ్యాసితవ్యః" "ధ్యాయమానః" అనుపదములచే ధ్యానముగాఁ జెప్పఁబడుచున్నది.

ధ్యానమనఁగా చింతనము. అది యెడ తెగని స్మృతి. ఒక్క పర్యాయము మాత్రము స్మరించుట ధ్యానము కాదు. "ఉపాస్తి" శబ్దమున కనేకతావుల ఎడతెగనియైకాగ్రచిత్తవృత్తిని దెలియఁజేయుటకై ప్రయోగము గానఁబడుచున్నందున దానికి అట్టి యెడ తెగని స్మృతియనే యర్థము. కనుక "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" "జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః" అను నీమొదలగు వాక్యముల యందంతటను వేదనము మొదలగు శబ్దములచే నెడతెగకుండ పలుమాఱు అనుష్ఠింపఁబడు స్మరణమే చెప్పఁబడు చున్నది.

---

(1) మొదటి సంపుటము ౧౫—౧౯ పత్రములను చూడుము.

౨॥ సూ॥ లిం గా చ్చ.

టీ॥ లింగాత్-చ=స్మృతివలనఁ గూడ (బ్రహ్మవేదనము స్మృతిసంతతి రూపమని తెలియఁబడుచున్నది.)

తా॥ స్మృతివలనఁగూడ బ్రహ్మవేదనము స్మృతిసంతతి రూపమని తెలియ వచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ లింగమనఁగా స్మృతిశాస్త్రము. మోక్షసాధనభూతమగు జ్ఞానము స్మృతిసంతతి రూపమని స్మృతుల వలనఁగూడ తెలియవచ్చు చున్నది. ఏలననిన, "ఏతద్రూప ప్రత్యయేచైకా సంతతిశ్చాన్యనిస్పృహా తద్ధ్యానం ప్రథమైష్షడ్భిరంగైర్నిష్పాద్యతే తథా॥" (విష్ణు. ౬ అం. ౭. అ ౯౧ శ్లో) అను వాక్యము, "వేఱొక చింతనము లేనిదియు ఏకాగ్రతగల స్మృతియే బ్రహ్మమును తెలిసికొనుటకు ముఖ్యసాధనము. అట్టిస్మృతి ధ్యానమనఁబడును. అది మొదటి యాఱంగములచే సంపాదింపఁబడుచున్నది" అని చెప్పుచున్నది. కనుక నీహేతువులను బట్టి బ్రహ్మవేదనమును పలుమాఱు అనుష్ఠింప వల యునని శాస్త్రాభిప్రాయము.

ఆవృత్త్యధికరణము ముగిసెను.

---

ఆత్మత్వోపాసనాధికరణము.

౩॥ సూ॥ ఆ త్మే తి తూ ప గ చ్ఛ న్తి గ్రా హ య న్తి చ

టీ॥ ఆత్మా-ఇతి-తు=సర్వేశ్వరుఁడు ఉపాసకుని యాత్మయనియే, (ఉపా స్యః=ఉపాసింపఁదగినవాఁడు. ఏలననఁగా,) ఉపగచ్ఛంతి=పూర్వులగు నుపాస కు లిట్లు అంగీకరించుచున్నారు, చ=మఱియు, గ్రాహయన్తి = శాస్త్రములిట్లు గ్రహింపఁజేయు చున్నవి.

తా॥ సర్వేశ్వరుఁడు ఉపాసకుని యాత్మయనియే యుపాసింపవలయును. పూర్వులగు నుపాసకులిట్లు అంగీకరించుచున్నారు. మఱియు శాస్త్రములు ఇట్లు గ్రహింపఁజేయుచున్నవి.

సంశయము.

శ్రీ॥ భా॥ ఉపాసకుఁడట్లు బ్రహ్మము నుపాసింపునపుడు బ్రహ్మము తన కంటె నన్యమను భావనతో నుపాసింపవలయునా? లేక, బ్రహ్మము తన యాత్మయే యను భావనతో నుపాసింపవలయునా?

## పూర్వపక్షము.

బ్రహ్మము తనకంటె నన్యమను భావనతో నుపాసించుట యుక్తము. ఏలననిన, ఉపాసకుని ప్రత్యగాత్మకంటె బ్రహ్మము వేఱైనది. "అధికంతుభేద నిర్దేశాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౨౨ సూ) అనియు "అధికోపదేశాత్" (బ్ర. సూ. 3 అ. ४ పా. ౮ సూ) అనియు "నేతరో నుపపత్తేః" (బ్ర. సూ ౧ అ. ౧ పా. ౧౬ సూ) అనియు నీ మొదలగు బ్రహ్మసూత్రములచే బ్రహ్మము ప్రత్యగాత్మకంటె నన్యమనిగదా ప్రతిపాదింపఁబడియె. కనుక బ్రహ్మమును యథావస్థితముగా అనఁగా బ్రహ్మము వాస్తవముగా నెట్లున్నదో యట్లే యుపాసింపవలయును. విపరీతముగా నుపాసించినచో, బ్రహ్మప్రాప్తియును విపరీతమే యగును, ఏలననిన, "యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" (ఛా. 3 ప్ర. ౧४ ఖ. ౧ వా) అను శ్రుతివాక్యము "పురుషుఁడీలోకమునం దెట్టి భావనతో నుండునో, ఈలోకమునుండి బయలు వెడలినప్పుడును అట్టిఫలమే గలవాఁడగును" అని గదా చెప్పుచున్నది. కనుక నుపాసకుఁడు బ్రహ్మమును తన ప్రత్యగాత్మకంటె నన్యమను భావనతో నుపాసింపవలయు ననిన.

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఉపాసకుఁడు పరబ్రహ్మమును తన యాత్మ యను భావనతో నుపాసింపవలయును. అనఁగా ఉపాసకుని ప్రత్యగాత్మ వాని శరీరమున కాత్మ యెట్లో, అట్లే పరబ్రహ్మము తన ప్రత్యగాత్మ యొక్క యాత్మయను భావనతో నుపాసనముఁ జేయవలయుననుట. ఏలననిన,

"త్వంవా అహమస్మి భగవో దేవతే అహంవై త్వమసి" అను శ్రుతి వాక్యము. "ఓపూజ్యమగు దేవతా! నీవే నేను, నేనే నీవు" అనుచు నిట్టి భావ నను బూర్వికులగు ఉపాసకులంగీకరించుచున్నట్లు తెలుపుచున్నది. ఉపాసకుఁడు తనకంటెను అన్యమగు బ్రహ్మమును "నేను" అని దెలిసికొనుట విరుద్ధము గాదా? యంటివేని, శాస్త్రములు ఉపాసకులను అట్లు గ్రహింపఁజేయుచున్నవి. ఎట్లన,

"య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాఽత్మా శరీరం య ఆత్మానమంతరో యమయతి స త ఆత్మా ఽన్తర్యామ్యమృతః" అను శ్రుతి వాక్యము "ఏ పరమాత్మ ప్రత్యగాత్మయం దున్నదై, ప్రత్యగాత్మ లోపలనుండి, ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁబడక, ప్రత్యగాత్మను లోపలనుండి నియమించుచున్నదో, యదియే నీయొక్క యాత్మయు, అంతర్యామియు, అమృతస్వరూపుఁడును" అని బోధింపుచున్నది.

"సన్మూలాః సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః ఐతదాత్మ్యమిదంసర్వం" (ఛా. ౬. ప్ర. ౮ఖ. ౪.) అను శ్రుతివాక్యము "ఓ శ్వేతకేతుఁడా! యీప్రజలందఱు సత్తనంబడు బ్రహ్మమే యాధారముగాఁ గలవారు. మఱియు నాబ్రహ్మమందే స్థితిని బొందుచున్నారు. ఇదియంతయు బ్రహ్మసంబంధమైనది" అని బోధింపుచున్నది.

"సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి" (ఛా. 3. ప్ర. ౧౪ఖ. ౧ వా.) అను శ్రుతివాక్యము "ఇది యంతయు బ్రహ్మము వలనఁబుట్టి బ్రహ్మమువనుండి బ్రహ్మమున లయమగుటంజేసి బ్రహ్మాత్మకమని బోధింపుచున్నది. చిదచిత్స్వరూపమగు నిదియంతయు బ్రహ్మమునుండియే బుట్టినదగుటవలనను, బ్రహ్మమువలననే రక్షింపఁబడిన దగుట వలనను, బ్రహ్మమునందే లయమగుటవలనను, బ్రహ్మముచే నియమింపఁబడిన దగుటవలనను, బ్రహ్మమునకు శరీరమగుటవలనను, సర్వమునకును ఈబ్రహ్మము ఆత్మ. కనుక, అది నీయొక్కయాత్మ.

ప్రత్యగాత్మ దేవమనుష్యాది శరీరములందుండు ఆత్మయగుటం జేసి దానిని "దేవోఽహం=నేను దేవుఁడను, మనుష్యోఽహం = నేను మనుష్యుఁడను" అన్నట్లు "అహం=నేను" అని యనుసంధించుట యుక్తమగునట్లు ప్రత్యగాత్మకును పరమాత్మ యాత్మయగుటంజేసి పరమాత్మ ననుసంధించుకొను నపుడును "అహం=నేను" అని యనుసంధించుకొనుట యుక్తము. సర్వజ్ఞానములు బ్రహ్మైకనిష్ఠములగుటవలన తద్వాచకములగు శబ్దములన్నియు బ్రహ్మమునే దెలియజేయుచున్నవి. ఇట్టి శాస్త్రప్రతిపాదితమగు సంబంధమును అంగీకరించి "త్వంవా అహమస్మి భగవో దేవతే అహం వైత్వమసి భగవో దేవతే" అను శాస్త్రమున "ఓదేవతా! నీవే నేను, నేనే నీవు" అను వ్యతిరేకానుసంధానమును శాస్త్రకారులు చెప్పియున్నారు. ఈ కారణము వలననే "అథయోన్యాం దేవతాముపాస్తే అన్యోసా వన్యోహ మస్మీతి నసవేద" అను శ్రుతి వాక్యము "ఎవఁడు తాను ఉపాసనజేయు దేవత వేఱు తాను వేఱు అను భావనతో నుపాసించుచున్నాఁడో, వాఁడు బ్రహ్మజ్ఞానము లేనివాఁడు" అనియు "అకృత్స్నోహ్యేష ఆత్మేత్యేవోపాసీత" అను వాక్యము "ఈప్రత్యగాత్మయ సంపూర్ణుఁడు గనుక, ఆత్మయను భావనతో పరమాత్మ నుపాసింపవలయును" అనియు, "సర్వంతం పరాదోద్యోఽన్యత్ర ఆత్మన స్సర్వం వేద" అను వాక్యము "ఎవఁడు సర్వము నాత్మకంటె భిన్నమని భావింపుచున్నాఁడో, యతనిని సర్వమున్ను వేఱుగాఁ జేయును" అనియు నీవిధముగా జెప్పుచు, యుపాసనమును గుఱించి ఆత్మభావనను దప్ప ఇతర భావనల నన్నింటిని నిషేధింపుచున్నవి. "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా" అను శ్రుతివాక్యముచే జెప్పఁబడిన పృథక్త్వానుసంధానయున్ను విరుద్ధముకాదు. ఏలననిన, పరమాత్మ నుపాసింపునపుడు "నేను"

అను భావనతో నతనిని స్వాత్మనుగా నను సంధానము జేయవలయునని జెప్పు టచే పరమాత్మను స్వభిన్నముగానను సంధింపగూడదని స్థిరపఱచినారు. మఱియు ఉపాసకుఁడు తన ప్రత్యగాత్మను తన శరీరముకంటెను వేఱైన దానినిగా భావించునట్లు పరమాత్మను(తన)ప్రత్యగాత్మకంటెను వేఱైన దానినిగా భావింపఁ దగును గాన, ఇందుచే పృథక్త్వాను సంధానమున్ను రక్షింపఁబడినది.

వేఱయినదైనను, బ్రహ్మము ప్రత్యగాత్మయొక్క యాత్మయయినందునను, ప్రత్యగాత్మ పరమాత్మకు శరీరమగుటవలనను, ప్రత్యగాత్మసంపూర్ణమైనది గాదని చెప్పియున్నారు. కనుక నీపైని గనఁపఱచిన హేతువులవలన పరమాత్మ నుపాసించునపుడు ఉపాసకుఁడు అతనిని తన యాత్మయను భావనతో నుపాసింపవలయునని సిద్ధమగుచున్నది.

ఆత్మత్వోపాసనాధికరణము ముగిసెను.

---

## ప్రతీకాధికరణము.

### ౪॥ సూ॥ న ప్రతీకే న హి సః.

---

టీ॥ ప్రతీకే=ప్రతీకమునందు, న=ఆత్మత్వాను సంధానము జేయరాదు, ఏలననఁగా, సః=ప్రతీకము, నహి=ఉపాసకుని యాత్మకాదు గదా!

తా॥ ప్రతీకముపాసకుని యాత్మకాదు గాన, ప్రతీకమునందాత్మత్వాను సంధానముఁ జేయరాదు.

శ్రీ॥ భా॥ "మనోబ్రహ్మేత్యుపాసీత" (ఛా. 3. ప్ర ౧౮. ౧ ఖ.) అనియు, "సయో నామబ్రహ్మేత్యుపాస్తే" (ఛా. ౭. ప్ర ౧. ౫ ఖ.) అనియు నీ మొదలగు వాక్యములు, మనస్సును, బ్రహ్మమునుగా నుపాసింపవలయు ననియు, నామమును బ్రహ్మమునుగా నుపాసింపవలయుననియు, నీవిధముగాఁ జెప్పుచు, ప్రతీకోపాసనములను విధింపుచున్నవి. ఇచట నొకసంశయము గలుగుచున్నది.

#### సంశయము.

ప్రతీకోపాసనముల ననుష్ఠించునపుడు మనస్సు నామము మొదలగు ప్రతీకములే పరబ్రహ్మమని భావింపవలయునా? లేక వానినట్లు భావింపఁ గూడదా?

#### పూర్వపక్షము.

"మనోబ్రహ్మేత్యుపాసీత" అను నీ మొదలగు శ్రుతివాక్యములచే విధింపఁబడు ప్రతీకోపాసనము బ్రహ్మోపాసనమువంటిది యయినందునను,

బ్రహ్మము ఉపాసకుని యాత్మమైనందునను, మనస్సు మొదలుగాఁగల ప్రతీకమే త్మయను భావనతో ప్రతీకోపాసనముల ననుష్ఠింపవలయుననిన,

సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తముకాదు. మనస్సు మొదలగు ప్రతీకమే యాత్మ యను భావనతో ప్రతీకోపాసనముల ననుష్ఠింపఁగూడదు. ఏలననిన—మనస్సు మొదలగు ప్రతీకములు ఉపాసకుని యాత్మగావు. ఇంతియెగాక, ప్రతీకోపాసనము నందు ఉపాస్య వస్తువు బ్రహ్మముగాదు. ప్రతీకమే యుపాస్య వస్తువు. అయినను, దానియందు బ్రహ్మదృష్టిని మాత్రముంచి యుపాసింపవలయును. బ్రహ్మము కాని దానిని బ్రహ్మమునుగా భావించి యుపాసించుటనుగదా, ప్రతీకోపాసనమం దురు. కనుక ప్రకృతమున ఉపాస్యమగు ప్రతీకము ఉపాసకుని యాత్మగా నందున, ప్రతీకమే యాత్మయను భావనతోఁ బ్రతీకోపాసనము ననుష్ఠింపఁ గూడదు.

అవతారిక—అయినను, ప్రకృతముననును బ్రహ్మమే యుపాస్యమగుట సంభవమగుచుండ, అచేతనములును, అల్పశక్తులును నగు మనస్సు మొదలగునవి యుపాస్యములని చెప్పుట యుక్తము కాదు. అందువలన నిచట బ్రహ్మమే యుపాస్యము. కాఁబట్టి బ్రహ్మమునే మనస్సు మొదలగు పదార్థములనుగా భావించి యుపాసింప వలయుననిన,

గీ॥ సూ॥ బ్రహ్మదృష్టిరుత్కర్షాత్

టీ. ఉత్కర్షాత్=ఆధిక్యమువలన, బ్రహ్మదృష్టిః=మనస్సు మొదలగు వానియందు బ్రహ్మభావన, కర్తవ్యా=చేయఁదగినది.

తా॥ సర్వోత్కృష్ట బ్రహ్మదృష్టి మనస్సుమొదలగు వానియందుత్కర్షను గలుగఁజేయుచున్నది గాన, మనస్సు మొదలగు వానియందు బ్రహ్మదృష్టి జేయఁ దగినది.

శ్రీ॥ భా॥ మనస్సు మొదలగువానిని బ్రహ్మముగా భావించుట యుక్తము. అయితే బ్రహ్మమును, మనస్సు మొదలగు పదార్థమునుగా భావించుట యుక్తము కాదు. ఏలననిన, మనస్సు మొదలగు వానికంటెను బ్రహ్మము ఉత్కృష్టమైనది. మనస్సు మొదలగునవి నికృష్టములు. ఉత్కృష్టుఁడగు రాజును భృత్యునిగా భావించుట చిన్నబుచ్చుటగదా; అయితే భృత్యుని రాజునుగా భావించుట స్తోత్రమనిపించుకొనుచున్నది.

ప్రతీకాధికరణము ముగిసెను.

## ఆదిత్యాదిమత్యధికరణము.

౬॥ సూ॥ ఆదిత్యాదిమతయశ్చాఙ్గ ఉపపత్తేః

టీ॥ అఙ్గే = కర్మాంగములగు ఉద్గీథాదులయందు, ఆదిత్యాదిమతయశ్చ = సూర్యాదిబుద్ధులే, ఉపపత్తేః=ఉపపన్నములగుట వలన, (కార్యాః= చేయఁదగినవి.)

తా॥ కర్మాంగములగు నుద్గీథాదులయం దాదిత్యాది దృష్టులనుంచవలయును. ఏలయన, ఆదిత్యాది దేవతారాధనద్వారా కర్మములు ఫలదాయకములగును. ఇట్లాదిత్యాది దృష్టులనుంచుట వానికుత్కృష్టత్వమును గలుగఁజేయును.

శ్రీ॥ భా॥ "య ఏవాసౌ తపతి తముద్గీథ ముపాసీత" (ఛా.౧ప్ర.౩ఖ.౧వా.) (ఎవఁడు తాపమును గలుగఁజేయుచున్నాఁడో, యతనిని, [1]ఉద్గీథముగా నుపాసింప వలయును) ఇత్యాది శ్రుతులయందు ఉద్గీథాది కర్మాంగములను గుఱించి విధింపఁబడిన ఉపాసనములవిషయమై యొకసంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఈయుద్గీథాద్యుపాసనముల ననుష్ఠించునపుడు ఉద్గీథాదులను, అనఁగా సామగానము మొదలగు వానిని ఆదిత్యాదులనుగా భావించి యుపాసింపవలయునా? లేక, ఆదిత్యాదులను ఉద్గీథాదులనుగా భావించి యుపాసింప వలయునా?

### పూర్వపక్షము.

నికృష్టపదార్థముల నుత్కృష్టపదార్థములనుగా భావించుట న్యాయము. ఉద్గీథాదులన్నో, ఫలసాధన భూతములగు కర్మములకంగము లగుటచే, ఫలసాధన భూతములుకాని యాదిత్యాదులకంటె నుత్కృష్టములు. కనుక ఆదిత్యాదుల నుద్గీథాదులనుగా భావించి యుపాసించుట యుక్తమనిన,

### సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. కర్మాంగములగు నుద్గీథాదుల నాదిత్యాదులనుగా భావించి యుపాసనము ననుష్ఠింపవలయును. ఏలయన, ఉద్గీథాదులకంటె నాదిత్యాదులు ఉత్కృష్టములు. ఆదిత్యాది దేవతలను సంతోషింపఁజేయుటవలనఁగదా కర్మములు ఫలసాధనములగుచున్నవి. కనుక నుద్గీథాదుల నాదిత్యాదులనుగా భావించుట యుక్తము.

ఆదిత్యాదిమత్యధికరణము ముగిసెను.

---

(1) మొదటి సంపుటము ౯-వ పత్రమున ౨-వ వివరణమును చూఁడుఁడు.

## ఆసీనాధి కరణము.

### ౭॥ సూ॥ ఆ సీ న స్సం భ వా త్

టీ॥ ఆసీనః=కూర్చుండినవాఁడై (ఉపాసీత=ఉపాసింపవలయును) ఏల యనఁగా, సంభవాత్= (అప్పుడు ఏకాగ్రచిత్తమును గలిగియుండుట) సంభవ మగుటవలన.

తా॥ కూర్చుండియున్నప్పుడే ఏకాగ్రచిత్తము కలుగును గాన, కూర్చుండియే యుపాసనము ననుష్ఠింపవలయును.

శ్రీ॥ భా॥ వేదాంతశాస్త్రముచే మోక్షసాధనముగా విధింపఁబడినట్టియు, ధ్యానమనియును, ఉపాసనమనియును, జెప్పఁబడు బ్రహ్మజ్ఞానమును పలుమాఱు అనుష్ఠింపవలసినదనియు, అది స్మృతిసంతతిరూపమైనదనియును చెప్పఁబడియె.

#### సంశయము.

అట్టి యుపాసనారూపమగు బ్రహ్మజ్ఞానము నెట్లుండి యనుష్ఠింపవలయును? కూర్చుండి యనుష్ఠింపవలయునా? పరుండి యనుష్ఠింపవలయునా? నిలువఁబడి యనుష్ఠింపవలయునా? నడుచుచునుండి యనుష్ఠింపవలయునా?

#### పూర్వపక్షము.

అట్టి యుపాసనారూపమగు జ్ఞానము ననుష్ఠించుపద్ధతిని గుఱించి నియమమెద్దియుఁ గానఁబడకున్నందున, కూర్చుండిగాని, పరుండిగాని, నిలువఁబడిగాని, నడుచుచునుండిగాని యథేష్టముగా ననుష్ఠింప వచ్చుననిన,

#### సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. కూర్చుండియే యుపాసనము ననుష్ఠింపవలయును. ఏలననిన, కూర్చుండినచో, బుద్ధియందేకాగ్రత గలుగుట సంభవము. నిలుచుండినను, నడుచుచుండినను, సప్రయత్నుఁడగుచున్నాఁడు. పరుండినచో, నిద్రపోవును. కనుక నిష్ప్రయత్నముగాఁ దన యుత్తరకాయము నిలువఁబడియుండుటకుఁ దగిన యాశ్రయమం దుపవిష్టుండై యుపాసనము ననుష్ఠింపవలయును.

### ౮॥ సూ॥ ధ్యా నా చ్చ

టీ॥ ధ్యానాత్-చ=ఉపాసనము ధ్యానరూపమగుటవలనఁగూడ (చిత్తైకాగ్రత యావశ్యకము)

తా॥ ఉపాసనము ధ్యానరూప మగుటవలనఁగూడ దాని ననుష్ఠించునపుడు చిత్తైకాగ్రత యావశ్యకము.

శ్రీ॥ భా॥ ఉపాసనమనఁగా నిదిధ్యాసనమనఁబడు ధ్యానముగాన, దానికి చిత్తైకాగ్రత యావశ్యకము. ఇతర చింతన యేమాత్రము లేకుండ తదేకచింత నముతో నుండుటఁగదా ధ్యానమనఁబడు చున్నది.

౯॥ సూ॥ అచలత్వం చాపేక్ష్య

టీ॥ చ=మఱియు, అచలత్వం=నిశ్చేష్టతను, అపేక్ష్య=పురస్కరించుకొని,

తా॥ పృథివ్యాదుల యందలి నిశ్చేష్టతను పురస్కరించుకొని "ధ్యాయతీవపృథివీ" అను శ్రుతివాక్యము పృథివ్యాదులు ధ్యానించుచున్నట్లు గన్పట్టు చున్నవని చెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ పృథివ్యాదులయందుండు నిశ్చేష్టతను పురస్కరించుకొని శ్రుతివాక్యము పృథివ్యంతరిక్షాదులు ధ్యానించుచున్నట్లున్నవని చెప్పుచున్నది. అదెట్లనిన, "ధ్యాయతీవ పృథివీ, ధ్యాయతీవాంతరిక్షం, ధ్యాయతీవ ద్యౌః, ధ్యాయన్తీవాపో, ధ్యాయన్తీవ పర్వతాః" (ఛా. ౭ ప్ర. ౬ ఖ. ౧ వా.) అను శ్రుతివాక్యము "పృథివి ధ్యానించు చున్నట్లున్నది, అంతరిక్షము ధ్యానించు చున్నట్లున్నది. ద్యులోకము ధ్యానించుచున్నట్లున్నది. ఉదకములు ధ్యానించు చున్నట్లున్నవి. పర్వతములు ధ్యానించుచున్నట్లున్నవి" అని చెప్పుచున్నది. కనుక కూర్చుండినచో, ఉపాసకుని చిత్తము పృథివ్యంతరిక్షాదులవలె నిశ్చేష్టముగా నుండుట సంభవము.

౧౦॥ సూ॥ స్మరన్తి చ.

టీ॥ చ=మఱియు, స్మరన్తి=శిష్టు లిట్లు స్మరించుచున్నారు.

తా॥ "శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః" అను స్మృతివాక్యమున, కూర్చుండియే యుపాసనము ననుష్ఠింపవలయునని శిష్టులు చెప్పుచున్నారు.

శ్రీ॥ భా॥ శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరం।
తత్రైకాగ్రం మనఃకృత్వా యత చిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ. మాత్మవిశుద్ధయే॥
భ. గీ. ౬ అ. ౧౧-౧౨ శ్లో.

తా॥ పరిశుద్ధమైన తావున మిక్కిలి ఎత్తుగానుండనిదియును, మిక్కిలి పొట్టిదిగా నుండనిదియును, కుశలచేతను, అజినముచేతను, వస్త్రముచేతనున్ను కప్పఁబడిన యాసనముమీఁద కూర్చొని, నియమింపబడిన చిత్తము యొక్కయు ఇంద్రియముల యొక్కయును వ్యాపారములు గలవాఁడై, మనస్సును నిశ్చలముగాఁ జేసికొని యాత్మ పరిశుద్ధికై యీవిధముగ ధ్యానింపవలయును.

ఈపైని గనఁబఱచిన ప్రకారము శ్రీభగవద్గీతలయందుఁ జెప్పియుండుటచే కూర్చుండియే ధ్యానమును అనగా ఉపాసనము ననుష్ఠింపవలయునని సిద్ధమగుచున్నది.

౧౧॥ సూ॥ య త్రై కా గ్ర తా త త్రా వి శే షా త్.

టీ॥ యత్ర=ఏదేశకాలములయందు, ఏకాగ్రతా=చిత్తనైశ్చల్యము కలుగునో, తత్ర=ఆదేశకాలములయందు, (ఉపాసీత=ధ్యానింపవలయును,) అవిశేషాత్=దేశకాలవిశేషములు శాస్త్రములయందు నిర్దేశించి చెప్పఁబడకుండుటవలన,

తా॥ శాస్త్రములయందు ఉపాసనమునకు దేశకాలములు నియమింపఁబడకుండుటచే ఏదేశకాలములయందు చిత్తైకాగ్రత గలుగునో, ఆదేశకాలములయందు ఉపాసించునది.

శ్రీ॥ భా॥ శాస్త్రములయందెచటను నిట్టి దేశమునందు ధ్యానింపవలయును, ఇక్కాలమున ధ్యానింపవలయునని యివ్విధముగ ధ్యానమునకుగాను, దేశకాలములు విధింపఁబడకున్నందున, చిత్తైకాగ్రతి కనుకూలమగు దేశకాలములే ధ్యానమునకుగాను, దేశకాలములని గ్రహింపవలయును. "సమే శుచౌ దేశే శర్కరావహ్నివాలుకావివర్జితే" అను శాస్త్రవాక్యము "సమమైనదియు, పరిశుద్ధమైనదియు, శర్కరా అగ్ని గులకరాళ్ళులేని ప్రదేశమున ధ్యానముఁ జేయవలయును" అనుటచే చిత్తైకాగ్రత కనుకూలమగు దేశమునే జెప్పుచున్నది గాని యిట్టి దేశమునందు ధ్యానముఁ జేయవలయునని యొకదేశవిశేషమును విధించుచుండలేదు. ఏలనిన, "మనోనుకూలః" అను వాక్య శేషమున్ను, "మనస్సున కనుకూలమగు దేశమున ధ్యానమునొనర్పవలయును" అని చెప్పుచున్నది గదా.

ఆసీనాధికరణము ముగిసెను

—•—

ఆప్రయాణాధికరణము.

౧౨॥ సూ॥ ఆ ప్ర యా ణా త్త త్రా పి హి దృ ష్ట మ్.

టీ॥ ఆప్రయాణాత్ = మరణపర్యంతము, (ఉపాసనం సంపాద్యం = ఉపాసన మనుష్ఠింపఁదగినది) తత్ర - అపి - హి = ఉపాసనారంభదినము మొదలుకొని మరణపర్యంతమును (ఉపాసనము.) దృష్టం = శ్రుతులయందుఁ గానఁబడుచున్నది.

తా॥ ఉపాసనము నారంభించిన దినము మొదలుకొని మరణపర్యంతము ఉపాసనము ననుష్ఠింపవలయునని శ్రుతులు జెప్పుచున్నందున మరణపర్యంతము ఉపాసనము ననుష్ఠింపవలయును.

—••—◆ సంశయము. ◆—••—

మోక్షసాధన భూతమగు ఉపాసనము నొక్క దినము మాత్రము అనుష్ఠింపవలయునా? లేక, మరణపర్యంతము ప్రతిదిన మనుష్ఠింపవలయునా?

—••—◆ పూర్వపక్షము. ◆—••—

ఒక్క దిన మనుష్ఠించినను శాస్త్రోక్తమగు నుపాసనము ననుష్ఠించినవారల మగుచున్నాము. కనుక ఉపాసనము నొక్క దినము మాత్ర మనుష్ఠింపవలయునని న,

—••—◆ సిద్ధాంతము. ◆—••—

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఉపాసనమును మరణపర్యంతము ప్రతిదిన మనుష్ఠింపవలయును. ఏలయన, "సఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే" (ఛా. ౮ ప్ర. ౧౫ ఖ. ౧ వా.) అను శ్రుతి వాక్యము "బ్రతికియున్నంత వఱకు ఈప్రకార ముపాసనము ననుష్ఠించుచున్నట్టి యుపాసకుఁడు బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు" అనుచు, ఉపాసన మారంభింపఁబడిన దినము మొదలు మరణము వఱకునుండు మధ్యకాలమునం దంతటను ఉపాసనము ననుష్ఠింపవలయునని తెలియఁజేయుచున్నది.

ఆప్రయాణాధికరణము ముగిసెను.



తదధిగమాధి కరణము.

౧౩॥ సూ॥ తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్

టీ॥ తదధిగమే = బ్రహ్మవిద్యాప్రాప్తి గలిగినప్పుడు, ఉత్తర పూర్వాఘయోః=సంచితాగామి పాపకర్మములకు, అశ్లేషవినాశౌ=అసంగత్వ ప్రణాశములు, (భవతః = కలుగుచున్నవి, ఏలయన,) తద్వ్యపదేశాత్ = శ్రుతులట్లు ఉపదేశించుట వలన.

తా॥ బ్రహ్మవిద్యాప్రాప్తి గలుగగానే యుపాసకునియొక్క ఆగామి పాపకర్మములతనిని సంబంధింపవు. సంచిత పాపకర్మములు నశించుచున్నవి. ఇట్లు శ్రుతులు జెప్పుచున్నవి.

శ్రీ॥ భా॥ ఇట్లు బ్రహ్మవిద్యా స్వరూపమును బరిశీలించి, అట్టి బ్రహ్మవిద్యవలనఁగలుగు ఫలమునుగుఱించి విచారించుటకై యుపక్రమించుచున్నారు.

బ్రహ్మవిద్యను లభించినమానవుని సంచితములగు పాపకర్మములు నశించుచున్నవనియు, వాని యాగామి పాపకర్మము లతనిని సంబంధింపవనియును శ్రుతులు చెప్పుచున్నవి. ఎట్లనిన,

ఛందోగులు "తద్యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్తే, ఏవమేవం విది పాపం కర్మ న శ్లిష్యతే" (ఛా. ౪ ప్ర. ౧౪ ఖ. 3 వా.) "తామరపత్రమును జలములెట్లు లంటవో, యట్లే బ్రహ్మమును ఇవ్విధముగా నుపాసించువానిని పాపము లంటవు" అనియు, వాజసనేయులు [1]తస్యైవ వస్యాత్పదవిత్తం విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేన (బృ. ౬ అ. ౪. బ్రా. ౨3 వా.) "పరమాత్మస్వరూపమును దెలిసికొనినవాఁడు వానిని ధ్యానించి పాపకర్మముతో సంబంధింపఁడు" అనియును పఠించుటచే, బ్రహ్మవిద్యగల వానిని ఆగామి పాపకర్మములు సంబంధింపవని తెలియఁజేయుచున్నారు.

ఛందోగులు "తద్యథేషీక తూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" (ఛా. ౫ ప్ర. ౨౪ ఖ. 3 వా.) "జమ్ముదూది అగ్నియందు వేయఁబడి యెట్లు అతిశీఘ్రమున దగ్ధయగునో, అట్లే బ్రహ్మవిద్యావంతుని పాపములు నశించుచున్నవి" అని పఠించుటచేతను, "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ము. ౨ ము. ౨ ఖ. ౮ వా.) అను శ్రుతివాక్యము, "పరావరుఁడగు సర్వేశ్వరుని సాక్షాత్కరించిన జ్ఞానియొక్క పాపములన్నియును నశించుచున్నవి" అని చెప్పుటచేతను బ్రహ్మవిద్యావంతుని యొక్క సంచిత పాపకర్మములు నశించుచున్నవని తెలియుచున్నది.

## సంశయము.

ఈ పైని కనఁబఱచిన ప్రకారము ఆగామి పాపకర్మములు బ్రహ్మవిద్యావంతుని సంబంధింపకుండుటయు, వాని సంచిత పాపకర్మములు, నశించుటయును వాని బ్రహ్మవిద్యాఫలములగుట సంభవమా? లేక అసంభవమా?

## పూర్వపక్షము.

"నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అను శాస్త్రమునందు "అనేకకోట్ల కల్పములు జరిగిపోయినను చేసిన కర్మమనుభవింపక తీరదు" అని చెప్పియుండుట వలన, బ్రహ్మవిద్యాబలముచే బ్రహ్మవేత్తయొక్క పాపకర్మము నశించుట యసంభవము. అయితే మోక్షసాధనమగు బ్రహ్మవిద్య నుపదేశించు వాక్యముల యందంతటను ఆగామి పాపకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియును, బ్రహ్మవేత్తయొక్క సంచిత పాపకర్మములు నశించుచున్నవనియును

(1) "తస్యైవాత్మాపదవిత్తం" అని భాష్యమున నీ శ్రుతికి పాఠభేదము కలదు.

యేల జెప్పఁబడెనని శంకింపఁబనిలేదు. అట్లు చెప్పియుండుట బ్రహ్మవిద్యను స్తుతి జేయుటకై గూడ గావచ్చును.

బ్రహ్మవిద్య సంచితాగామి పాపకర్మములను బోఁగొట్టునట్టి ప్రాయశ్చిత్తముగా వేదాంతశాస్త్రముచే విధింపఁబడలేదు. అట్లు విధింపఁబడినపక్షమున, దానిమూలముగా నాగామి పాపకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియు, సంచితపాపకర్మములు నశించుచున్నవనియును జెప్పవచ్చును. అయితే "బ్రహ్మవిదాప్నోతిపరం" అనియు, "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనియు నీ మొదలగు వేదాంతవాక్యములచే బ్రహ్మజ్ఞానము బ్రహ్మప్రాప్త్యుపాయముగా విధింపఁబడుచున్నది. కనుక నాగామి పాపకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియు, వాని సంచితపాపకర్మములు నశించుచున్నవనియును, బ్రహ్మవిద్యను స్తుతిఁజేయుటకు మాత్రమే చెప్పఁబడిన దనిన.

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తముకాదు. పురుషునికి బ్రహ్మవిద్య లభించినప్పుడు అట్టి విద్యకుఁగల మాహాత్మ్యమువలన వానియొక్క సంచిత పాపకర్మములు నశించుటయు, ఆగామి పాపకర్మము లతనిని సంబంధింపకుండుటయును సంభవము. ఏలననిన, బ్రహ్మవిద్య కిట్టి మాహాత్మ్యమున్నట్లు "ఏవంవిది పాపం కర్మ న శ్లిష్యతే" అనియు, "ఏవం హాస్య సర్వేపాప్మానః ప్రదూయన్తే" అనియు నీ మొదలగు నుపనిషద్వాక్యముల వలనఁ దెలిసికొనుచున్నాము.

"నాభుక్తం క్షీయతేకర్మ"అను శాస్త్రము ఈ యుపనిషద్వాక్యములతో విరోధింపదు. ఎట్లనిన, కర్మములకు ఫలమునిచ్చు సామర్థ్యము గలదనుటను దృఢపరచుటయే గదా! "నాభుక్తం" అను శాస్త్రమునకు ప్రధానవిషయము. అనఁగా నందులకై గదా యాశాస్త్రము ప్రవర్తించినది. ఈపైని యుదహరించిన యుపనిషద్వాక్యములకన్నన్, విద్యోత్పత్తికి పూర్వమొనర్చిన పాపకర్మముల యొక్క ఫలజననశక్తిని నశింపఁజేయుటకును, విద్యోత్పత్త్యనంతర ముత్పన్నములుగాఁబోవు పాపకర్మములయొక్క ఫలజనన శక్త్యుత్పత్తిని ప్రతిబంధించుటకును, బ్రహ్మవిద్యకు సామర్థ్యము గలదని ప్రతిపాదించుటయే ప్రధాన విషయము. అనఁగా నవి యందుకుగానే ప్రవర్తించినవి. ఈ శాస్త్రములు పైజెప్పిన ప్రకారము భిన్నవిషయములైనందున పరస్పరము విరుద్ధములు గావు. దృష్టాంతము:—(ఉష్ణమును గలుగఁజేయు సామర్థ్యమగ్నియందు గలదు గాన) ఔష్ణ్యము విషయమై అగ్నిప్రమాణముగాను, (అట్టి యుష్ణమును బోగొట్టు సామర్థ్యముదకమునకు గలదు గాన) తన్నివారణము విషయమై యుదకము ప్రమాణముగాను నెన్నఁబడుచున్నవి. అట్లే ఈరెండు శాస్త్రములును

భిన్న భిన్న విషయములనుగుఱించి ప్రమాణములు కాఁదగును. కావున నవి పరస్పరము విరుద్ధములు గావు.

ఆగామి పాపకర్మములు బ్రహ్మవేత్తనను సంబంధింపవనుటకు తాత్పర్యమేమనఁగా, మనుజునికి వైదికకర్మములయందదయోగ్యతను గలుగఁజేయునట్టి యభిరుచిని బుట్టించునదియు, పాపకర్మముల యందుండు నదియగు శక్తి యుత్పన్నము గాకుండ చేయఁబడుచున్న దనుటయే. పాపములవలనఁగదా! మానవునికి వైదిక కర్మములయందయోగ్యతయు, అట్టివియగు నితర పాపకర్మములయందభిరుచియు, పాపమున్ను గలుగుచున్నవి. సంచితములగు పాపకర్మములు నశించుచున్న వనుటకు తాత్పర్యమేమనఁగా, యుత్పన్నమైనదియు, పాపముల యందుండునట్టి శక్తి నశింపఁబడుచున్నదనుటయే. భగవన్నిగ్రహమే యీ సందర్భమున పాపములయందుండునట్టి శక్తి యనఁబడుచున్నది.

విద్యచేఁ దెలుపఁబడు సర్వేశ్వరుఁడు బ్రహ్మవేత్తకు మిక్కిలి ప్రియుఁడగుట వలన నట్టి సర్వేశ్వరుని దెలిసికొనుటకు సాధనభూతమగు బ్రహ్మవిద్యగూడ నతనికిఁ బ్రియమైనది. మఱియు నిది సర్వేశ్వరుని కారాధన రూపమైనది. కాఁబట్టి యీ బ్రహ్మవిద్య జ్ఞానియొక్క సంచిత పాపకర్మలచే సర్వేశ్వరునికిఁ గలిగిన నిగ్రహమును బోఁగొట్టుచున్నది. అట్లే యీ బ్రహ్మవిద్య జ్ఞానియొక్క అనంతర భావిపాపకర్మలవలన సర్వేశ్వరునికిఁ గలుగఁబోవు నిగ్రహముయొక్క యుత్పత్తిని గూడ నిరోధించుచున్నది. ఇట్లు బ్రహ్మవిద్యా మాహాత్మ్యమువలన పాపకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనునది వానిచేఁ బ్రామాదికముగాఁ జేయఁబడిన పాపకర్మములను గుఱించినదియేయని యెఱుంగవలయును. ఏలననిన, "నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః నాశాంతమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్" (కఠ. ౨ వ. ౨౪.) అను శ్రుతివాక్యము "ఓ నచికేతుఁడా! చెడునడవడికను విడువక, యింద్రియచలనముడుగక, యేకాగ్రచిత్తము లేక, అన్నింటియందు వ్యాపించు చిత్తముగలవాఁడు పరమాత్మను బొందఁడు" అనుచు జ్ఞానియగువాఁడు దుశ్చేష్టలనుమానుటచే యావజ్జీవము వానిచే నాచరింపఁబడు ఉపాసనము ఉత్తరోత్తరాభివృద్ధిని బొందుచున్నట్లు తెలియఁజేయుచున్నది.

తదధిగమాధికరణము ముగిసెను.

---

ఇతరాధికరణము.

౧౪॥ సూ॥ ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు.

టీ॥ ఇతరస్యాపి=ఇతరమగు పుణ్యకర్మమునకుఁగూడ, ఏవం=పాపమునకువలెనే, అసంశ్లేషః = అసంయోగమును వినాశమును, (భవతః = కలుగుచున్నవి. ఇవియెప్పుడనిన,) పాతేతు=మరణకాలమునందే.

తా॥ పాపముకంటె నితరమగు పుణ్యకర్మమునకుఁగూడ బ్రహ్మవిద్యా మాహాత్మ్యమువలన అశ్లేష వినాశములు ప్రాప్తించును. అయితే యిట్లు పుణ్యమునకు అశ్లేషవినాశములు గలుగుట బ్రహ్మవేత్త మృతినొందిన తరువాత యని యెఱుఁగునది.

శ్రీ॥ భా॥ బ్రహ్మవిద్యా మాహాత్మ్యమువలన నాగామి పాపకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియు, సంచితపాపకర్మములు నశించుచున్నవనియును పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడినది. అట్లే ఆగామి పుణ్యకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియును సంచితపుణ్యకర్మములు నశించుచున్నవనియును గూడ జెప్పవచ్చును. ఏలననిన, పాపకర్మములు విద్యాఫల (మోక్ష) విరోధులగు చందమున పుణ్యకర్మములుగూడ విద్యాఫల (మోక్ష) విరోధులు. మఱియు ఆగామి పుణ్యకర్మములు బ్రహ్మవేత్తను సంబంధింపవనియు, అతని సంచిత పుణ్యకర్మములు నశించుచున్నవనియును శాస్త్రము జెప్పుచున్నది. అదెట్లనిన, ఛందోగులు పుణ్యపాపములను రెంటిని నిర్దేశించి "సర్వే పాప్మానోఽతో నివర్తంతే" (ఛా. ౮ ప్ర. ౪ ఖ. ౧ వా.) అను వాక్యమున, "అన్ని పాపములు, అనఁగాఁ బుణ్యములును, పాపములును, బ్రహ్మవేత్తనువిడిచి పోవుచున్నవి" అనియు, కౌషీతకులు "తత్సుకృత దుష్కృతే ధూనుతే" అను వాక్యమున "బ్రహ్మవేత్త పుణ్యపాపములను వదలుచున్నాఁడు" అనియును పఠించుచున్నారు. పాపమువలె పుణ్యమున్ను ముముక్షువునకు అనిష్టఫలము నిచ్చునదైనందున ఈ పైశ్రుతియందుఁ బుణ్యపాపములు రెంటును పాప్మశబ్దముచే నిర్దేశింపఁబడినవి. పుణ్యమున్ను శాస్త్రవిహితమైనందున దానిఫలమునకై కొందఱు ఇష్టపడుచుందురు. అందువలన నది బ్రహ్మవిద్యా విరోధికాదని శంకింపవచ్చును. అట్టిశంకను బోఁగొట్టుటకై పుణ్యమునకును అశ్లేషవినాశములు చెప్పఁబడినవి.

బ్రహ్మవేత్త తన యుపాసనమును యథావిధిగా ననుష్ఠించుకొనుటకై పుణ్యఫలములగు వృష్టి, అన్నము మొదలగు వాని నపేక్షించుచున్నాఁడుగదా! అట్లైనచో, విరోధులైనందున పుణ్యకర్మములుగూడ నశించుచున్నవని యెట్లు చెప్పవచ్చుననిన, బ్రహ్మవేత్తయొక్క బ్రహ్మవిద్యకనుగుణములగు దృష్టఫలములనిచ్చునట్టి పుణ్యకర్మములు బ్రహ్మవేత్త మృతినొందిన తరువాత నశించుచున్నవని యెఱుఁగునది.

ఇతరాధికరణము ముగిసెను.

---

## అనారబ్ధకార్యాధికరణము.

౧౫॥ సూ॥ అ నా ర బ్ధ కా ర్యే ఏ వ తు పూ ర్వే త ద వ ధేః.

టీ॥ తు = పూర్వపక్షమయుక్తము, అనారబ్ధకార్యే = అప్రవృత్త ఫలములగు, పూర్వేఏవ = విద్యోత్పత్తికి పూర్వ మాచరింపఁబడిన పుణ్య పాప

కర్మములు మాత్రమే, (క్షీయన్తే = క్షయించుచున్నవి. ఏలననిన), తదవధేః= శ్రుత్యుక్తమగు శరీరపాతావధి వలన.

తా॥ విద్యోత్పత్తికి పూర్వము సంచితములైనట్టియు, ఫలదానప్రవృత్తములుగాని సుకృత దుష్కృత కర్మములు మాత్రమే విద్యాధిగమమున క్షయించుచున్నవి. ప్రారబ్ధఫలములగు సుకృత దుష్కృత కర్మములు క్షయించుటకు శరీరపాతము నవధినిగా శ్రుతులు జెప్పుచున్నవి గదా.

శ్రీ॥ భా॥ విద్యోత్పత్తికి పూర్వము, బ్రహ్మవేత్తచే నాచరింపఁబడిన పుణ్యపాపకర్మములు బ్రహ్మవిద్యామాహాత్మ్యమువలన నశించుచున్నవనియు, విద్యోత్పత్త్యనంతరము గలుగఁబోవు పుణ్యపాపకర్మములున్ను, అందువలననే వానిని సంబంధింపవనియును, పూర్వాధికరణములయందుఁ జెప్పఁబడియె.

### సంశయము.

విద్యోత్పత్తికి పూర్వ మాచరింపఁబడిన పుణ్యపాపకర్మములన్నియును అనఁగా ఆరబ్ధకార్యములును (ఫలదానప్రవృత్తములును)అనారబ్ధకార్యములును, (ఫలదానప్రవృత్తములుకానివియును) బ్రహ్మవిద్యామాహాత్మ్యమువలన నశించుచున్నవా? లేక అనారబ్ధకార్యములు మాత్రమే నశించుచున్నవా?

### పూర్వపక్షము.

ఛందోగులు "సర్వేపాప్మానః ప్రదూయన్తే" (ఛా.౫ప్ర.౨౪ఖ.౩వా.) అను వాక్యమున "విద్యామాహాత్మ్యముచే పాపపుణ్యములన్నియును నశించుచున్నవి" అని సామాన్యముగాఁజెప్పియున్నందున, ఆరబ్ధకార్యములును, అనారబ్ధకార్యములును, నశించుచున్న ననుట యుక్తము. ఆరబ్ధకార్యములగు కర్మములు శరీరస్థితికి మూలభూతములుగాన, మానవునికి బ్రహ్మవిద్య గలిగినతోఁడనే యవియును బ్రహ్మవిద్యామాహాత్మ్యమువలన నశించునవియగుపక్షమున,తదనంతరము శరీరస్థితికి కారణమేది యగును? అని శంకింపఁబనిలేదు. ఎట్లన, కులాలుఁడు ఒక్కసారి చక్రమునుద్రిప్పి వదలినచో, ఆచక్రమా వేగమున్నంతనఱకును తిరుగుచునే యుండునుగదా! అట్లే, విద్యోత్పత్తికి పూర్వము కర్మములచే నారంభింపబడిన శరీరము, విద్యోత్పత్త్యనంతర మా కర్మములు నశించినను, సంస్కారవశమున విడువకుండును. కావున సామాన్యముగా నన్నికర్మములును బ్రహ్మవిద్యామాహాత్మ్యమువలన నశించుచున్న ననిన,

### సిద్ధాంతము.

అట్లుచెప్పుట యుక్తము గాదు. విద్యోత్పత్తికి పూర్వము అనారబ్ధకార్యములగు పుణ్యపాపకర్మములు మాత్రమే విద్యోత్పత్త్యనంతరము నశించుచున్నవి.

ఏలననిన, ''తస్యతావదేవచిరం యావన్న విమోక్ష్యే అథసంపత్స్యే'' (ఛా. ౬ ప్ర. ౧౪ ఖ. ౨) అను శ్రుతివాక్యము, "బ్రహ్మవేత్తయగు వాని కీశరీరము విడువకున్నంతవఱకే విళంబముండును, అనంతరమతఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడు'' అనుచు, బ్రహ్మప్రాప్తికి శరీరపాతమునే యవధినిగా నేర్పఱచుచున్నది. పుణ్యకర్మములవలన సంపాదించుకొనఁబడిన భగవదనుగ్రహముకంటెను, పాపకర్మములవలన సంపాదించుకొనఁబడిన భగవన్నిగ్రహము కంటెనున్ను వేఱుగా సంస్కారమనునదొకటి శరీరస్థితికి కారణముగాఁ గలదనుటకు ప్రమాణమేదియును గానఁబడదు. (కావున ప్రారబ్ధకర్మము విద్యామాహాత్మ్యముచే నశింపక, ఈ మధ్యకాలమున శరీరస్థితికి కారణభూతముగా నుండునని యెఱుంగునది.)

అనారబ్ధకార్యాధికరణము ముగిసెను.

## అగ్నిహోత్రాద్యధికరణము.

### ౧౬॥ సూ॥ అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్.

టీ॥ అగ్నిహోత్రాదితు=అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మమయితే, తత్కార్యాయ-ఏవ=విద్యారూపమగు ఫలముకొఱకే, యని(ప్రభవతి=సిద్ధమగుచున్నది. ఏలయన,) తద్దర్శనాత్=అట్లు శ్రుతి తెలుపుచుండుటవలన.

తా॥ అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మ మన్ననో, ఇతరసుకృతకర్మములనలెనె నశింపక, విద్యోత్పాదనమందు వినియుక్తమగుచున్నది.

#### పూర్వపక్షము.

శ్రీ॥ భా॥ ''ఇతరస్యాప్యేవమసంశ్లేషః'' (బ్ర. సూ. ౪ అ. ౧ పా. ౧౪ సూ.) అను సూత్రమున, బ్రహ్మవిద్యామాహాత్మ్యమువలన బ్రహ్మవేత్తకు పుణ్యసంబంధముగూడ లేదని చెప్పఁబడియె. అట్లైనచో, నిత్యనైమిత్తికాదిస్వాశ్రమ కర్మములుగూడ సామాన్యముగా పుణ్యకర్మమని వ్యవహరింపఁబడుటవలన, వీనిఫలములతోఁగూడ బ్రహ్మవేత్తకు సంబంధముండనేరదు. కాఁబట్టి నిష్కాముఁడగు ఈబ్రహ్మవేత్తకు అగ్నిహోత్రాదికర్మముల ననుష్ఠింపనలసిన యవసరమెద్దియు లేదే? యనిన.

#### సిద్ధాంతము.

బ్రహ్మవేత్తకు అగ్నిహోత్రాద్యాశ్రమ కర్మములఫలముతో సంబంధము లేకుండుట యసంభవము. కావున, నవి బ్రహ్మవేత్తచే ననుష్ఠింపవలసినవియే! ఏలయన, అగ్నిహోత్రాద్యాశ్రమకర్మములు బ్రహ్మవిద్యను గలుగఁజేయుటకై యేర్పడినవి. అందువలన బ్రహ్మవేత్త విద్యోత్పత్తికిగానే వానిని తప్పక యను

ష్ఠింపవలయును. అది యెట్లు తెలియుననిన, శాస్త్రమునందు అగ్నిహోత్రాద్యాశ్రమ కర్మములు విద్యోపకారకములుగా విధింపఁబడియున్నవి. ఎట్లన, "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన, దానేన, తపసానాశకేన" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా.) అను శ్రుతివాక్యము "బ్రాహ్మణులు వేదాధ్యయనముచేతను, యజ్ఞముచేతను, దానముచేతను, ఫలము నపేక్షింపకయే యొనర్పఁబడు తపస్సుచేతను, పరమాత్మను దెలిసికొనుట కిచ్ఛయించుచున్నారు" అనుటచే అగ్నిహోత్రాద్యాశ్రమ కర్మములను బ్రహ్మవిద్యా సాధనములనుగాఁ దెలియఁజేయుచున్నది. బ్రహ్మవిద్య, జీవుఁడు శరీరమును విడిచిపోవువఱకు, అభ్యసింపఁబడుటచే నానాటికి వృద్ధిపొందునదిగాన, నది ప్రతిదినము ఉత్పన్నమగునది కావున దానిని అట్లు యుత్పన్నమగునట్లు చేయుటకై ఆశ్రమ కర్మములును ప్రతిదిన మనుష్ఠింపవలసినవియే. అట్లుకాకున్న, ఆశ్రమకర్మములు లోపింపఁగా, అపరిశుద్ధమైన అంతఃకరణము గల వానికి బ్రహ్మవిద్య యుత్పన్నమే గానేరదు.

అవతారిక:—అగ్నిహోత్రాది సత్కర్మములు విద్యోత్పత్త్యర్థము ఉపయోగింపఁబడుచున్నవనియు, అట్టివిద్యోత్పత్తికిఁ బూర్వమాచరింపఁబడిన పుణ్యకర్మములు "యావత్సంపాతముషిత్వా" "ప్రాప్యాంతం కర్మణః" అను నీమొదలగు శ్రుతులయందు జెప్పఁబడినప్రకారము, అనుభవముచే నశించుచున్నవనియు నింతకుఁ బూర్వము జెప్పఁబడియె. ఇట్లు అనుభవించిన తరువాత ఇంకను మిగిలి యుండునది ప్రారబ్ధకర్మఫలమే గదా! ఇట్లుండ, కొన్ని వేదశాఖలయందు "సుహృదస్సాధు కృత్యాం" ఇత్యాది వాక్యములు "బ్రహ్మవేత్త మరణమును బొందునపుడు అతని స్నేహితులు లతని సత్కర్మములను బొందుచున్నారు" అని చెప్పుచున్నవే! బ్రహ్మవేత్తయొక్క సత్కర్మములలో నేకర్మముల నతని స్నేహితులు బొందుచున్నారనిన, నిందులకు సమాధానమునీ సూత్రముచే జెప్పుచున్నారు.

౧౭॥ సూ॥ అతోన్యాపి హ్యేకేషాముభయోః

టీ॥ అతః=అగ్నిహోత్రాది సత్కర్మముకంటె, అన్యాపి=ఇతరమగు పుణ్యకర్మముగూడ, (అస్తి=కలదు అది), ఉభయోః=సంచితాగామి పుణ్యకర్మములలోఁ జేరినది, ఏకేషాం = కొన్ని శాఖలవారి "తస్యపుత్రాదాయ ముపయన్తి" ఇత్యాది వాక్యముల కది విషయము.

తా॥ అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక పుణ్యకర్మములకంటె నన్యమగు పుణ్యకర్మము గలదు. అది సంచితాగామి పుణ్యకర్మములలోఁ జేరినది. దానినే కొన్ని శాఖలవారు బ్రహ్మవేత్తయొక్క మిత్రులు పొందుచున్నారని పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ "తస్యపుత్రా దాయముపయన్తి సుహృదస్సాధుకృత్యాం" (బ్రహ్మవేత్త మరణము నొందునపుడతని పుత్త్రులతని భాగలబ్ధమగు సొత్తును బొందుచున్నారు. అతని స్నేహితులతని పుణ్యకర్మములను బొందుచున్నారు" అను శ్రుతియందు పేర్కొనిన పుణ్యకర్మములు, జ్ఞానోత్పత్తి సాధనములగు అగ్నిహోత్రాది కర్మములకంటె భిన్నములైనవి. అనఁగా విద్యోత్పత్తికిఁ బూర్వముగాని యనంతరముగాని యొనర్పఁబడినట్టి పుణ్యకర్మములలోఁ జేరినవియు, బలవత్తరకర్మముచే నిరుద్ధఫలములగు పుణ్యకర్మములు అనంతములుండుట సంభవము. వీనినే బ్రహ్మవేత్త మృతినొందునపు డతని స్నేహితులు పొందుచున్నారని శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మవిద్యామాహాత్మ్యముచే నశించుచున్నవిగాను, బ్రహ్మవేత్తను సంబంధింపనివిగానును శ్రుతియందు జెప్పఁబడిన సంచితాగామి పుణ్యకర్మములు గూడ నివియే.

అవతారిక:—కర్మము లనుష్ఠింపఁబడినను, ప్రబలకర్మముచే ఫలమునకు ప్రతిబంధకము గలుగుట సంభవమని పూర్వసూత్రమునందు జెప్పిన యంశము నీ సూత్రముచేఁ స్మరింపఁజేయుచున్నారు.

౧౮॥ సూ॥ య దే వ వి ద్య యే తి హి.

టీ॥ "యదేవవిద్యయా" ఇతి= "యదేవ విద్యయా" అనుశ్రుతి, హి = విద్యతోఁగూడియున్న కర్మము ఎక్కువ వీర్యము గలదని చెప్పుచున్నది గదా!

తా॥ "యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి "విద్యతోఁగూడిన కర్మము ఫలము నిచ్చుటయం దెక్కువ సమర్థమైనదగును" అనుటచే కర్మముల నొకప్పుడు ఫలము నీయకుండ జేయు ప్రతిబంధకము గలుగవచ్చునని సూచింపుచున్నది.

శ్రీ॥ భా॥ "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అను శ్రుతివాక్యము, "ఉద్గీథాద్యుపాసనముతో నేకర్మము నొనర్చుచున్నాఁడో ఆకర్మము వీర్యవత్తర మగుచున్నది అనఁగా ఫలము నిచ్చుటయం దెక్కువ సామర్థ్యము గలదగుచున్నది." అని చెప్పుచున్నది. ఇందువలన కర్మము లనుష్ఠింపఁ బడినను, ఫలమునకు ప్రతిబంధకములు గలుగవచ్చునని సూచితమగుచున్నది. అట్లు ప్రతిబంధితఫలములగు కర్మములనే బ్రహ్మవేత్తయొక్క స్నేహితులు బొందుచున్నారని "సుహృద స్సాధు కృత్యాం" అనువాక్యముచే శాట్యాయినులు పఠించుచున్నారు.

అగ్నిహోత్రాద్యధికరణము ముగిసెను.

## ఇతరక్షపణాధి కరణము.

## ౧౮॥ సూ॥ భోగేనత్వితరే క్షపయిత్వాఽథ సంపత్స్యతే.

టీ॥ ఇతరే = అనారబ్ధకార్యములకంటె నన్యములగు ప్రారబ్ధసుకృత దుష్కృతకర్మములను, భోగేన=అనుభవముచే, క్షపయిత్వా = క్షయింపఁజేసి, అథ=తరువాత (విద్వాన్=బ్రహ్మవిద్యావంతుఁడు, సంపద్యతే = బ్రహ్మమును బొందుచున్నాఁడు.

తా॥ సంచితాగామి సుకృతదుష్కృత కర్మములకంటె నన్యములగు ప్రారబ్ధసుకృత దుష్కృతకర్మములను భోగమువలననే క్షయింపఁజేసి, బ్రహ్మవేత్త బ్రహ్మప్రాప్తిరూపమగు పరమపదమును బొందుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తయొక్క యనారబ్ధకార్యములగు ఆగామి పుణ్యపాపకర్మము లతనిని సంబంధింపవనియు, అట్టివియగు సంచితపుణ్యపాపకర్మములు నశించుచున్నవనియు, నింతకుఁబూర్వము జెప్పఁబడెను.

### సంశయము.

అయితే తదితరములును, ఆరబ్ధకార్యములునగు పుణ్యపాపకర్మములు, అనఁగా ప్రారబ్ధకర్మములు, బ్రహ్మవేత్త యేశరీరముతో నుండగా అతనికి విద్యోత్పత్తి గలిగినదో, ఆశరీరావసానముననే నశించుచున్నవా? లేక, ఆశరీరావసానమునఁగాని, వేఱొక్కశరీరావసానమునఁగాని నశించుచున్నవా?

### పూర్వపక్షము.

"తస్యతావదేవచిరం యావన్నవిమోక్ష్యే" (ఛా. ౬ ప్ర. ౧౪ ఖ. ౨వా.) అను శ్రుతివాక్యము బ్రహ్మవేత్త శరీరమునుండి విముక్తుఁడగువఱకు బ్రహ్మమును పొందుటకు విళంబము గలదు" అని చెప్పుచున్నందున, ఏశరీరముతోనుండగా బ్రహ్మవిద్యాప్రాప్తిగలుగుచున్నదో, ఆశరీరావసానముననే ప్రారబ్ధకర్మములు నశించుచున్నవనుట యుక్తమనిన.

### సిద్ధాంతము.

అట్లుచెప్పుట సరికాదు. బ్రహ్మవేత్త ఆరబ్ధకార్యములగు పుణ్యపాపములను, అనఁగా ప్రారబ్ధకర్మములను ఫలభోగముచే నశింపఁజేసి, తత్ఫలభోగావసానమున బ్రహ్మమును బొందుచున్నాఁడు. అట్టి పుణ్యపాపములు ఏకశరీరభోగ్యఫలములైనచో, ఆశరీరావసానముననే వానిని నశింపఁజేసి, యతఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడు. లేక, అవి యనేక శరీరభోగ్యఫలములైనచో, అనేక జన్మములనెత్తి యాకర్మఫలములనన్నింటిని ననుభవించి, యనంతరము బహ్మమును బొందుచున్నాఁడు. ప్రారబ్ధకర్మములు ఫలానుభవముచేతనే నశించు

నవి గదా! ఏలననిన, "తస్యతావదేవ చిరంయావన్న విమోక్ష్యే" అను శ్రుతి వాక్యము ప్రారబ్ధములగు పుణ్యపాపములకు అనుభవముచేతనే విముక్తిగలుగు చున్నదని తెలుపుచున్నది. అయితే యివి యీదేహావసానముననే నశించుచున్న వనెడి నియమమెచ్చటను జెప్పియుండలేదు.

ఇట్లు బ్రహ్మవిద్యాప్రాప్తికి పూర్వము బ్రహ్మవేత్తచే నొనర్పఁబడినవియు, అభుక్తఫలములును, అనారబ్ధఫలములును, అనాదికాలసంచితములును, అనంత ములునునగు పుణ్యపాపరూపకర్మములు బ్రహ్మవిద్యామాహాత్మ్యముచే నశించు చున్నవి. బ్రహ్మవిద్యాప్రాప్త్యనంతరము బ్రహ్మవేత్తచే ననుష్ఠింపఁబడిన పుణ్య పాపరూపములగు కర్మములు వానిని సంబంధింపవు. అయితే వానిలోఁ బుణ్య కర్మములను బ్రహ్మవేత్తయొక్క మిత్రులును పాపకర్మములను అతని శత్రువు లును, బొందుచున్నారనిన దోషమేదియును లేదు.


ఇతరక్షపణాధికరణము ముగిసెను.

గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బద్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణ తార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమాను గ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరు దాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు చతుర్థాధ్యాయమున ప్రథమపాదము.

శ్రీరస్తు.



    

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## చతుర్థాధ్యాయము—ద్వితీయపాదము

### వాగధికరణము.

**౧॥ సూ॥ వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ.**

టీ॥ వాక్ = వాగింద్రియము, మనసి = మనస్సునందు, (సంపద్యతే = సంయుక్తమగుచున్నది, ఏలయన) దర్శనాత్ =అట్లు గానఁబడుటవలనను, శబ్దాత్ - చ=శ్రుతి ప్రమాణమువలనను.

తా॥ మ్రియమాణుని వాగింద్రియము మనస్సుతో సంయుక్తమగుచున్నది. అట్లు లోకమునఁ గానఁబడుచున్నది. శ్రుతియు నటులనే చెప్పుచున్నది.

ప్రథమద్వితీయ పాదములకుఁ గల పూర్వాపర సంబంధము.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్త మోక్షమునుబొందు పద్ధతిని గుఱించి విచారించుటకై, యీ పాదమారంభింపఁబడుచున్నది. అందులకై, ప్రథమమున, జీవుఁడు శరీరమును విడిచిపోవునట్టి విధమును గుఱించి విచారించుచున్నారు. ఈవిషయమును గుఱించి ఛందోగులు "అస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" (ఛా. ౬ ప్ర. ౮ ఖ. ౬ వా.) అను వాక్యమున "ఈ జీవుఁడు శరీరమును విడుచునపుడు వాక్కు మనస్సుతో సంయుక్తమగుచున్నది, మనస్సు ప్రాణముతో సంయుక్తమగుచున్నది, ప్రాణము తేజస్సుతో సంయుక్తమగుచున్నది, తేజస్సు పరదేవతతో సంయుక్తమగుచున్నది" అని పఠించుచున్నారు. ఈసందర్భమున నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఈ పైశ్రుతి ప్రకారము వాక్కు మనస్సుతో సంయుక్తమగుచున్నదనఁగా, వాగ్వ్యాపారము మాత్రము మనస్సుతో సంయుక్తమగుచున్నదని

గ్రహింపవలయునా? లేక వాగింద్రియము మనస్సుతో సంయుక్తమగుచున్న దని గ్రహింపవలయునా?

## పూ ర్వ ప క్ష ము.

వాగ్వ్యాపారము మాత్రమే మనస్సుతోఁ జేరుచున్నదని గ్రహింపవలయును, ఏలననిన, మనస్సు వాక్కునకు ఉపాదాన కారణము కాదు గాన, వాక్స్వరూపము మనస్సుతోఁజేర నేరదు. అయితే వాగాదీంద్రియ వ్యాపారములు మనస్సునకధీనము లగుటనుబట్టి "వాఙ్మనసి సంపద్యతే" యను శ్రుతి వాక్యము వాగ్వ్యాపారము మాత్రము మనస్సుతోఁజేరుచున్నట్లు తెలియఁ జేయుచున్నదని గ్రహింప వచ్చుననిన,—

## సి ద్ధా ం త ము.

"వాక్స్వరూపము మనస్సుతో సంయుక్తమగు చున్నదని చెప్పుట యుక్తము. ఏలనిన, [1]వాగింద్రియము నివృత్తవ్యాపారమైనను, మనస్సు సవ్యాపారముగానున్నట్లు మనము చూచుచున్నాము. కావున నివృత్త వ్యాపారమైన వాగింద్రియము మనస్సుతోనే సంయుక్తమగు చున్నదనుట యుక్తము. అయితే వాగ్వ్యాపారము మనస్సుతో సంయుక్తమగుచున్నదను పక్షమునను గూడ, మనస్సు సవ్యాపారముగా నుండవచ్చునని శంకింపఁ బనిలేదు. "వాఙ్మనసి సంపద్యతే" అను శ్రుతి వాక్యము వాగింద్రియము మనస్సుతో సంయుక్తమగుచున్నదని చెప్పుచున్నదే గాని; వాగ్వ్యాపారము మనస్సుతో సంయుక్తమగుచున్నదని చెప్పుచుండలేదు. వాగ్వ్యాపారము [2]ఉపరమించినపుడు, వాక్స్వరూపమున్నట్లు మనకే ప్రమాణమువలనను దెలియుచుండలేదు ఇట్లుండ,

(1) మరణకాలమున వాక్కుయొక్క వ్యాపారము ఉపరిమించినను అనఁగా మాటలు పోయినను మనస్సు సవ్యాపారముగా నుండునట్లు చేతిసంజ్ఞ మొదలగునవి చేయుటవలనఁదెలిసికొనుచున్నాము. నివృత్తవ్యాపారమైన వాగింద్రియము ప్రవృత్తవ్యాపారమగు మనస్సుతోఁ జేరుట యుపపన్నము. నివృత్తవ్యాపారమైన యగ్ని ప్రవృత్త వ్యాపారమగు దారువుతోఁ జేరియుండునట్లు మనము జూచుచున్నాము గదా.

(2) పూర్వపక్షి వాగ్వ్యాపారము మాత్రము మనస్సుతోఁ జేరుచున్నదని చెప్పెను. వాక్స్వరూపము మనస్సుతోఁ జేరుచున్నదని సిద్ధాంతి చెప్పుచున్నాఁడు. అయితే పూర్వపక్షి చెప్పినప్రకారము వాగ్వ్యాపారము మాత్రము మనస్సుతోఁ జేరుచున్నదని యొప్పుకొనినను, వాక్స్వరూపము మనస్సుతోఁ జేరకయున్నట్టిదిగా మనకు కనఁబడుచున్నదా? లేదు. కాఁబట్టి వాగింద్రియము మనస్సుతోఁ జేరకయున్నట్లు మనకుఁ గానఁబడదేని, వాక్కుయొక్క వ్యాపారము మాత్రమే మనస్సుతో సంయుక్తమగుచున్నదని చెప్పుకొనవచ్చును. వాగింద్రియము మనస్సుతోఁ జేరుచున్నట్లు మాత్రము మనకుఁ దెలియవచ్చుచున్నదా యనియెదవేమో? వాస్తవమే

వాగ్వ్యాపారముమాత్రము మనస్సుతో సంయుక్తమగుచున్నదనియు వాక్స్వరూపము సంయుక్తమగుచుండలేదనియు నెట్లు జెప్పఁగలము?

వాగింద్రియమునకు మనస్సు ఉపాదానకారణముకాదు గాన, వాగింద్రియము మనస్సునందు లీనమగుట యసంభవమని పూర్వపక్షి చెప్పినదియును సరికాదు. ఏలయన, "వాఙ్మనసి సంపద్యతే" అను శ్రుతివాక్యమునకు వాక్కు మనస్సుతో సంయుక్తమగుచున్నదని చెప్పుటయందు తాత్పర్యమేగాని యది మనస్సునందు లీనమగుచున్నదని చెప్పుటయందు తాత్పర్యము కాదు.

౨॥ సూ॥ అత ఏవ స ర్వా ణ్యా ను.

టీ॥ అతఏవ=పూర్వసూత్రోక్త హేతువువలననే, సర్వాణిచ=సర్వేంద్రియములును, అను=వాగింద్రియమువలె మనస్సుతో సంయుక్తములగుచున్నవి.

తా॥ పూర్వసూత్రమునందు గానఁబడిన హేతువులవలననే వాగింద్రియేతరములగు నన్నియింద్రియములును వాగింద్రియమువలెనె మనస్సుతో సంయుక్తములగుచున్నవి.

శ్రీ॥ భా॥ 'వాఙ్మనసిసంపద్యతే" అను శ్రుతివాక్యమున, వాగింద్రియమునకు మనస్సుతో సంయోగము మాత్రము వివక్షింపఁబడినది గాని, దానికి మనస్సునందు లయము వివక్షింపఁబడలేదని పూర్వసూత్రమున నిశ్చయింపఁబడియె. ఈ న్యాయమే "తస్మాదుపశాంత తేజా అపునర్భవమింద్రియైర్మనసి సంపద్యమానైః" అను శ్రుతియందుగూడ ననుసరింపదగినది. (వాగింద్రియేతరములగు నన్నియింద్రియములును, వాగింద్రియమునకు తరువాత మనస్సుతో సంయుక్తములగుచున్నవని చెప్పునట్టి యీ శ్రుతియందును పూర్వము జెప్పినప్రకారము వానికి మనస్సుతో సంయోగము మాత్రము వివక్షితముగాని లయము వివక్షితముగాదని యెఱుఁగునది.)

వాగధికరణము ముగిసెను.

మనోధికరణము.

౩॥ సూ॥ త న్మ నః ప్రా ణ ఉ త్త రా త్.

టీ॥ ఉత్తరాత్=ఉత్తరవాక్యమువలన, తత్=ఇంద్రియ సంయుక్తమగు, మనః=మనస్సు, ప్రాణే=ప్రాణమునందు, (సంపద్యతే=సంయుక్తమగుచున్నది)

అది యట్లు తెలియుచుండలేదు. అయినను "వాఙ్మనసి సంపద్యతే" అనుశ్రుతి యట్లు చెప్పుచున్నది. ప్రమాణాంతర వేద్యములుగాని వానిని శాస్త్రప్రమాణము తెలిపినట్లుగదా తెలియఁదగును. పైశ్రుతి వాగింద్రియమును మనస్సుతోఁ జేరుదానినిగాఁ జెప్పుచున్నదిగాని, వాగ్వ్యాపారమును మనస్సుతోఁ జేరుదానినిగాఁ జెప్పుచుండలేదే?

తా॥ ఇంద్రియ సంయుక్తమగు మనస్సు ప్రాణముతో సంయుక్తమగు చున్నదని యుత్తరవాక్యమువలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ చక్షురాదిసర్వేంద్రియసంయుక్తమైన మనస్సు ప్రాణముతో సంయుక్తమగుచున్నదని తెలియుచున్నది. కావున, నిచట మనోవృత్తి మాత్రము ప్రాణముతో సంయుక్తమగుచున్నదని జెప్పఁగూడదు. ''మనః ప్రాణే'' ''మనస్సు ప్రాణమున సంయుక్తమగుచున్నది'' అను ఉత్తరవాక్యము అట్లు తెలుపు చున్నది.

—•◆ ఆ క్షే ప ము. ◆•—

'' అన్నమయం హి సోమ్య మనః''అను శ్రుతివాక్యము ''మనస్సు అన్న ప్రకృతికమైనది'' అనుటచే ''మనస్సునకన్నము ఉపాదానకారణము'' అనియు, ''తా అన్నమసృజంత'' అను శ్రుతివాక్యము ''ఉదకము లన్నమును సృజించెను'' అనుటచే ''అయన్నమునకు ఉదకములు ఉపాదానకారణము'' అనియును, ''ఆపో మయః ప్రాణః'' అను శ్రుతివాక్యము ''ప్రాణము ఉదకప్రకృతికము'' అనుటచే, ''ప్రాణమునకు ఉదకములు ఉపాదానకారణము'' అనియును దెలియఁజేయు చున్నవి. అనఁగా నీ శ్రుతులవలన మనస్సున కుపాదాన కారణమన్నమనియు, అన్నమునకు ఉపాదానకారణము ఉదకమనియు, మఱియు ప్రాణమునకుఁగూడ ఉపాదాన కారణము ఉదకమనియుఁ దెలిసికొనుచున్నాము.




కనుక, ''మనః ప్రాణే'' అను వాక్యప్రకారము ''మనస్సు ప్రాణ మునందు, అనఁగా ప్రాణమునకు ఉపాదనకారణమగు నుదకమునందు లీన మగుచున్నదని చెప్పుట యుక్తము. ఇట్లు చెప్పినచో, మనస్సునకు పరంపరగా స్వకారణమునం దనఁగా నుదకమునందు లయ మీశ్రుతిచే బోధింపఁబడినట్లు చెప్పినట్లగును. కావున ఇట్లు చెప్పుట యుక్తమనిన,—

—•◆ స మా ధా న ము. ◆•—

''అన్నమయం హి సోమ్యమనః'' ''ఆపోమయః ప్రాణః'' అను శ్రుతి వాక్యములు ''మనస్సు అన్నముచేతను, ప్రాణము ఉదకములచేతను, పోషింపఁ బడుచున్నవని చెప్పుచున్నవే గాని, మనస్సునకు అన్నము ఉపాదాన కారణ మనియు, ప్రాణమునకు ఉదకములు ఉపాధాన కారణమనియును జెప్పుచుండ

లేదు. మనస్సునకు ఉపాదానకారణము అహంకారము. ప్రాణమునకు ఉపాదాన కారణము ఆకాశము. కాఁబట్టి "మనఃప్రాణే" అను శ్రుతియందలి "ప్రాణ" శబ్దముయొక్క లక్షణార్థము నవలంభించి యది యుదకవాచక మనుటకును అవకాశము లేదు.

మనోధికరణము ముగిసెను.

## అధ్యక్షాధికరణము.

### ౪॥ సూ॥ సోధ్యక్షే తదుపగమాదిభ్యః.

టీ॥ సః = ఆప్రాణము, అధ్యక్షే = కరణాధిపుఁడగు జీవునియందు సంపద్యతే = సంయుక్తమగుచున్నది. తదుపగమాదిభ్యః = (జీవునిగూర్చి ప్రాణములకు) సమీపప్రాప్త్యాదులు జెప్పఁబడుటవలన,

తా॥ జీవునిగూర్చి ప్రాణములకు సమీప ప్రాప్త్యాదులు శ్రుతియందుఁ జెప్పఁబడి యుండుటవలన, ప్రాణము కరణాధిపుఁడగు జీవునితో సంయుక్తమగుచున్నది.

#### పూర్వపక్షము.

"వాఙ్మనసి సంపద్యతే" అనియు "మనఃప్రాణే" అనియు నీశ్రుతివాక్యములయందుఁ జెప్పియున్న ప్రకారము, వాఙ్మనస్సులు మనఃప్రాణములతో సంయుక్తము లగుచున్నవని జెప్పినట్లు "ప్రాణస్తేజసి" యను శ్రుతివాక్యమునఁ జెప్పియున్న ప్రకారము ప్రాణము తేజస్సునందు సంయుక్తమగుచున్నదని చెప్పవచ్చునే? యనిన.

#### సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. ప్రాణము చక్షురాదీంద్రియముల కధిపతియగు జీవునితో సంయుక్త మగుచున్నది. ఏలయన, "ఏవమేవేమమాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి" అను శ్రుతివాక్యము "మరణసమయమునఁ బ్రాణములన్నియు జీవునితోఁ జేరుచున్నవి" అనియు "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" అను శ్రుతివాక్యము "ప్రాణము జీవుఁడు బయలు వెడలుచున్నప్పుడు వానిని వెంబడించిపోవుచున్నది" అనియును, జెప్పుచున్నందున ప్రాణము జీవునితోఁ గూడనే శరీరములోనుండి బయలు వెడలుచున్నట్లు దెలిసికొనుచున్నాము. మఱియు "కస్మిన్నుత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామి కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామి" (ప్రశ్న. ౬-3) అనువాక్యము "ఎవఁడు బయలు వెడలినచో, నేనున్ను బయలు వెడలుచున్నాను. ఎవఁడు స్థిరముగానుండిన నేనున్ను స్థిరముగానుందును" అనియు నివ్విధమగు ప్రాణ

సంవాదముచే నీశరీరమునందు జీవుఁడున్నంతవఱకే ప్రాణముండునని తెలియ వచ్చుచున్నది.

ఈ పై శ్రుతివాక్యముల వలనఁ బ్రాణస్థితిగతులు జీవస్థితిగతుల ననుస రించియున్నట్లు, అనగా జీవుఁడీశరీరములో నున్నంతవఱకే ప్రాణముగూడ శరీ రమునందుండుననియు, జీవుఁడీశరీరములోనుండి బయలువెడలినప్పుడు ప్రాణము గూడ బయలువెడలుననియును, దెలియుచున్నది. కావున ప్రాణము జీవునితోఁ గూడుకొని జీవునితోఁగూడ తేజస్సుతోఁ గలుసుకొనుచున్నదని, "ప్రాణస్తేజసి" అను శ్రుతిప్రమాణము తెలుపుచున్నది. యమునానది గంగతోఁగలిసి సముద్ర ములోఁ గలియుచున్నను యమునానది సముద్రములోఁ గలియుచున్నదని చెప్పి నట్లు "ప్రాణము తేజస్సుతో సంయుక్తమగుచున్నది" అని చెప్పుట పొసగును.

అధ్యక్షాధికరణము ముగిసెను.

---

## భూతాధికరణము.

### సూ॥ భూతేషు తచ్ఛ్రుతేః.

టీ॥ తచ్ఛ్రుతేః = జీవుఁడు సర్వభూతమయుండని తెలుపు శ్రుతివలన, భూతేషు = సర్వభూతములయందు, (సః-అవశిష్టతే = జీవునితోఁగూడిన ప్రాణ ముండును)

తా॥ జీవుఁడు సర్వభూతమయుఁడని శ్రుతివాక్యము జెప్పుచున్నందున జీవునితోఁగూడుకొనిన ప్రాణము సర్వభూతములతోను సంయుక్త మగుచున్నది.

శ్రీ॥ భా॥ "ప్రాణస్తేజసి" అను శ్రుతిప్రకారము ప్రాణము జీవునితోఁ గూడుకొని తరువాత తేజస్సుతో సంయుక్తమగుచున్నదని పూర్వసూత్రమునఁ జెప్పఁబడెను. ఇందొక సంశయము కలుగుచున్నది.

#### సంశయము.

ఇట్లు జీవునితోఁగూడిన ప్రాణము తేజస్సుతోమాత్రము సంయుక్తమగు చున్నదా? లేక, తేజస్సు మొదలగు భూతములతో నన్నింటితోను సంయుక్త మగుచున్నదా?

#### నిర్ణయము.

"పృథివీమయ ఆపోమయ స్తేజోమయః" అను శ్రుతివాక్యము "జీవుఁడు పృథివీమయుఁడుగాను, ఆపోమయుఁడుగాను, తేజోమయుఁడుగాను, బోవుచున్నాఁడు" అనుచు, దేహమునువదలి సంచరించు జీవునికి పృథివ్యాది భూతములన్నింటితోను సంబంధము గలదని తెలియఁజేయుచున్నందున, నట్టిజీవు

నితోఁ జేరియున్న ప్రాణము తేజస్సు మొదలగు భూతములన్నింటితోనుగూడ సంయుక్తమగుచున్నట్లు దెలిసికొనుచున్నాము.

అవతారిక:—ఇట్లు జీవసంయుక్తమగు ప్రాణము క్రమముగ తేజస్సు మొదలగు భూతములలో నొక్కొక్కదానితో సంయుక్తమగుచున్ననుగూడ జీవుఁడు పృథివీమయుఁడనియు ఆపోమయుఁడనియు, నివ్విధముగ శ్రుతి యందుఁ జెప్పియుండుట యుపపన్నమగునే యనిన.

౬॥ సూ॥ నైకస్మిన్ దర్శయతో హి

టీ॥ ఏకస్మిన్ = ఒకొక్కొక్క దానియందు మాత్రను, న =జీవుఁడు సంయుక్తుఁడు గాఁడు, హి = ఏలయన, దర్శయతః = (శ్రుతిస్మృతులు అట్లు) ప్రదర్శింపుచున్నవి.

తా॥ జీవుఁడొక్కొక్క భూతముతో మాత్రము సంయుక్తుఁడు కాఁడు. అయితే యతఁడు భూతములన్నింటితోను, సంయుక్తుఁడగు చున్నాఁడని శ్రుతి స్మృతులవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ భూతములలో నొక్కొక్కటి ప్రత్యేకముగా నెట్టికార్యమును జేయ సమర్థము కాదు, కావున నట్టి ప్రాణము భూతసమూహముతోఁ సంయుక్త మగుచున్నదనుట యుక్తము. ఇటులనే శ్రుతిస్మృతులు సయితము తెలియఁ జేయుచున్నవి. ఎట్లన, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకర వాణి తాసాంత్రివృతం త్రివృతమేకైకాం కరవాణి"అను శ్రుతివాక్యము "సచ్ఛబ్దవాచ్యమగు పరదేవత జీవశరీరుఁడుగా పృథివ్యప్తేజస్సులలోఁ బ్రవేశించి నామ రూప విశిష్టమగు దేవమనుష్యాది. విచిత్రసృష్టిని జేయుటకై యీపృథివ్య ప్తేజస్సులలో నొక్కొక్క దానిని త్రివృత్తుగాను అనఁగా నొక్కదానిని మూఁడు భూతములయొక్క భాగములు గలదానినిగాఁ జేసెనని చెప్పుచు, నామరూప వైశద్య రూపమగు సృష్టియందు ఉపయుక్తములగుటకై పృథివ్యాది భూత ములకు త్రివృత్కరణము గలదని యుపదేశించుచున్నది. స్మృతులును అట్లే తెలుపుచున్నవి.

శ్లో. నానావీర్యాః పృథగ్భూతాః తతస్తే సంహతిం వినా।
నాఽశక్నువన్ ప్రజాస్స్రష్టుం అసమాగమ్యకృత్స్నశః॥
సమేత్యాన్యోన్య సంయోగం పరస్పర సమాశ్రయాః।
మహదాద్యా విశేషాన్తా హ్యణ్డముత్పాదయంతి తే ".

విష్ణు. ౧ అం. ౨ అ. ౫౨. ౫౩.

తా॥ "నానావిధశక్తి యుక్తములైన పృథివ్యాది భూతములు వేఱు వేఱుగానున్నవయి, పరస్పరము కలిసియుండక పోవుటవలనఁ బ్రజాసృష్టియందు

సమర్థములుగాక పోయెను, అప్పుడవి పరస్పరము గలసికొని, పరస్పరము సంబంధించినవై, మహాదాది స్తంభపర్యంతముండు పదార్థములను, బ్రహ్మాండమునున్ను సృజించినవాయెను.

"ప్రాణస్తేజసి" (ఛా. ౬ ప్ర. ౮ ఖ. ౬ వా.) అను శ్రుతియందు తేజశ్శబ్దముచే భూతాంతరములతో గూడుకొనినదియేయగు తేజస్సు చెప్పఁబడుచున్నది. కనుక జీవసంయుక్తమైన ప్రాణము పరస్పర సంబద్ధములైయున్నట్టి పృథివ్యాది భూతము లన్నింటితోను సంయుక్తమగుచున్నది.

భూతాధికరణము ముగిసెను.

## ఆసృత్యుపక్రమాధికరణము.

౭॥ సూ॥ సమానాచాసృత్యు పక్రమాదమృతత్వం చానుపోష్య.

టీ॥ ఆసృత్యుపక్రమాత్ =నాడీప్రవేశపర్యంతము, సమానా=బ్రహ్మవేత్తకును బ్రహ్మవేత్తకానివానికిని ఉత్క్రాంతి సమానము, అమృతత్వంచ = ఇచటి యమృతత్వము, అనుపోష్య= (శరీరేంద్రియాది సంబంధమును). దహింపక, (ప్రాప్యం=ప్రాప్తించునట్టి సంచితాగామి కర్మముల యశ్లేషవినాశమే)

తా॥ బ్రహ్మవేత్తకును బ్రహ్మవేత్తకానివానికిని నాడీప్రవేశపర్యంతము ఉత్క్రాంతి సమానము. ఇచటఁ గలుగునట్టి యమృతత్వము శరీరేంద్రియ సంబంధముండునపుడే ప్రాప్తించునట్టి సంచితాగామికర్మముల యశ్లేష వినాశ రూపమయినది.

### సంశయము.

ఇట్లు బ్రహ్మవేత్తలును, బ్రహ్మవేత్తలు కానివారును అనఁగా ఈయుభయులును, శరీరములోనుండి బయలువెడలుచున్నారా ? లేక బ్రహ్మవేత్తలు కాని జీవులు మాత్రమే బయలు వెడలుచున్నారా ?

### పూర్వపక్షము.

బ్రహ్మవేత్తలుకాని జీవులు మాత్రమే శరీరములోనుండి బయలు వెడలుచున్నారు. బ్రహ్మవేత్తయగు పురుషుఁడిచటనే మోక్షమును బొందుచున్నాడని శ్రుతులుఁజెప్పుచుండుటచే నతఁడు బయలువెడలడు. ఎట్లన, "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది స్థితాః। అథమర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" (కఠ. ౨. ౬. ౧౪) అను శ్రుతి వాక్యము, 'ఓనచికేతుఁడా! ఈ పూర్వమందు జెప్పినప్రకారము బ్రహ్మవేత్త యగు వాని హృదయమును, జ్ఞానోత్పత్తికి పూర్వము, ఆశ్రయించియుండు సమస్తకోరిక లెప్పుడు నాశమును బొందుచున్నవో, అప్పుడామనుజుఁడు జననమరణ రూపమగు సంసా

రమునుండి విముక్తుఁడగుచు నిక్కడనే బ్రహ్మమును బొందుచున్నాఁడు" అని చెప్పుచున్నదిగదా! యనిన,

## సిద్ధాంతము.

నాడీప్రవేశమునకుపూర్వము వీరి యుభయుల యుత్క్రమణమును సమానమే. అయితే నాడీప్రవేశ సమయమున బ్రహ్మవేత్తయగు జీవుఁడు మాత్రము నాడీవిశేషముగుండా బయలు వెడలునని శాస్త్రము చెప్పుచున్నది. "శతంచైకాచ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్జన్యా ఉత్క్రమణే భవంతి" (కఠ. ౨-౬-౧౬) అను శ్రుతి వాక్యము, "బ్రహ్మవేత్తయగు పురుషుఁడు తనహృదయమునుండి బయలు వెడలిన నూటయొక్క నాడులలో శిరస్సును భేదించుకొని బయలువెడలిన యొకటియగు సుషుమ్న నాడిగుండ ఊర్ధ్వభాగమును బొంది జన్మమరణ రహితమగు మోక్షమును బొందుచున్నాఁడు. అజ్ఞానులు ఇతర నాడులద్వారా బయలువెడలి మరల సంసారమును బొందుచున్నారు" అనుటచే, బ్రహ్మవేత్తయగువాని విషయమై సుషుమ్న నాడిగుండ బహిర్గమనమును దెలియఁజేయుచున్నది. కావున బ్రహ్మవేత్తయగు వానికిఁగూడ శరీరములోనుండి బయలు వెడలక తప్పదు. కావున నాడీ ప్రవేశమునకు పూర్వము వీరియుభయుల యొక్కయును ఉత్క్రమణమును గుఱించి విశేషమేదియును జెప్పియుండనందున, నంతవఱకు వీరి యుత్క్రమణము సమానము. నాడీప్రవేశసమయమునన్, విశేషము వినఁబడుచున్నది. ఎట్లనిన, "తేనప్రద్యోతే నైషఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యోవా శరీరదేశేభ్యః" అనుశ్రుతివాక్యము, "నాడీద్వారము ప్రకాశింపఁగా జీవుఁడు నేత్రముద్వారాగాని, శిరస్సుద్వారాగాని, యితరములగు శరీర ప్రదేశములద్వారాగాని, బయలువెడలుచున్నాఁడు" అని చెప్పుచున్నది. కనుక "శతంచైకాచ" అను కాఠకశ్రుతి యీశ్రుతితో నేకార్థమైనందున "శిరోద్వారముగుండ బయలువెడలుననుట బ్రహ్మవేత్తనుగుఱించి చెప్పినదనియు, నేత్రము మొదలగు శరీరప్రదేశములనుండి బయలు వెడలుననుట బ్రహ్మవేత్తకాని వానిని గుఱించి చెప్పినదనియును నిశ్చయింపఁబడుచున్నది.

"యదా సర్వే ప్రముచ్యంతే" అను కాఠకశ్రుతి బ్రహ్మవేత్త శరీరములోనుండిబయలు వెడల నక్కరలేకుండ అతని కచ్చటనే యమృతస్వరూపమగు మోక్షము గలుగుననుచున్నది" అని చెప్పుచున్న దేయని శంకింపఁబనిలేదు. ఈ శ్రుతియందుఁ జెప్పఁబడు అమృతస్వరూపము శరీరేంద్రియ సంబంధము వదలక ముందే పొందఁబడునుగాన, నిది విద్యామాహాత్మ్యముచే బ్రహ్మవేత్తకుఁగలుగు సంచితాగామి పుణ్యపాపముల అశ్లేషవినాశరూపమైనదని యెఱుంగఁదగినది. "యదా

సర్వై ప్రముచ్యంతే" అను శ్రుతియునుగూడ అట్లే చెప్పుచున్నది. అనఁగా ఇట్టి యమృతత్వమునే యీశ్రుతి జెప్పుచున్నది. అయితే "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అను శ్రుతివాక్యము "బ్రహ్మవేత్త యిచ్చటనే బ్రహ్మమును బొందుచున్నాఁడు" అని చెప్పుచున్నదే యనియును శంకింపఁబనిలేదు. "ఇచ్చటనే బ్రహ్మమును బొందుచున్నాఁడు" అనఁగా "ఉపాసనము ననుష్ఠించు సమయమునందు గలుగు బ్రహ్మానుభవమును బొందుచున్నాఁడు" అనుట.

## ౮॥ సూ॥ త దా పీ తే స్సం సా ర వ్య ప దే శా త్

టీ॥ తత్ = ఆ యమృతత్వము (శరీరేంద్రియ సంబంధముండునపుడు పొందఁబడు నదియే ఏలయన), ఆపీతేః = బ్రహ్మప్రాప్తిపర్యంతము, సంసార వ్యపదేశాత్ = (అంతవఱకు) సంసారముండునని శ్రుతి యుపదేశించుట వలన.

తా॥ బ్రహ్మప్రాప్తి పర్యంతము సంసారముండునని శ్రుతి యుపదేశించుట వలన, అవశ్యముగ ఆ యమృతత్వము శరీరేంద్రియసంబంధముండునపుడు గలుగునదియే.

శ్రీ॥ భా॥ శ్రుతివాక్యమునఁ జెప్పబడిన యమృతత్వము శరీరసంబంధము విడిపోవుటకు పూర్వము గలుగునదియే యని యవశ్య మెఱుంగునది. ఏలయన, బ్రహ్మప్రాప్తి గలుగు నఱకును . సంసారసంబంధము గలదు. బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షమన్ననో, ఈ జీవుఁడర్చిరాదిమార్గమునఁ బ్రయాణము జేసి లోకాంతరమును జేరి బొందునది. అట్టి యవస్థను బొందువఱకును దేహేంద్రియ సంబంధరూపమగు సంసారముండునని గదా శ్రుతియును జెప్పుచున్నది. ఎట్లనన, "తస్యతావదేవ చిరం యావ న్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే" (ఛా. ౬ ప్ర. ౧౪ ఖ. ౨ వా.) అను శ్రుతివాక్యము "బ్రహ్మవిద్యావంతుని కెంతవఱకు ప్రారబ్ధకర్మారబ్ధమైన శరీరము విడవకుండునో అంతవఱకు బ్రహ్మప్రాప్తి గలుగుట కాలస్యముండును. తరువాత ఈతఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడు" అని చెప్పుచున్నది. మఱియు "అశ్వ ఇవ రోమాణి విహాయ పాపం, చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య, ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవాని" (ఛా. ౮ ప్ర. 3 ఖ. ౧ వా.) అను శ్రుతివాక్యము సయితము "అశ్వము భూపరాగముచేత లిప్తములయి యుండెడి రోమములను కంపనము చేసి మాలిన్యమును పోగొట్టుకొనునట్లు పుణ్యపాపములను త్యజించి, చంద్రుఁడు రాహుముఖమునుండి బయలువెడలునట్లు, శరీరమునుండి బయలువెడలి, కృతార్థుఁడగు బ్రహ్మవేత్త నిత్యమగు బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు" అనుటవలన నిట్లు తెలియఁజేయుచున్నది.

౯॥ సూ॥ సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః.

టీ॥ సూక్ష్మం = సూక్ష్మశరీరము, (అనువర్తతే = అనువర్తించుచున్నది), ప్రమాణతః = శ్రుతిప్రమాణమువలన, తథా=అట్లు, ఉపలబ్ధేః = తెలియుచుండుటవలన.

తా॥ జీవునితోఁగూడ సూక్ష్మశరీరము పోవుచున్నట్లు శ్రుతివలనఁదెలియ వచ్చుచుండుటచే శరీరములోనుండి బయలు వెడలినంత మాత్రమున శరీరేంద్రియ సంబంధము విడలేదు.

శ్రీ॥ భా॥ ఇట్లు జీవుఁడు శరీరమునుండి బయలు వెడలిన తరువాతనుగూడ ఈతఁడు బంధవిముక్తుఁడు గాడు. అప్పుడీతనితోఁగూడ సూక్ష్మశరీరము పోవుచున్నట్లు శ్రుతిప్రమాణము దెలియఁబఱచుచున్నది. ఎట్లన, "తం ప్రతిబ్రూయాత్ సత్యం బ్రూయాత్" అను శ్రుతివాక్యము "సత్యము జెప్పవలయునని యతనికిఁ జెప్పుము" అనుచు దేవయానమునఁ బోవు బ్రహ్మవేత్తకు చంద్రునితో సంభాషణము జరుగుచున్నట్లు తెలుపుచున్నది. అందువలన నీతనికి శరీరమున్నట్లు దెలియుచున్నది. కావున సూక్ష్మశరీర మీతనితోఁగూడ పోవుచున్నట్లు సిద్ధమగుచున్నది. కనుక నింతటితో ఈతనికి బంధవిముక్తి గలుగలేదు.

౧౦॥ సూ॥ నోపమర్దేనాతః.

టీ॥ అతః=అందువలన, ఉపమర్దేన=సంసారబంధముపోవుటచేఁ గలుగు అమృతత్వమును, న="యదా సర్వే" ఇత్యాదిశ్రుతి జెప్పుచుండలేదు.

తా॥ కాఁబట్టి "యదా సర్వే ప్రముచ్యంతే" ఇత్యాది శ్రుతివాక్యము జీవునికి బంధనాశముచేఁ గలుగునట్టి అనఁగా బ్రహ్మప్రాప్తి రూపమైన యమృతత్వమును జెప్పుచుండలేదు.

శ్రీ॥ భా॥ కనుక "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృదిస్థితాః అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అను శ్రుతివాక్యము సంసారసంబంధము బొత్తుగఁబోవుటచేఁ గలుగు అమృతత్వమును జెప్పుచుండలేదు.

౧౧॥ సూ॥ అస్యైవ చోపపత్తేరూష్మా.

టీ॥ అస్య=ఈసూక్ష్మశరీరము, ఉపపత్తేః=ఉన్నట్లు సంభవమగుటవలన, ఊష్మా=(ఈ స్థూలశరీరమున నుండు) వేడిమి, అస్య ఏవచ = ఈ సూక్ష్మశరీర సంబంధ మయినదే.

తా॥ సూక్ష్మశరీరముండుట సంభవము గాన, మరణకాలమున స్థూలశరీరమునం దొక్కతావునఁ దెలియవచ్చుచున్నట్టి వేడిమి సూక్ష్మశరీర సంబంధమయినదియే.

శ్రీ॥ భా॥ ఏదాక్క తావున సూక్ష్మశరీరముండుట సంభవముగాన, మరణము సమీపించిన బ్రహ్మవేత్తకు మృతినొందుటకు పూర్వము స్థూలశరీరమునందు ఏదొక్కతావున ఉష్ణముగానుండును. ఈయుష్ణత స్థూలశరీరసంబంధమైనది గానేరదు. అటులైనచో నిది స్థూలశరీరమందంతట నుండవలయునే? ఏదొక్క తావున మాత్రము ఏల యుండవలయును? కావున ఇట్లు యుష్ణముగా నుండుట బ్రహ్మవేత్త శరీరమును వదలి పోవునపుడు అతనితోఁగూడబోవు సూక్ష్మశరీర సంబంధమైనదని తెలియవచ్చుచున్నది. దీనివలన నాడీప్రవేశము వఱకు బ్రహ్మవేత్తలకును బ్రహ్మవేత్తలు కానివారికిని వీరియుభయులకును, ఉత్క్రమణము (శరీరములోనుండి బయలు వెడలుట) సమానమే యని సిద్ధమగుచున్నది.

అవతారిక:—బ్రహ్మవేత్త శరీరములోనుండి బయలువెడలడని మరల శంకించి ఆశంక నీసూత్రముచే పరిహరించుచున్నారు.

౧౨॥ సూ॥ ప్రతిషేధాదితి చేన్న శారీరాత్స్పష్టో హ్యేకేషాం.

టీ॥ ప్రతిషేధాత్ = (బ్రహ్మవేత్త విషయమై యుత్క్రమణము శ్రుతియందు) నిషేధించియుండుటవలన, ఇతిచేత్ = అతనికి శరీరములోనుండి యుత్క్రమణము సంభవింపదంటివేని, న=అట్లుకాదు. (ఏలయన) శారీరాత్ =జీవునినుండి ఉత్క్రమణమును అచట నిషేధించుట వలన, ఏలననఁగా, ఏకేషాం= కొన్ని శాఖలయందు (జీవునినుండి ఉత్క్రమణమును నిషేధించుట), స్పష్టోహి= స్పష్టముగాఁ జెప్పఁబడినది గదా!

తా॥ "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అనుచో, బ్రహ్మవేత్త విషయమై యుత్క్రమణమును శ్రుతిప్రతిషేధించుటచే నతనికి శరీరములోనుండి యుత్క్రమణము సంభవింపదంటివేని, యది యుక్తము గాదు. జీవాత్మనుండి ప్రాణముల యుత్క్రమణము నచట శ్రుతి ప్రతిషేధించెనుగాని, శరీరములోనుండి జీవుని యుత్క్రమణమును శ్రుతి ప్రతిషేధింపలేదు. ఈ విషయము మాధ్యందిన శాఖయందు స్పష్టముగాఁ దెలుపఁబడినది.

—••◆ ఆక్షేపము. ◆••—

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తయును శరీరములోనుండి బయలువెడలునని యింతకుఁ బూర్వము జెప్పఁబడియె. అది యసంభవము. బ్రహ్మవేత్తనుగుఱించి యుత్క్రమణము శ్రుతులచే నిషేధింపఁ బడుచున్నది. ఏలననిన, వాజసనేయులు ఆరంభమున "స ఏతా స్తేజోమాత్రా స్సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి" (బృ. ౬ అ. ౪ బ్రా. ౧ వా.) అను వాక్యముచే, "జీవుఁడు తేజస్సు మొదలగు భూతసూక్ష్మములను తనయందుంచుకొని హృదయప్రదేశమును జేరుచున్నాఁడు" అని పఠించి, "తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి తమత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" అను వాక్య

ముచే "అప్పుడు జీవనిర్గమస్థానమగు నాడీద్వారము ప్రకాశింపఁగా, జీవుఁడు శరీరములోనుండి బయలు వెడలుచున్నాఁడు. అట్లు బయలు వెడలునట్టి జీవుని యనుసరించి, ప్రాణము గూడ బయలు వెడలుచున్నది" అని పఠించుటచే బ్రహ్మవేత్త గాని వాఁడు శరీరములోనుండి బయలు వెడలు పద్ధతిని వర్ణించి, తరువాత "అన్యన్నవతరం కల్యాణతరం రూపం కురుతే" అను వాక్యముచే "పూర్వమున్న శరీరమునకంటె, భిన్నమును, నూతనమును, మంగళస్వరూపమునునగు శరీరమును బొందుచున్నాఁడు" అనుటచే, బ్రహ్మవేత్తకాని వాఁడు మఱియొకశరీరమును బొందునని చెప్పి, తుట్టతుదకు "ప్రాప్యాంతంకర్మణ స్తస్యయత్కించేహ కరోత్యయం తస్మాల్లోకాత్పున రేత్యస్మై లోకాయ కర్మణే" (తాను యీలోకమునందొనర్చిన కర్మములయొక్క ఫలముల ననుభవించి కర్మమును సంపాదించుకొనుటకై మరల ఈలోకమునకు వచ్చుచున్నాఁడు) అనుటచే, వానిని గుఱించి పునరావృత్తిని జెప్పి, తదనంతరము, "అథాకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామః న తస్య ప్రాణా ఉత్క్రామన్తి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను వాక్యముచే "ఎవఁడు కర్మఫలమును కోరనివాఁడును, కోరిక లేనివాఁడును, తననుండి సమస్తములయిన కోరికలును పోయినవాఁడును, పొందఁబడినకోరికగలవాఁడునునై (అనగా శేషము లేకుండ నన్నికోరికల ఫలములను బొందినవాఁడునై) స్వస్వరూపమును మాత్రము కోరువాఁడు అగుచున్నాఁడో వాని ప్రాణములు శరీరములోనుండి బయలు వెడలవు. అట్టివాఁడిక్కడనే బ్రహ్మమై పరిపూర్ణమగు బ్రహ్మమును బొందుచున్నాఁడు" అని పఠించుటచే బ్రహ్మవేత్తను గుఱించి శరీరోత్క్రమణమును నిషేధించుచున్నవి. మఱియు నింతకు పూర్వము జనకచక్రవర్తి యజ్ఞసభయందు ఆర్తభాగుఁడను మహర్షి ఈవిషయమునే గుఱించి యాజ్ఞవల్క్యుని ప్రశ్న చేసినపుడు యాజ్ఞవల్క్యుఁడును బ్రహ్మవేత్త యగువాఁడు శరీరములోనుండి బయలు వెడలడని చెప్పియున్నాఁడు. అదెట్లనిన "అపపునర్మృత్యుంజయతి" అనువాక్యముచే ఆర్తభాగుఁడు "జన్మమరణ రూపమగు మృత్యువును జయించుచున్నాఁడు" అనుచు బ్రహ్మవేత్తను గుఱించి ప్రస్తావించి "యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియతే ఉదస్మాత్ప్రాణాః క్రామంత్యా హో నేతి" అను వాక్యమున, ఓ యాజ్ఞవల్క్యుఁడా! బ్రహ్మవేత్త యగు పురుషుఁడు మరణమును బొందఁగా నతని శరీరము నుండి ప్రాణములు లేచి పోవుచున్నవా! లేక, అవి లేచిపోవుచుండ లేదా? అని ప్రశ్న చేయఁగా, యాజ్ఞవల్క్యుఁడు "నేతి హోవాచ యాజ్ఞవల్క్యోఽత్రైవ సమవలీయంతే స ఉచ్ఛ్వయత్యాధ్మాతో మృతః శేతే" అను వాక్యమున "బ్రహ్మవేత్త యగు వాని ప్రాణములు బయలు వెడలక ఇక్కడనే పరబ్రహ్మమునందు లీనమగుచున్నవి. అనంతరమీ పురుషుఁడు నిద్రాళుతను

బొంది, బాహ్యవాయువుచేత పూరింపఁబడిన వాఁడై స్మృతినొందుచున్నాఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను. కనుక బ్రహ్మవేత్తయగు వాఁడు శరీరములోనుండి బయలు వెడలక ఈ శరీరమునందే అమృతత్వమును బొందుచున్నాఁడని చెప్పుట యుక్తమనిన,

సమాధానము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, ప్రత్యగాత్మనుండి ప్రాణములు విడిపోవుచుండ లేదని ఈశ్రుతియందుఁ జెప్పఁబడెను గాని శరీరములోనుండి కాదు. ఏలయన, "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అను వాక్యమందలి "తస్య" యను సర్వ నామపదము "అథాకామయమానః" అను పూర్వవాక్యమునందు జెప్పఁబడిన బ్రహ్మవేత్తయగు పురుషుని పరామర్శించుచున్నదే గాని, పూర్వ వాక్యమునందుఁ జెప్పఁబడని శరీరము నిచట పరామర్శించుచుండ లేదు.

"తస్య" యనునది షష్ఠీవిభక్త్యంతపదము గనుక, అది "తస్యప్రాణాః" యనుచోట "తస్య=వాని—ప్రత్యగాత్మయొక్క, ప్రాణాః=ప్రాణములు" అనెడి యర్థము నిచ్చునే గాని "ప్రత్యగాత్మనుండి" యను పంచమీ విభక్త్యర్థము నెటుల నిచ్చును? కనుక ప్రత్యగాత్మ సంబంధములగు ప్రాణములు శరీరమునుండి బయలువెడలవనుట శ్రుత్యర్థముగాని యవి ప్రత్యగాత్మనుండి వేఱుగాఁ బోవ నుట యీ శ్రుత్యర్థముకాదని శంకింపఁబనిలేదు. ఏలననిన, పూర్వము శ్రుతి యందు జెప్పఁబడిన యాత్మను బరామర్శించు "తస్య" యను శబ్దముయొక్క షష్ఠీవిభక్తిని పంచమ్యర్థమునఁ గైకొని "యాత్మనుండి ప్రాణములు వేఱుగాఁ బోవనుటయే" యీ శ్రుత్యర్థమనుట యుక్తము. ఇంతియెగాక సంబంధసామా న్యమును తెలుపునది యగు "తస్య" యను పదముయొక్క షష్ఠీవిభక్త్యర్థ ములోఁ బ్రకృతమునఁ బ్రయోజన మెద్దియును గానఁబడదు. ఈ తావుల షష్ఠీ విభక్తిని పంచమీ విభక్త్యర్థమునఁగైకొనుట శాస్త్రవిరుద్ధము గాదు. ఉదాహ రణము:—" నటస్య శృణోతి=నటునివలన వినుచున్నాఁడు" యను నపుడు "నటస్య" యనుపదము షష్ఠీవిభక్తియందున్నను, "నటునివలన" అని పంచమీ విభక్త్యర్థమును గైకొనుచుండలేదా ? అయిన నిచట షష్ఠీవిభక్త్యర్థమా? లేక, పంచమీవిభక్త్యర్థమా ? యని వివాదపడవలసిన యవసరము లేకుండనే మాధ్యందినులు జీవపరామర్శియగు తచ్ఛబ్దమును "యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్మాత్ప్రాణా ఉత్క్రామన్తి" అనుతావున "తస్య" అనుటకు బదులుగా "తస్మాత్" అని పంచమీవిభక్తియందే ప్రయోగించి యున్నారు.

బ్రహ్మవేత్తయగు నాత్మనుండి ప్రాణములు వేఱగునని పూర్వ మెచట నయినను, ప్రాప్తమయినచో నిచట నట్టియాత్మనుండి ప్రాణములు వేఱుగా

బోవని యాశ్రుతియందుఁ జెప్పియుండుట యుక్తమగును. అయితే యీసందర్భమున నావిషయమును గుఱించిన ప్రసక్తియే లేదు గాన నిషేధమెందుకని శంకింపఁబని లేదు. బ్రహ్మవేత్తయగు నాత్మనుండి ప్రాణములకు ఉత్క్రాంతి ప్రసక్తమే. అదెటులనిన:—"తస్యతావదేవ చిరం" యను శ్రుతివాక్యము, "బ్రహ్మవేత్తయగు నాత్మకు శరీర సంబంధము పోయినచో బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షము గలుగును" అని చెప్పుచుండుటచే "బ్రహ్మప్రాప్తి సమయమున దీయాత్మను శరీరము విడనాడునట్లు ప్రాణములుగూడ విడనాడును" అని ప్రసక్తించెను. అట్లు ప్రాణములుగూడ యీ యాత్మను విడుచుచున్నచో, ఈయాత్మ దేవయాన మార్గమునఁ బ్రయాణము జేసి బ్రహ్మమును జేరుట యసంభవమగును. కనుక, బ్రహ్మవేత్తయగువాఁడు దేవయాన మార్గమునఁ బ్రయాణము జేసి బ్రహ్మమును బొందుటకు పూర్వము ఈతనిని ప్రాణములు విడనాడవని "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అను శ్రుతివాక్యము చెప్పుచున్నది. ఆర్తభాగుఁడడిగిన ప్రశ్నము బ్రహ్మవేత్త విషయమగు పక్షమునను, ఈపైని గానఁబఱచిన ప్రకారమే పరిహారమును యొఱుఁగునది. అయితే, ఆర్తభాగుని ప్రశ్నము బ్రహ్మవేత్తకానివాని విషయమైనది. ఆర్తభాగ యాజ్ఞవల్క్యుల ప్రశ్నోత్తర సందర్భమున బ్రహ్మవిద్యయొక్క ప్రసక్తియే లేదు. అచట నీ క్రిందయుదహరింపఁబడిన విషయములు మాత్రమే విచారింపఁబడినవి.

1. గ్రహాతిగ్రహ రూపములగు ఇంద్రియేంద్రియార్థముల స్వభావమును గుఱించిన విచారము.
2. ఉదకము లగ్నికి అన్నమగుట.
3. మరణసమయమున ప్రాణము జీవుని విడనాడక పోవుట.
4. చనిపోయిన వానిని నామ మనఁబడు కీర్తి యనువర్తించుట.
5. మరణానంతరము జీవుఁడు పుణ్యాపాపకర్మానుగుణమగు గతిని బొందుట.

ఈపైని యుదహరించిన విషయములే యచట ప్రశ్నోత్తరరూపముగా విచారింపఁబడినవి.

మఱియు నచట "అపపు నర్మృత్యుం జయతి" యనునపుడు ఉదకము లగ్నికి యన్నమనెడి జ్ఞానముచే అగ్నిని జయించుటయనఁబడు నది మృత్యువును జయించుటయని చెప్పఁబడుచున్నది.

కనుక ఈ సందర్భమున బ్రహ్మవేత్తయొక్క ప్రసక్తియే లేదు. అయితే "నేతిహోవాచ యాజ్ఞవల్క్య" అను వాక్యముచే మరణము నొందువానిని ప్రాణములు విడిచిపోవని యిట్లు యాజ్ఞవల్క్యుఁడిచ్చిన యుత్తరము బ్రహ్మవేత్త కాని వాని విషయమైనది. అనఁగా "స్థూలదేహమువలె ప్రాణములును అజ్ఞానిని

వదలవు. అయితే యివి భూతసూక్ష్మములవలె జీవునితోఁగూడి పోవుచున్నవి" యని ప్రతిపాదింపఁబడియె. కనుక నిచట దోషమెద్దియును లేదు.

౧౩॥ సూ॥ స్మ ర్య తే చ.

టీ॥ స్మర్యతే-చ=మఱియు స్మరింపఁబడుచున్నది.

తా॥ బ్రహ్మవేత్తకు గూడ మూర్ధన్యనాడిగుండ ఉత్క్రమణము స్మృతి యందు జెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ "ఊర్ధ్వమేకః స్థితస్తేషాం యో భిత్వా సూర్యమండలం, బ్రహ్మలోక మతిక్రమ్య తేన యాతి పరాం గతిం" అను యాజ్ఞవల్క్యస్మృతిగూడ "వానిలో నూర్ధ్వముగాఁ బోవునట్టి యొకనాడీద్వారా బయలువెడలు జీవుఁడు సూర్యమండలమును భేదించుకొని పోయి బ్రహ్మలోకము నతిక్రమించి ఉత్కృష్టమైన గతిని బొందుచున్నాఁడు" అనుటచే బ్రహ్మవేత్తయగువాఁడు మూర్ధన్యనాడిగుండ శరీరములోనుండి బయలు వెడలుచున్నాఁడని చెప్పుచున్నది.

ఆస్సృత్యుప క్రమాధికరణము ముగిసెను.



## పరసంపత్త్యధి కరణము.

౧౪॥ సూ॥ తా ని ప రే త థా హ్యా హ.

టీ॥ తాని=భూతసూక్ష్మములు, పరే=పరబ్రహ్మమునందు (సంపద్యంతే=సంయుక్తము లగుచున్నవి.) తథా=అట్లు, ఆహహి=శ్రుతి చెప్పుచున్నది గదా!

తా॥ భూతసూక్ష్మములు పరమాత్మతో సంయుక్తము లగుచున్నవి. ఇట్లు శ్రుతి చెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ కరణాధ్యక్షుఁడగు ప్రత్యగాత్మ ఇంద్రియములతోడను, ప్రాణములతోడను గూడుకొని యీశరీరములోనుండి బయలువెడలు సమయమున తేజస్సు మొదలగు భూతసూక్ష్మములతో సంయుక్తుఁడగు చున్నాఁడని చెప్పి ఇట్టి సంయోగము బ్రహ్మోపాసకుని గుఱించినది గాదని శంకింపఁగా నట్టి శంకను గూడ పరిహరించి యుండిరి. ఇప్పుడు వేఱొక సంశయము గలుగుచున్నది.

సం శ య ము.

ఇట్లు ఈ జీవునితోఁగూడ బోయెడు భూతసూక్ష్మములు ఈజీవుఁడు పరబ్రహ్మమును బొందునపుడు (మఱియొక జీవుని యాశ్రయించి వాని) కర్మజ్ఞానానుగుణముగ సుఖదుఃఖరూపమగు ఫలమును గలుగఁ జేయుచున్నవా? లేక ఇవియును గూడ బ్రహ్మములో సంయుక్తములగు చున్నవా?

## పూర్వపక్షము.

భూతసూక్ష్మములు పరబ్రహ్మముతో సంయుక్తములగు పక్షమున, నప్పుడపి వాని కార్యములగు సుఖదుఃఖములను గలుగఁజేయుచున్నట్లు దెలియవచ్చుచుండలేదు. కాబట్టి ఆభూతసూక్ష్మములు కర్మజ్ఞానాను గుణములగు సుఖదుఃఖరూప భోగములను గలుగఁజేయుటకు తగిన తావునకు బోవుచున్న వనుట యుక్తమనిన,

## సిద్ధాంతము.

అట్లుచెప్పుట సరికాదు. భూతసూక్ష్మములు పరమాత్మతో సంయుక్తము లగుచున్నవి. ఏలననిన, "తేజః పరస్యాం దేవతాయాం" అను శ్రుతివాక్యము "తేజస్సుమొదలగు భూతసూక్ష్మములు పరమాత్మతో సంయుక్తము లగుచున్నవి" అని గదా చెప్పుచున్నది. శ్రుతియందుఁజెప్పియున్న ప్రకారము ఈ భూతసూక్ష్మముల కార్యమును గల్పించుకొనుట యుక్తము. ప్రళయకాలముననను, సుషుప్తియందును పరమాత్మతో సంయోగము గలుగుచుండుటచే సుఖదుఃఖభోగాయాసమునుండి విశ్రాంతము గన్పట్టుచున్నది గదా. అటులనే ప్రకృతమునను యెఱుంగునది.

పరసంపత్త్యధికరణము ముగిసెను.



## అవిభాగాధికరణము.

### ౧౭॥ సూ॥ అవిభాగో వచనాత్.

టీ॥ అవిభాగః=(ఆత్మయు, భూతసూక్ష్మములును పరమాత్మనుబొందుట యనఁబడునది) పృథగ్వ్యవహారానర్హ స్వరూపమగు సంసర్గము. ఏలయనిన, వచనాత్ = "సంపద్యతే" అను క్రియాపదము ఉభయత్ర సంబంధించుచున్నందువలన.

తా॥ ఆత్మయు, భూతసూక్ష్మములున్ను, పరమాత్మను బొందుచున్న వనఁగా నవి పరమాత్మనుండి వేఱుగాఁ దెలియరానట్టివగు సంసర్గమును బొందుచున్నవి. "వాఙ్మనసి సంపద్యతే" అనుచోట "సంపద్యతే" అను క్రియాపదము "తేజః పరస్యాం దేవతాయాం" అను తావునఁగూడ నన్వయించుటవలన నిట్లు దెలియవచ్చుచున్నది.

## సంశయము.

శ్రీ॥ భా॥ ఇటుల నీభూతసూక్ష్మములు పరమాత్మను బొందుననఁగా ఘటాది కార్యపదార్థములు మృత్తికాదికారణపదార్థములయందు లయమై మృత్తికాది

కారణ స్వరూపమును బొందునట్లు, పరమాత్మయందు లయమై పరమాత్మ స్వరూపమును బొందుచున్నవా? లేక, "వాఙ్మనసి" అను శ్రుతిప్రకారము వాగాదీంద్రియములు మనస్సుతో సంయుక్తము లగుచున్నట్లు, ఇవియును పరమాత్మను విడువకుండ నెప్పుడు నతనితోఁ జేరియుండున వగుచున్నవా?

## పూర్వపక్షము.

పరమాత్మ సర్వమునకుఁ గారణ మగుటవలన నతనికార్యములగు భూత సూక్ష్మములు సర్వకారణుఁడగు నాపరమాత్మయందు లీనములై కారణ స్వరూపమును బొందుచున్న వనుట యుక్తమనిన,

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము గాదు. భూతసూక్ష్మములు పరమాత్మతో నవిభాగమును బొందుచున్న వనఁగా పరమాత్మకంటే వేఱుగా వ్యవహరింప నర్హములుగా నట్లు వానితో సంబంధించి యుండునవి యనుట. ఏలననిన, "వాఙ్మనసి సంపద్యతే" అను వాక్యమునుండి "సంపద్యతే" అను క్రియాపదము "తేజః పరస్యాం దేవతాయాం" అను వాక్యమునందు అనువర్తించుచున్నది. ఈ పదము ఆవాక్యమున సంబంధవిశేషమును తెలుపునది. వాక్యాంతరమునుండి యనువర్తించునట్టి పదము ఆవాక్యాంతరమున బోధించిన యర్థమునకంటె భిన్నమగు నర్థమును బోధించు ననుట కెద్దియు ప్రమాణములేదు గదా! ఇంతియెగాక, ఉత్క్రమణ సమయమున నీభూతసూక్ష్మములు పరమాత్మయందు లీనములై కారణస్వరూపమును బొందుటకు ప్రయోజన మేదియును గానఁబడదు. [1]మఱియు, నచట నవ్యక్తాదుల సృష్టియును మరల చెప్పఁబడలేదు.

ఆవిభాగాధికరణము ముగిసెను.

---

## తదోకోధికరణము.

౧౬॥ సూ॥ తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతశ్శతాధికయా.

టీ॥ (ఉపాసకుఁడు) విద్యాసామర్థ్యాత్=బ్రహ్మవిద్యా ప్రభావము వలనను, తచ్ఛేషగత్యనుస్మృతియోగాత్-చ=అట్టి బ్రహ్మవిద్యకు అంగభూతమగు నర్చిరాదిగతియొక్క యను చింతనమువలనను, హార్దానుగృహీతః=హృదయాం

---

1 ఈతావున కారణస్వరూపాపత్తి రూపమగు లయము చెప్పఁబడినదగు పక్షమున, నిచట సృష్టిని గుఱించియును చెప్పియుండవలయును. అట్లు చెప్పియుండలేదు. అందువలన నిచట లయము వివక్షితము కాదని యెఱుంగునది.

తర్వాత్తియగు పరబ్రహ్మముచే ననుగ్రహింపఁబడినవాఁడు (భవతి=అగుచున్నాఁడు) (అందువలన) (తదోకః), తత్ = ఆ జీవాత్మయొక్క, ఓకః = స్థానమగు హృదయము, అగ్రజ్వలనం-అగ్రే=చివర (నాడీముఖమున) జ్వలనం=ప్రకాశముగలది (భవతి=అగుచున్నది, అప్పుడు జీవుఁడు)తత్ప్రకాశితద్వారః=పరమాత్మానుగ్రహముచే ప్రకాశింపఁజేయఁబడిన ద్వారము గలవాఁడు, (జాయతే=అగుచున్నాఁడు, పిమ్మట అతఁడు), శతాధికయా = నూటయొక్కటియగు నాడిగుండ (నిష్క్రామతి = వెడలుచున్నాఁడు.)

తా. బ్రహ్మవేత్త తాననుష్ఠించునట్టి బ్రహ్మవిద్యయొక్క మాహాత్మ్యము వలనను, అట్టి బ్రహ్మవిద్యకు శేషభూతమగు నర్చిరాది మార్గస్మరణమువలననున్ను పరమాత్మచే ననుగ్రహింపఁబడినవాఁడగును. అందువలన జీవుని కాయతనమగు హృదయముయొక్క యగ్రమున నొక ప్రకాశము గలుగును. ఆపరమాత్మయొక్క యనుగ్రహముచే నిష్క్రమణ ద్వారముగూడ ప్రకాశితమగును. పిమ్మట బ్రహ్మవేత్త నూటయొక్కటియవదగును మూర్ధన్య నాడిగుండ శరీరము లోనుండి బయలు వెడలును.

శ్రీ॥ భా॥ నాడీ ప్రవేశము వఱకు బ్రహ్మవేత్తలకును బ్రహ్మవేత్తలు కానివారికిని వీరియుభయులకును ఉత్క్రమణము సమానమని యింతకుఁబూర్వము ప్రతిపాదింపఁబడెను. ఇఁకమీఁద బ్రహ్మవేత్తయొక్క యుత్క్రమణమును గుఱించి విశేషము జెప్పఁబడుచున్నది.

"శతం చైకాచ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా, తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" అను శ్రుతివాక్యము "బ్రహ్మవిద్య ననుష్ఠించువాఁడు తన హృదయమునుండి బయలు వెడలిన నూటయొక్క నాడులలో శిరస్సును భేదించుకొని బయలు వెడలినదియు, ఒక్కటియునగు సుషుమ్న నాడిగుండ నూర్ధ్వభాగమును బొందినవాఁడై అమృతస్వరూపమగు మోక్షమును బొందుచున్నాఁడు. అట్టివిద్యననుష్ఠింపనివారు ఇతర నాడులగుండ బయలువెడలి మరల ఈ సంసారమును బొందుచున్నారు" అని చెప్పుచుండుటచే బ్రహ్మవేత్త సుషుమ్న నాడిగుండ బయలు వెడలు ననియు, బ్రహ్మవేత్తకాని వాఁడితర నాడులగుండ బయలు వెడలు ననియును, దెలియవచ్చుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఇట్టి నియమముండుట సంభవమా? లేక, ఇట్టి నియమమెద్దియు లేదా?

## పూర్వపక్షము.

ఇట్టి నియమ ముండనేరదు. ఏలననిన, నాడులనేకములును, సూక్ష్మములును గనుక, నవి పురుషునిచే దెలిసికొన శక్యములు గావు. "తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" అను శ్రుతివాక్యము

యాదృచ్ఛికముగాఁ జరిగిన యుత్క్రమణము ననువదించుచున్నదే గాని, బ్రహ్మవేత్తయగువాఁడు సుషుమ్నా నాడిగుండనే శరీరములోనుండి బయలువెడలుననియు, ఇతరులు ఇతరప్రదేశములనుండి బయలువెడలుదురనియు నొక నియమము నిచట దెలియఁ బఱచుచుండ లేదనిన,

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము కాదు. బ్రహ్మవిద్యానుష్ఠానపరుఁడు శిరస్సును భేదించుకొని బయలువెడలినదియు ఒక్కటియునగు సుషుమ్నా నాడిగుండనే శరీరములోనుండి బయలువెడలుచున్నాఁడు. అట్టి యుపాసకునికి నాడులను దెలిసికొనుట దుర్లభముగాదు. ఏలననిన, అతఁడు, పరమపురుషారాధనరూపమగుటచే అత్యంతప్రియమగు బ్రహ్మవిద్యయొక్క సామర్థ్యమువలనను, అట్టివిద్యకు అంగమైనందునఁ దనకత్యంతము ప్రియమగు నర్చిరాది గతి నెప్పుడు స్మరించుచుండుట యనఁబడు యోగము వలనను, ప్రసన్నుఁడై హృదయ పుండరీకము నందుండు పరమపురుషునిచే ననుగ్రహింపఁ బడినవాఁడగుచున్నాఁడు. అందువలన జీవస్థానమగు హృదయముయొక్క అగ్రభాగము ప్రకాశించుచున్నది. బ్రహ్మోపాసకుఁడీట్లు పరమపురుషానుగ్రహముచే ప్రకాశింపఁబడిన మార్గము గలవాఁడై సుషుమ్నా నాడిని దెలిసికొనుచున్నాఁడు. కనుక సుషుమ్నా నాడిగుండనే, బ్రహ్మోపాసకుఁడు శరీరములోనుండి బయలువెడలు చున్నాఁడని చెప్పుట యుక్తము.

తదోకోధికరణము ముగిసెను

## రశ్మ్యనుసారాధికరణము.

### ౧౭॥ సూ॥ రశ్మ్యనుసారీ

టీ॥ రశ్మ్యనుసారీ=(బ్రహ్మవేత్త) సూర్యకిరణానుసారియై (పైకి పోవుచున్నాఁడు.)

తా॥ బ్రహ్మవేత్త సూర్యకిరణముల ననుసరించియే పైకిపోవుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ "అథ యత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభిరూర్ధ్వమాక్రమతే" అను శ్రుతివాక్యము "జీవుఁడీశరీరమునుండి బయలువెడలి సూర్యరశ్ముల ననుసరించి పైకి పోవుచున్నాఁడు" అనుచు, హృదయమునుండి మూర్ధన్యనాడిగుండ బయలువెడలిన జీవుఁడు సూర్యకిరణముల ననుసరించి, పైకిపోయి సూర్యుని బొందుచున్నాఁడని తెలియఁజేయుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

మూర్ధన్యనాడిగుండ బయలువెడలిన జీవుఁడు ఈ శ్రుతిప్రకారము సూర్యరశ్ముల ననుసరించియే పైకి పోవలయునని నియమమా? లేక, అట్టి నియమమెద్దియు లేదా?

## పూర్వపక్షము.

అట్టి నియమ మెద్దియు లేదని చెప్పుట యుక్తము. ఏలననిన, రాత్రిసమయమున సూర్యకిరణము లుండవు గదా. అట్టిసమయమున మృతినొందిన బ్రహ్మోపాసకుఁడు సూర్యకిరణముల ననుసరించి పైకి పోవుట యసంభవము. అయితే బ్రహ్మోపాసకుఁడు సూర్యకిరణముల ననుసరించి పోవుచున్నాఁడని చెప్పునట్టి శ్రుతివాక్యము కొందఱిని గుఱించి మాత్రము అట్లు చెప్పుచున్నదని యెఱుంగునదియనిన,

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము గాదు. బ్రహ్మోపాసకుఁడు సూర్యరశ్ములనే యనుసరించి పైకి పోవుచున్నాఁడు. ఏలననిన, "అథైతైరేవ రశ్మిభిః" అనుచోట "ఏవ" అనుశబ్దము "ఈ జీవుఁడు రశ్ములనే యనుసరించి పైకిపోవుచున్నాఁడు" అని నిర్ధారణముగాఁ జెప్పుచున్నది. రశ్ముల ననుసరించి పైకిపోవు చున్నాఁడను మాట కొందఱిని గుఱించి మాత్రము జెప్పఁబడిన దయినచో, "అథైతైరేవ" అనుచోట "ఏవ కారము" నిరర్థక మగును.

రాత్రిసమయ మయినప్పటికిని జీవుఁడు సూర్యరశ్ముల ననుసరించి పైకి పోవుట యసంభవము గాదు. అప్పుడు సూర్యరశ్ములు లేవని యెట్లు జెప్పఁదగును? ఎండకాలమున రాత్రి సమయమునందు ఉష్ణముగా నుండుటచే సూర్యరశ్ములున్నట్లు గన్పట్టుచున్నవి. తత్కారణమగు నౌష్ణ్య మనుభవింపఁబడుచున్నది గదా! హేమంత సమయారంభమున మంచుగుఱియుటచే సూర్యరశ్ము లున్నను, దుర్దినమందువలె వాని యౌష్ణ్యము మనచే ననుభవింపఁ బడుచుండ లేదు. ఇంతియెగాక, "తద్యథా మహాపథ ఆతత ఉభౌ గ్రామౌ గచ్ఛతీమంచాముంచ ఏవమేవైత ఆదిత్యస్య రశ్మయ ఉభౌలోకౌ గచ్ఛంతీమం చాముంచ అముష్మాదాదిత్యాత్ప్రతాయంతే త ఆసు నాడీషు సృప్తాః ఆభ్యోనాడీభ్యః ప్రతాయంతే తేఽముష్మిన్నాదిత్యే సృప్తాః" (ఛా. ౮ ప్ర. ౬ ఖ. ౨ వా) అను శ్రుతియును "ఈ లోకమునందు బహుదూరము వ్యాపించియుండెడి పెద్దరాజమార్గము సమీపమునందుండెడి గ్రామమును, దూరదేశమున నుండెడి గ్రామమును, ఏప్రకారము బొందుచున్నదో, ఆప్రకారమే ఆదిత్యుని కిరణములు, ఈలోకమును పరలోకమును వ్యాపించియున్నందున, ఆ యీలోకములోని పురుషశరీరమునందును

పరలోకములోని యాదిత్యమండలమునందును వ్యాపించినవై ప్రవర్తించు చున్నవి. కనుక ఆదిత్యమండలమునుండి నిర్గతములైన కిరణములేవియో, అవియే యీ పురుషుని యొక్క నాడీరంధ్రములలోఁ బ్రవేశించి యున్నవనియు, ఇటుల నీనాడులలోనుండి నిర్గమించినవి యేవియో, అవియే పరలోకములోని యాదిత్యు నియందు ప్రవేశించు చున్నవనియును జెప్పుచు, సూర్యరశ్ములకును నాడులకున్ను ఎల్లప్పుడు పరస్పరము సంబంధమున్నట్లు దెలియఁజేయుచున్నది. ఈ హేతువుల వలన, రాత్రిసమయమునందును, సూర్యరశ్ము లున్నట్లు తెలియుచున్నందున, రాత్రిసమయమున మృతుఁడైనను, బ్రహ్మవేత్త సూర్యరశ్ములనే యనుసరించి పైకిపోయి పరబ్రహ్మమును బొందుచున్నాఁడనుట యుక్తము.

॥ రశ్మ్యనుసారాధికరణము ముగిసెను. ॥

---

## నిశాధికరణము.

౧౯॥ సూ॥ నిశి నేతిచేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతిచ

టీ॥ నిశి=రాత్రియందు మృతినొందిన వానికి, న=బ్రహ్మప్రాప్తి లేదు, ఇతి చేత్=ఇట్లంటివేని, సంబంధస్య=కర్మసంబంధము, యావద్దేహభావిత్వాత్=శరీర ముండువఱకేయుండు నదగుటవలన, న=అట్లు చెప్పుట సరిగాదు, చ=మఱియు, దర్శ యతి=ఈ యర్థమును శ్రుతి ప్రదర్శింపు చున్నది.

తా॥ దినామరణము ప్రశస్త మగుటంజేసి రాత్రి సమయమున మృతి నొందిన వానికి బ్రహ్మప్రాప్తి గలుగనేరదని చెప్పఁగూడదు. శరీరముండువఱకే కర్మసంబంధ ముండును గాన, శరీర వియోగమైన వెంటనే మోక్షము సిద్ధించును. "తస్యతావదేవచిరం" అను శ్రుతివాక్య మిట్లు చెప్పుచున్నది.

### సంశయము.

శ్రీ॥ భా॥ రాత్రి సమయమున మృతినొందిన బ్రహ్మవేత్తకు బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షము సంభవించునా? సంభవింపదా?

### పూర్వపక్షము.

రాత్రి సమయమున, సూర్యరశ్ము లుండును గాన, జీవుఁడు రశ్ముల ననుస రించి పైకిపోవుట సంభవమయినను, నిశామరణము శాస్త్రగర్హితమైనందున పరమపురుషార్థమగు బ్రహ్మప్రాప్తి రాత్రియందు మృతినొందినవానికిఁ గలుగ నేరదు. శాస్త్రములచే దివామరణము ప్రశస్తము గాను, నిశామరణము అప్ర శస్తముగాను నెన్నఁబడినది. ఏలననిన, "దివా చ శుక్లపక్షశ్చ ఉత్తరాయణ మేవచ, ముమూర్షతాం ప్రశస్తాని విపరీతం తు గర్హితం" అను శ్రీభగవద్గీతా

వాక్యము "పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము" అనునవి మృతినొందువార లకు ప్రశస్తములైన వనియు, ఇతరములు, అనఁగా రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, అనునవి ప్రశస్తములు గావనియును చెప్పుచున్నది గదా. దివా మరణము ఉత్తమగతికి హేతువగుటవలనఁ బ్రశస్తము గాను,నిశామరణము అధోగతికి హేతువగుటవలన నప్రశస్తముగానున్ను యెన్నఁబడి యుండవచ్చును. కనుక నిశామరణము అధోగతికి హేతువగుటవలన, రాత్రివేళ మృతినొందినవానికి బ్రహ్మప్రాప్తి గలుగదనిన.

సి ద్ధాం త ము.

అట్లు చెప్పుట సరిగాదు. ఏలననిన, బ్రహ్మవేత్తకు శరీరమున్నంతవఱకే కర్మసంబంధ ముండును. అదియెట్లనిన, అధోగతి హేతుభూతములును అనారబ్ధకార్యములగు నతనికర్మములు (సంచితకర్మములు) బ్రహ్మవిద్యాసంబంధముచే నశించుచున్నవి. ఆగామికర్మములును అట్లే బ్రహ్మవిద్యాసంబంధము వలన నతనిని సంబంధింపవు. ప్రారబ్ధకార్యములు అనఁగా ప్రారబ్ధకర్మములన్నవో, చరమదేహమున్నంతవఱకే అనుభవింపఁ బడుచున్నవి. ఇట్లు బంధహేతువులగు కర్మములతో బ్రహ్మవేత్తకు సంబంధము లేదు. కనుకనీతఁడు నిశామృతుఁడైనను, ఇతనికి బ్రహ్మప్రాప్తి సిద్ధమే, "తస్యతావదేవ చిరంయావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" అను శ్రుతియును, "బ్రహ్మవేత్తయగు వానికెంతవఱకు శరీరసంబంధము విడదో, అంతవఱకే అతఁడు బ్రహ్మమును బొందుటకు విలంబము. అనంతర మతఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడు" అనుచు, అట్లే తెలియఁ జేయుచున్నది. "పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణమును మృతిబొందువానికి ప్రశస్తములు. తదితరములు ప్రశస్తములు గావు" అను నియమము బ్రహ్మవేత్తకాని వాని మరణమును గుఱించి చెప్పినదని యెఱుంగునది.

నిశాధికరణము ముగిసెను.



దక్షిణాయనాధికరణము.

౧౯॥ సూ॥ అ త శ్చా య నే ఽ పి ద క్షి ణే.

టీ॥ అతః-చ=పూర్వోక్తహేతువులవలననే, దక్షిణే-అయనే-పి=దక్షిణాయనమందు మృతుఁడైనను, బ్రహ్మవేత్త బ్రహ్మమును బొందును.

తా॥ పూర్వోక్తహేతువులవలననే, దక్షిణాయనమున మృతుఁడైనను, బ్రహ్మవేత్త బ్రహ్మమును బొందును.

శ్రీ॥ భా॥ రాత్రి సమయమున మృతుఁడైనను, బ్రహ్మోపాసకుఁడు బ్రహ్మప్రాప్తిరూపమగు [illegible] బొందుచున్నాఁడనుటకు యేహేతువులు

గాన్పింపఁబడినవ్రో, ఆహేతువులను బట్టియే దక్షిణాయనమున మృతుఁడైనను బ్రహ్మవేత్త బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షమును బొందుచున్నాఁడనియును గూడ సిద్ధమగుచున్నది. ఇందునుగుఱించి వేఱొకయాక్షేపము వచ్చును.

—••◆ ఆ క్షే ప ము. ◆••—

"అథ యో దక్షిణే ప్రమీయతే పితౄణా మేవ మహిమానం గత్వా చంద్రమస స్సాయుజ్యం గచ్ఛతి," (తై. నా. ౫.౨) అను శ్రుతివాక్యము, "దక్షిణాయనమున మృతుఁడైనవాఁడు పితృమహిమనుబొంది, చంద్రునితో సాయుజ్యమును బొందుచున్నాఁడు" అనియు, మఱియు నట్లు చంద్రునితో సాయుజ్యమును బొందిన వారు "తేషాం యదా తత్పర్యవైత్య థైతమేవా ధ్వానం పునర్నివర్తన్తే" (ఛా.౫.ప్ర.౧౦ఖ.౫వా.) అను శ్రుతివాక్యము "చంద్రుని వదలునపుడు తామింతకుముందు పోయిన మార్గముననే తిరిగివచ్చి యీలోకమున జన్మించుచున్నారు" అనియును, జెప్పుచుండుటవలనను, బ్రహ్మవేత్తలగు శ్రీ భీష్మాచార్యులు మొదలగువారు మృతినొందుటకై యుత్తరాయణమును బ్రతీక్షించి యున్నట్లు పురాణాదులయందుఁ జెప్పియుండుట వలననున్ను దక్షిణాయనమున మృతినొందిన వానికి బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షము గలుగనేరదనిన,

—••◆ స మా ధా న ము ◆••—

బ్రహ్మవేత్తలుగానివారు మాత్రము పితృయాణమునఁబోయి, చంద్రుని బొంది, మఱల నీలోకమునకు వచ్చి, యిచట జన్మించుదురు. బ్రహ్మవేత్తయగువాఁడు చంద్రునిబొందినను, అతఁడు చంద్రలోకమునుండి యీలోకమునకువచ్చి మరల జన్మింపఁడు. ఏలననిన, "తస్మాద్బ్రహ్మణో మహిమాన మాప్నోతి" అను శ్రుతివాక్యము "ఈతఁడు చంద్రలోకమునుండి బ్రహ్మమహిమను బొందుచున్నాఁడు" అని చెప్పుచుండుటచే దక్షిణాయనమున మృతుఁడై బ్రహ్మమును బొందఁబోవునట్టి యీ బ్రహ్మవేత్తకు చంద్రలోకము మార్గమధ్యమున విశ్రాంతి స్థానముగాను మాత్రము తెలియవచ్చుచున్నది. ఈవాక్యశేషమే యాధారము గాకపోయినను, పూర్వాధికరణమునఁ బ్రతిపాదించిన ప్రకార మీ బ్రహ్మవేత్తయగు పురుషునికి బంధహేతువులగు సంచిత ప్రారబ్ధాగామికర్మములు సమూలముగా నశించినవి గనుక, నతఁడు చంద్రుని బొందినప్పటికిన్ని యతనికి బ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షము తప్పక కలుగును. భీష్మాదులు యోగప్రభావమువలనఁ దమ కిష్టము వచ్చినపుడు మరణము నొంద సమర్థులు, వారలు ఉత్తరాయణమున మరణమునొందుట ప్రశస్తమనెడి ధర్మమును లోకమునందుఁ బ్రవర్తింపఁ జేయుటకుఁగాను తమ యాచారమును జూపించుటకై యట్టి యాచారమును అనుష్ఠించిరి.

అవతారిక :—"యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవయోగినః, ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ" "ఓ యర్జునా! యోగులు ఏకాలమునఁ బ్రయాణము జేసిన (శరీరమునువదలిన) మరల ఈలోకమునకు వత్తురో, మఱియు నేకాలమునఁ బ్రయాణముఁ జేసిన మరల ఈలోకమునకు రాకుందురో, ఆయాకాల విశేషములను జెప్పుచున్నాను. "అగ్నిర్జ్యోతిరహః శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదో జనాః" అనఁగా "అగ్నియును, జ్యోతిస్సును, దినంబును, శుక్లపక్షం బును, ఆరుమాసములగు ఉత్తరాయణంబును, వీనిలోఁ బ్రయాణముఁజేసిన బ్రహ్మవేత్తలగు జనులు, బ్రహ్మమును బొందుచున్నారు.

"ధూమో రాత్రి స్తథాకృష్ణః షణ్మాసా దక్షిణాయనం తత్ర చాంద్ర మసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే" అనఁగా "ధూమంబును, రాత్రియును, కృష్ణపక్షంబును, ఆరుమాసంబులగు దక్షిణాయనంబును, వీనిలోఁ బ్రయాణముఁ జేయువారు చంద్రసంబంధియగు తేజస్సును బొంది మరల ఈలోకమునకు వచ్చుచున్నారు.

"శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శ్శాశ్వతే మతే ఏకయా యాత్యనా వృత్తి మన్యయాఽవర్తతే పునః" అనఁగా "ఓ యర్జునా! శుక్లపక్షసంబంధముగల అర్చిరాదియు, కృష్ణపక్షసంబంధముగల ధూమాదియననెడి యీరెండును బ్రహ్మవేత్తలకును, కర్మిష్ఠులకును శాశ్వతములుగా నున్నవి. అందు మొదటిదియగు నర్చిరాదిలోఁజనెడి బ్రహ్మవేత్త మరల రాడు అనఁగా పునర్జన్మమునొందడు. రెండవదియగుధూమాదిలోఁ జనెడువాఁడు మరలవచ్చును అనఁగా మరల జన్మించును.

ఈప్రకారము శ్రీభగవద్గీతలయందు జెప్పి యుండుటచే బ్రహ్మవేత్తలకుఁ గూడ మరణము నొందుటకు కాలవిశేషమున్నట్లును, అట్టి కాలవిశేషము పునరావృత్త్య పునరావృత్తులకు హేతుభూతమగు చున్నట్లున్ను గానఁబడుచున్నదని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

౨౦॥ సూ॥ యోగినః ప్రతి స్మర్యేతే స్మార్తే చైతే

టీ॥ ఏతే=ఈ, స్మార్తే = స్మృతిప్రోక్తములగు దేవయాన పితృయాణములు, యోగినఃప్రతి = యోగులనుగుఱించి, స్మర్యేతే=స్మర్తవ్యములుగాఁ జెప్పఁబడుచున్నవి. (కాని యిచట మరణమునొందుటకుఁ గాలవిశేషము జెప్పఁ బడలేదు.)

తా॥ యోగులచే స్మరణీయములుగా స్మృతిప్రోక్తములగు దేవయాన పితృయాణమార్గములు ఈతాఁపునఁ జెప్పఁబడుచున్నవే కాని, మృతినొందుటకుఁ గాను కాలశేషము నియమింపఁబడుచుండ లేదు.

శ్రీ॥ భా॥ ఈ పైశ్లోకములచే మరణము నొందువారలను గుఱించి కాలవిశేషము జెప్పఁబడుచుండలేదు. అయితే యోగనిష్ఠులగువారిచే యోగాంగముగా నిత్యము స్మరింపవలసిన దేవయాన పితృయాణములనఁబడు మార్గములు జెప్పఁబడుచున్నవి. కనుకనే ఉపసంహారమునఁగూడ, "నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన, తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున" అనుతావున "ఓ అర్జునా! ఈమార్గములను దెలిసికొనిన యోగిపురుషుఁ డెవ్వఁడును మోహముఁ జెందఁడు. కనుక సర్వకాలములయందును, యోగముతోఁగూడిన వాఁడవగుము" అని చెప్పఁబడియె. ఈ రెండువిధములగు మార్గములిచట యోగులచే దెలిసికొనఁబడవలసినవిగాఁ జెప్పఁబడుచున్నవి. కాఁబట్టి "అగ్నిర్జ్యోతిః" అనియు, "ధూమోరాత్రిః" అనియు నీతావులఁగూడ దేవయాన పితృయాణములే జెప్పఁబడుచున్నవి. "యత్రకాలే" అను శ్లోకమునందుండు "కాల" శబ్దము కాలాభిమానియగు దేవతాపరముగాని కేవల కాలపరము కాదు. కాలపరమని చెప్పినచో, పైశ్లోకమునందుండు అగ్న్యాది శబ్దములుగూడ కాలపరములని చెప్పవలసివచ్చును. అట్లగుట యసంభవము.

కనుక నీశ్లోకములచే యోగనిష్ఠులగు వారిని గుఱించి దేవయానానుస్మరణము విధింపఁబడుచున్నదే గాని, మరణమునొందు వారిని గుఱించి కాలవిశేషము నియమింపఁబడు చుండలేదు.

దక్షిణాయనాధి కరణము ముగిసెను.



గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు

చతుర్థాధ్యాయమున
ద్వితీయపాదము.
శ్రీరస్తు.



శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## చతుర్థాధ్యాయము—తృతీయపాదము

### అర్చిరాద్యధికరణము.

### ౧॥ సూ॥ అర్చిరాదినా తత్ప్రథితేః.

టీ॥ అర్చిరాదినా = అర్చిరాదిమార్గమున, (విద్వాన్ = బ్రహ్మవిద్యావంతుఁడు), (గచ్ఛతి=పోవుచున్నాఁడు ; ఏలయన,) తత్ప్రథితేః=ఆ మారమునకు శ్రుతులయందు ప్రసిద్ధి యుండుటవలన,

తా॥ బ్రహ్మవిద్యావంతులందఱు నర్చిరాది మార్గముననే పరమపదమునకుఁ బొయ్యెదరు. విద్వాంసులందఱికి నామార్గము బ్రహ్మప్రాప్తి సాధనముగా శ్రుతులయందు ప్రసిద్ధినొందినది.

ద్వితీయతృతీయ పాదములకుఁ గల పరస్పర సంబంధము.

శ్రీ॥ భా॥ మరణ సమయమున హృదయమునుండి బయలు వెడలు బ్రహ్మవేత్తయగు జీవుఁడు హృత్పుండరీకముననుండు పరమాత్మయొక్కయనుగ్రహముచే సుషుమ్న నాడిద్వారా శరీరములోనుండి బయలు వెడలుచున్నాఁడని ద్వితీయపాదమున ప్రతిపాదింపఁబడియె. అట్లు బయలువెడలిన జీవుఁడు పోవుమార్గ మీపాదమున నిర్ణయింపఁబడుచున్నది.

జీవుఁడు పోవునట్టిమార్గములు శ్రుతులయందు అనేకవిధములుగాఁ జెప్పఁబడియున్నవి. ఎట్లనిన,

ఛందోగులు "యథా పుష్కర పలాశ ఆపో నశ్లిష్యంతే ఏవమేవం విది పాపం కర్మ న శ్లిష్యతే" (ఛా. ౪ ప్ర. ౧౪ ఖ. 3 వా.) అను వాక్యమున, "పద్మపత్రమును ఉదకములంటనట్లు ఈ బ్రహ్మవిద్య ననుష్ఠించు పురుషుని సుకృత దుష్కృతములు సంబంధింపవు" అని యివ్విధముగాఁ జెప్ప నారంభించి, బ్రహ్మవిద్య ముపదేశించి, [illegible] అథ యదు చాస్మించ్ఛ

వ్యం కుర్వంతి యదిచనార్చిషమే వాభిసంభవంతి అర్చిషో హారహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణ పక్షాద్యాన్ షడుదఙ్జేతి మాసాం స్తాన్ మాసేభ్య స్సంవత్సరం సంవత్సరాదాదిత్య మాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవస్సఏనాన్ బ్రహ్మగమయత్యేష దేవపథో బ్రహ్మపథః ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే నావర్తంతే" అనఁగా "ఇట్లుఉపదేశింపఁబడిన బ్రహ్మవిద్య నభ్యసించిన బహ్మవేత్తలు, మరణమునొందిన తరువాత వారికి శాస్త్రోక్తములగు నుత్తర క్రియలు జరిగినను జరుగకపోయినను గూడ, వారర్చిరాది మార్గమునఁ బోవుచున్నారు. అనగా వారు మొదట నర్చిస్సునుబొంది, అర్చిస్సునుండి అహస్సును, అహస్సునుండి ఆపూర్యమాణపక్షమును, ఆపూర్యమాణపక్షమునుండి ఉత్తరాయణమని జెప్పఁబడు నాఱుమాసములను, ఆ యుత్తరాయణ మనంబడు నాఱుమాసములనుండి సంవత్సరమును, సంవత్సరమునుండి యాదిత్యుని, ఆదిత్యునినుండి చంద్రుని, చంద్రునినుండి విద్యుత్తును బొందుదురు. అప్పుడ మానవపురుషుఁడు వీరిని బ్రహ్మయొద్దకుఁ దోడుకొని పోవుచున్నాఁడు. ఈ మార్గమును దేవపథమనియు, బ్రహ్మపథమనియును జెప్పుదురు. ఈ మార్గమునఁ బోయినవారెన్నఁడును మరల ఈలోకమునకు రారు" అని పఠించుచున్నారు.

ఈ ఛందోగులే మఱియొకతావున, అనఁగా నష్టమప్రపాఠకమున, "అథైతై రేవ రశ్మిభి రూర్ధ్వమాక్రమతే" (ఛా. ౮. ప్ర. ౬ ఖ. ౫ వా.) అను వాక్యమున "మరణకాలమున నీశరీరములోనుండి బయలువెడలిన జీవుఁడు సూర్యరశ్మిలద్వారా ఊర్ధ్వలోకమునకుఁ బోవుచున్నాఁడు" అని పఠించుచున్నారు.

కౌషీతకులీదేవయానమను మార్గమును వేఱొక విధముగ పఠించుచున్నారు. ఎట్లనిన, వారు "స ఏతం దేవయానం పన్థాన మాపద్యాగ్నిలోకమాగచ్ఛతి స వాయులోకం స వరుణలోకం స ఆదిత్యలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకం" అనువాక్యమున "ఈ జీవుఁడీ దేవయానమార్గము ననుసరించి పోవునపుడు ప్రథమమున అగ్నిలోకమును జేరుచున్నాఁడు. అచటనుండి వాయులోకమును, వాయులోకమునుండి వరుణలోకమును, వరుణలోకమునుండి ఆదిత్యలోకమును, ఆదిత్యలోకమునుండి ఇంద్రలోకమును, ఇంద్రలోకమునుండి ప్రజాపతిలోకమును, ప్రజాపతిలోకమునుండి బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు" అని పఠించుచున్నారు.

వాజసనేయులీమార్గమును గుఱించి మఱియొకవిధముగ పఠించుచున్నారు. ఎట్లనిన, వారు "య ఏవ మేతద్విదుర్యేచేమేఽరణ్యే శ్రద్ధాంసత్యముపాసతే తేఽర్చిష మభి సంభవంతి అర్చిషోఽహారహ్న ఆపూర్యమాణపక్ష

మాపూర్యమాణ పక్షాద్యాన్ షణ్మాసానుదఙ్జాదిత్య ఏతి మాసాన్మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్య మాదిత్యా ద్వైద్యుతం వైద్యుతాత్పురుషో మానవస్సఏత్య బ్రహ్మలోకాన్ గమయతి" (బృ. ౮. అ. ౨. బ్రా. ౧౫ వా) అనువాక్యమున "ఇట్లు ద్యుపర్జన్యాద్యగ్నులయందు శ్రద్ధాసోమాదిసంగతుఁడగు ప్రత్యగాత్మను బ్రహ్మాత్మకునిగా నుపాసించువారును అరణ్యమున శ్రద్ధాపురస్సరముగ సత్యమనఁబడు పరబ్రహ్మమును ప్రత్యగాత్మ కాత్మభూతునిగా నుపాసించువారును అర్చిస్సును బొందుచున్నారు. అర్చిస్సునుండి అహస్సును, అహస్సునుండి ఆపూర్యమాణపక్షమును, అపూర్యమాణపక్షమునుండి యుత్తరాయణమను నాఱుమాసములును, ఉత్తరాయణమను నాఱుమాసములనుండి దేవలోకమును, దేవలోకమునుండి యాదిత్యుని, ఆదిత్యునినుండి విద్యుత్తును బొందుచున్నారు. ఇచట అమానవపురుషుఁడు వీరలను విద్యుల్లోకమునుండి బ్రహ్మలోకమునకుఁ దోడుకొని పోవుచున్నాఁడు" అని పఠించుచున్నారు.

వీరే మఱియొకతావున ఈవిషయమునుగుఱించి పఠించునపుడు "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి స వాయుమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స ఆదిత్యమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా డంబరస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స చంద్రమసమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా దున్దుభేః" (బృ. ౭. అ. ౧౦ బ్రా ౧ వా) ఇత్యాదివాక్యమున "ఈలోకమునుండి పోవు బ్రహ్మవేత్తయగు పురుషుఁడు వాయువును బొంది దానియందు రథచక్రపు బెజ్జమంత యవకాశమును బొందినవాఁడై వాయువుతోఁజేరి పైకి పోయి ఆదిత్యుని బొందుచున్నాఁడు. ఆదిత్యుని యందు మృదంగ రంధ్రమంత యవకాశమునుబొంది, దానిగుండ పైకి పోయి చంద్రుని బొందుచున్నాఁడు, చంద్రునియందు భేరీరంధ్రమంత యవకాశమును బొంది, దానిగుండ పైకిపోవుచున్నాఁడు" అని యిట్లు పఠించుచున్నారు.

ఇట్లు శ్రుతులు జీవుఁడు పోవు మార్గమును భిన్న భిన్న విధములుగాఁ జెప్పుచుండుటవలన నిందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము

ఈ శ్రుతులన్నియు నర్చిరాదిమార్గము నొక్కదానినే యిట్లు ప్రతిపాదించుచు, ఆమార్గముననే బ్రహ్మవేత్త పోవుచున్నాఁడని తెలుపుచున్నవా? లేక, అవి యిట్లు వేఱువేఱుమార్గముల నుపదేశించుచు బ్రహ్మవేత్త యీమార్గములలో దేనిగుండ నయినను పోవచ్చును గాన, నతఁడర్చిరాది మార్గముననే పోవలయునన్న నియమమెద్దియును లేదని తెలుపుచున్నవా?

## పూర్వపక్షము

ఇచట నుపదేశింపఁబడిన మార్గములు పరస్పరము భిన్నములై యొకదానితోనొకటి సంబంధింపకయున్నవి. కనుక నీశ్రుతులు వేఱువేఱుమార్గముల నుపదేశించుచున్నందున, బ్రహ్మవేత్త వీనిలో నేమార్గముననైనను పోవచ్చును. కావున, నతఁడు అర్చిరాదిమార్గముననే పోవలయునన్న నియమము లేదనిన.

## సిద్ధాంతము

అట్లుచెప్పుట యుక్తముకాదు. శ్రుతుల యందంతట నర్చిరాదిమార్గ మొక్కటియే ప్రతిపాదింపఁబడుచున్నది. అంతట నిది ప్రసిద్ధమైనదగుటవలన, అనఁగా నంగీకరింపఁబడిన దగుటవలన, నీశ్రుతులన్నియు నర్చిరాదిమార్గమునే ప్రతిపాదించుచు నామార్గముననే బ్రహ్మవేత్త పోవలయు నని చెప్పుచున్నవి. ఇట్లు అర్చిరాదిమార్గము శాస్త్రసమ్మతమయిన దయినందున నిదియే కొంచము ఎచ్చుతక్కువగా నన్ని శాఖలయందును పఠింపఁబడుచున్నట్లు గ్రహింపఁదగినది. ఉపకోసలాది బ్రహ్మోపాసనములు భిన్నభిన్న శాఖలయందు భిన్న భిన్న విధములుగా నుపదేశింపఁబడినను, ఒకశాఖవారు పేర్కొనిన గుణములు మొదలగు విశేషములను శాఖాంతరమునందుఁగూడ నుపసంహరించుకొని వీనియన్నిటియందు నుపదేశింపబడిన బ్రహ్మవిద్య యొక్కటియేయని గ్రహించుచుండ లేదా? అట్లే ప్రకృతముగను అర్చిరాది మార్గమును గుఱించి యొకశాఖ వారుపఠించు విశేషములను శాఖాంతరమునందుఁగూడ నుపసంహరించుకొని, యన్ని శాఖలయందు నర్చిరాదిమార్గ మొక్కటియే యుపదేశింపఁబడుచున్నదనుట యుక్తము. ఛందోగులు ఉపకోసలవిద్యాసందర్భమునను, పంచాగ్నివిద్యా సందర్భముననున్ను, అర్చిరాదిమార్గము నొక్కవిధముగనే పఠించుచున్నారు. వాజసనేయులు పంచాగ్ని విద్యాసందర్భమున నీయర్చిరాదిమార్గమును స్వల్ప భేదముతో ఛందోగులు పఠించిన రీతినే పఠించుచున్నారు. కాఁబట్టి ఛందోగులు పఠించిన మార్గమునే వాజసనేయులుగూడ పఠించుచున్నట్లు తెలియుచున్నది. ఇతర శాఖలయందుఁగూడ నొకతావున పఠింపఁబడిన అగ్న్యాదిత్యాదులే మఱియొక తావునను పఠింపఁబడుటచే నన్ని శాఖలయందు నీయర్చిరాది మార్గ మొక్కటియే యుపదేశింపఁబడినట్లు సిద్ధమగుచున్నది.

అర్చిరాద్యధికరణము ముగిసెను.



## వాయ్వధికరణము

### ౨॥ సూ॥ వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యాం

టీ॥ అవిశేష విశేషాభ్యాం=సామాన్య విశేషోపదేశములవలన, (బ్రహ్మవేత్తలు) అబ్దాత్ =సంవత్సరమునుండి, వాయుం=వాయువును, (అభిసంభవంతి=పొందుచున్నారు.)

తా॥ "మాసేభ్యో దేవలోకం" అనుతావున "దేవలోక" శబ్దము సామాన్య నిర్దేశముచే వాయువును తెలుపుచున్నందునను, "స వాయుమభిగచ్ఛతి" అనుతావున "వాయు" శబ్దము విశేషనిర్దేశముచే వాయువునే తెలుపుచున్నందునను న్న "దేవలోక" "వాయు" శబ్దములు సామాన్యవిశేష నిర్దేశములచే వాయువునే తెలుపువి. కనుక ముక్తపురుషుఁడు, సంవత్సరముచు బొందినపిదప, వాయువును బొందుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తలు అర్చిరాదిమార్గముననే పోవుచున్నారని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడియె. ఛందోగులు అర్చిరాది మార్గక్రమమును వివరించునపుడు "మాసేభ్యః సంవత్సరం సంవత్సరాదాదిత్యం" ఇత్యాదివాక్యమున "మాసాదిత్యులకు మధ్యను సంవత్సరమును పఠించుచున్నారు. అయితే వాజసనేయులీసందర్భమున "మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్యం" అనుతావున, మాసాదిత్యులకు మధ్యను దేవలోకమును పఠించుచున్నారు. ఈరెండు శాఖలవారును పఠించునది యర్చిరాది మార్గమొక్కటియే యయినందున, పూర్వాధికరణమునఁ జెప్పినప్రకారము, వీనిలో నొకశాఖయందలి యర్చిరాదిమార్గక్రమమునఁ బఠింపఁబడిన సంవత్సర దేవలోకములను శాఖాంతరమందలి యర్చిరాది మార్గక్రమమునఁగూడ నుపసంహరించు కొనవలయును. ఇట్లుండ, ఇందొక సంశయము గలుగుచున్నది.

పూర్వాధికరణ సంబంధము

#### సంశయము.

ఇట్లు సంవత్సర దేవలోకములను శాఖాంతరమున నుపసంహరించు కొనునపుడు, మొదట సంవత్సరమును, దానితరువాత దేవలోకమును ఈక్రమ ప్రకారము ఉపసంహరించు కొనవలయునా? లేక మొదట దేవలోకమును, దానితరువాత సంవత్సమును ఈక్రమప్రకార ముపసంహరించు కొనవలయునా?

#### నిర్ణయము.

ఉభయ శాఖలయందును సంవత్సరదేవలోకములు మాసానంతరము పఠింపఁబడుటచే వానికి రెంటికిని మాసానంతరముండుట సమానమే యయినను, "అర్చిషో౽హరహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణ పక్షాద్యాన్

షడుదఙ్జేతి మాసాం స్తాన్ " ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మవేత్తయగు పురుషుఁడు, అర్చిస్సునుండి అహస్సును బొందుననియు, అహస్సునుండి ఆపూర్యమాణపక్షమును బొందుననియు, ఆపూర్యమాణపక్షమునుండి ఉత్తరాయణమనంబడు నాఱుమాసములను బొందును" అనియు, నీవిధముగనర్చిరాదిమార్గమును పఠించునపుడు న్యూనకాలములను ముందుగ పఠించి, క్రమముగ నధికకాలములను పఠించుటనుబట్టి యిచట న్యూనకాలమగు మాసమునకు తరువాత దానికంటె నధికకాలమగు సంవత్సరము నుపసంహరించుకొని తదనంతరమే దేవలోకము నుపసంహరించుకొనుట యుక్తమని నిశ్చయింపఁ బడుచున్నది.

వాజసనేయులు మఱియొకతావున, ఈ యర్చిరాది మార్గమునుగుఱించి జెప్పు సందర్భమున " యదావై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి సవాయుమాగచ్ఛతి తస్మైస తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వ మాక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి" ఇత్యాది వాక్యమున "ఈలోకమునుండి పైకిపోవునపుడీ పురుషుఁడు వాయువును బొంది దానియందు రథచక్రముయొక్క బెజ్జమంతయవకాశమునుబొంది వాయువుతోఁజేరి పైకిపోయి ఆదిత్యుని బొందుచున్నాఁడు" అనుటచే వాయువు నాదిత్యునికి పూర్వముండుదానినిగా పఠించుచున్నారు.

కౌషీతకు లీసందర్భమున " స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం" ఇత్యాది వాక్యమున, "బ్రహ్మవేత్త దేవయానమున అగ్నిలోకమనంబడు అర్చిస్సును బొంది వాయువును బొందుచున్నాఁడు" అనుచు వాయువు నర్చిస్సున కనంతరముండుదానినిగా పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

కౌషీతక శ్రుతియందు పఠించియున్న ప్రకారము వాయువు నర్చిస్సున కనంతర ముండు దానినిగాఁ దెలిసికొనవలయునా? లేక, వాజసనేయులు పఠించి యున్న ప్రకారము ఆదిత్యునికి పూర్వమున్న దానినిగాఁదెలిసికొనవలయునా?

### ఆక్షేపము.

కౌషీతకులు అర్చిస్సునకు తరువాత వాయువును పఠించుచుండుటచే వారి పాఠక్రమమునుబట్టి వాయువు నర్చిస్సున కనంతర ముండుదానినిగాఁ దెలిసికొనవలయును.

### నిర్ణయము.

అయినను, ఇట్లు దెలిసికొనుట కింతకంటె వేఱొక కారణమెద్దియును గానఁబడదు. ఇట్లు కేవలము పాఠక్రమమునుబట్టి వాయువుయొక్క స్థానమును నిశ్చయించుటకంటె, బృహదారణ్యకమున "ఈపురుషుఁడు వాయువు నాధారముగాఁ జేసికొని పైకిపోయి ఆదిత్యుని బొందుచున్నాఁడు" అని చెప్పియుండుటచే

ఊర్ధ్వమునందుండు ఆదిత్యునిబొందుటకు వాయువు యీపురుషునికి సాధనభూత మైనదని తెలియ వచ్చుచున్నదిగాన, నీహేతువునుబట్టి వాయువు నాదిత్యుని కంటె పూర్వముండు దానినిగాఁ దెలిసికొనుట యుక్తము.

(ఇంతకుపూర్వము దేవలోకమును సంవత్సరమున కనంతరముండు దానిని గాఁ దెలిసికొనవలయునని నిశ్చయింపఁబడియెను గాన) దేవలోకమును వాయువును సంవత్సరాదిత్యుల మధ్యను అనఁగా సంవత్సరమున కనంతరముననను, ఆదిత్యునికి పూర్వముననుండు నవియని ప్రాప్తమగుచున్నది. ఇట్లుండ, ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము

దేవలోకంబును వాయువును భిన్న పదార్థంబులా? అట్లగునేని, బ్రహ్మవేత్తయగు పురుషుఁడు తనయిష్టమువచ్చిన క్రమమున, అనఁగా నతఁడు దేవలోకమునుబొంది వాయువునుగాని, వాయువునుబొంది దేవలోకమును గాని పొందవలయును. లేక, దేవలోకమన్నను, వాయువన్నను ఒక్కటియే పదార్థమా? అట్లగునేని, ఈబ్రహ్మవేత్త సంవత్సరమును పొంది యచటనుండి దేవలోకముగానుండునట్టి వాయువును పొందవలయును,

## పూర్వపక్షము.

దేవలోకమును వాయువును భిన్న పదార్థములు. ఏలననఁగా, దేవలోకమనియు నాయువనియును ప్రసిద్ధి కలదు. బృహదారణ్యకోపనిషత్తునందు "తేన స ఊర్ధ్వం=జీవుఁడు వాయువుతోఁగూడ పైకిపోవు చున్నాఁడు" అను తావున, పైకిపోవుటను చెప్పియున్నందునను, ఛాందోగ్యోపనిషత్తునందు "దేవలోకాత్ =దేవలోకమునుండి" అను పంచమీవిభక్తి వలన నున్ను దేవలోకమనియును వాయువనియును రెండుభిన్న పదార్థములు సంవత్సరాదిత్యులకు మధ్య నున్నట్లు శ్రుతివలనఁ దెలియుచున్నది. మఱియు "జీవుఁడు ఊర్ధ్వముననుండు ఆదిత్యుని పొందుటకు వాయువు సాధనభూతమగుచున్నది" అని యిట్లు వాయువు యొక్క స్థానమునాదిత్యునికి పూర్వముననుండు దానినిగా నిశ్చయించునట్టి యొక విశేషము వాజసనేయశ్రుతియందు వినఁబడుచున్నట్లు, ప్రకృతమున జీవుఁడు దేవలోకమును వాయువునున్ను పొందునట్టి క్రమమును నిశ్చయించునట్టి విశేష మెద్దియును శ్రుతులయందు వినఁబడదు. కావున బ్రహ్మవేత్తయగు జీవుఁడు, తన యిష్టమువచ్చిన క్రమమున, దేవలోకమును వాయువునున్ను పొందుచున్నాఁడఁనిన.

## సిద్ధాంతము.

దేవలోకమనఁగా దేవతయొక్క లోకమని యర్థము. ఇట్టి దేవతయొక్క లోకమని విశేషనిర్దేశము లేనందున, సామాన్య నిర్దేశముచే నీదేవలోక

శబ్దము వాయువునే తెలుపునది. మఱియు, "స వాయు మభిగచ్ఛతి తస్మైసత త్రేతి" అనువాక్యమున వాజసనేయు లట్టివాయువునే విశేషనిర్దేశముచే దెలుపుచున్నారు. ఈకారణములవలన, అనఁగా దేవలోకశబ్దము సామాన్య నిర్దేశము చేతను వాయుశబ్దము విశేషనిర్దేశము చేతనున్ను వాయువునే తెలుపుటవలన, దేవలోకవాయు శబ్దములచే వాయువొక్కటియే తెలుపఁబడుచున్నట్లు సిద్ధమగుచున్నది. కనుక బ్రహ్మవేత్త సంవత్సరమునుండి వాయువును బొందుచున్నాఁడనుట యుక్తము. కౌషీతకులు అగ్నిని అగ్నిలోకమన్నట్లు వాయువును వాయులోకమని పఠించియున్నారు. వారి పాఠమున "వాయుశ్చాసౌలోకశ్చ" అను వ్యుత్పత్తినిబట్టి వాయులోక మనఁగా వాయువనే యర్థము. మఱియు ఈవాయువు "యోఽయంపవత ఏష దేవానాం గృహాః" ఈమొదలగు తావుల దేవగృహమని గూడ జెప్పఁబడినది.

వాయ్వధికరణము ముగిసెను.

---

## వరుణాధికరణము.

### 3॥ సూ॥ త టి తో ఽ ధి వ రు ణ స్స మ్బ న్ధా త్.

టీ॥ తటితః = విద్యుత్తుకంటె, అధి = పైని, వరుణః = వరుణుఁడు, (సంబధ్యతే = సంబంధించును, ఏలనఁగా) సంబంధాత్ = విద్యుద్వరుణులకు సంబంధముండుటవలన,

తా॥ విద్యుత్తు మేఘోదరమునందుండున దగుటంజేసి దానికి వరునితో సంబంధము గలదు. కావున, విద్యుత్తునకు తరువాత వరుణుఁడర్చిరాది మార్గమున సంబంధించును.

శ్రీ॥ భా॥ కౌషీతకులీయర్చిరాదిమార్గమును గుఱించి పఠించు సందర్భమున, "స ఏతం దేవయానం పన్థాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం స వరుణలోకం స ఆదిత్యలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకం" (కౌ. ౧ అ 3) అను వాక్యముచే "ఆబ్రహ్మవేత్త దేవయానమార్గము నవలంబించి అగ్నిలోకమును జేరుచున్నాఁడు. అనంతరమతఁడు వాయులోకమును, వరుణలోకమును, ఆదిత్యలోకమును, ఇంద్రలోకమును, ప్రజాపతిలోకమును, మఱియు బ్రహ్మలోకమును జేరుచున్నాఁడు" అని పఠించుచున్నారు.

అగ్నిలోకమనఁగా నర్చిస్సు గాన, నీశ్రుతి యగ్నిలోకము నన్నిటికంటె ముందుగాఁ జేర్కొనవచ్చును. సంవత్సరమునకు తరువాత వాయువున్నట్లు దెలిసికొనవలయునని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడియె. ఈ కౌషీతక

శ్రుతియందు వాయులోకానంతరము వరుణలోకము పఠింపఁబడినను, ఈక్రమము బాధింపఁబడి "దేవలోకాదాదిత్య మాదిత్యాచ్చంద్రమసం" (బృ. ౮ అ. ౩ బ్రా. ౧౫.వా) అను వాజసనేయశ్రుతియందుఁ జెప్పియున్న క్రమప్రకారము దేవలోకమనఁబడు వాయువున కనంతరము ఆదిత్యుఁడు ఉన్నట్లు సిద్ధమగుచున్నది. ఇట్లుండ, వరుణేంద్రాదిలోకములను గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

—••◆ సంశయము. ◆••—

కౌషీతక శ్రుతియందు పఠింపఁబడిన ప్రకారము, వరుణాదిలోకములను వాయువున కనంతర ముండు వానినిగాఁ దెలిసికొనుట యుక్తమా ? లేక, వీనిని విద్యుత్తున కనంతర ముండు వానినిగాఁ దెలిసికొనుట యుక్తమా ?

—••◆ పూర్వపక్షము. ◆••—

ఈ వరుణాదులను, కౌషీతక శ్రుతిప్రకారము, వాయువున కనంతరముండు వానినిగాఁ దెలిసికొంటిమేని, ఛందోగులు "అర్చిషోఽహః" (ఛా. ౪ ప్ర. ౧౫ ఖ. ౫ వా.) ఇత్యాది వాక్యమున పఠించియున్నట్టి యర్చిరాదుల క్రమమునకు అనఁగా నొకదాని తరువాత నొకటియుండు క్రమమునకు భంగమువచ్చును. మఱియు వారు "తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మ గమయతి" అను వాక్యమున "విద్యుత్పురుషుఁడు బ్రహ్మవేత్తను పరబ్రహ్మయొద్దకుఁ దోడుకొని పోవుచున్నాఁడు" అని పఠించుటచే నవి విద్యుత్తున కనంతరముండునవి యగుటకు వ్యవధానములేదు. కావున ఈ వరుణాదుల నర్చిరాదిమార్గక్రమమున నుపసంహరించుకొనుట కవకాశము గలుగదు. అయితే యిట్లు అవకాశము లేదని వీని నర్చిరాదిమార్గమున నుపసంహరించుకొనకుంటిమా, వీని నీయర్చిరాది మార్గక్రమమున పఠించునట్టి కౌషీతకశ్రుతి నిరర్థకమగును. ఇట్లు ఈ యిఱుతెఱంగులగు శ్రుతులలో దేనినైననొక్కదాని ననుసరించుటచే రెండవది బాధింపఁబడుట తప్పని సరి గాన, కౌషీతకుల పాఠక్రమమునుబట్టి వాయువున కనంతరము వరుణుని యుపసంహరించుకొనుదము. ఇటుల నుపసంహరించుకొనుటచే వాయ్వాదిత్యుల స్థానములను గుఱించి ఛందోగులుపఠించిన క్రమము తప్పినది యేలాగునైనను తప్పినదే గాన, ఈవరుణుని కనంతరము ఇంద్ర ప్రజాపతులనుగూడ నుపసంహరించు కొనుదమనిన,

—••◆ సిద్ధాంతము. ◆••—

వరుణుఁడు విద్యుత్తునకు తరువాత నుండువాఁడని చెప్పఁదగును. ఏలననిన, విద్యుత్తు మేఘముల యుదరమున నుండు నదిగాన, వరుణునికి విద్యుత్తుతో సంబంధము గలదు. ఈసంగతి లోకమునందును వేదములయందును ప్రసిద్ధమైనదియే. పలితార్థమేమన్నను, కౌషీతకులుదేవయాన మార్గక్రమమును గుఱించి

పఠించునపుడు వరుణేంద్రాదులనుగూడ పేర్కొనుచున్నారు గాన, వారి శ్రుతి నిరర్థకముగాకుండుటకై యా వరుణాదులను దేవయానమార్గమునం దెచటనయినను ఉపసంహరించుకొనుట యావశ్యకము. ఇందులకై కౌషీతకుల కేవల పాఠక్రమమునుబట్టి వరుణుని వాయువున కనంతరముండు వానినిగా నుపసంహరించు కొనుటకంటె అర్థక్రమమునుబట్టి విద్యుల్లోకమున కనంతరముండు వానినిగా నుపసంహరించుకొనుట యుక్తము. పాఠక్రమమునకంటె నర్థక్రమము ఎక్కువ బలమైనది గదా! ఇందువలన నమానవపురుషుడు విద్యుత్తును బొందిన జీవుని బ్రహ్మముయొద్దకుం గొనిపోవుటలోం గొంత వ్యవధానమున్నట్లు దెలియుచున్నది. ఇట్లు వ్యవధాన ముండుటవలనను, కౌషీతకులచే నర్చిరాదిమార్గక్రమమునం బఠింపం బడినవగుటంజేసి యవశ్యముగా నర్చిరాదిమార్గక్రమమున నుపసంహరించుకొనవలసిన వగుటవలనను, అచట వరుణుని కనంతరము పఠింపంబడిన వగుట వలనను, ఆగంతుకులను తుట్టతుదంబెట్టు కొనుట సహజమగుటవలననున్ను ఇంద్ర ప్రజాపతులను వరుణునికనంతరముండువానినిగా నుపసంహరించు కొనవలయును.

వరుణాధికరణము ముగిసెను.

---

## అతివాహికాధి కరణము.

### ౪॥ సూ॥ ఆ తి వా హి కా స్త ల్లి ఙ్గా త్.

టీ॥ (ఏ తే=ఈ యర్చిరాదులు, ఆతివాహికాః = తోడుకొనిపోవువారు), (భవితుమర్హంతి = కాందగియున్నారు. ఏలననంగా), తల్లింగాత్ = శ్రుతియందు "పొందించుట" అను సూచన యుండుటవలన,

తా॥ "చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏనాన్ బ్రహ్మగమయతి" అను తావున "పొందించుట" యను సూచన యుండుటవలన విద్యుత్పురుషుండు జీవునిం దోడుకొనిపోవువాండని తెలియవచ్చుచున్నది. అర్చిరాదులు విద్యుత్తుతోంగూడ పేర్కొనంబడుటచే వారునుగూడ జీవుని తోడుకొని పోవువారని, నిశ్చితమగుచున్నది.

సంశయము.

శ్రీ॥ భా॥ ఈ యర్చిరాదులు దేవయానమార్గమునందుండు ఒకవిధమైన చిహ్నములా? (గుర్తులా?) లేక, భోగభూములా? లేక, బ్రహ్మమునుబొందుటకిచ్ఛయించుచుండు బ్రహ్మవేత్తలను తోడుకొనిపోవువారా?

## పూ ర్వ ప క్ష ము.

అర్చిరాదులనఁగా దేవయానమార్గము నందుండు నొకవిధమయిన గుర్తులనుట యుక్తము. ఉపదేశించుపద్ధతినిబట్టి విచారించినఁ గూడ నిటులనే తెలియవచ్చుచున్నది. ఎట్లనిన, గ్రామాంతరమునకుఁ బోవువారిని "ఇట్లుపోయి యీ వృక్షసమీపమునకుఁబొమ్ము, అనంతర మీనదీసమీపమునకుఁబొమ్ము, అనంతర మీపర్వతపార్శ్వముగుండ ఈ గ్రామమునకుఁబొమ్ము" అని గదా మనము లోకమున నుపదేశించు చున్నాము.

అథవా, అర్చిరాదులనఁగా, భోగస్థానములయినను కావచ్చును. ఏలననిన, దినము, పక్షము, మొదలగునవి కాలవిశేషములుగా లోకమునందు ప్రసిద్ధములయి యున్నవి గాన, నవి మార్గమునందుండు గుర్తులు గానేరవు. అవి యట్టి గుర్తులయొక్క నామములు కావు గదా. కాఁబట్టి యవి భోగభూములని చెప్పుట యుక్తము. కనుకనే తైత్తిరీయులు "ఏత ఏవ లోకా యదహోరాత్రాణ్యర్ధమాసా ఋతవస్సంవత్సరాః" ఇత్యాదివాక్యమున, అహోరాత్రములు, పక్షములు, మాసములు మొదలగువానిని లోకములనుగాఁ బఠించుచున్నారు. అట్లే కౌషీతకులును దేవయానమును గుఱించి పఠించునపుడు "అగ్నిలోకమాగచ్ఛతి" అను వాక్యమున అగ్న్యాదులను లోకములనుగాఁ బఠించి యున్నారనిన,

## సి ద్ధాం త ము.

అట్లు చెప్పుట యుక్తము గాదు. అర్చిరాదులనఁగా బ్రహ్మవేత్తలను తన సమీపమునకుఁ దోడుకొని వచ్చుటకై పరమపురుషునిచే నియోగింపఁబడిన కొందఱు దేవతలు. అతివహనమనఁగా పోవువారిని తోడుకొనిపోవుట గదా! "తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మగమయతి" అను శ్రుతివాక్యము "విద్యుత్పురుషుఁ డీ బ్రహ్మవేత్తలను బ్రహ్మమును బొందించుచున్నాఁడు" అని యుపసంహారమునఁ జెప్పుచున్నందున నింతకుఁ బూర్వము పఠింపఁబడిన యర్చిరాదులు సయితము అట్టివారే యని తెలియవచ్చుచున్నది. కనుక "తంపృథివ్యబ్రవీత్" ఈ మొదలగుతావుల పృథివ్యాదిశబ్దములు పృథివ్యాద్యభిమానిదేవతలను తెలుపునట్లు 'అర్చిషోఽహః' ఇత్యాది తావులను అర్చిస్సు మొదలగు శబ్దములు అర్చిరాద్యభిమానిదేవతలను తెలుపునవియని తెలియవచ్చుచున్నది.

అవతారిక:—అయినను, "తత్పురుషోఽమానవ స్స ఏనాన్ బ్రహ్మ గమయతి" అను శ్రుతివాక్యము "విద్యుత్పురుషుఁడు మాత్రమే యీ బ్రహ్మవేత్తలను బ్రహ్మసమీపమునకుఁ దోడుకొని పోవుచున్నాఁడు" అని చెప్పుచున్నది గదా! ఇందువలన విద్యుత్తునకనంతరము పఠింపఁబడు వరుణాదు లీబ్రహ్మవేత్తలను బ్రహ్మసమీపమునకుఁ దోడుకొని పోవువారు కారే? అనిశంకింపఁగా నట్టిశంకను పరిహరించుటకై,

౫॥ సూ॥ వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః.

టీ॥ తతః=విద్యుత్ప్రాప్త్యనంతరము, వైద్యుతేనైవ=విద్యుల్లోకవర్తియగు నమానవ పురుషునిచేతనే (బ్రహ్మవేత్త తోడుకొనిపోఁబడుచున్నాఁడు. ఏలననిన) తచ్ఛ్రుతేః=అట్లు శ్రుతిచెప్పుచున్నందునవలన,

తా॥ విద్యుత్తును బొందిన పిదప తల్లోకవర్తియగు నమానవ పురుషుని చేతనే బ్రహ్మవేత్తలు తోడుకొని పోబడుచున్నారని శ్రుతివలనఁదెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "స ఏనాన్ బ్రహ్మగమయతి" అను శ్రుతివాక్యము "విద్యుత్పురుషుఁడు ఈ బ్రహ్మవేత్తలను బ్రహ్మసమీపమునకుఁ దోడుకొని పోవుచున్నాఁడు" అని చెప్పుటచే బ్రహ్మప్రాప్తివఱకును ఈబ్రహ్మవేత్తలను దోడుకొని పోవువాఁడు విద్యుత్పురుషుఁడే యని తెలియవచ్చుచున్నది. అయినను, వరుణాదులును అందులకై తోడుపడుచున్నారు గాన, వీరలున్ను విద్యుత్పురుషుని ద్వారా బ్రహ్మవేత్తను బ్రహ్మసమీపమునకుఁ దోడుకొనిపోవు వారలగుచున్నారు.

ఆతివాహికాధికరణము ముగిసెను.



కార్యాధికరణము.

౬॥ సూ॥ కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః.

టీ॥ కార్యం=హిరణ్యగర్భుని, (ఉపాసీనాన్=ఉపాసించువారలను, అర్చిరాదిః=అర్చిరాదిగణము, నయతి=తోడుకొని పోవుచున్నది, ఇతి=అని), బాదరిః=బాదరాయణాచార్యుఁడు (మన్యతే=తలఁచుచున్నాఁడు, ఏలననఁగా) అస్య=హిరణ్యగర్భుని యుపాసించువానికి, గత్యుపపత్తేః=గమనము ఉపపన్నమగుటవలన,

తా॥ అర్చిరాదిగణము కార్యభూతుఁడగు హిరణ్యగర్భుని యుపాసించువానిఁ దోడుకొని పోవుచున్నదని శ్రీ బాదరాయణాచార్యుఁడు తలంచుచున్నాఁడు. హిరణ్యగర్భుఁడు పరిచ్ఛిన్నుఁడగుటచే వాని నుపాసించువానికి దేశాంతరగమనము ఉపపన్నము.

శ్రీ॥ భా॥ బ్రహ్మవేత్తయగు పురుషుఁడర్చిరాది మార్గముననే పోవుచున్నాఁడనియు, అర్చిస్సు మొదలు అమానవ పురుషుని వఱకును పేర్కొనఁబడిన యర్చిరాదిగణము జీవునిఁ దోడుకొనిపోవువారనియు, వారలు బ్రహ్మవేత్తను బ్రహ్మయొద్దకుఁ దోడుకొని పోవుచున్నారనియును జెప్పఁబడియె. ఇప్పుడొక విచారము గలుగుచున్నది.

పూర్వాధికరణ సంబంధము.

సంశయము.

ఈ యర్చిరాదిగణము పరబ్రహ్మచే సృజింపఁబడిన హిరణ్యగర్భుని యుపాసించు వారలను దోడుకొని పోవుచున్నదా? లేక పరబ్రహ్మము నుపాసించువారలను మాత్రము తోడుకొని పోవుచున్నదా? అథవా, పరబ్రహ్మము నుపాసించు వారలను, ప్రత్యగాత్మను బ్రహ్మాత్మకమైన దానినిగా నుపాసించువారలనున్ను తోడుకొని పోవుచున్నదా?

పూర్వపక్షము

శ్రీబాదరాయాచార్యుని మతము:—పరబ్రహ్మముచే సృజింపఁబడిన హిరణ్యగర్భుని యుపాసించువాని మాత్రమే యీ యర్చిరాదిగణము తోడుకొని పోవుచున్నదని శ్రీ బాదరాయాచార్యులవారు తలఁచుచున్నారు. ఏలననిన, హిరణ్యగర్భుని యుపాసించువాఁడు మాత్రమే దేశాంతరమునకుఁ బోవుట సంభవము గాని, పరిపూర్ణుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వగతుఁడును, సర్వాత్మభూతుఁడునగు పరబ్రహ్మము నుపాసించువాఁడట్టి పరబ్రహ్మమును బొందుటకై దేశాంతరమునకుఁ బోవుట సంభవము గాదు. ఈ యుపాసకుఁడెచ్చటయుండునో, అచటనే పరబ్రహ్మమును బొందియున్నాఁడు గదా! నిత్యము పరబ్రహ్మమును బొందియున్నట్టి యీ బ్రహ్మవేత్తయొక్క యవిద్యను పోగొట్టుటయే బ్రహ్మవిద్యవలని ప్రయోజనము. పరబ్రహ్మముచే సృజింపఁబడిన హిరణ్యగర్భుఁడు పరబ్రహ్మమువలె సర్వత్రయుండువాఁడు గాక, యొక ప్రదేశమునందు మాత్ర ముండువాఁడు గాన, నట్టి హిరణ్యగర్భుని యుపాసించువాఁడు మాత్ర మతనిని బొందుటకై దేశాంతరమునకుఁ బోవుట సంభవము. కనుక నర్చిరాది గణ మట్టి హిరణ్యగర్భుని యుపాసించువాని మాత్రమే తోడుకొని పోవుచున్నదనుట యుక్తము.

౭॥ సూ॥ విశేషితత్వాచ్చ.

టీ॥ విశేషితత్వాత్-చ=(గంతవ్యబ్రహ్మము బహువచనాదులచే శ్రుతి యందు) విశేషింపఁబడుట వలనను (హిరణ్యగర్భుని యుపాసించునట్టి వారినే అమానపురుషుఁడు తోడుకొని పోవుచున్నాఁడు.)

తా॥ "బ్రహ్మలోకాన్ గమయతి" అను శ్రుతివాక్యమున 'లోకాన్' అను బహువచనముచేతను; లోకశబ్దముచేతనున్ను లోకవిశేషవర్తియగు హిరణ్యగర్భుని యుపాసించువారినే యవమానవపురుషుఁడు తోడుకొని పోవుచున్నాఁడని తెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ "పురుషోఽమానవ ఏత్య బ్రహ్మలోకాన్గమయతి" అనఁగా "బ్రహ్మవేత్తలను అమానవ పురుషుఁడు బ్రహ్మలోకములను బొందించు

చున్నాఁడు" అను శ్రుతియందు "లోక"శబ్దముచేతను, "బ్రహ్మలోకాన్" అను బహువచనముచేతనున్ను లోకవిశేషమునందుండు హిరణ్యగర్భుని యుపాసించు వారిని మాత్రమే యమానవ పురుషుఁడు తోడుకొనిపోవుచున్నాఁడని విశేషముగ సూచితమగుచున్నది. మఱియు "ప్రజాపతేస్సభాం వేశ్మప్రపద్యే" (ప్రజాపతియొక్క సభనున్ను, అతని గృహమునున్ను బొందితిని) అను శ్రుతివాక్యమువలన అర్చిరాదిమార్గమున ప్రయాణముచేయునట్టివాఁడు కార్యభూతుఁడగు హిరణ్యగర్భుని బొందినట్లు స్మరించుకొనుచున్నాఁడని తెలియుచున్నది.

అవతారిక:—"బ్రహ్మన్" శబ్దము పరబ్రహ్మవాచక మగునపుడు నపుంసకలింగమునందును, హిరణ్యగర్భ వాచకమగునపుడు పుల్లింగమునందును బ్రయోగింపఁబడుచున్నది గదా! ఇట్లుండ, ఈ యర్చిరాదిగణము ఈపురుషుని హిరణ్యగర్భుని యొద్దకుఁ దోడుకొని పోవుచున్నదను పక్షమున, "తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మ గమయతి" అను శ్రుతివాక్యమునందుండు "బ్రహ్మన్" శబ్దము ఈపైని గనఁబఱచిన నియమప్రకారము పుల్లింగమునందుఁ బ్రయోగింపఁబడినదై "బ్రహ్మ గమయతి" అనియుండుటకు బదులుగా "బ్రహ్మాణంగమయతి" అని యుండవలసి వచ్చునే? అని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౮॥ సూ॥ సామీప్యాత్తు తద్వ్యపదేశః.

టీ॥ తు=శంకయుక్తమైనదికాదు, (ఏలననఁగా) సామీప్యాత్ =పరబ్రహ్మ సామీప్యమువలన, తద్వ్యపదేశః = (హిరణ్యగర్భుని తెలుపుటకై) నపుంసకలింగమున బ్రహ్మన్ శబ్దమును ప్రయోగించుట, (న విరుధ్యతే=విరోధింపదు.)

తా॥ ఇట్లు శంకింపఁ బనిలేదు. హిరణ్యగర్భుఁడు పరబ్రహ్మముయొక్క సామీప్యమునయుండుటవలన వానిని తెలుపుటకై నపుంసకలింగబ్రహ్మన్ శబ్ద ప్రయోగము విరోధింపదు.

శ్రీ॥ భా॥ "యో బ్రహ్మాణం విదధాతి" అను శ్రుతివాక్యము "పరబ్రహ్మము హిరణ్యగర్భుని ముందుగా సృజించెను" అని తెలియఁజేయుచున్నది. కనుక, హిరణ్యగర్భుఁడు పరబ్రహ్మముయొక్క జ్యేష్ఠపుత్రుఁడయినందున, నెల్లప్పుడతని సమీపమున నుండువాఁడు. ఇట్టి పరబ్రహ్మసాన్నిధ్యమునుబట్టి యతఁడు పరబ్రహ్మవాచకమగు నపుంసకలింగ "బ్రహ్మన్" శబ్దముచే "బ్రహ్మగమయతి" అను శ్రుతివాక్యమున వ్యవహరింపఁబడినట్లు ఈపైని గానఁబఱచిన గత్యనుపపత్తి మొదలగు కారణములచే నిశ్చయింపఁబడుచున్నది.

అవతారిక:—ఇట్లు దేవయానమునఁ బోయినవాఁడు హిరణ్యగర్భుని బొందుపక్షమున, "ఏష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా

ఇమం మానవ మావర్తం నావర్తంతే" అను శ్రుతివాక్యము " ఈ మార్గము దేవపథమనియు, బ్రహ్మపథమనియును, జెప్పఁబడుచున్నది. ఈ మార్గమునఁ బోయినవారు ఈ మనుష్యలోకమునకు మరల రారు" అనియు "తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి" అను శ్రుతివాక్యము 'ఈ సుషుమ్న నాడిగుండ పైకి పోయినవాఁ డమృతత్వమును బొందుచున్నాఁడు" అనియు నీవిధముగ అట్టివానికి యపునరావృత్తినిన్ని అమృతత్వప్రాప్తినిన్ని జెప్పుట యసంభవ మగునే? ఏలననిన, పరబ్రహ్మముచే సృజింపఁబడిన ఈ హిరణ్యగర్భుఁడు ద్విపరార్ధ కాలావసానమున నాశమును బొందుచున్నాఁడని గదా శాస్త్రములు జెప్పుచున్నవి. మఱియు శ్రీభగవద్గీతలయందు " ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోఽర్జున" అను శ్లోకమున "బ్రహ్మలోకముపర్యంతముండునట్టి యితర లోకములకుఁ బోయినవారికి పునరావృత్తి గలుగును" అని చెప్పఁబడియె. ఈ హేతువులనుబట్టి హిరణ్యగర్భుని బొందినవాఁడు అవశ్యముగ మరల ఈ లోకమునకు వచ్చుచున్నాఁడే? అని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై,

౯॥ సూ॥ కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్ "

టీ॥ కార్యాత్యయే = హిరణ్యగర్భుని లోకమునకు ప్రళయము గలుగు సమయమున, తదధ్యక్షేణసహ=ఆ లోకాధ్యక్షుఁడగు హిరణ్యగర్భునితోఁగూడ, బ్రహ్మవిద్యను సంపాదించుకొనిన, (సః=ఉపాసకుఁడు, అతఃపరం = దానికంటె విలక్షణమగు పరమపదమును, అభిధానాత్ = అనావృత్తి కధనమువలన, ప్రాప్నోతి =పొందుచున్నాఁడు.)

తా॥ హిరణ్యగర్భుని లోకమునకు ప్రళయము సంభవించు కాలమున, ఉపాసకుఁడా లోకాధ్యక్షుఁడగు హిరణ్యగర్భునితోఁగూడ బ్రహ్మవిద్యనుసంపాదించుకొని దానికంటె విలక్షణమగు పరమపదమును అనఁగా పరబ్రహ్మమును బొంధుచున్నాఁడు. ఇట్లు అనావృత్త్యాది శ్రుతివచనములచే దెలియవచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ కార్యభూతమగు బ్రహ్మలోకము ప్రళయమును బొందునపుడు అచట నొక యుద్యోగమున నియోగింపఁబడిన వాఁడును, తన యుద్యోగమును ముగించుకొనినవాఁడును, బ్రహ్మవిద్యావంతుఁడునగు హిరణ్యగర్భునితోఁగూడ స్వయముగా నచట బ్రహ్మవిద్యను సంపాదించుకొనినట్టి యాజీవుఁడట్టి హిరణ్యగర్భుని లోకమునుండి పరబ్రహ్మమునుబొందుచున్నాఁడు. దేవయానమునఁబ్రయాణము జేసినవానికి పునరావృత్తి లేదనియు అతఁ డమృతత్వ రూపమగు మోక్షమును బొందుచున్నాఁడనియును శ్రుతి జెప్పుచున్నందున, నిట్లు దెలియవచ్చుచున్నది. మఱియు, "తే బ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతాత్పరి

ముచ్యంతి సర్వే" (తై. నా. ౧౨ అను) అనఁగా "వారందఱును ప్రళయకాలమున ఉత్కృష్టమగు నమృతత్వమును బొంది ముక్తు లగుచున్నారు" అను శ్రుతి వాక్యమువలనను ఇట్లు తెలియుచున్నది.

## ౧౦॥ సూ॥ స్మృతేశ్చ.

టీ॥ స్మృతేః-చ=స్మృతివలనను ఇట్లు తెలియుచున్నది.

తా॥ "బ్రహ్మణా సహ తే సర్వే" ఇత్యాది స్మృతివాక్యము ఉపాసకులు హిరణ్యగర్భునితోఁగూడ పరమపదమును బొందుచున్నారని తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ యర్థము స్మృతివలనను తెలియుచున్నది. ఎట్లనిన, "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం" అను స్మృతివాక్యము "మహాప్రళయము ప్రాప్తింపఁగా, హిరణ్యగర్భాయుర్దాయావసానమున వారాత్మసాక్షాత్కారముగలవారై యాహిరణ్యగర్భునితోఁగూడఁ బరమపదమును బొందుదురు" అని చెప్పుచున్నది. కనుక హిరణ్యగర్భుని ఉపాసించు వానిని మాత్రము అర్చిరాదిగణము తోడు కొని పోవుచున్నదని శ్రీబాదరాయాచార్యులవారు తలఁచుచున్నారు.

అవతారిక:—ఈ సందర్భమున శ్రీజైమిన్యాచార్యుల వారు తమ మతమును తెలుపుచు బదులు జెప్పుచున్నారు.

## ౧౧॥ సూ॥ పరం జైమినిర్ముఖ్యత్వాత్.

టీ॥ పరం=పరబ్రహ్మమును, (ఉపాసీనాన్=ఉపాసించువారిని, గమయతీతి=అర్చిరాదిగణము తోడుకొనిపోవుచున్నదని), జైమినిః = జైమిన్యాచార్యుఁడు, (మన్యతే = తలఁచుచున్నాఁడు, ఏలననఁగా,) ముఖ్యత్వాత్ = (బ్రహ్మశబ్దమునకు పరబ్రహ్మము) ముఖ్యార్థ మగుటవలన,

తా॥ "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అనుచో, "బ్రహ్మ" శబ్దము ముఖ్యముగాఁ బరబ్రహ్మమును దెలుపునది యగుటవలన, అర్చిరాదిగణము పరబ్రహ్మమును ఉపాసించువారిని మాత్రము తోడుకొని పోవుచున్నదని జైమిన్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ జైమినిమతము—అర్చిరాదిగణము పరబ్రహ్మమును ఉపాసించు వారిని తోడుకొనిపోవుచున్నదని శ్రీ జైమిన్యాచార్యులవారు తలఁచు చున్నారు. ఏలననఁగా, "తత్పురుషోఽమానవ స్స ఏనాన్ బ్రహ్మ గమయతి" అను శ్రుతి వాక్యమునందుండు "బ్రహ్మ" శబ్దమునకు పరబ్రహ్మము ముఖ్యార్థము. ఈ యమానవపురుషుఁడు బ్రహ్మవేత్తను హిరణ్యగర్భుని యొద్దకుఁ దోడుకొనిపోవు

చున్నాఁడని ప్రమాణాంతరములవలనఁ దెలియవచ్చుచున్న పక్షమునఁ గదా, అనఁగా ప్రమాణాంతరముచే ముఖ్యార్థము బాధితమగు సందర్భమునఁగదా, యీ తావున "బ్రహ్మ" శబ్దము యొక్క ముఖ్యార్థమును త్యజించి లక్షణార్థమును గైకొనవచ్చును. బ్రహ్మము సర్వగతము గాన అనఁగా నన్నిచోట్లను ఉండునదిగాన, నట్టి బ్రహ్మమును బొందుటకై బ్రహ్మోపాసకుఁ డర్చిరాది మార్గమునఁ దేశాంతరమునకుఁబోవుట యసంభవ మగుటయే యట్టి ప్రసూణ మనుట కవకాశము లేదు. ఏలయన, పరబ్రహ్మము సర్వగతమైనను, ఏదైన నొకదేశ విశేషమును బొందియే యీ బ్రహ్మవేత్త నిశ్శేషముగా నవిద్యను బోగొట్టు కొనుచున్నట్లు శాస్త్రమువలనఁ దెలియుచున్నది. అదెటువలెననిన, "తమేతం వేదాను వచనేన" ఇత్యాది శాస్త్రవాక్యమువలన జ్ఞానోత్పత్తికి గాను బ్రాహ్మణాది వర్ణధర్మములును, బ్రహ్మచర్యాద్యాశ్రమధర్మములును, శౌచమును, సదాచారమును, దేశకాలములును ఆవశ్యకములని దెలియవచ్చుచందమున, ఈతఁడర్చిరాదిమార్గమున నొకదేశవిశేషమును బొందియే నిశ్శేషముగా నవిద్యారహితుఁ డగుచున్నాఁడని, అర్చిరాదిమార్గ ప్రయాణమును విధించునట్టి శాస్త్రమువలనఁ దెలియవచ్చుచున్నది. బ్రహ్మవేత్త శరీరమునుండి బయలువెడలుట శాస్త్రనిషిద్ధమను శంక పూర్వమే పరిహరింపఁబడియె.

"బ్రహ్మలోకాన్" అనుతావున లోకశబ్దమువలనను బహువచనము వలనను దేవయానమునఁ బోయిన జ్ఞానిపురుషుఁడు హిరణ్యగర్భుని బొందుచున్నట్లు దెలియవచ్చుచున్నదను వాదము గూడ యుక్తమయినది కాదు. ఏలయనిన, "నిషాద స్థపతి" న్యాయానుసారము అనఁగా పూర్వమీమాంసమునందు [1] "నిషాద

(1) "వాస్తుమయం రౌద్రం చరుం నిర్వపేత్" అను శ్రుతివాక్యము రౌద్రయాగమును విధించి, తరువాత "ఏతయా నిషాదస్థపతిం యాజయేత్" అనువాక్యమున "నిషాదస్థపతిచే నట్టి యాగమును చేయించుమనది" అని విధించుచున్నది. ఈతావున "నిషాదస్థపతి" శబ్దము "నిషాదానాం స్థపతిః=కొండయెఱుకలవారి ప్రభువు" అను షష్ఠీతత్పురుష సమాసార్థమునుబట్టి, నిషాదులకుఁ బ్రభువగు ద్విజుని తెలుపుచున్నదా? లేక "నిషాదశ్చ సౌ స్థపతిశ్చ=నిషాదజాతివాఁడగు ప్రభువు" అను కర్మధారయ సమాసార్థమునుబట్టి నిషాదజాతివాఁడగు ప్రభువును తెలుపునదియా? యని విచారించి, ద్విజులకే వేదాధ్యయనద్వారా యాగములనొనర్చుట కధికారముండుటను బట్టి యిచట షష్ఠీసమాసార్థ ప్రకారము ఈ శబ్దము నిషాదులకుఁ బ్రభువగు నొక ద్విజుని తెలుపునది యని పూర్వపక్షముఁజేసి, యనంతరము కర్మధారయసమాసార్థమే యీ తావున ముఖ్యమనియు, కాలవశమున ఆచార్యునిద్వారా జ్ఞానమును సంపాదించుకొనిన నిషాదుఁడును రౌద్రయాగమునుఁజేయుట కర్హుఁడనియును, అందువలన ఈశబ్దమును కర్మధారయ సమాసార్థముననే గైకొనునదియనియును పూర్వమీమాంసాశాస్త్రమున నిశ్చయింపఁబడియె.

స్థపతి" యనుశబ్దమును "నిషాదుఁడగు ప్రభువు" అనెడి కర్మధారయ సమాసార్థమునఁ గైకొనినట్లు, ఈ తావునను "బ్రహ్మలోకాన్" అను శబ్దమును "బ్రహ్మైవ లోకః=బ్రహ్మమే లోకము" అను కర్మధారయ సమాసార్థమునఁ గైకొనుట యుక్తము. ఇట్లు తెలుపఁబడు పదార్థము ఒక్కటియే యని నిశ్చితమగుచున్నందున దానిని తెలుపునట్టి శబ్దము బహువచనమునఁ బ్రయోగింపఁబడినను బాధకములేదు. అదెటువలెననిన. పూర్వమీమాంసమున [1] "అదితిః పాశాన్"అనుతావున పశువునుకట్టు పాశమొక్కటియేయైనను "పాశ"శబ్దమును బహువచనమునఁ బ్రయోగించుట యుపపన్నమగునట్లు, ఈతావునను, బహువచనము ఉపపన్నమే. అయినను, పరిపూర్ణుఁడును, సర్వగతుఁడును, సత్యసంకల్పుఁడునగు పరబ్రహ్మముయొక్క స్వేచ్ఛచేఁ గల్పింపఁబడిననగుటచే స్వాసాధారణములై అప్రాకృతములగు లోకము లనంతములు గలవు. అవి లేవన్నమాట లేదు. శ్రుతిస్మృతీతిహాస పురాణములవలన నట్లు తెలియుచున్నది.

౧౩॥ సూ॥ దర్శనాచ్చ.

టీ॥ దర్శనాత్ -చ=పరబ్రహ్మప్రాప్తికి గాను దేవయానగమనము శ్రుతియందుఁ గానఁబడుటవలనను,

తా॥ "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ " ఇత్యాది శ్రుతివాక్యము "ముక్తపురుషుఁడు శరీరములోనుండి బయలువెడలి దేవయానమునఁబోయి పరబ్రహ్మమును బొందుచున్నాఁడు" అని తెలుపుట వలనను అమానవపురుషుఁడీ ముక్తపురుషుని పరబ్రహ్మమునే పొందించుచున్నాఁడని విశదమగుచున్నది.

శ్రీ॥ భా॥ "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఈ జీవుఁడు ఈ శరీరములోనుండి బయలువెడలి పరంజ్యోతిస్సును బొంది స్వస్వరూపావిర్భావము గలవాఁడగుచున్నాఁడు)అను శ్రుతివాక్యము శరీరములోనుండి మూర్ధన్యనాడిగుండ బయలు

(1) జ్యోతిష్టోమమున అగ్నీషోమీయపశువును కట్టుటకుగానగు త్రాటిని గుఱించి పఠించు నపుడు తైత్తిరీయులు "అదితిఃపాశాన్"అని పఠించియున్నారు. ఇచట పశువును కట్టుటకుగానగు త్రాడు ఒక్కటియేయైనను దానిఁదెలుపు "పాశ" శబ్దము "పాశాన్"అని బహువచనమునఁ బ్రయోగింపఁబడినది. అయితే శాఖాంతరములయందు ఈసందర్భమున, "అదితిఃపాశం" అను తావున "పాశం" అని యేకవచన ప్రయోగము సయితముకలదు. ఈహేతువువలన నర్థమునే ప్రధానముగాఁగొని "పాశాన్" బహువచనమున నుండు శబ్దమునకు ఏకవచనార్థమునే పూర్వమీమాంసమునఁ గైకొనియున్నారు. (మీ. సూ. ౨ అ. ౩ పా.) వైదికభాషయందు ఏకవచనముండవలసిన తావున బహువచనముండిన నుండవచ్చుననియు, అందు అర్థమే ప్రధానమనియును శ్రీ పతంజలిమహర్షి "వ్యత్యయో బహులం" అను పాణిని సూత్రభాష్యమున నెంతయో విపులముగాఁ బ్రతిపాదించి యున్నారు.

వెడలి దేవయానమార్గమునఁ బ్రయాణముఁ జేసిన జీవునికి పరబ్రహ్మప్రాప్తి గల దని తెలుపుచున్నది.

అవతారిక:—"ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అను శ్రుతివాక్యము బ్రహ్మవేత్తయగు పురుషుఁడు తాను ప్రజాపతియొక్క సభను, గృహమునున్ను బొందితినని యనుసంధించుకొనుచున్నాఁడనుచు ఈ పురుషుఁడు హిరణ్యగర్భుని బొందుచున్నట్లు దెలియఁజేయుచున్న దే? యని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై,

౧౩॥ సూ॥ న చ కా ర్యే ప్ర త్య భి స న్ధిః

టీ॥ ప్రత్యభిసన్ధిః=ఈ ప్రత్యభిసంధానము, కార్యే = హిరణ్యగర్భుని విషయమైనది, న-చ=కానేరదు,

తా॥ "ప్రజాపతేః సభాం వేశ్మ" ఇత్యాది శ్రుతియందుఁ జెప్పఁబడిన ప్రత్యభిసంధానము హిరణ్యగర్భుని గుఱించినది కాదని వాక్యశేషమువలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇట్టి యనుసంధానము పరబ్రహ్మమును గుఱించినదియే గాని, హిరణ్యగర్భుని గుఱించినదికాదు. ఏలననఁగా, "యశోహం భవామి బ్రాహ్మణానాం" (ఛా. ౮ ప్ర. ౩ ఖ. ౪ వా.) "బ్రాహ్మణులలో నేను యశోవంతుఁడను" అను వాక్యశేషము దేవయానమునఁబోయి పరబ్రహ్మమును బొందిన బ్రహ్మవేత్త యవిద్యారహితుఁడై సర్వాత్మభావానుసంధానయుక్తుఁ డగుచున్నట్లు దెలియఁ జేయుచున్నది. మఱియు "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" అను శ్రుతి వాక్యము "అశ్వము రోమములను విదిలించి వేసినట్లు పాపమును బోఁగొట్టుకొని, చంద్రుఁడు రాహుముఖమునుండి బయలువెడలినట్లు శరీరములోనుండి బయలువెడలి కృతార్థుఁడనై కృతముగాని అనఁగా సృష్టింపఁబడనిదైనందున నిత్యమగు బ్రహ్మలోకమును బొందుచున్నాను" అని చెప్పుచుండుటచే నీబ్రహ్మవేత్తచే బొందఁబడు బ్రహ్మలోకము నిత్యమైనట్లు దెలియవచ్చుచున్నది. మఱియు ఈ పురుషుఁడు సర్వబంధవినిర్ముక్తుఁ డగుచున్నాఁడనియును ఈ వాక్యమువలన విశదమగుచున్నది. ఈ హేతువులనుబట్టి యర్చిరాదిగణము పరబ్రహ్మమును ఉపాసించువానిని మాత్రము తోడుకొని పోవుచున్నదని తెలియుచున్నది. ఇట్లు శ్రీజైమిన్యాచార్యుల వారు తలఁచుచున్నారు.

అవతారిక:—శ్రీవేదవ్యాసులు స్వాభిప్రాయము నీసూత్రముచే దెలియఁ జేయుచున్నారు.

౧౪॥ సూ॥ అ ప్ర తీ కా ల ం బ నా న్న య తీ తి బా ద రా య ణ

ఉ భ య థా చ దో షా త్త త్క్ర తు శ్చ

టీ॥ అప్రతీకాలంబనాన్ = ప్రతీకోపాసకులు కానివారిని, నయతి = అర్చి రాదిగణము తోడుకొని పోవుచున్నది, ఇతి=అని, బాదరాయణః = వ్యాసాచార్యుఁడు, మన్యతే=తలఁచుచున్నాఁడు (ఏలననఁగా), ఉభయథాచ=ఈపైని గనఁబఱిచిన రెండుపక్షములను, అనఁగా హిరణ్యగర్భుని ఉపాసించువారినిఁ దోడుకొని పోవుచున్నదను పక్షమునను, పరబ్రహ్మమును ఉపాసించువారిని మాత్రము తోడుకొని పోవుచున్నదను పక్షమునను, దోషాత్ = శ్రుతివిరోధ రూపమగు దోషముండుటవలన, అది యెట్లనిన, తత్క్రతుశ్చ=ఉపాసకుఁడు తన యుపాసనమున కనుగుణముగాను గదా ఫలమును బొందును.

తా॥ ఈ యర్చిరాదిగణము హిరణ్యగర్భుని ఉపాసించువారినిఁ దోడుకొనిపోవుచున్నదను పక్షమునను, పరబ్రహ్మమును ఉపాసించువారిని మాత్రము తోడుకొని పోవుచున్నదను పక్షమునను దోషము సంప్రాప్తమగుటం జేసి, యది ప్రతీకోపాసకులను తప్ప తక్కినవారినిఁదోడుకొని పోవుచున్నదని శ్రీవ్యాసాచార్యుఁడు తలఁచుచున్నాఁడు. ఉపాసనమున కనుగుణముగాను గదా ఫలము గలుగును.

శ్రీ॥ భా॥ శ్రీవేదవ్యాసునిమతము— ప్రతీకోపాసకులను తప్ప తక్కిన యుపాసకులను అర్చిరాదిగణము తోడుకొని పోవుచున్నదని శ్రీవేదవ్యాసుల వారు తలఁచుచున్నారు. ఫలితార్థమేమనిన, ఈ యర్చిరాదిగణము హిరణ్యగర్భుని ఉపాసించువారినిఁ దోడుకొని పోవుట యసంభవము. ఇది పరబ్రహ్మమును ఉపాసించువారిని మాత్రము తోడుకొనిపోవుచున్నదన్న నియమమును లేదు. మఱియు నిది ప్రతీకోపాసకులను గూడ తోడుకొని పోదు. అయితే ఈ యర్చిరాదిగణము పరబ్రహ్మమును ఉపాసించువారిని, ప్రకృతివియుక్తమై బ్రహ్మాత్మకమైన దానినిగాఁ బ్రత్యగాత్మను ఉపాసించువారినిన్ని అనఁగా నీయుభయవిధోపాసకులను మాత్రము తోడుకొని పోవుచున్నది. అయితే బ్రహ్మకార్యాంతర్భూతములగు నామము మొదలగు పదార్థములను, దేవదత్తాదులను సింహాదులనుగా భావించి యుపాసించునట్లు, బ్రహ్మభావనచే నుపాసించువారిని గాని, యట్టి బ్రహ్మభావనలేక కేవలము అట్టి పదార్థములను మాత్రము ఉపాసించువారిని గాని యీయర్చిరాదిగణము తోడుకొని పోదు. కావున నిది పరబ్రహ్మమును ఉపాసించువారినిన్ని, ప్రత్యగాత్మను ప్రకృతివియుక్తమై బ్రహ్మాత్మకమైనదానినిగాను ఉపాసించువారినిన్ని తోడుకొనిపోవుచున్నదని సిద్ధమగుచున్నది.

వలననిన, ఈ పైనిగనఁబఱచిన బాదరి జైమినుల మతములు రెండును దోష యుక్తములు. బాదరాయ్యాచార్యుల మతానుసారము కార్యభూతుఁడగు హిరణ్యా గర్భుని ఉపాసించువారిని అర్చిరాదిగణము తోడుకొని పోవుచున్నదను పక్షమున, "అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య" (ఛా.౮ప్ర.౩ఖ.౪లా) ఈ మొదలగు శ్రుతివాక్యములు "బ్రహ్మవేత్త యీశరీరములోనుండి బయలు వెడలి పరంజ్యోతిస్సును అనఁగా పరబ్రహ్మమును బొందుచున్నాఁడు" అని చెప్పుచున్నందున నట్టిశ్రుతులతో విరోధము వచ్చును. మఱియు జైమిన్యా చార్యుల మతానుసారము ఈ యర్చిరాదిగణము పరబ్రహ్మమును ఉపాసించు వారిని మాత్రము తోడుకొనిపోవుననెడి నియమముండు పక్షమున, "తద్య ఇత్థం దుర్యేచేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవంతి" (ఛా. ౫ ప్ర. ౧౦ ఖ. ౧ వా) (ఎవరు ప్రత్యగాత్మను పంచాగ్నివిద్యయందుఁ జెప్పియున్న ప్రకారము అనఁగా ద్యుపర్జన్యాద్యగ్నులయందు శ్రద్ధాసోమాది శరీరకము గాను, దేహాదిప్రకృతి విలక్షణమైనదానినిగాను, బ్రహ్మాత్మకమైనదానినిగానును ఉపాసించుచున్నారో వారును, ఎవరు అరణ్యమునందు శ్రద్ధాపురస్సరముగ తపస్సనంబడు బ్రహ్మమును ఉపాసించుచున్నారో వారును అర్చిస్సును బొందు చున్నారు) అను శ్రుతివాక్యము "ప్రత్యగాత్మను ప్రకృతివియుక్తమై బ్రహ్మా త్మకమైన దానినిగా నుపాసించుట" యనెడి పంచాగ్నివిద్య ననుష్ఠించువానికిని అర్చిరాదిమార్గప్రయాణము గలదని తెలుపుచుండుటచేనట్టిశ్రుతితో విరోధము వచ్చును. కనుక నీపైనిగనఁబఱచిన శ్రుతివిరోధమునుబట్టి బాదరి జైమినుల పక్షములు దోషయుక్తములు. అందువలన పైనిగనఁబఱచిన ఉభయవిధోపాసకులను మాత్ర మర్చిరాదిగణము తోడుకొని పోవుచున్నదనుట యుక్తము.

ఇందులకు ఉపాసకుల ధ్యానమే కారణము. ఈవిషయమునే సూత్ర కారులు "తత్క్రతుశ్చ"అనుటచే దెలిపి యున్నారు. అనఁగా ఎవ్వఁడేయేవిధ ముగ ధ్యానించుచున్నాఁడో, వాఁడట్టిఫలమునే పొందుచున్నాఁడు. అదియెట్ల నిన, శ్రుతివాక్యములు "యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" "పురుషుఁడీ లోకమున నెట్టి ధ్యానముతోనుండునో, యీ లోక మునుండి బయలువెడలియు నట్టి గతియే గలవాఁడగును" అనియు, "తం యథా యథోపాసతే" "వానిని యేయేవిధమున నుపాసించుచున్నారో" అనియును జెప్పుచు ఉపాసకులు తమతమ యుపాసనముల కనుగుణమగు ఫలమును బొందు దురను న్యాయమును తెలియఁజేయుచున్నవి. "తద్య ఇత్థం విదుః" ఇత్యాదిశ్రుతి యందు పంచాగ్నివిద్యానిష్ఠునికిని దేవయానమునఁబోవుటయు, దేవయానమునఁ బోయిన వానికి పరబ్రహ్మప్రాప్తియు, పునరావృత్తిరాహిత్యమును జెప్పియున్నం

దునను, ఉపాసనమున కనుగుణముగ ఫలము గలుగుననెడి న్యాయమునలనను ఈపంచాగ్ని విద్యాశ్రుతియందుపదేశించిన యుపాసనము ప్రకృతివియుక్తమై బ్రహ్మాత్మకమగు నాత్మను గుఱించిన యనుసంధానమేయని సిద్ధమగుచున్నది. (కావున పంచాగ్ని విద్యానిష్ఠుఁడు [1]బ్రహ్మోపాసకుఁడే).

[2]నామము మొదలు ప్రాణపర్యంతము ఛాందోగ్య శ్రుతియందుఁ జేర్కొనఁబడిన ప్రతీకములను ఉపాసించువారు ఈపైని యుదహరింపఁబడిన ఉభయవిధ శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడిన యుపాసనము నొనర్చువారు కారు. అయితె వారు జడపదార్థ మిశ్రితమగు వస్తువును ఉపాసించువారు. కావున, అట్టివారికి, ఈపైని గనఁబఱచిన న్యాయానుసారము అనఁగా జీవుఁడీలోకమున నొనర్చునట్టి యుపాసనమున కనుగుణమగు ఫలమును బొందుచున్నాఁడను న్యాయానుగుణముగ, అర్చిరాదిమార్గమునఁ బోవుటయు, బ్రహ్మప్రాప్తియును సంభవింపవు.

అవతారిక:—శ్రుతివాక్యమే యిట్టిభేదమును గాన్పించుచున్నదనుటకై.

౧౫॥ సూ॥ వి శే షం చ ద ర్శ య తి.

టీ॥ చ = మఱియు, విశేషం = (నామము మొదలు ప్రాణపర్యంతము పేర్కొనఁబడిన ప్రతీకములను ఉపాసించువారలకు) పరిమిత ఫలవిశేషమును, దర్శయతి=శ్రుతి కాన్పించుచున్నది.

---

(1) అయితే పంచాగ్నివిద్యానిష్ఠుఁడును బ్రహ్మోపాసకుఁడే యగునేని యిచట పంచాగ్నివిద్యానిష్ఠునిన్ని బ్రహ్మోపాసకునిన్ని వేఱుగాఁ జెప్పినందువలనఁ బ్రయోజనమేమని యడుగవచ్చును. ఇట్టి విభాగమునకు వేఱొకయవకాశము లేకపోవుటచే నిచట "తద్య ఇత్థం విదుః" అను తావున చెప్పఁబడినది బ్రహ్మాత్మకస్వాత్మోపాసనమనియు, "యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" అను తావున చెప్పఁబడినది స్వాత్మవిశిష్టబ్రహ్మోపాసన మనియును ఊహించుకొనునది. ఏలననఁగా, పంచాగ్నివిద్యానిష్ఠులకును బ్రహ్మప్రాప్తి శ్రుతియందుఁ జెప్పియున్నది. వారు బ్రహ్మోపాసకు లయిననే తప్ప వారి కట్టి బ్రహ్మప్రాప్తి రూపమగు ఫలము గలుగనేరదు. మఱియు నీపైని గనఁబఱచిన ప్రకారము ఊహించుకొనిననేతప్ప శ్రుతియందుఁ జెప్పియున్న విభాగము సార్థము కాదు.

(2) నామము, వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, ఉదకము, తేజస్సు, ఆకాశము, స్మరణము, ఆశా, ప్రాణము, అను వానిలో పూర్వపూర్వమునఁ జెప్పఁబడిన దానికంటె నుత్తరోత్తరమునఁ జెప్పఁబడిన దానిని ఉత్కృష్టమైన దానినిగాఁదలఁచి వానియందు బ్రహ్మదృష్టినుంచి యుపాసించునది యని యిట్టి యుపాసనములు కొన్ని ఛాందోగ్యోపనిషత్తునందు ౭-వ ప్రపాఠకమునఁ జెప్పఁబడినవి. ఇవి ప్రతీకోపాసనము లనఁబడును. బ్రహ్మముకాని దానిని బ్రహ్మమునుగాఁదలఁచి యుపాసించుట ప్రతీకోపాసన మనఁబడును. ఈ ప్రతీకోపాసనములకోగాను కొన్ని పరిమితఫలములును అచ్చటనే చెప్పఁబడినవి.

తా॥ "యావన్నామ్నో గతం" ఇత్యాది శ్రుతి వాక్యము నామాదిప్రాణ పర్యంతము పేర్కొనఁబడిన ప్రతీకములను ఉపాసించువారలకు పరిమిత ఫలవిశేషమును గాన్పించుచుండుట చే వారిని నర్చిరాదిగణము తోడుకొనిపోదు.

శ్రీ॥ భా॥ ''యావన్నామ్నో గతం తత్రాస్య యథాకామచారో భవతి'' (ఛా. ౭. ప్ర. ౧ ఖ ౫ వా) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు, ''ఎంతవఱకు నామము వ్యాపించియుండునో, అంతవఱకు నామబ్రహ్మోపాసకునికి స్వేచ్ఛావిహారము గలదు'' అనియు నివ్విధముగాఁ జెప్పుచు నామము మొదలుకొని ప్రాణపర్యంతము శ్రుతియందుఁ బేర్కొనఁబడిన ప్రతీకములను ఉపాసించువారలకు మఱియొక చోటికిఁ బోనక్కఱలేకుండుటను, పరిమితమగు నొక ఫలవిశేషమునున్ను తెలుపుచున్నవి. కనుక జడపదార్థమిశ్రితమగు వస్తువునైనను, లేక, కేవలము జడపదార్థమునైనను బ్రహ్మదృష్టితోఁగాని బ్రహ్మదృష్టిలేకుండగాని యుపాసించువారిని అర్చిరాదిగణము తోడుకొనిపోదు. అయితే పరబ్రహ్మమును ఉపాసించువారిని, ఆత్మను ప్రకృతి వియుక్తమై బ్రహ్మాత్మకమైన దానినిగా నుపాసించువారినిన్ని యీ యర్చిరాది గణము తోడుకొని పోవుచున్నదని సిద్ధమగుచున్నది.

 కార్యాధికరణము ముగిసెను.

గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బన్ధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు చతుర్థాధ్యాయమున తృతీయపాదము.

శ్రీరస్తు.



    

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## చతుర్థాధ్యాయము—చతుర్థపాదము

### సంపద్యావిర్భావాధికరణము.

**౧॥ సూ॥ సంపద్యావిర్భావస్స్వేన శబ్దాత్.**

టీ॥ అయం ప్రత్యగాత్మా=ఈ జీవుఁడు, సంపద్య = పరంజ్యోతిస్సును బొందిన పిదప పొందునట్టి యవస్థావిశేషము, ఆవిర్భావః=స్వస్వరూపావిర్భావ రూపమైనదని, స్వేనశబ్దాత్ = శ్రుతియందలి "స్వేన" అను శబ్దమువలన, జ్ఞాయతే = తెలియవచ్చుచున్నది).

తా॥ "స్వేన రూపేణాభినిష్పద్యతే" అను శ్రుతియందు "స్వేన" శబ్దము ప్రయోగింపఁబడియున్నందున, పరంజ్యోతిస్సును బొందిన ముక్తపురుషుని స్థితి స్వస్వరూపావిర్భావరూపమయినదని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మమును ఉపాసించువారును, ఆత్మను ప్రకృతివిని ర్ముక్తమై బ్రహ్మాత్మకమయిన దానినిగాను ఉపాసించువారును, అర్చి రాదిమార్గమునఁ బోవుదురనియు, వారు మరల ఈ లోకమునకు రారనియు, తృతీయపాదమునఁ జెప్పఁబడెను. ఈ పాదమున ముక్తపురుషులు పొందునట్టి యైశ్వర్యముయొక్క విధమును గుఱించి విచారింపఁబడును.

*తృతీయచతుర్థాధ్యాయముల కుఁగల పరస్పర సంబంధము*

ఈ విషయమును గుఱించి పఠించునపుడు, ఛందోగులు "ఏవమేవైష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౨ వా.) అను వాక్యమున, "జీవుఁడీ శరీరములోనుండి బయలువెడలి, పరంజ్యోతిస్సును బొంది, స్వకీయమైన రూపముతో నుండును. అనఁగా నిజస్వరూపుఁడగుచున్నాఁడు" అని పఠించుచున్నారు. ఈ సందర్భమున నొక సంశయము గలుగుచున్నది.

 

## సంశయము.

జీవుఁ డీ శరీరములోనుండి బయలు వెడలి పరంజ్యోతిస్సునుబొంది స్వకీయమగు రూపముతో నుండుననఁగా దేవాది రూపమువంటి యొక సంపాదించుకొనఁదగిన రూపముగలవాఁడగుచున్నాఁడని యీ శ్రుతివాక్యము జెప్పుచున్నదా! లేక, అఁతడు స్వాభావికమైన రూపముతో నుండువాఁడగునని చెప్పుచున్నదా?

## పూర్వపక్షము.

ఈశ్రుతి ముక్తపురుషుఁడు దేవాదిస్వరూపమువంటి సంపాదించుకొనఁదగినదియగు రూపముతో సంబంధమును బొందునని చెప్పుచున్నదనుట యుక్తము. అట్లుకాకున్న, అనఁగా స్వాభావికమైన స్వరూపముతో నుండువాఁడగునని చెప్పిన పక్షమున, స్వాభావికమైన స్వరూపము స్వయముగా నొక పురుషార్థము గానేరదుగాన, మోక్షశాస్త్ర మెద్దియును పురుషార్థమును బోధింపలేదను మాటవచ్చును. మఱియు సుషుప్త్యవస్థయం దింద్రియవ్యాపారము లుపరమింపఁగా, నట్టి సమయమునం దీపురుషుఁడు కేవలాత్మస్వరూపముతో అనఁగా స్వస్వరూపముతో నుండినను, అట్టి స్థితి యొక పురుషార్థముతో సంబంధించినదిగాఁ గానఁబడుచుండ లేదు.

పరంజ్యోతిస్సును బొందిన యీ యాత్మకు దుఃఖనివృత్తి గలుగుట మాత్రమే పురుషార్థమగు పక్షమున, స్వస్వరూపావిర్భావమే మోక్షమని చెప్పవచ్చును. అయితే యింతమాత్రమే మోక్షము కాదు. ఏలననిన, "స ఏకో బ్రహ్మణ ఆనందః శ్రోత్రియస్యచాకామహతస్య" అను శ్రుతివాక్యము, "కామాదులచేఁ బీడితుఁడు గానట్టి ముక్తునియొక్క యానందమును బ్రహ్మానందమును నొక్కటియే" యనియు, "రసం హ్యేవాయలబ్ధ్వానందీ భవతి" అను శ్రుతివాక్యము "ఈముక్తాత్మ ఆనందమయుఁడగు పరబ్రహ్మమును బొంది యానందముగల వాఁడగుచున్నాఁడు" అనియును జెప్పుచు, ఈ ముక్తాత్మ యనంత సుఖమును బొందుచున్నట్లు దెలియఁజేయుచున్నవి.

ఈ యాత్మయొక్క స్వరూపము అపరిచ్ఛిన్నమగు నానందమే స్వరూపముగాఁగల చైతన్యమే గాన, నట్టి చైతన్యము సంసారావస్థయం దవిద్యచే తిరోహితమయినదై (మూయఁబడినదై) యీ పురుషుఁడు పరంజ్యోతిస్సును బొందఁగానే, అది యావిర్భూతమగుచున్నదనిన (ప్రకటితమగుచున్నదనిన) దోష మెద్దియును లేదే యనియును జెప్పుట యుక్తము కాదు. ఏలననిన, జ్ఞానస్వరూపమైనదానికి తిరోధానము సంభవింపదు అట్లు ప్రకాశమేయగు జ్ఞానమునకు తిరోధానము సంభవించు పక్షమున, దాని కది వినాశమేయని యింతకుఁ బూర్వము ప్రతిపాదింపఁబడితె.

ఇంతియె కాక, ప్రకాశమాత్రమగునది యానందమగుట యసంభవము. ఎట్లన, ఆనందస్వరూపమగుట యనఁగా సుఖస్వరూపమగుట గదా! సుఖస్వరూపమనఁగా నాత్మకు అనుకూలమగుట. ప్రకాశమాత్రమే యాత్మ యనుపక్షమున, ప్రకాశమనుదానిని యనుకూలమైన దానినిగా ననుభవించువాఁ డెవడు? కావున, ప్రకాశ మాత్ర మాత్మయనువాని పక్షమున, నట్టి ప్రకాశ మానంద రూపమని ప్రతిపాదించుట యశక్యము.

మఱియు ప్రకృతమున సాధింపఁదగినది స్వస్వరూపప్రాప్తియే యంటివేని, యట్టి స్వస్వరూప మీయాత్మ కెప్పుడును సిద్ధముగా నుండునదియే. కావున, "స్వేన రూపేణాభి నిష్పద్యతే" అను శ్రుతి పరంజ్యోతిస్సును బొందినవానిని గుఱించి యట్టిస్వరూపమును తెలుపుపక్షమున, నందుండు "అభినిష్పద్యతే" "సాధింపఁబడుచున్నది" అనుశబ్దమున కర్థమే లేకపోవును. కాఁబట్టి పరంజ్యోతిస్సును బొందినవాఁడు పొందునది యింతకుఁబూర్వము పొందియుండనిదియు, ఇప్పుడు సాధింపఁదగినదియు ననుటయే శ్రుత్యభిప్రాయమని చెప్పుట యుక్తము. ఇట్లు చెప్పినచో, "అభినిష్పద్యతే" "సాధింపఁబడుచున్నది" అను పదము గూడ ముఖ్యార్థము గలదియగుచున్నది. ఈ పక్షమున, "స్వేనరూపేణ" అనఁగా స్వాసాధారణమగు నానందైకస్వరూపముతో" అనియర్థము గాన, నీపక్షమున "స్వేన రూపేణ" అనునది గూడ సంగతార్థ మగుచున్నది.

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము గాదు. ఈ యాత్మ యర్చిరాదిమార్గమునఁ బ్రయాణముఁజేసి, పరంజ్యోతిస్సును బొంది, యేస్థితిలోనుండునో, ఆస్థితి స్వస్వరూపావిర్భావ రూపమయినది గాని, నూతనరూపోత్పత్తిరూపమయినది కాదు. అట్లు అది నూతనరూపోత్పత్తి రూపమయినదగు పక్షమున, "పరంజ్యోతిరుపసంపద్య స్వేన" ఇత్యాది శ్రుతివాక్యమునందుండు "స్వేన" అను విశేషణము నిరర్థకమగును గదా? ఏలననిన, ఇట్టి విశేషణము లేకున్నను సంబంధమునుబట్టి యట్టి స్వరూపము స్వకీయమని సిద్ధించును.

అవతారిక:—ఆత్మకు స్వస్వరూపమెప్పుడు నుండునదియే గాన "సంపద్యాభి నిష్పద్యతే" అను వచనము నిరర్థకమగునను శంకను బరిహరించుటకై.

### ౨॥ సూ॥ ముక్తః ప్రతిజ్ఞానాత్.

టీ॥ ప్రతిజ్ఞానాత్ = (శ్రుతియందు) ప్రతిజ్ఞచేయుటవలన, ముక్తః=సర్వబంధవినిర్ముక్తుఁడే (శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు అని తెలియుచున్నది.)

తా॥ ''స్వేన రూపేణాభి నిష్పద్యతే''అను శ్రుతిచేఁ జెప్పఁబడిన వాఁడు సర్వబంధవినిర్ముక్తుఁడే యని శ్రుతియందలి ప్రతిజ్ఞ వలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ కర్మసంబంధమును, అందువలనఁగలిగిన శరీరాదులును లేని వాఁడై స్వాభావికమగు రూపముతో నుండువాఁడే "స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఈముక్తాత్మ తన స్వరూపముతో నుండువాఁడగును) అను శ్రుతిచేఁ జెప్పఁబడిన వాఁడు. ఆత్మకు స్వస్వరూపము నిత్యప్రాప్తమైనదియే యైనను, బద్ధావస్థయందది కర్మరూపమగు నవిద్యచే తిరోహితమైనదై (మూయఁబడినదై) యిప్పుడు అనఁగా ముక్తావస్థయందట్టికర్మరూపమగునవిద్యయొక్క తిరోధానము లేనిదియగుచున్నది. ఇట్టిస్థితియే "స్వేన రూపేణాభి నిష్పద్యతే''యను శ్రుతియందుఁ జెప్పఁబడిన యభినిష్పత్తి. అది యెట్లు తెలియుననిన, ఛందోగులు ఉపక్రమమున, కర్మ సంబంధ రహితమగు నాత్మస్వరూపమును ప్రతిపాదించుటకై ప్రతిజ్ఞ చేసి "య ఆత్మా" ఇత్యాది వాక్యమున ప్రకృతుఁడగు ప్రత్యగాత్మను జాగరితాద్యవస్థాత్రయ వినిర్ముక్తునిగాను, సుఖదుఃఖములకు హేతుభూతములగు కర్మముల వలనఁగలిగిన శరీరమునుండి వినిర్ముక్తునిగానును ప్రతిపాదించుటకై ''ఎతంత్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి'' (ఛా. ౮ ప్ర. ౯ ఖ. 3 వా) (ఈ యాత్మను గుఱించియే నీకు మరల ఉపదేశించెదను) అని యిట్లు మరల మరల ఆత్మను గుఱించి యుపదేశించి పిదప ''ఎవమేవైష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే'' అను వాక్యముచే ''ఈ యాత్మ యీ శరీరములోనుండి బయలువెడలి పరంజ్యోతిస్సును బొంది స్వస్వరూపముతోనుండు వాఁడగును'' అని పఠించుచున్నారు. కనుక, కర్మబద్ధుఁడగు నీ యాత్మకు పరంజ్యోతిస్సును బొందుటచేఁ గలుగు కర్మబంధనివృత్తిరూపమగు ముక్తియే "స్వస్వరూపముతో నభినిష్పన్నమగుట"యని అనఁగా "స్వస్వరూపావిర్భావము"అని శ్రుతి చెప్పుచున్నది. మఱియు ''అభినిష్పత్తి''శబ్దమునకు స్వరూపావిర్భావవాచకముగాను భాషయందుఁ బ్రయోగము గూడ గలదు. "యుక్త్యాఽయమర్థో నిష్పద్యతే'' అనఁగా "యుక్తిచే నీయర్థము సిద్ధించుచున్నది'' ఇత్యాది తావులఁ జూచుకొనునది.

అవతారిక:—సుషుప్త్యవస్థయందుండు కేవలాత్మస్వరూపము ఒక పురుషార్థముగ గానఁబడనందునను, మఱియు ముక్తునికిఁగలుగునది స్వస్వరూపావిర్భావమే యగుపక్షమున, మోక్షశాస్త్రమెద్దియు పురుషార్థమును బోధింపలేదనెడి మాటవచ్చుటవలనను "స్వేన రూపేణాభి నిష్పద్యతే'' అను శ్రుతివాక్యమునఁ జెప్పఁబడినట్టి యభినిష్పత్తి దేవాద్యవస్థవలె సుఖసంబంధముగల యొక యవస్థావిశేషమని శంకింపఁగా నట్టి శంకను పరిహరించుటకై.

3॥ సూ॥ ఆత్మా ప్రకరణాత్.

టీ॥ ప్రకరణాత్=ప్రకరణ సందర్భమునుబట్టియు, ఆత్మా=ప్రత్యగాత్మ, (అపహతపాప్మత్వాది స్వరూపుఁడుగా, అవగమ్యతే=తెలియఁబడుచున్నాఁడు.)

తా॥ ప్రకరణ సందర్భమునుబట్టియును ప్రత్యగాత్మ అపహతపాప్మత్వాది స్వరూపుఁడుగాఁ దెలియవచ్చుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ ఈప్రత్యగాత్మ, స్వరూపమునుబట్టియే అపహతపాప్మత్వము మొదలుకొని సత్యసంకల్పత్వము వఱకును శ్రుతియందుఁ జేర్కొనఁబడిన గుణములను గలిగియుండువాఁడుగాను, ప్రకరణ సందర్భమునుబట్టి తెలియవచ్చుచున్నాఁడు. ఎట్లనిన, "య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" (ఛా. ౮ ప్ర. ౭ ఖ. ౧ వా.) అను ప్రజాపతివాక్యము (ఆత్మ పాపరహితుఁడనియు, జరారహితుఁడనియు, మరణరహితుఁడనియు, దుఃఖరహితుఁడనియు, క్షుత్పిపాసారహితుఁడనియు, సత్యకాముఁడనియు, సత్యసంకల్పుఁడనియును) చెప్పుచున్నది. మఱియు ఈ వాక్యము ప్రత్యగాత్మ స్వరూపమును గుఱించియే యిట్లు జెప్పుచున్నదని, "ఉత్తరచ్చేదావిర్భూత స్వరూపస్తు" (బ్ర. సూ. ౧ అ. 3 పా. ౧౯ సూ.) అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబడెను. ఇట్లు ప్రత్యగాత్మ అపహతపాప్మత్వాది స్వరూపము గలవాఁడేయయినను, సంసార దశయందట్టి స్వరూపము కర్మమనంబడు నట్టి యవిద్యచే తిరోహితమయినదై పరంజ్యోతిస్సును బొందుటచే నది ప్రకటితమగుచున్నది. కాఁబట్టి యీ యపహతపాప్మత్వాదులు ఆత్మయొక్క స్వాభావిక గుణములు. ఈ యాత్మ పరంజ్యోతిస్సును బొందునపుడవి ప్రకటితములగుచున్నవే గాని, నూతనముగా సృజింపఁబడుచుండ లేదు. శౌనక మహర్షియును ఇట్లే చెప్పియున్నారు.

శ్లో॥ యథా న క్రియతే జ్యోత్స్నా మలప్రక్షాళనాన్మణేః
దోషప్రహాణాన్న జ్ఞాన మాత్మనః క్రియతే తథా॥

తా॥ మణియందుండు మాలిన్యమును తుడిచివేసినంత మాత్రముచే మణికిఁగలుగునట్టి కాంతి సృజింపఁబడని చందమున, దోషములను బోఁగొట్టినంత మాత్రమున ఆత్మయొక్క జ్ఞానానందాదిస్వరూపము సృజింపఁబడదు. అనఁగానది యాత్మకు స్వాభావికమైనది.

అది యెటువలె ననిన,

శ్లో॥ యథోదపానకరణాత్క్రియతే న జలాంబరం।
సదేవ నీయతే వ్యక్తి మసతః సంభవః కుతః॥

తా॥ కూపమును త్రొవ్వుటచే నుదకరాశి సృజింపఁబడదు. అయితే అందుండు కూపోదకము స్పష్టముగాఁ దెలియఁ జేయఁబడుచున్నది. ఇంతకు ముందున్న వస్తువు ప్రకటిత మగునే గాని, లేని వస్తువు గలుగుట యెట్లుసంభవము? అట్లే,

శ్లో॥ తథాహేయ గుణధ్వంసాదవ బోధాదయో గుణాః।
ప్రకాశ్యన్తే న జన్యన్తే నిత్యా ఏవాత్మనో హి తే॥

తా॥ హేయగుణములు నశించుటచే జ్ఞానాదిగుణములు ప్రకాశించుచున్నవే గాని, యవి సృజింపఁబడుచుండ లేదు. జ్ఞానాదిగుణము లాత్మయందెల్లప్పుడు నుండునవి గదా! .

కావున, కర్మ సంబంధముచే నాత్మయొక్క జ్ఞానానందాది గుణములు ప్రకాశమానములై, యాత్మ పరంజ్యోతిస్సును బొందుటచే నట్టి కర్మసంబంధము నశింపఁగా, నవి ప్రకాశరూపమగు నావిర్భావమును బొందుటయసంభమము కాదు. కాఁబట్టి "సంపద్యావిర్భావః"—"పరంజ్యోతిస్సును బొందగా నాత్మయొక్క స్వస్వరూపము ప్రకటితమగును" అని సూత్రకారుఁడు చెప్పినది బాగుగా నున్నది.

సంపద్యావిర్భావాధి కరణము ముగిసెను.

## అవిభాగేనదృష్టత్వాధి కరణము.

### ౪॥ సూ॥ అ వి భా గే న దృ ష్ట త్వా త్.

టీ॥ దృష్టత్వాత్ = శ్రుతియందుఁ జూడఁబడుటచే, అవిభాగేన = ముక్తుఁడు "నేను బ్రహ్మమునుండి యవిభక్తుఁడను" అని భావించుకొను చున్నాఁడు.

తా॥ ముక్తుఁడు తనను పరబ్రహ్మమునుండి యవిభక్తునిగా భావించుకొనుచున్నాఁడని శ్రుతులనుండి తెలియుచున్నది.

### సం శ య ము.

శ్రీ॥ భా॥ పరంజ్యోతిస్సును బొందుటచే సర్వబంధవినిర్ముక్తుఁడగు ప్రత్యగాత్మ తాను పరమాత్మకంటె వేఱయినవాఁడనని భావించునా? లేక, పరమాత్మకు శరీర భూతుఁడగుటం జేసి పరమాత్మనుండి తాను అవిభక్తుఁడని భావించునా?

### పూ ర్వ ప క్ష ము.

"సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై. ఆ. ౧-౨) "సర్వబంధ వినిర్ముక్తుఁడగు బ్రహ్మవేత్త సర్వజ్ఞుఁడగు పరబ్రహ్మముతోఁగూడ సమస్తకల్యాణగుణముల ననుభవించు చున్నాఁడు"అనియు "యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం తదా విద్వాన్

పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ము. 3 ము. ౧-3) "బ్రహ్మస్వరూపమును జూచుచుండెడి విద్వాంసుఁడు పరంజ్యోతిస్స్వరూపుఁడును, జగత్కర్తయును, జగన్నియామకుఁడును, సృష్టికర్తయును, జగత్తునకు ఉపాదాన కారణుఁడును, పరిపూర్ణుఁడునగు పరమాత్మనెప్పుడీ పూర్వము జెప్పిన ప్రకారము సాక్షాత్కరించునో, అప్పుడా విద్వాంసుఁడు ప్రకృతి సంబంధము లేనివాఁడై పరబ్రహ్మముతో పరమసామ్యమును బొందుచున్నాఁడు" అని యివ్విధమున శ్రుతులయందుఁ జెప్పియుండుట వలనను, "ఇదం జ్ఞానముపాశ్రిత్యమమ సాధర్మ్యమాగతాః సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తిచ" (ఈజ్ఞానము నాశ్రయించి నాయొక్క సాధర్మ్యమును బొందినవారు సృష్టియందుఁగూడ పుట్టరు ప్రళయమునందుఁగూడ నశింపరు" అని శ్రీభగవద్గీతలయందుఁ జెప్పియుండుటవలనను, ముక్తపురుషుఁడు పరమాత్మతో సాహిత్యమును, సామ్యమును, సాధర్మ్యమునున్ను బొందుచున్నాఁడని తెలియవచ్చుచున్నది. అందువలన ప్రత్యగాత్మ పరంజ్యోతిస్సును బొంది సర్వబంధవినిర్ముక్తుఁడగునపుడు తాను పరమాత్మకంటె వేఱయిన వాడనని భావించుననుట యుక్తమనిన,

## సిద్ధాంతము.

అట్లు చెప్పుట యుక్తము గాదు. ముక్తపురుషుఁడు తాను పరబ్రహ్మనుండి అవిభక్తుఁడనని తెలిసికొను చున్నాఁడు. ఎట్లనిన, పరబ్రహ్మమును బొందుటచే ఈ ప్రత్యగాత్మ అవిద్యాతిరోధానము లేనివాఁడై, యందు మూలముగాఁ దన స్వరూపమును యథార్థముగాఁ దెలిసికొన సమర్థుఁ డగుచున్నాఁడు. మఱియు, నట్టి ప్రత్యగాత్మయొక్క స్వరూపమునుగుఱించి యుపదేశించు సందర్భమున కొన్ని శ్రుతులలో, 'తత్త్వమసి' (నీవు ఆపరమాత్మ) అనియు, "అయమాత్మాబ్రహ్మ" (ఈ ప్రత్యగాత్మ బ్రహ్మము) అనియు "ఐతదాత్మ్యమిదంసర్వం" (ఛా. ౬ ప్ర. ౮ ఖ. ౭ వా.) (ఇది యంతయు పరమాత్మ సంబంధమైనది,) అనియు "సర్వం ఖల్విదంబ్రహ్మ" (ఛా. 3 ప్ర. ౧౪ ఖ. ౧ వా.) "ఇదియంతయు బ్రహ్మము" అనియు నీ మొదలగు తావుల నాత్మపరమాత్మలను సామానాధికరణ్యముచే నిర్దేశించుటవలనను, మఱికొన్ని శ్రుతులలో "య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమంతరో యమయతిస త ఆత్మాఽన్తర్యామ్యమృతః" (బృ. ౫ అ ౭ బ్రా - ౨౨ వా.) "ఏపరమాత్మ ప్రత్యగాత్మయందున్నవాఁడై ప్రత్యగాత్మలోనుండి ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁబడక, ప్రత్యగాత్మను తనయొక్క శరీరమునుగా గలిగియుండి, ప్రత్యగాత్మను నియమించుచున్నాఁడో, యట్టి పరమాత్మ నీ (ప్రత్యగాత్మకు)

యాత్మయైయున్నాఁడు" అనియు, "అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" (అరణ. ౧. 3-౨౧.) ఈ మొదలగు తావుల "పరమాత్మ యందఱిలో పలఁ బ్రవేశించి ప్రజల నందఱిని నియమించుచు, నందఱికి నాత్మగానుండు వాఁడు" అనియునుజెప్పుటచే, ప్రత్యగాత్మ పరమాత్మయే యాత్మగాఁగలదియై పరమాత్మకు శరీరమగుటచే నది పరమాత్మకు శేషభూతమయినదని "అవస్థితే రితి కాశకృత్స్నః" (బ్ర. సూ. ౧ అ. ౪ పా. ౨౨ సూ.) అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. కాఁబట్టి ముక్తపురుషుఁడు "నేను బ్రహ్మము" అనగా బ్రహ్మనుండి విభక్తుఁడను గానని తెలిసికొనుచున్నాఁడనుట యుక్తము.

ప్రత్యగాత్మకు బ్రహ్మముతో సామ్యసాధర్మ్యములను జెప్పుశ్రుతులు బ్రహ్మమునకు శేషభూతమైన ప్రత్యగాత్మయొక్క స్వరూపము బ్రహ్మసమము అనఁగా దేవాది ప్రాకృతరూపము వంటిదిగానిదై బ్రహ్మముతో సమానమగు పరిశుద్ధతను బొంది యుండునదని ప్రతిపాదించుచున్నవి. "సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహ బ్రహ్మణా" అను శ్రుతివాక్యమిట్లు పరిశుద్ధస్వరూపుఁడును, శేషభూతుఁడునగు ప్రత్యగాత్మ తనకు శేషియగు బ్రహ్మముతోఁగూడ నతని గుణముల ననుభవించుచున్నాఁడని మాత్రము జెప్పుచున్నది. కాఁబట్టి యీ శ్రుతు లెంత మాత్ర మీపైని ప్రతిపాదించిన విషయముతో విరోధింపవు. ప్రత్యగాత్మ బ్రహ్మముకు శేషభూతమగుటనుబట్టి యది బ్రహ్మమునుండి విభక్తమైనది గాదని చెప్పఁబడియెను గాన, "సంకల్పాదేవతచ్ఛ్రుతేః" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౮ సూ) అనియు "అధికంతు భేద నిర్దేశాత్" (బ్ర.సూ. ౨ అ. ౧ పా. ౨౨సూ.) అనియు "అధికోపదేశాత్" (బ్ర. సూ. 3 అ. ౪ పా. ౮ సూ) అనియు నీ మొదలగు సూత్రములతోను గూడ విరోధముండ నేరదు.

అవిభాగేన దృష్టత్వాధికరణము ముగిసెను.

---

## బ్రాహ్మాధి కరణము.

సూ॥ బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః

టీ॥ బ్రాహ్మేణ=అతహతపాప్మత్వాది బ్రహ్మధర్మముతో, (అభినిష్పద్యత ఇతి=అభి నిష్పన్నుఁడగునని), జైమినిః=జైమినిముని, (మన్యతే=తలఁచుచున్నాఁడు. ఏలననఁగా), ఉపన్యాసాదిభ్యః= (బ్రహ్మ ధర్మములను ముక్తుని యందు) ఉపన్యసించుట లోనగు హేతువులవలన,

తా॥ అపహతపాప్మత్వాది బ్రహ్మధర్మముతో ముక్తుఁడభి నిష్పన్నుఁడగునని యుపన్యాసాదులనుబట్టి జైమినిముని తలఁచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ పరం జ్యోతిస్సును బొంది యవిద్యా తిరోధాన రహితుఁడైన ప్రత్యగాత్మ పొందునట్టి యవస్థావిశేషము స్వస్వరూపావిర్భావమే యని అనఁగా నతని స్వాభావికస్వరూపము ఆవిర్భూతమగుటయే (స్పష్టపడుటయే) యని యింతకుఁబూర్వము జెప్పఁబడియె. అట్టి సమయమున ప్రత్యగాత్మ యే స్వరూపముతో నావిర్భూతుఁడగునో, ఆ స్వరూపమును గుఱించి శ్రుతు లనేకవిధములుగాఁ జెప్పుచున్నందున, ఆ యంశము ఈ యధికరణమున విచారింపఁబడుచున్నది. ఇందును గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ప్రత్యగాత్మ అపహతపాప్మత్వాదులే స్వరూపముగాఁ గలదగుటంజేసి, యట్టి స్వరూపముతో నది యావిర్భూత మగుచున్నదా? విజ్ఞానము మాత్రమే స్వరూపముగాఁ గలదగుటంజేసి, యది యట్టి విజ్ఞానమాత్రస్వరూపముగా నావిర్భూత మగుచున్నదా? లేక, ఈయుభయవిధశ్రుతులకును విరోధము లేకుండునట్లు అపహతపాప్మత్వాది స్వరూపముగాను, విజ్ఞానమాత్ర స్వరూపముగానున్ను, అనఁగా నీ యుభయవిధస్వరూపముగా నావిర్భూత మగుచున్నదా?

## పూర్వపక్షము.

జైమిని మతము:—బ్రహ్మసంబంధియగు స్వరూపము గలవాఁడుగ నావిర్భూతుఁడగునని శ్రీజైమిన్యాచార్యులు తలఁచుచున్నారు. బ్రహ్మసంబంధియగు రూప మనఁగా అపహతపాప్మత్వాది రూపమనుట. ఏలననఁగా, అపహతపాప్మత్వాదులు బ్రహ్మసంబంధము గలవిగాను దహరవిద్యావాక్యమునఁ జెప్పఁబడుచున్నవి. అయినను, ప్రత్యగాత్మ అపహతపాప్మత్వాదిరూపముగా నావిర్భూతమగుచున్నదని యెట్లు తెలియుచున్నదనిన, "య ఆత్మాఽపహతపాప్మా" అనునది మొదలు "సత్యసంకల్పః" అను వఱకును ప్రజాపతి వాక్యమున బ్రహ్మగుణములగు అపహతపాప్మత్వాదులు ప్రత్యగాత్మయొక్క గుణములుగాను ఉపన్యసింపఁబడుచున్నవి. అందువలన ప్రత్యగాత్మ అపహతపాప్మత్వాదిరూపముగా నావిర్భూతమగునట్లు తెలియుచున్నది. సూత్రమునందు "ఉపన్యాసాదిభ్యః" అను తావున "ఆది" శబ్దముచే "జక్షన్, క్రీడన్, రమమాణః" అను శ్రుతియందుఁ జెప్పబడునవియు, అట్టి అపహతపాప్మత్వాదుల కథీనములగు జక్షణాది వ్యవహారములు గూడ గ్రహింపఁబడుచున్నవి. కనుక ప్రత్యగాత్మయొక్క స్వరూపము విజ్ఞానమాత్రమే యగుట యసంభవమని యీపైని గనఁబఱచిన ఉపన్యాసాది హేతువులనుబట్టి శ్రీ జైమిన్యాచార్యులు తలఁచుచున్నారు.

౬॥ సూ॥ చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః.

టీ॥ చితి=చిత్తునందు, తన్మాత్రేణ=చిన్మాత్రముతో, (అభినిష్పద్యతే=ప్రత్యగాత్మ యావిర్భూతుఁడగును. ఏలయన) తదాత్మకత్వాత్ =వానికిఁ జైతన్య మాత్రస్వరూపముగలదని శ్రుతి చెప్పుటవలన, ఇతి=అని, ఔడులోమిః = ఔడులోమ్యాచార్యుఁడు, (మన్యతే=తలఁచు చున్నాఁడు.)

తా॥ ప్రత్యగాత్మ చైతన్యమాత్ర స్వరూపుఁడని శ్రుతియందుఁ జెప్పియున్నందున, వాఁడు చిన్మాత్రస్వరూపుఁడుగా నావిర్భూతుఁడగునని యౌడులోమ్యాచార్యుఁడు తలఁచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ ఔడులోమి మతము:—ప్రత్యగాత్మయొక్క స్వరూపము చైతన్య మాత్రము గాన, ముక్తావస్థయందాతఁడు చైతన్యమాత్ర స్వరూపుఁడుగా నావిర్భూతుఁ డగునని యౌడులోమ్యాచార్యుఁడు తలఁచుచున్నాఁడు. ఎట్లనిన, "స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ ఏవం వా అరేఽయమాత్మా అనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (బృ. ౬ అ. ౫ బ్రా. ౧౩ వా.) అను శ్రుతివాక్యము "ఉప్పుగడ్డ బాహ్యాభ్యంతర భేదములు లేనిదై సంపూర్ణముగా నుప్పదనమేయై యుంఁడుచందంబున, ప్రత్యగాత్మయును బాహ్యాభ్యంతర భేదములు లేనిదై సంపూర్ణముగ ప్రజ్ఞానముయొక్క గడ్డయే" యనియు "విజ్ఞాన ఘనఏవ" (బృ. ౪ అ. ౪ బ్రా. ౧౨) "ప్రత్యగాత్మ విజ్ఞానముయొక్కగడ్డయే" అనియు నిట్లు ప్రత్యగాత్మ విజ్ఞానస్వరూపుఁడేయని నిర్ధారణముగాఁ జెప్పుటచే నతఁడు విజ్ఞానమాత్ర స్వరూపుఁడని తెలియవచ్చుచున్నది. ఇట్లు ఈ పై శ్రుతివాక్యములు ప్రత్యగాత్మ విజ్ఞానమాత్ర స్వరూపుఁడే యని చెప్పుచుండుటంజేసి యీతని యందితర గుణములేవియు నుండజాలవు. కావున, ప్రజాపతివాక్యమునందుండు [1]"అపహతపాప్మా" ఇత్యాది శబ్దములు వికారము, సుఖము, దుఃఖము ఈ మొదలుగాఁగల యవిద్యారూపములగు ధర్మము లీప్రత్యగాత్మయందులేవని మాత్రమే తెలుపుచున్నవి. కనుక స్వస్వరూపావిర్భావమనఁగా చైతన్యమాత్ర స్వరూపముగా నావిర్భూతమగుటయని ఔడులోమ్యాచార్యుల వారి యభిప్రాయము.

అవతారిక:—వేదవ్యాసులు స్వమతప్రదర్శన పూర్వకముగ సిద్ధాంతమును దెలియఁబఱచుచున్నారు.

---

(1) ఔడులోమ్యాచార్యుని మతప్రకారము అపహతపాప్మేత్యాది శ్రుతియందుండు పదముల యర్థము :—విజరః=వికారరహితుఁడు, విశోకః=దుఃఖములేనివాఁడు, సత్యకామః=కాదాచిత్కముకాని సుఖముగలవాఁడు, సత్యసంకల్పః=ఉపేక్షారహితుఁడు. వ్యర్థమగు సంకల్పములేని వాఁడనియును చెప్పవచ్చును.

౭॥ సూ॥ ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః.

టీ॥ ఏవం-అపి=ప్రత్యగాత్మ చైతన్యమాత్ర స్వరూపుఁడేయని శ్రుతులు చెప్పినను, ఉపన్యాసాత్ =ఉపన్యాసాది హేతువులచే, పూర్వభావాత్ =పూర్వము గాన్పింపఁబడిన అపహతపాప్మాదులును ఉండుటవలన, అవిరోధం=విరోధము లేదని, బాదరాయణః=వ్యాసాచార్యుఁడు, (మన్యతే=తలఁచుచున్నాఁడు.)

తా॥ ప్రత్యగాత్మ చైతన్యమాత్ర స్వరూపుఁడని శ్రుతులు చెప్పినను, ఉపన్యాసాది హేతువులనుబట్టి పూర్వముజెప్పిన అపహతపాప్మత్వాదులును వానికిఁ గలవు. కావున విరోధము లేదని వ్యాసాచార్యుఁడు తలఁచుచున్నాఁడు.

—సిద్ధాంతము.—

శ్రీ॥ భా॥ శ్రీవేదవ్యాసుని మతము:— ప్రత్యగాత్మ విజ్ఞానమాత్ర స్వరూపుఁడని శ్రుతులు ప్రతిపాదించినను, పూర్వము జెప్పిన అపహతపాప్మత్వ, సత్యసఙ్కల్పత్వాది గుణములుండుటకు విరోధ మెద్దియును లేదని శ్రీవేదవ్యాసుల వారు తలఁచుచున్నారు. ఏలననిన, "య ఆత్మా అపహతపాప్మా" ఇత్యాదిశ్రుతి ప్రమాణమే అపహతపాప్మత్వము, సత్యసంకల్పత్వము మొదలగునవి ప్రత్యగాత్మకుఁ గలవని చెప్పుచున్నది. అతఁడు విజ్ఞానస్వరూపుఁడని చెప్పునట్టి శ్రుతివాక్యమెట్లు ప్రామాణికమో, అట్లే యతఁడు అపహతపాప్మత్వ, సత్యసంకల్పత్వాదులు గలవాఁడని చెప్పుశ్రుతివాక్యమును ప్రామాణికమైనది. ఇట్లు ఈ యుభయ శ్రుతులును తుల్యబలము లయినందున, వీనిలో నొక్కటి వేఱొక్క దానిని బాధింపఁదగదు. [1]వస్తు విరోధముండుటంజేసి యపహతపాప్మత్వాదులు అవిద్యాకల్పితములని చెప్పఁదగదు. ఏలననిన, రెండు శ్రుతులును తుల్యబలము లగుటంజేసి విపరీతముగానును అనఁగా అపహతపాప్మత్వాదులను ప్రతిపాదించు శ్రుతి విజ్ఞానమాత్రమును ప్రతిపాదించు శ్రుతినే బాధింపవచ్చునే? అయితే తుల్యబలములగు రెండువాక్యములు పరస్పరము విరుద్ధములగు నర్థములనిచ్చు తావుల, వానిలోఁ దేనియర్థము ఎక్కువ విరోధించునో, అట్టి విరోధము గలుగకుండ, దానిని వేఱొక్కవిధముగా నర్థము చేసుకొనుట న్యాయము. ఈ న్యాయము నంగీకరించినను, "విజ్ఞానఘనఏవ" ఇత్యాదివాక్యములు జ్ఞానమాత్రమే ఈ ప్రత్యగాత్మయొక్క స్వరూపమనియు వేఱొక్కటెద్దియును కాదనియు నిట్టి యర్థమును ప్రతిపాదించుచుండ లేదు. అయితే యా పైవాక్యమున కర్థమేమనఁగా, ఈ ప్రత్యగాత్మ జడపదార్థములవలె నితరపదార్థములచే

(1) విజ్ఞానమనఁబడు నదియొక గుణము. అపహతపాప్మత్వాదియును వేఱొక్కగుణము. ఒక గుణమునందు వేఱొక్కగుణముండుట లోకవిరుద్ధము గాన, విజ్ఞాన మాత్రమునందు అపహత పాప్మత్వాది యుండఁదగదు,

ప్రకాశింపఁబడునది కాక, స్వయంప్రకాశమనియు, దీనియందు ఇంచుకైనను అన్యపదార్థముచే ప్రకాశింపఁబడు ప్రదేశము లేదనియును ఈపైవాక్యమున కర్థము. ఎట్లనిన, "స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ ఏవం వాఽరేఽయమాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నః విజ్ఞానఘన ఏవ" అనఁగా "ఉప్పుగడ్డ బాహ్యాంతర భేదములు లేనిదై అంతటను ఉప్పుగానే యుండు చందంబున, ఈ ప్రత్యగాత్మయును బాహ్యాంతర భేదములు లేనిదై సంపూర్ణముగ విజ్ఞానముగా నుండునది" అనుటచే నీవాక్యము ఈ పైని గనఁబఱచిన యర్థమునే విశదపఱచుచున్నది. మఱియు, ద్రష్టయును, సంపూర్ణుఁడునగు ప్రత్యగాత్మ విజ్ఞానపు ముద్దయే యయినను, శ్రుత్యంతర ప్రతిపాదితములగు నపహత పాప్మత్వాది గుణములను గలిగి యుండుట విరుద్ధముగాదు. అది యెటువలెననిన, ఉప్పుగడ్డ సంపూర్ణముగ ఉప్పదనముతోఁ గూడుకొని యున్నట్లు రసనేంద్రియము వలనఁ దెలియఁబడుచున్నను, అది చక్షురాదీంద్రియావగతములగు రూపకాఠి న్యాదులతోఁ గూడుకొని యుండుట విరుద్ధము కాదు. ఈ శ్రుతియొక్క తాత్పర్య మేమనఁగా, బాహ్యప్రదేశముననుండు చర్మమున నొక్కరుచిని, లోపల వేఱొక్క రుచినిన్ని గలిగియుండు ఆమ్రఫలాదులవలెకాక, ఉప్పుగడ్డ అంతట నొక్కటియే యగు లవణరసమును గలిగియుండునట్లు, ఈ ప్రత్యగాత్మ యంతటను విజ్ఞానమే గలవాడు అనఁగా, స్వయంప్రకాశుఁడనుటయే యీ శ్రుత్యభిప్రాయము.

బ్రాహ్మాధికరణము ముగిసెను.



సఙ్కల్పాధికరణము.

**౮॥ సూ॥ సఙ్కల్పాదేవ తచ్ఛ్రుతేః.**

టీ॥ (పూర్వపక్ష మయుక్తము) తచ్ఛ్రుతేః="సఙ్కల్పాదేవ" అను అవధారణశ్రుతివలన, సఙ్కల్పాదేవ = (ముక్తుని) సఙ్కల్పమాత్రమున (పిత్రాది సముత్థానం = పిత్రాద్యావిర్భావము, భవతి=కలుగుచున్నది.)

తా॥ పూర్వపక్ష మయుక్తము. ముక్తుని సఙ్కల్పమాత్రమున పిత్రాదు లావిర్భవించుచున్నారు.

శ్రీ॥భా॥ ముక్తపురుషుఁడు పరబ్రహ్మమునుబొంది జ్ఞానస్వరూపుఁడు గాను, అపహతపాప్మత్వము మొదలు సత్యసఙ్కల్పత్వమువఱకు శ్రుతియందుఁ జెప్పఁబడిన గుణములు గలవాఁడు గాను నావిర్భూతుఁడగు నని చెప్పఁబడియె. "స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా" (ముక్తపురుషుఁడు స్త్రీలతోఁగాని, రథములతోఁగాని, జ్ఞాతులతోఁగాని, భుజిం

పూర్వాధికరణ సంబంధము

చుచు, క్రీడించుచు, ఆనందించుచు, నంతట సంచరించుచున్నాఁడు) అనియు నీ మొదలగు శ్రుతులవలన ముక్తులకు జ్ఞాతులు మొదలగువారి యనుభవము గలదని తెలియుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

సంశయము.

ఈ ముక్తపురుషుఁడు ఈ పై శ్రుతియందుఁ గానఁబడిచిన జ్ఞాతులు మొదలగువారిని బొందుటకై వేఱొక్క ప్రయత్నము నొనర్పవలయునా? లేక, పరమపురుషుఁడువలె నతఁడును తన సంకల్పమాత్రముచే వారిని బొందుచున్నాఁడా?

పూర్వపక్షము.

లోకమునందు రాజులు మొదలగువారు సత్యసంకల్పులుగాను, అనఁగా తమ సంకల్పమాత్రముచే నన్ని కార్యములను సాధించుకొనుటకు సమర్థులుగాను వ్యవహరింపఁబడినను, కార్యమును గలుగఁజేయు విషయమై వేఱొక్క ప్రయత్నము నొనర్చియే యాకార్యమును సాధించుకొనుచున్నట్లు మనము చూచుచున్నాము కదా! అట్లే ముక్తపురుషుఁడును సత్యసంకల్పుఁడే యైనను, జ్ఞాతులు మొదలగు వారిని బొందుటకై వేఱొక్క ప్రయత్నము నొనర్పవలయుననిన,

సిద్ధాంతము.

ముక్తపురుషుఁడు తన సంకల్పమాత్రమున జ్ఞాతులు మొదలగు వారిని బొందుచున్నాఁడు. ఏలననిన, "స యది పితృలోకకామో భవతి సఙ్కల్పాదేవాస్య పితర స్సముత్తిష్ఠన్తి" అను శ్రుతివాక్యము "ముక్తపురుషుఁడు పితృలోకము గావలయునని సఙ్కల్పించెనేని, పితృదేవతలతని యొద్దకు వచ్చుచున్నారు" అనుచు సంకల్పమాత్రముచే, పితృదేవతలు మొదలగు వారలు ముక్తపురుషునికి స్వాధీనులగుచున్నట్లు తెలుపుచున్నది. మఱియు, ఈతఁడు జ్ఞాతులు మొదలగు వారిని బొందుటకై తగిన ప్రయత్నముల నొనర్చుచున్నట్లు, శ్రుతులయందెచటను జెప్పియుండలేదు. ఇంతియెకాక, "సఙ్కల్పాదేవ" యనుచో, నిర్ధారణార్థకమగు "ఏవ" కారమున్ను ముక్తపురుషుఁడు ప్రయత్నాంతరాపేక్ష లేకయే, స్వసఙ్కల్పమాత్రమున జ్ఞాతులు మొదలగువారిని బొందుచున్నాఁడని తెలియఁజేయుచున్నది.

౯॥ సూ॥ అత ఏవ చానన్యాధిపతిః.

టీ॥ అతఏవచ=సత్యసఙ్కల్పుఁడగుట చేతనే (ముక్తపురుషుఁడు), అనన్యాధిపతిః=విధినిషేధముల కధీనుఁడు గాఁడు.

తా॥ ముక్తపురుషుఁడు సత్యసఙ్కల్పుఁ డగుటచే విధినిషేధముల కధీనములైన ప్రవృత్తి నివృత్తులు గలవాఁడు గాఁడని సిద్ధింపుచున్నది.

శ్రీ॥భా॥ ముక్తపురుషుఁడు సత్యసఙ్కల్పుఁడయినందుననే "అనన్యాధిపతి" యనిపించుకొనుచున్నాఁడు. "అన్యాధిపతి" యనఁగా "ఇదిచేయుము ఇది చేయకుము" అనెడి విధి నిషేధములకు వశ్యుఁడగుట. "అనన్యాధిపతి" యనఁగా నట్టివాఁడు కాకపోవుట. అతఁడు విధి నిషేధములకు వశ్యుఁడగునేని, సత్యసఙ్కల్పుఁడు అనఁగా తనసఙ్కల్పప్రకారము కార్యము జరుగునట్టి సామర్థ్యము గలవాఁడు కాకపోవును. సత్యసఙ్కల్పుఁడని శ్రుతులు జెప్పు చున్నందుచే నతఁ డనన్యాధిపతి యనియును సిద్ధ మగుచున్నది. కనుకనే "స స్వరాడ్భవతి" అను శ్రుతివాక్యము "ముక్తుఁడు కర్మవశ్యత లేనివాఁడగుచున్నాఁడు" అని తెలుపుచున్నది.

సఙ్కల్పాధి కరణము ముగిసెను.

## అభావాధికరణము.

### ౧౦॥ సూ॥ అ భా వం బా ద రి రా హ హ్యే వ మ్.

టీ॥ అభావం=శరీరేంద్రియాద్య భావమును, బాదరిః=బాదర్యాచార్యుఁడు, (మన్య తే=తలఁచుచున్నాఁడు. ఏలననఁగా), ఏవం=ఇట్లు ఆహహి=శ్రుతి తెలుపుచున్నది గదా.

తా॥ ముక్తునికి శరీరేంద్రియములు లేవని బాదర్యాచార్యుఁడు తలఁచుచున్నాఁడు. అట్లే గదా శ్రుతులు తెలుపుచున్నవి.

సంశయము.

శ్రీ॥ భా॥ 'ముక్తపురుషునికి దేహేంద్రియములు ఉన్నవా? లేవా? అథవా, సఙ్కల్పానుగుణముగ దేహేంద్రియములు ఉండుటయును లేకపోవుటయును గలదా?

పూర్వపక్షము.

బాదర్యాచార్యుని మతము:— ముక్తపురుషునికి దేహేంద్రియములు లేవని శ్రీబాదర్యాచార్యులవారు తలఁచుచున్నారు. ఏలయన, శ్రుతులు 'న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి అశరీరం వావసంతం న ప్రియాప్రియే స్పృశతః' అను వాక్యమున "శరీరయుక్తుఁడగు వానిని సుఖదుఃఖము లెన్నఁడును ఎడబాయవు. శరీరము లేని వాని నెన్నఁడును సుఖదుఃఖములు సంభవింపవు" అని చెప్పుటచే శరీరసంబంధ ముండువఱకు దుఃఖమువర్జనీయమని తెలియఁజేసి, తరువాత "అస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం

జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి సంపద్యతే'' అను వాక్యమున "ఈ జీవుఁడీ శరీరములోనుండి బయలువెడలి పరంజ్యోతిస్సును బొంది స్వస్వరూపముతో నుండును'' అని చెప్పుటచే ముక్తపురుషుఁడు శరీరరహితుఁడని తెలియఁజేయు చున్నవి. కాఁబట్టి ముక్తపురుషుఁడు శరీరరహితుఁడు.

౧౧॥ సూ॥ భావం జైమినిర్వికల్పామననాత్.

టీ॥ వికల్పామననాత్=(ముక్తుని కనేకథా భావరూపమగు) వికల్పము శ్రుతియందుఁ జెప్పఁబడుటవలన, భావం=శరీరేంద్రియసద్భావమును, జైమినిః= జైమిన్యాచార్యుఁడు (మన్యతే=తలఁచుచున్నాఁడు.)

తా॥ "స ఏకధా భవతి త్రిధా భవతి'' ఇత్యాదిశ్రుతివాక్యము ముక్తుఁ డనేకముగా నగునని బోధించుటచే వానికి శరీరేంద్రియములు గలవని జైమి న్యాచార్యుఁడు తలఁచుచున్నాఁడు.

జైమిని మతము:—ముక్తపురుషునికి శరీరేంద్రియములు గలవని శ్రీజైమి న్యాచార్యులవారు తలఁచుచున్నారు. ఏలననఁగా, ఛందోగులు "స ఏకధా భవతి త్రిధా భవతి పఞ్చధా భవతి" (ఛా. ౭ ప్ర. ౧౨ ఖ. ౧ వా) అను వాక్య మున "ముక్తపురుషుఁడొక్కటిగా నగును, మూఁడుగా నగును, అయిదుగా నగును" అని పఠించుచున్నారు. ఆత్మ యొక్కటియు, అవిభాజ్యమును గాన, నది యనేక ములుగా నగుట యసంభవము. కావున నది మూఁడుగాను, అయిదుగాను నగుట శరీరమును బట్టియేయని యవగతమగుచున్నది. అయితే ముక్తునికి శరీరము లేదని చెప్పు వాక్యమన్ననో, యాతనికి కర్మానుభవమునకై గలిగిన శరీరము లేదని మాత్రము జెప్పుచున్నది. కర్మానుభవమునకై గలిగిన శరీరమే గదా సుఖదుఃఖము లను గలుగఁజేయునది.

అవతారిక:—శ్రీ వేదవ్యాసులు స్వమతమును తెలుపుచున్నారు.

౧౨॥ సూ॥ ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః.

టీ॥ అతః=సఙ్కల్పమునుబట్టి, ద్వాదశాహవత్ = ద్వాదశాహక్రతువు వలె, ఉభయవిధం=ముక్తుని శరీరవంతుని గాను, శరీరరహితుని గానును, బాదరా యణః=వ్యాసాచార్యుఁడు (మన్యతే=తలఁచుచున్నాఁడు).

తా॥ ద్వాదశాహ క్రతువు సంకల్పానుసారము సత్రమును అహీనమునగు నట్లు, ముక్తుఁడును శరీరవంతుఁడును శరీరరహితుఁడు నగునని వ్యాసాచార్యుఁడు తలఁచుచున్నాఁడు.

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ ముక్త పురుషుఁడు సఙ్కల్పానుగుణముగ శరీరయుక్తుఁ డును, శరీరరహితుఁడును కాఁదగునని శ్రీ వేదవ్యాసులవారు తలఁచుచున్నారు.

శ్రీవేదవ్యాసుల వారి మతము ఉభయవిధ శ్రుతులకును అనఁగా, ముక్తపురుషునికి శరీరము కలదని తెలుపునట్టి శ్రుతులకును శరీరములేదని తెలుపునట్టి శ్రుతులకును అనుగుణ మయినది. కనుక, ఈయుభయవిధశ్రుతులును ఉపపన్నము లగుచున్నవి. అదెటువలెననిన ; [1] కర్మకాండమున "ద్వాదశాహమృద్ధికామా ఉపేయుః" (సంపత్సమృద్ధికిగాను ద్వాదశాహము ననుష్ఠింపవలయును) అనియు "ద్వాదశాహం ప్రజాకామం యాజయేత్" (సంతానమునుగోరువానిచే ద్వాదశాహము ననుష్ఠింపఁజేయవలయును) అనియు నిట్లు శ్రుతులచే విధింపఁబడిన ద్వాదశాహమనఁబడు కర్మవిశేషము "ఉపేయుః" "యాజయేత్" అనెడి చోదనా భేదమునుబట్టియు, సఙ్కల్ప భేదమునుబట్టియును "సత్రము" గాను "అహీనము" గానును గాఁదగినట్లు, ముక్తపురుషుఁడును సంకల్ప భేదమునుబట్టి శరీరవంతుఁడు గాను, శరీరరహితుఁడు గానును కాఁదగునని యెఱుంగునది.

అవతారిక:—ముక్తపురుషుఁడు దేహేంద్రియయుక్తుఁడగు పక్షమున, నతఁడట్టి దేహేంద్రియా ద్యుపకరణములను తానే సృజించుకొనవలయునన్న నియమము లేదని తెలుపుటకై.

౧౩॥ సూ॥ తన్వభావే సన్ధ్యవదుపపత్తేః.

టీ॥ తన్వభావే=(ముక్తునికిఁ దనచే సృజింపఁబడిన) శరీరము లేకపోయినచో, సన్ధ్యవత్=స్వప్నమునందువలెనే (ఈశ్వర సృష్టమగు శరీరముండుట వలన) ఉపపత్తేః=భోగోపపత్తిగలుగు చుండుటవలన,

తా॥ ముక్తుఁడు తనచే నిర్మింపఁబడిన శరీరేంద్రియములు లేనివాఁడగు పక్షమున, స్వప్నమునందువలెనే యీశ్వర నిర్మితములగు శరీరేంద్రియములు గలవాఁడై భోగముల ననుభవించుట యుపపన్నము.

శ్రీ॥ భా॥ ముక్తపురుషుఁడు తనచే సృజింపఁబడిన దేహేంద్రియాద్యుపకరణములు లేనివాఁడగునపుడు, సర్వేశ్వరునిచే సృజింపఁబడిన దేహేంద్రియాద్యుపకరణములతో భోగము ననుభవించుట సంభవము. కావున నీతఁడు సత్యసంకల్పుఁడేయైనను, స్వయముగా వానిని సృజింపడు. అయితే వాజసనేయులు "అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" అని యారంభించి "అథ వేశాన్తాన్

---

(1) పూర్వమీమాంసమున ద్వాదశాహ మనఁబడునట్టి క్రతువిశేష మొక్కటి విధింపఁబడినది. దానిని అనేక యజమానులు సఙ్కల్పించి యనుష్ఠించిరేని, యది "సత్ర" మనఁబడుచున్నది. ఒక్కఁడే యజమానుఁడు సఙ్కల్పించి యనుష్ఠించునేని యది "అహీన" మనఁబడుచున్నది. ఇట్లు ఒక్కటియేయగు ద్వాదశాహము సత్రమగుటకును అహీన మగుటకును సఙ్కల్ప భేదమే నియామకమని పూర్వమీమాంసమున నిశ్చయింపఁబడియె. అట్లేప్రకృతముననుముక్తాత్మ శరీరయుక్తుఁడగుటకును శరీరరహితుఁడగుటకును వాని సంకల్పమే నియామకమని యెఱుంగునది.

పుష్కరిణ్యః స్రవన్త్యః సృజతే స హి కర్తా" అను వాక్యమునను, "య ఏష సుప్తేషు జాగర్తి కామంకామం పురుషో నిర్మిమాణః తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే తస్మిన్లోకాశ్శ్రితా స్సర్వే తదునాత్యేతి కశ్చన" అను వాక్యమునను చెప్పియున్నప్రకారము బద్ధపురుషుఁడు స్వాప్నావస్థయందు ఈశ్వరునిచే సృజింపఁబడిన రథపుష్కరిణ్యాదులతో భోగముల ననుభవించు చందంబున, ముక్తపురుషుఁడును క్రీడార్థము ప్రవృత్తుఁడైన సర్వేశ్వరునిచే సృజింపఁబడిన పితృలోకాదులతో విలాసము ననుభవించుచున్నాఁడు.

## ౧౪॥ సూ॥ భావే జాగ్రద్వత్.

టీ॥ భావే=(స్వసంకల్పముచే సృజింపఁబడిన శరీరము ఇంద్రియములు మొదలుగాఁగల) ఉపకరణములను కలిగియున్న పక్షమున, జాగ్రద్వత్=జాగ్రదవస్థయందువలెనే (లీలారస మనుభవతి=లీలారసము ననుభవించు చున్నాఁడు.)

తా॥ ముక్తపురుషుఁడు స్వసంకల్పముచే సృజింపఁబడిన శరీరము, ఇంద్రియములు మొదలుగాఁగల యుపకరణములు గలవాఁడగుపక్షమున, జాగ్రద్దశయందు బద్ధపురుషునివలెనే లీలారసము ననుభవించుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ ముక్తపురుషుఁడు తన సంకల్పముచేతనే సృజింపఁబడిన శరీరాద్యుపకరణములు గలవాఁడగు నప్పుడు, జాగ్రదవస్థయందు బద్ధపురుషుఁడు భోగముల ననుభవించు చందంబున, ఈతఁడును లీలారసము ననుభవించుచున్నాఁడు. పరమపురుషుఁడును దశరథ వసుదేవాది పితృలోకాదులను తనకుగాను విలాసార్థము స్వసంకల్పమువలన సృజించి వానితో మనుష్యధర్మముల లీలారసము ననుభవించునట్లు, వాఁడొకప్పుడు ముక్తులకుఁ గూడ వారి విలాసమునకుఁగాను తన సంకల్పమువలన శరీరాద్యుపకరణములను సృజించి యిచ్చుచున్నాఁడు. మఱియొకప్పుడు ముక్తపురుషులే తాము స్వయముగ సత్యసంకల్పత్వాదిగుణములు గలవారగుటం జేసి, పరమపురుషుని క్రీడతోఁ జేరినదియగు స్వపితృలోకాదికమును స్వయముగానే సృజించుకొనుచున్నారు. కాఁబట్టి వీరికిఁగాను శరీరాద్యుపకరణములను సర్వేశ్వరుఁడు సృజించి యిచ్చుచున్నాఁడని గాని, లేక, వీరే వానిని సృజించుకొనుచున్నారని గాని, యెట్లు చెప్పినను దోషము లేదు.

అవతారిక :—ఆత్మ యణుపరిమాణమైనదని చెప్పఁబడియెను గదా! ఇట్లు ఒక్కటియేయై, యణుపరిమాణమైన యాత్మ యనేకశరీరములతో నెట్లు సంబంధించియుండునని శంకింపఁగా, నందులకు సమాధాన మీ సూత్రముచేఁ జెప్పఁబడుచున్నది.

౧౫॥ సూ॥ ప్ర దీ ప వ దా వే శ స్త థా హి ద ర్శ య తి.

టీ॥ ప్రదీపవత్=దీపమువలెనే, ఆవేశః=ముక్తపురుషునికి అనేక శరీరములలోఁ బ్రవేశము, (సంభవతి=కలుగుచున్నది,) తథాహి=అట్లే కదా, దర్శయతి=శ్రుతి గాన్పించుచున్నది.

తా॥ ఒక్కటియగు దీపము ఒక్కటియే ప్రదేశమునందున్న దైనను కాంతిచే నితర ప్రదేశములతో సంబంధించి యున్నట్లు, ఆత్మయును ఒక్కటియే యగు దేహమునఁ మందున్నను స్వప్రభారూపమగు చైతన్యముచే నన్ని దేహములతోను సంబంధించి యుండవచ్చును. "వాలాగ్రశతభాగస్య" ఇత్యాది శ్రుతియు నిట్లు తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ దీపము ఇంటిలో నేదో యొకప్రదేశమునందున్నను, కాంతిచే నది యితరప్రదేశములతో సంబంధించియుండు చందంబున, ఆత్మయు దేహమునందు నేదోయొక ప్రదేశమునందున్నను, స్వప్రభారూపమగు చైతన్యముచే నది దేహమునందలి యన్నిప్రదేశములతోను సంబంధించి యుండుట యసంభవము గాదు గదా. ఇట్లు ఆత్మ దేహమునందలి హృదయము మొదలగు నేదో యొక ప్రదేశమునందున్నను, చైతన్యముయొక్కవ్యాప్తిచే దేహమునం దంతటను తనదియనెడి యభిమానముగలది యగునట్లు, దేహాంతరములను గుఱించియును అట్టి యభిమానము గలదియగునని యెఱుంగునది. అయితే, యిందు విశేష మెద్దియనిన, కర్మబద్ధుఁడగువాని జ్ఞానము కర్మబలముచే సంకుచితమగుచున్నది. కనుక, నాతని యాత్మ యట్టి యభిమానముగలది కానేరదు. ముక్తుని జ్ఞానము కర్మబలముచే సంకుచితమైనది కాదు. అందువలన నీతనికి తన చైతన్యమును సంకల్పానుగుణముగ వ్యాపింపజేయుటయు, సర్వశరీరముల యందును. "ఇది నాశరీరము, ఇది నాశరీరము"అనెడి యాత్మాభిమానమును గలిగియుండుటయును అసంభవములు గావు. కనుకనే "వాలాగ్రశత భాగస్య శతధా కల్పితస్యచ, భాగో జీవ స్స విజ్ఞేయః। స చానన్త్యాయ కల్పతే" అను శ్రుతివాక్యము "ఒక్కరోమము యొక్క కొనను నూఱుభాగములుగా భాగించి వానిలో నొక భాగమును మరల నూఱుభాగములుగా, భాగించినచో, వానిలో నొక్కభాగమంత పరిమాణము ఈ జీవుఁడుండును. ఇట్లు అణుమాత్ర పరిమాణుఁడగు జీవుఁడే అనంతుఁడగుచున్నాఁడు" అని తెలుపు చున్నది. బద్ధపురుషుఁడు కర్మానుగుణముగాఁ బ్రవర్తించుచున్నాఁడు. ముక్తపురుషుఁ డన్ననో, స్వేచ్ఛానుగుణముగాఁ బ్రవర్తించుచున్నాఁడు. ఇదియే బద్ధముక్తులకుఁగల భేద మని యెఱుంగునది.

అవతారిక:—"ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యాం కిఞ్చన వేద నాన్తరం" అను శ్రుతివాక్యము "ఈయాత్మ పరమాత్మతోఁ గలిసి కొనినవాఁడై

బాహ్యపదార్థములనున్ను ఆన్తరపదార్థములనున్ను తెలిసికొనఁడు" అనుచు బ్రహ్మమును బొందిన పిదప ముక్తపురుషునికి బాహ్యాభ్యంతర పదార్థములను గుఱించిన జ్ఞానము లేదని చెప్పుచుండ, అతఁడు సర్వజ్ఞుఁడని యెట్లు జెప్పవచ్చునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

౧౬॥ సూ॥ స్వాప్యయసమ్పత్త్యో రన్యతరాపేక్షమావిష్కృతం హి.

టీ॥ స్వాప్యయ సంపత్త్యోః = సుషుప్తి మరణావస్థలలో, అన్యతరాపేక్షం=ఏదైననొక దానిని గుఱించి చెప్పఁబడినది. ఆవిష్కృతంహి = (ఈ విషయము) శ్రుతి ప్రకటితము గదా.

తా॥ "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" ఇత్యాది శ్రుతివాక్యము సుషుప్త్యవస్థయందు గాని మరణావస్థయందు గాని యీ పురుషుఁడు బాహ్యాంతర జ్ఞానశూన్యుఁడగుచున్నాఁడని చెప్పుచున్నది. ఏలననఁగా, శ్రుతివాక్యమే ఈ విషయమును స్పష్టపఱచుచున్నది.

శ్రీ॥ భా॥ ఈపైని గనఁబఱచిన శ్రుతివాక్యము ముక్తపురుషునికి బాహ్యాభ్యంతర పదార్థములను గుఱించిన జ్ఞానములేదని జెప్పునది కాదు. అయితే, సుషుప్తి మరణావస్థలలో నేదైన నొకదానిని గుఱించి యిట్లు చెప్పుచున్నది. ఏలననిన, ఛందోగులు "వాఙ్మనసి సంపద్యతే"అని యారంభించి"తేజఃపరస్యాం దేవతాయాం" అనువాక్యము వఱకు "మరణము నొందు నపుడీ పురుషుని వాక్కు మనస్సుతోను, మనస్సు ప్రాణముతోను, ప్రాణము (జీవునితో గలిసికొని) తేజస్సు మొదలగు భూతసూక్ష్మములతోనును సంయుక్తములగుచున్నవనియు, అట్లు జీవసంయుక్తములగు తేజస్సు మొదలగు భూతసూక్ష్మములు పరదేవతతో సంయుక్తము లగుచున్నవనియును, జెప్పియుండుటచే సుషుప్తిమరణావస్థలయం దీజీవుఁడు ప్రాజ్ఞుఁడగు పరమాత్మను బొందుటయును, అప్పుడు బాహ్యాభ్యంతరపదార్థములను గుఱించిన జ్ఞానము లేకపోవుటయును గలవు. కనుక నీశ్రుతి సుషుప్త్యవస్థయందుండు పురుషుని గుఱించి గాని, లేక మరణావస్థయందుండు పురుషుని గుఱించి గాని ఇట్లు జెప్పుచున్నదని స్థిరమగుచున్నది. మఱియు, ఛందోగులే సుషుప్తి మరణావస్థలయం దీ పురుషునికి జ్ఞానము లేదనియు, ముక్తావస్థయందన్ననో, ఈతఁడు సర్వజ్ఞుఁడగు ననియును తెలిపి యున్నారు. ఎట్లనిన, "నాహం ఖల్వయ మేవం సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమే వాపీతో భవతి నాహమత్ర భోగ్యం పశ్యామి" అను వాక్యమున, "సుషుప్త్యవస్థయందు జీవుఁడు నేనిట్టి వాఁడని తనను తెలిసికొననేరడు. మఱియు ఈ పృథివ్యాదిభూతములనున్ను తెలిసికొననేరడు. కావున, నీతఁడిప్పుడు వినాశమును బొందువానివలె నున్నాఁడు. కాఁబట్టి యిచ్చటెద్ది

యును సుఖమున్నట్లు దెలియరాదు" అనుటచే సుషుప్త్యవస్థయందు ఈ పురుషునికి బాహ్యాంతర పదార్థములను గుఱించిన జ్ఞానము లేదని జెప్పి, అనంతరము అచటనే ముక్తుని గుఱించి చెప్పునపుడు "స వా ఏష దివ్యేన చక్షుషా మనసై తాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" అనఁగా "ఈ పురుషుఁడు బ్రహ్మలోకమునందుండు భోగ్యవస్తువులను దివ్యమగు జ్ఞానచక్షుస్సుతోఁజూచి వాని ననుభవించుచున్నాఁడు" అనుటచే ముక్తపురుషుఁడు సర్వజ్ఞుఁడనిగదా చెప్పియున్నారు. మఱియు "సర్వం హ పశ్యః పశతి సర్వమాప్నోతి సర్వశః" అను శ్రుతివాక్యము "బ్రహ్మమును సాక్షాత్కరించిన పురుషుఁడు సర్వమును చూచుచున్నాఁడు. సర్వమును సర్వత్ర పొందుచున్నాఁడు" అనుటచే ముక్తపురుషుఁడు సర్వజ్ఞుఁడని స్పష్టముగాఁ దెలుపుచున్నది. మఱియు, "ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి" అను శ్రుతివాక్యము "ఈ పురుషుఁడీ భూతములనుండి బయలువెడలి ఈ భూతములనున్ను దెలిసికొననేరఁడు" అనుటచే మరణావస్థయందు ఈ పురుషునికి బాహ్యాంతర పదార్థములను గుఱించిన జ్ఞానము లేదని చెప్పుచున్నది. ఈ హేతువులనుబట్టి "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః న బాహ్యం కిఞ్చన వేద" అనఁగా "ప్రాజ్ఞుఁడగు నాత్మను బొందిన పురుషుఁడు బాహ్యాభ్యంతర జ్ఞానశూన్యుఁడగుచున్నాఁడు" అని చెప్పు శ్రుతివాక్యము మరణావస్థయందుఁ గాని, సుషుప్త్యవస్థయందు గాని యుండునట్టి పురుషుని గుఱించి యట్లు జెప్పుచున్నట్లు స్పష్టమగుచున్నది.

అభావాధికరణము ముగిసెను.

---

## జగద్వ్యాపార వర్జాధికరణము.

**౧౭॥ సూ॥ జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ.**

టీ॥ జగద్వ్యాపారవర్జం = (ముక్తైశ్వర్యము) జగత్కర్తృత్వాది రహితము, ఏలయన, ప్రకరణాత్ =(సృష్టివాక్యముల యందీశ్వరునకు ప్రకృతత్వముండుట వలనను, అసన్నిహితత్వాత్ - చ=(ముక్తునకు సృష్టిప్రసంగమునందు) సన్నిధానము లేకపోవుటవలనను,

తా॥ సృష్టివాక్యముల యందీశ్వరునకు ప్రకృతత్వముండుట వలనను ముక్తులకు సృష్టిప్రసంగమునందు సన్నిధానము లేకపోవుట వలననున్ను ముక్తైశ్వర్యము జగత్కర్తృత్వాదిరహితమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ పరమపురుషప్రాప్తిచే ముక్తపురుషుఁడు పొందునట్టి ఐశ్వర్యమెట్టిదియను విషయమును గుఱించి సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ముక్తపురుషుఁడు పరమపురుషునిచే మాత్ర మొనర్ప శక్యములగు జగత్సృష్టి మొదలగువాని నొనర్చు సామర్థ్యమును బొందుటచే నీతఁడును సర్వేశ్వరుఁడగు చున్నాఁడా? లేక, ఈతఁడట్టి జగత్సృష్టి మొదలగు వాని నొనర్చు సామర్థ్యమును బొందక, పరమపురుషానుభవమును మాత్రము బొందుచున్నాఁడా?

## పూర్వపక్షము.

ముక్తపురుషుఁడు జగత్సృష్టి మొదలగువాని నొనర్చు సామర్థ్యమును పొంది జగదీశ్వరుఁడు సయితమగుచున్నాఁడనుట యుక్తము. ఏలననిన, "నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ముక్తుఁడు పరమపురుషునితో పరమసామ్యమును బొందుచున్నాఁడు) అనియు "సత్యసంకల్పః" (సత్యసంకల్పుఁ డగుచున్నాఁడు) అనియు నీమొదలగు శ్రుతులు జెప్పుచున్నవి. సర్వేశ్వరునిచే మాత్రమొనర్ప శక్యములగు జగత్సృష్టి మొదలగు వానిని జేయ సమర్థుఁడయిననే తప్ప, ఈతఁడు అట్టి సర్వేశ్వరునితో పరమసామ్యమును బొందుటయు, సత్యసంకల్పుఁడగుటయును అసంభవము లగును. కనుక, నిట్లు పరమసామ్యమును, సత్యసంకల్పత్వమునున్ను బొందుట కొక యుపపత్తిని గలుగఁజేయుటకు గాను జగన్నియమనానురూపమగు నైశ్వర్యమును గూడ ముక్తపురుషుఁడు పొందుచున్నాఁడనుట యుక్తమనిన.

## సిద్ధాంతము.

సూత్రమునందుండు "జగద్వ్యాపార"శబ్దమునకు "ఈ సమస్తములగు చేతనాచేతపదార్థముల స్వరూపస్థితి ప్రవృత్తులను నియమించుట" యనియర్థము. ముక్తుని నైశ్వర్యము జగద్వ్యాపారరహితము అనఁగా ముక్తపురుషుఁడట్టి యవస్థయందు అవిద్యాతిరోధాన మెంతమాత్రము లేనివాఁడగుటం జేసి నిర్వ్యాజముగ పరబ్రహ్మము ననుభవించుట యనఁబడు ఐశ్వర్యమును బొందుచున్నాఁడే గాని, నిఖిల చేతనాచేతనముల స్వరూప స్థితి ప్రవృత్తులను నియమించుట యనఁబడు జగద్వ్యాపారము నొనర్చునట్టి సామర్థ్యమును బొందడు. ఏలననఁగా, సృష్టిప్రకరణము నందంతటను జగత్సృష్టి జగన్నియమనాదులను పరబ్రహ్మము జేయుచున్నాఁడని గదా! చెప్పియున్నది. ఎట్లననిన, తైత్తిరీయులు "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" అను వాక్యమున "దేనినుండి యీ భూతములు పుట్టుచున్నవో, దేనిచే నివి రక్షింపఁబడు చున్నవో, దేనియందంతమున సంయుక్తము లగుచున్నవో, అది బ్రహ్మమని తెలిసి కొనుము" అని యిట్లు జగదీశ్వరుఁడుగా నుండుటను బ్రహ్మలక్షణమునుగాఁ దెలిపియున్నారు.

దేనికేది యసాధారణమైనదో, అనఁగా, దానియందు తప్ప మఱిదేనియందు నుండనిదో, అదియే గదా దాని లక్షణమగును. ఇట్లుండ, జగన్నియమన రూపమగు జగదీశ్వరత్వము ముక్తపురుషులకును పొదువయిన దగుపక్షమున, నది పరబ్రహ్మముయొక్క లక్షణమగుట పొసగదు. మఱియు "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత" (సృష్టికిఁ బూర్వ మీపరిదృశ్యమానమగు జగత్తు ఒక్కటియును ద్వితీయరహితమునగు సద్రూపముగా నుండెను. ఆ బ్రహ్మము సృష్టికి గాను అనేకముగా నయ్యెదనని ధ్యానించి తేజస్సును సృజించెను" అనియు "బ్రహ్మవా ఇదమేక ఏవాగ్ర ఆసీదేకమేవా ద్వితీయం తదేకం సన్న వ్యభవత్ తచ్ఛ్రేయో రూపమత్యసృజత క్షత్రం యాన్యేతాని దేవక్షత్రాణి ఇంద్రో వరుణః సోమో రుద్రః పర్జన్యో యమో మృత్యురీశానః" (సృష్టికి పూర్వమిదియంతయు నొక్కటియు అద్వితీయమునగు బ్రహ్మము గానే యుండెను. ఇట్టి బ్రహ్మము విభుత్వమును పొందకపోయెను ప్రశస్తమగు క్షత్రియజాతిని సృజించెను. ఆ క్షత్రియ జాతియందు దేవతలలో క్షత్రియులగు ఇంద్రుఁడు, చంద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు, పర్జన్యుఁడు, యముఁడు, మృత్యువు, ఈశానుఁడీ మొదలగు వారిని సృజించెను" అనియు, "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కిఞ్చ న మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాఁల్లోకా నసృజత" (సృష్టికి పూర్వము జగత్తంతయు నొక్కటియగు నాత్మగానుండెను. మఱియెద్దియు లేకుండెను. ఆ యాత్మ లోకములను సృజింపవలయునని ధ్యానించి ఈ లోకములను సృజించెను) అనియు 'ఏకోహ వై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానః నేమే ద్యావా పృథివీ న నక్షత్రాణి నాపో నాగ్నిర్నసోమో న సూర్యః స ఏకాకీ నరమేత తస్య ధ్యానా న్తస్థస్యైకా కన్యా దశేంద్రియాణి" (సృష్టికి పూర్వము నారాయణుఁ డొక్కఁడే యుండెను. హిరణ్యగర్భుఁడు, రుద్రుఁడు, ద్యావాపృథువులు, నక్షత్రములు, ఉదకము, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, వీర లెవరును అప్పుడు లేరు. ఒంటరిగా నుండుటచే నతఁడు సంతుష్టుఁడు గాక, అందువలన నతఁడు ధ్యానమునందుండి నప్పుడొక్క కన్యకను దశేంద్రియములనున్ను సృజించెను) అనియు నీమొదలగు శ్రుతులయందు జగత్సృష్టిని వర్ణించుసందర్భమునను, వాజసనేయులు "యః పృథివ్యాం తిష్ఠన్"అను వాక్యము మొదలుకొని "య ఆత్మనితిష్ఠన్" అను వాక్యమువఱకు సర్వనియామకత్వమును వర్ణించు సందర్భమునను పరబ్రహ్మమును గుఱించియే ప్రస్తావింపఁబడియెను గాని, యీస్థలములయం దెచటను ముక్తపురుషుని ప్రస్తావమే లేదు,

౧౮॥ సూ॥ ప్రత్యక్షోపదేశాన్నేతి చేన్నాధి కారికమణ్డలస్థోక్తేః.

టీ. ప్రత్యక్షోపదేశాత్ =ముక్తునికి జగద్వ్యాపారా ద్యైశ్వర్యము గలదని శ్రుతులు ప్రత్యక్షముగాఁ జెప్పుచున్నందున, నేతిచేత్ =ముక్తుని యైశ్వర్యము జగద్వ్యాపారరహితము కాదంటివేని, ఆధికారిక మణ్డలస్థోక్తేః=అధికారమునందు నియుక్తులగు హిరణ్యగర్భాదుల లోకములయందలి భోగములను జెప్పుచుండుట వలన, న=అట్లు చెప్పఁదగదు.

తా॥ "స స్వరాడ్భవతి" ఇత్యాది శ్రుతులు ముక్తునికి జగద్వ్యాపారాదులు గలవని సాక్షాత్తుగాఁ జెప్పుచుండుటంజేసి, యతని యైశ్వర్యము జగద్వ్యాపార రహితమని చెప్పఁ దగదంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, అవి ముక్తపురుషుఁడు హిరణ్యగర్భాదుల లోకములయందుండు భోగముల ననుభవించుచున్నాఁడని చెప్పుచున్నవి.

—ఆ క్షే ప ము.—

"స స్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి "అను శ్రుతి వాక్యము"ఆముక్తపురుషుఁడు స్వతంత్రుఁడును సర్వలోకములయందును స్వేచ్ఛా సంచారము గలవాఁడు నగుచున్నాఁడు" అనియు "ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యను సఞ్చరన్"అను శ్రుతివాక్యము "ముక్తుఁడీలోకములయందు సంచరించుచు, తన కిష్టమువచ్చిన రూపములను బొంది ఇష్టము వచ్చిన భోగముల ననుభవించుచున్నాఁడు"అనియును చెప్పుచుండుటచే ముక్తపురుషుఁడు జగన్నియమనము మొదలగువాని నొనర్చుటయందుఁగూడ సమర్థుఁడని సాక్షాత్తుగాఁ దెలుపుచున్నవి. కాఁబట్టి ముక్తునికి జగత్సృష్టి జగన్నియమనముల నొనర్చు విషయమై సామర్థ్యము లేదనుట యసంభవ మనినచో.

—స మా ధా న ము.—

ఇట్లు జెప్పుట సరి గాదు. ఏలననిన, ఈ పై శ్రుతులు ముక్తపురుషుఁడు కర్మవశ్యుఁడు గానందున, జగత్సృష్ట్యాద్యధికారమున నియుక్తులగు హిరణ్యగర్భాదుల లోకములయందుఁగల భోగముల ననుభవించుచున్నాఁడని చెప్పుచున్నవి. అనఁగా ముక్తపురుషుఁడు కర్మబలముచే సంకుచితముగాని జ్ఞానము గల వాఁడగుటచే బ్రహ్మవిభూతిరూపములును, వికారభూతములునగు నీ లోకముల నిష్టము వచ్చినట్లు అనుభవించి తృప్తిబొందుచున్నాఁడు. కనుక వికారాంతర్గతములై బ్రహ్మ విభూతులగు హిరణ్యగర్భాది లోకములందలి సమస్త భోగములను ముక్తపురుషుఁ డనుభవించుచున్నాఁడని ఈపైని యుదహరింపఁబడిన శ్రుతివాక్యములు తెలుపుచున్న వే గాని, యవి జగద్వ్యాపారమును తెలుపుచుండ లేదు.

అవతారిక:—బద్ధపురుషునివలె ముక్తపురుషుడును వికారాంతర్గతము లగు భోగముల ననుభవించు పక్షమున, బద్ధపురుషుని భోగములవలెనే ముక్తపురుషుని భోగములున్ను అనిత్యములును, అల్పములునని ప్రసక్తించునే యని శంకింపగా, నట్టి శంకను పరిహరించుటకై.

౧౮॥ సూ॥ వికారావర్తి చ తథాహి స్థితి మాహ.

టీ॥ వికారావర్తి-చ = జన్మాది వికారములు లేనట్టి బ్రహ్మమును (ముక్తః అనుభవతి=ముక్తుడనుభవించుచున్నాడు) తథాహి=అట్లేగదా, స్థితిం=(ముక్తుని) యనుభవస్థితిని, ఆహ=శ్రుతి చెప్పుచున్నది.

తా॥ ముక్తుడు జన్మాదివికారములు లేనిదగు బ్రహ్మమును అనుభవించుచున్నాడని శ్రుతి జెప్పుచున్నది.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "వికారావర్తి" అను శబ్దమునకు జన్మాది వికారములను బొందనిది యని యర్థము, అనగా జన్మాదివికారము లేవియును లేనివాడును, హేయగుణరహితుడును, కల్యాణగుణాకరుడును, నిరతిశయానంద యుక్తుడును, సకలకల్యాణగుణనిధియనగు పరబ్రహ్మమును అతని విభూతితోను కల్యాణగుణములతోనున్ను ముక్తపురుషుడనుభవించుచున్నాడు. అనగా, అట్టి పరబ్రహ్మముయొక్క విభూతిలోనుండునవైనందున వికారయుక్తములగు లోకములను సయితము ఈ ముక్తపురుషుడనుభవించుచున్నాడు. మఱియు, తైత్తిరీయుల "యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తే నిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథసోఽభయం గతో భవతి" అను శ్రుతివాక్యము "ఎప్పుడీ ముక్తపురుషుడు చక్షురాదీంద్రియాగోచరుడును, శరీరరహితుడును, జాతిగుణాదులను తెలియజేయు దేవాదిశబ్దములచే దెలుపబడనివాడును, ఆశ్రయశూన్యుడనగు సర్వేశ్వరునియెడల అభయమునకై నిరంతర స్మృతిరూపమగు నిష్ఠను బొందుచున్నాడో, అప్పుడీతడ భయమును బొందుచున్నాడు" అనియు, "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అను శ్రుతివాక్యము "పరబ్రహ్మము ఆనందమయుడు అట్టి యానందమయుని బొంది ముక్తపురుషు డానందము గలవాడగుచున్నాడు" అనియును జెప్పుచు వికారరహితుడును నిరతిశయానంద యుక్తుడునగు సర్వేశ్వరుని యనుభవించుచుండునట్టి స్థితి ముక్తపురుషునికిగలదని తెలియజేయుచున్నవి. మఱియు, "తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తదునాత్యేతి కశ్చన" అను శ్రుతివాక్యము "లోకములన్నియును ఆసర్వేశ్వరునియందే యున్నవి. వాని నతిక్రమించు వా డెవడును లేడు" అనియును జెప్పుచు సర్వేశ్వరుని విభూతియయిన యీ జగత్తంతయు వానియందే యున్నట్లు దెలియజేయుచున్నది. కనుక ఈముక్తపురుషుడు పరబ్రహ్మ

ముయొక్క విభూతిని సయితమనుభవించుచున్నట్లు విశదమగుచున్నది. కావున "సర్వేషు లోకేషు కామచారో భవతి" అను శ్రుతివాక్యము "ఈ ముక్త పురుషునికి సమస్తలోకములయందును స్వేచ్ఛాసంచారము గలదు" అని చెప్పుచుండుటచే నీతనికి బ్రహ్మాండములోఁగల భోగములున్ను గలవని తెలుపు చున్నది. ఇందువలన, ఈ ముక్తపురుషునికి జగత్సృష్టి జగన్నియమనము మొదలగు వాని నొనర్చుటయందు సామర్థ్యము ఉన్నట్లు జెప్పఁబడలేదని స్పష్టమగు చున్నది.

## ౨౦॥ సూ॥ దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే.

టీ॥ ప్రత్యక్షానుమానే=శ్రుతిస్మృతులు, ఏవం=ఇట్లు (జగత్సృష్టి జగన్నియమనముల నొనర్చుటకుఁదగిన సామర్థ్యము ముక్తునికి లేదని) దర్శయతః=కాన్పించుచున్నవి.

తా॥ జగన్నియమనాదుల నొనర్చుటకుఁ దగినసామర్థ్యముముక్తునికి లేదని శ్రుతిస్మృతులును గాన్పించు చున్నవి.

శ్రీ భా॥ సర్వేశ్వరుని నియమనమున కధీనుఁడును, ముక్తుఁడునగు ప్రత్యగాత్మ సర్వేశ్వరునిచే మాత్ర మొనర్ప శక్యమును, జగన్నియమనాదిరూప మునగు వ్యాపారము నొనర్చుటయందు సమర్థుఁడగుట యసంభవమని యింతకుఁ బూర్వము జెప్పఁబడియె. శ్రుతిస్మృతులును నిఖిల జగన్నియమనాదిరూపమగు వ్యాపారమును జేయుటకు సర్వేశ్వరుఁడే సమర్థుఁడని తెలుపు చున్నవి. ఎట్లన, "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః" (తై. ఆ. ౮-౧) అను శ్రుతివాక్యము "ఈ సర్వేశ్వరుని భయమునవలన వాయువు వీచుచున్నది. సూర్యుఁడు ఉదయించుచున్నాఁడు. ఈ సర్వేశ్వరుని భయమువలననే అగ్నియును, చంద్రుఁడును అయిదవదియగు మృత్యువును తమతమ కార్యములయందుఁ బ్రవర్తించుచున్నారు" అనియు "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" (బృ. ౫ అ. ౮ బ్రా. ౯ వా) అను శ్రుతివాక్యము "ఓ గార్గి ఈ యక్షర స్వరూపుఁడగు పరబ్రహ్మముయొక్క శాసనముచే సూర్యుఁడును చంద్రుఁడును తమ తమ స్థానములను విడువకయున్నారు" అనియు తెలుపుచున్నవి. అట్లే "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి, రేష భూతపాల, ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా.) అను శ్రుతివాక్యము "ఈయక్షరస్వరూపుడే సమస్తమును నియమించువాఁడు, ఈతఁడే చేతనాచేతన ములకన్నింటికి నధిపతి, ఈతఁడే భూతపాలకుఁడు, మఱియు నీతఁడే లోకములు చెదరి పోకుండునట్లు వానిని ధరించియున్నాఁడు" అనియును జెప్పుచున్నది.

 

స్మృతులయందును,

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం ।
హేతునాఽనేన కౌన్తేయ జగద్ధి పవర్తతే॥

భ. గీ. ౯ అ. ౧౦ శ్లో.

తా॥ ఓ అర్జునా ! ప్రకృతి అధ్యక్షుఁడనైనానాచే నధిష్ఠింపబడినదై స్థావరజంగమములతోఁగూడిన జగత్తును కనుచున్నది. నేనిట్లు అధ్యక్షుఁడనై యుండుటచేతనే యీ జగత్తు ప్రవర్తింపుచున్నది.

శ్లో॥ విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"

భ. గీ. ౧౦ అ. ౪౨ శ్లో.

తా॥ ఓ అర్జునా ! ఈ జగత్తంతయు స్వరూపము సిద్ధించువిషయమునను ఉనికివిషయమునను, ప్రవర్తించువిషయమునను, నా సంకల్పము నతిక్రమింప కుండునట్లు, నా మహిమలోని యతిస్వల్పభాగముచే దానినంతయును నిలువఁ బెట్టియున్నాను.

మఱియు ఈ ముక్తపురుషుఁడు పొందునట్టి యానందము సత్యసంకల్పత్వాదిపూర్వకమేయయినను, అందులకు సర్వేశ్వరుఁడే హేతువగుచున్నాఁడనియును శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి ఎట్లనిన, "ఏష హ్యే వానన్దయాతి" (తై. ఆ. ౭. ౨. ౧.) అను శ్రుతివాక్యము "ఈ సర్వేశ్వరుఁడే ఆనందమును గలుగఁజేయుచున్నాఁడు" అని చెప్పుచున్నది. శ్రీ భగవద్గీతలయందును,

శ్లో॥ "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే"

భ. గీ. ౧౪ అ. ౨౬ శ్లో.

తా॥ ఓ అర్జునా ! అనాదికాలమునుండి ప్రవర్తించిన విపరీతవాసనచే నాతలంపును వదలక, నన్నెప్పుడును ఎడతెగకుండ భజించువాఁడు తనచే స్వయముగా నతిక్రమింప శక్యములుగాని గుణముల నన్నింటిని నతిక్రమించి బ్రహ్మమునకుఁ దగిన వాఁడగుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మమృతస్యా వ్యయస్యచ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యై కాంతి కస్య చ॥

భ. గీ. ౧౪ అ. ౨౭ శ్లో.

తా॥ బ్రహ్మమునకు అనఁగా జననమరణములు లేని ప్రత్యగాత్మ స్వరూపమునకును, శాశ్వతధర్మమునకు అనఁగా మిక్కిలి యతిశయముగలిగిన నిత్యమైన యైశ్వర్యమునకును, సుఖమునకును అనఁగా, జ్ఞానిపొందవలసిన యానందమునకు నేనే యాధారభూతుఁడను,

అపహతపాప్మము మొదలు సత్యసంకల్పమువరకును శ్రుతియందుఁ జెప్పఁబడిన గుణములు ప్రత్యగాత్మకు స్వాభావికములేనై ప్రకటితములగు చున్నను, అవి యట్టివిఘగుటయే పరమపురుషాధీనము. ప్రత్యగాత్మకట్టి గుణములు స్వభావికముగా నుండుట సర్వేశ్వరాధీనము. ఆగుణము లీ ప్రత్యగాత్మ యందు నిత్యముగానుండుటయును అతని యధీనమే. ఇట్లు ఈగుణములు ప్రత్యగాత్మయందు నిత్యముగానుండుట సర్వేశ్వరునికి ఎప్పుడును ఇష్టము. అందువలన నివి ప్రత్యగాత్మయందట్లు నిత్యముగా నుండునవి. కావున, విరోధమేమియు లేదు. ఇట్లే నిత్యములుగా శాస్త్రమునుండి తెలియవచ్చునట్టివియు, పరమపురుషుని వియునగు భోగోపకరణములును, లీలోపకరణములును నిత్యములుగా నుండుట యతని కెప్పుడును ఇష్టమైనందున నివియును నిత్యముగ నతని కున్నట్లు శాస్త్రము వలనఁ దెలియుచున్నది. కనుక, ముక్తపురుషుఁడు జగద్వ్యాపారమునఁదప్ప, తక్కినవానియందు మాత్రము సత్యసంకల్పుఁడును పరమపురుష సమునఁడునని సిద్ధమగుచున్నది.

## ౨౧॥ సూ॥ భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ.

టీ॥ భోగమాత్రసామ్యలిఙ్గాత్ -చ = ముక్తునకు ఈశ్వరునితో భోగమాత్రమున సామ్యము కలదని శ్రుతులు తెలుపుచున్నందునను, (వానికి జగద్వ్యాపారాదుల నొనర్చుటకుఁ దగినట్టి యైశ్వర్యము గలుగదు.)

తా॥ భోగమాత్రముననే ముక్తునకు ఈశ్వరునితో సామ్యము గలదని శ్రుతులు తెలుపుచుండుటచేతనున్ను, వానికి జగద్వ్యాపారాదుల నొనర్చుటకుఁ దగినట్టి యైశ్వర్యము సంభవింపదని సూచితమగుచున్నది.

శ్రీ॥ భా॥ బ్రహ్మ యాథాత్మ్యానుభవరూపమగు భోగమునందు మాత్రము ఈముక్తపురుషుఁడు బ్రహ్మముతో సమానుఁడని చెప్పియుండుట వలన ఈతనికి జగద్వ్యాపారాదుల నొనర్చుటకుఁదగిన సామర్థ్యము లేనట్లు సూచితమగుచున్నది. ఏలననిన, "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అను శ్రుతివాక్యము "ఆ ముక్తపురుషుఁడు సర్వజ్ఞుఁడగు బ్రహ్మముతోఁగూడ సర్వభోగముల ననుభవించుచున్నాఁడు" అని గదా జెప్పుచున్నది. కనుక జగత్సృష్టి మొదలగునవి పరమపురుషునిచే మాత్ర మొనర్పఁబడుచున్నవని చెప్పునట్టి శ్రుతి వాక్యముల కనుగుణము గానే ముక్తపురుషుఁడు పొందునట్టి పరమపురుషసామ్యమును, సత్యసంకల్పమునున్ను వర్ణించుట యుక్తము. ఇందువలన ముక్తపురుషుఁడు బొందునట్టి యైశ్వర్యము జగద్వ్యాపార వర్జమని సిద్ధమగుచున్నది.

అవతారిక:—ముక్తపురుషుని యైశ్వర్యము పరమపురుషుని కధీనమయి నదని యింతకుఁబూర్వము జెప్పఁబడియె. అట్లయినచో, పరమపురుషుఁడు స్వతంత్రుఁడగుటం జేసి, యతని సంకల్పమువలన ముక్తపురుషుఁడు మరల ఈ లోకమునఁజన్మించునని భావింపవచ్చునే యని శంకింపఁగ, అట్టిశంకను పరిహరించుటకై.

**౨౨॥ సూ॥ అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్.**

టీ॥ శబ్దాత్ = శ్రుతివలన, అనావృత్తిః = పునరాగమనరాహిత్యము, స్యాత్ = కలుగును. (ఉత్తరార్థమునకు నిదియే యర్థము.)

తా॥ ముక్తునికి పునరావృత్తి లేదని శ్రుతులవలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ హేయగుణము లెంతమాత్రము లేనివాఁడును, కల్యాణ గుణాకరుఁడును, జగజ్జన్మస్థిత్యాదులకుఁ గారణభూతుఁడును, సమస్తవస్తు విలక్షణుఁడును, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడును, ఆశ్రితవాత్సల్యైక జలనిధియును, పరమకారుణికుఁడును, తనకంటె గొప్పవాఁడు గాని, తనతో సమానుఁడు గాని లేనివాఁడును, పరబ్రహ్మమనఁబడు పరమపురుషుఁ డొక్కఁడు గలఁడని వేదములవలన నెట్లు దెలియవచ్చుచున్నదో, అట్లే యా పరమపురుషుఁడు వర్ణాశ్రమ ధర్మానుష్ఠానముచే నుపకరింపఁబడునదియు, ఉపాసనరూపమగు నారాధనముచే సంతోషింపఁబడి, భక్తులయెడల అత్యంతము ప్రీతిగలవాఁడై, అనాదికాలముగ వారిచే జేయఁబడిన యనంత పాపకర్మములనఁబడు అవిద్యను పోఁగొట్టి, వారికు స్వయాథాత్మ్యానుభవరూపమగు నిరతిశయానందమును గలుగఁజేసి, వారిని జన్మమరణాదిరూపమగు నీసంసారమును మరలపొందకుండ జేయుచున్నాఁడని యును, వేదములనుండియే తెలియుచున్నది. ఏలననిన, "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే నచ పునరావర్తతే నచ పునరావర్తతే" "ఈబ్రహ్మవేత్త యీప్రకారము జీవించియుండువఱకు ఉపాసనమునను ష్ఠించుచు ఈ సర్వేశ్వరుని బొంది మరల ఈలోకమున జన్మింపడు" ఇత్యాది శ్రుతివాక్యము లట్లు తెలుపుచున్నవి. ఇట్లే శ్రీభగవద్గీతలయందు భగవంతుఁడు స్వయముగా నానతిచ్చియున్నాఁడు.

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః॥

భ. గీ. ౮ అ. ౧౫ శ్లో.

తా॥ ఓ అర్జునా! నన్నుబొంది గొప్పసిద్ధిని బొందిన మహాత్ములు దుఃఖములకు స్థానమైనదియును, అనిత్యమైనదియునగు జన్మమును మరల పొందరు.

శ్లో. ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోఽర్జున,
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే.
భ. గీ. ౮ అ. ౧౬ శ్లో.

తా॥ ఓ అర్జునా ! చతుర్ముఖ బ్రహ్మలోకపర్యంతముగల లోకములెల్ల పునరావృత్తిగలవి. అయితే నన్ను బొందినవారికి పునర్జన్మము లేదు.

కర్మబంధమంతయు నశించి, జ్ఞానసంకోచము బొత్తుగ పోయి, ఎల్లప్పుడు పరబ్రహ్మమునే తలఁచుచు, నాతనికి మిక్కిలి ప్రియుఁడై, నిరతిశయానందరూపమగు నాపరబ్రహ్మము ననుభవించునట్టి యీ ముక్తపురుషునికి వేఱొక్కదానియందపేక్ష కలుగనే కలుగదు. కావున నతఁడు వేఱొక్కదానికై ప్రయత్నింపనే ప్రయత్నింపఁడు. ఆదువలన నతనికి పునర్జన్మము గలుగునని శంకయయినను గలుగుట కవకాశము లేదు. ఇంతియెకాక, సత్యసంకల్పుఁడగు పరమపురుషుఁడు తనకత్యంత ప్రియుఁడగు బ్రహ్మవేత్తను తన సన్నిధానమునకుఁ జేర్చుకొని మరల అతనికి జన్మము నెన్నటికిని గలుగఁజేయఁడు. ఇట్లు భగవంతుఁడు స్వయముగ నానతిచ్చి యున్నాఁడు.

శ్లో॥ ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః॥
భ. గీ. ౭ అ. ౧౭ శ్లో.

తా॥ ఓ అర్జునా! నేను జ్ఞానికి మిక్కిలి ప్రియుఁడను. వాఁడును నాకు మిక్కిలి ప్రియుఁడు.

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం
భ. గీ. ౭ అ. ౧౮ శ్లో.

తా॥ ఎవ్వారలు నావలన నొక్కదానిని గ్రహింతురో, వారు నాకు సర్వస్వము నిచ్చినవారు. జ్ఞాని నాకు ఆత్మయే. అనఁగా నేను జ్ఞానికి అధీనమైన యునికి గలవాఁడనుగాఁ దలచెదను. ఈ జ్ఞాని నన్ను విడిచి తాను ఉండలేక నన్నే ప్రాప్యునిగా బొందెను. గాన, నేనును అతనిని విడిచి నిలువలేను. కాఁబట్టి అతఁడు నాకు ఆత్మ గదా! ఏలననఁగా, అతఁడు ఎప్పుడును నన్నే ధ్యానించుచు నన్నే ఉత్తమమయినగతిని గాను నిర్ణయించుకొనియుండువాఁడు.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥
భ. గీ. ౭. అ. ౧౯ శ్లో.

తా॥ ఓ అర్జునా! లెక్కలేని పుణ్యజన్మములు గడచిన పైని "నేను వాసుదేవునికి శేషభూతుఁడను నాస్వరూపంబును, నాయునికియును, నాప్రవృత్తియును, వాని యధీనంబులు. వాఁడు లెక్కలేని కల్యాణగుణములచే నుత్కృష్టుఁడు" అను జ్ఞానము గలవాఁడై వాసుదేవుఁడె నాకు అంతయును అనఁగా ప్రాప్యంబును, ప్రాపకంబును, ఇదిగాక, నేను కోరవలసిన దంతయును వాసుదేవుఁడే యని నన్ను ఉపాసించునట్టి మహాత్ముఁడు మిక్కిలి దుర్లభుఁడు.

ఈ పైనిజెప్పిన ప్రకారము తన కత్యంతప్రియుఁడగు జ్ఞానిని బొంది సత్యసంకల్పుఁడగు పరమపురుషుఁడు వాని నెన్నఁడును విడనాడఁడు. సూత్రమునందు "అనావృత్తిశ్శబ్దాత్" అను ద్విరుక్తి శాస్త్రసమాప్తిని తెలుపునది. కావున నంతయును సంమంజము.

జగద్వ్యాపారవర్జాధికరణము ముగిసెను.



గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బస్తవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంతసంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు చతుర్థాధ్యాయమున చతుర్థపాదము.

శ్రీరస్తు.




శ్రీమతే రామానుజాయ నమః.

# ఈ గ్రంథమును గుఱించిన కొన్ని యోగ్యతాపత్రికలు.

శ్రీ వానమామలై శ్రీ రామానుజ జియ్యర్ స్వామి వారిట్లు తమ యభిప్రాయమును కృపచేసియున్నారు:—

"మీరు శ్రీభగవద్రామానుజ విరచిత శ్రీభాష్యానుసారముగా ఆంధ్రభాషయందు రచియించి పంపించిన ప్రథమపుస్తకమును కొంతభాగము చూచినాము. ఈగ్రంథము సుబోధంబుగానున్ను-జనోపకారకముగానున్ను ఉన్నది. ఈగ్రంథముతోఁజేరిన బాకీగ్రంథములనుకూడా రచియించుటకై మీకు ఉత్తరోత్తరము శ్రేయః ప్రార్థనను చేయుచున్నారము."

మైసూరునందుండు శ్రీ. శ్రీ. బ్రహ్మతన్త్ర పరకాల మఠాధిపతులగు జియ్యర్ స్వామివారు తమ శ్రీకార్యకర్తలగు శ్రీనివాస రాఘవాచార్యులవారి మూలముగా తమయభిప్రాయము నిట్లు కృపచేసియున్నారు:—

"దేవరవారి శ్రీముఖమున్ను ఆంధ్రశ్రీభాష్య గ్రంథమున్ను చేరినవి. శ్రీ-శ్రీ-సన్నిధిలో సమర్పించడమైనది. శ్రీవారును కటాక్షించి యున్నారు.

గీర్వాణ భాషాప్రాచుర్యము కొరవయిన ఈకాలమునందు ఈగ్రంథము ఆస్తిక్యులగు వారలకు చాలా సహాయపడగలదు. ఇదేతీరునసే ఇతర సద్గ్రంథములన్నియు దేవరవారిచే నాంధ్రీకరింపఁబడిన యెడల ఆధునిక మహాజనులకు గొప్ప ఉపకారముకలిగి దేవరవారి శ్రమము సార్థకము కాఁగలదు. శ్రీ-శ్రీ-సన్నిధియందు భక్త్యతిశయముచే దేవరవారంపిన శ్రీభాష్యసంపుటమును స్వీకరించి శ్రీ-శ్రీ-వారు దేవరవారికి పరమానుగ్రహమున మంగళా శాసనములను అనుగ్రహించియున్నారు. తిరువళ్యమునకు తేవలయును."

లేటు శ్రీరంగనారాయణ మఠాధిపతులును ప్రస్తుతము శ్రీ పెరుంబూధూరునందు వేంచేసియుండే శ్రీమాన్ అయోధ్య రామానుజ జియ్యర్ స్వామి వారిట్లు తమ యభిప్రాయమును కృపచేసియున్నారు.

"భవద్భిరనుగృహీతమాన్ధ్రభాషామయం శ్రీభాష్యంకిఞ్చ దద్రాక్షమ్. శోభతేచ తత్సర్వం భాష్యవాక్యానురోధేన, కిఞ్చద్వివరణరూపేణ.

అస్య అధికారిదౌర్లభ్యేన వైఫల్య మపి శంక్యమ్, భాష్యస్యత్రైవర్ణికాధికారత్వేన సిద్ధత్వేఽపి, తేషామేన కేషాంచిన్మన్దమతీనాం వివరణాదినా కార్యకరత్వేన సాఫల్యమ ప్యస్తీతి మన్యామహే.

* * * * * * *

ఏతాదృశో గ్రన్థః ముద్రాపణీయ ఏవ. ముద్రాపణవిషయే చ సర్వే సజ్జనాస్సాహాయ్యం కుర్యురితిమన్మహే. అవశ్యం కర్తన్యమితి చ.

మైసూరు సంస్థానమున ఆస్థానపండితులగు శ్రీమాన్ లక్ష్మీపురం శ్రీనివాసాచార్యుల వారు తమ యభిప్రాయమును కృపచేసియున్నారు.

"అయి మహాశయాః-తాముపంపించిన శ్రీమదాంధ్ర శ్రీభాష్యముయొక్క మొదటి సంచికను ఆమూలాగ్రముగ చూచితిని. శ్రీభాష్యకారులవారిచేత నెంతో గంభీరముగాను, సామాన్యజనదురవగాహముగాను వ్రాయఁబడిన ఇతర మతీయుల పూర్వపక్ష సమాధానాంశములను మఱియు స్వసిద్ధాన్త విషయములను అచ్చట సులలితముగా పండిత తదితర సులభమగునట్లు తేట తెనుగుచే వ్రాయబడియుండుట కెంతయు సంతసింపవలసి యున్నది.

శాస్త్రీయశైలిచే నిరుపణ చేయఁబడిన విషయములను భాషాంతరమునందు పరివర్తనము చేయునపుడు రుచిభేదములుండినను, ఇయ్యది సంస్కృత భాషయందెక్కువ పరిశ్రమ లేనివారికి శ్రీభాష్యార్థతత్త్వమును సులభముగాఁ బోధపఱచుటచేతను, ఇట్టి గ్రంథమిదివఱకు వెలువడకుండుటచేతను ఇది మహోపకారకంబని వేఱుచెప్పనక్కఱ లేదు. శ్రీమదాచార్యానుగ్రహముచే నిట్టి సదుద్యమము తుదముట్టగాని అందుచే సర్వజనులు పరమపురుషార్థమును బొందుదురని నాయభిప్రాయమును వెల్లడించుచున్నాడను.

శ్లో॥ యచ్ఛ్రీభాష్య మనూదితం సువిదితైః కందాడ శేషాహ్వయైః। అన్యూనానతిరిక్తమాంధ్రభణితో నీతంచ సన్ముద్రణామ్। దృష్ట్వా తత్పరిశీల్య శాస్త్రమనసా ప్రాకార లక్ష్మీపురం శ్రీవాసాఖ్యవిపశ్చితేత్థ మధికామోదేన నైజాశయః..

శ్రీశ్రీ శ్రీరామానుజుల వారుస్థాపించిన డెబ్బదినాలుగు సింహాసనాధిపతులలో నొక్కరును, శ్రీమనవాళమహామునులు స్థాపించిన యష్టదిగ్గజములలో ప్రాథమికులునునగు శ్రీమాన్ వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తి హరాచార్యుల అయ్యవార్లంగారు ఈగ్రంథమును కటాక్షించి యోగ్యతాపత్రికను గృపజేసియున్నారు.

"భవల్లిఖితం శ్రీమదాంధ్ర శ్రీభాష్యం అనుమోదామహే
శ్లో॥ శ్రీరామానుజభాష్యమాంధ్ర భణితైస్సీవ్యైర్వివర్తం
నయన్నన్యూనాధికరీతిభిస్సులలితై స్తత్రప్రవేశాత్మనాం,
సంగృహ్ణన్నపి పండితో విపులధీః కందాడశేషాహ్వయః
కిఞ్చిత్కారసుధాకరోన్నమ మణేః రామానుజార్యస్యయః॥
శ్లో॥ వాధూలదేశిక శ్రీమత్ప్రణతార్తి హరాహ్వయైః।
సూరిభి ర్భాష్యరత్నస్య వివర్తః ప్రత్యవేక్షితః॥"

---

ఈ గ్రంథకర్తచే రచియింపఁబడిన గ్రంథముల పట్టీ.

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) | శ్రీమదాంధ్రశ్రీభాష్యము మొదటిసంపుటము (ప్రథమాధ్యాయాంతము) | | 8 | 0 | 0 |
| (2) | డిటో. రెండవ సంపుటము (ద్వితీయ తృతీయ చతుర్థాధ్యాయములు.) | | 8 | 0 | 0 |
| (3) | ఈశావాస్యోపనిషత్తు. శ్రీరామానుజ సిద్ధాంతపరములగు తెనుగు టీకా తాత్పర్యములతోను విపులమైన పీఠికతోనునుగూడి యున్నది. | | 0 | 8 | 0 |
| (4) | కేనోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (5) | కఠోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (6) | ప్రశ్నోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (7) | ముండకోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (8) | మాండూక్యోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (9) | తైత్తిరీయోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (10) | ఐతరేయోపనిషత్తు | డిటో | 1 | 0 | 0 |
| (11) | ఛాందోగ్యోపనిషత్తు | డిటో | 0 | 8 | 0 |
| (12) | బృహదారణ్యకోపనిషత్తు | డిటో | 5 | 0 | 0 |
| | | | 5 | 0 | 0 |

వలయువారు క్రిందివిలాసమునకు వ్రాయుఁడు:—కందాడై శేషాచార్యులు.
C/o యమ్. ఆర్. చంద్రా అండు కంపెని,
295, చెనాబజారు రోడ్డు, మద్రాసు.

PRINTED AT THE INDIA PRINTING WORKS. MADRAS

